## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 5010010016871

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్

నమో నారాయణాయ

# చతుర్వేద పరమరహస్యము

# The REAL SECRET of The FOUR VEDAS



అజాం పురాణీ మమరాం సనాతనీం। చతుర్భుజాం పుస్తక మక్షధారిణీమ్
వరాభయాభ్యా మనుశోభిహస్తాం।నమామి తాం జాడ్యజరావినాశినీమ్.
సరస్వతీం త్వా మనునౌమి వాచం।వాచం ప్రదాంహంసవరాధిరూఢామ్
ముక్తామణిద్యోతితకంఠహారాం।భాగ్యైకలభ్యాం పరమాం పవిత్రామ్.

రచయిత

వేదసంస్థాపక, శ్రీమత్పరమహంస పరివ్రాజక శ్రీరామచంద్రేంద్ర
సరస్వతీయతీంద్ర ముఖ్యశిష్యుఁడు, తత్పుత్త్రుఁడు

పీసపాటి లక్ష్మ్యవధాని

అగ్రహారము – గుంటూరు.

మద్రాసురాజధాని – ఇండియా

అమూల్యము
1000 కాపీలు

1950

వికృతినామ సం॥
ఆశ్వయుజ శు॥ 3

# విషయసూచిక.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

ఓమ్ ప్రజ్ఞానం బ్రహ్మ

ఓమ్ అయమాత్మా బ్రహ్మ

ఓమ్ అహం బ్రహ్మాస్మి



ఓమ్ తత్త్వమసి

**వేదసంస్థాపక శ్రీ స॥ ప॥ శ్రీరామచంద్రేంద్ర సరస్వతీయతీంద్రులు.**

బ్రహ్మానందం, పరమసుఖదం, కేవలం, జ్ఞానమూర్తిం,
విశ్వాతీతం, గగనసదృశం, తత్త్వమస్యాదిలక్ష్యమ్,
ఏకం, నిత్యం, విమల, మచలం, సర్వధీసాక్షిభూతం,
భావాతీతం, త్రిగుణరహితం, సద్గురుం, తం నమామి.

శ్రీ శివాయగురవే నమః.

'వేదోద్ధారక' శ్రీ॥ ప॥ ప॥ శ్రీరామచంద్రేంద్ర సరస్వతీయతీంద్ర

# సద్గురుస్తోత్రమ్

మత్పరివ్రాజక రాజహంసం
సదాఽఽత్మబోధాఽమృతతృప్తహంసం
శ్రీరామచంద్రేంద్ర యతీంద్ర మీడే
సరస్వతీ సద్గురు సంప్రదాయమ్.

2. శ్రీమన్మహాదేవ పరావతారం
బాల్యాత్సమాస్వాదిత వేదసారమ్
విజ్ఞాననౌకాప్త భవాబ్ధిపారం
శ్రీరామచంద్రేంద్ర యతీంద్రమీడే.

3. వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థం
సన్యాసయోగాం చితశుద్ధతత్త్వమ్
తత్త్వార్థతుచ్ఛీకృతలోకసౌఖ్యం
శ్రీరామచంద్రేంద్ర యతీంద్రమీడే.

4. కారుణ్యసంవర్ధిత శిష్యబృందం
నిత్యాత్మనాసేవిత శ్రీముకుందమ్
ఆత్మీకృతాంతః కరణారవిందం
శ్రీరామచంద్రేంద్ర యతీంద్రమీడే.

5. శ్రీమద్గురుం శంకరతత్త్వలక్ష్యమ్
లక్ష్యార్థనిర్మూలితలోక సాక్ష్యమ్
సాక్షాచ్ఛివం సర్వ మనోభిరామం
రామచంద్రేంద్ర యతీంద్రమీడే.

6. సర్వ స్వరూపాత్మ రసైకయుక్తం
ప్రహ్లాదభీష్మ స్తుతిపారరక్తమ్

జీవన్విముక్తంచ విదేహముక్తం
శ్రీరామచంద్రేంద్ర యతీంద్రమీడే.

7. దేహాదిదుర్గాణి విభేదయంతం
కామాదిశత్రూన్ ప్రవినాశయంతం
మైత్ర్యాదివర్గాన్ పరిపాలయంతం
శ్రీరామచంద్రేంద్ర యతీంద్రమీడే.

8. ఆబాలగోపాల ముపాస్యమానం
మానావమానాదిషుతుల్యభావమ్
'భావ, స్సుఖం, బ్రహ్మ' ఇతీరయంతం
శ్రీరామచంద్రేంద్ర యతీంద్రమీడే,

9. "చైతన్యమేవేద మశేషరూపం
తస్మిన్మహామోహ బలాత్ప్రతీతమ్
బ్రహ్మస్వరూపోహ" మితీరయంతం
శ్రీరామచంద్రేంద్ర యతీంద్రమీడే.

10. జ్ఞానావసానం పరిదర్శయంతం
అజ్ఞానమూలం జగదింద్రజాలమ్
మిథ్యేతినిశ్చిత్య విలోకయన్తం
శ్రీరామచంద్రేంద్ర యతీంద్రమీడే.

11. శ్రీమద్గురుస్తోత్ర మిదంపవిత్రం
సమూలసంసార లతాలవిత్రమ్
యోవాపఠేన్ముక్తిముపైతిజీవన్
శ్రీరామచంద్రేంద్ర యతీంద్రభక్తః

గుం॥ మం॥ వే॥ వి॥ పరీక్షాసభా
కార్యస్థానస్థః పౌరాణికః
గుంటూరు,
శ్రీవికృతి జ్యేష్ఠ శు 3 శుక్ర.

ఇత్థం
శ్రీసద్గురు స్వామినాం
పాదపద్మ శిష్యపరమాణుః
ప్రతాప హనుమయనామధేయః.

శ్రీ

మాత



పీసపాటి వరలక్ష్మమ్మ

చతుర్వేదపరమరహస్యగ్రంధకర్త్రు ధర్మపత్ని:
వేదసంస్థాపక శ్రీ ప. ప. శ్రీరామచంద్రేంద్ర సరస్వతీయతీంద్ర
ముఖ్యశిష్యురాలు, (కోడలు) జిజ్ఞాసువు లగుస్త్రీలకు చతుర్వేద
పరమరహస్యముల ప్రతిఫలారహితముగా నిత్యముబోధించుచున్న విజ్ఞాని

# ప్రస్తావము

ప్రమాణరాజము లగు ప్రత్యక్షానుమానప్రమాణంబులచేఁ గూడఁ దెలిసికొన శక్యముకాని యతీంద్రియవిషయంబులఁ దెలుపునట్టిది వేదము. ఈయది ఋగ్యజుస్సామాథర్వణము లనెడి నాల్గుశాఖలుగాఁ దెలియఁబడుచున్నది. ఇది భగవంతునియుచ్ఛ్వాసనిశ్శ్వాసరూపము. కావునఁ బరమపవిత్రము. జన్మజరామరణశూన్యు లగుమహర్షి పుంగవులు స్వతపస్సామర్థ్యమున వేదముల గ్రహించి లోకోప కారార్థము గురుశిష్యప్రశిష్యపరంపరాక్రమాధ్యయనాధ్యాపనసంప్ర దాయరూపమున దానిని లోకమున వెలయించినారు.

వేదము కర్మోపాసనాజ్ఞానముల నుపస్థాపించుచుఁ గర్మకాండ, బ్రహ్మకాండము లనుపేరఁ గాండద్వయాత్మకమై యున్నది. నిత్య నైమిత్తికకామ్యకర్మములను బోధించుభాగమునకే కర్మకాండము లేక పూర్వకాండమనియు, నుపాసనాఫలీభూతజ్ఞానమును బోధించు భాగమునకే బ్రహ్మకాండము, జ్ఞానకాండము, వేదాంతములు, ఉపని షత్తులు లేక యుత్తరకాండ మనియు నభిజ్ఞులు వక్కాణింతురు. కర్మ బ్రహ్మకాండములకు సంబంధించినవిషయము లీవేదమున నధికారి తారతమ్యము ననుసరించి చక్కఁగ బోధింపఁబడియున్నవి.

కర్మకాండమం దిహపరలోకసుఖసంపాదనమునకు వలయు సకలోపాయములు చక్కఁగాఁ దెలుపఁబడియున్నవి. లోకమునందుఁ గలచతుష్షష్టివిద్యలకు నీకర్మకాండమే మూలాధారము. వీనికి సంబం ధించినరహస్యము లన్నియు వేదములందు బీజభూతములుగ నచ్చ టచ్చటఁ దెలుపఁబడియున్నవి. బ్రహ్మకాండమునందు నశ్వరమగు నిహపరలోకసుఖప్రాప్తిని నిరసించుచు, ననశ్వర మగుశాశ్వతనిరతి శయానందరూపబ్రహ్మప్రాప్తికి సంబంధించిన విషయ మంతయు విస్తరింపఁబడియున్నది. పరమాత్మనియుచ్ఛ్వాసనిశ్శ్వాసరూపము లగునీవేదములను యథోక్తఫల మపేక్షించు ద్విజశిష్యులు

బ్రాహ్మణగురుముఖమునుండి సంప్రదాయసిద్ధముగను స్వరసహితముగను నీనాఁటికిని నేనాఁటికిని బఠయవలసియుండును.

పూర్వము శ్రీ వ్యాసభగవానుఁడు, జీవు లజ్ఞానముచే విషయసుఖరూప సంసారములందుఁ బడి, తత్సుఖసంపాదనమునకే ప్రయత్నించుచు బ్రహ్మానందసుఖ మనునది యున్న దనుసంగతియే తెలియకయున్నపుడు వారికి బోధపడుటకుఁగాను దా నుపనిషద్రహస్యముల నెల్ల బ్రహ్మసూత్రము లనుపేర రచియించిరి. అటులే శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలయందు బోధించిరి. కాని కాలక్రమమునఁ గలియుగమున నేతద్విషయములు మఱచి ప్రజ లేతద్వాక్యార్థముల గ్రహింపనేరని స్థితియం దుండుటచే శ్రీశంకరభగవత్పాదాచార్యస్వామియును విద్యారణ్యస్వామ్యాదులును నుపనిషత్తులకును బ్రహ్మసూత్రములకును భగవద్గీతలకును నప్పటి జనసామాన్యమునకుఁ దెలియురీతి భాష్యములు రచియించియుండిరి.

ప్రస్తుతకాలమున నవియు నర్థమగుట దుస్తర మగుటచేతను ఆగ్రంథములు విస్తారము లగుటచేతను నేఁడు సర్వజనులకు వేదరహస్యము సుబోధ మగునట్లు నాచేఁ గ్లుప్తముగ సులభశైలిని దెలుఁగు తాత్పర్యసహితముగఁ జతుర్వేదపరమరహస్య మను నీగ్రంథము వ్రాయఁబడినది.

విద్య యేకాక్షరస్వరూపము, మాత్రారహితపరబ్రహ్మస్వరూపము నని శ్రుతిప్రమాణము, మఱియు గుప్తగాయత్రీ, ప్రణవగాయత్రీ స్వరూపమే వేద మనియుఁ దెలియ నగును. ఆవేదము బ్రాహ్మణముఖమున వెలువడినపుడే వేద మనఁబడి మహావాక్యార్థలక్ష్యార్థస్వరూపమై జ్ఞానయజ్ఞార్హ మగును.

యజ్ఞములలో నెల్ల జ్ఞానయజ్ఞము సర్వోత్తమము. జ్ఞానయజ్ఞమన బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్య యన వేదము. వేదమే బ్రహ్మవిద్య. ఈరెంటికిని నభేదము. శ్రీవ్యాసభగవానులు సూత్రభాష్యమందు "శాస్త్రయోనిత్వాత్" అని బోధించియున్నారు. వేదముయొక్క

పరమరహస్యస్వరూపమునకు శాస్త్రయోని యని పేరు. వేదరహస్యముం దెలిసినఁ బరమాత్మను దెలిసినటులే; పరమాత్మను దెలిసిన వేదరహస్యమును దెలిసికొనినట్లే యని తెలియుచున్నది.

ఈయజ్ఞమునఁ జేయువారి కెట్టిఫలము గలుగునో చేయించు వారికిని నట్టిఫలమే గలుగుట నిస్సంశయము. ఇట్టిరహస్యజ్ఞు లగుట చేతనే వేదసంస్థాపకు లగు శ్రీరామచంద్రేంద్రసరస్వతీయతీంద్రులు గుంటూరు నగరమున అఖిలభారతకృష్ణయజుర్వేదశాఖాధ్యాపకవిద్వత్సభను సంస్థాపించియుండిరి. కానఁ జాతుర్వర్ణ్యమువారును దీని పరమరహస్య మెఱిఁగి, తమసంపాదనమునుండి షోడశాంశమునైన నీజ్ఞానయజ్ఞనిర్వాహమునకై వినియోగించి సర్వయజ్ఞములు గావించియుఁ బడయఁజాలని మహాఫలమును బడయఁదగును.

నే నీ 'చతుర్వేదపరమరహస్య' మనుగ్రంథమును వ్రాయుట సాహసమే యైనను దీనిని నేను నాశక్తిచే వ్రాసితినని తలంచుట లేదు. దీని కీశ్వరప్రేరణమును, బరాశక్తియనుగ్రహమును, శ్రీరామచంద్రేంద్రసరస్వతీసద్గురుకటాక్షమును గారణములని నిశ్చయముగ నమ్ముచున్నాను.

పండితు లిందలి లోపములనెల్ల సవరించి, యే యే స్థలములం దెట్లుండవలసినది వ్రాసిపంపించిన నవి సహేతుకముగ నున్నచో రెండవ ముద్రణమందు సరిచేయబడును.

ఈగ్రంథము సరిచూచిన వేదార్థప్రవీణ, విద్వత్సార్వభౌమ బ్రహ్మశ్రీ చివుకుల వేంకటరమణశాస్త్రిలుగారికిని, ఈగ్రంథముద్రణమందు సహాయ మొనరించిన బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వర శాస్త్రిలుగారికిని నాకృతజ్ఞతాపూర్వకనమస్కారములు.

ఇట్లు,

గ్రంథకర్త.



ఓం

యజుర్వేద పరమరహస్యముల నెల్ల గ్రహింపవిజ్ఞాని



ఏతద్గ్రంథముద్రణద్రవ్యసమర్పయితృ

**యడవల్లి వేంకటకృష్ణశాస్త్రి**

వేదసంస్థాపక శ్రీ ప. ప. శ్రీరామచంద్రేంద్రసరస్వతీయతీంద్రశిష్యుడు,

శ్రీకృష్ణయజుర్వేద క్రమాంతపూర్వాధ్యాపకపరీక్షాసభాకార్యదర్శి,

అగ్రహారము - గుంటూరు.



# చతుర్వేద పరమరహస్యము



శ్రు॥ యశ్ఛందసా మృషభో విశ్వరూపః । ఛందోభ్యోఽధ్యమృతాత్సంబభూవ । స మేంద్రో మేధయా స్పృణోతు । అమృతస్య దేవధారణో భూయాసం । శరీరం మే విచర్షణం । జిహ్వా మే మధుమత్తమా । కర్ణాభ్యాం భూరి విశ్రువం । బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః । శ్రుతం మే గోపాయ.

తా॥ వేదము లన్నిటిలోను (ఋషభము=ప్రధానము) శ్రేష్ఠ మగు నోంకారము సర్వలోకములకు అధిష్ఠాన మగు బ్రహ్మస్వరూపమై అమృతమువలె నుజ్జీవింపజేయుసామర్థ్యము గల్గి, నిత్యమై, వేదములో నుండి యభివ్యక్తమై, అధికారులచేత ఉపాస్యమాన మగుచున్నది. దానిచే ప్రతిపాదింపబడు పరమేశ్వరుడు నన్ను మేధావంతునిగా నొనర్చుగాక ! ఓ పరమేశ్వరా ! లోకములనుండి, దేవతలనుండి, వేదములనుండి, వ్యాహృతులనుండియు సారమును గ్రహించదలచిననీకు ధ్యానమందీ ఓంకారము సారతరమైనదిగా భాసించెనుగదా ! నే నట్టి ఓంకారము నుపాసించి, మోక్షము నొందెదనుగాక! ఎట్టి విఘ్నములు లేకుండ అందు కనువగు శమదమాదులను బడయుటకును, శ్రవణాదిక మొనర్చుటకును, నా శరీరము తగియుండు గాక ! నా వాక్కు-మధురభాషలు పల్కుగాక ! నా శ్రోత్రములు గురువులు చెప్పుదానిని సక్రమముగా గ్రహించుగాక ! ఒరయందు కత్తియుండుట లోకప్రసిద్ధముగాన, కత్తి కావలసినవాడు ఒరను చేపట్టునట్లు ఓ ప్రణవమా !

నేను, బ్రహ్మోపలబ్ధికొరకు నిన్నుపాసించుచున్నాను. నీవు లౌకిక ప్రజ్ఞచే ఆచ్ఛాదింపబడియుంటివిగాన, సామాన్యులు నిన్నెరుగజాలరు. నే నెరుగున ట్లనుగ్రహింపుము. నేను గురుశాస్త్రములవలన గ్రహించిన విద్యను రక్షింపుము.



## ఇష్టదేవతా ప్రార్థన

1. ఐశ్వర్యం పరమం తత్త్వ మాదిమధ్యాంతవర్జితమ్
ఆధారం సర్వలోకానా మనాధార మవిక్రియమ్.

2. అనంతానందబోధాంబునిధి మద్భుతవిక్రమమ్
అంబికాపతి మీశాన మనిశం ప్రణమా మ్యహమ్.

3. మన్మాయాశక్తిసంక్లృప్తం జగ త్సర్వం చరాచరమ్
సాపి మత్తః పృథ ఙ్మాయా నా స్త్యేవ పరమార్థతః.

4. శివో దాతా శివో భోక్తా శివ స్సర్వ మిదం జగత్
శివో యజతి యజ్ఞైశ్చ య శ్శివ స్సోఽహ మేవ హి.

5. యా విద్యా శివకేశవాదిజననీ, యా వై జగన్మోహినీ,
యా బ్రహ్మాదిపిపీలికాంతజగదానందైకసంధాయినీ,
యా పంచప్రణవద్విరేఫనళినీ, యా చిత్కళామాలినీ,
సా పాయా త్పర దేవతా, భగవతీ, శ్రీరాజరాజేశ్వరీ.

6. సంచింతయామి చరణౌ, కులరంధ్రపీఠే
శంభో ర శేషజననస్థితినాశహేతూ,
షష్ట్యుత్తరత్రిశతదివ్యమరీచికానా
మంతే పదోపరి షడన్వయరక్తశుక్లౌ.

7. జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.

8. గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షా త్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః.

9. అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః.

10. నారాయణం, పద్మభువం, వశిష్ఠం,
శక్తిం చ, తత్పుత్రపరాశరం చ,
వ్యాసం, శుకం, గౌడపదం మహాంతం,
గోవిందయోగీంద్ర మథాస్య శిష్యమ్.

11. శ్రీశంకరాచార్య, మథాస్య పద్మ
పాదం చ, హస్తామలకం చ, శిష్యమ్
తం త్రోటకం వార్తికకార మన్యా
నస్మద్గురూ న్సంతత మానతోఽస్మి.

12. శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్
నమామి భగవత్పాదశంకరం లోకశంకరమ్.

13. శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్
సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః.

14. నారాయణసమారంభాం విద్యాశంకరమధ్యమామ్
శ్రీరామచంద్రేంద్రసరస్వతీపర్యంతాం వందే గురుపరంపరామ్.

15. వందే గురుపదద్వంద్వ మవాఙ్మానసగోచరమ్
రక్తశుక్లప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం మహః.



## దక్షిణామూర్తి స్తవము

1. మౌనవ్యాఖ్యాప్రకటితపరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాంతే వసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః
ఆచార్యేంద్రం కరకలితచిన్ముద్ర మానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే.

తా॥ ఆత్మస్వరూప మనిర్వచనీయ మగుటచేతను, చక్షురాది ఇంద్రియగోచరము కానిదగుటచేతను, ఇదమిత్థమని నిరూపింప వీలు లేక, తాను చిన్నవాడై దక్షిణామూర్తిరూపమున నవతరించిన ఈశ్వరుడు వృద్ధులును, బ్రహ్మనిష్ఠులును, అగు శిష్యభూతులైన ఋషివర్యులచేత పరివేష్టింపబడి వారికి అత్యుత్తమమైన ఉపదేశరీతియగు మౌనమాత్రముచేతనే, పరబ్రహ్మతత్త్వము నుపదేశించుచు దక్షిణ హస్తమందు తర్జన్యంగుష్ఠసంయోగరూపమగు చిన్ముద్రను లేక జ్ఞానముద్రను ధరించినవాడును, ఆనందమే స్వరూపముగా గల్గి, తన స్వరూపమే బ్రహ్మాండ మంతట వ్యాపించిన దనునిశ్చయ జ్ఞానము ననుభవించువాడును. ప్రసన్న మగుముఖము గలవాడును, ఆచార్యులలో నెల్ల శ్రేష్ఠుడనగు శ్రీదక్షిణామూర్తిదేవుని స్తోత్రము చేయుచున్నాను. "జ్ఞానముద్రా, జ్ఞానగమ్యా ... దక్షిణామూర్తిరూపిణీ" అను లలితారహస్యనామప్రమాణము ననుసరించి, ఈదక్షిణామూర్తి పరదేవీ స్వరూపమని గ్రహించవలసియున్నది.

2. విశ్వం దర్పణదృశ్యమాననగరీతుల్యం నిజాంతర్గతం
పశ్య న్నాత్మని మాయయా బహిరి వోద్భూతం యథా నిద్రియా
య స్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమే వాద్వయం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే

తా॥ ఆకాశాదిపంచభూతాత్మకమై స్థావరజంగమరూప మగు నీ జగత్తంతయు అద్దమునందలి ప్రతిబింబమువలె ఆత్మయందు కనబడు చుండును; తిరిగి మాయచేత ఈ ప్రపంచము వెలుపల నున్నట్లగపడు చుండును. నిద్రయందు వాసనాసంస్కారముచే కల్పింపబడి భాసించు స్వప్నప్రపంచమువలె ఈ కనుపించుజగమంతయు కల్పింపబడినదేగాని వాస్తవము గాజాలదు. గురూపదేశముచేత అపరోక్షాత్మవిజ్ఞానోత్పత్తి సమకాలమందు భేదములేని ఆత్మనుమాత్రమే గోచరింపజేసి, బ్రహ్మానందము ననుభవింపజేయు గురుస్వరూపు డగుశ్రీదక్షిణామూర్తి దేవునకు నమస్కారము.

3. బీజ స్యాంతరి వాంకురో జగి దిదం ప్రా క్నిర్వికల్పం పున
ర్మాయాకల్పితదేశకాలకలనావైచిత్ర్యచిత్రీకృతమ్
మాయావీవ విజృంభయ త్యపి మహాయోగీవ య స్స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

తా॥ ఆత్మ సత్యము జ్ఞానరూపము ఆనందరూపము సర్వ వ్యాపకము అయియున్నది. ప్రపంచము అసత్యము జడము దుఃఖ రూపము పరిచ్ఛిన్నము అయియున్నది. ఇట్టిజగత్తునకు అట్టి ఆత్మ కారణ మెట్లగునో వివరింపబడుచున్నది.

ఉత్పత్తికి పూర్వము బీజము లేక విత్తునందు పత్ర, శాఖా, పుష్పాదిసహితమహావృక్ష మిమిడియున్నట్లు, ఆత్మయందీప్రపంచ మిమిడియున్నది. గారడీవాడు తనమాయా (గారడీ) దండమం దిమిడి యున్న మామిడిచెట్టును, బహిర్గత మొనర్చి ప్రజలకు చూపించునటు గను, మహాయోగీశ్వరుడు అణిమాద్యష్టైశ్వర్యసిద్ధిబలముచే అనేక విషయములను బహిర్గత మొనర్చి ప్రదర్శించునట్లును, ఈఆత్మ గూడ మాయా వశమున జన్మాంతరీయపుణ్యపాపములబీజములను సృష్టి కాలమందు బహిర్గత మొనర్చి, మాయచే కల్పింపబడిన దేశ,కాలాది, నానావిధ, నామరూపాదిభేదములతో నొప్పుజగత్తును విజృంభింప జేయుచున్నాడు. అట్టిశుద్ధ మగుపరమాత్మ భక్తులకు జ్ఞానోపదేశ మొనర్చుటకై దక్షిణామూర్తిరూపమున నవతరించెను. అట్టి దక్షిణా మూర్తిరూపు డగుదేవునకు నమస్కారము.

4. యస్యైవ స్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే,
సాక్షా త్తత్త్వమసీతి వేదవచసా యో బోధయ త్యాశ్రితాన్,
యత్సాక్షాత్కరణా ద్భవే న్న పునరావృత్తి ర్భవాంభోనిధౌ
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

తా॥ జ్ఞానప్రకాశము ఒక్కఆత్మధర్మమేగాని అగ్నిసూర్యాది దేవతలకుగాని చక్షురాదీంద్రియములకుగాని లేదు. పరమార్థదృష్టిలో

లేనివగు అగ్నిసూర్య, చక్షురాదులకు వ్యవహారదశలో నున్నట్లు కనుపించు జ్ఞానప్రకాశము ఆత్మధర్మమే.

ఏపరమేశ్వరుని, సద్రూప మగుచైతన్యము అసత్యములగు ఆకాశాదిభూతములవలె ప్రకాశించుచున్నదో, ఎవరు తనభక్తులకు "తత్త్వమసి" ఇత్యాదిమహావాక్యములద్వారా అపరోక్షాత్మవిజ్ఞానోపదేశ మొనర్చుచున్నాడో, ఎట్టితననిజస్వరూప మెరిగినవారికి జననమరణప్రవాహరూప మగుసంసారదుఃఖము గలుగదో, అట్టి జ్ఞానోపదేశార్థ మవతరించినదక్షిణామూర్తిదేవునకు నమస్కారము.

5. నానాఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరం
జ్ఞానం, యస్య తు చక్షురాదికరణద్వారా బహి స్స్పందతే
జానామీతి తమేవ భాంత మనుభా త్యేతత్సమస్తం జగత్
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

తా॥ ఆత్మధర్మ మగుజ్ఞానప్రకాశ మొక్కటియే చక్షు శ్శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణాదులద్వారా వ్యవహారదశలో భాసించుట యుక్తిశూన్యముగాక, దృష్టాంతసహితమై యుక్తియుక్త మగుచున్నది. ఎట్లన, అనేకరంధ్రములు గలయొకేకుండలో నుంచబడిన ఒకేదీపము అనేకరంధ్రములద్వారా అనేకదీపములుగా భాసించుట లోకసిద్ధము. అట్లే, ఆత్మయొక్క జ్ఞానప్రకాశము చక్షురాది, ఇంద్రియరంధ్రముల ద్వారా దర్శన, స్పర్శన, శ్రవణ, ఘ్రాణనాది, జ్ఞానము లనుభిన్న శక్తులవలె భాసించుచున్నది. అనగా జ్ఞానప్రకాశము చక్షురింద్రియ రంధ్రముద్వారా బహిర్గతమైనపుడు దర్శనజ్ఞానము లేక రూపజ్ఞాన మనబడును. శ్రోత్రేంద్రియరంధ్రముద్వారా బహిర్గతమైనపుడు శబ్ద జ్ఞాన మనబడును. నాసికారంధ్రముద్వారా బహిర్గతమగునపుడు ఘ్రాణజ్ఞానము లేక గంధజ్ఞాన మనబడును- ఇత్యాదిగా, ఒకేవిద్యుచ్ఛక్తి ఎఱుపు, పసుపు, నీలము మొదలగురంగులు గలబల్బుల ద్వారా ప్రసరింపజేయబడినపుడు ఎఱుపు, పసుపు, నీలము మొదలగు రంగుగలకాంతి ప్రసరించునట్లు, ఒకే ఆత్మధర్మ మగుజ్ఞానప్రకాశము

చక్షురాది, ఉపాధులద్వారా రూపాదివృత్తిజ్ఞానము లనెడివ్యవహార మున కాస్పద మగుచున్నది.

పాంచభౌతిక మగు ఈజగత్తంతయు ఆయాయింద్రియముల వృత్తిజ్ఞానముద్వారా ఆత్మచైతన్యజ్ఞానప్రకాశముచే అభివ్యక్త మగుచున్నది. అనగా జ్ఞానప్రకాశరూప మగుఆత్మయే యీజగత్తు నంతను ప్రకాశింపజేయుచున్నది. అట్టిజ్ఞానము నుపదేశించుట కవతరించిన దక్షిణామూర్తిదేవునకు నమస్కారము.

6. దేహం ప్రాణమ పీంద్రియాణ్యపి చలాం బుద్ధిం చ శూన్యం విదుః
స్త్రీబాలాంధజడోపమా స్త్వహమితి భ్రాంతా భృశం వాదినః
మాయాశక్తివిలాసకల్పితమహావ్యామోహసంహారిణే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

తా॥ అహం=నేను పైన వివరింపబడినట్టి జ్ఞానప్రకాశరూపమగు ఆత్మయొక్క నిజరూపమే నేనని గుర్తించలేని స్త్రీ, బాల, అంధ, జడులతో తుల్యు లగుపామరులలో కొందరు దేహమే నే ననియు, మరికొందరు ప్రాణమే నే ననియు, ఇంకొకరు ఇంద్రియములే నే ననియు, వేరుమంది ప్రతిక్షణవిలక్షణ బుద్ధియే నే ననియు, మరికొందరు శూన్యమే నే ననియు భ్రాంతులై స్వేచ్ఛగా మాట్లాడుదురు. ఇట్టి యందరయొక్క మాయాశక్తివిలాసముచే కల్పిత మగువ్యామోహమును సంహరించు దక్షిణామూర్తిరూపు డగుగురుమూర్తికి నమస్కారము.

7. రాహుగ్రస్తదివాకరేందుసదృశో మాయాసమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూ త్సుషుప్తః పుమాన్
ప్రాగస్వాప్స మితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

తా॥ సుషుప్తియందు, విశేషవిజ్ఞాన సాధనము లగుచక్షుశ్శ్రోత్రాదు లనుఇంద్రియములు, తమతమ వ్యాపారములను మాని, ఉప

సంహృతముదైనపుడు కేవలము మాయానమావృతుడై సత్తామాత్ర ముచే స్ఫురించుచు గ్రహణకాలమందు రాహువుచేగాని కేతువుచేగాని సమావృతు లగుసూర్యచంద్రులవలె సన్మాత్రుడగు జీవుడు మేల్కొన్న క్షణమందు “ఇదివరలో నిద్రించితిని, ఇపుడు మేల్కొంటిని” అని యెడు పూర్వానుభవస్మరణరూప మగుప్రత్యభిజ్ఞ గల్గియుండుటచే, జీవుడు, జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడి, మూడు అవస్థలకు సాక్షిమాత్రుడే అనుట యుక్తియుక్తముగా నున్నది. ఇట్టివిజ్ఞానము నుపదేశించు దక్షిణామూర్తిరూపు డగుగురుమూర్తికి నమస్కారము.

ప్రత్యభిజ్ఞాన మనగా పూర్వము ప్రకాశించినట్టియు ఇపుడు ప్రకాశించుచున్నట్టియు వస్తువులయొక్క సమానధర్మాదిగుణముల చేత పూర్వోత్తరదేశకాలముల పరిత్యజించి, అదియె ఇద యని గ్రహించుట యని తాత్పర్యము.

8. బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తా స్వనువర్తమాన మహమి త్యంత స్స్ఫురంతం సదా
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో ముద్రయా భద్రయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

తా॥ బాల్య, యౌవన, కౌమార, వార్ధకాద్యవస్థలందును, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలందును, దర్శన, స్పర్శనాద్యవస్థలందును, “నేను” అనెడి యేజ్ఞానస్వరూపచైతన్య మెప్పుడును ఒకేవిధముగ ప్రకాశించుచున్నదో అట్టి చైతన్యమే నేను అనగా నాయొక్క నిజరూపమగు ఆత్మ అదియే సర్వవ్యాపకమై అన్నిటికంటె పెద్దది గాన బ్రహ్మ మనునభిప్రాయమును చిన్ముద్రచేత తెలుపుచున్నదక్షిణామూర్తిదేవునకు నమస్కారము.

అనగా బాల్యాద్యవస్థావిశేషము లన్నిటియందును దేహము, ఇంద్రియములు, మనస్సు, అంతఃకరణవృత్తులు మొదలగున వన్నియు, వ్యావృత్తము లనగా మార్పునొందుచున్నను, వీని కన్నిటికి సాక్షి

మాత్ర మగు ఆత్మయొక్కటి సీని యన్నిటియందును ఏకరీతిగా అనువర్తమాన మగుచున్నందున ఇదియే ఆత్మయొక్క నిజరూప మనియు, ప్రతిక్షణమందును మార్పుల నొందు దేహేంద్రియాదులు ఆత్మయొక్క నిజరూపము లెంతమాత్రము కాజాలవనియు బోధించు దక్షిణామూర్తి దేవునకు నమస్కారము.

9. విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధత
శ్శిష్యాచార్యతయా తథైవ పితృపుత్త్రాద్యాత్మనా భేదతః,
స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయాపరిభ్రామితః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

తా॥ సర్వప్రాణులకు ప్రత్యక్షముగ గనంబడుచున్న ఈజీవుడు తాను యథార్థమునకు బ్రహ్మమే యైయున్నను మలినసత్త్వప్రధాన మగుఅవిద్యచే నావరింపబడినవాడై జాగ్రత్స్వప్నావస్థలందు జగదంతః పాతు లగుకొన్నివస్తువులను కారణములనియు, మరికొన్నివస్తువులను కార్యములనియు, కొందరిని యజమానులనియు, మరికొందరిని నౌకరు లనియు, కొందరిని గురువులనియు, మరికొందరిని శిష్యులనియు, కొంద రిని తండ్రులనియు, మరికొందరిని పుత్రులనియు - ఇట్లు నానాభేదము లతో జూచుచున్నాడు. పరమార్థవిచారణచే ఇవన్నియు నసత్యములు. ఏలననగా, ఈవిభేద మంతయు దేహేంద్రియసంఘాతమునకు సంబం ధించినదిమాత్రమేగాన, అయ్యది అవాస్తవమైనందున ఈవిభేదము లన్నియు అవాస్తవములు- గాన జీవుడే పరమాత్మ- ఎవ రట్టిపర మాత్మస్వరూపుడై భక్తులకు జ్ఞానోపదేశముకొరకు దక్షిణామూర్తి రూపమున నవతరించెనో ఆ గురుమూర్తికి నమస్కారము.

10. భూరంభాంస్యనిలోఽనలోఽంబరమహర్నాథోహిమాంశుః పుమా
నిత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్;
నాన్య త్కించన విద్యతే విమృశతాం యస్మా త్పరస్మా ద్విభోః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

తా॥ భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, యాగమొనర్చుపురుషుడు అనునీ యెనిమిదిరూపములుగా చరాచరాత్మకమగు ప్రపంచమంతయు, ఎవనియొక్క మూర్తులుగా ప్రకాశించుచున్నవో, విమర్శించిచూచువారలకు పరమాత్మకంటె భిన్నమగు వస్తువు గనపడదో అట్టి అపరోక్షాత్మవిజ్ఞానోపదేశము కొరకు దక్షిణామూర్తిరూపమున నున్న గురుదేవునకు నమస్కారము.

11. సర్వాత్మత్వ మితి స్ఫుటీకృత మిదం యస్మా దముష్మింస్తవే
తేనాస్య శ్రవణా త్తదర్థమననా ద్ధ్యానాచ్చ సంకీర్తనాత్
సర్వాత్మత్వమహావిభూతిసహితం స్యా దీశ్వరత్వం స్వతః
స్సిద్ధ్యే త్తత్పున రష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్.

తా॥ ఈదృశ్యమానప్రపంచ మంతయు ఆత్మయే యని స్పష్టీకరింపబడినది. కాబట్టి ఇట్టి యీగురుమూర్తిని స్తోత్రమొనర్చుటచేతను ఆయర్థమును గురువులద్వారా ఉపదేశమొంది పరమాత్మస్వరూపమును ధ్యానించుటచేతను, నిరంతర మాయర్థమును మననమొనర్చుటచేతను, కీర్తించుటచేతను, సర్వాత్మభావము మహైశ్వర్యములతో నొప్పు ఈశ్వరత్వమును స్వయముగ పొంది అపరోక్షాత్మ విజ్ఞానము నొంది, జీవన్ముక్తుడై మాయాపరిణామరూపము లగు అణిమాద్యష్టైశ్వర్యములను పొంది, శ్రీదక్షిణామూర్తిరూపమున నున్నగురుమూర్తిద్వారా విదేహముక్తి నొంది బ్రహ్మానందము ననుభవింతురు.



## విజ్ఞానావశ్యకత

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ
అద్యవాఽబ్దశతాంతే వా మృత్యు ర్వై ప్రాణినాం ధ్రువమ్.

తా॥ పుట్టినవానికి ఈ క్షణమందుగాని నూరుసంవత్సరములలో గాని మరణము తప్పక గల్గును. అట్లే చచ్చినవానికి తిరిగి జన్మ గల్గును.

జన్మ దుఃఖం జరా దుఃఖం జాయా దుఃఖం పునఃపునః
సంసారసాగరం దుఃఖం తస్మా జ్జాగృత జాగృత.

తా॥ జన్మమే దుఃఖము, మరణమును దుఃఖమే, మరియు భార్యా పుత్రాదులవలనను దుఃఖమే. ఈ దుఃఖము లెడతెగనివై, పదేపదే వచ్చుచుండును. సంసారము సముద్రమువలె అంతులేనిదుఃఖము లనెడితరంగములు గలది; గనుక జాగ్రత్తపడి, యట్టిదుఃఖ మెన్నటికి రాకుండుటకును, నిరతిశయానందము కల్గుటకును, జ్ఞానమును సంపాదింపవలెను.

ఆయుః కల్లోలలోలం, కతిపయదివసస్థాయినీ యౌవనశ్రీః,
అర్థా స్సంకల్పకల్పా, ఘనసమయతటిద్విభ్రమా భోగపూగాః,
కంఠాశ్లేషోపగూఢం తదపి చ న చిరం య త్ప్రియాభిః ప్రణీతం,
బ్రహ్మ ణ్యాసక్తచిత్తా భవత, భవభయాంభోధిపారం తరీతుమ్.

తా॥ అలలవలె, జీవనము అస్థిరము, యౌవనశోభ కొంతకాలముమాత్రమే యుండును ధనము తలంపులవలె క్షణికము. విషయ భోగములు వర్షాకాలపుమెఱుపులవలె అతిభంగురములు, ప్రియతమలగువనితలొనంగు ఆలింగనాదులు కొద్దికాలముననే సడలును. కాబట్టి సంసారమనుసముద్రమును దాటి, శాశ్వతమైనసుఖము నొందుటకు మనుజుడు బ్రహ్మజ్ఞానసంపాదనమం దాసక్తిగలవాడై యుండవలెను.

అసారే ఖలు సంసారే సుఖభ్రాంతి శ్శరీరిణామ్
లాలాపానమి వాంగుష్ఠే బాలానాం స్తన్యవిభ్రమాత్.

తా॥ బాలురు బొటనవ్రేలు నోటియందుంచుకొని తల్లిపాలు అనెడిభ్రాంతివలన చొంగను త్రాగుచు ఆనందించునట్లు, శరీరధారులు

దేహమే ఆత్మ యనుభ్రాంతిగలవారై సారములేని ఈ సంసారమందు సుఖభ్రాంతిని పొందుచున్నారు.

కుర్వతే కర్మ భోగాయ కర్మ కర్తుం చ భుంజతే
నద్యాం కీటా ఇవావర్తా దావర్తాంతర మాశు తే
వ్రజంతో జన్మనో జన్మ లభంతే నైవ నిర్వృతిమ్.

తా॥ జీవులు మనుష్యాదిశరీరముల నొంది, సుఖాద్యనుభవముకొరకు ఆయా శరీరోచితకర్మలను చేయుచున్నారు. దేవాదిశరీరముల చేత తిరిగి కర్మల నాచరించుటకొరకు తత్ఫలము ననుభవించుచున్నారు. నీటిప్రవాహమందు ఒకసుడినుండి మరియొకసుడిని పొందుచుండు పురుగులవలె, ఈ జీవులు ఒకజన్మనుండి మరియొకజన్మను పొందుచు సుఖము నెంతమాత్రము పొందుట లేదు.

సత్కర్మపరిపాకాత్తే కరుణానిధి నోద్ధృతాః
ప్రాప్య తీరతరుచ్ఛాయాం విశ్రామ్యంతి యథాసుఖమ్.

తా॥ అనేకజన్మలం దార్జింపబడినపుణ్యకర్మపరిపాకముచే, సుడిగుండములోనిపురుగు నదీతీరమునందలి వృక్షముక్రిందికి చేరెడిరీతిని ఈ జీవులు అహైతుకదయగల ఒకానొకసద్గురువుచే ఈ జననమరణప్రవాహరూప మగుసంసారమునుండి ఉద్ధరింపబడి, అపరోక్షాత్మవిజ్ఞాన మనెడిచెట్టునీడయందు సుఖముగ చేర్పబడి నిరతిశయసుఖులై తిరిగి జననాదిసంసారబాధ నొందరు.

శ్రు॥ ఇహ చే దవేదీ దథ సత్య మస్తి
న చే దిహావేదీ న్మహతీ వినష్టిః
భూతేషు భూతేషు విచింత్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవంతి.

తా॥ ఈ మనుష్యజన్మయందు అధికారము గల్గి, ఆత్మతత్త్వ మును అనగా తననిజరూపమును గుర్తించినవానికి సత్య మగుపర మార్థతారూప మగుచరితార్థత కల్గుచున్నది. అట్లు తెలిసికొనకపో యినయెడల జననమరణప్రవాహరూప మగుగొప్పవినాశము గలు గును. ఆత్మయొక్క నిజరూపమును తెలిసికొన్నజ్ఞానులు సకలభూత ములయందు నాశరహితముగను, ఏకరీతిగను, ఉండు ఆత్మతత్వమును తెలిసికొని జననమరణధర్మములు లేనివా రగుదురు. అనగా బ్రహ్మ భావము నొందుదురు లేక మోక్షము నొందుదు రని తాత్పర్యము.

అవిజ్ఞాతే జన్మ నష్టం, విజ్ఞాతే జన్మ సార్థకమ్
జ్ఞాతు రాత్మా న దూరే స్యా, దితి వేదాంతడిండిమః.

తా॥ తన (ఆత్మ) యొక్క నిజరూపమును విచారించి తెలిసి కొననివానిజన్మ వ్యర్థమును, తెలిసికొన్నవానిజన్మ సార్థకమును, అగు చున్నది. విచారించుజిజ్ఞాసువునకు పరమాత్మ ఎంతమాత్రము దూరమున లేక, అత్యంతసమీపములోనే యుండును. అనగా, ప్రతి జీవునియొక్కయు నిజరూపమే బ్రహ్మమని వేదాంతభేరి మ్రోగు చున్నది.

పురుషార్థత్రయావిష్టాః పురుషాః పశవో ధ్రువమ్
మోక్షార్థీ పురుష శ్శ్రేష్ఠ ఇతి వేదాంతడిండిమః.

తా॥ పురుషులచే కోరబడుటచే "పురుషార్థము" లనబడు 1. ధర్మము 2. అర్థము 3. కామము 4. మోక్షము అను నాలుగిం టిలో ధర్మ, అర్థ, కామములందుమాత్రమే ప్రవృత్తులై, ఐహికభోగ ములనుమాత్రమే కోరుపురుషులు పశుతుల్యులు.

మోక్షమును కోరి, తదర్థప్రయత్నమగు, నిత్యానిత్యవస్తువివే కము ఇహ, అముత్రార్థఫలభోగవిరాగము, శమ, దమాదిసాధన

సంపత్తి మొదలగువాని నభ్యసించి, వేదాంతవాక్యముల శ్రవణ, మనన, నిదిధ్యాసనముల నొనర్చుపురుషుడే శ్రేష్ఠు డనబడును.

యోగినో భోగినో వాపి, త్యాగినో రాగిణోపి చ
జ్ఞానా న్మోక్షో న సందేహ ఇతి వేదాంతడిండిమః.

తా॥ మనుష్యులలో కొందరు యోగాభ్యాసపరులు, మరికొందరు భోగలంపటులు, మరికొందరు త్యాగశీలురు, మరికొందరు విషయానురాగపరులు వీరలందరికిని ఎన్నిజన్మములకైనను వేదాంతవాక్య శ్రవణ, మననాదులచే గల్గు అద్వితీయాత్మజ్ఞానమువలననే మోక్షము గల్గునుగాని, తదితరములవలన మోక్ష మెంతమాత్రమును గలుగ నేరదని వేదాంతభేరి మ్రోగుచున్నది.

జంతూనాం నరజన్మ దుర్లభ, మతః పుంస్త్వం, తతో విప్రతా,
తస్మా ద్వైదికధర్మమార్గపరతా, విద్వత్త్వ మస్మా త్పరమ్,
ఆత్మానాత్మవివేచనం, స్వనుభవో, బ్రహ్మాత్మనా సంస్థితిః,
ముక్తి ర్నో శతకోటిజన్మసు, కృతైః పుణ్యై ర్వినా లభ్యతే.

తా॥ సకలస్థావరజంగమభూతములలో నరులు శ్రేష్ఠులు. అందును, పురుషు లుత్తములు. అందును బ్రాహ్మణు లుత్తములు. అందును వేదాధ్యయనాదిసంపత్తిగల్గినవా రుత్తములు. అందును వేదార్థజ్ఞానము గలిగినపరోక్షజ్ఞాను లుత్తములు. అందును నిత్యానిత్యవస్తువివేకజ్ఞానమును సంపాదించినవా రుత్తములు. అందును సంశయ విపర్యయ రహితమగు ఆత్మాపరోక్షజ్ఞానమును అనగా ఆత్మానుభవమును సంపాదించినవారు శ్రేష్ఠులు. అందును నిరంతరము జీవన్ముక్తావస్థయం దుండువారు శ్రేష్ఠులు. అనేకజన్మలం దాచరింపబడిన పుణ్యకర్మపరిపాకముచే అనేక కోటిలో ఏయొకనికోగాని మోక్షము లభింపదు.

# బ్రహ్మవిద్యాఫలము

శ్రు॥ బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి.

తా॥ బ్రహ్మ మనగా, "బృహి వృద్ధౌ" అనుధాతువువలన అన్నిటికంటె గొప్పది యని యర్థము. ఆకాశాదిపంచభూతములలో, పృథివికంటె జలమును, దానికంటె అగ్నియు, దానికంటె వాయువును, దానికంటె ఆకాశమును, పెద్దవియై, పూర్వపూర్వముల కుత్తరోత్తరములు కారణ మగుచున్నవి. ఇవి యన్నియు పరిచ్ఛిన్నములేగాన బ్రహ్మ మాకాశముకంటె గొప్పదియై దానికిగూడ కారణము కావలెను. అందుచే అనంతము లేక అపరిచ్ఛిన్నము, సర్వవ్యాపకము, బ్రహ్మ మనబడుచున్నది. ఇయ్యది దేశతః వస్తుతః కాలతః సర్వసాపేక్షికముగాన, నయ్యది సత్యమవశ్య మయితీరవలెను. ఆకాశాదిప్రపంచమంతయు జడమును, అనిత్యమును అయినందున నీబ్రహ్మము తద్విలక్షణమై జ్ఞానరూప మయితీరవలెను. ఇట్టిది జాగ్రదాద్యవస్థాసాక్షియేగాన, నియ్యది ఆనందరూప మవశ్య మయితీరవలెను. కావుననే, "సత్యం, జ్ఞానం, అనంతం, ఆనందం బ్రహ్మ"యనుశ్రుతు లుపపన్నములగును. ఇట్టివస్తువును తెలిసికొన్నవాని, ఆత్మరూపమే ఈబ్రహ్మముగాన, బ్రహ్మవేత్త బ్రహ్మమే యగును

శ్రు॥ క్షీయంతే చాస్య కర్మాణి తస్మి న్దృష్టే. పరావరే.

తా॥ వేదాంతవాక్యములను సద్గురువులవలన యథావిధిగా శ్రవణ మొనర్చి, యావిషయమును ఏకాంతమున మనన మొనర్చి, దానిని, నిదిధ్యాస మొనర్పగా, ఆనిదిధ్యాసయొక్క పరిపాకదశయే సమాధి యనబడును. అందు సాధకునిచిత్తము ధ్యేయ మగు బ్రహ్మైకగోచర మగును. అట్టివానికి. అనేకపూర్వజన్మలలోని సమస్తపుణ్యపాపకర్మలును పూర్తిగా నశించి, అపరోక్షాత్మవిజ్ఞానము గల్గును.

శ్రు॥ ఆనందం బ్రహ్మణో విద్వాన్, న బిభేతి కుతశ్చనేతి.

ధ్యానము, లేక స్మరణమనగా- భగవంతుని అనంతనామములను సదా మంత్రమూలకముగా విధిప్రకారము జపించుట.

పాదసేవన మనగా- భగవంతునియొక్క శ్రీపాదారవిందములను హృదయమందు ధ్యానించుట, లేక మానసికముగా సేవించుట.

అర్చన మనగా- భగవదవతారము లగురామకృష్ణాదిమూర్తులను పుష్పాదులతో నలంకరించి, తులసి, బిల్వము మొదలగు పత్ర పుష్పములతో భగవంతుని పాదపద్మములను మంత్రాదులతో విధిప్రకారము పూజించుట.

వందన మనగా- భగవంతునిదివ్యమంగళవిగ్రహమునకు సాష్టాంగముగ నమస్కరించుట.

"విధినా కృతం కృతం, అవిధినా కృత మకృతమ్"

అను ప్రమాణమునుబట్టి శాస్త్రమం దుపదేశింపబడినవిధిచే పూజాదుల నాచరించువారలకుమాత్రము ఫలము వచ్చును. అట్లుగాక తమతమయిష్టానుసారము పూజాదుల నాచరించువారలకు ఫల మెంతమాత్రము రాక, వారిశ్రమ వ్యర్థ మగుచున్నది.

దాస్య మనగా- భగవంతునకు వందన మాచరించినవెనుక, భయభక్తులతో "ఓ భగవంతుడా! పరమాత్మా! నీవు నాకు రక్షకుండవు, నేను నీబంటును. కాబట్టి తెలియక నేను చేసినతప్పులను మన్నించి వానివలన కలుగుఆపదలను తొలగించి రక్షించు" మని మనంబున బహువిధంబుల ప్రార్థించి, భగవత్సన్నిధిని విడిచివచ్చుటకుకూడ మనసొప్పక స్తంభమువలె కదలక మెదలక, ఇతరసంకల్పములను మనస్సునందు రానీయక భగవంతుని ఏకలక్ష్యముతో ధ్యానించుచుండుట.

సఖ్య మనగా- భగవంతునియందు తనకు ప్రియమైన దారపుత్రాదులయందుండు ప్రీతికంటె అధికమగుప్రేమ గల్గియుండుట.

ఆత్మనివేదన మనగా- తనచిత్తమును భగవంతునియందు అర్పణ మొనర్చి, ఇతరసంకల్పము లేవియు లేక, నిస్సంకల్పుడై తదేక ధ్యానముతో తన్మయుడై యుండుట.

ఇవి బాహ్యానవవిధభక్తు లని తెలియవలెను.



## అ న న్య భ క్తి

దేహవ్యాపారమునకు సంబంధించిన పనులకొరకు గడపుకాల మునతప్ప తదితరకాలమునం దంతయు పైవిధమున ధ్యానించుచుండుట అనన్యభక్తి యనబడును.



## ఏ కాం త భ క్తి

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి.

అనెడిభగవద్గీతావాక్యముప్రకారము సముద్రమునందు తరంగము లుండునట్లు నారాయణునియందు సకలప్రపంచ మున్నదనియు

శ్రు॥ "నారాయణపరో జ్యోతి రాత్మా నారాయణః పరః"

అనురీతి ఈదేహమున నారాయణుడు ఆత్మస్వరూపంబై యున్నాడని తెలిసి, జ్యోతిస్స్వరూపమును దర్శించుచు, తన్మయుడై యుండుట ఏకాంతభక్తి యనబడును. అనగా ప్రతిజీవు-డనగా పాంచ భౌతిక మగుదేహమును, అందలి చైతన్యమునుగదా- అందలిచైతన్యమే ఆత్మవస్తువు, నారాయణశబ్దవాచ్యము, జ్యోతిస్స్వరూపము, అవినాశి, సర్వవ్యాపకము, నిత్యము, సత్యము, జ్ఞానరూపము, ఆనంద రూపమును అయినది. అద్దానియందు అధ్యస్తమయినదే యీదేహేంద్రియసంఘాతము- ఇయ్యది కర్మఫల మగుటచే ప్రతిదేహాభిన్నము,

అసత్యము, జడము, దుఃఖరూపము, పరిచ్ఛిన్నము, నశ్వరము, అనిత్యమును అయినది. కావున జ్ఞాని యగువాడు సర్వప్రపంచమందును ఏకరీతిగా అనుగతమై చైతన్యరూప మగుస్వాత్మస్వరూపమును గుర్తించు చుండును. (చూచును. అట్లే స్వాత్మస్వరూపమందు అవిద్యచే ఆరోపింపబడి కల్పిత మగుపాంచభౌతికరూపమును గుర్తించును (చూచును.)

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణా న్సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

తా॥ ఎవరు భగవంతుని నిజమగుభక్తితో సేవించుచున్నారో వారే ముక్తిని పొందగలరు. తదితరులు పొందజాలరు.

ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా
మహాభయకృతత్రాణాత్, ద్విత్రాణా ముపజాయతే.

తా॥ ఈశ్వరానుగ్రహము గల యిద్దరు ముగ్గురకుతప్ప, అది లేనట్టివారలకు అద్వైతబ్రహ్మజ్ఞానము కలుగజాలదు. బ్రహ్మజ్ఞానము లేనియెడల జననమరణప్రవాహంబును దాటి మోక్షంబును చేరుటకు ఎంతమాత్రము సాధ్యము కాదు. మరియు

అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ.

తా॥ ఎవరు నాయందు భక్తి గల్గి, నన్ను పూజింతురో వారికి నేను అభయము నిచ్చుచున్నాను. ఇదే నాకు మహావ్రతముగా నున్నదని శ్రీరామునివచనము.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్.

తా॥ ఎవరు నన్ను నిజముగా నమ్మి నాయందు భక్తి గల్గి, నన్ను పూజించుచున్నారో, వారిని నేను సంసారమునందుండి సంతరింపజేయుచున్నానని శ్రీకృష్ణపరమాత్మ చెప్పినాడు.

# భక్తియొక్క అతిశయము

మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే,
స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరే జగుః.

తా॥ మోక్షమును పొందుటకు కావలసినసాధనములలో నెల్ల "భక్తి" యే గొప్పసాధనము- భక్తి యనగా వివరింపబడుచున్నది- చక్షుశ్శ్రోత్రాదీంద్రియములు తమస్వరూపముచే జడములుగా నున్నట్లు మనకు అనుభవసిద్ధము. ఏలననగా జాగ్రిదవస్థయందు అయ్యవి రూప, శబ్దాదిజ్ఞానసాధనము లైన ట్లగపడుచున్నను స్వప్నా వస్థయందు ఈచక్షుశ్శ్రోత్రాదులు జడములై యుండ, వేరొకచక్షు రాదులచే రూపాదిజ్ఞానము గల్గుచున్నది. నిద్రించువానిసమీపమునం దున్న మేల్కొన్నవారి నిద్రించువానిచక్షురాదీంద్రియము లుపరతిని చెంది, ఎట్టివ్యాపారమును చేయకుండుటను చూచుచున్నారు. నిద్రించువాడుమాత్రము తా నాయాయింద్రియములతో ఆయా రూపాదిజ్ఞానముల ననుభవించినట్లు తదుపరి తెల్పుచున్నాడు. దీనిని బట్టి స్వప్నావస్థలో వానిమనస్సే ఇంద్రియపాత్రను, ఇంద్రియములచే ననుభవించు రూపాదివిషయపాత్రను ధరించినట్లు స్పష్టపడుచున్నది. కాగా స్వప్నావస్థయందు చక్షురాదీంద్రియములు జడములై యున్న ట్లు స్ఫుటము.

మరి సుషుప్త్యవస్థయందు చక్షురాదీంద్రియము లన్నియు మన స్సును జడములై యున్నట్లు సర్వానుభవసిద్ధము.

కాన జాగ్రదితరావస్థలందు చక్షురాదీంద్రియములు జడములు గాను సుషుప్త్యవస్థయందు మనస్సహిత మగుసన్నియింద్రియములు జడములుగాను స్ఫుటముగా గోచరించుచున్నవి.

ఇక జాగ్రద్దశలో మాత్ర మీయింద్రియములు జ్ఞానము గల విగా కనుపించుచున్నవి. ఈజ్ఞాన మీచక్షురాదీంద్రియములకు సహజ

మెంతమాత్రము కాజాలదు. సుషుప్తియందు ఏది మన యింద్రియాదులవలె నుపరతి నొందలేదో అద్దానియొక్క స్వభావమే ఈ జ్ఞానమనియు, తత్సహాయముచే నీ మన యిందిరియము లన్నియు, రూపాదిజ్ఞానసాధనము లగుచున్నవనియు చెప్పుట యుక్తియుక్తము.

అదియే ఆత్మ- కాన ఆత్మస్వరూప మగుజ్ఞానమే మనస్సు ద్వారా ప్రసరించినపుడు కామసంకల్పవిచికిత్సాదు లనబడుచున్నది. అట్లే ఆత్మస్వరూప మగుజ్ఞానము చక్షురాదీంద్రియములద్వారా ప్రసరించినపుడు, రూపాదు లనబడుచున్నది.

కాన, ప్రతిమానసికవృత్తియందును చక్షురింద్రియజన్యరూప జ్ఞానమందును, శ్రోత్రేంద్రియజన్యశబ్దజ్ఞానమందును, ఘ్రాణేంద్రియ జన్యగంధజ్ఞానమందును, త్వగింద్రియజన్యస్పర్శజ్ఞానమందును, జిహ్వేంద్రియజన్య రసజ్ఞానమందునుగూడ ఆత్మజ్ఞానమునే మూలకారణముగా గ్రహించుటయే భక్తి యనబడును. ఇది యొక మతము.

సత్యము, జ్ఞానము, అనంతము, ఆనందము, బ్రహ్మము మొదలగు శబ్దములచే తెలియదగినదే ఆత్మతత్త్వము. తద్భిన్నముగా అనగా అసత్యముగా జడముగా పరిచ్ఛిన్నముగా దుఃఖరూపముగా అల్పముగా భాసించు దేహేంద్రియాదిజగత్తంతయు మిథ్యాభూత మైనది. అట్టిబ్రహ్మమే నేను. ఈదేహాదిజగత్తు నేను గాదు. అను నిశ్చయజ్ఞానము సర్వకాలసర్వావస్థలయందును కల్గియుండుటయే భక్తి యని మరికొందరిమతము.



## భగవల్లక్షణము

ఐశ్వర్యస్య సమగ్రస్య, వీర్యస్య, యశస, శ్రియః
జ్ఞానవైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా.

తా॥ అణిమాద్యష్టైశ్వర్యములు, ధర్మము, కీర్తి, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము - అను నీయాఱును భగ మనబడును. ఇవి గలవాడే భగవంతుడు.

ఉత్పత్తిం చ లయం చైవ భూతానా మాగతిం గతిమ్
వేత్తి విద్యా మవిద్యాం చ, స వాచ్యో భగవా నితి.

తా॥ సర్వభూతములయొక్క పుట్టుకను, నాశమును, రాబోవు సంపత్తును, ఆపత్తును, జ్ఞానమును, అజ్ఞానమును, ఎవడు ముందుగా గుర్తెరుగునో వాడే భగవంతు డనంబడును.

సర్వజ్ఞతా, తృప్తి, రనాదిబోధ,
స్వాతంత్రతా, నిత్య మలుప్తశక్తిః
అనంతశక్తి శ్చ, విభో ర్విధిజ్ఞా
ష డాహు రంగాని మహేశ్వరస్య.

తా॥ సర్వజ్ఞత్వము, ఎల్లపుడు తృప్తి గల్గియుండుట, అనాదిగా నుండు పరిశుద్ధమగు ఆత్మజ్ఞానము, సర్వస్వాతంత్రత్వము, మితిలేని శక్తి, నాశములేనిశక్తి యనునాఱంగములు గలవాడే భగవంతుడు. సర్వేశ్వరత్వము, సర్వభోక్తృత్వము, సర్వాంతర్యామిత్వము, సర్వస్రష్టృత్వము, సర్వపరిపాలకత్వము, సర్వసంహారకత్వాది సర్వలక్షణ సంపన్నుడైనవాడే భగవంతుడని శాస్త్రమందు నిర్వచింపబడినది- అందు

<u>సర్వజ్ఞత్వ మనగా</u>- తా నున్నచోటనే యుండి, సర్వలోకవ్యవహారములను తెలియుట.

<u>సర్వేశ్వరత్వ మనగా</u>- సకలజీవులకు తాను ప్రభువుగా నుండి, తన యాజ్ఞానుసార మెల్లరను నడచుకొనునట్లు నియమించుట.

<u>సర్వభోక్తృత్వ మనగా</u>- తనవలన సృజింపబడినజీవులు చేయుపూజా, యజ్ఞాదులను దేవతారూపము నొంది అనుభవించుట.

సర్వాంతర్యామిత్వ మనగా- తాను తలచినమాత్రముననే చేతనా చేతనాత్మక మగుప్రపంచము నంతను వ్యాపించి యుండుట.

సర్వసృష్టృత్వ మనగా- తాను తలచినమాత్రముచేతనే సర్వజగత్తును సృజించుట.

సర్వపరిపాలకత్వ మనగా - సకలజీవులను రక్షించుట, పరిపాలించు చుండుట, అన్నపానాదులచే పోషించి, సర్వజీవులను రక్షించుట.

సర్వసంహారకత్వ మనగా- దుష్టులను శిక్షించుట, తాను తలచిన మాత్రముచేతనే తనచే సృజింపబడినసర్వప్రపంచమును తన యందు లయమొందునట్లు చేయుట

ఇట్టిసామర్థ్యము లన్నియు గలవాడే భగవంతుడగునుగాని తదితరులును, వీనిలో కొన్నిసామర్థ్యములు గలవారును, భగవంతులని చెప్పుట కెంతమాత్రము వీలులేదు.



## ఈశ్వర లక్షణము

శ్రు॥ బ్రహ్మైవ స్వశక్తిప్రకృత్యాభిధేయ మాశ్రిత్య, లోకాన్సృష్ట్వా, ప్రవిశ్యాంతర్యామిత్వేన, బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియ నియంతృత్వా దీశ్వరః-

తా॥ అట్టిశుద్ధము, నిర్గుణము, నిరాకారమును అగుపరబ్రహ్మమే కల్పాంతరీయ. సర్వజీవపుణ్యాపాపరూప మగుమాయతో గూడినపుడు మాయాశబలితబ్రహ్మమై అనగా సగుణబ్రహ్మమై సాకారుడై ఇచ్ఛామాత్రముచే ప్రపంచమును సృజించుచు సకలచరాచరములందును అంతర్యామిగా వ్యాపించి. సర్వజీవులయొక్క బుద్ధీంద్రియములకు నియంత యైనపుడు ఈశ్వరు డనబడును.

అట్టిభగవంతుని భక్తి యనబడు అపరోక్షాత్మవిజ్ఞానమును సద్గురువుద్వారా పొంది ముక్తిని పొందవలెను.

శ్రు॥ నాన్యః పంథా విద్యతేఽయనాయ.

తా॥ మోక్షము నొందుటకు ఈఉపనిషత్ప్రతిపాదితజ్ఞానము కంటె వేరుమార్గ మెంతమాత్రమును లేదు.



## వైరాగ్యావశ్యకత

ఇందుకు ప్రథమసాధనము వైరాగ్యము.

దోషదృష్టి ర్జిహాసా చ, పున ర్భోగే ష్వదీనతా
అసాధారణహేత్వాద్యా వైరాగ్యస్య త్రయోఽప్యమీ.

తా॥ ప్రాపంచికవిషయము నెద్దానిని విమర్శించినను అయ్యది దుష్టమే యగుచున్నది. అనగా ప్రపంచము అసత్యము, జడము, పరిచ్ఛిన్నము, దుఃఖకరము గాన, ఏ వస్తువును అట్టి ప్రపంచములోనిదేగాన నుక్తదోషయుక్త మగుచున్నది. ఇట్టిదోషదృష్టియే వైరాగ్యమునకు హేతువు.

ఎపుడు విషయ మగువస్తువు దుష్ట మనితోచెనో అపుడు అట్టి వస్తువును పరిగ్రహింపవలె ననుకోరిక యుండదు. కాన ప్రాపంచికవిషయము లగుభోగములను విడచుటయే వైరాగ్యమునకు స్వరూపము.

ఒకమారు విషయమును విమర్శించి దుష్టమని నిర్ధారణచేసి వదలిపెట్టినతర్వాత లోకు లందరు విషయభోగముల ననుభవించుట చూచియుగూడ తాను తిరిగి ఆ విషయభోగములందు ఇచ్ఛ నొందక పోవుటయే వైరాగ్యముయొక్క కార్యము.

సంగీ హి బాధ్యతే లోకై ర్నిస్సంగ స్సుఖ మశ్నుతే
తేన సంగః పరిత్యాజ్య స్సర్వదా సుఖ మిచ్ఛతా.

తా॥ విషయాసక్తి గలవాడు జనులచేత బాధింపబడుచున్నాడు విషయాసక్తి లేనివాడు సౌఖ్యము నొందుచున్నాడు. అందుచే

నెల్లపుడు శాశ్వతసుఖమును గోరువాడు విషయాసక్తిని విడువవలెను. ఈ విడుచుటయే వైరాగ్య మనబడును. ఆ వైరాగ్యమూలముననే బ్రహ్మజ్ఞానము గల్గును. వైరాగ్యము గల్గుటకు జగత్తుయొక్క నిజ రూప మిట్లు పెద్దలచే వర్ణింపబడినది.



## బంధస్వరూపము

మూలప్రకృతి యాలవాలంబు, సుఖదుఃఖములు ఫలంబులు, త్రిగుణములు మూలంబులు, ధర్మార్థకామమోక్షంబులు రసంబులు, పంచేంద్రియంబు లూడలు, షడూర్ములు స్వభావంబులు, సప్తధాతువులు పొఱలు, అష్టప్రకృతులు విటపంబులు, నవరంధ్రంబులు కోటరంబులు, దశవిధప్రాణంబులు పత్రింబులు, శబ్దాదివిషయంబులు పల్లవంబులు, రాగద్వేషాదు లుపశాఖలు, నానావిధకర్మంబులు పుష్పంబులు, జీవేశ్వరులు పక్షులుగా గల్గి మందిరారామక్షేత్రపుత్ర మిత్ర కళత్రబంధుమధ్యస్థద్వేష్యజనాది తీక్ష్ణదుష్కంటకతరుగుల్మాతాసంకీర్ణంబు, కామాదిచోరదుస్సంచారంబు, రోగవ్యాఘ్రభయంకరంబు, దుఃఖదావానలసమావృతంబు, మృత్యుసింహభయగ్రస్తంబు, జరాపిశాచసమన్వితంబు, దైన్యపర్వతసంకటంబు, దురితరాక్షసఘోరంబు, తృష్ణాభీకరకాకోదరసమాకులంబు, హర్షామర్షఝంఝానిలాదూషితంబు, స్వర్గనరకదుర్మార్గతిరోహితాపవర్గసన్మార్గంబు నైనమహాదుఃఖారణ్యంబునం గాదుపడి, పుణ్యపాపవిధేయుండై, జీవుఁ డంతటం దిరిగి, చీకాకుపడి, యెచ్చటను విశ్రాంతి గానక, విసివి, ముందరం గాంచి యనంతంబని, వెనుక జూచి యనాదియని కలయం గనుంగొని యసాధ్యంబని తెలిసి, మహాగాఢదుఃఖభయశోకవ్యాకులచిత్తుండు తాపత్రయాదిత్యప్రదీప్తాతపసంతప్తుండునై, యంతట నిరంతరనిత్యాంతాగమచ్ఛాయల నాశ్రయించి, స్రక్చందనవనితాధనధాన్యపశుసంతానశయ్యానికేతనోద్యానప్రముఖవిషయసంపాదనసాధనంబు లైన కృషివాణిజ్యసేవాయాచనాదిలౌకికకర్మంబుల బరిహరించి, స్వర్గాది సత్యాంతపరలోకవిషయసుఖసాధనంబు లైన నిత్యనైమిత్తికాది

కర్మంబులు ఫలకాంక్షచేత జేయక, పరమేశ్వరార్పణంబుగా నాచరించి, యప్పరమేశ్వరానుగ్రహంబువలన పరిశుద్ధహృదయుండై యమానిత్వము, అదంభిత్వము, అహింస, ఆర్జవము, క్షాంతి, ఆచార్యోపాసనము, శౌచము, స్థైర్యము, ఆత్మవినిగ్రహము, ఇంద్రియార్థంబుల యెడ వైరాగ్యము, అనహంకారము, జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనము, పుత్రదారగృహాద్యనాసక్తి, యనభిష్వంగము, నిత్యేష్టానిష్టోపపత్తిసమచిత్తత్వంబు, అనన్యయోగముగల నిశ్చలభక్తి, వివిక్తదేశసేవిత్వము, జనసంగాసక్తివిసర్జనము, అధ్యాత్మజ్ఞాన నిత్యత్వంబు, తత్త్వజ్ఞానార్థదర్శనం బనువింశతిగుణంబు లెప్పుడు సంగ్రహించునో అప్పు డాత్మ బ్రహ్మైక్యసాక్షాత్కారవిచారాధికారి యగును. ఇంతవఱకునుగూడి వైరాగ్యశబ్దంబునకు తాత్పర్యార్థంబు.

తా॥ సంసార మనునది మహారణ్యమువంటిది. అరణ్య మనేక వృక్షసముదాయకలితము. ఆవృక్షములు వృద్ధినొందుటకు పాదు లెట్లు కారణమో, అట్లే ఈసంసార మభివృద్ధి యగుటకు మాయ కారణము. ఈసంసారవృక్షమునకు సుఖదుఃఖములే ఫలములు. సత్త్వము, రజస్సు, తమస్సు- అను త్రిగుణములే వేరులు. ఈవృక్షమునకు ధర్మము, అర్థము, కామము, మోక్షము, అనునట్టినాలుగుపురుషార్థములే రుచులు. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనుజ్ఞానేంద్రియములే ఈవృక్షమునకు బలకరము లైనయూడలు. ఊడ లెట్లు నేలలోనికి దిగి, చెట్టు నెన్నటికి నెట్టిగాలివానకును పడకుండజేయునో, ఆప్రకారము గానే ఈజ్ఞానేంద్రియములు శబ్దస్పర్శరూపరసగంధము లనువిషయములం దగుల్కొని, ఈసంసారవృక్షమును బలపరచుచుండును. ఈవృక్షమునకు ఆకలి దప్పిక శోకము మోహము జర మరణము అనుషడూర్మలే స్వభావములు. ఈవృక్షమునకు త్వక్కు, మాంసము, రుధిరము, మేదస్సు, మజ్జ, స్నాయువు, అస్థి లనుసప్తధాతువులే పొఱలు. ఈవృక్షమునకు భూమి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకార మనుఅష్టప్రకృతులే కొమ్మలు.

శ్రోత్రములు రెండు, నేత్రములు రెండు, నాసికలు రెండు, వాక్కు, పాయువు, ఉపస్థ లనునవరంధ్రములే ఈవృక్షమునకు తొఱ్ఱలు. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము, నాగము. కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము లనుదశవిధప్రాణములే ఈవృక్షమునకు ఆకులు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనువిషయము లీవృక్షమునకు చిగురుటాకులు. రాగము, ద్వేషము మొదలగునవి రెమ్మలు. ఈవృక్షమునకు సుఖదుఃఖరూపము లగు ఫలముల నిచ్చునట్టి పుష్పములు నానావిధకర్మజాలము. ఆకర్మసముదాయమునకు తగినట్లు సుఖదుఃఖరూపము లైనఫలములు ఫలించును. ఈసంసారవృక్షమునందు జీవుడు ఈశ్వరుడు నను రెండు పక్షులు వాసముచేయుచుండును. ఈరెంటిలో జీవుడు వానిఫలముల ననుభవించును. ఈశ్వరుడు తా ననుభవించకయే జీవులచే ననుభవింపజేయుచు వినోదించుచు తృప్తినొందును వృక్షములను రక్షించుటకు వృక్షము చుట్టును అనేకము లగుముండ్లపొదలు, తీగెలు నల్లిబిల్లిగ నల్లుకొనియుండున ట్లీసంసారవృక్షమును రక్షించుటకు ఇండ్లు, తోటలు, దొడ్లు, పొలములు, పశువులు, ఆలుబిడ్డలు, శత్రువులు, మిత్రులు, ఉదాసీనులు, ననెడివారు గలరు. ఇట్టిపొదలతోగూడినదియే మహారణ్య మనబడును. ఈఅరణ్యమందు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులే దొంగలు. జ్వరాదిసర్వవ్యాధులును ఈఅరణ్యమందలి వ్యాఘ్రాదిదుష్టజంతువులై భయపెట్టును, హింసించునుగూడ. అరణ్యమున కార్చిచ్చుదగులుకొని వృద్ధి జెందున ట్లిందు దుఃఖము లంకురించి వృద్ధినొందుచుండును. మరియు నందు సింహ మెట్లు సకలమృగముల తనవాత బెట్టుకొనునో అట్లే యిందు మృత్యువు జీవులను తనవాతబెట్టుకొనును. అందు పిశాచము లెట్లుండునో యట్లే ఇందు ముదిమియనున దుండును. అరణ్యము పర్వతములచే సంకటముగ నున్న ట్లీసంసారము దారిద్ర్యముచే సంకటముగ నుండును. అందు రాక్షసులవలె నిందు దురితములు లేక దుఃఖములు పీడించుచుండును. అందు సర్పములవలె నిందు ఆశ పీడిం

చును, ఇందు నప్పుడప్పుడు మారుచు కలుగుచుండు క్రోధము, ఆనందము మొదలగునవియే ఝంఝామారుతములుగా వీచుచుండును. అరణ్యమందు పెక్కుతప్పుడుదారు లున్నట్లు ఇందును స్వర్గనరకము లనుదారులు గలవు. ఆదారు లెంతదూరము పోయినను, అరణ్యమందే యుండునట్లు ఈ స్వర్గనరకము లనుదారులును అందు కనువగు ధర్మాధర్మములును ఎంతదూరము పోయినను సంసారమునందే యుండునుగాని, మోక్షమునకు దారి తీసి జీవు నీసంసారమునుండి తరింపజేయవు.

కావున నరణ్య మెట్లు దుఃఖముల కునికిపట్టో, ఈ సంసారమును అట్లే దుఃఖముల కాకరము. ఇట్టిసంసారారణ్యమునందు దగుల్కొని దిక్కుతోపక స్వర్గనరకము లనబడుపుణ్యపాపములకు లోబడి వాని ననుసరించుచు ఆ మార్గముల బడిపోవుజీవుడు. మహారణ్యమున త్రోవ తప్పినవానివలెనే జననమరణాదిప్రవాహములోనే యుండును గాని, ఎన్నటికిని ముక్తుడు కాజాలడు. కాబట్టి సంసారమున కాద్యంతములు గనజాలక చచ్చుచు బుట్టుచు ననేకకష్టముల ననుభవించుచు నేమియు దోపక వేసగి నెండకు తపింపజేయబడినవా డెట్లు చల్లనిచెట్టు నీడను గోరునో యట్లే జీవు డాధ్యాత్మికాదితాపత్రయములపాల బడి, తపించి, ఎపుడు దీనినుండి తప్పించుకొందునా యని విచారించుచు చివరకు వేదశాస్త్రములయండ జేరును.

అనంతరము "కృషి, వ్యాపారము, సేవ, యాచన మొదలగు లోకవ్యాపారములు చేయుటవలన గల్గులాభము స్రక్చందనవనితాది విషయములేగదా! వానివలన ఇదివరలో ననుభవించినదుఃఖము చాలును. నాకిక నెన్నటికిని ఆ భోగములు వలదు'' అని లౌకికవ్యాపారములను విడిచిపెట్టి వేదశాస్త్రముచే విధింపబడినసంధ్యావందనాది నిత్యకర్మలను పితృయజ్ఞాదినైమిత్తికకర్మలను పూర్వమువలె ఫలాభిలాష లేక ఈశ్వరార్పణబుద్ధితో నాచరించును. అద్దానివలన వీనికి చిత్తశుద్ధి గల్గి అమానిత్వము, అదంభిత్వము మొదలగు నిరువది

గుణము లలవడును. క్రమముగా నితడు బ్రహ్మాత్మానుభవవిచార మున కధికారి యగును.



## బోధలక్షణము

శ్రవణాదిత్రయం తద్వ, త్తత్త్వమిథ్యావివేచనమ్
పునర్గ్రంథే రనుదయో బోధస్యైతే త్రయో మతాః.

తా॥ ఉపనిషత్తు లను ప్రసిద్ధితో నున్న వేదముయొక్క అంతిమ భాగములను సద్గురువుమూలముగా శ్రవణమొనర్చి, తదర్థము ననేక పర్యాయములు మనన మొనర్చి, తదనుభవముతో నిదిధ్యాస మొన ర్చుట ఆత్మజ్ఞానమునకు హేతువగును.

దేహేంద్రియసంఘాతము అనృత, జడ, దుఃఖ, పరిచ్ఛిన్న మైనదనియు, ఆత్మ సత్య, జ్ఞాన, ఆనంద, అనంత మైనదనియు నిశ్చ యముగా తెలిసికొని దేహాదులం దాత్మభ్రాంతిని విడనాడి వ్యవహరిం చుట ఆత్మజ్ఞానముయొక్క స్వరూప మగును.

దేహాత్మల కన్యోన్యాధ్యాసరూప మగుహృదయగ్రంధి మరల నుదయింపకుండుటయే ఆత్మజ్ఞానముయొక్క కార్య మగును-



## ఉపరతిలక్షణము

యమాదిధీనిరోధ శ్చ వ్యవహారస్య సంక్షయః
స్యు ర్హేత్వాద్యా ఉపరతే రిత్యసంకర ఈరితః.

తా॥ యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధులు ఉపరతికి హేతువు లగును. బుద్ధియొక్క నిరోధము అనగా స్వాభావికప్రవృత్తి విషయవిముఖీకరణమే ఉపరతి

స్వరూప మగును. దేహవ్యాపార, వ్యవహారములందు ప్రవృత్తి లేక పోవుటయే ఉపరతియొక్క కార్య మగును.

తత్త్వబోధః ప్రధానం స్యా త్సాక్షాన్మోక్షప్రదత్త్వతః
బోధోపకారిణా వేతౌ వైరాగ్యోపరమా వుభౌ.

తా॥ సంపూర్ణ మగుతత్వబోధ అనగా అపరోక్షాత్మానుభవము కలిగినక్షణమునకు మోక్షమునకు అంతరము లేనందున వైరాగ్య, ఉపరతి, జ్ఞానము లనుమూడింటిలో జ్ఞానము ప్రధాన మగుచున్నది. మిగిలిన, వైరాగ్య, ఉపరతులు రెండును, జ్ఞానము గల్గుటకు సాధనము లగుచున్నవి.

త్రయో ప్యత్యంతపక్వాశ్చే న్మహత స్తపసః ఫలమ్
దురితేన క్వచి త్కించి త్కదాచి త్ప్రతిబధ్యతే.

తా॥ వైరాగ్య, బోధ, ఉపరతులు మూడును మిక్కిలిపరిపక్వములై యుండుట అనేకజన్మలందు సంపాదించినపుణ్యరాశిరూపమగుతపస్సుయొక్క ఫలమే. ప్రతిబంధక మగుపాపము ననుసరించి, ఆమూటిలో నొకటైనను రెండైనను ఒకానొక కాలమందు ఒకానొకపురుషునకు లేకపోవచ్చును. అయినను వైరాగ్యోపరతులు కొంత తక్కువగా నున్నను జ్ఞానము పూర్ణముగా నున్నపుడు మోక్షము గల్గును. కాని, జ్ఞానము కొంత తక్కువగా నుండి, వైరాగ్యోపరతులు పూర్ణముగా నున్నను మోక్షము లేదు.

వైరాగ్యోపరతీ పూర్ణే బోధస్తు ప్రతిబధ్యతే
యస్య తస్య న మోక్షో స్తి పుణ్యలోక స్తపోబలాత్.

తా॥ ఏ పురుషునకు వైరాగ్యోపరతులు రెండును పూర్ణముగా నుండి, ఆత్మతత్వజ్ఞానము కలుగదో అట్టివానికి మోక్షము గలుగదు గాని, ఈ వైరాగ్యోపరతులు గొప్పతపస్సేగాన, తద్బలముచే పుణ్యలోకప్రాప్తి మాత్రము గలుగును.

పూర్ణే బోధే తదన్యౌ ద్వౌ ప్రతిబద్ధౌ యదా తదా
మోక్షో వినిశ్చితః కింతు దృష్టదుఃఖం న నశ్యతి.

తా॥ తత్త్వజ్ఞానము పూర్ణముగా నున్నదగుచు వైరాగ్యోపరతులు రెండును లేనియెడల అట్టిపురుషునకు మోక్షము నిశ్చయముగా గల్గును; గాని వానికి ప్రారబ్ధకర్మవశమున కలిగెడిదుఃఖముమాత్రము నశింపదు. అనగా జ్ఞానముచేత విదేహముక్తి నిశ్చయమైనను వైరాగ్యోపరతులు లేనందువలన జీవన్ముక్తిసుఖము లభింపదని తాత్పర్యము.

బ్రహ్మలోకతృణీకారో వైరాగ్య స్యావధి ర్మతః
దేహాత్మవత్పరాత్మత్వదార్ఢ్యే బోధ స్సమాప్యతే.

తా॥ బ్రహ్మలోకమునుగూడ గడ్డిపరకవలె నిష్ప్రయోజనకరమని తలచుటయే వైరాగ్యమున కవధి, అనగా అంతకు మించినవైరాగ్యము లేదు. అనేకజన్మలనుండి దేహమే నేననెడిజ్ఞాన మెంతదృఢముగా నుండెనో "ఈదేహము నేను గాదు నేనే బ్రహ్మమును" అనెడి ఆత్మతత్త్వజ్ఞానము అంత దృఢముగా నుండుటయే బోధకు పరమావధి.

సుప్తివ ద్విస్మృతి స్సీమా భవే దుపరమస్య హి,
ధియా స్వయా వినిశ్చేయం తారతమ్య మవాంతరమ్.

తా॥ సుషుప్తిదశయందెట్లు సర్వవ్యవహార సంక్షయ ముండునో అట్లు సర్వదశలందును ప్రాపంచిక వ్యవహారశూన్యతతో నుండుట ఉపరతికి పరమావధి.

ఇట్లు వైరాగ్య, బోధ, ఉపరతులకు పరమావధు లుపదేశింపబడగా అవధికంటె తక్కువగా నుండువైరాగ్యాదులు, ఎవరెవరికి ఎంతగా నున్నవను విషయమును ఎవరికివారే తమబుద్ధితో పరిశీలించుకొని ఇంకను వైరాగ్యాదుల కవధి ఎంతదూరములో నున్నదో తెలిసికొని, ఆయవధిని పొందుటకు ప్రయత్నింపవలయును.

ఆరబ్ధకర్మనానాత్వా ద్బుద్ధానా మన్యథాన్యథా
వర్తంతే తేన శాస్త్రార్థే భ్రమితవ్యం న పండితైః.

తా॥ తత్త్వజ్ఞానవంతులకును కామక్రోధాదులు కలిగియుండుట చేత జ్ఞానులకును, అజ్ఞానులకును భేదము లేదని తలపరాదు. ప్రారబ్ధ కర్మము నానావిధములుగా నుండుటవలన జ్ఞానులకును నానావిధ ముగా ప్రవర్తన ముండును. కనుక పండితులగువారు శాస్త్రార్థము నందు భ్రమించి, జ్ఞానులు వ్యవహారశూన్యులై యుండవలెనని తలచ రాదు కామక్రోధరాగద్వేషాదులు ప్రారబ్ధకర్మఫలరూప మగుటచేత ఆకామక్రోధరాగాదులు ముక్తికి ఎంతమాత్రమును ప్రతిబంధకములు కాజాలవు.

స్వస్వకర్మానుసారేణ వర్తతాం తే యథాయథా
అవిశిష్ట స్సర్వబోధ స్సమా ముక్తి రితి స్థితిః.

తా॥ జ్ఞానులు తమతమ ప్రారబ్ధకర్మ ననుసరించినప్రవర్తన గలవారై యుందురు ఇట్లు వారివారిప్రవర్తన భిన్నరీతిగా గాన్పించు చున్నను వారందరకు "అహం బ్రహ్మాస్మి" నేనే బ్రహ్మమును అను అపరోక్షాత్మజ్ఞానము భేదము లేక సమానముగా నుండును. ఫల మగుమోక్షముగూడ సమానమని వేదాంతనిర్ణయము.

సమాధి మథ కర్మాణి మా కరోతు కరోతు వా
హృదయే నాస్తసర్వాస్థో ముక్త ఏవోత్తమాశయః.

తా॥ ఎవడు బుద్ధిచేత సకలాసక్తివిశేషములను అనగా విష యాభిలాషను నిశ్శేషముగా విడిచి, నిర్మలజ్ఞానము గలవాడగునో ఆపురుషుడు ధ్యానమొనర్చినను లేకున్నను వర్ణాశ్రమధర్మముల నాచరించినను ఆచరింపకున్నను, కర్మఫలరూప మగుదేహమందు వర్ణ, ఆశ్రమ, కర్మలు కల్పింపబడిన వనుబోధ గల్గి, తాను చిన్మాత్రు డగుఆత్మస్వరూపుడ ననునిశ్చయజ్ఞానము గల్గియుండుటచేత, ముక్తుడే యగును. అనగా తత్త్వవేత్తకు విధినిషేధశాస్త్రనియమము లేదనియు

తత్త్వవేత్త కానంతవరకు విధినిషేధశాస్త్రము లవశ్య మనుష్ఠేయము లనియు తాత్పర్యము.

నానుష్ఠేయం తు తత్సర్వం మునిభి ర్య దనుష్ఠితమ్
వాక్యమే వానుసర్తవ్యం పండితైః పరమో మతః.

తా॥ వేదవ్యాసులు శ్రీకృష్ణభగవానులు మొదలగుసర్వవేద పారంగతులై, ధర్మప్రవర్తకాచార్యులై, ఆధికారికపురుషు లగుమహా మహులు లోకమున కెట్లుపదేశించిరో అట్లే మన మాచరింపవల యునుగాని, అమ్మహామహులు ప్రవర్తించినట్లు మన మెంతమాత్రము ప్రవర్తింపరాదు. వారివిద్యాప్రభావము వారిజ్ఞానము వారు చేసిన లోకాసాధ్య మగుకార్యములు, వారిప్రవచనసామర్థ్యాతిశయము మొదలగువానిని సమగ్రముగా పూర్వాపరవిమర్శనముతో తెలిసికొన జాలక వారిపోకలను తమతమ ఇష్టానుసార మూహించుకొని ప్రవర్తించుటవలన నరకము నొందుదురేగాని ప్రయోజనాంతరము నొందరు.

## బ్రహ్మవిద్యోత్కర్ష

అనంతశాస్త్రం బహు వేదితవ్యం
స్వల్ప శ్చ కాలో, బహవ శ్చ విఘ్నాః,
య త్సారభూతం త దుపాసితవ్యం
హంసో యథా క్షీర మివాంబుమిశ్రమ్.

తా॥ మనచే తెలిసికొనదగినశాస్త్ర మనంతముగ నున్నది. మన మభ్యసించుటకు మనజీవిత మతిస్వల్పము. ఆస్వల్పకాలములోగూడ ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతికవిఘ్నము లెన్నియో యుండును. కావున రాజహంస, నీళ్ళతో కలిసియున్నపాలలో నుండి, శుద్ధ మగు పాలనుమాత్రమే గ్రహించి, నీళ్ళను వదలివేయునట్లు మనముగూడ

స్వపదార్థములలోను సారభూత మగు పరమాత్మతత్త్వమును, గురు శాస్త్రమూలముగా గ్రహించి, పరమపురుషార్థమును పొందుటకు ప్రయత్నింపవలయును. మరియు

కిం వర్ణితేన బహునా లక్షణం గుణదోషయోః,
గుణదోషదృశి ర్దోషః, గుణ స్తూభయవర్జితః.

తా॥ ఇట్టిది గుణము, ఇట్టిది దోషము- అని ఎన్నిలక్షణములు చెప్పినను పొందుప్రయోజన మింతమాత్రమే. ప్రపంచమందలిప్రతి పదార్థమును కొన్నిగుణములతోను కొన్నిదోషములతోను నిండియే యుండును. ఈపదార్థమందలిగుణదోషవిచారణ యనునదియే యొక దోషము. ఎట్టిగుణదోషములును, లేని దొకపరమాత్మతత్త్వముమాత్రమే. అట్టిఆత్మతత్త్వపరిజ్ఞానముకొరకే పదార్థములందలి, గుణదోష లక్షణము లేర్పడినవి.

అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా
విజ్ఞాతేపి పరే తత్త్వే, శాస్త్రాధీతిస్తు నిష్ఫలా.

తా॥ శాస్త్రము పఠించుట, అర్థజ్ఞానముకొరకును అర్థజ్ఞానము ఆచరించుటకొరకును, ఆచరించుట, పురుషార్థప్రాప్తికొరకును, ఏర్పడినది. పురుషార్థములలోనెల్ల నుత్కృష్టమైనది మోక్షము. అద్దానికి అంతరంగసాధనము పరతత్త్వజ్ఞానము. కావున సర్వశాస్త్రములును, పరతత్త్వజ్ఞానము నుపదేశించుటకొరకేర్పడినవి. అట్టిజ్ఞానము కలుగని వానిశాస్త్రాధ్యయనము వ్యర్థమగును. అట్టిజ్ఞానముగల్గుటయే శాస్త్రాధ్యయనమునకు ఫలముగాన ఫలోత్పత్త్యనంతరమందు శాస్త్రాధ్యయనము వ్యర్థమగును.

అన్యవిద్యాపరిజ్ఞాన మవశ్యం నశ్వరం భవేత్,
బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం భవేత్.

తా॥ శాస్త్రములలో కొన్ని బాలురకొరకు నుద్దేశింపబడినవి. మరికొన్ని క్రమముగా అట్టిబాలురను పరమపురుషార్థమును పొందిం

చుసాధనముల నుపదేశించినవి. కావున సర్వశాస్త్రపరిసమాప్తి యగు బ్రహ్మవిద్య నభ్యసించుటకు కావలసినపూర్వశాస్త్రము లన్నియు నభ్యసించి అంతటితో విద్య నాపక బ్రహ్మవిద్యనుగూడ నభ్యసించి తదర్థమును మననాదికము చేసి, బ్రహ్మభావ మనుమోక్షరూప పరమపురుషార్థము నొందవచ్చును. అట్లుగాక బ్రహ్మవిద్యకు పూర్వములగు ఇతరవిద్యలనుమాత్రమే అభ్యసించినవానికి కొంత కాలము నకు తిరిగి నశించునట్టిఫలమే వచ్చును.

బ్రహ్మవిద్యను అభ్యసించుటయొక్కఫల మిట్లు చెప్పబడినది-

స్నాతం తేన సమస్తతీర్థనిచయే, దత్తం మహీమండలం
విప్రేభ్యః, పితృదేవతా స్సురగణా స్సర్వేపి సంతర్పితాః,
జప్తా మంత్రసహస్రకోటి రమునా, తప్తం చ తీవ్రం తపః
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్.

తా॥ గంగాదిపుణ్యనదులందు స్నానమొనర్చుట, గోభూహిరణ్యాదులను బ్రాహ్మణోత్తములకు దానమొనర్చుట, దేవతా పితృ భూతాదులను తృప్తి నొందించుట, వేదమంత్రములను జపించుట, తపస్సు నాచరించుట మొదలగునవి- ఆయాఅధికారులకొరకు చిత్త శుద్ధిసాధనములుగా నుపదేశింపబడినవి.

బ్రహ్మవిద్యాభ్యాస మొనర్చుసాధకుడు ఒకక్షణకాలమైనను నిశ్చలమనస్సుతో తానే బ్రహ్మమననియు, దేహేంద్రియసంఘాతము మిథ్యయనియు, నిశ్చయజ్ఞానము గల్గియున్నచో, నట్టివానికి పైగంగాది పుణ్యతీర్థస్నానాదిఫలము లన్నియు సిద్ధించును. అట్టిబ్రహ్మవేత్త లగు సత్పురుషుల దర్శన, పూజాదిఫల మిట్లు చెప్పబడినది.

సీ॥ తనపాదధూళి సోఁకినఁ జరాచరము ల
త్యంతపావనములై యలరుచుండ
తనదునెమ్మోమును సందర్శించి జనములు
నిష్పాపులై కడు నెరయుచుండ

తను నిరంతర ముపాసనముచేయుమహాత్ము
లతులితైశ్వర్యంబు లనుభవింపఁ
దనయనుగ్రహము నొందినభక్తులకు ముక్తి
కరతలామలకంబుకరణిఁ దోఁప ...

తా॥ 1. జీవన్ముక్తునిపాదధూళి సోకినంతమాత్రముననే స్థావర జంగమాత్మక మగుభూతజాల మతిపవిత్ర మగును.

2. జీవన్ముక్తుని సందర్శించినంతమాత్రముననే సకలపాపములు తొలగును.

3. ఆపుణ్యపురుషుని సేవించువారల కఖండైశ్వర్యములు చేకూరును.

4. ఆబ్రహ్మస్వరూపునియనుగ్రహము కలిగినంతమాత్రముననే ఎల్లజనులు, జననమరణప్రవాహరూప మగుసంసారబంధంబునుండి బాయుదమని యతనికృప కెదురుచూచుచుందురు. అతనికృప గల్గిన యెడల అపరోక్షాత్మవిజ్ఞాన మతిసులభముగా గల్గి ముక్తు లగుదురు

5. అతనివంశమునందు జన్మించినవారు 21 తరములవరకు స్వర్గమునందు దివ్యసుఖము నొంది తదుపరి తరింతురు.

6. బ్రహ్మమును తెలిసికొనగోరుజిజ్ఞాసువు లెల్లరు నాతని నుతించి, సమస్తలోకములలోను సర్వోత్తము డగుటచేత సర్వదేవతలును నాబ్రహ్మవిదుని పూజింతురు.

ఈయర్థమునే

శ్రు॥ "సర్వేఽస్మై దేవా బలి మావహంతి"

అనుశ్రుతి బోధించుచున్నది. అట్టివాడు భగవంతుని నిజరూపమేయని "జ్ఞానీ త్వాత్మైవ మే మతం" అని శ్రీకృష్ణభగవానులు గీతలలో నుద్ఘోషించెను. మరియు

తే॥ గీ॥ అతులవైరాగ్యబోధోపరతులు గలుగు
నతనిమహిమలు గణుతించి యభినుతింప
హరిహరహిరణ్యగర్భులకైనఁ దరమె ...

తా॥ జీవన్ముక్తుడు అజ్ఞానముచే నీప్రపంచమంతయు తనయం దారోపింపబడిన దేగాని జ్ఞానముతో పరిశీలించగా, ఈ జగత్తు లేనే లేదు అనునిశ్చయముతో, సర్వము బహ్మమని తెలిసియుండుటచేత ఎప్పుడును ఆనందరూపుడై యుండును. ఇంతేగాక సర్వవ్యవహారము లకు సాక్షిమాత్రుడ నే నని తన్నెరిగి వర్తించునుగాని దేహేంద్రియ వ్యాపారములందు ప్రవృత్తుడు గాడు గాన, నాతనిమహిమ మనంత మగుటచే నెట్టివాడును నాతనిగొప్పదనమును వర్ణింపజాలడు.



## సత్పురుషదూషణఫలము

### అట్టిమహానుభావులను దూషించువారు

మహావిద్యావతాం పుంసాం మనఃక్షోభం కరోతి యః
సప్తరాత్రౌ వ్యతీతాయాం స్వయమేవ వినశ్యతి.

తా॥ ఏడుదినములలోగా స్వయముగానే నశింతురని మహావిద్య యందు చెప్పబడియున్నది.

అట్టిజీవన్ముక్తు లదివరలో చేసిన పుణ్యపాపము లేమగునో విచారించబడుచున్నది.

ప్రారబ్ధం భోగతో నశ్యే త్తత్వజ్ఞానేన సంచితమ్
ఆగామి ద్వివిధం కర్మ తద్ద్వేష్యప్రియవాదినోః.

తా॥ పుణ్యపాపరూపకర్మలో ఏభాగము ఫలోన్ముఖమాయెనో ఆభాగము 'ప్రారబ్ధ' మనుపేరుతోనుండును. అయ్యది ఈ వర్తమాన దేహారంభకాలమందే నిర్ణయింపబడియున్నది. అదియే ఈ దేహము

గాన, అట్టిప్రారబ్ధకర్మ ఈ దేహాపతనమువరకు అనుభవించుటతో పోగలదు. ఫలోన్ముఖము కాగా ఫలపరిణామావస్థలో నుండు పుణ్యపాపకర్మఫలము సంచిత మనుపేరుతో నుండును. ఆ పుణ్యపాపకర్మల నాచరించునపు డీతడు తనదేహేంద్రియసంఘాతమే తా ననుభ్రాంతితో నుండి, ఆయాకర్మల నాచరించెను. ఇపుడు జ్ఞానోదయమై తా నీ దేహేంద్రియసంఘాతరూపుడు గాననియు, నిర్వికారచిన్మాత్రు డగు బ్రహ్మమే తాననియు తత్త్వజ్ఞానము గలవాడైనందున ఆ సంచిత కర్మ యంతయు నశించును.

ఇక స్వల్పభావికాలములో ఫలపరిణామము నొందుటకు సిద్ధముగా నుండుపుణ్యపాపకర్మఫలము ఆగామి యనుపేరుతో నుండును. అందలి పుణ్యకర్మఫలము ఆ బ్రహ్మవిదునియందు భక్తివిశ్వాసములు గలభక్తులకు చెందును. ఆగామియందలిపాపకర్మఫలము ఆ బ్రహ్మవేత్తను ద్వేషించి, దూషించువారలను చెందును. ఆసుకృత దుష్కృతఫలములను జ్ఞానిస్థానమున వానిభక్తులును, శత్రువులును, స్వర్గ, నరకములద్వారా అనుభవింతురు.

జ్ఞానిమాత్రము తన్నెవరు దూషించినను పూజించినను ఎట్టి వికారము నొందక, స్థిర మగుబ్రహ్మానందము ననుభవించుచునే యుండును.

ఇట్లు బ్రహ్మవేత్త యగువాడుగూడ, దేహధారియై జిజ్ఞాసువై క్రమముగా జ్ఞానియైనందున, ముందు దేహోత్పత్తిక్రమమును విచారించి తెలిసికొందము.

## శరీరలక్షణము

శ్రు॥ పంచాత్మకం, పంచసు వర్తమానం,
షడాశ్రయం, షడ్గుణయోగయుక్తమ్,
తం సప్తధాతుం, త్రిమలం, ద్వియోనిం,
చతుర్విధాహారమయం, శరీరమ్.

తా॥ ఈశరీరము, అయిదింటిని ముఖ్యముగా కలిగినదియు, అయిదింటియందుండునదియును, ఆరింటిని ఆశ్రయించినదియును, ఆరుగుణయోగములతో గూడినదియును, ఏడుధాతువులను, మూడు మలములను, మూడుకారణములను గలిగినదియు, నాలుగువిధము లగునాహారములు గలదియు అయి యున్నది.

శ్రు॥ భవతి పంచాత్మక మితి కస్మాత్

తా॥ ఎట్లు, ఏ అయిదింటిని ముఖ్యముగా కల్గియున్నది?

శ్రు॥ పృథివ్యాపస్తేజోవాయురాకాశ మిత్యస్మిన్, పంచాత్మకే శరీరే

తా॥ ఈశరీరమునందు పృథివి, ఉదకము, తేజస్సు, వాయువు, ఆకాశము, అనునీయైదును ముఖ్యమైనవి.

శ్రు॥ కా పృథివీ, కా ఆపః, కిం తేజః, కో వాయుః, కి మాకాశ మిత్యస్మి న్పంచాత్మకే శరీరే.

తా॥ ఈశరీరమందు పృథివి ఏది? ఉదక మేది? తేజస్సు ఏది? వాయు వేది? ఆకాశ మేది?

శ్రు॥ యత్కఠినం సా పృథివీ, యద్ద్రవం త దాపో, య దుష్ణం త త్తేజో, య స్సంచరతి స వాయు, ర్య త్సుషిరం త దాకాశ మిత్యుచ్యతే.

తా॥ ఈశరీరమందు గట్టిగా నుండునది పృథివి, ద్రవముగా నుండునది జలము, ఉష్ణముగా నుండునది తేజస్సు, సంచరించునది వాయువు, రంధ్రముగా ద్వారమై యుండునది ఆకాశము అయి యున్నవి.

శ్రు॥ తత్ర పృథివీ నామ ధారణే, ఆపః పిండీకరణే, తేజో రూపదర్శనే, వాయు ర్గమనే, ఆకాశ మవకాశప్రదానే,

శ్రోత్రం శబ్దే, త్వ క్స్పర్శే, చక్షూ రూపే, జిహ్వా రసే, ఘ్రాణం గంధే, వా గ్వచనే, పాణి రాదానే, పాదో గమనే, పాయు ర్విసర్గే, ఉపస్థ ఆనందే వర్తతే.

తా॥ పంచభూతములలో పృథివి ధరించుటయందును, ఉదకము ముద్దజేయుటయందును, తేజస్సు రూపమును కనుపరచుటయందును, వాయువు గమనమందును, ఆకాశము అవకాశ మొసగుటయందును, శ్రోత్రము వినుటయందును, త్వక్కు తాకుటయందును, నేత్రము రూపమందును, నాలుక రుచిచూచుటయందును, ముక్కు వాసన చూచుటయందును, వాక్కు మాటలాడుటయందును, హస్తములు గ్రహించుటయందును, పాదములు గమనమందును, పాయువు మలమును విడచుటయందును, ఉపస్థ ఆనందించుటయందును ప్రవర్తించుచున్నవి.

శ్రు॥ బుద్ధ్యా బుధ్యతి నిశ్చినోతి, మనసా సంకల్పతే వికల్పతే చ, చిత్తేన సంజానాతి, అహంకారేణ చాహంకరోతి; తాని తాని తత్తద్విషయేషు వర్తంతే.

తా॥ బుద్ధిచేత తెలిసికొని నిశ్చయించుచున్నాడు. మనస్సుచేత సంకల్పమును వికల్పమును చేయుచున్నాడు. చిత్తముచేత పదార్థమును చక్కగా గుర్తించుచున్నాడు అహంకారముచేత గర్వించుచున్నాడు. ఇట్లివి తమతమవిషయములం దున్నవి.

శ్రు॥ కత షడాశ్రయ మితి.

తా॥ ఈశరీరము ఏయారింటిని ఎట్లాశ్రయించి యున్నది?

శ్రు॥ షడ్వై రసాః మధురామ్ల, లవణ, కటు, కషాయ, తిక్తాః తా నాశ్రయతే, త్రై రస్యాశ్రితమ్.

తా॥ ఈదేహము తీపి, పులుపు, ఉప్పు, కారము, వగరు, చేదు, అనునీయారురసముల నాశ్రయించినదియు, ఈ రసములచే నాశ్రయింపబడినదియు నై యున్నది.

శ్రు॥ షడ్వై భావవికారా, అస్తి, జాయతే వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతీతి, భవతి విక్రియతే చ.

తా॥ ఈ శరీరము ఉండుట, పుట్టుట, వృద్ధినొందుట, పక్వమగుట, తగ్గుట, నశించుట, యనునీయారుభావవికారములు గల్గియుండునది.

శ్రు॥ షడ్వై చక్రాణి; మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, కాగ్నే, యానాహత, విశుద్ధాని. తద్ధమన్యాశ్రితమ్.

తా॥ ఈ శరీరము ౧. మూలాధారము. ౨ స్వాధిష్ఠానము. 3. మణిపూరకము. ౪. ఆగ్నేయము. ౫. అనాహతము. ౬ విశుద్ధము- అను నాయా నాడుల నాశ్రయించిన ఆరుచక్రములు గలది

శ్రు॥ షడ్వాన గుణాః; కామాదయ, శ్శమాదయశ్చ తద్యోగ స్తన్నిష్ఠాంతయా చ యుక్తమ్

తా॥ కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను ఆరుగుణములును; శమము,దమము, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము అను ఆరుగుణములును వీనితో కూడినదియు, వీనియం దాసక్తిగల్గియుండునదియు, ఈ శరీర మయియున్నది.

శ్రు॥ అధ చ షడ్జ,ఋషభ,గాంధార, పంచమ, మధ్యమ, ధైవత, నిషాదాశ్చే తీష్టానిష్టశబ్దసంజ్ఞాః ప్రతివిధా భవంతి సప్త.

తా॥ ఈశరీరములో ఇష్టానిష్టశబ్దోచ్చారణకు పరస్పరవిలక్షణములగు ౧ షడ్జము ౨ ఋషభము 3 గాంధారము ౪ పంచమము ౫ మధ్యమము ౬ ధైవతము ౭ నిషాదము- అను ఏడుస్వరములతో ధ్వని విశేషములు గలవు. ( ...

శ్రు॥ శుక్లో, రక్తః, కృష్ణో, ధూమ్రః, పీతః, కపిలః, పాండర ఇతి సప్తధాతవ స్తద్వర్ణాః.

తా॥ శుక్ల మనగా తెలుపు, రక్తమనగా నెఱుపు, కృష్ణ మనగా నలుపు, ధూమ్రమనగా పొగరంగు, (నలుపు ఎఱుపు కలయిక) పీతమనగా పసుపు, కపిలమనగా గోరోచనవర్ణము, పాండరమనగా తెలుపు పసుపు కలయిక-యను నీ యేడువర్ణములు చర్మమాంసాది సప్తధాతువులయొక్క స్వభావసిద్ధ మగువర్ణములు.

శ్రు॥ కస్మాద్యదా కస్యచి ద్ద్రవ్యస్య విషయా జాయంత ఉప
చీయంతే పరస్పర, రసగుణత్వాద్వా యోని స్సా రసః.

తా॥ ఏ యొక ద్రవ్యమునకైన సహజముగా నుండుగుణములు పెరుగుచు పరస్పరసంబంధమువలన క్రొత్తగుణములుగా మారును. అందుకు కారణము "రస" మనబడును.

# గర్భోత్పత్తి ప్రకారము

శు॥ షడ్విధో రసః, రసా చ్ఛోణితం, శోణితా న్మాంసం,
మాంసా న్మేదః, మేదసోఽస్థీని, అస్థిభ్యో మజ్జా, మజ్జాయా
శ్శుక్లః.

తా॥ శరీరధారులచే భుజింపబడు ఆరువిధములగు రసముల నుండి రక్త మేర్పడును. రక్తమువలన మాంసమును, మాంసమువలన మేదస్సును, మేదస్సువలన ఎముకలును, ఎముకలవలన మజ్జయు, మజ్జ వలన శుక్లధాతువును ఏర్పడుచుండును.

శ్రు॥ శుక్లశోణితసంయోగా దావర్తతే గర్భో హృది వ్యవస్థాం
నయతి.

తా॥ భార్యాభర్తలశుక్లశోణితసంయోగమువలన గర్భ మేర్పడి హృదయస్థానము నొందియుండును.

శ్రు॥ హృదయేభ్యోఽంతరాగ్ని రగ్నిస్థానే పిత్తం, పిత్తస్థానే వాయు, ర్వాయుస్థానే హృదయం, ప్రాజాపత్యాదృతుకాలే ప్రసం యోగత ఏకరాత్రోషితం కలలం భవతి.

తా॥ భుజింపదగినపదార్థములద్వారా హృదయములనుండి, జారరాగ్నిని పొంది, జారరాగ్నిస్థానమందుండి పిత్తమును, పిత్తస్థానమందుండి వాయువును, వాయుస్థానమునుండి హృదయమును, ప్రాజాపత్యక్రమముగా ననగా బ్రహ్మనిర్మితప్రకారముగా పోయి చేరుచున్నది. ఋతుకాలికసంయోగానంతర మొకరోజుతరువాత మీగడ వంటిముద్ద యగును.

శ్రు॥ సప్తరాత్రోషితం బుద్బుదం భవతి. అర్ధమాసాభ్యంతరేణ పిండో భవతి, మాసాభ్యంతరేణ కఠినో భవతి, మాసద్వయేన శిరః కురుతే, మాసత్రయేణ పాదప్రదేశో భవతి, అథ చతుర్థే మాసే జఠరకటిప్రదేశో భవతి, పంచమే మాసే పృష్ఠవంశో భవతి, షష్ఠే మాసి నాసాక్షిశ్రోత్రాణి భవంతి. సప్తమే మాసే జీవసంయుక్తో భవతి, అష్టమే మాసే సర్వసంపూర్ణో భవతి, నవమే పీవతే.

తా॥ గర్భమునందు ఏడుదినము లుండగా నీటిబుడగవలె నగును. ఒకపక్షములోపల పిండ మగుచున్నది. ఒకనెలకు గట్టిపడును. రెండు నెలలకు శిర స్సేర్పడును మూడు నెలలకు పాదము లేర్పడును. నాల్గవమాసమందు నడుము కడుపు ఏర్పడును అయిదవమాసమందు వెన్నెముక ఏర్పడును. ఆరవమాసమున ముక్కులు, కండ్లు, చెవులును ఏర్పడును. ఏడవమాసమున ప్రాణ మేర్పడును. ఎనిమిదవమాసమున శరీరావయవము లన్నియు, పూర్తిగా నేర్పడును. తొమ్మిదవనెలలో గర్భమునందు శిశువు సంచరించును.

శ్రు॥ శుక్లం పుంభాగః శోణితం స్త్రీభాగః ఉభయం క్లీబమ్.

తా॥ శుక్లము పురుషునిభాగము. శోణితము స్త్రీయొక్కభాగము. శుక్లశోణితములు రెండు కలియక విడిగానుండు నెడల నపుంసకుడగును.

శ్లో॥ పితృ రేతోఽతిరేకాత్పురుషో భవతి, మాతృ రేతోఽతిరేకాత్స్త్రియో భవంతి, స్త్రియో హి కామిన్యః, ఆసాం సుఖాధిక్యాత్తా ఏవ బహులా జాయంతే. ఉభయోర్బీజతౌల్యే నపుంసకో భవతి.

తా॥ తండ్రియొక్క శుక్ల మధికమగుచో, ఆశిశువు పురుషుడగును. తల్లియొక్క శోణిత మధికమగుచో, ఆశిశువు స్త్రీయగును. సాధారణముగా స్త్రీలు కామముగలవారుగాన వారికి సుఖ మధికమగుటంజేసి, స్త్రీ ప్రజలే అధికముగా గల్గెదరు. తల్లిదండ్రులయొక్క శుక్లశోణితములు సమమయ్యేనేని ఆశిశువు నపుంసకు డగును.

## జాత్యంధాదులకు కారణము

శ్లో॥ వృత్త్యనుగుణా హి ప్రవృత్తిః- తతో హి పిత్రనుగుణా ప్రజా. వ్యాకులితమనోభ్యా మంధాః, ఖంజాః, కుబ్జా, వామనా, వ్యంగా జాయం

తా॥ ఆ సమయమందలి తల్లిదండ్రుల మనోవృత్తి ననుసరించి, గర్భమందు జనింపబోవు శిశువుయొక్క ప్రవర్తన ముండును. వారా సమయమందు సద్బుద్ధితో నుండురేని జన్మింపబోవు శిశువు సత్పురుషు డగును. తల్లిదండ్రు లాసమయమందు వ్యాకులచిత్తులైనచో, కుంటివాడు, గ్రుడ్డివాడు, మఱుగుజ్జువాడు, అంగవికలుడు, మొదలగు సంతానము గల్గును.

శ్లో॥ పుష్పవతో, రుపరక్తయో రంగవైకల్యభాజః కాలదేశ క్రియాద్రవ్య, భోగోపాధిభి రుపచితాపచిత, అనురూప, అననురూపమూర్తయో భవంతి.

తా॥ చంద్ర, సూర్య గ్రహణకాలమందు, గర్భోత్పత్తి యగు నెడల జన్మించు సంతాన మంగవికలు లగుదురు. మరియు ఆ గర్భో

త్పత్తి సమయము, మంచికాలము, మంచిప్రదేశము, ఆప్రదేశమందలి మంచిద్రవ్యములు ఇత్యాదులమీద జన్మించు శిశువుయొక్క మంచితన మాధారపడి యుండును.

శ్రు॥ సమ్యగ్యోగే సారూప్య మవాప్య సమానగుణా భవంతి బింబ మివోపాధౌ ప్రతిబింబమ్.

తా॥ తల్లిదండ్రు లిద్దరు సత్ప్రవర్తనగలవారై ఆసమయమందు సద్వృత్తితో, సత్పదార్థచింతనతో, సద్వస్తుదర్శనముతో, మంచి దేశ, కాలములందు గర్భాధాన మొనర్చినయెడల అట్టిగుణములుగల మంచిసంతానము గల్గును. ముఖము నలంకరించుకొని అద్దములో ప్రతిబింబమును జూచినచో అట్టిముఖమే కనిపించునుగదా.

శ్రు॥ అన్యోన్యవాయుపరిపీడితానాం శుక్లద్వైవిధ్యే యమళా భవతః, పిత్రో స్తథాత్వేన రేతోవిభాగే, మిశ్రప్రజాప్రమేడితా భవతి.

తా॥ గర్భాశయమందలి పరస్పర వాయుపీడితమైన శుక్ల శోణితమిశ్రబిందువు రెండుశకలము లయ్యేనేని కవలపిల్లలు గల్గుదురు.

శ్రు॥ పంచ మానుషీషు పేశ్యః-ఏకా సాధారణీ, ద్వా కాసాంచిత్- బహ్వ్యస్సహస్రతమీషు- ముహు ర్నిషేకే అధికాంగాస్స్యుః- సకృన్నిషేకే శుష్కాః- అసకృ దాధానే స్త్రీయోన్యాం యుగ్మాః ప్రజాయంతే.

తా॥ మనుష్యులకు అయిదుప్రేగు లుండును, అందొకటి ప్రధానతమమైనది సాధారణముగా నందరకును ఉండును. కొలది మందికి మాత్రము రెండుండును. పెక్కువేలమందిలో నొకరికి ఇంకను అధికముగ నుండును, గర్భాశయమందు మాటిమాటికి రేతస్సేక మొనర్చినచో, అధికమగు అవయవములు గలశిశువు జన్మించును. ఒక్కమారుమాత్రమే రేతస్సేక మొనర్చినచో శుష్కమగు శిశువు జన్మించును. అనేకపర్యాయములు గర్భమందు రేతస్సు నుంచినచో కవలపిల్లలు పుట్టుదురు.

శ్లో॥ పంచాత్మక స్సమర్థః పంచాత్మక తేజసా దివ్యగంధరసశ్చ సమ్యగ్జ్ఞానా దక్షర మోంకారం చింతయతి. తదేవ హైకాక్షరం జ్ఞాత్వాష్టౌ ప్రకృతయః షోడశవికారా శ్శరీరే తస్యైవ దేహినః. అథ నవమే మాసే సర్వలక్షణసంపూర్ణో భవతి పూర్వజాతిం స్మరతి కృతాకృతం కర్మ విభాతి శుభాశుభం కర్మ విందతి.

తా॥ గర్భస్థశిశువు పంచభూతస్వరూపుడును, సమర్థుడును, పంచేంద్రియములతో గూడినవాడును, గంధరసాదిపంచ తన్మాత్రల నెరుంగువాడును, అయి మంచిజ్ఞానమునందునను, ధ్యానమువలనను, ఓంకారమును, చింతించుచు పరబ్రహ్మస్వరూపమైన ఏకాక్షరమగు ప్రణవమును తెలిసికొని శరీరమందలి భూమ్యాదులగు ఎనిమిది ప్రకృతులను, పదునారు వికారములను, తనదేహమం దెరిగి తొమ్మిదవ మాసమందు సంపూర్ణదేహము గల్గి తనపూర్వజన్మవృత్తాంతమును ఆ జన్మయందలి జాతి విద్యాదులను గుర్తించినవాడై ఈ క్రిందిరీతిగా విచారపడుచుండును.

—•

# గర్భస్థజీవుని విచారము

శ్లో॥ నానాయోనిసహస్రాణి దృష్ట్వా చైవ తతో మయా
ఆహారా వివిధా భుక్తాః పీతాశ్చ వివిధా స్తనాః

తా॥ నేను లెక్కలేని స్త్రీగర్భములను ప్రవేశించి చూచి వివిధము లగునాహారముల ననుభవించి అనేకవిధము లగు తల్లుల స్తన్యపాన మొనర్చితిని.

శ్లో॥ జన్మభూమి ర్హి సర్వా భూ శ్శ్మశాన మపి మే పురా
చతురశీతిలక్షేషు యోనిభేదేషు చాభవమ్

తా॥ నాకు సమస్తభూమియు జన్మభూమియె. నాకు సమస్త భూమియు శ్మశానమె నేను ఎనుబదినాలుగులక్షల యోనిభేదము లందు జన్మించితిని.

శ్రు॥ జాతశ్చ మలిత శ్చాస్మి, సంసార్యస్మి పునః పునః
జన్మమృత్యూ పునర్జన్మ పునర్మృత్యుః పునర్జనిః.

తా॥ నేను పలుమారులు జన్మించితిని. పలుమారులు మృతి నొందితిని. పలుమారులు సంసారినైయుంటిని. పుట్టుట, చచ్చుట, మరల పుట్టుట, మరలచచ్చుట ఇట్లనేకమార్లాయెను.

శ్రు॥ గర్భవాసే మహ ద్దుఃఖం మోహహో దుఃఖంచ జన్మను
బాల్యే దుఃఖం తథా శోకః, పారవశ్యం చ మూఢతా.

తా॥ గర్భవాసమందు మిక్కిలి దుఃఖము. ఇట్లు జన్మమునెత్తుట యందు భ్రమనొందుట మరల పుట్టుటయు దుఃఖము. బాల్యము నందు దుఃఖమును, శోకమును, పరాధీనతయు, మూఢత్వమును కల్గుచున్నది.

హితాకరణ మాలస్య మహితాచరణం తథా,
యావనే విషయాసక్తి స్తాపత్రయనిపీడితః,

తా॥ యావనమందు కుటుంబపోషణార్థమైన ధనేషణ, దారేషణ, పుత్రేషణలతో నలసత నొంది పరలోకహితములగు యాగాది కము ననుష్ఠింపక, విషయలోలుడనై యుండుట గొప్పదుఃఖము.

చింతారోగశ్చ వార్ధక్యే మరణే తు మహ ద్భయం
ఆశయా చాభిమానే చ, కామక్రోధాదిసంకటే,
అత్యుత్కటే మహ ద్దుఃఖ మస్వతంత్రశ్చ దుఃఖితః.

తా॥ ముసలితనమందు చింతయను రోగమును, మరణమందు భయమును, అత్యంతాశచేతను, దురభిమానముచేతను, కామక్రోధాది సంకటములం దగుల్కొని తన వ్యాపారములకుగూడ పరాధీనుడై దుఃఖించును.

దుఃఖబీజ మిదం జన్మ దుఃఖరూపం చ మన్సహమ్,
నివృత్తిధర్మో నోపాత్తో న యోగజ్ఞాన సాధనమ్.

తా॥ ఇట్లింతవిమర్శించినను బాల్యాది వార్ధకాంతావస్థ లన్నిటి యందును, దుఃఖమే గల్గుచున్నది. ఈదుఃఖనివారక మగుఆత్మజ్ఞాన మునకు సాధనము లగునిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, శమదమాదిసాధనసంపత్తి, మోక్షేచ్ఛ, మొద లగున వెంతమాత్రమును అభ్యసింపబడలేదుగదా.

అహో దుఃఖోదధౌ మగ్నో న పశ్యామి ప్రతిక్రియామ్
ధిగజ్ఞానం ధిగజ్ఞానం ధిక్కామక్రోధసంకటమ్.

తా॥ అక్కటా! ఎంతఘోర మగుదుఃఖసాగరమున మునిగి యుంటిని! దీనికిపుడు ప్రతిక్రియను చేయజాలకున్నాను. కామ క్రోధాదులచే ఎంత అజ్ఞానమున బడితిని. ఎంతకష్టము! ఎంతనీచ మైన పని చేసితిని!

సంసారశృంఖలం ధిగ్ధిగాచార్యాత్ జ్ఞాన మాప్నుయామ్
యది యోన్యాం ప్రముంచామి సాంఖ్యయోగం సమాశ్రయే.

తా॥ జననమరణప్రవాహరూప మగుసంసార మనెడుసంకె ళ్ళతో ఎంతబాధపడుచుంటిని! ఈయోనిద్వారములోనుండి బయట పడితినేని సత్సంప్రదాయసిద్ధు డగుఆచార్యునివలన జ్ఞానమును పొంది, సాంఖ్యయోగముల నభ్యసించి, ఈసంసారమునుండి బయటపడెదను.

అశుభక్షయకర్తారం ఫలముక్తిప్రదాయకమ్
యది యోన్యాం ప్రముంచామి తం ప్రపద్యే మహేశ్వరమ్.

తా॥ ఈగర్భాశయమునుండి వెలువడినవెంటనే సమస్తప్రతి బంధకములను పోగొట్టి మోక్షఫలము నొసంగునట్టి సర్వేశ్వరుని శర ణుజొచ్చి ఆరాధింతును.

అశుభక్షయకర్తారం పురుషార్థప్రదాయినమ్
యది యోన్యాం ప్రముంచామి ప్రపద్యే జగదీశ్వరమ్.

తా॥ ఈగర్భవాసమునుండి బయటపడగానే సర్వదుఃఖములను పోగొట్టి పురుషార్థముల నిచ్చునట్టిజగదీశ్వరు నారాధించి వానియను గ్రహమునకు పాత్రుడ నగుదును.

సర్వశక్తిం చిదాత్మానం సర్వకారణకారణమ్
యది యోన్యాం ప్రముచ్యేయం ప్రపద్యే పరమేశ్వరమ్
భర్గం పశుపతిం రుద్రం మహాదేవం జగద్గురుమ్.

తా॥ ఈగర్భమునుండి వెలుపలకు రాగానే సకలశక్తులు గల వాడును చిత్స్వరూపుడును వాయ్వాదిభూతము లన్నిటికి కారణమై ఆకాశమునకుగూడ కారణమైన భర్గ, పశుపతి, రుద్ర, మహాదేవాది శబ్దములచే ప్రతిపాదింపబడు, సమస్తలోకగురువు నారాధించి, తిరిగి ఈ సంసారదుఃఖము నొందకుండునట్లు యత్నింతును.

యోనిబంధాత్ప్రముచ్యేయం యది తప్స్యే మహత్తపః.

తా॥ ఈ యోనిబంధమునుండి విముక్తుడను గాగానే గొప్ప తపస్సును చేసి ఈ దుఃఖమునుండి విముక్తుడ నగుదును.

గర్భవాసాత్ప్రముచ్యేయం యది విష్ణుం భజే హృది
అమృతప్రద మానందం నారాయణ మనామయమ్.

తా॥ గర్భవాసమునుండి నేను వెలువరింపబడగానే మోక్షరూపుడును ఆనందరూపుడును దుఃఖమునుపోగొట్టునట్టి భగవంతుడగునారాయణు డనుసర్వవ్యాపకుని హృదయమందు నిరంతరము సేవింతును

మాతృకుక్షౌ నిబద్ధోఽస్మి ముచ్యే యద్యస్య బంధనైః
వాసుదేవం ప్రపత్స్యామి భగవంత మనన్యధీః.

తా॥ ఇపుడు తల్లిగర్భమునందు పేగు లనుబంధములతో కట్టబడియుంటిని. ఈ బంధములు వీడినయెడల నిశ్చలమనస్సుతో భగవంతు డగువాసుదేవుని స్తుతింతును.

పురా పరజనస్యార్థే కృతం కర్మ శుభాశుభమ్
ఏకాకీ తేన దహ్యేమి గతాస్తే ఫలభాగినః.

తా॥ నేను గతజన్మలందు దారపుత్రాదులకొరకు అనేక పుణ్య పాపకర్మల నాచరించితిని. ఆఫల మగుధనమును ఆదారపుత్రాదులే

అనుభవించిరి. నేనుమాత్రి మొంటిరిగా ఆదుష్కృతకర్మఫలము నిపు డనుభవించుచుంటిని.

నాస్తిక్యేన భయం త్యక్త్వా పాపా న్యకరవం పురా
భుంజామి తత్ఫలం హ్యద్య భవిష్యా మ్యాస్తిక స్తతః.

తా॥ నేను పూర్వము వేదము ప్రమాణమని విశ్వసింపని నాస్తికుడనై, అనేక పాపముల నాచరించి, ఇపుడు తత్ఫలము ననుభవించుచు బుద్ధి తెచ్చుకొంటిని. ఇకమీద వేదప్రమాణవాదినై సంచరింపగలను.

ఏవం నానావిధా నర్థా న్పరిచింత్య ముహు ర్ముహుః
శశ్వత్సాంసారికం దుఃఖం స్మృత్వా నిర్వేద మాప్య చ
అవిద్యాకామకర్మాద్యై ర్ముహ్యతే జంతు రాంతరః.

తా॥ ఇట్లనేకవిధము లగువిషయములను మాటిమాటికి చింతించి, జననమరణప్రవాహరూప మగుసంసారదుఃఖమును స్మరించుచు, వైరాగ్యము నొంది, గర్భస్థశిశువు అవిద్యా, కామ, కర్మాదులచే మోహమునొందుచున్నాడు.

శ్రు॥ స వై జంతుః స్త్రీయోనిశతం గత్వా, యోనిద్వారముపేత్య ముముక్షు ర్యతతే తత్రాశక్తో యంత్రేణ పీడ్యతే మహాతా దుఃఖేన క్లిశ్యతి పిష్యతే చ ప్రసూతివాతేన జాతమాత్రస్తు వైష్ణవేన వాయునా సంస్పృశ్యతే. తదా న స్మరతి నైవ కించన పారత్రికం, నాపరోక్షదృ గ్భవతి.

తా॥ ఆశిశువు ఇట్లిదివరలో అనేకస్త్రీ లగుతల్లులయోనిద్వారములను బొంది ఇపుడు గర్భమునుండి విమోచనార్థము ప్రయత్నించుచు అశక్తుడై తల్లియొక్క ప్రేగులసమూహ మనుయంత్రముచే పీడింపబడి, బయటకు రాజాలక బాధ నొందును. ప్రసూతికాలిక మాతృగర్భస్థ వాయువేగముచేత నలగగొట్టబడి బయటకు నెట్టివేయబడి పుట్టినతోడనే వీనికర్మఫలరూప మగువైష్ణవమాయావాయువుచే స్పృశింపబడి గర్భస్థుడై యుండగా కల్గినజ్ఞానము నంతను మరచి

పోయి, ఆదేహమందే తాదాత్మ్యభ్రాంతి గల్గియుండి, పారమార్థిక చింత నెంతమాత్రము చేయడు.

శ్రు॥ భూమిసంస్పర్శనా జ్జంతు రుగ్రదృ క్పామరో భవేత్,
జలసంస్పర్శనా దూర్ధ్వం దృగ్దోష స్తస్య నశ్యతి.

తా॥ శిశువు గర్భమునుండి భూమిమీద పడుటతోడనే క్రూర దృష్టి గలదియై పామర మగును. ఆశిశువునకు నీళ్ళు పోయుటతోడనే ఆక్రూరదృష్టి తొలగిపోవును.

శ్రు॥ సహ వై జాతస్య జన్మమరణకర్మశుభాశుభసాధన స్ఫూర్తి ర్వాసనా శ్చ నిగూహితా భవంతి- కథ మధో జానాతి.

తా॥ పామరత్వముమాత్ర మట్లే నిల్చియున్నందున పుట్టిన ఆశిశువునకు గర్భస్థకాలమందలిశుభాశుభసాధనజ్ఞానమును జన్మాంతర వాసనలును, తొలగిపోవును. అతడు వర్తమానదేహతాదాత్మ్యమును మాత్రిమే పొంది క్షుత్పిపాసాదిపీడితుడై యుండును. కాన ఎట్లు తెలిసికొనగలడు ?

శ్రు॥ వాతః పిత్తః, శ్లేష్మాచ, త్రయో ధాతవ స్సమానా ఆరోగ్యదా భవంతి.

తా॥ వాత, పిత్త, శ్లేష్మము లనెడిమూడుధాతువులు సమానముగా నున్నచో ఆరోగ్యము గల్గియుండును.

శ్రు॥ విషమా స్తే రోగదా. నైవ రోగీ విందతే వేద్యం చ, తేన తస్మి పిత్తే నానురూపేణ జానాతి న్యూనే నాల్పం అధికే నాధికం వికృతేన వికృతోన్మత్తాయతే. తద్వై పిత్త మగ్నిః కర్మాశయగతో ధర్మాధర్మమూలేన వాయునా ప్రజ్వాల్యతే, యద్వా దింధనం, భోగ్య మాంతరం బాహ్యం చ.

తా॥ వాతపిత్తశ్లేష్మములు సమముగా లేక విషమములుగా నుండెనేని వ్యాధిగ్రస్తుడై తెలియదగినవిషయములను తెలిసికొన

జాలడు, కాబట్టి పిత్త మనురూపముగా నుండినచో తెలిసికొన గలడు. అందును పిత్త మల్పమైనచో కొద్దిగాను పిత్త మధికమైనచో ఎక్కువగాను తెలిసికొనును. పిత్తము వికృతముగా నున్నచో పిచ్చివాడు వెఱ్ఱివాడును అగును. ఈ పిత్త మనునగ్ని కర్మాశయమందుండి జన్మాంతరీయ, పుణ్యాపాపకర్మఫలరూప మగు వాయువుచే విసరబడి, శరీరములోపల నున్నభుక్తపదార్థ, రక్తమాంసాదులును శరీరమునకు వెలుపల నున్నభోగ్యపదార్థము లగుగృహక్షేత్రారామాదులును, కట్టెలుగా గలదై ప్రజ్వరిల్లుచుండును.



## అగ్న్యుపాసనవిధి

శ్రు॥ స హ్యాగ్నిః కతివిధో భవతి?

తా॥ ఆ అగ్ని ఎన్నివిధములుగా నుండును?

శ్రు॥ త్రీణి వై శరీరాణి, త్రీణి వావ రేతాగ్ంసి, త్రైపురః, త్రిధాతుః, త్రయీమయః త్రివిధోఽగ్నిః త్రేతానామ శారీరకో వైశ్వానరః

తా॥ మూడు శరీరములు మూడువిధము లగురేతస్సు మూడు ధాతువులు, మూడు పురములు,మూడు వేదములు- వీని అన్నిటితోను సంబంధించినమూడు అగ్నులు శరీరమందు కలవు.

మనుష్యశరీరమందలి అగ్ని భేదము వివరింపబడుచున్నది-

శ్రు॥ స ఏవ జ్ఞానాగ్నిః దర్శనాగ్నిః కోష్ఠాగ్నిః ఇతి చ భవతి.

తా॥ జ్ఞానాగ్ని, దర్శనాగ్ని కోష్ఠాగ్ని యనుమూడు పేరులు గల్గినయగ్ని మూడువిధములుగ నుండును.

శ్రు॥ తత్ర జ్ఞానాగ్ని ర్మానసః దర్శనాగ్ని రైంద్రియకః కోష్ఠాగ్ని ర్దహరః సతు నిత్య మశితపీతలేహ్యచోష్యాదికం పాచయతి సమం ప్రాణాపానాభ్యామ్.

తా॥ అందు జ్ఞానాగ్ని మనస్సులో నుండునది. దర్శనాగ్ని ఇంద్రియములం దుండునది. కోష్ఠాగ్ని హృదయమందు లేక జఠరమందుండి ప్రాణాపానవాయుసహాయముతో భుజింపబడిన షడ్రసోపేతాహారము నంతను పక్వముచేసి జీర్ణమొనర్చి, ఆయా అవయవముల కిచ్చునది.

శ్రు॥ దృగేవ దర్శనాగ్నిః విజ్ఞానవిక్రుతిః దృశ్యదర్శనం కరోతి తస్య త్రీణి స్థానాని భవంతి ఇంద్రియగోళకాని ఉపస్థానాని చక్షురే వావసథః.

తా॥ ఆయా చక్షురాదీంద్రియములతో గ్రహించురూపాది విజ్ఞానమే దర్శనాగ్ని యనబడును. దీనికి చక్షురింద్రియమే ఇల్లు. ఇది మూడుస్థానములలో నుండును. 1 ఇంద్రియాగ్రభాగములు 2 ఇంద్రియమూలభాగములు 3 మనస్సునకు ఇంద్రియమునకు గలసంధిభాగములు ఈమూడుస్థానములలో నుండి ఆయా ఇంద్రియములతో ఆయా విషయములను గ్రహించుట కుపకరించును.

శ్రు॥ జ్ఞానాగ్ని శ్శుభాశుభం కర్మ విందతి.

తా॥ జ్ఞానాగ్ని వేదవేదాంగాదివిద్యలకు కారణమై శుభాశుభకర్మపరిజ్ఞానమును గలుగజేయును. అనగా ఏయేకర్మలు ఎప్పుడు ఎట్లు ఏక్రమమున ఆచరించిన ఎట్టిశుభము గల్గునో తెలియజేసి, అట్లాచరించుటకు ప్రేరణచేయుటయు, ఏయేకర్మలు నింద్యములో అనర్థఫలకములో తెలియజేసి వానినుండి పురుషుని మరలింపజేయుటయు జ్ఞానాగ్నియొక్క సామర్థ్యము. ఇక శారీరకయజ్ఞము చెప్పబడుచున్నది,

శ్రు॥ త్రీణి స్థానాని భవంతి, ముఖే ఆహవనీయః ఉదరే గార్హపత్యః హృది దక్షిణాగ్నిః ఆత్మా యజమానః మనో బ్రహ్మా లోభాదయః పశవః ధృతి ర్దీక్షా సంతోష శ్చ బుద్ధీంద్రియాణి యజ్ఞపాత్రాణి, హవీంషి కర్మేంద్రియాణి, శిరః కపాలం, కేశా దర్భాః, ముఖ మంతర్వేదిః బుద్ధిః పత్నీ, సత్రే శారీరకే తత్ర

ద్దేవతా ఏవర్త్విజః కూటస్థా ఏవ యథాదేశం యజమాన మను యజంతే, శాలా శరీరం కామ మాజ్యం, జీవితకాల స్సత్రకాలో, దహరః నాద స్సామ, వైఖరీ యజుః, పరా పశ్యంతీ మధ్యమాచ ఋచః - పరుషాణి అథర్వఖిలాని, సూనృతాని వ్యాహృతయః - ఆయు ర్బలం, మరణ మవభృథః.

తా॥ అగ్నియొక్క మూడుస్థానములలో నొకటి మనుష్యుల ముఖమే, ఆహవనీయము రెండవది ఉదరమే గార్హపత్యము. మూడవది హృదయమే దక్షిణాగ్ని - ఆత్మయే యాగకర్త యగుయజమాని. వీనిమనస్సే బ్రహ్మ యనుఋత్విక్కు. లోభ, మోహ, మద, మాత్సర్యాదులే యాగపశువులు ధైర్యసంతోషములే యాగదీక్ష - త్వక్చక్షుశ్రోత్రజిహ్వాఘ్రాణము లనుజ్ఞానేంద్రియములే స్ఫ్య, కపాల, అగ్నిహోత్రహవణీ, శూర్ప, కృష్ణాజిన, శమ్యా, ఉలూఖల, ముసల, దృషదుపల, స్రువ, జుహూ, ఉపభృత్, ధ్రువా, ప్రాశిత్రహరణాది యజ్ఞపాత్రలు - వాక్పాణిపాదపాయూపస్థ లనుకర్మేంద్రియములే పురోడాశ, చరు, పయో, దధ్యామిక్షాదిహవిస్సులు - పురోడాశశ్రపణార్థ మగుకపాలము శిరస్సే. కేశములే దర్భలు. ముఖమే అంతర్వేది యనగా గార్హపత్యాహవనీయములమధ్యప్రదేశము. వీనిబుద్ధియే ధర్మపత్ని. చక్షుశ్శ్రోత్రాదీంద్రియాధిష్ఠానదేవతలే ఋత్విక్కులై, తాము స్వయముగా యాగఫలము నొందక, యజమానికి ఫలముకొరకు పాటుపడుదురు. శరీరమే యాగశాల. వీనికామమే ఆజ్యము, జీవితకాల మంతయు యాగకాలమే. దహరనాదమే యాగమందలిసామగానము. వైఖరీవాక్కే యాగమందలియజుర్వేదమంత్రములు. పరా, పశ్యంతీ, మధ్యమ లనువాగ్భేదములే యాగమందలిఋగ్వేదమంత్రములు. మనుష్యు డుచ్చరించుపరుషవాక్కులే యాగమునందలి అథర్వణవేదీయఖిలభాగములు. మనుష్యు డుచ్చరించు మంచివాక్కులే యాగమందలిభూరాదివ్యాహృతులు. ఆయుర్దాయమే యాగబలము. మనుష్యునిమరణమే యజ్ఞమునకవభృథము- ఇట్లు విద్యావంతు డగు ప్రతిమనుష్యుడును నిత్యము యాగమొనర్చుచునే యుండును.

శ్రు॥ తస్మిన్యజ్ఞే ప్రజ్వలం త్యగ్నయ స్తత్రి దేవా స్సాంసారిక మనురూప ముపయచ్ఛంతి. యే కేచి చ్చేతయేయుస్సర్వే యజ్ఞకృతః నాయజ్ఞకృ జ్జీవతి, యజ్ఞా ద్యేదం శరీరం యజ్ఞా ద్భవతి, యజ్ఞానురూపం వివర్తతే, పరిణామినీ శరీర ధారా దుఃఖాబ్ధిం గచ్ఛతి.

తా॥ ఈ యాగమందు మూడు అగ్నులును ఆరాధింపబడి సంతోషించును. ఆరాధింపబడిన దేవతలు ఆయాయింద్రియముల ద్వారా యాగానురూప మగుసంసారసుఖాదుల నిచ్చుచున్నారు. ప్రాణధారు లందరును ఈ యజ్ఞమును చేయుచునే యున్నారు. ఈ యజ్ఞము నాచరింపనివాడు జీవింపలేడు ఈ శరీరము యజ్ఞముకొరకేర్పడెను. యజ్ఞమువలన ఈశరీర మేర్పడెను. ఈయజ్ఞమున కనువగు దేహము వచ్చును. ఈ యజ్ఞమును తెలిసికొనలేనివారు శరీరపరంపరలను పొందుచు దుఃఖసముద్రమందు మునుగుచుందురు.

## శరీర విభాగములు

శ్రు॥ తస్యైతచ్ఛరీరస్య షోడశద్వ్యయ సంతపటలాని, దశపంచ సంధయః, షణ్ణవ త్యంగుళోన్మానం, చతుర్దశనాడీస్థానాని, అష్టోత్తరశతం మర్మాణి, తత్రి ద్విస ప్తతిధమన్యః, తాసాం మధ్యే ద్విస ప్తతిస్థానం, ముఖ్యా స్తిస్రః ఇడా, పింగళా, సుషుమ్నా చేతి. తురీయా పురీతతిః, పంచమీ జీవితం, జీవితా దధి పిత్తం, పిత్తా దర్వా క్పురీతతి, నాభే రూర్ధ్వం ద్వ్యంగుళే వామభాగే పిత్తమూలం ప్రతిష్ఠితం. అన్న మశితం త్రేధా విధీయతే; మూత్రం పురీషం సారఇతి. మూత్రం ద్విధా భూత్వా నాభే రధో వామే పరిస్రవతి. పురీషం స ప్తధా. తత్ర దక్షిణే వర్తతే సారః పంచవిధః శ్శరీరం వ్యాప్నోతి తేనవై రేత శ్శోణితం చాన్నపానాభ్యామ్.

తా॥ ఈశరీరమంతు ౩౬౦ దంతములును, ౧౫౦ సంధులును, ౧౮ నాడీస్థానములును, ౧౦౭ మర్మములును, ౭౨ ధమనులును గలవు. ఎవరిఅడ్డవేళ్ళతో వారు ౯౬ అడ్డవేళ్ళపొడవు గల్గియుందురు. అనగా నాలుగువేళ్ళు కలిపి అడ్డముగా పెట్టిన బెత్తతో ౨౪ బెత్తలు పొడవు గల్గియుందురు. ఈ ౭౨ ధమనులమధ్యను ౭౨ స్థానము లున్నవి. వీనిలో 1 ఇడా, 2 పింగళా, 3 సుషుమ్న లనుమూడును ప్రధానములు నాల్గవది పురీతతి యనునది. అయిదవది జీవిత మను నది. ఈజీవితనాడి కవతల పిత్తనాడి యుండును. పిత్తనాడికి వెనుక పురీతతినాడి యుండును. నాభికి ఊర్ధ్వమున రెండుఅంగుళముల ఎడమ ప్రక్కను పిత్తనాడియొక్కమూల ముండును.

భుజించినఆహారము 1 మూత్రము 2 పురీషము 3 సారము- అని మూడువిధములుగా మారును. అందు మూత్రము రెండువిధములు గానై, నాభికి క్రిందుగా ఎడమభాగమునకు స్రవించును. పురీషము ఏడువిధములై ఎడమభాగముగుండా వెడలిపోవును. ఇక సారము అయిదు విధములుగామారి నాభికి కుడివైపున నుండి దేహావయవముల కన్నిటికి వ్యాపించును. అట్టి యన్నపానములలోనిసారములో ప్రధాన భాగమువలన పురుషులకు రేతస్సును, స్త్రీలకు శోణితమును ఏర్పడును.

శ్లో॥ తత్ర దేహచాలకో వాయు స్స ప్రాణ స్సూత్రాత్మా తేనోచ్ఛ్వసతి నిశ్వసతి చేష్టతే చ- న హ్యంగం శారీరకం తేన వినా, జీవతి- వాయునా హై రుధిరస్రోతాం స్సురశ్చక్రా న్నాడీషు చాల్యంతే తత స్త్వాచం సర్వదర్శనమ్.

తా॥ ఈ దేహమును చలింపజేయునదియే ప్రాణవాయువు. అది దారమువలె సన్నగా నుండి సర్వదేహమును వ్యాపించి యుండును. దానిచేతనే ఊపిరి పీల్చుటయు, విడుచుటయు, దేహవ్యవహార మంతయును గల్గుచున్నది. శరీరమందలి ఏయొక అవయవమైనను ఆప్రాణవాయుప్రసారము లేనిదో జీవింపనేరదు. ఆప్రాణవాయువు చేతనే హృదయచక్రమునుండి, సర్వదేహగతనాడులకును రక్తనాళ

ములద్వారా రక్తము ప్రసరింపజేయబడి చర్మము నాశ్రయించిన సకలదేహావ్యవహారమును జరుగుచున్నది.

శ్రు॥ రసః పక్వ స్సవిత్రీకుక్షౌ, స్రంసిన్యా జరాయుం గత్వా, శిశుశిరః కపాలం ప్రవిశ్య సుషుమ్నాద్వారా, గర్భశాబక ప్రాణం తర్పయతి.

తా॥ తల్లిగర్భమందలి ఆహారములోనుండి పక్వమైనరసము, స్రంసినీ యనునాడిద్వారా గర్భమందలి మావిని పొంది గర్భస్థశిశువు యొక్క శిరస్సుమధ్యభాగమం దుండు సుషుమ్నానాడిగుండా ప్రసరించి, ఆ శిశువుయొక్క ప్రాణతృప్తిని గల్గించును.

శ్రు॥ సా సుషుమ్నా, బ్రహ్మనాడీ భవతి.

తా॥ ఈ సుషుమ్న యనునదియే బ్రహ్మనాడి యనబడును.

శ్రు॥ తత్ర వ్యజ్యతే ప్రాణాది గర్భస్య జన్మాభిముఖోఽధోధః, ప్రస్యంపతే, జాతస్యతు హృదయే ప్రతిష్ఠితః తం తు యోగే నాయమ్య భ్రూమధ్యా త్సుషుమ్నాంతం ప్రాపయే ద్యథా గర్భగ స్తథా పరోక్షదర్శీ భవతి.

తా॥ ఆగర్భమం దుండుశిశువునకు ప్రాణాదిక మచట అపుడు ప్రకటిత మగును. క్రమముగా ఆశిశువు యోన్యధోభాగాభిముఖముగా క్రిందికి జారుచుండును. ఇట్లు గర్భమం దుండుకాలమందు శిరస్సునందలి బ్రహ్మరంధ్రగత మగుముఖ్యప్రాణము ఆశిశువునకు పుట్టినక్షణమునుండి హృదయమునకు వచ్చిచేరును. ఆశిశువే పెద్దవాడై విద్వాంసుడై యోగబలముచేత హృదయగత మగుముఖ్యప్రాణ మును భ్రూమధ్యమునుండి గర్భస్థితికాలమునందువలె బ్రహ్మరంధ్రమును పొందించినయెడల అట్టివాడు అపరోక్షాత్మసాక్షాత్కారము నొంది సర్వద్రష్టయై బ్రహ్మ మగును.

శ్రు॥ తాదృగ్విధే దేహే అంతర్యా మ్యాత్మామృత, స్సాక్షీ పురుషః, స హ్యేవృత్తో జీవ త్యభిమాన్యవిద్యయా చేతతే, ప్రాణే, తస్యావరక మజ్ఞానం బీజం. తదంకుర మంతఃకరణం, తద్వృక్ష శ్శరీరమ్.

తా॥ ఇట్టిదేహామం దంతర్యామిగా నుండి జననమరణాదికము లేకుండునది ఆత్మ యనబడును. ఆదేహమునకు సాక్షిగా నుండువాడు పురుషు డనబడును. అట్టివాడు తననిజరూప మవిద్యచే నావరింపబడగా ఈదేహామే తా ననునభిమానము నొంది వ్యవహరించును. ఇట్టి ఆవరకమగు అవిద్య బీజరూపముగా వానిప్రాణవాయువు నాశ్రయించియుండును. దానియంకురమే వీనియంతఃకరణము దానివృక్షమే వీనిశరీరము.

శ్రు॥ తస్మి న్లోమ్నా మష్టౌ కోటయః, అశీతి స్సంధిశతం, నవ స్నాయుశతాని, హృదయం పలా న్యష్టౌ, ద్వాదశపలా జిహ్వా, పిత్తం ప్రస్థం, కఫ శ్చాఢకం, శుక్లం కుడవం, మేదః ప్రస్థౌ ద్వౌ. సర్వం నశ్వరం విజ్ఞాయ, యథాగర్భగ స్సుషుమ్నా ప్రతిష్ఠితో భూయా జ్జంతు ర్వివే క్యుచ్యతే-న పున శ్శరీరం ప్రాప్నోతి.

తా॥ అట్టిశరీరము ఎనిమిదికోట్లరోమములును, ఎనిమిదివేల సంధులును, తొమ్మిదివందలస్నాయువులును, ఎనిమిదిపలములహృదయమును, పండ్రెండుపలముల నాలుకయు, ఒకకుంచము పిత్తమును, ఒకతూము కఫమును, శుక్లధాతు వొకకుడవమును, మేదస్సు రెండు కుంచములును, గలసమూహామై యుండుటచే నశించుస్వభావము గల్గినది. ఇట్టిదీనిస్వభావ మెరిగినవిద్వాంసుడు తాను తల్లిగర్భమందుండుకాలములోవలె బ్రహ్మరంధ్రగతు డగుటకు ప్రయత్నించుచో వాడు వివేకి యనబడి, తిరిగి ఈశరీరబంధము నెన్నటికిని పొందక ముక్తుడగును.

శ్రు॥ అన్యథా త్వజ్ఞస్య సంసారిణః అహరహః క్రిమివ త్తన్మూత్రపురీషయోః పానం, యథా నరకే, తద్వ దిహైవ శరీరే.

తా॥ అట్టివివేకము లేనిమూఢుడు నరకమునందువలె ఈదేహమందే ప్రతిదినము మలమూత్రపానమొనర్చుచు పురుగువలె బాధపడుచు చచ్చుచు పుట్టుచు సంసారధర్మ మొందును.

శ్రు॥ స జాతో యావదాయుషం జీవతి, తం ప్రేతం దిష్టమితోఽగ్నయ ఏవ హరంతి, యత ఏవేతో యత స్సంజాతో భవతి.

తా॥ వైవిధముగా పుట్టినపురుషుడు పూర్వకర్మవశమున ఏర్పడినయాయుర్దాయముయొక్క పరిమితి ననుసరించి జీవించి ఘటీయంత్రమువలె ఊర్ధ్వాధోగమన మొనర్చుటకు హేతువగు సుకృత, దుష్కృతముల నొనర్చుచు జీవనహేతు వగుప్రారబ్ధకర్మక్షయ మైనతరువాత కర్మవాసనావిశిష్టుడై మరణమొందును. వాడు జీవించియున్నప్పుడు తన వర్ణాశ్రమధర్మము ననుసరించి స్వోచితాగ్ని దేవతోపాసన చేయునుగాన అట్టిఉపాస్యదేవత యగునగ్నిలోనే వానిదేహమును వానిపుత్రాదులు శాస్త్రీయముగా లయ మొనర్చెదరు. ఇదియే, ఔర్ధ్వదైహికకర్మ లేక ఉత్తరక్రియ లేక అంత్యేష్టి యని వ్యవహరింపబడును. ఆయగ్ని సర్వలోకదేవతాపరిజ్ఞాతమై సర్వజీవులయొక్క జఠరమం దుండి వారలసర్వవృత్తాంతములను ఎరిగినవాడుగాన ఈ మరణించినవా డెట్టిపుణ్యాపాపకర్మలను ఎట్టిచిత్తశుద్ధితో నాచరించెనో తెలిసికొని అందుల కనువగులోకమున కితని తీసికొనిపోవును.



## లోకాంతరగమనవిచారణము

ఈ యగ్నియొక్క విశేష మొకింత ప్రదర్శింపబడుచున్నది. ఛాందోగ్యోపనిషత్తునం దిట్లుపదేశింపబడెను.

## పంచాగ్నివిద్య

1 ఈద్యులోక మనునగ్నియందు శ్రద్ధను హోమముచేయగా సోమరాజు పుట్టును.
2 పర్జన్యు డనునగ్నియందు సోమరాజును హోమముచేయగా వర్షము పుట్టును.
3 పృథివి యనునగ్నియందు వర్షమును హోమముచేయగా అన్నము పుట్టును.
4 పురుషు డనునగ్నియందు అన్నమును హోమముచేయగా రేతస్సు పుట్టును.
5 స్త్రీ యనునగ్నియందు రేతస్సును హోమముచేయగా శిశువు పుట్టును.

## దేవయానవివరణము

శ్రు॥ త ద్య ఇత్థం విదు, ర్యే చేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే, తేఽర్చిష మభిసంభవంతి, అర్చిషోఽహః, అహ్నః ఆపూర్యమాణపక్షం. ఆపూర్యమాణపక్షా ద్యా న్ష డుద జేతి మాసాగ్ం స్తాన్ మాసేభ్య స్సంవత్సరం సంవత్సరా దాదిత్యం ఆదిత్యా చ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః. స ఏనా న్బ్రహ్మ గమయ త్యేష దేవయానః పంథాః

తా॥ ఇట్టి పంచాగ్నివిద్యాస్వరూపమును బాగుగా నెరిగి అభ్యసించువారును వానప్రస్థాశ్రమధర్మముతో నరణ్యమం దుండి శ్రద్ధాపూర్వకముగా తప మాచరించువారును, నైష్ఠికబ్రహ్మచారులును, ఉపాసకులును, అరణ్యజ్ఞానముతో విద్యాసహితముగా నిష్కామకర్మల నాచరించువారును ఇచట మరణించగానే దేవయానమార్గమున బ్రహ్మలోకమునకు పోవుదురు. తత్క్రమ మెట్లనగా ఈదేహములో

నుండి లేచి అగ్నితేజస్సగు "అర్చిస్సు"లో లయమొందుదురు. అట నుండి అహరభిమానిదేవతయందును, అటనుండి శుక్లపక్షాభిమాని దేవతయందును, అటనుండి ఉత్తరాయణాధిష్ఠానదేవతయందును, అట నుండి సంవత్సరాధిష్ఠానదేవతయందును, అటనుండి ఆదిత్యదేవతయం దును, అటనుండి చంద్రునియందును, అటనుండి విద్యుద్దేవతయందును ఈక్రమముగా లయమొందుదురు. అట కొక అమానవపురుషు డేతెంచి వీరిని బ్రహ్మలోకమునకు గొనిపోవును. ఆబ్రహ్మలోకకాల మానముచేత నూరుసంవత్సరములు పూర్తియగువరకు వీ రచట జగ ద్వ్యాపారముతప్ప మిగిలినవిషయములలో బ్రహ్మతో సమానముగ నుండి స్వయంప్రతిభాతవేదులై వేదాంతవాక్యవిచారణ మొనర్చుచు ఆబ్రహ్మతోగూడ ప్రతిసంచరకాలమందు వీరుగూడ ముక్తులగుదురు. ఇది ఉత్తమాధికారు లగువారిపరలోకగమనమార్గము.

ఇక మధ్యమాధికారులయొక్క పరలోకగమనమార్గాదికము విచారింపబడుచున్నది.

## —♦ పితృయాణ విచారణము ♦—

శ్రు॥ అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మిత్యుపాసతే తే ధూమ మభిసంభవంతి. ధూమా ద్రాత్రిం. రాత్రే రపర పక్షం. అపరపక్షా ద్యా న్షడ్దక్షిణేనైతి మాసాగ్ం స్తాన్ - నైతే సంవత్సర మభిప్రాప్నువంతి- మాసేభ్యః పితృలోకం, పితృలోకా దాకాశం, ఆకాశా చ్చంద్రమసం, ఏష సోమో రాజా, తద్దేవానా మన్నం, తం దేవా భక్షయంతి.

తా॥ ఇక విద్యారహిత మగుకేవలశ్రౌతకర్మలను సకామ ముగా నాచరించువారును స్మార్తకర్మల నాచరించువారును వాపీకూపతటాకారామదేవాలయాదినిర్మాతలును పరోపకారము పితృమాతృపరిచర్య గురుశుశ్రూష కేవలస్వాధ్యాయాధ్యయనము

మొదలగువాని నాచరించువారును పితృయాణమార్గమున పరలోకము లకు పోవుదురు. ఆక్రమ మెట్లనగా ఈశరీరములోనుండి లేచి, వారిచే నుపాసింపబడిన అగ్నిసంబంధ మగుధూమములో లయమై అటనుండి రాత్ర్యభిమానిదేవతయందును, అటనుండి కృష్ణపక్షాభిమానిదేవత యందును, అటనుండి దక్షిణాయనాధిష్ఠానదేవతయందును క్రమముగా లయ మగుదురు. వీరు సంవత్సరాభిమానిదేవతలో లయ మొందరు. అటనుండి వీరు పితృలోకమునకు వెళ్ళి అటనుండి ఆకాశమందు లయమై అటనుండి చంద్రునిలో లయమగుదురు ఈసోమరాజుగారు దేవతలకు ఆహారము గాన వీరిని దేవతలు భుజింతురు.

శ్రు॥ తస్మిన్యావత్సంపాత ముషిత్వా అథైతమే వాధ్వానం పున ర్నివర్తంతే. యథేత మాకాశం, ఆకాశా ద్వాయుం, వాయు ర్భూత్వా ధూమో భవతి, ధూమో భూత్వా అభ్రం భవతి, అభ్రం భూత్వా మేఘో భవతి, మేఘో భూత్వా ప్రవర్షతి, త ఇహ వ్రీహియవా ఓషధివనస్పతయః తిలమాషా ఇతి జాయంతే. అతో వై ఖలు దుర్నిష్ప్రపతరం యో యో హ్యన్న మత్తి యో రేత స్సించతి తద్భూయ ఏవ భవతి.

తా॥ ఆదేవతల హృదయములో కర్మఫలక్షయపర్యంతము నివసించి, సుకృతకర్మభోగక్షయము కాగానే వచ్చినమార్గముననే తిరిగి ఈ భూలోకమునకు వత్తురు. ఎట్లనగా అటనుండి ఆకాశమును పొంది అటనుండి వాయువును పొంది అటనుండి ధూమమును పొంది అటనుండి నీరు లేని పొడిమేఘమును పొంది అటనుండి తడిమేఘ మును పొంది అటనుండి వర్షమును పొంది తద్ద్వారా వ్రీహులుగానో, యవలుగానో, ఓషధులుగానో, వనస్పతులుగానో, నువ్వులుగానో, మినుములుగానో, పుట్టుచున్నారు. ఆపైని నిరూపించుటకు వీలులేని పరిణామము నొందుదురు. ఏలననగా కర్మఫలమునుబట్టి వీనికి బ్రాహ్మణాదిదేహము రాదగియున్నయెడల ఆవ్రీహ్యాదికము బ్రాహ్మ ణాదుల కాహారమే యగును. వీనికర్మఫలమునుబట్టి వీనికి నీచజన్మ

రాదగియున్నచో ఆవ్రీహ్యాదికమును కోడి, కాకి మొదలగు జంతు వులు భుజించును.

ఇట్లు తమతమ కర్మానురూపముగా నాయాజాతిలోని జీవు లాహారమై వారలచే భుజింపబడి రసాదిక్రమమున ఆహారపరిణామము ద్వారా ఆయాజాతిపురుషులయొక్క రేతస్సుగా మారి స్త్రీగర్భము లో ప్రవేశించి తిరిగి జన్మించుచున్నారు.

శ్రు॥ తద్య ఇహ రమణీయచరణా అభ్యాశో హ, యత్తే రమణీయాం యోని మాపద్యేరన్, బ్రాహ్మణయోనిం వా క్షత్రియయోనిం వా వైశ్యయోనిం వా - అథ య ఇహ కపూయచరణా, అభ్యాశో హ యత్తే కపూయాం యోని మాపద్యేరన్; శ్వయోనిం వా, సూకరయోనిం వా, చండాలయోనిం వా.

తా॥ పుణ్యకర్మశేష మనుభవించదగి సిద్ధముగా నున్నవారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, జాతులలో జన్మింతురు పాపకర్మ శేష మనుభవించదగి సిద్ధముగానున్న వారు నీచజంతువులు మొదలగు జాతులలో జన్మింతురు.

---

## శూద్రమార్గవివరణము

శ్రు॥ అథైతయోః పథోర్న కతరేణ చ న తానీమాని క్షుద్రా ణ్యసకృదావర్తీని భూతాని భవంతి. జాయస్వ మ్రియస్వే త్యేత త్తృతీయగ్ం స్థానం, తేనాసౌ లోకో న సం పూర్యతే. తస్మా జ్జుగుప్సేత.

తా॥ ఇట్లు పైనచెప్పబడిన దేవయాన పితృయానములు రెంటికిని తగిన జ్ఞానము లేని క్షుద్రజీవులు చీమలు, దోమలు నల్లులు మొదలగునవి మాటిమాటికి పుట్టుచు, చచ్చుచు ఉండును వీనికి మూడవమార్గము "జాయస్వ మ్రియస్వ" అనగా పుట్టుము

చావుము- అను ఈశ్వరాజ్ఞను ప్రతిక్షణమందును అనుసరించుటతప్ప వేరుగతి లేదు. వీనికి పరమార్థవిచారణ కెంతమాత్రము నవకాశము లేదు. వీనివలన లోకములో నెవరికిని ఎట్టిప్రయోజనమును లేదు. ఇట్టి వీనిపరిస్థితిని గతిని సంసారదుఃఖమును ప్రతిమానవుడును తమమనస్సుతో నూహించి అట్టి జీవత్వప్రాప్తి కనువగుదుష్కార్యముల నెన్నటికిని ఆచరింపకుండుటయు జననమరణప్రవాహరూప మగునీసంసారమందు హేయభావమును పొంది వైరాగ్యము నభ్యసించుటయు చేయదగును.

ఈయభిప్రాయమునే భగవద్గీత యిట్లువివరించుచున్నది.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః.

తా॥ పురుషులప్రవర్తన, ఆచరణము, మొదలగునవి మూడు విధములుగ నుండును. సత్త్వగుణము ప్రధానముగా గలవారు సాత్వికాహారప్రియులై సాత్వికప్రవర్తన గలవారై విద్యాసహితముగా సత్కర్మాచరణశీలురై మరణించినతరువాత ఊర్ధ్వలోకములకు పోవుదురు. అనగా దేవయానమార్గమున పోవుదురు. రజోగుణము ప్రధానముగా గలవారు రాజసాహారప్రియులై రాజసప్రవర్తన గలవారై కేవల కర్మానుష్ఠానమున ఇష్టాపూర్తాదుల నొనర్చి మరణించినతరువాత మధ్యమ మగుసువర్లోకము నొంది అట సుఖముల ననుభవించి తిరిగి మనుష్యలోకమున జన్మించెదురు. అనగా పితృయాణమార్గమున పోవుదురు. ఇక తమోగుణము ప్రధానముగా గలవారు తామసాహారప్రియులై తామసప్రవర్తన గలవారై పారమార్థికజ్ఞానశూన్యులై క్షుద్రజంతువులై మాటిమాటికి పుట్టుచు, చచ్చుచు, నీచాతినీచ మగు సంసారదుఃఖము నొందుదురు.

—♦—

## బ్రహ్మవేత్తకు దేహానంతరస్థితి

ఇట్లు పైజెప్పిన మూడువిధములలో బ్రహ్మవేత్త చేరడు. "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" అనుశ్రుతినిబట్టి వాడు బ్రహ్మభావము నొంది సర్వవ్యాపకుడును సత్యరూపుడును జ్ఞానరూపుడును ఆనందరూపుడును అయినందున వానికి లోకాంతరగమనముగాని పునర్జన్మగాని ఎంతమాత్రము లేవు.

ఘటే నష్టే యథా వ్యోమ, వ్యోమైవ భవతి స్వయమ్
తథై వోపాధివిలయే. బ్రహ్మైవ బ్రహ్మవి త్స్వయమ్.

తా॥ సర్వవ్యాపక మగునాకాశము ఒక కుండలోగూడ నుండినపుడు, అయ్యది "ఘటాకాశమ"ని వ్యవహరింపబడినను, ఆ కుండ పగిలిపోగానే ఆఘటాకాశమే ఆఘటాకాశ మనువ్యవహారమును గోల్పోయి ఆకాశమని యెట్లు వ్యవహరింపబడుచున్నదో అట్లే సత్యజ్ఞానానందరూప మగుబ్రహ్మము సర్వవ్యాపకమై ఒకజీవుని దేహములోగూడ నుండినపుడు అయ్యది "జీవాత్మ" యని వ్యవహరింపబడినను, ఆజీవోపాధి యగుదేహము నశింపగానే ఆజీవాత్మ యను వ్యవహారము పోయి బ్రహ్మ మగును, ఇట్టిజ్ఞానమును అపరోక్షముగా సాక్షాత్కారమొనర్చుకొన్నవాడే బ్రహ్మవేత్త కాన వానికి జన్మాంతరములుగాని లోకాంతరగమనముగాని లేవు.

ఇట్టిబ్రహ్మవేత్త యగుటకు ప్రయత్నించుచు ఆప్రయత్నము పూర్తిగా ఫలప్రద మగువరకు ప్రయత్నింపకపూర్వమే మరణించినవాడు "యోగభ్రష్టు" డనబడును ఇట్టివానిజన్మాంతర, లోకాంతరగమనాదిక మిట్లు భగవద్గీతయం దుపదేశింపబడెను.

పార్థ ! నై వేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత ! గచ్ఛతి.
ప్రాప్య పుణ్యకృతాఀ లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్.
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన !

తా॥ శాస్త్రము ననుసరించి మంచిపని చేయువా డెవడును ఎన్నటికిని దుర్గతిని పొందనేరడు. బ్రహ్మవిద్య నభ్యసించుచు తత్ఫల ప్రాప్తిలోపుగానే ప్రయత్నములో నుండగానే మరణించిన యోగ భ్రష్టుడు ఇహలోకమందుగాని పరలోకమందుగాని ఎట్టిహానిని పొందడు. అట్టివాడు మరణింపగానే పుణ్యలోకములకు పోయి అందు అనేకసంవత్సరములకాలము నివసించి పరిశుద్ధాంతఃకరణు లగువిద్యా వంతులయింటియందుగాని, మహాయోగీశ్వరులకులమందుగాని జన్మిం చును. ఇట్టిజన్మ యోగభ్రష్టులకు తప్ప సామాన్యులకు లభ్యము గాదు. అచట పూర్వదేహముతో తా మెంతవరకు బ్రహ్మవిద్యా వ్యాసంగ మొనర్చినదియు స్మరించి గుర్తించి ఆపై ప్రయత్నమును కొనసాగించి క్రమముగా మోక్షము నొందెదరు.

మరియు యోగభ్రష్టులు మరణకాలమందు 'మేము ప్రయ త్నించుచున్న బ్రహ్మవిద్యాభ్యాసము ఫలప్రద మగువరకు పూర్తి కాకపోయెగదా; దీని నెట్లు ఎప్పుడు పూర్తిచేసి మోక్షమునొందెదమా' యను విచారముతోనే ప్రాణోత్క్రమణ మొనర్తురుగాన వారలకు మరుజన్మలో ఆప్రయత్నముయొక్క అనువృత్తి యుండును.

యం యం వాపి స్మర న్భావం త్యజ త్యంతే కళేబరమ్
తం తమే వైతి కౌంతేయ సదా తద్భావభావితః.

తా॥ మరణకాలమందు జీవు డేయేభావములను స్మరించుచు ప్రాణములను విడుచునో ఆయాభావముల కనువగునుత్తరజన్మమే వారలకు సిద్ధించును.

కాబట్టి యోగభ్రష్టులకు ఉత్తరదేహములోగూడ పూర్వ దేహసంబంధ మగువిద్యావాసనలు గల్గియుండును. ఈ విద్యావిజ్ఞాన మనగా తా నెవరు ? తననిజరూప మెద్ది ? తా నొకపుడు తల్లి గర్భమందు పుట్టుటకు కారణ మేమి ? జీవులు తనకండ్లయెదుట చనిపోవుటకు కారణ మేమి ? కొందరు సుఖించుటకును కొందరు దుఃఖించుటకును కారణ మేమి ? ఇత్యాది ప్రశ్నలకు సమాధానము కొరకు వెదకి ప్రయత్నించుటయే.

ఈ ప్రశ్నలును వానికి సమాధానములును సర్వసారోపనిషత్తు మొదలగువానియం దిట్లుపదేశింపబడినవి.



## పదార్థవిచారము

### —♦ బంధ మెట్లు ? ♦—

శ్రు॥ కథం బంధః ?

తా॥ ఈ జీవునకు బంధ మెట్లేర్పడుచున్నది ? బంధ మనగా నేమి ?

శ్రు॥ ఆత్మేశ్వరో జీవః అనాత్మనాం దేహాదీనా మాత్మత్వేన అభిమన్యతే సోఽభిమాన ఆత్మనో బంధః. అనాద్యవిద్యావాసనయా, జాతోఽహం మిత్యాదిసంకల్పో బంధః. పితృమాతృసహోదరాపత్య. గృహారామక్షేత్రాదిమమతా, సంసారావరణసంకల్పో బంధః. కర్తృత్వాద్యహంకారసంకల్పో బంధః. దేవమనుష్యాద్యుపాసనాకామసంకల్పో బంధః. వర్ణాశ్రమధర్మసంకల్పో బంధః. ఆజ్ఞాభయసంశయాదిగుణసంకల్పో బంధః. యజ్ఞవ్రతతపోదాన, విధివిధానజ్ఞానసంకల్పో బంధః. కేవల మోక్షాపేక్షాసంకల్పోబంధః; సంకల్పమాత్రసంభవో బంధః.

తా॥ దేహాధిపతి యగుజీవుడు అనాత్మ లగుదేహేంద్రియాదులను తనఆత్మగా నభిమానించుటయే బంధ మనబడును. ఇట్లభిమా

రించుట అనేకజన్మలనుండి వీనికి నిరంతరాభ్యస్త మైనది. ఇదియే అవిద్య యనబడును. నేను పుట్టితిని, నేను బ్రాహ్మణుడను, నేను తెలివిగలవాడను, నేను నడచుచున్నాను, నేను కుంటివాడను- ఇత్యాదిగా తలచుటయే బంధ మనబడును. తండ్రి, తల్లి, సోదరులు, సంతానము, గృహము, తోట, పొలము మొదలగువానియందు మమత్వాభిమాన మనగా సంతానమునకు రోగము వచ్చినపుడు తనకే రోగము వచ్చినట్లుగా బాధపడుట, గృహక్షేత్రాదులకు లోటువచ్చినపుడు తనకే లోటువచ్చినట్లు బాధపడుట ఈమొదలైనదే జననమరణప్రవాహరూప మగుసంసార మను ఆవరణమై ఆత్మరూపుడగు జీవుని బంధించుచున్నది. తాను చేయుపను లన్నిటికిని తానే కర్త ననుటభిమానమే బంధ మగును. దేవతలను మనుష్యులలో తన కంటె నుత్కృష్టు లగువారలను సేవించి గృహక్షేత్రారామాద్యైశ్వర్యము నార్జించవలయు ననుసంకల్పమే బంధ మగును. "నేను బ్రాహ్మణుడను, నేను బ్రహ్మచారిని, నేను అగ్నిహోత్రకర్మ నాచరించుచున్నాను- ఇత్యాద్యభిమానమే బంధమగును. ఇతరుల నాజ్ఞాపించుట, ఇతరులవలన భయపడుట, ఒకపనిచేయుటవలన ఏమిపరిణామము కల్గునో అనిసంశయించుట- ఇత్యాదిగుణములను తనయందారోపించుకొనుటయే బంధ మగును. నేను యజ్ఞ మాచరింతును, నేను తపంబొనర్తును, నేను దానముజేయుదును, నేను యాగాదివిధుల నన్నిటి నెరుగుదును- ఇత్యాదిగా నహంకరించుటయే బంధ మగును. "నేను మోక్షమునొందెదను, అనిసంకల్పించుటగూడ బంధమే. వేయేల తానెట్టిసంకల్పము జేసినను అది బంధమే యగుచున్నది.

—♦ మో క్ష మె ట్లు? ♦—

ప్ర॥ కథం మోక్షః, కో మోక్షః ?

ఉ॥ తన్నివృత్తి ర్మోక్షః. నిత్యానిత్యవస్తువిచారా దనిత్యసంసారసుఖదుఃఖవిషయ, సమస్త క్షేత్రమమతాది సమస్తబంధసంకల్పక్షయో మోక్షః

తా॥ మోక్ష మనగానేమి? అదెట్లుగల్గును? ఇందుకు సమాధాన మేమన పూర్వము చెప్పబడినబంధమును పోగొట్టుకొనుటయే మోక్ష మనబడును. తనను విమర్శచేసికొని తన దేహమును ఇంద్రియములను ప్రాణమును జాగ్రత్స్వప్నసుషుప్తులయందు ఏవేవి ఎట్టిస్థితిలో నుండుచున్నవో విచారణచేసికొని అనిత్య మగుదేహాదులందును సుఖదుఃఖాదిప్రాపంచికవిషయములందును గృహారామక్షేత్రాపత్యాదులందును మమత్వమును విడనాడి, ఎట్టిమనోవ్యాపారమును లేనట్టిస్థితియే మోక్ష మనబడును.

## —♦ అవిద్యాలక్షణము ♦—

ప్రశ్న॥ కా అవిద్యా? యా తదభిమానం కారయతి సా హి అవిద్యా.

తా॥ దేహమే ఆత్మ యనెడియభిమానమును, గృహక్షేత్రారామాపత్యాదులందు మమత్వాభిమానమును, ఏది కలుగజేయునో, యదియే అవిద్య యనబడుచున్నది.

## —♦ విద్యాలక్షణము ♦—

ప్రశ్న॥ కా విద్యా? సోఽభిమానో యయా నివర్తతే సా విద్యా.

తా॥ పైయభిమానము దేనివలన నివృత్తియగునో, యదియే విద్య యనబడుచున్నది.

## —♦ జాగ్రదవస్థాలక్షణము ♦—

ప్రశ్న॥ కా జాగ్రదవస్థా? మనఆదిచతుర్దశకరణైః పుష్కలైరాదిత్యాద్యనుగృహీతైః శబ్దాదీన్విషయాన్ స్థూలాన్ యదోపలభతే తదాత్మనో జాగరణమ్.

తా॥ త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనుజ్ఞానేంద్రియములైదును, వాక్పాణిపాదపాయూపస్థ లనుకర్మేంద్రియము లైదును,

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనునీపదునాలుగు ఇంద్రియములును. ఆయాఅధిష్ఠానదేవతలతో నొప్పియుండి, స్థూలములగు శబ్దాదిబాహ్యవిషయములను ఎపుడు గ్రహించునో, అపుడు జాగ్రదవస్థ యనబడును.

## స్వప్నావస్థాలక్షణము

శ్రు॥ కా స్వప్నావస్థా? తద్వాసనాసహితైః చతుర్దశకరణైః శబ్దాద్యభావేపి వాసనామయాన్ శబ్దాదీన్ తాత్కాలికాన్ ప్రతిభాసమానాన్ యదా ఉపలభతే తదా స్వప్నమ్.

తా॥ స్వప్నావస్థయనగా నెట్టిదో వివరింపబడుచున్నది. శబ్దస్పర్శాదివిషయములు లేకున్నను తత్కాలమునందు ప్రతిభాసించు జాగ్రద్వాసనామయము లగుశబ్దస్పర్శాదులను జాగ్రద్వాసనాసహితము లగు పైపదునాలుగు ఇంద్రియములతోను బాహ్యమందుగాక, అంతఃకరణమందే యెపుడు గ్రహించునో అది స్వప్నావస్థ యనబడుచున్నది.

## సుషుప్తి లక్షణము

శ్రు॥ కా సుషుప్త్యవస్థా? చతుర్దశకరణోపరమాత్ విశేషవిజ్ఞానాభావా ద్యదా శబ్దాదీ న్విషయా నోపలభతే తదా త్మన స్సుషుప్తిః.

తా॥ పై పదునాలుగు ఇంద్రియములును తమ కారణమందు లయమును పొందియున్నందున శబ్దాదివిషయములను బాహ్యప్రపంచమందుగాని, అంతఃకరణమందుగాని గ్రహించుటకు ప్రవృత్తి లేకుండుటచే ఆయా శబ్దాదివిశేషవిజ్ఞానము కలుగనేరదు. అట్టి స్థితియే సుషుప్త్యవస్థ యనబడును.

## తురీయ లక్షణము

శ్రు॥ కిం తురీయం? అవస్థాత్రయభావాభావసాక్షి స్వయం భావాభావరహితం నిరంతరచైతన్యమాత్రం యదా తత్తురీ

యం, అవస్థాత్రయోపహితం అవస్థాత్రయోపలక్షితం చ నిర
వస్థం, విశుద్ధమేవ చైతన్యమ్.

తా॥ పై జాగ్రత్స్వప్నసుషుప్తులలో జాగ్రదవస్థ యున్నపుడు, స్వప్నసుషుప్తు లుండవు. ఇట్లే స్వప్నమందు జాగ్రత్సుషుప్తు లుండవు ఇట్లే సుషుప్తియందు జాగ్రత్స్వప్నము లుండవు. ఈమూటికి సాంతత్యమును ఈనాడు జాగ్రద్దశలో ఒకపనిని కొంతవరకు చేసి,ఆపి,స్వప్నసుషుప్తుల నొంది, ఆపైని తిరిగి జాగ్రద్దశలో పూర్వకార్యముయొక్క తరువాయిని మాత్రమే, నిన్నటిసమాప్తినుండి ఆచరించుటయు, లోకప్రత్యక్షముగదా. కావున ఈమూడవస్థలకు అతీతు డగునట్టియు, ఈ మూడవస్థలతో నెట్టి సంబంధమును లేనట్టియు ఒకవస్తు వుండితీరవలెననుట యుక్తిసహముగదా కావున అట్టి అవస్థాత్రయమునకు సాక్షిమాత్రమును, స్వయముగా తనకెట్టి భావాభావములును లేనట్టియు, చైతన్యమాత్రమే, తురీయ మనబడుచున్నది. ఈ చైతన్యము పై అవస్థాత్రయముయొక్క అనుభవములతో నెట్టిసంబంధము లేక విశుద్ధమైనదిగాన ప్రతియవస్థయందును సాక్షిమాత్రముగా అనుగత మగుచుండును. ఇట్టిచైతన్యమును ఈ అవస్థాత్రయముద్వారానే తెలిసికొనవలెనుగాని సాక్షాత్తుగా తెలియగాదు. ఏలననగా నయ్యది శబ్దాది గుణములు లేనిదిగాన ఇంద్రియగోచరము గాదు. ఇట్టిచైతన్యమే సత్యము, జ్ఞానము, అనంతము, ఆనందము, బ్రహ్మ మనబడుచు ప్రతిజీవికిని ఆత్మస్వరూప మగుచున్నది. ఇట్టిజ్ఞానము గలవాడే బ్రహ్మవేత్త యనబడి ముక్తుడగును, ఇందుకు సాధనము తపస్సు- తపస్సనగా

శ్రు॥ కిం తపః? బ్రహ్మ సత్యం జగ న్మిథ్యా ఇత్యపరోక్షజ్ఞానా
గ్నినా బ్రహ్మాద్యైశ్వర్యాశాసిద్ధసంకల్పబీజసంతాపరూపం తపః

తా॥ బ్రహ్మమే సత్యమనియు, పాంచభౌతిక మగుజగత్తంతయు మిథ్యయనియు, నపరోక్షముగా గల్గినజ్ఞాన మనునగ్నిచే ప్రాపంచిక సుఖములయొక్క చివరిహద్దగు బ్రహ్మైశ్వర్యము తనకు కావలయు ననుదురాశను తగులబెట్టుటయే తప స్సనబడును. అనగా

మనుష్యలోకము మొదలగు నూర్ధ్వలోకములలో, క్రమముగా ఉత్కృష్టపుణ్యవంతులు నివసించి ఉత్కృష్టములగు నాయా లౌకిక సుఖములను తమతమ కర్మఫలానురూపముగా కొంతకాలమనుభవించి కర్మభోగక్షయకాలమందు తిరిగి క్రిందిలోకములకు కర్మానురూపముగా వత్తురు. అట్టి ఊర్ధ్వలోకములలోని కెల్లను గొప్పది బ్రహ్మలోకము. అట్టి బ్రహ్మలోకమందలి తాత్కాలికసుఖముగూడ కొంతకాలము మాత్రమే యుండునది గాన, బ్రహ్మవేత్త యగువాడు, దానినిగూడ తృణీకరించుననుటచే, ఇక మిగిలిన లౌకికసుఖములను తృణీకరించునని కైముతికన్యాయముచేతనే సిద్ధమగుచున్నది. అట్టితృణీకారమే, తపస్సనబడునని తాత్పర్యము. అట్టివానికి గ్రాహ్య మేదియో చెప్పబడుచున్నది.

## —♦ గ్రాహ్య విచారణము ♦—

శ్రు॥ కిం గ్రాహ్యం? దేశకాలవస్తుపరిచ్ఛేదరహిత చిన్మాత్ర స్వరూపం గ్రాహ్యమ్.

తా॥ ప్రపంచములో కనుపించువస్తువు లన్నియు, కొంత పొడవు, వెడల్పు, ఎత్తు, లోతు, మాత్రమే గల్గి కొంత దేశమును మాత్రమే వ్యాపించియుండును. అటులనే ఒక కాలములో మాత్రమే యుండును; గాన మరియొక దేశములోను, కాలములోను ఉండవు. కావుననే ఇట్టివస్తువులు అసత్యములు, జడములు, దుఃఖరూపములును అగుచున్నవి. ఇక బ్రహ్మయన్ననో ఇందుకు వ్యతిరేకమై సర్వదేశములందును, సర్వకాలములందును ఉండి, సత్యరూపమై, జ్ఞానరూపమై, ఆనందరూప మైనది. అందొకటియే గ్రాహ్యమైనది.

## —♦ అగ్రాహ్య విచారణము ♦—

శ్రు॥ కి మగ్రాహ్యం ? స్వరూపవ్యతిరిక్త, మాయామయ, బుద్ధీంద్రియాదిగోచర జగత్సత్యత్వ చింతన మగ్రాహ్యమ్.

తా॥ నిరతిశయశ్రేయస్సును బొందగోరువాడు, పై జెప్పినబ్రహ్మమే తననిజరూపమని గుర్తించి, అంతకు భిన్నముగా నుండునట్టియు

తన ఇంద్రియములకు గోచరించునట్టియు, జగత్తును మాయామయ మైనదిగాను, కల్పితమైనదానినిగాను, గుర్తించి అది సత్య మనెడిచిర కాలాభ్యస్త మగుభ్రాంతిని వదలిపెట్టవలెను. అట్టి భ్రాంతిని పోగొట్టు కొనుటకు సాధన ముపదేశింపబడుచున్నది.

## —♦ గురూపసదనవిధి ♦—

శ్రు॥ కి ముపాస్యం? సర్వశరీరస్థ, చైతన్య, బ్రహ్మప్రాపకో, గురు రుపాస్యః.

తా॥ సర్వజీవుల దేహములందును. చైతన్యరూపుడుగా, వ్యాపించియుండు బ్రహ్మభావమును తాను పొంది ఇతరులకు పొందించు సామర్థ్యము గలగురువును ఆరాధించి వానియనుగ్రహముచే పైగ్రాహ్యాగ్రాహ్యములను చక్కగా తెలిసికొనవలెను. ఆ తెలిసికొనురీతి భగవద్గీతయం దిట్లుపదేశింపబడినది.

త ద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వదర్శినః.

తా॥ పరమార్థవస్తువును అపరోక్షముగా సాక్షాత్కారము నొందిన జ్ఞానులను సాష్టాంగనమస్కారపూర్వకముగా గురూపసదన విధితో సమీపించి తనచే నిదివరలో నభ్యసింపబడిన విద్యాదికమును వారికి నివేదించి తన కిపుడు గలసందేహములను సవినయముగా జిజ్ఞాసతో ప్రశ్నించి వారికి తనయం దనుగ్రహము గలుగురీతి సేవింపవలయును. అపుడు వారు వీనియధికారము ననుసరించి జ్ఞానసాధనముల నుపదేశింతురు. ఇట్టి శిష్యుడు అట్టి గురువులయొద్ద పూర్తిగా విద్యాభ్యాస మొనర్చినతరువాత నేమగునో ప్రదర్శింపబడుచున్నది.

## —♦ శిష్యలక్షణము ♦—

శ్రు॥ విద్యాధ్వస్త ప్రపంచావగాహిత జ్ఞానావశిష్టం బ్రహ్మైవ శిష్యః-

తా॥ ప్రారంభములో శిష్యునకు తనదేహము ప్రపంచములోని వివిధవస్తువులు చిత్రవిచిత్ర స్వభావములతో అనేకకర్తృభోక్తృసంయుక్తముగా ప్రతివ్యక్తికిని భిన్న మగుదేశకాల నిమిత్త క్రియాఫలములు గలిగినట్లుగా భాసించుచుండును. ఇపుడీగురువునొద్ద పూర్ణముగా విద్యాభ్యాస మొనర్చినతరువాత పూర్వప్రపంచ మంతయు తనవిద్యాబలముచే యథార్థస్థితిని విచారించగా సత్యజ్ఞానానంతానందరూప మగు తన ఆత్మరూప మైనబ్రహ్మమందు మునిగిపోగా తానే సర్వవ్యాపక మగుబ్రహ్మ మగుచున్నాడు.

ఇపు డిత డేమనబడునో బోధింపబడుచున్నది.

శ్రు॥ సర్వాంతరస్థ స్వసంవిద్రూపవిత్ విద్వాన్

తా॥ సత్యజ్ఞానానందరూపు డగుతానే సర్వజీవులకు అంతఃకరణమందు సాక్షిరూపుడుగానున్నట్లు గుర్తించినవాడుగాన "విద్వాన్" అనబడును. లోకములో నిట్టివానినే విద్వాంసు డనవలెను. ఇట్లుగాక-

—♦ మూఢలక్షణము ♦—

శ్రు॥ దేహ వర్ణాశ్రమ కర్తృత్వ భోక్తృత్వా ద్యహంకార భావనారూఢో మూఢః.

తా॥ తానే బ్రాహ్మణాదివర్ణముతోను బ్రహ్మచర్యాద్యాశ్రమముతోను కూడిన దేహ మనియు దర్శనస్పర్శనాదిసర్వకార్యములకు తానే కర్తననియు తానే సర్వేంద్రియములతోను ఆయావిషయములననుభవించుభోక్త ననియు ఇత్యాదిగా నహంకారముతో నుండువాడు మూఢు డనబడును. తా ననుభవించుసుఖములు సుఖములే గావు. సుఖ మనగా నెట్టిదో శ్రుతివలన ఇట్లుపదేశింపబడెను.

—♦ సుఖలక్షణము ♦—

శ్రు॥ సచ్చిదానందానుభవం జ్ఞాత్వా, ఆనందరూపావస్థితి రేవ సుఖమ్.

తా॥ ప్రపంచ మంతయు అనృత, జడ, పరిచ్ఛిన్న, దుఃఖ రూప మనియు, బ్రహ్మ మొక్కటియే సత్య, జ్ఞాన, అనంత, ఆనంద రూపమనియు అట్టిదియే తన ఆత్మరూపమనియు గుర్తించి తాను అట్టినిరంతరానందరూపముతో నుండుటయే సుఖ మనబడును. ఇందుకు వ్యతిరేకముగా నుండునది సుఖ మనబడకపోగా

శ్రు॥ అత స్సంసారవిషయసంకల్ప ఏవ దుఃఖమ్.

తా॥ ప్రపంచమందలి వస్తువు లన్నియు పంచభూతవికారములే యైనందున వానితో తనయింద్రియములద్వారా దేహమునకు గల్గిన సంబంధమువలన గల్గునది దుఃఖమే యనబడును.

## —♦ స్వర్గ లక్షణము ♦—

ఇక స్వర్గ మన నేమో విచారింపబడుచున్నది.

శ్రు॥ సత్సంసర్గః స్వర్గః.

తా॥ సత్పురుషులతోడిసంబంధమును సత్ అనగా బ్రహ్మము. ఆబ్రహ్మముతో సంబంధమనగా బ్రహ్మవిద్యావిచారణమును ఆ బ్రహ్మమును కొంతభాగముచే సాక్షాత్తుగాను మరికొంతభాగముచే పరంపరగాను బోధించు వేద వేదాంగములతోడి సంబంధ మనగా, నిరంతరము తదధ్యయన, తదర్థబోధ, తదుదితాచరణ, తత్ప్రచార ములును, స్వర్గ మనబడును.

## —♦ నరక లక్షణము ♦—

శ్రు॥ అత స్సంసారవిషయ జననసంసర్గ ఏవ నరకః.

తా॥ ఇక నరకమనగా పైస్వర్గమునకు విరుద్ధమైనది. అనగా వేదవేదాంగాదుల నధ్యయన తదర్థజ్ఞానాదులచే స్పృశింపక దేహేంద్రి యాదులే తా నను భ్రాంతితో నిరంతర మాదేహేంద్రియతృప్తికొరకు మాత్రమే పాటుపడుచు మరణించుచు, తిరిగి పుట్టుచు నుండుటయే నరక మనబడును.

ఇక నిట్టినరకములోనుండి వేదాధ్యయనాదు లాచరించియు విద్వత్తును సంపాదింపలేని ప్రక్రియ యొకటి గలదు.

అదేమనబడునో విచారింతము. కిమాసురమ్

శ్రు॥ బ్రహ్మవిష్ణురుద్ర ఈశానేంద్రాదీనా మైశ్వర్యకామనయా నిరశన జపాగ్ని హోత్రాది ష్వంతరాత్మానం సంతాపయ న్నాచరితం సంతత మత్యుగ్రరాగ ద్వేషహింసాదంభాద్య పేక్షితం తప ఆసురమ్.

తా॥ వేదములోను కొన్ని అభిచారిక కర్మలు, కొన్ని కామ్య కర్మలు బోధింపబడినవి. ఎవరు స్వభావముచేతనే హింసించుటయందు ప్రవృత్తులైయుందురో అట్టివారిని అహింసామార్గమునుండి మరలించు టకుగాను "నీవు చేయుహింసను నీయిష్టానుసారముగా లౌకికముగా చేయకుము. ఈవిధముగా హింసను చేయుము'' అని అభాగము బోధించును. అట్లే దుష్టశిక్షణము శిష్టరక్షణము ధర్మములుగా గల క్షత్రియపుంగవునకు తదర్థమై కొన్ని కర్మ లేర్పడినవి. ఇట్టి వ్యవస్థను గుర్తించక తమయధికారము నెరుగక వాని నన్నిటిని ఆచరించు వారును బ్రహ్మవిష్ణు రుద్ర ఇంద్రాదిదేవతలయొక్క ఐశ్వర్యము తమకు కావలయు ననుకోరికతోను ఆహారమును మాని కఠిననియమ ములతోను అతితీవ్ర మగురాగద్వేష హింసాదంభాదులతోను ఆచరించు వైదికకర్మలుగాని తపస్సుగాని ఆసుర మనబడునేగాని స్వర్గ మనబడదు.

## కర్మలక్షణము

ఇక కర్మ మనగా నెట్టిదో విచారింపబడుచున్నది

శ్రు॥ క్రియమాణేంద్రియైః కర్మ ణ్యహంకరోమీ త్యధ్యాత్మ నిష్ఠతయా కృతం కర్మైవ కర్మ-

తా॥ ఆయా ఇంద్రియములచే నాయావిషయ సంబద్ధ మగు కర్మలు (పనులు) చేయబడుచుండగా తానే ఆయింద్రియాదిరూపుడ నను నహంకారముతో చేయుపనులే కర్మ లనబడును-

## —♦ అకర్మలక్షణము ♦—

ఇక అకర్మ యన నెద్దియో విచారింపబడుచున్నది.

శ్రు॥ కర్తృత్వ భోక్తృత్వాద్యహంకారతయా బంధరూపం జన్మాదికారణం నిత్యనైమిత్తిక యాగవ్రత తపోదానాదిషు ఫలానభిసంధానం యత్తదకర్మ.

తా॥ నేను చేయుచున్నా ననుకర్తృత్వాభిమానముతోను నే నీ పనియొక్క ఫలము ననుభవించుచున్నా ననుభోక్తృత్వాభిమానముతోను, సంధ్యాగ్నిహోత్రాదినిత్యకర్మలను, గృహదాహేష్ట్యాది నైమిత్తిక కర్మలను, తపోదానాదు లగుస్మార్తకర్మలను, ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణబుద్ధితో చేయునవి అకర్మ లనబడును. ఇక సర్వోత్కృష్ట మగుజ్ఞానము నిరూపింపబడుచున్నది.

## —♦ జ్ఞానలక్షణము ♦—

శ్రు॥ దేహేంద్రియనిగ్రహ సద్గురూపాసనశ్రవణమనన నిదిధ్యాసనైః యద్య ద్దృగ్దృశ్యస్వరూపం,సర్వాంతరస్థం సర్వసమం ఘటపటాది పదార్థమి వావికారం వికారేషు చైతన్యం వినా కించి న్నాస్తీతి సాక్షాత్కారానుభవః జ్ఞానమ్.

తా॥ ముందు దేహేంద్రియనిగ్రహ మనగా ఆయాచక్షురాదీంద్రియములను, ఆయారూపాదులమీదికి ఉచ్ఛృంఖలముగా పోనీయక నిగ్రహించి, ఆపైని అనాద్యవిచ్ఛిన్నపరంపరాప్రాప్తవిద్యు డగు సద్గురువు నాశ్రయించి, వారివలన బ్రహ్మవిద్యను శ్రవణమొనర్చి, ఆపైని మననమొనర్చి, ఆపైని నిదిధ్యాస మొనర్చి, సర్వదృశ్యపదార్థములకును దృగ్రూపముగా నున్నట్టియు, సర్వజీవులయంతఃకరణమందును ఏకరీతిగాను జ్ఞానరూపముగాను, చైతన్యరూపముగాను ఉండునట్టియు, లోకమందలి ఘటాదిపదార్థములవలె వికారము నొందనట్టియు, వికారము నొందుసర్వప్రాపంచికపదార్థములందును చైతన్యరూపముగా నున్నట్టియు అట్టి సత్య, జ్ఞాన, అనంత, ఆనందరూప

మగు బ్రహ్మమే తనయాత్మ (నిజ) రూపమనియు అంతకంటె వేరైన వస్త్వంతర మెందును లేదనియు ప్రత్యక్షముగా ననుభవించుటయే జ్ఞాన మనబడును,

ఇందుకు విపరీత మగున దేమగునో తెలుపబడుచున్నది,

## —♦ అ జ్ఞా న ల క్ష ణ ము ♦—

శ్రు॥ రజ్జౌ సర్పభ్రాంతిరివ అద్వితీయే సర్వానుస్యూతే సర్వమయే బ్రహ్మణి దేవతిర్యఙ్మనుష్య స్థావర స్త్రీ పురుష వర్ణాశ్రమబంధ మోక్షోపాధి నానాత్మభేదకల్పితం జ్ఞానం అజ్ఞాన—

తా॥ చీకటిలో త్రాడును జూచి సర్ప మని భ్రాంతిపడినట్లు సర్వజీవులందును ఏకరూపముగా చైతన్యముగా అనుస్యూత మయి యున్న అద్వితీయబ్రహ్మమే సర్వత్ర నిండియుండగా నందలి భాగమును, దేవతలని తిర్యగ్జంతువులని మనుష్యులని స్థావరములని జంగమములని స్త్రీలని పురుషులని బ్రాహ్మణులని క్షత్రియులని వైశ్యులని శూద్రులని బ్రహ్మచారులని గృహస్థులని వానప్రస్థులని సన్న్యాసులని వేరువేరుగ గ్రహించి బంధమోక్షములకు కారణ మగునుపాధినానాత్వమును జూచి ఇట్టి నానాత్వమే వాస్తవ మనుకొనుట యజ్ఞాన మనబడును,

## —♦ ఈ శ్వ ర ల క్ష ణ ము ♦—

శ్రు॥ బ్రహ్మైవ స్వశక్తిం ప్రకృత్యభిధేయ మాశ్రిత్య, లోకాన్సృష్ట్వా ప్రవిశ్యాంతర్యామిత్వేన బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియ నియంతృత్వా దీశ్వరః,

తా॥ వెనుక జెప్పబడిన బ్రహ్మమే ప్రకృతి యను పేరుగల తన శక్తి నాశ్రయించి లోకములను అందలి జీవులను వారల పూర్వజన్మకర్మానురూపముగా సృజించి వారలలో అంతర్యామి రూపమున ప్రవేశించి వారలయంతఃకరణవృత్తులను ఇంద్రియవ్యాపారములను నియ

మించుటచే నీశ్వరు డనబడుచున్నాడు. అట్టి యీశ్వరుని కార్యము వివరింపబడుచున్నది.

ఈశకార్యం జీవభోగ్యం జగ ద్ద్వాభ్యాం సమన్వితమ్
పితృజన్యా భర్తృభోగ్యా యథా యోషి త్త థేష్యతామ్

తా॥ ఈజగ త్తంతయు ఈశ్వరునిచే నిర్మింపబడినదై జీవులందరచే భోగింపబడుచున్నది. లోకమం దిట్టి దృష్టాంతము గలదు. ఏదనగా స్త్రీ తండ్రిచే పుట్టింపబడి, భర్తచే ననుభవింపబడుచున్నట్లు సర్వలోకవిదితమేగదా ?

జీవు లనగా నెట్టివారో వివరింపబడుచున్నది.

## జీవలక్షణము

శ్రు॥ ఈశ్వర ఏవ బ్రహ్మవిష్ణ్వీశానేంద్రాదీనాం నామరూప ద్వారా స్థూలోఽహ మిత్యాద్యధ్యాసవశా జ్జీవః. సోఽయ మేకోఽపి దేహారంభకవశా జ్జీవః నానేవ.

తా॥ అట్టి ఈశ్వరుడే ఆయాజీవులపూర్వజన్మకర్మఫలము ననుసరించి యొకట బ్రహ్మగాను మరియొకట విష్ణువుగాను ఇంకొకట రుద్రుడుగాను వేరొకట నింద్రుడుగాను ఆయానామములతో నాయా రూపము లనగా నాకృతివిశేషములతో నొప్పియుండుచున్నను ఆయా నామరూపాత్మక మగు దేహమును నిజరూప మగుబ్రహ్మభావమును ఒకదానితో నొకటి కలిపి వ్యవహరించుటచే జీవు లనబడుదురు. వీరందరు ఒకే బ్రహ్మరూపులై యున్నను వారలదేహము నారంభించుటకు కారణ మగుకర్మఫలము వేర్వేరుగా నున్నందున జీవులుగూడ ఆయాయుపాధులనుబట్టి వేర్వేరుగా నగుపడుచున్నారు. విద్యాబలముచేత ఎన్నటికి ఉపాధిసంబంధము లేన ట్లొనర్చుకొనగా జీవు డొక్కడై బ్రహ్మమే యగుచున్నాడు.

శ్రు॥ పుణ్యపాపకర్మానుసారీ భూత్వా ప్రాప్తశరీరసంయోగం అప్రాప్తశరీరమివ కుర్వాణః పాణ్యధ్యాసీ జీవః.

తా॥ తాను పూర్వజన్మమం దొనర్చిన పుణ్యపాపకర్మ ననుసరించి వర్తమానదేహమును పొందినవాడైనను తాను వేరని దేహసంబంధమును పొందితినని వివేకము లేనివాడై తానే దేహమనియు, దేహమే తాననియు భ్రాంతి యనెడిఅధ్యాసతో జీవించువాడుగాన, జీవు డనబడుచున్నాడు.

## కర్తృలక్షణము

ఇక కర్త యననెట్టివాడో వివరింపబడుచున్నది.

శ్రు॥ సుఖదుఃఖబుద్ధ్యాశ్రయః, తత్తదిచ్ఛయా దేహాంతః కృతిమాన్, కర్తా, ఇష్ట మితివృత్తిస్సుఖబుద్ధిః- అనిష్ట మితివృత్తిః దుఃఖబుద్ధిః- శబ్దస్పర్శరూపరసగంధా స్సుఖదుఃఖసంయోగహేతవః-

తా॥ అంతఃకరణయందు తన కిది ఇష్టమైన దనువృత్తి గల్గుటయే సుఖబుద్ధి యనబడును. అట్లే అంతఃకరణయందు తన కిది అనిష్టమైన దనువృత్తి గలుటయే దుఃఖబుద్ధి యనబడును. ఇట్టిసుఖబుద్ధితోను, దుఃఖబుద్ధితోను, ఆసుఖదుఃఖేచ్ఛలు శబ్దస్పర్శ, రూప, రస, గంధములద్వారా తనదేహేంద్రియాదులకు సుఖదుఃఖఫలముల నిచ్చుటకు అనువగుప్రయత్నము నొనర్చువాడు కర్త యనబడును.

## క్షేత్రజ్ఞలక్షణము

ఇక క్షేత్రజ్ఞు డనగా నెట్టివాడో వివరింపబడుచున్నది,

శ్రు॥ పంచవర్గధర్మి భూతాత్మజ్ఞాన మృతేన వినశ్యత్యాత్మసంనిధౌ నిత్యత్వేన ప్రతీయతే చ, తత్ప్రతిఫలితం చైతన్యం యత్ప్రకాశతే స క్షేత్రజ్ఞః-

తా॥ మనస్సు మొదలగునవి ప్రాణాదులు ఇచ్ఛాదులు సత్త్వాదులు పుణ్యాదు లనునీయైదు వర్గములసముదాయము పంచవర్గ మనబడును. ఈపంచవర్గధర్మములు గలధర్మి యగుదేహాత్మ యగుజీవుడు

ఆత్మసన్నిధియందుండుటచే నిత్యముగా తోచుచున్నాడు. ఆత్మజ్ఞానము లేనివారి కీభేదము గోచరింపదు. అట్టిపంచవర్గధర్మి యగుభూతాత్మ యందు ప్రతిఫలించి ప్రకాశించుచున్న చైతన్యమే క్షేత్రజ్ఞు డనబడును. ఈక్షేత్రజ్ఞుడు ఆత్మసన్నిధియందు నిత్యమైనదానివలె ప్రతీయమాన మగుజీవోపాధి యైనలింగదేహమందు ప్రకాశించుచుండును. ఈలింగ దేహమే హృదయగ్రంథి యనబడును. ఇదియే ఈజీవుని కనేకజన్మ లందు అన్నిటియందును అనుగతమగుచుండును. అనగా జీవునిస్థూల దేహము లెన్ని మారినను ఈలింగదేహముమాత్రము మారక అన్నిటియందును అనుగత మగుచుండును. అన్ని దేహములతోను చేసిన పుణ్యపాపకర్మలన్నియు ఈలింగశరీరమును లేక హృదయగ్రంథి నాశ్రయించియుండును. ఈహృదయగ్రంథి ఆత్మజ్ఞానముచేత మాత్ర మే నశించునుగాని మరొకదానిచే నెంతమాత్రము నశింపదు-

## —♦ పంచవర్గలక్షణము ♦—

1 పంచవర్గములనగా మనో, బుద్ధి, చిత్త, అహంకారములును
2 ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములును
3 సత్వ, రజ, స్తమస్సులును
4 పృథివి, అప్, తేజో, వాయు, ఆకాశములును
5 పుణ్య, పాపములును అని తెలియవలెను.

ఇక సాక్షి యనగా నెట్టివాడో వివరింపబడుచున్నది.

## —♦ సాక్షిలక్షణము ♦—

శ్రు॥ జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయా దావిర్భావ తిరోభావ జ్ఞాతా, స్వయం తదావిర్భావతిరోభావరహితః, స్వయంజ్యోతి, శ్చేతన స్సాక్షీ-

తా॥ జ్ఞాత యనగా ఆయాపదార్థములను తెలిసికొనువాడు ఆపదార్థములను తెలిసికొనుటయే జ్ఞాన మనబడును- ఆ తెలియబడు పదార్థములే జ్ఞేయము లనబడును. ఇట్లు ఈ జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయము

లోకపు డావిర్భవించుచు, మరియొకపుడు తిరోభావము నొందుచుం డగా స్వయముగా తన కీయావిర్భావ, తిరోభావములు లేనివాఁడై వానిని గుర్తించుచు, తనంతట తానే, ఇతరసహాయము లేకయే ప్రకాశించు చైతన్యరూపుడే సాక్షి యనబడును.

## —♦ కూటస్థలక్షణము ♦—

ఇక కూటస్థుడన నెట్టివాఁడో వివరింపబడుచున్నది.

శ్రు॥ బ్రహ్మాదిపిపీలికాంతసర్వబుద్ధి ష్వవిశిష్టత యోపలభ్యమాన స్సర్వప్రాణిబుద్ధిసాక్ష్యధిష్ఠానాత్మాఽస్తిభాసతేజసః, కూటస్థః.

తా॥ పిపీలికాదిబ్రహ్మపర్యంత మగుసర్వజీవులయంతఃకరణమం దును అవిశేషముగా నుండి, వారలబుద్ధివృత్తులకు అధిష్ఠానమై, వారల బుద్ధివృత్తులతో నెంతమాత్రము సంబంధింపక సాక్షిమాత్రుడుగా నిర్వికారుడై ప్రకాశించువాడు కూటస్థు డనబడును.

## —♦ అంతర్యామిలక్షణము ♦—

ఇక నంతర్యామి యనగా నెట్టివాఁడో వివరింపబడుచున్నది.

శ్రు॥ కూటస్థాద్యుపహితభేదానాం స్వరూపలాభే హేతుః భూత్వా మణిగణే సూత్రమివ సర్వక్షేత్రేషు యదానుస్యూతః అంతర్యమయన్ ప్రకాశతే హ్యాత్మా సోఽంతర్యామీ.

తా॥ నిర్వికారచిన్మాత్రస్వరూప మగుకూటస్థుడు ఆయాయు పాధులలో నుండుటకు హేతువగుచు, (అనగా, కారణరూప మగు నవిద్యతో సంబంధించినచైతన్యము లేక సర్వజీవకారణదేహసమష్టి యనిభావము) అనేకమణుల నొకహారముగా గ్రుచ్చినదారమువలె సర్వజీవులందును అనుస్యూతుడై వారలలోనుండి వారల నాయాపను లందు నియమించుచు, ప్రకాశించునాత్మయే అంతర్యామి యన బడును.

## — ప్రత్యగాత్మ లక్షణము —

ఇక ప్రత్యగాత్మ ఎట్టివాడో వివరింపబడుచున్నది.

శ్రు॥ సత్యం జ్ఞాన మనంత మానందం సర్వశరీరోపాధివినిర్ముక్తం కటకమకుటాద్యుపాధిరహితసువర్ణఘనవ ద్విజ్ఞానఘనచిన్మాత్రస్వభావ మాత్మచైతన్యం బ్రహ్మ యదవభాసతే, త్వం పదార్థః స ప్రత్యగాత్మా

తా॥ సత్యరూపము జ్ఞానరూపము అనంతము ఆనందరూపమును సర్వశరీరోపాధులతో కల్పితమగుసంబంధము తీసివేయబడినట్టియు, కటకమకుటాద్యాభరణభేదము లేని బంగారమువలె విజ్ఞానఘనరూపమును నిర్వికారచిన్మాత్రస్వరూపమును, చైతన్యాత్మక మగు బ్రహ్మమే త్వం అనుపదమున కర్థమై ప్రకాశించునదే ప్రత్యగాత్మ యనబడును.

ఇక బ్రహ్మ మెట్టిదో వివరింపబడుచున్నది.

## — బ్రహ్మస్వరూపము —

శ్రు॥ సర్వోపాధివినిర్ముక్తం నిర్విశేషచిన్మాత్రం స దద్వైత మానందం బ్రహ్మ.

తా॥ జ్ఞానరూపమును, నిర్విశేష మగుచైతన్యమాత్రస్వరూపమును సర్వకాల, సర్వదేశ, సర్వావస్థలందును ఉండునదియు, ఎట్టి యుపాధులతో నెట్టిసంబంధము లేనిదియు సజాతీయ, విజాతీయ, స్వగతభేదము లెవియు లేనిదియు, ఒక్కటియే యగు పరమానందమే బ్రహ్మ మనబడును. ఇట్టిబ్రహ్మ కెన్నటికిని నాశములేదని చెప్పబడుచున్నది.

## — అవినాశి లక్షణము —

శ్రు॥ తద్ధి త్వంపదార్థా దౌపాధికాత్ తత్పదార్థాచ్చ, ఔపాధిక భేదా ద్విలక్షణ మభేద మధిష్ఠానత్వోపలక్షితం శుద్ధం పారమార్థికం సత్తామాత్రం అవినాశి.

తా॥ ఆబ్రహ్మమే ఆయా ఉపాధులతో కల్పితసంబంధము గల్గినపుడు త్వం పదమునకు వాచ్యార్థమై నానావిధములుగ నగుపడు చున్నది. ఆకల్పితసంబంధమును తీసివేయగా ఆ నానాత్వము పోయి, తత్పదలక్ష్యార్థమే యగుచున్నది. ఇట్లు త్వంపదతత్పదములకు అభేదము సిద్ధించుచున్నది. ఇదియే అనేకవిచిత్రములతో గాన్పించు ఇంద్రజాల తుల్య మగు జగత్తున కంతకును అధిష్ఠానము. ఇదియే ఎట్టివికారములు లేక శుద్ధమైనదియు, సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలందును ఏకరీతిగా నుండునదియు, చిన్మాత్రమైనదియు గనుకనే, యిది యెన్నటికిని నశింపదుగాన అవినాశి యనబడును.

ఇక బ్రహ్మాది దేవతలు మనుష్యాదులును ఎవరో ప్రశ్న సమాధానరూపముగా శ్రుతిచే నిట్లు వివరింపబడుచున్నది.

శ్రు॥ కిం బ్రహ్మ కో విష్ణుః కో రుద్రః క ఇంద్రః క శ్శమనః క స్సూర్యః క శ్చంద్రః కే సురాః కే అసురాః కే పిశాచాః కే మనుష్యాః కాః స్త్రియః కే పశ్వాదయః కిం స్థావరం కే బ్రాహ్మణాదయః ?

తా॥ బ్రహ్మ మనగా నేమి? విష్ణు, రుద్ర, ఇంద్ర, శమనాదు లెవరు? అని ప్రశ్న వేసికొని సమాధాన మిట్లు శ్రుతిచే ప్రదర్శింప బడుచున్నది.

## పరమాత్మలక్షణము

శ్రు॥ పరమాత్మేతి దేహాదేః పరతరత్వా ద్బ్రహ్మైవ పరమాత్మా. స బ్రహ్మా స విష్ణుః స రుద్రః స ఇంద్రః స శమనః స సూర్యః స చంద్రః తే సురాః తే అసురాః తే పిశాచాః, తే మనుష్యాః తాః స్త్రియః తే పశ్వాదయః తత్ స్థావరం తే బ్రాహ్మణాదయః సర్వం ఖ ల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన.

తా॥ దేహేంద్రియసంఘాత మాయాజీవులజన్మాంతరకర్మఫల మైనందున ఆకర్మక్షయకాలమందు నశించును. తిరిగి మరియొకవిధ

మగుకర్మఫలము ననుభవించుట కనువగుమరియొక దేహము వచ్చును. ఈ దేహేంద్రియసంఘాతము కర్మవలన నేర్పడినందునను జన్మకర్మ సంబంధ మనాదియైనందునను దీనికి జ్ఞానముచే అంతము గల్గియుండుటచేతను ఇది ఐంద్రజాలికమాయాతుల్యమైనది. పై బ్రహ్మ విష్ణు, రుద్ర, ఇంద్ర, శమన, సూర్య, చంద్ర, సుర, అసుర, పిశాచ, మనుష్య, స్త్రీ, పశు, స్థావర, బ్రాహ్మణాదు లన్నియు ఆయా కర్మఫలానురూప మగు దేహవిశేషములే యైనందున ఆదేహము లన్నియు మాయామయములు నశ్వరములు అగుచున్నవి. ఇక నా దేహములకంటె విలక్షణముగా జన్మమరణాదులు లేనట్టియు సత్యమైనట్టియు ఆనందరూపమైనట్టియు చైతన్యరూప మగునదియే ఈ అన్ని దేహములందును ఏకరీతిగా ననుగతమగుచున్నది. అదియే బ్రహ్మమనబడును లేక పరమాత్మ యనబడును. అందుచే వాస్తవముగానివి యన్నియు అట్టివాస్తవరూపముచే నివి యన్నియు పరమాత్మయే- ఇట్లాయా బ్రహ్మవిష్ణురుద్రాదులలోని వాస్తవ అవాస్తవరూపములను విభజించి గుర్తించుటయే బ్రహ్మవిద్య యనబడును. ఇట్టివిద్యను పుష్కలముగా నవగతమొనర్చుకొన్నవాడే జ్ఞాని యనబడును. కాన జ్ఞానిదృష్టిచేత నిది యంతయు బ్రహ్మమే యగును గాని యజ్ఞాను లగుమూఢులకు బ్రహ్మ, విష్ణు, రుద్రాదు లందరు భిన్నభిన్నములుగానే భాసింతురు. అట్టిజ్ఞానముగల్గుట అనేకజన్మలందు జేయబడిన బహుపుణ్యకర్మపరిపాకముచేతనే గల్గునుగాని సామాన్యముగా గలుగదు. అదియు అనేకకోట్లజనులలో నొకానొకనికి మాత్రమే గల్గునని భగవద్గీతలో నిట్లు చెప్పబడినది.

బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః
మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః.

తా॥ అనేకసహస్ర మనుష్యులలో నొకడు మోక్షసిద్ధికై ప్రయత్నించును. ఆ ప్రయత్నించు వేలమందిలో నొకానొకడు

మాత్రమే నన్ను అనగా, బ్రహ్మమును పుష్కలముగాను యథార్థ ముగాను గుర్తించును. ఇట్టివా డనేకజన్మలందు జేసినపుణ్యకర్మపరిపా కముచే చివరజన్మయందుమాత్రమే సర్వప్రపంచమును బ్రహ్మగా తెలిసికొనుజ్ఞానియై మోక్షమునొందును. అట్టిప్రయత్నమును ప్రారం భించు సత్పురుషులే మహాత్ము లనబడుదురు.

## —♦ మ హా త్మ ల క్ష ణ ము ♦—

మన స్యేకం వచ స్యేకం కర్మ ణ్యేకం మహాత్మనామ్

తా॥ బ్రహ్మవిద్య నభ్యసించదలచినవారు మున్ముందు, మన స్సునందును వాక్కునందును, పనియందును, ఒకేవిషయము నిశ్చల ముగా గల్గియుండవలెను. అనగా సత్యమునే మున్ముం దలవరచుకొన వలెను. ఇందుకు చేతగానివారైనయెడల వారు దురాత్ము లనబడుదు రని యిట్లుచెప్పబడినది.

మన స్యన్యత్ వచ స్యన్యత్ కర్మ ణ్యన్యత్ దురాత్మనామ్

తా॥ మనస్సులో నొకవిషయమును తలంచి, మాట్లాడునపు డావిషయమును మరుగుపరచి మరియొకవిషయము నాలోచించు నట్లు చెప్పుచు పనిచేయునపుడు పైమానసిక, వాచికములను రెంటిని మరుగుపరచి వేరొకవిషయము నాచరించువాడు దురాత్మ డన బడును. ఇట్టివారికిని బ్రహ్మవిద్యకును అనేకకోట్లమైళ్లదూర ముండును కావున బ్రహ్మవిద్య నభ్యసించదలచినవాడు మున్ముందు సత్యవ్రతుడై ఆపైని ప్రపంచలక్షణమును చక్కగా నెరుగవలయును.

## —♦ ప్ర పం చ ల క్ష ణ ము ♦—

ప్రపంచమనగా పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనుపంచభూత ములును వీనిగుణము లగుగంధరసరూపస్పర్శశబ్దములును పుణ్యపాప కర్మలును స్థూలదేహములును ప్రపంచ మనబడును. అందును స్థూల దేహమును విభజించి పరిశీలించగా త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనుజ్ఞానేంద్రియము లైదును, వాక్పాణి పాదపాయూపస్థ లనుకర్మేంద్రి యము లైదును, ప్రాణాపానవ్యానోదానసమానము లనుపంచప్రాణ

ములును, మనోబుద్ధి చిత్తాహంకారము లనుఅంతరింద్రియములును-ఇవియెల్ల కలసి దేహ మనబడును. ఈ దేహములతో జాగ్రత్స్వప్న సుషుప్తు లనుమూడు అవస్థలలో సుఖదుఃఖముల ననుభవించుటగు. దీని నంతను విభజించి పరిశీలించగా (Analysis),

1 కర్త, కారణము, కార్యము.

2 జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము,

3 దృష్ట, దృశ్యము, దర్శనము,

అనునీత్రిపుటిలోని కీజగత్తంతయు వచ్చుచున్నది. ఈజగద్బీజమే ప్రకృతి యనబడును.

## ప్ర కృ తి ల క్ష ణ ము

శ్రు॥ బ్రహ్మణ స్సకాశాత్ నానావిచిత్రజగన్నిర్మాణసామ
ర్థ్యకబుద్ధిరూపబ్రహ్మశక్తి రేవ ప్రకృతిః

తా॥ కల్పాంతరీయ, సర్వజీవపుణ్యాపాప, కర్మబీజమే ప్రకృతి యనబడును. అది సృష్టికాలమందు ఫలోన్ముఖమై ఉద్బుద్ధము కాగా అది స్వతంత్రముగా అచేతనమైనందున ఎట్టిజగత్సృష్టిని చేయజాల నందున అందు ప్రతిబింబించినబ్రహ్మచైతన్యమే సృష్టికారణ మగుచున్నది. అదియె జగత్సర్జనసామర్థ్య మనుబ్రహ్మబుద్ధియై మహత్తత్వ మనబడును.

ఈ ప్రకృతి 1 సత్, 2 అసత్, 3 మిథ్య యని మూడు విధములు. అందు సత్తనగా బ్రహ్మచైతన్యమే. అసత్తనగా తుచ్ఛమైనది అనగా ఆకాశపుష్పము కుందేటికొమ్ము వంధ్యాపుత్రుడు మొదలగువానివలె లేనేలేనిది. మిథ్య యనగా రజ్జువును జూచి సర్ప మనుకొనుటవలె బ్రహ్మయందు కల్పనచే నారోపింపబడిన యసత్యరూప మగుజగత్తు. కావున సర్పభ్రాంతి పోవుటకు ఎట్లు రజ్జుస్వరూప జ్ఞాన మావశ్యకమో యట్లే జగత్సత్యత్వభ్రాంతి పోవుటకు అధిష్ఠాన మగుబ్రహ్మజ్ఞాన మావశ్యక మగుచున్నది.

## జ్ఞేయ మెద్ది ?

శ్రు॥ బ్రహ్మై వాత్మా జ్ఞేయః

తా॥ సర్వప్రపంచమునకు నిజమైన అధిష్ఠానరూప మగు బ్రహ్మమే తెలియదగిన దని శ్రుతిచే బోధింపబడెను. ఇక జ్ఞానమనగా నెట్టిదో వివరింపబడుచున్నది.

## ♦ బ్రహ్మజ్ఞానలక్షణము ♦.

శ్రు॥ బ్రహ్మజ్ఞానం సమూలానాత్మనివర్తకం సత్ బ్రహ్మణి విలీయతే-

తా॥ అనాత్మ యగు దేహేంద్రియసంఘాతమును తద్విశేష మగుస్థూలసూక్ష్మకారణ దేహాదికమును జాగ్రత్స్వప్నసుషుప్త్యాద్యవస్థల ద్వారాగాను అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనంద మయ కోశములద్వారాను శాస్త్రముచేతను తదర్థమును అనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్తసంప్రదాయక్రమముగా గ్రహించుట చేతను సమూలముగా నివర్తింపజేసి ఈఅత్మకు సర్వావస్థలందును సాక్షిగానుండి సత్యమై జ్ఞానరూపమై సర్వవ్యాపకమై సజాతీయవిజాతీయ స్వగతభేదశూన్యమై అవినాశియై యానందరూపముతో ప్రకాశించుబ్రహ్మమే తనయాత్మ (నిజ) రూప మని గ్రహించుటయే బ్రహ్మజ్ఞాన మనబడును. అట్టిజ్ఞానోదయ మైనవానికి రజ్జుసర్పభ్రాంతి నొందిన వానికి భ్రాంతికాలమందలిసర్పజ్ఞానము యథార్థ మగురజ్జుజ్ఞానకాలమందెట్లు రజ్జువునందు లీనమాయెనో అట్లు అవివేక కాలమందలి అనాత్మజ్ఞాన మంతయు ఆత్మయందు లీనమగును.

## ♦ ఉదాసీనలక్షణము ♦

న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి,
ఉదాసీనవ దాసీన ఇతి గ్రంథిభిరోచ్యతే.

తా॥ దుఃఖములు ప్రాప్తించుచుండగా జ్ఞానవంతుడు ద్వేషమును బొందడనియు సుఖములు నివర్తించుచుండగా అపేక్షింపడనియు మరియేమనగా జ్ఞానియగువాడు ఏమియునక్కరలేని వానివలె ప్రవర్తించుచుండును. జ్ఞానికి హృదయగ్రంథిశూన్యత్వము చెప్పబడెను. ఉదాసీనస్య లక్షణం అని యున్నందున నిక్కడ ఔదాసీన్యము విధిపరముగదనియు జ్ఞానగ్రంథిశూన్యత్వమందు ప్రమాణమనియు తెలియనగును పైయవివేకమునే మాయ యని శ్రుతి యిట్లు నిర్వచించుచున్నది.

—♦ మాయాలక్షణము ♦—

శ్రు॥ అనాత్మమూలం మాయా, అనాది రంతవతీ ప్రమాణా ప్రమాణసాధారణా న సతీ, నాసతీ న సదసతీ అనిర్వాచ్యా అధిష్ఠానవ వావిద్యమానా, అంతర్వాణివికల్పనిరూప్యమాణోచ్చావచవ్యవహారభేదవతీ, యా న విద్యతే వస్తుతః సా మాయా.

తా॥ పైయనాత్మకు మూలమైనదే మాయ - దీనికి ఆది లేదు. అంతముమాత్రము గలదు. అధిష్ఠానమగు బ్రహ్మజ్ఞానము గల్గుటతోడనే యియ్యది నశించును. ఇంద్రియములకు గోచరమగునదియు కాదు. గోచరము కానిదియు గాదు. ప్రమాణ అప్రమాణములు రెంటికిని సాధారణమైనది. ఉన్నదియు లేనిదియు కాదు. ఇదమిత్థమని నిరూపింప నలవికానిది. అధిష్ఠానముకంటె వేరుగా వాస్తవముగా లేనిది. అధిష్ఠానముమీాద వేరుగా మూఢులకు భాసించునట్టిది. అయాదర్శనకర్తలచేత అనేకవిధవికల్పములతో నిరూపింపబడిన అనేక వ్యవహారభేదములు గలది. యథార్థముగా లేనిది. ఇట్టిదే మాయ యనబడుచున్నది.

శ్రు॥ తత్స్వరూప మజ్ఞానమ్.

తా॥ ఆమాయయొక్క స్వరూపమే యజ్ఞానము.

## —♦ మూ ల ప్ర కృ తి ల క్ష ణ ము ♦—

శు॥ తదేవ మూలప్రకృతిః

తా॥ అదియే మూలప్రకృతి యనబడును.

## —♦ ప రి ణా మ ల క్ష ణ ము ♦—

శ్రు॥ గుణసామ్య మవిద్యేత్యాద్యనేకాకారా, జగదాకారేణ పరిణతా.

తా॥ అదియే సత్త్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థ యనియు అవిద్య యనియు చెప్పబడుచు అనేక చిత్రములతో నొప్పు జగత్తుగా పరిణమించెను.

## —♦ బ్ర హ్మ జ్ఞా ని అ ను భ వ ల క్ష ణ ము ♦—

శ్రు॥ తదేవ బ్రహ్మవిజ్ఞానా త్యనుభవతి చ.

తా॥ బ్రహ్మవేత్త యగువా డట్టిమాయ ననుభవముచే తెలిసికొనుచున్నాడు. అట్టి వానికి "సర్వం ఖల్విదం బ్రహ్మ, నేహ నానాస్తి కించన" యనురీతిగా ఈ జగత్తు నానావిధములుగా తోచనే తోచదు. అంతట నిండిన సత్యజ్ఞానానందరూప మగుబ్రహ్మముగానే భాసించును. ఎట్లనగా ఐంద్రజాలికుడు తన ఇంద్రజాలవిద్యాబలముచే నొక మామిడిచెట్టును అప్పటికప్పుడు సృజించి ఆక్షణములో చెట్టు అంకురించుట, చిగుర్చుట శాఖోపశాఖలుగా వృద్ధినొందుట పుష్పించుట ఫలించుట మొదలగున దంతయు క్షణకాలములోనే ప్రదర్శింప గలడు. ఆయైంద్రజాలిక మాయను తెలియని సామాన్యమానవు లందరు నద్దానిని జూచి, యథార్థ మగుమామిడిచెట్టుగాను మామిడిపండ్లను గాను గ్రహింతురు. కాని ఆయింద్రజాలికుడు మాత్ర మామామిడి చెట్టు నెంతమాత్రము చూడక తన మాయాబలముచే ప్రజలందరు భ్రమించుటను గమనించి వినోదించుచుండును. ఇట్లే బ్రహ్మజ్ఞాని యగువాడు జగత్తునంతను బ్రహ్మముగా గుర్తించును. మూఢులు మాత్ర మాయాచిత్రవిచిత్రవస్తుభేదములతో నొప్పుజగత్తును జగత్తుగా గ్రహింతురు.

## —♦ మోక్షలక్షణము ♦—

ఇట్టి బ్రహ్మానుభవమే మోక్ష మనబడును.

అభేదదర్శనం మోక్షః, స్సంసారో భేదదర్శనమ్
ఇతి నిస్సంశయజ్ఞానా న్ముక్తి ర్వేదాంతడిండిమః

తా॥ పరస్పరవిలక్షణముగా నుండుజగద్వైచిత్ర్యమును మాయగా నెరిగి సర్వమును సజాతీయాదిభేదరహిత అద్వితీయ చిన్మాత్ర నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావ మగుబ్రహ్మముగా నెరుగుటయే మోక్ష మనబడునని వేదాంతశాస్త్రమందు భేరివలె మ్రోగుచున్నది.

## —♦ పంచకోశ వివరణము ♦—

ఇట్లు జగత్తునంతను బ్రహ్మముగా నెరుగుటకు గలసాధనములలో పంచకోశోపాసన మగ్రగణ్యముగా నొప్పుచున్నది. పంచకోశములనగా—

1. అన్నమయకోశము 2. ప్రాణమయకోశము 3 మనోమయ కోశము, 4. విజ్ఞానమయకోశము 5. ఆనందమయకోశము అనునవి.

ఇం దన్నమయకోశ మెట్టిదో వివరింపబడుచున్నది.

శ్రు॥ అన్నకార్యాణాం సమూహోఽన్నమయః కోశః

తా॥ భుజింపబడిన యాహారముయొక్క పరిణామమగు రక్త, మాంస, అస్థి, త్వగాదిసమూహ మగు నీస్థూలదేహమంతయు అన్నమయకోశ మనబడును.

ఇక ప్రాణమయకోశ మెట్టిదనగా

శ్రు॥ ప్రాణాదిదశవాయవః అన్నమయకోశే యదావర్తంతే,
తదా ప్రాణమయః కోశః

తా॥ ప్రాణ అపాన వ్యాన ఉదాన సమాన, నాగ, కూర్మ కృకర దేవదత్త ధనంజయము లనెడు దశవిధప్రాణవాయువులు స్థూలదేహమం దుండునపు డదియే ప్రాణమయకోశ మనబడును.

ఇక మనోమయకోశ మెట్టిదనగా.

శ్రు॥ ఏతత్కోశద్వయసంయుక్త ఆత్మామనఆదిచతుర్దశకరణైః శబ్దాదివిషయసంకల్పాదిధర్మాన్ యదా కరోతి తదా మనోమయః కోశః—

తా॥ అన్నమయప్రాణమయకోశములు రెంటితో కూడి మనస్సు మొదలగుపూర్వోక్తము లగుపదునాలుగు ఇంద్రియములచేతను శబ్దస్పర్శాదివిషయసంకల్పము మొదలగు ధర్మములను చేయుటయే మనోమయకోశ మనబడును.

ఇక విజ్ఞానమయకోశ మెట్టిదో వివరింపబడుచున్నది.

శ్రు॥ ఏతత్కోశత్రయవిశిష్టాంతఃకరణే తద్గతవిశేషధ్యాన మననాదివృత్తయో యదా ఉత్పద్యంతే తదా విజ్ఞానమయః కోశః—

తా॥ అన్నమయ, ప్రాణమయ. మనోమయ, కోశములు మూటితోను కూడినయంతఃకరణమందు శబ్దస్పర్శాది విషయములయొక్క విశేషములను అందలి సాధకబాధకములను చక్కగా విమర్శించి యొకనిశ్చయమునకు వచ్చుఅంతఃకరణవృత్తులే విజ్ఞానమయకోశ మనబడును.

ఇక ఆనందమయకోశ మెట్టిదనగా

శ్రు॥ ఏతత్కోశచతుష్టయకారణాజ్ఞాన సంవృత్తం స్వకారణ జ్ఞానం, స్వరూపసుఖే. వటధానాసు వటవృక్ష ఇవ, యదా వర్తతే, తదా ఆనందమయః కోశః

తా॥ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములు నాల్గింటికిని కారణ మగుఅవిద్య లేక అజ్ఞానముచే నావరింపబడిన తనయొక్క కారణజ్ఞాన మానందరూప మగుబ్రహ్మమందు వి త్తనమందు వృక్షమువలె బీజరూపముగా లీనమైయుండుటయే యానందమయకోశము.

శ్రు॥ కోశోపాధ్యుపహిత ఆత్మా కోశ ఇత్యుచ్యతే.

తా॥ పై అయిదుకోశములును ఉపాధులేగాన ఆత్మ ఆయాకోశ మనుఉపాధితోడితాదాత్మ్యమువలన ఆయాకోశమయ మగునుగాన అన్నమయకోశమనగా అన్నమయకోశోపాధితో తాదాత్మ్యము నొందినఆత్మయే యగును. ఇట్లే ప్రాణమయాది కోశములకుగూడ తెలియ నగును ఇందుమనోమయ విజ్ఞానమయములకు భేద మొకింత వివరింప బడుచున్నది.

—♦ మ నో బు ద్ధు ల ల క్ష ణ ము ♦—

మనో విమర్శరూపం స్యా ద్బుద్ధి స్స్యా న్నిశ్చయాత్మికా
అహంవృత్తి రిదంవృత్తి రిత్యంతఃకరణం ద్విధా
విజ్ఞానం స్యా దహంవృత్తి రిదంవృత్తి ర్మనో భవేత్.

తా॥ ఆయాయింద్రియములతో నాయాకార్యములను చేయు దమా? వలదా? యను సంశయావస్థలోనుండు అంతఃకరణము మన స్సనబడును. ఆకార్యమందలిగుణదోషములను చేయుటయందలి సాధక బాధకములను పూర్తిగా నాలోచించి ఈకార్య మిట్లు చేసితీరవలయు నని నిశ్చయించునట్టి అంతఃకరణము బుద్ధి యనబడును.

అట్లే అంతఃకరణములో రెండువిధము లగువృత్తు లుండును. అం దొకటి "నేను"అని తనదేహాదికమం దభిమానముతో వ్యవహ రించెడి వృత్తి. ఇదియే విజ్ఞాన మనబడును. రెండవది తనకంటె వేరుగా బాహ్యముం దుండు, గృహక్షేత్రపుత్రదారాది సమస్త ప్రపంచమును "ఇది" యని వ్యవహరించెడివృత్తి. ఇదియె మన స్సనబడును.

ఈరెంటిలో తాను లేక బాహ్యప్రపంచము నెరుగజాలదు గాన మనస్సునకుగూడ విజ్ఞానము కారణ మగుచున్నది.

ఈ పంచకోశములలో అన్నమయకోశము స్థూలదేహము. ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయకోశములు మూడును సూక్ష్మ దేహము, లేక లింగదేహము. ఆనందమయకోశమే కారణదేహము.

ఇందు స్థూలదేహము లెన్ని మారినను అనగా నెన్నిజన్మ లెత్తినను సూక్ష్మదేహము మారదు. ఈలింగదేహముతోనే ఊర్ధ్వాధోలోకము లకు పోవుటయు తిరిగి వచ్చుటయు గల్గును – అందు ఊర్ధ్వలోకము లేవనగా.

1 భూలోకము 2 భువర్లోకము 3 సువర్లోకము 4 మహో లోకము 5 జనోలోకము 6 తపోలోకము 7 సత్యలోకము అనునీ యేడును ఊర్ధ్వలోకము లనబడును.

ఇక నధోలోకము లేవనగా.

1 అతలము 2 వితలము 3 సుతలము 4 తలాతలము 5 మహా తలము 6 రసాతలము 7 పాతాళము అను నీయేడును అధోలోకము లనబడును.

ఇం దధోలోకములలో నరకమం దతికష్టప్రదబాధల ననుభవించు జీవు లుందురు. ఊర్ధ్వలోకములందు ఉత్తరోత్తరక్రమముగా నుత్కృష్ట పుణ్యవంతు లగుజీవు లుందురు. కావున ఈలోకములందు మాటి మాటికి పుట్టుచు చచ్చుచు నుండుసంసారబంధమును పోగొట్టుకొన గోరువాడే ముముక్షు వనబడును. వానిలక్షణ మిట్లున్నది.

## —♦ ము ము క్షు ల క్ష ణ ము ♦—

బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానా ద్య ద్విద్వా న్మోక్తు మిచ్ఛతి
సంసారపాశబంధం త న్ముముక్షుత్వం నిగద్యతే.

తా॥ విద్వాంసుడై, జీవునివాస్తవరూపమునకు అనగా తన యొక్క నిజరూపమునకు బ్రహ్మమునకు, ఎట్టిభేదము లేక, రెండును ఒకటేయను విజ్ఞానముచే జననమరణ ప్రవాహరూపమగు సంసార బంధమునుండి ఎవడు వదలింపబడకోరుచున్నాడో వాడే ముముక్షు వనబడును.

ఇట్టివాడు శమదమాదుల నభ్యసించవలయును. అవి 1 శమము 2 దమము 3 ఉపరతి 4 తితిక్ష 5 శ్రద్ధ 6 సమాధానము అని ఆఱు

వీని లక్షణము లిట్లు శ్రుతిచే తెలియవచ్చుచున్నవి.

—♦ శమలక్షణము ♦—

శ్రు॥ శమః మనోనిగ్రహః

ఏకవృత్త్యైవ మనసః స్వలక్ష్యే నియతస్థితిః
శమ ఇత్యుచ్యతే సద్భి శ్శమలక్షణవేదిభిః

తా॥ మనస్సును నిగ్రహించుట యనగా ఏకాగ్రవృత్తిచే లక్ష్యమునందు స్థిరముగ నిలుపుటయే శమ మనబడును.

—♦ దమలక్షణము ♦—

శ్రు॥ దమః చక్షురాదిబాహ్యేంద్రియ నిగ్రహః

బ్రహ్మచర్యాదిభి ర్ధర్మై ర్బుద్ధే ర్దోషనివృత్తయే
దండనం దమ ఇత్యాహు ర్మనస శ్శాంతిసాధనమ్

తా॥ చక్షురాదిబాహ్యేంద్రియనిగ్రహమే దమ మనబడును. అంతఃకరణమందలి ఆయా ఇంద్రియసంబద్ధము లగుదుష్ట వృత్తులను, దోషములను పోగొట్టుటకొరకు బ్రహ్మచర్యాదిధర్మములచే అట్టిబుద్ధిని దండించుటయే దమ మనబడును. ఇది మనస్సునకు శాంతి నిచ్చును.

—♦ ఉపరతిలక్షణము ♦—

శ్రు॥ ఉపరతిర్నామ సర్వకర్మణాం త్యాగః. సఏవ న్యాస ఇతి కథ్యతే–

తా॥ స్వస్వవర్ణాశ్రమోచితసర్వకర్మలను యథాశాస్త్రముగా త్యాగ మొనర్చి సంన్యాసాశ్రమమును స్వీకరించుటయే ఉపరతి యనబడును.

—♦ తితిక్షాలక్షణము ♦—

శ్రు॥ తితిక్షానామ శీతోష్ణసుఖదుఃఖాది సహిష్ణుత్వమ్–

ఆధ్యాత్మికాదికం దుఃఖం ప్రాప్తం ప్రారబ్ధవేగతః
అచింతయా తత్సహనం తితిక్షేతి ప్రచక్షతే.

తా॥ జ్వరాదులవలన గలుగుదుఃఖములును చక్షురాదీంద్రియములకు విషయము లగురూపాదులద్వారా కలుగుదుఃఖములును ఆధ్యాత్మికములు- సింహవ్యాఘ్రాదులవలన గలుగుదుఃఖము లాధిభౌతికములు- వర్షగర్జనాదులవలన గలుగుదుఃఖము లాధిదైవికములు-ఇట్టి దుఃఖము లన్నియు, ప్రారబ్ధవశముచే గల్గుచుండగా, ఎట్టిచింత లేక విచారము లేకయే, వానిని సహించుటయే తితిక్ష యనబడును. అట్లే పరస్పరవిరుద్ధము లగుశీతోష్ణములు, సుఖదుఃఖములు, మొదలగున వెన్ని శరీరమునకు తటస్థించినను ఎట్టివికారము నొందక వానిన న్నిటిని సమదృష్టితో సహించుటయే అనగా, సుఖము వచ్చినపుడు సంతోషింపకుండుటయు దుఃఖము వచ్చినపుడు విచారింపకుండుటయు తితిక్ష యనబడును.

## —♦ శ్రద్ధాలక్షణము ♦—

శ్లో॥ శ్రద్ధానామ సర్వవేదాంతసిద్ధాంతసంగ్రహః
గురువేదాంతవాక్యేషు బుద్ధి ర్యా నిశ్చయాత్మికా
సత్య మిత్యేవ సా శ్రద్ధా నిదానం ముక్తిసిద్ధయే.

తా॥ వేదాంతము లనబడు ఉపనిషత్తుల నన్నిటిని అనాద్యవిచ్ఛిన్న పరంపరాక్రమప్రాప్తవిద్యులగు, సద్గురువులవలన యథావిధిగా శ్రవణమొనర్చి ఆ గురువులవాక్యములందును, ఆ వేదాంతవాక్యములందును నుత్కృష్ట మగుప్రమాణబుద్ధియే శ్రద్ధ యనబడును. ఇది మోక్షనిదానమైనది.

## —♦ సమాధానలక్షణము ♦—

శ్లో॥ సమాధానంనామ ఆధ్యాత్మికాదితాపత్రయనాశః.
శ్రుత్యుక్తార్థావగాహాయ విదుషా జ్ఞేయవస్తుని
చిత్తస్య సమ్యగాధానం సమాధాన మితీర్యతే.

తా॥ ఆధ్యాత్మికతాపములు, ఆధిదైవికతాపములు, ఆధిభౌతికతాపములు, అను నీమూడువిధము లగుతాపములను, నశింపజేయుట కనువుగా వేదాంతములం దుపదేశింపబడిన ప్రమేయమును, చక్కగా నవగతమొనర్చుకొని, జ్ఞేయవస్తువగు బ్రహ్మమందు, చిత్తమును స్థిరముగా నుంచుటయే సమాధాన మనబడును.

ఈ బ్రహ్మవిద్య నెచట మనన మొనర్పవలయు ననగా,

## —♦ ఏకాంతలక్షణము ♦—

ఏకాకీ చింతయే న్నిత్యం వివిక్తే హిత మాత్మనః
ఏకాకీ చింతయానో హి పరం శ్రేయోఽధిగచ్ఛతి॥

తా॥ వేదాంతముల నశేషముగా సమన్వయపూర్వకముగా సద్గురువువలన శ్రవణ మొనర్చి తదర్థమును చక్కగా మనన మొనర్చుటకు చిత్తవిక్షేపహేతువులు లేని ఏకాంతప్రదేశమం దుండి తనకు హితమగు ఆత్మజ్ఞానమును వేదాంతవాక్య సమన్వయపూర్వకముగా నాలోచించుచుండవలెను.

అదృష్టాసకృదభ్యాస సంస్కారసచివా ద్భవేత్
సూ॥ ఆవృత్తి రసకృదుపదేశాత్

తా॥ ఈమననము నిరంతరముగా ననేకపర్యాయము లొనర్పవలెను. అట్లాచరింపగా, పరోక్ష మగునాత్మజ్ఞానము క్రమముగా నిదిధ్యాసవలన సిద్ధించును. నిదిధ్యాస యనగా

## —♦ నిధిధ్యాసలక్షణము ♦—

తాభ్యాం నిర్విచికిత్స్యేర్థే చేతస స్థాపితస్య యత్
ఏకతానత్వ మేత ద్ధి నిదిధ్యాసన ముచ్యతే.

తా॥ ఆశ్రవణమననములచే నిస్సంశయమ్ముగా నిర్ధారణచేయబడిన ఆత్మయందు చిత్తమును స్థాపించి తదేకాకారవృత్తి ప్రవాహమును చిత్తమునకు గలిగించుటయే నిదిధ్యాస మనబడును.

## —♦ దేహత్రయలక్షణము ♦—

ఇట్లు మననమొనర్చుటకు తన దేహత్రయముయొక్క లక్షణముల నెరుగవలయును. అవెవ్వి యన

## —♦ స్థూలశరీరము ♦—

స్థూల స్త్వన్నమయో దేహ స్సూక్ష్మ స్తద్వాసనామయః
మూలాజ్ఞానం య త్తదేవ శరీరం కారణాభిధమ్.

తా॥ అన్నరసపరిణామరూపమయి, త్వక్, అసృక్, మాంస, మేదో, అస్థి, మజ్జాత్మకమయి, ఈ దృశ్యమగుచున్న స్థూల దేహము అన్నమయకోశము. ఇది ఇతరభూతములను లేక, స్థూల దేహములను అన్నముగ గైకొనుచు, ఇతర భూతముల కిది యన్నమగుచున్నదిగాన, ఇది అన్నమయ మనబడును.

ఇదియే స్థూలదేహము. మరియు,

మూ॥ పఞ్చీకృతపఞ్చమహాభూతైః కృతం స త్కర్మజన్యం సుఖదుఃఖాదిభోగాయతనం శరీరం, అస్తి, జాయతే, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, వినశ్యతీతి షడ్వికార మేతత్ స్థూల శరీరమ్.

తా॥ పంచీకృతపంచమహాభూతములచే నిర్మింపబడినదియును, కర్మముచే గల్గినదియును, సుఖదుఃఖాది భోగములకు స్థానమైనది యును ఉండుట, పుట్టుట, పెరుగుట, విరుగుట, తగ్గుట, చెడుట- అను నీయారువికారములు గలదియు అగుశరీరము స్థూలదేహ మన బడును.

### విశ్వుడు

శ్రు॥ స్థూలశరీరాభిమానీ ఆత్మా విశ్వ ఇత్యుచ్యతే.

తా॥ జాగ్రదవస్థయొక్క స్థూలశరీరాభిమానియైన ఆత్మ విశ్వుడని చెప్పబడుచున్నాడు.

ఇట్టి స్థూలశరీరమునం దభిమానము నొంది తానే ఈ దేహ మని తాదాత్మ్యభ్రాంతిలో నుండుయాత్మయె, విశ్వు డనబడును.

ఇట్టి విశ్వు లందరియొక్క సమష్టిరూపమే విరాట్పురుషు డన బడును. ఈ స్థూలదేహమందు చక్షురాదీంద్రియములన్నియు, రూపాది బాహ్యప్రపంచమంతయు, వ్యాపృతమై యుండి, ఆయారూపాది విజ్ఞానముల గల్గించును. ఈ కాలమే, జాగ్రదవస్థ యనబడును.

## —♦ సూక్ష్మశరీరము ♦—

ఇక స్వప్నావస్థలో చక్షురాదీంద్రియము లుపరతిని జెందగా బాహ్యప్రపంచము ఎంతమాత్రము లేకయే పూర్వానుభవవాసనా విశిష్ట మగునంతఃకరణమే చక్షురాదీంద్రియములను బాహ్యప్రాపంచిక పదార్థములను రూపాదివిజ్ఞానములను అన్నిటిని సృజించి, యనుభ వించుచున్నది. మరియు

మూ॥ అపఞ్చీకృతపఞ్చమహాభూతైః కృతం స త్కర్మజన్యం సుఖదుఃఖాదిభోగసాధనం. పఞ్చజ్ఞానేంద్రియాణి పఞ్చకర్మేం ద్రియాణి పఞ్చ ప్రాణాదయః మన శ్చైకం బుద్ధి శ్చైకా ఏవం స ప్తదశకలాభిః సహ య త్తిష్ఠతి తత్ సూక్ష్మశరీరమ్.

తా॥ అపంచీకృత పంచమహాభూతములచే కలిగినదియును, కర్మచే సిద్ధించినదియును, సుఖదుఃఖాదిభోగములకు సాధనమైనదియును, జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియములు అయిదు, ప్రాణాది వాయువులైదు, మనస్సు, బుద్ధి అను నీపదునేడు కలలతో గూడు నదియునై యుండునది సూక్ష్మశరీరము.

### తైజసుడు

శ్రు॥ సూక్ష్మశరీరాభిమానీ తైజస ఉచ్యతే.

తా॥ స్వప్నావస్థయొక్క సూక్ష్మశరీరాభిమానియైన ఆత్మ తైజసు డనబడుచున్నాడు.

ఇందు తాదాత్మ్యాభిమానముగల ఆత్మయే తైజసు డనబడును. వీరల సమష్టియే హిరణ్యగర్భు డనబడును.

## —♦ కారణశరీరము ♦—

ఇక సుషుప్త్యవస్థయందు పై ఇంద్రియములుగాని, తద్వృత్తులుగాని ఎంతమాత్రము లేక, కేవల ఆనందరూపముగా నుండి మేల్కొనిన క్షణమందు ప్రతిపురుషుడును "నేను సుఖముగా నిద్రించితిని" అని పల్కుచున్నాడు. కాని, ఈ సుషుప్తికి పూర్వమే యేపనిని ఎంతవరకు చేసి ఆపివేసెనో ఆ సుషుప్త్యనంతరమం దాయా పనిని అక్కడనుండి తరువాయినే కొనసాగించుచున్నందున, ఆయా విజ్ఞానాదికము సంపూర్ణముగా నశింపక బీజరూపముగా నున్నట్లు అవశ్య మంగీకరింపక తప్పనందున బీజరూపముగానుండు ఇంద్రియ వృత్త్యాదికము మాత్రమే సుషుప్త్యవస్థయం దుండును దేహముగాని, ఇంద్రియములుగాని, ఇవన్నియు జన్మాంతరీయపుణ్యపాపకర్మఫలమే గావున సుషుప్త్యవస్థయందు బీజరూప మగుకర్మఫలముచే నావృత మగు ఆనందము మాత్రమే యున్నది. ఈ కర్మఫలమే యవిద్య యనబడునుగాన అవిద్యయే కారణశరీర మనబడుచున్నది. మరియు.

మూ॥ అనిర్వాచ్యానాద్యవిద్యారూపం శరీరద్వయస్య కారణమాత్రం సత్ స్వస్వరూపాజ్ఞానం నిర్వికల్పకరూపం య దస్తి, తత్కారణశరీరమ్.

తా॥ అనిర్వాచ్యమై అనాదియై అవిద్యాస్వరూపమై, శరీరములు రెంటికిని కారణమాత్రమై యుండు స్వస్వరూప అజ్ఞానమైన నిర్వికల్పస్వరూప మేదియో అది కారణశరీరము.

అనిర్వాచ్యమనగా = సత్యమనియును అసత్యమనియును చెప్పుటకు సాధ్యము లేని దేదియో అది అనిర్వాచ్యము.

తా॥ మాయను అసత్యమని చెప్పుదుమేని ప్రపంచోత్పత్తి కాగూడదు. ఈ మాయయే ప్రపంచమును గలుగచేయుచున్నది.

సత్యమని చెప్పవదమేని జ్ఞానముచే నశించుచున్నది. కావున మాయ అనిర్వాచ్యము. అట్లే రజ్జువునందు తోచినసర్పము అసత్యమనిచెప్పవదు మేని భయము, వణకు, మొదలగునవి కలుగగూడదు. సత్యమని చెప్పదుమేని విచారముచే నశించుచున్నది. కాబట్టి రజ్జువునందు సర్పము అనిర్వాచ్యము. ఇది యిట్టిదని నిష్కర్షగా జెప్పుటకు సాధ్యము కానిది యేదియో అది అనిర్వాచ్యము. దీనినే అనిర్వచనీయమనియును, అనాది యనియును, ఉత్పత్తి లేనిది అనియును చెప్పుదురు.

ప్రాజ్ఞుడు

శ్రు॥ కారణశరీరాభిమానీ ఆత్మా ప్రాజ్ఞ ఇత్యుచ్యతే.

తా॥ సుషుప్త్యవస్థయొక్క కారణశరీరాభిమాని అయిన ఆత్మ ప్రాజ్ఞు డనబడుచున్నాడు.

ఇందు తాదాత్మ్యాభిమానము నొందినయాత్మయే ప్రాజ్ఞుడన బడును. వీరల సమష్టిరూపమే అవ్యాకృతు డనబడును.

వేద మంతయు శ్రేయస్సాధన మగుచుండగా నొకవేదాంత భాగమే ఏల, మోక్షవిద్య యగునో వివరింపబడుచున్నది.

—♦ కర్మప్రయోజనము ♦—

కర్మాణి చిత్తశుద్ధ్యర్థం చిత్తైకాగ్ర్య ముపాసనమ్
మోక్షార్థం బ్రహ్మవిజ్ఞాన మితి వేదాంతడిండిమః.

వేదమం దుపదేశింపబడినకర్మ లన్నియు, చిత్తశుద్ధికి సాధనము లగును. వేదమం దుపదేశింపబడినయుపాసన లన్నియు, చిత్తైకాగ్రతా సాధనములు. కేవలబ్రహ్మవిజ్ఞానము నుపదేశించు వేదభాగ మగునుపని షత్తులు మాత్రమే మోక్షసాధనము లగునని వేదాంతభేరి మ్రోగు చున్నది.

వేదమం దుపదేశింపబడినకర్మలుగూడ ప్రతిజనులును ప్రతి కర్మను చేయ వీలులేదు. తమతమవర్ణమునకును, ఆశ్రమమునకును అనువగు కర్మలనే యాచరింపవలయును.

## —♦ స్వ ధ ర్మా ను ష్ఠా న ఫ ల ము ♦—

శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్.

తా॥ కర్మలే ధర్మ మనబడును. తమ, వర్ణాశ్రమోచితమగు ధర్మము నొకింత, తక్కువగా నాచరించినను, అవి శ్రేయస్సునే కలుగజేయును. ఇతరవర్ణములకును, ఇతర ఆశ్రమములవారి కొరకును, విధింపబడిన ధర్మములను తానెంత బాగుగానాచరించినను, అవి శ్రేయస్సును కలుగజేయకపోగా, అనర్థమును కలుగజేయును. ఒకజన్మ యొక్క చివరక్షణమందుగాని, లేక ఉత్తరజన్మయొక్క ఆరంభక్షణ మందుగాని, ఆజీవుడు చేసిన పుణ్య, పాపకర్మ లన్నిటియొక్క మొత్తము లెక్కింపబడి, అందులో శీఘ్రఫలప్రదకర్మలను, ఆలస్యముగా ఫలమునిచ్చు కర్మలను విభజించి, తదనుగుణ మగునుత్తరదేహమును నిర్ణయింప ననువగు, ప్రారబ్ధ మగుకర్మఫలమే "స్వభావ"మనబడును. ఇదియే ప్రతివానియొక్క జాతి, వర్ణములకు హేతు వగుచున్నది. అనగా నీ స్వభావమున కనువగుజాతియందే, వర్ణమందే ఆయా జీవులు పుట్టుదురు. కావున ప్రతివాడును తమతమజాతివర్ణముల కను రూపమగు కర్మల నాచరించుటచే పాపమును పొందక, పాపమును క్రమముగా తగ్గించుకొని, పుణ్యమును వృద్ధినొందించును. ఇదియే వానికి శ్రేయస్సనబడును. అట్లుగాక స్వభావము నుల్లంఘించి ఇతర వర్ణములవారి ధర్మమును తానే స్వబుద్ధితో నాచరించినయెడల ఆప దలనొందును. అనగా నట్టివానికి ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక, దుఃఖములు సంభవించి, ఉత్తరజన్మలో నికృష్టమగు దేహము వచ్చును. అపుడు వైదిక ధర్మమున కెంతమాత్రమును అధికార ముండకపోవు టచే ఇంకను పాపాతిరేకమొనర్చి క్రమముగా నధోలోకములలో జన్మించును. అపుడు పరమార్థ మనలేలేదు. కావున జాతి, వర్ణములు, పూర్వకాలమం దసలే లేవనియు, తరువాత మానవ సంఘము తమలో తాము చేసికొన్న వ్యవస్థమాత్రమే యనియు, ఆయాజీవులు విద్యా ప్రవర్తనా వృత్తులనుబట్టి, జాతి వర్ణములమార్పును బొంద

వచ్చుననియు, పాశ్చాత్యనాగరకతాధురీణులు పలుకు వాక్యములు, శాస్త్రవిరుద్ధములని తెలియనగును. కావుననే, వేదమందు

శ్రు॥ బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్. బాహూ రాజన్యః కృతః. ఊరూ తదస్య యద్వైశ్యః. పద్భ్యాగ్ం శూద్రో అజాయత.

శ్రు॥ వసంతే బ్రాహ్మణోఽగ్ని మాదధీత. గ్రీష్మే రాజన్య ఆదధీత. శరది వైశ్య ఆదధీత. అష్టసు విక్రామేషు బ్రాహ్మణోఽగ్ని మాదధీత. ఏకాదశసు విక్రామేషు క్షత్రియోఽగ్ని మాదధీత. ద్వాదశసు విక్రామేషు వైశ్యోఽగ్ని మాదధీత.

శ్రు॥ గాయత్రఛందా వై బ్రాహ్మణః; త్రిష్టుప్ఛందా వై రాజన్యః, జగతీఛందా వై వైశ్యః.

శ్రు॥ బ్రాహ్మణో బృహస్పతిసవేన యజేత; రాజా రాజసూయేన యజేత; క్షత్రియ స్స్వారాజ్యకామోఽశ్వమేధేన యజేత; వైశ్యః వైశ్యసోమేన యజేత

శ్రు॥ అష్టవర్షం బ్రాహ్మణ ముపనయీత; ఏకాదశవర్షం క్షత్రియ ముపనయీత; ద్వాదశవర్షం వైశ్య ముపనయీత.

తా॥ ఇత్యాది వేదవాక్యములు ఆయాజాతులకు భిన్నములగు నుత్పత్తిస్థానములును, అగ్న్యాధాన ఋతువిశేషములును, గార్హపత్యాహవనీయముల మధ్య దూరమును, వార లుచ్చరింపదగు నుపస్థానాది మంత్రములకును, గాయత్ర్యాదిజప్తవ్యమంత్రములకును గలఛందోభేదవిశేషములను, ఆయా వర్ణస్థులు మాత్రమే చేయదగు అసాధారణక్రతు విశేషములును (అనగా, బ్రాహ్మణులు మాత్రమే బృహస్పతి సవనమను క్రతువు నాచరించవలెను, క్షత్రియులు మాత్రమే రాజసూయాశ్వమేధము లనుక్రతువుల నాచరింప నర్హులు. అటులనే వైశ్యులు మాత్రమే, వైశ్యస్తోమ మనుక్రతువు నాచరింప నర్హులు)

ఆయా వర్ణములవారికి ఉపనయనముచేయుటకు యుక్తమగు వయస్సులను ప్రదర్శించుచున్నవి. ఇట్లే అగ్నిష్టోమాది నానాక్రతువులు, త్రైవర్ణికులు ముగ్గురు సాధారణముగా ననుష్ఠింపదగినట్లున్నను, వాని అనుష్ఠాన విశేషములలో నచ్చటచ్చట బ్రాహ్మణాదులకు భిన్నభిన్నములగురీతు లున్నట్లు వేద ముపదేశించుచున్నది. కావున పైపాశ్చాత్యనాగరకతాధురీణుల వాక్యములు శ్రుతివిరుద్ధములని ప్రాజ్ఞులు గమనింపగలరు.

—♦ వేదస్వరూపము ♦

శ్రుతి యనగా పురుషులకు ఉచ్ఛ్వాసనిశ్వాసము లెట్లు స్వప్రయత్నము లేకుండగనే వానియంతట నవి నడచుచున్నవో, అట్లే జగత్కారణ మగుబ్రహ్మముయొక్క ప్రయత్నము లేకయే వెలువడి బ్రహ్మచే తొలుత వినబడినదే యని.

శ్రు॥ అస్య మహతో భూతస్య నిశ్వ మేవైత దృ
దృగ్వేదో యజుర్వేద స్సామవేద అథర్వాంగిరసః.

ఇత్యాది బృహదారణ్య శ్రుతివలన తెలియబడుచున్నది. మరియు దీనికే వేద మనుసార్థకనామ మున్నది.

ప్రత్యక్షే ణానుమిత్యా వా య స్తూపాయో న బుధ్యతే
ఏతం విదంతి వేదేన, తస్మా ద్వేదస్య వేదతా.

తా॥ లోకమందు పదార్థజ్ఞానమునకు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము మొదలగుప్రమాణములు సాధనము లగుచున్నవి. అట్టి సాధనములచే తెలియబడని విషయమును తెలుపునదిగాన "వేద" మని పేరు.

ఇట్టి వేదమునందుమాత్రమే జీవులకు జన్మాంతరములు, లోకాంతరగమనము, పుణ్యాపాపకర్మవిశేషములు, వానిచే గలుగు ఊర్ధ్వాధోలోకగమనములు, ఉత్కృష్టనికృష్టము లగుజాతులందు జన్మలు మొదలగునసాధారణవిశేషము లుపదేశింపబడియున్నవి. అద్దానిని పరమ

ప్రమాణముగా విశ్వసింపనివారు లోకాంతరగమన పుణ్యపాపాదికము లతో నెంతమాత్రము సంబంధమును విశ్వసింపనివా రగుదురు. కనుక అందలిరహస్యవిశేషములలో కొన్నిటినిమాత్రము విశ్వసించి మరి కొన్నిటిని విశ్వసింపకపోవుట ప్రాజ్ఞులధర్మము కానుగదా.

ఈ వేదమందు ప్రతిధర్మమును జాతివర్ణాశ్రమములకు సంబంధించియే యున్నది. ఇట్టిజాతివర్ణాశ్రమధర్మములను అసంకీర్ణముగా ఎవరివర్ణోచితధర్మములను వారు ఆచరించినపుడే ఆవేదమం దుపదేశింపబడినఫలము వచ్చునుగాని ఇతర వర్ణోచితధర్మముల నాచరించినపుడు ఫలము రాకపోగా అనర్థము వచ్చుననుటకు ఆ వేదమే ప్రమాణము.

ఇట్టివర్ణాశ్రమధర్మరూప మగు వేదశాసనమును అందరు ఆచరించునట్లు ప్రవర్తింపజేయుప్రభువునకు "భరతు" డనుపేరును, ఈ ధర్మము నాచరించుప్రజలకు భారతీయు లనుపేరును, ఇట్టిధర్మ ముండు నోటునకు భరతవర్ష మనుపేరును వేదమందే యున్నది.

కాన స్వర్గాదిపుణ్యలోకముల నొందుటకును, క్రమముగా బ్రహ్మలోకము నొందుటకును, మోక్షము నొందుటకును, ఈ భరతవర్షములో జన్మించినవారలకే యధికారముగ్గాని ఇతరభూమండలవాసుల కెంతమాత్రము అధికారము లేదు. అసలు ఇతరదేశములలోని యేమతసిద్ధాంతమందును జన్మాంతరలోకాంతరగమన మోక్షాది వృత్తాంతము లేనేలేదుగదా. ఒకవేళ ఆభాసమాత్రముగా నున్నను అందలిరీతిగా ప్రవర్తించువారలకు ఆయాఫలము వచ్చుననుటకు, ఆయా మతకర్తలవాక్యమే ప్రమాణమగుచు ఆయాఫలమునందు "కావచ్చును కాకపోవచ్చును" అను వికల్పమున కాస్పద మున్నది. ఏలననగా ఆయా మతగ్రంథములలోని వాక్యము లాయామతకర్త లగు పురుషమాత్రులవాక్యములుగాన పురుషబుద్ధిసహజ మగుప్రమాదాదిక మందు సంభవించును. ఇంతేగాక పురుషమాత్రు డెవడు లోకాంతరములను జూచివచ్చెను? ఏలోకములో నెట్టికర్మ జేసినవారు జన్మింతురు? ఈ జీవు డీలోకములో జేసినపుణ్యపాపకర్మలఫల మెట్లుండును? ఎచట

నుండును? ఇత్యాదిప్రశ్నలకు సమాధానమును పురుషమాత్రు డెవడు సమాధానము చెప్పగలడు? పోనీ, ఏదేశమందైనను, ఏమతకర్తయైనను ఈ ప్రశ్నలకు సమాధానములను లౌకికయుక్తులతో చెప్పియుండెనా? ఒకవేళ చెప్పినను వానియథార్థతకు బాధ్యు లెవరు? కావున పురుష బుద్ధిచే కల్పింపబడినమతము లన్నిటికిని ఈ దోష మున్నందున శ్రేయస్కాము లగువా రెవరును ఆ మతములను వినరాదు, చూడరాదు, ఆచరింపరాదు, స్పృశింపరాదు.

ఇక భారతీయులకన్ననో అపౌరుషేయమై బ్రహ్మచే వినబడినట్టిదై ఆద్యంతకాలములు లేక సర్వకాలసర్వావస్థలందు నుండునట్టి నిత్యమై, స్వతఃప్రమాణమై యలరారుచున్న వేద మీ సర్వవిషయములకును చక్కనియుక్తియుక్త మగుసమాధానము నుపదేశించినది, కాన అట్లాచరించువారలఫలమునకు అదియే బాధ్యత వహించును.

కావుననే భగవద్గీతయం దిట్లున్నది.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి.
యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్.

తా॥ పై హేతువులచే ఇది చేయదగును, ఇది చేయకూడదు అని నిర్ణయించుటకు భారతీయులకు శాస్త్రమే పరమప్రమాణము, ఆశాస్త్రమందలివిధానము ననుసరించియే భారతీయులు ప్రవర్తింపవలెను. ఏ భారతీయు డట్టిశాస్త్రము నుల్లంఘించి తనబుద్ధికి తోచినట్లు ప్రవర్తించునో వాడు కార్యసిద్ధినిగాని ఐహికసుఖమునుగాని, ఆముష్మికశ్రేయస్సునుగాని పొందడు.

—♦ వేదము లెట్టివి ? ♦—

బృహదారణ్యకోపనిషత్తు

శ్రు॥ స యథార్ద్రైధాగ్నే రభ్యాహితా త్పృథ గ్ధూమా, విని
శ్చరం త్యేవంవా అరేఽస్య మహతో భూతస్య నిశ్వసిత మేత

ద్యదృగ్వేదో యజుర్వేదస్సామ వేదోఽథర్వాంఙ్గిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషద శ్లోకా స్సూత్రా ణ్యనువ్యాఖ్యా నాని వ్యాఖ్యానా న్యస్యై వై తాని సర్వాణి నిశ్వసితాని.

తా॥ చెమ్మగా నుండుకట్టెలయొక్క అగ్నినుండి పొగ బయలు వెడలునట్లు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము, ఇతిహాసము, పురాణము, విద్య, ఉపనిషత్తులు, శ్లోకములు, సూత్రములు, అనువ్యాఖ్యానములు, వ్యాఖ్యానములు-ఇవి అన్నియు ఆమహాభూతము లేక పరమాత్మయొక్క నిశ్వాసములు. మరియు

## ముక్తికోపనిషత్తు

శ్రు॥ నిశ్వాసభూతా మే విష్ణో ర్వేదా జాతాస్సు విస్తరాః

తా॥ విష్ణు వగునాయొక్క నిశ్వాసమునుండి వేదములు విస్తరముగా గల్గెను. ఇక్కడ విష్ణువు అనగా పరమాత్మ అని గ్రహించునది.

## యోగశిఖోపనిషత్తు

శ్రు॥ వేదశాస్త్రపురాణానాం స్వయం కర్తా భవిష్యసి.

తా॥ వేదశాస్త్రపురాణములకు కర్త పరమాత్మయే యగుచున్నాడు.

## తైత్తిరీయోపనిషత్తు

శ్రు॥ తస్మా ద్విరా డజాయత విరాజో అధిపురుషః ఋచ స్సామాని జజ్ఞిరే. ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్. యజుస్తస్మా దజాయత.

తా॥ ఆబ్రహ్మమునుండి ఆదిపురుషు డైనవిరాట్టు కలిగినాడు, అనగా పుట్టినాడు. ఆయజ్ఞపురుషునివలన ఋగ్వేదము, సామవేదము, ఛందస్సులు, యజుర్వేదము కల్గెను.

## ఛాందోగ్యోపనిషత్తు

శ్రు॥ సామవా, ఋగ్వేదో, యజుర్వేద, అధర్వణ శ్చతుర్థా మితిహాసపురాణః పంచమవేదానాం వేదః.

తా॥ ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, ఐదవదైన ఇతిహాసములు పురాణములు అనునివి యన్నియు వేదములే యగును.

—♦ శాస్త్రము లెట్టివి ? ♦—

శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా
కల్పశ్చేతి షడంగాని వేద స్యాహు ర్మనీషిణః.

తా॥ వేదపురుషునకు శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము–అనునీయారును అంగములు.

—♦ శ్రుతిప్రామాణ్యము లేనివాడు మూర్ఖు డనబడును ♦—

భ్రామ్యంతే పండితంమన్యా స్సర్వే లౌకికతార్కికాః
అనాదృత్య శ్రుతిః మౌర్ఖ్యా త్కేవలాం యుక్తి మాశ్రితాః

తా॥ లౌకిక తార్కికు లగువా రందరు తాము పండితులమని తలచుచు యుక్తి నొక్కదానినిమాత్ర మాశ్రయించినవా రగుచు మూర్ఖతవలన శ్రుతిని నిగ్రహించి (ఆదరింపక) భ్రాంతిని పొందుచున్నారు. ఇట్టివారు మూర్ఖు లనబడుదురు.

—♦ పూర్వాపరవిమర్శ లేనివారు సిగ్గులేనివా రనబడుదురు ♦—

పూర్వాపరపరామర్శవికలా స్తత్ర కేచన
వాక్యాభాసాః స్వస్వపక్షే యోజయం త్యపలజ్జయా.

తా॥ ఆలౌకికతార్కికులలో కొందరు పూర్వవాక్యములయొక్కయు వెనుకటివాక్యములయొక్కయు అర్థమును విమర్శించుటయందు సామర్థ్యము లేనివారగుచు తమతమమతములందు వాక్యములయొక్క ఆభాసలను అనగా పరవాక్యములచే బాధింపబడెడి పూర్వపక్షవాక్యములను సిగ్గులేమిచే చేర్చుచున్నారు.

ఇందుచే శ్రుతిప్రామాణ్యము లేనివా రెంతమాత్రము ముక్తి నొందజాలరు.

—♦ మనోనాశ లక్షణము ♦—

ముక్తికోపనిషత్

శ్రు॥ సహోవాచ శ్రీరామః. ద్వివిధ శ్చిత్తనాశోస్తి సరూపో రూపఏవచ। జీవన్ముక్త స్సరూపస్స్యా దరూపో దేహముక్తిగః.

తా॥ మనోనాశము సరూపలయమనియు, అరూపలయమనియును రెండు విధములు. జీవన్ముక్తియందు సరూపమనోనాశమే యుండును. అనగా ఈ వర్తమానదేహ ప్రారబ్ధకర్మ ముండునంత వరకు ఒకవిధ మగువృత్తి యుండును. కావున సరూపలయావస్థను పొందునని భావము. విదేహముక్తియందు ప్రారబ్ధము నశించును. కావున రూపవిహీనమై కర్పూరదీపమువలె స్వకారణమునందే లయించును. ఇదియే అరూపమనోనాశ మనబడును. జీవన్ముక్తియందు సరూపముగ చిత్తము నశించును. విదేహముక్తియందు అరూపముగ నశించును.

శ్రు॥ భూయోజన్మవినిర్ముక్తం జీవన్ముక్తస్య తన్మనః
సరూపో సౌ మనోనాశః జీవన్ముక్తస్య విద్యతే.

తా॥ జీవన్ముక్తుడగువానియొక్క మనస్సు మనఃకార్యములగు సంకల్పవికల్పాదికములందు సాభినివేశముగ ప్రవర్తింపదు. కావున జన్మపరంపరలకు కారణముగాక ఉపాధిక్షయమువరకు సరూపముగ నుండియు మానసవ్యాపారాదికమునకు కారణభూతము గాకపోవుట చేత సరూపమనోనాశమని చెప్పబడియున్నది ఇట్టి సరూపమనోనాశము జీవన్ముక్తునకే కాని అన్యునకు గాదు.

శ్రు॥ అరూపస్తు మనోనాశో వైదేహీ ముక్తిగో భవేత్.

తా॥ రూపముసైతము లేక నిశ్శేషముగా మనస్సు నశించుట విదేహముక్తి. ఈ విదేహముక్తియందు అరూపమనోనాశము కల్గును.

—♦ ప్రాప్తృ ప్రాప్య, గంతృ గంతవ్య వివేకము ♦—

ప్రాప్తయనగా=బ్రహ్మప్రాప్తికి ప్రయత్నించునట్టివాడు.

ప్రాప్యమనగా=పొందదగినట్టిది, బ్రహ్మము. ఇది పరోక్ష బ్రహ్మజ్ఞానము.

పరోక్షం బ్రహ్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకమ్,
బుద్ధిపూర్వకృతం పాపం కృత్స్నం దహతి వహ్నివత్.

తా॥ గురువుద్వారా లభింపబడినట్టి తత్త్వమస్యాది మహావాక్యములవలన గలిగినపరోక్షబ్రహ్మజ్ఞానము సమస్తపాపములను బుద్ధిపూర్వకముగా చేసిన పాపములతోగూడ అగ్నివలె దహించుచున్నది.

గంతయనగా= తెలిసికొనదగిన ఆత్మను తెలిసికొనుటకు ప్రయత్నించునట్టి జీవుడు.

గంతవ్యమనగా= తెలిసికొనదగిన లేక పొందదగిన బ్రహ్మము. ఇది అపరోక్షాత్మక విజ్ఞానము.

అపరోక్షాత్మవిజ్ఞానం శాబ్దం దేశిపూర్వకమ్
సంసారకారణాజ్ఞానతమస శ్చండభాస్కరః.

తా॥ ఆచార్యునివలన తత్త్వమస్యాదిమహావాక్యజన్య మగుఅపరోక్షాత్మవిజ్ఞానము సంశయ, విపర్యయరహితజ్ఞానము, సంసారమునకు కారణమై, జన్మపరంపరకు హేతువైన మూలాజ్ఞానమును, మధ్యాహ్నకాల సూర్యుని తేజస్సు చీకటిని పోగొట్టినట్లు, పోగొట్టి పురుషునకు సర్వసంసారవిముక్తిని గలిగించును,

పై విషయద్వయము లివి యని తెలిసికొనుటయే ప్రాప్తృ, ప్రాప్య, గంతృ, గంతవ్య వివేకమని యెరుంగవలయును.

—♦ సాక్షాత్కార లక్షణము ♦—

శ్రు॥ వేదాహ మేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, త మేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పంథా విద్యతేఽయనాయ.

తా॥ ఏ పురుషుడు సమస్తములయిన దేవమనుష్యశరీరములను విశేషముగ పుట్టించి నామములను కల్పించి వానిచేత పిలువబడుచు

నున్నాడో మరియు గొప్పవాడును, సూర్యునివంటి కాంతిగల వాడును, అంధకారముకంటె అవతల నుండువాడును, అగు ఈ పురుషుని నేను ఎరుగుదును. ఈవిధముగ ఎరిగినవా డిచ్చటనే అనగ ఎప్పుడు ఎరిగితే అప్పుడు ముక్తుడైనవాడు అగుచున్నాడు. మోక్షము కొరకు నింకొక మార్గము లేదు.

ఆత్మాకారేణ సంవిత్తి ర్బుద్ధి ర్విద్యేతి కల్ప్యతే
వికల్పరహితం తత్వం పర మిత్యభిధీయతే.

తా॥ బ్రహ్మాకారాకారితాపరోక్షాంతఃకరణవృత్తిరూప మగు విద్యాపదవాచ్య మగువిజ్ఞానముకూడ నవిద్యాజనక మాయాకార్య విశేషమే అవును గాన అదియు మిథ్యయే అగును. అట్టివిద్యయందు విషయీభూతమగు వికల్పరహిత నిర్విశేషతత్వమే పరాత్పర బ్రహ్మ తత్వము.

ఇందుకు ఫలము

అహం బ్రహ్మేతి విజ్ఞానా త్కల్పకోటిశతార్జితమ్
సంచితం విలయం యాతి ప్రబోధా త్స్వప్నకర్మవత్.

తా॥ నేను బ్రహ్మము అనిమెడి అపరోక్ష సాక్షాత్కారమువలన కల్పకోటిశతములనుండి పుణ్యపాపకర్మల నాచరించుచు చేర్చికొని యున్న సంచితకర్మ అంతయు మెలకువ రాగానే స్వప్నకృతము నశించినవిధముగ నశించును.

—♦ భ్రాంతి లక్షణము ♦—

భ్రాంతి ర్విద్యా పరం చేతి శివరూప మిదం త్రయమ్
అర్థేషు భిన్నరూపేషు విజ్ఞానం భ్రాంతి రుచ్యతే.

తా॥ భ్రాంతి (అవిద్య) అనియు, విద్య అనియు, బర మనియు చెప్పబడు నీమూడును బరశివస్వరూపములే. ఇందు విద్యావిద్యలు రెండును జిచ్ఛక్తులు, పరము చిద్రూపము. విద్యఅనునది పూర్వశ్లోకోక్త మయినది, అవిద్య అనగా నాత్మస్వరూపావరకమై అనాత్మవస్తువిష

యకమైన విషయజ్ఞానస్వరూపమైయుండునది, గనుక నీవిద్యావిద్యలు రెండును మహామాయాకార్యములే. ఇందు స్వప్నకల్పితవ్యాఘ్రము స్వప్నమునుగూడ నివర్తింపచేసి తాగూడ నివర్తించినట్లు మాయా కార్యములలో నొకటియగు బ్రహ్మాకారపరోక్షాంతఃకరణవృత్తి రూప మగువిద్య ఉదయించి స్వవిరుద్ధ మగునవిద్యను, స్వకారణ మగు మహామాయను నశింపజేసి తాగూడ లయించును; అనగా ప్రత్యగభిన్నాఖండాద్వితీయ పరబ్రహ్మస్వరూపమాత్రి మగుపరతత్వ మొకటియే నిలిచియుండునని తెలియనగును.

## —♦ భ్రమ లక్షణము ♦—

భ్రిమే ణాహం భ్రిమేణ త్వం భ్రిమే ణోపాసకా జనాః
భ్రమే ణేశ్వరభావ శ్చ భ్రిమమూల మిదం జగత్.

తా॥ నేను, నీవు, ఉపాసకులు, ఈశ్వరుడు, సోపాధిక స్వరూపము లన్నియు భ్రాంతిమూలకములే, సమస్తజగత్తుగూడ భ్రాంతి కల్పితమే.

## —♦ చాతుర్వర్ణ్య విభాగము ♦—

జాతివర్ణవిభాగముగూడ భగవద్గీతయం దిట్లుపదేశింపబడినది.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్.

తా॥ పరమేశ్వరుడ నగునాచేత ఆయాజీవుల పుణ్యపాపకర్మ విభాగము ననుసరించియు, ఆయాకర్మఫల మగుసత్వరజస్తమోగుణముల హెచ్చుతగ్గులతో నొప్పు విభాగవిశేషమునుబట్టియు, బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రు లనునాలుగువర్ణములప్రజాసమూహము సృజింపబడినది. నే నాయావర్ణములను స్వతంత్రముగా సృజించినచో నొకరియందు వైషమ్యమును మరియొకరియందు నైర్ఘృణ్యమును అనగా కొందరిని ఉత్తమజాతియందును, మరికొందరిని నీచజాతియందును సృజించుటచే నాయందు వైషమ్యాదిదోషములు ప్రసక్త

మగును. గాన నే నాయాజీవులజన్మాంతరకర్మానురూపముగ నే వారల కీజన్మలోనిజాతిని నిర్ణయించితిని. కావున వారలసృష్టికి నేను కర్త నైనను కర్మఫలాపేక్షితసృష్టిగాన నే నకర్తనే యగుదును.

ఇందు సృష్టం అనుక్రియాపదము భూతకాలము (Past Tense) లో నున్నది. చాతుర్వర్ణ్యశబ్దము జన్మించినజీవులను చెప్పునుగాని చచ్చినవారలనుగాని పుట్టబోవువారలనుగాని చెప్పలేదు. కాన జీవుడు పుట్టినక్షణమునకు, పూర్వకాలములోనే పరమేశ్వరునిచే వానిజాతి నిర్ణయింపబడినదని స్పష్టమగుచున్నది. దీనికి హేతువుగా 'గుణకర్మ విభాగశః' అను పద మొప్పుచున్నది. కాన శిశువు తల్లిగర్భములో ప్రవేశించుటకు పూర్వక్షణమందే ఆజీవుని గుణవిభాగమును కర్మ విభాగమును బట్టి వానిజాతి నిర్ణయించబడియున్నట్లు స్పష్టపడు చున్నది. కావున ఆక్షణమునకు పూర్వమందలి యాజీవునిగుణ కర్మాదికము పూర్వజన్మసంబంధమైన దేగాని, వర్తమానజన్మయందలిది గాదు గదా! దీనినిబట్టి ఈ జన్మలోనే ఆయాజీవుల వృత్తివిద్యా వైదుష్యాదులచే వారలజాతి మారునని యర్థముచెప్పు పాశ్చాత్యనాగరకుల సమన్వయజ్ఞాన మెంత సరసమైనదో ప్రాజ్ఞులే యూహింపగలరు.

కావుననే పరమేశ్వరు డనగా, అనేకకోటిజీవు లందరియొక్క కర్మఫలవేత్తయు వారల నందరను వారివారికర్మఫలానురూపముగా నాయాజాతులందు జన్మలను నియమించుశక్తి గలవాడును, అయియున్నట్లు "నియంత్రీ, నిఖిలేశ్వరీ'' అనురహస్య నామప్రామాణ్యముచేత గూడ తెలియుచున్నది. మరియు జాతివ్యవస్థ లేనట్లు బోధించుశ్రుతి యొకటిపాశ్చాత్యనాగరకతాధురీణులచే నుదాహరింపబడుచున్నందున దాని నొకింత విచారింతము.

శ్రు॥ న చర్మణో న రక్తస్య న మాంసస్య న చాస్థినః
న జాతి రాత్మనో జాతి ర్వ్యవహారప్రకల్పితా.

తా॥ జాతి యనునది ఆత్మకు లేదు. చర్మమునకుగాని, రక్తమునకుగాని, మాంసమునకుగాని, ఎముకకుగాని జాతి లేదు. వ్యవహారము కొరకు కల్పింపబడినదే జాతి.

ఈ వాక్యముయొక్క ప్రకరణమునుబట్టి దీనితాత్పర్యమును, విచారింపవలసియున్నది. ఇయ్యది నిరాలంబోపనిషత్తునం దున్నది.

"నిరాలంబం సమాశ్రిత్య సాలంబం విజహాతి యః,
న సన్న్యాసీ చ యోగీ చ కైవల్యం పద మశ్నుతే.

అనువాక్యముతో నీయుపనిషత్తు ప్రారంభమైనది. దీనితాత్పర్య మేమనగా, పరిదృశ్యమాన మగునీదేహేంద్రియసంఘాతమును జగత్తును ఆలంబనముగా గైకొని తద్ద్వారా నిర్వికారము నిర్గుణము నిష్కలము నిరవయవము నిరవద్యము నిరంతరము నిష్కారణము నిష్కళంకము నిరుపాధికమును అగు సత్యజ్ఞానానందానంతబ్రహ్మచైతన్యమును గుర్తించినవాడు సన్న్యాసియు యోగియునై కైవల్య మనగా మోక్షము నొందును.

ఇట్లుపక్రమింపబడిన యీయుపనిషత్తునందు క్రమముగా జీవలక్షణము, అవిద్యాలక్షణము, బంధలక్షణము, మోక్షలక్షణము, కర్మలక్షణము, జ్ఞానలక్షణము, ఉపాస్యలక్షణము, ప్రకృతిలక్షణము స్వర్గ నరక సుఖ దుఃఖ బ్రహ్మ విష్ణు రుద్ర ఇంద్ర శమన సూర్య చంద్ర సురాసుర పిశాచ మనుష్యాదిలక్షణము లన్నియు చెప్పబడి, ఆపైన-

శ్రు॥ సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన జాతిరితి చ. న చర్మణో న రక్తస్య న మాంసస్య న చాస్థినః న జాతి రాత్మనో జాతి ర్వ్యవహారప్రకల్పితా- యని యున్నది.

కావున దీనితాత్పర్య మిట్లు పెద్దలచే చెప్పబడినది. భారతవర్షమందు జన్మించి అందును ఉత్తమవైదికవిద్యాసంపద గలబ్రాహ్మణవంశమందు జన్మించి సత్కర్మానుష్ఠానమును ఈశ్వరార్పణబుద్ధితో నొనర్చినవానికి ఈజన్మయందుగాని జన్మాంతరమందుగాని చిత్తశుద్ధి గల్గి, వేదాంతవాక్యజిజ్ఞాస గల్గి, శాస్త్రీయముగా సర్వకర్మసన్న్యాసపూర్వకముగా తురీయాశ్రమము స్వీకరించి సద్గురువులద్వారా శ్రవణ మొనర్చి మననాదిద్వారా ముక్తు డగును. ఇట్టివా డుత్తమాధికారి. ఇట్టి ఉత్తమాధికారినై "సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి

కించన" యను శ్రుత్యర్థము. "నే నిదివరలో భిన్న భిన్నలక్షణములతో నొప్పునీజగత్తును వాస్తవమయినదానినిగా భ్రాంతిపడితిని. ఇపు డీజగ మంతయు బ్రహ్మమే యైనది. ఇదివరలో భ్రాంతికల్పిత మగునానా త్వము పోయినది" అనునపరోక్షాత్మవిజ్ఞానము నొందినవానికి వాని దేహేంద్రియసంఘాతమే అవిద్యాకల్పితముగాన తదాశ్రితవిశేష మగు జాతిగూడ నవిద్యాకల్పిత మైనందున నట్టివానికి జాతివిషయ లేదు— కాని, ఇట్టి ఉత్తమాధికారి యగుటకుపూర్వము ఈజన్మయందుగాని పూర్వజన్మలందుగాని చిత్తశుద్ధికొరకు చేయుకర్మానుష్ఠానకాలమందు జాతివర్ణాశ్రమాదులన్నియును తదాశ్రిత విధినిషేధములును ఆవిధుల నాచరించుటయు అనిషేధములను పరిత్యజించుటయు అంతయు గలదు. ఇట్టిచిత్తశుద్ధిసంపాదకకాలమునకే వ్యవహారదశ యని పేరు. ఈకాల మందు సాధకుడు అనృత, జడ, దుఃఖ, పరిచ్ఛిన్న మగుదేహాది కమును సత్య, జ్ఞాన, ఆనంద, అనంత మగుఆత్మను, ఒకదానితో నొక కలిపి వ్యవహరించును. ఈకలుపుటకే "అధ్యాస" యని పేరు.

ఇట్లు అధ్యాసతో కూడియున్నంతవరకు అది వ్యవహారదశ యనబడుచు జాతి, వర్ణాశ్రమాదిధర్మము లన్నియు వానిని నియమించు చుండును. ఇట్టి అధికారులకొరకే "బ్రాహ్మణో యజేత. న సురాం పిబేత్" ఇత్యాది విధినిషేధము లన్నియు ప్రవర్తించుచున్నవి. ఈ వ్యవహారదశయందలిజీవు లందరు తమదేహాదికమే తామని వ్యవహ రించుటయేగాక తమకంటె వేరగు దారపుత్రగృహక్షేత్రాదు లన్నియు తామే యని వ్యవహరించుచు వానిలో దేనికి లోటువచ్చినను తమకే లోటువచ్చినట్లు భావించుచు నిరంతరము దేహసౌఖ్యముకొరకు ధనే షణ, దారేషణ, పుత్రేషణాదితాపత్రయములతో విరామము లేక యుండి వ్యవహరింతురు. ఇట్టి వ్యవహారదశయందు జాతి కల్పించబడి దనియు, పారమార్థికదశయం దున్నజ్ఞానికి జాతి లేదనియు, పైశ్రుతికి ఉపక్రమోపసంహారాదులచే నిర్ణయింపబడిన తాత్పర్యార్థము. అంతే గాని పైశ్రుతిలో "వ్యవహారప్రకల్పితా" యనుపదమునకు లోకమందలి వ్యవహారముకొరకు తరువాతివారిచే కల్పింపబడినది యనునర్థ మెంత

మాత్రము గాదు. అట్టిఅర్థమును చెప్పుచో పై శ్రుతిలోని పూర్వా పరములకు ఎంతమాత్రము సందర్భము పొసగదు.

పైయధ్యాసకే "అవిద్య" యనిగూడ పేరు. ప్రతివానికిని అనృత జడదుఃఖపరిచ్ఛిన్న మగు దేహాదికమును సత్య, జ్ఞాన, ఆనంద, అనంత మగుఆత్మకును అత్యంతవిరుద్ధలక్షణము లుండగా నిట్టివిరుద్ధము లగు నీరెంటిని కలిపి ఏకముగా నెట్లు వ్యవహరింతురనగా నదియే వారల కందరకు అనేకజన్మలనుండి వచ్చుచున్న పుణ్యపాపకర్మఫలరూప మగునవిద్య. ఇదియే శుద్ధసత్వప్రధాన మగునపుడు అవిద్య యనియు, మలినసత్వప్రధాన మగునపుడు మాయ యనియు చెప్పబడును.

ముత్తముమీాద అదికానిదానియందు అది యనుబుద్ధిని పుట్టించుట దీనిస్వభావము.

ద్రవత్వ ముదకే వహ్నా వౌష్ణ్యం కాఠిన్య మశ్మని
మాయాయాం దుర్ఘటత్వం చ స్వత స్సిద్ధ్యతి నాన్యథా.

తా॥ నీటియందు ద్రవించుశక్తియు అగ్నియందు ఉష్ణస్వభావ మును రాతియందు కాఠిన్యమును ఎట్లు స్వభావసిద్ధములో అట్లే మాయయందు దుర్ఘటత్వముగూడ స్వభావసిద్ధమై యున్నది. అదియే యీజగత్తునందలి వైచిత్ర్యమునకు కారణ మగుచున్నది. ఇదియే జ్ఞాని దృష్టిలో లేనిదియు ఇంద్రజాలమువంటిదియు నగును.

ఏతస్మాత్కిమి వేంద్రజాల మపరం యద్గర్భవాసస్థితం
రేత శ్చేతతి హ స్తమ స్తకపదప్రోద్భూతనానాంకురమ్
పర్యాయేణ శిశుత్వయౌవనజరావేషై రనేకై ర్వృతం
పశ్య త్యత్తి శృణోతి జిఘ్రతి తథా గచ్ఛ త్యథాగచ్ఛతి.

తా॥ పురుషునిచే స్త్రీగర్భమం దుంచబడినస్వల్పపరిమితి గలరేతస్సు కాలక్రమముచే చేతులు, కాళ్ళు, శిరస్సు మొదలగు నవయవములు గలదై బాల్య, యౌవన, కౌమార, వార్ధకము లను వేషములను ధరించుచు చూచుట తినుట వినుట వాసనజూచుట వెళ్ళుట వచ్చుట మొదలగుక్రియల నాచరించుచుండుటకంటె గొప్ప

యింద్రజాలము లోకమం దెచ్చటనైనను గలదా! లేదు. కాని ఇది మాయావిచే నిర్మింపబడిన ఇంద్రజాలము లేక గారడీ. ఇదియే మనుష్యులవ్యవహారమునకేగాక పరమేశ్వరుని జగత్సృష్టికిగూడ హేతువగుచున్నది.

శ్రు॥ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి
సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి.

తా॥ ప్రళయకాలమందు సర్వజగత్కారణ మగు బ్రహ్మమొక్కటియే సత్యజ్ఞానానందరూప మయియుండగా పూర్వకల్పమందలి సర్వజీవులయొక్క పుణ్యపాపకర్మఫలరూప మగునవిద్య పరిపాకమును బొంది ఉద్బుద్ధముగాగా నందు ప్రతిబింబించిన బ్రహ్మచైతన్యమే ఈశ్వరుడు లేక అవ్యాకృతము లేక మాయోపహిత చైతన్యము లేక కామేశ్వరుడు- ఇత్యాదిగా ననబడును. అట్టికామేశ్వరుడు లోకముల నన్నిటిని అనగా సర్వజీవులను వారివారి కర్మఫలానుసారముగా సృజించి తానే యందు ప్రవేశించి బహురూపుడ నగుదునుగాక యని సంకల్పించెను. కావున ఈశ్వరునిజగత్సృష్టికిగూడ ఈమాయయే కారణ మగుచున్నది.

ఇట్లు సంకల్పమాత్రముచేతనే ఈశ్వరునకు కార్యసిద్ధి గలుగును. మనుష్యాదుల కట్లుగాక మనస్సంకల్పానంతరమందు వాచిక కాయికవ్యాపారాదులయనంతరము కార్యము సిద్ధించవచ్చును, సిద్ధించకపోవచ్చును. సిద్ధించినకార్యమందైనను వీరలశక్తి యీశ్వరానుగ్రహలబ్ధమైనదేగాని వీరలస్వతంత్రశక్తి గాదు.

ఇట్లు మనుష్యమాత్రులకేగాక ఇంద్రాగ్న్యాదిదేవతలకు గల సామర్థ్యముగూడ పరమేశ్వరాధీనమైనదేగాని వారివారిస్వశక్తిచే గల్గిన దెంతమాత్రము గాదని దృష్టాంతపురస్సరముగా నొకయాఖ్యాయిక కేనోపనిషత్తునం దిట్లు వినవచ్చుచున్నది.

శ్రు॥ బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే. తస్య హ బ్రహ్మణో
విజయే దేవా అమహీయంత. త ఐక్షంత అస్మాకమే వాయం
విజయః అస్మాకమే వాయం మహిమేతి—

తా॥ దేవతలకు రాక్షసులకు గల్గినయుద్ధమందు జగత్కారణ మగుపరబ్రహ్మము దేవతలకొరకు జయించెను. ఇట్లు బ్రహ్మము జయింపగా దేవతలు తమరాజ్యసుఖముల నొంది తమస్వశక్తి సామర్థ్యములచేతనే తా మీయుద్ధమందు జయించితిమనియు, తామే గొప్పవార మనియు తలచి గర్వించుచుండిరి.

శ్రు॥ తద్ధైషాం విజజ్ఞౌ, తేభ్యో హ ప్రాదుర్బభూవ. త న్న వ్యజానంత, కి మిదం యక్ష మితి.

తా॥ ఆపరబ్రహ్మము దేవతలయొక్క అజ్ఞానవిలసిత మగునట్టి గర్వమును గుర్తించి, వారలయహంకారమును పోగొట్టదలచినవాడై వారలముందట నొకానొకమహాభూతముగా ప్రాదుర్భవించెను. ఆ దేవత లీభూత మెద్దియో కనుగొనజాలకపోయిరి.

శ్రు॥ తేఽగ్ని మబ్రువన్. జాతవేద ఏత ద్విజానీహి. కి మేత ద్యక్ష మితి. తథేతి.

తా॥ అపు డాదేవతలందరు కలసి తమకు ఆయాయజమానుల యాగములలోనిహవిర్భాగములను తెచ్చియిచ్చుటద్వారా పెద్దవాడగు నగ్నిదేవునితో నాభూత మెద్దియో కనుగొనిర మ్మనిచెప్పగా నాత డందుల కంగీకరించెను.

శ్రు॥ త దభ్యద్రవత్. త మభ్యవదత్, కోఽసీతి. అగ్ని ర్వా అహ మస్మీ త్యబ్రవీత్. జాతవేదా వా అహ మస్మీతి.

తా॥ ఆయగ్ని యాభూతముకడ కతిత్వరితముగ జేరగానే యాభూత మీయగ్నిని "నీ వెవడ" వని ప్రశ్నింపగా నీయగ్ని "నేను అగ్నిదేవుడు జాతవేదుడు అనుపేళ్లు గలగొప్పదేవత" నని సగర్వముగా బదులు చెప్పెను.

శ్రు॥ తస్మిం స్త్వయి కిం వీర్య మితి. అపీదగ్ం సర్వం దహేయం య దిదం పృథివ్యామితి.

తా॥ అప్పు డాభూతము తిరిగి యగ్ని నిగూర్చి "అట్టి నీయందు గలసామర్థ్యాతిశయ మెట్టిది"ని ప్రశ్నింపగా నగ్నిదేవుడు "ఈ పరిదృశ్యమాన మగుపృథివ్యాదిలోకములందలి సర్వవస్తువులును నాదృష్టిలో అతిస్వల్పముగా కనుపించుచున్నవి అవసరమనితోచినపు డీస్థావరజంగమాత్మకమగుసర్వమును తగులబెట్టి భస్మమొనర్పగల" నని సగర్వముగా బదులువల్కెను.

శ్రు॥ తస్మై తృణం నిదధా వేత ద్దహేతి- తదుపప్రేయాయ సర్వజవేన- త న్న శశాక దగ్ధుం. స తతఏవ నివవృతే నైత దశకం విజ్ఞాతుం యదేత ద్యక్ష మితి.

తా॥ ఆ భూతరూపముతో నున్నబ్రహ్మ మాయగ్నిముందట నొకతృణము నుంచి "ఓఅగ్ని దేవుడా! ఈగడ్డిపరకను తగులపెట్టుము"ని పలుకగా నాయగ్నిదేవుడు తనసర్వశక్తిని ఆగడ్డిపరకపై వినియోగించియు నద్దానిని తగులపెట్టజాలక అచ్చోటినుండి లజ్జతో మరలి వచ్చి దేవతలకు "ఈభూత మెట్టిదో నేను తెలిసికొనజాలకున్నా" నని చెప్పెను.

శ్రు॥ అథ వాయు మబ్రువ న్వాయ వేత ద్విజానీహి కి మేత ద్యక్ష మితి. తథేతి.

తా॥ అంతట దేవత లందరును సర్వజీవులలో ఉచ్ఛ్వాసనిశ్వాస రూపముగా ప్రాణప్రదు డగుటచే ముఖ్యుడుగా పరిగణింపబడుచున్న వాయుదేవుని పిలిచి యాభూత మెట్టిదో వెళ్లి విచారించి కనుగొనిర మ్మనిపలుకగా నావాయు వందుల కంగీకరించెను.

శ్రు॥ త దభ్యద్రవత్. త మభ్యవద త్కోఽసీతి. వాయుర్వా అహ మస్మీ త్యబ్రవీ న్మాతరిశ్వా వా అహ మస్మీతి-

తా॥ అంతట నా వాయుదేవు డాభూతము నతిత్వరితగతిని సమీపింపగా నాభూత మా వాయువును "నీ వెవడ" వని ప్రశ్నించెను. అందుల కావాయువు "నేను గమనస్వభావము గలవాడ

నా౯టచే వాయు వనుపేరును అంతరిక్షమం దుండువాడ నగుటచే మాతరిశ్వ డనుపేరును గల్గియున్నవాడ" నని సగర్వముగా పలికెను.

శ్రు॥ తస్మిం స్త్వయి కిం వీర్య మితి- అపీదగ్ం సర్వ మాదదీయ య దిదం పృథివ్యా మితి.

తా॥ అంతట నాభూతము తిరిగి వాయువునుగూర్చి "నీయందలి సామర్థ్య మెట్టి"దని ప్రశ్నింపగా నావాయువు "ఈపృథివ్యాదిసకల లోకములును నాదృష్టికి బహుస్వల్పముగా కాన్పించుచున్నవి. నేను తలచుకొన్నచో ఈలోకముల నన్నిటి నొక్కమారు గ్రహించగల" నని సగర్వముగా బదులుచెప్పెను.

శ్రు॥ తస్మై తృణం నిదధా వేత దాదత్స్వేతి. త దుప ప్రేయాయ సర్వజవేన. త న్న శశా కాదాతుం. స తతఏవ నివవృతే, నైత దశకం విజ్ఞాతుం య దేత ద్యక్షమితి-

తా॥ అంతట నాభూత మావాయుదేవునిగర్వ మడంపదలచి యొకగడ్డిపరక నావాయువుముం దుంచి 'ఓ వాయుదేవుడా! ఈ తృణ మును గ్రహింపుమా' యని కోరగా నావాయు వాతృణమును సమీపించి తనసర్వశక్తులను వినియోగించియు దానిని గ్రహించుటకు చేతగాక లజ్జతో తిరిగి దేవతలయొద్దకు పోయి 'ఆభూత మెట్టిదో నే నెరుగజాలకున్నా' నని వారిలకు నివేదించెను.

శ్రు॥ అథేంద్ర మబ్రువన్. మఘవ న్నేత ద్విజానీహి కి మేత ద్యక్ష మితి. తథేతి త దభ్యద్రవ త్తస్మా త్తిరోదధే-

తా॥ అంతట దేవతలు తమకు ప్రభువగు ఇంద్రునితో నా భూత మెట్టిదో తెలిసికొనిర మ్మని పలుకగా నాయింద్రు డందుల కంగీకరించి యాభూతమును త్వరగా సమీపింపగా నాభూత మంత ర్ధానమై ఇంద్రునకు కనుపించనే లేదు.

శ్రు॥ స తస్మిన్నే వాకాశే స్త్రియ మాజగామ, బహుశోభ మానా ముమాం హైమవతీం- తాం హోవాచ కి మేత ద క్ష మితి-

తా॥ ఆ యింద్రుఁ డాభూతము తిరోధాన మొందినచోటనే యుండి ఏకాగ్రచిత్తముతో ఆభూతమునే ధ్యానించుచు ఆభూత మేమైయుండునా! యని మనస్సునందు విచారించుచుండగా నా యాకసమం దాయింద్రునకు ప్రపంచములోని శోభావంతము లగు పదార్థము లన్నిటికంటె మిక్కిలి అధికమైనశోభ గలిగి, బంగారు నగలతో నిండినసర్వదేహము గలిగి, ఉమ యనుపేరు గలయొక స్త్రీ రూపము గోచరించెను. అంత నింద్రు డా బ్రహ్మావిద్యారూపిణి యగు ఉమాదేవతను సవినయముగా చేరి భక్తినమ్రుడై తనకును తన పూర్వులగు అగ్నివాయువులకును గోచరించి ఇపుడు తిరోధానము నొందినభూత మెవ్వరని ప్రశ్నించెను.

శ్రు॥ సా బ్రహ్మేతి హోవాచ. బ్రహ్మణోవా ఏతద్విజయే మహీయధ్వ మితి- తతో హైవ విదాంచకార బ్రహ్మేతి-

తా॥ అంత నావిద్యారూపిణి యగునుమాదేవి బ్రహ్మమే యాభూత మనియు ఇటీవల యుద్ధములో జయమొందిన దీబ్రహ్మ శక్తియే యనియు అది తెలియక దేవత లగుమీ రీజయము మీ సామర్థ్యాతిశయముచే మీ ప్రయోజకత్వముచేతనే సిద్ధించినదని గర్వించుచుండగా మీ యీగర్వమును అజ్ఞానమును పోగొట్టుటకే బ్రహ్మ మీ భూతరూపములో వచ్చి మీకు బుద్ధిచెప్పిన దనియు, ఇంద్రునకు బోధించెను. అపు డాయింద్రు డాయుమాదేవివాక్యము లందు భక్తిశ్రద్ధలు గలవాడై విశ్వసించి బ్రహ్మమును తెలిసికొనెను.

శ్రు॥ తస్మాద్వా ఏతే దేవా అతితరామి వాన్యా న్దేవాన్ యదగ్ని ర్వాయు రింద్రః, తేహ్యేన న్నేదిష్ఠం పస్పర్శుః, తే హ్యేన త్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి-

తా॥ ఈకారణముచేత దేవతలందరిలోను అగ్ని, వాయువు, ఇంద్రుడు అనుముగ్గురుదేవతలును బ్రహ్మదర్శన, సంవాదాదులచే బ్రహ్మసామీప్యము నొందిరిగాన శ్రేష్ఠు లనబడుచున్నారు.

శ్రు॥ తస్మాద్వా ఇంద్రో౽తితరామి వాన్యా న్దేవాన్ స హ్యేన న్నేదిష్ఠం పస్పర్శ. స హ్యేన ప్రథమో విదాంచకార బ్రహ్మే॥

తా॥ ఈముగ్గురు దేవతలలోగూడ అగ్ని వాయువు లిద్దరును ఆబ్రహ్మసామీప్య సంవాదములను మాత్రమే పొంది ఆబ్రహ్మ జ్ఞానము నొందక కృతకృత్యులు గాకయే తిరిగివచ్చుటచేతను ఇంద్రుడు స్థిరబుద్ధితో నచట నే యుండి బ్రహ్మవిద్యారూపిణి యగునుమా దేవతా ధ్యానాదులద్వారా బ్రహ్మజ్ఞానమును సంపాదించి కృతార్థుడగుట చేతను, ఇంద్రుడే దేవత లందరిలోను శ్రేష్ఠుడును ప్రధానుడును అగుచున్నాడు.

ఈశ్రుతియందలి యాఖ్యాయికవలన దేవమనుష్యాదు లాయా కార్యములందు కృతకృత్యు లగుటకు, పరమాత్మశక్తియే కారణము గాని, స్వశక్తి యెంతమాత్రము గాదని తెలియుచున్నది. అదియు అందుకు తగినరీతి నీశ్వరారాధన మొనర్చినవారికి మాత్రమే తదారాధనానురూప మగుశక్తి మాత్రమే వచ్చునుగాని కొంచె మారాధించి ఎక్కువశక్తి రావలెనని కోరినవారికి వారికోరికకు తగినంతశక్తి రాజాలదు.

అట్టి ఈశ్వరుడే ఆయా దేశములందు ఆయా కాలములందు వేదోదితధర్మము ననుష్ఠించువారలు తక్కువగా నున్నపుడును అధర్మానుష్ఠాతలకు విఘ్నములను గలుగజేయువారు హెచ్చుగా నున్నపుడును అధర్మము ప్రబలినపుడు దానిని సంహరించుటకును, వేదార్థమును సంప్రదాయసిద్ధముగా ప్రవచన మొనర్చువారు తక్కువగానుండి వేదమునకు అపార్థములు కల్పనచేయబడుచుండునపుడును అవతరించి ఆయా కార్యములను నెరవేర్చునని భగవద్గీత విశదీకరించును.

## —♦ అ వ తా ర ల క్ష ణ ము ♦—

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥

అనుశ్లోకముచే పైయర్థము తెలియుచున్నది. కావున వేదము నకు వ్యతిరేక మగుసిద్ధాంతములను ప్రచారమొనర్చువా రవతారపురు షులని ఎంతమాత్రము తలచరాదు. మరియు కొందరు తమతమ దేహాదివ్యవహారము నెంతమాత్రము విడనాడక ధనేషణాది తాపత్ర యము నెంతమాత్రము సడలింపక అధ్యస్తాత్మభావముతో, వ్యవహార దశలోనే యుండి గూడ ఏవో కొన్ని ఉపనిషద్వాక్యములుమాత్రము నోటితో పలుకుచు తమ తమ వర్ణాశ్రమధర్మములను పరిత్యజించు చున్నారు. వీరలకు పరమార్థము లేక ఆముష్మికస్థితి యెట్లుండుననగా-

## —♦ స్వ ధ ర్మ త్యా గ ఫ ల ము ♦—

నైవ స్నానం, నాపి జపో, న పూజా, నాపి కీర్తనమ్
యథా తండులసంపర్కా న్నారికేళం వినశ్యతి.

తా॥ సకాలమున యథావిధిగా స్నాన మాచరింపనివారును సకాలమున తమతమ వర్ణానురూప మగుసంధ్యావందన మాచరింపని వారును తమతమవర్ణానురూపముగా అగ్నిదేవతారాధన మొనర్పని వారును వేదాధ్యయన మను బ్రహ్మయజ్ఞ మొనర్పనివారును ఆము ష్మికశ్రేయస్సు నెంతమాత్రము పొందక యధోలోకములపా లగు దురు. ఇందులకు దృష్టాంతమేమనగా కొబ్బరికాయలో బియ్యము కలిసినచో నయ్యది ఎట్లు నశించునో అట్లే వీరలుగూడ నశింతురు. నశించుటయనగా మనుష్యజన్మలోనుండి తిర్యగ్జంతుజన్మల నొందు టయే, అట్టిమహాపాతకముల నొనర్చుటచే తా నధోలోకములపా లగుటయేగాక తనకుల మంతయు చెడిపోయి కులధర్మము లన్నియు నశించి ఇంకను అనేకదోషములు పరంపరగా వచ్చును.

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత.

తా॥ కులము నశించినచో అనాదినుండి పరంపరగా వచ్చు కులధర్మము లన్నియు నశించును. దానివల్ల కులము నంతను అధర్మ మాక్రమించి క్రమింగివేయును. ఒకయింటికొకమూల నిప్పంటుకొనినచో

దానివలన ఆమూలమాత్రమేగాక ఆయి ల్లింతయు నెట్లు పూర్తిగా తగులబడునో యట్లే ఒకడు చేసినమహాపాతకమువలన వానికుల మంతయు నశించును; అనగా నరకములపా లగును. వారిపితృదేవత లందరు అధఃపతన మొందెదరు. అట్లే కాలమం దొకడు బ్రహ్మవేత్త యైనచో వానికుల మంతయు ఊర్ధ్వలోకముల నొంది క్రమముగా ముక్తు లగుదురు.

అధర్మాభిభవా త్కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః.

తా॥ ఇట్లు కులమంతయు అధర్మముచే నాక్రమించబడగా నా కులమందలిస్త్రీ లందరు పాతివ్రత్యాది స్త్రీధర్మములనుండి చెడుదురు. దానివలన ఆకులమందు వర్ణసంకరులు పుట్టుదురు. అపుడు శుద్ధమగు వానివర్ణము సంకరవర్ణ మగుననిభావము. అనగా వర్ణసంకరసంతాన మునకు నియతగుణసంపద యెంతమాత్రము నుండదని యర్థము. ఇట్లొక కులము చెడినపుడు వారిసంబంధులకులములును చెడును.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ
పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః.

తా॥ ఇట్టివర్ణసాంకర్యమువలన నాకులమునకును, కులనాశము నకు హేతువగువారలకును, నరకము తప్పక సంభవించును. అపు డాకులమందలి పి తలకు పిండదానముగాని ఉదకదానముగాని ఇచ్చువారు లేక వా రూర్ధ్వలోకములనుండి అధోలోకములపా లగుదురు.

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః.

తా॥ ఇట్టి వర్ణసంకరకారణములచే నాకులమందలి అనాది కాలమునుండి వచ్చుచున్న ధర్మములును జాతిధర్మములును నశించును. కావున శ్రుతిస్మృతులం దుపదేశింపబడిన తమతమ వర్ణాశ్రమోచిత

ధర్మముల నుల్లంఘించి స్వేచ్ఛగా సంచరించుచు మనుష్యులకు జీవితాంతమున శాశ్వతనరకవాసము తప్పదని శాస్త్రమువలన తెలియుచున్నది.

## —• బ్రాహ్మణ స్వభావము •—

ఇందు వర్ణధర్మము లనగా

శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవచ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్.

తా॥ పూర్వజన్మమందలి పుణ్యకర్మాతిశయవశముచే సత్వగుణాధిక్యము గలజీవులు బ్రాహ్మణదంపతులకు జన్మింతురు. అట్టివారికి పుట్టుకతోడనే

1 శమ మనగా అంతరింద్రియనిగ్రహము.

2 దమ మనగా బాహ్యేంద్రియనిగ్రహము.

3 తప స్సనగా స్వాధ్యాయాధ్యయన తదర్థజ్ఞాన తదుదిత ధర్మాచరణము.

4 శౌచ మనగా స్నానాదులచే బాహ్యమందును, జపాదులచే అంతఃకరణమందును నిర్మలత్వమును సంపాదించుట.

5 క్షాంతి యనగా ఆధ్యాత్మిక ఆధిదైవిక, ఆధిభౌతికాదివిఘ్నములెన్ని వచ్చినను వానిని సహించి, తనధర్మమును విడనాడకుండ ననుష్ఠించుట.

6 ఆర్జవ మనగా మనోవాక్కాయము లన్నిటియందును ఏకరీతి గలప్రవర్తన.

7 జ్ఞాన మనగా వేదశాస్త్రాధ్యయనముచే సంపాదింపబడిన పరోక్షబ్రహ్మజ్ఞానము.

8 విజ్ఞాన మనగా గురువులద్వారా శ్రవణమొనర్చి మనన నిదిధ్యాసలద్వారా అపరోక్షాత్మవిజ్ఞానమును సంపాదించుట.

9 ఆస్తిక్య మనగా లోకమందలి వ్యవహారము లన్నిటికి రాజాజ్ఞ ఎట్టి ప్రబలప్రమాణమో అట్లే తనకు సర్వవ్యవహారములందును వేద మొక్కటియే పరమప్రమాణ మనుస్థిరమైనవిశ్వాసము గల్గి యుండుట, అను నీతొమ్మిదిగుణము లుండును.

## —♦ క్షత్రియ స్వభావము ♦—

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్
దాన మీశ్వరభావ శ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్.

తా॥ పూర్వజన్మయందలి పుణ్యపాపకర్మసంఘాత పరిపాక వశముచే నీజన్మయందు క్షత్రియదంపతులకు జన్మించువారు పుట్టుక తోడనే

1 శౌర్య మనగా అధర్మమును శిక్షించుటయందు శూరభావము.

2 తేజ స్సనగా తనరాష్ట్రమందలిప్రజ లందరియందునుగల, ధర్మా ధర్మములను తెలిసికొనుట దుష్టులగుశత్రువుల నభిభవించుసామర్థ్య మును.

3 ధృతి యనగా ధైర్యము అనగా ధర్మమును రక్షించుటయందును అధర్మమును శిక్షించుటయందును ఎట్టివిఘ్నములు వచ్చినను వానిని ధైర్యముతో నెదుర్కొని తనకార్యమును సాధించుట.

4 దాక్ష్య మనగా తనధర్మమును నెరవేర్చుకొనుసామర్థ్యాతిశయము.

5 యుద్ధమందు పారిపోకుండుట.

6 దాన మనగా శాస్త్రీయదేశకాలపాత్రముల ననుసరించి తనద్రవ్య మును వినియోగించుచు అడిగినవానికి లేదనక ఇచ్చుట.

7 ఈశ్వరభావ మనగా తనరాజ్యములో ప్రజలందరును వేదప్రమా ణము ననుసరించి తమతమ ధర్మముల నాచరించునట్లు చేయుట అనునీ యేడుగుణములను గలియుందురు.

—♦ వై శ్య స్వ భా వ ము ♦—

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్.

తా॥ రజస్తమస్సు లెక్కువగా నుండుజీవులు వైశ్యదంపతులకు జన్మింతురు. అట్టివారు పుట్టుకతోడనే

1 కృషి యనగా భూమిలో ఆయాసస్యములు ఫలించుటకు తగిన ప్రయత్న మొనర్చుటయు,

2 గోరక్షణ మనగా పశువులను పోషించుటయు,

3 వాణిజ్య మనగా సమస్తవస్తువులను కొనుట అమ్ముటలయందు నైపుణ్యమును, అను నీమూడుగుణములు స్వభావముచేతనే గల్గియుందురు.

—♦ శూ ద్ర స్వ భా వ ము ♦—

ఇక తమోగుణమే ప్రధానముగా గలజీవులు, శూద్రదంపతులకు జన్మింతురు.

పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్

ఇట్టివారు పుట్టుకతోడనే పైమూడుజాతులవారికిని పరిచర్య యొనర్చి వారియనుగ్రహమునకు పాత్రులై వారివలన పురాణాదిప్రోక్తధర్మములను శ్రద్ధతో విని వాని నాచరించి తరించుటయం దాసక్తి గల్గియుందురు.

స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరత స్సిద్ధిం యథావిందతి తచ్ఛృణు.

తా॥ పైనాలుగుజాతులవారును తమ తమ ధర్మములను శాస్త్రీయముగా, నాచరించినచో సిద్ధిని పొందుదురు. ఇచట సిద్ధి యనగా, పుష్కలసిద్ధి యగుమోక్షమే. ఇద్దాని నొందుటకు బ్రాహ్మణ జాతిలో జన్మించినపరమహంసపరివ్రాజకులకు మాత్రమే యధికార మున్నది. ఇతరులు తమతమధర్మములను యథాశాస్త్రముగా నాచ

రించినచో వారుత్తరజన్మమందు ఉత్కృష్టజాతిలో జన్మించి, అప్పుడాజాతి కనువగుధర్మముల నాచరించి ఆపైజన్మలో నంతకంటె ఉత్కృష్ట మగుజాతిలో జన్మించి క్రమముగా పరమహంసాశ్రమమును స్వీకరించి మోక్షము నొందెదరు. ఇదియే యిట సిద్ధి యనబడును. ఇట్లు సిద్ధినొందుటకు హేతు విట్లు చెప్పబడినది.

యతః ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః.

తా॥ సర్వజీవులకును వారివారిపూర్వజన్మయందలి పుణ్యాపాప కర్మానుసారమగు నీజన్మయందలి ఉత్పత్తియు ప్రవర్తనయు సర్వజీవుల యంతఃకరణమందును అంతర్యామిరూపముగా నుండు ఏ యీశ్వరుని వలన కలుగుచున్నదో, ఏయీశ్వరునిచే నీబ్రహ్మాండ మంతయు వ్యాపింపబడియున్నదో, అట్టిఈశ్వరానుగ్రహము వలననే ప్రతిజీవుడును కార్యసిద్ధి నొందవలయును. ఈశ్వరానుగ్రహము కల్గుటకు సాధనము లనంతములు - జీవులును అనంతములు. గాని స్వేచ్ఛగా ప్రతివాడును ప్రతిసాధనమును అవలంబించినచో ఈశ్వరానుగ్రహము రాకపోగా ఈశ్వరాగ్రహము వచ్చును. ఎవడెవడు ఏయే సాధన మవలంబించినపుడు ఈశ్వరానుగ్రహము వచ్చునో అదియె వర్ణాశ్రమధర్మ మన బడును గాన సర్వవిధముల తమతమవర్ణమునకును ఆశ్రమమునకును తగిన ధర్మమును నాచరించియే ఈశ్వరానుగ్రహమును పొంది క్రమ ముగా ముక్తులు కావలెను.

ఇట్టివర్ణాశ్రమధర్మమే వేదమునందలి పూర్వకాండ మనబడు చున్నది. వేదమునందలి ఉత్తరకాండమె ఉపనిషత్తులని జ్ఞానకాండ మనియు చెప్పబడుచున్నది పదార్థరూప మగు ఈజ్ఞానకాండములోని సారము నంతను సంగ్రహముగా 67 శ్లోకములలో స్వాత్మప్రకాశికచే వివరింపబడుచున్నది.

# స్వాత్మప్రకాశిక

[ శ్రీ శంకర భగవత్పాదాచార్యకృతము ]

1 జగత్కారణ మజ్ఞాన మేకమేవ చిదన్వితమ్
ఏక ఏవ మనస్సాక్షీ జానా త్యేవం జగత్త్రియమ్.

తా॥ ఈపరిదృశ్యమాన మగుజగత్తున కంతకును సజాతీయ విజాతీయ స్వగతభేదము లేని చైతన్య ప్రతిబింబవిశిష్ట మగునజ్ఞానమే కారణమై యున్నది. సర్వజీవులమనోవృత్తుల కన్నిటికిని సాక్షి యగు నొక్కడే సర్వలోకములను వ్యాపించియున్నందున ముల్లోకములను గుర్తించుచున్నాడు. సామాన్యముగా పురాణాదులందు వేదాంతసారమును విని, కొలదిజ్ఞానము గలశిష్యుడు ప్రశ్నించుచున్నాడు.

2 వివేకయుక్తబుద్ధ్యాహం జానా మ్యాత్మాన మద్వయమ్
తథాపి బంధమోక్షాదివ్యవహారః ప్రతీయతే-

తా॥ శాస్త్రములం దచ్చటచ్చట చెప్పబడిన విషయములను వినగా గల్గినబుద్ధితో నేను అద్వితీయ మగునాత్మ యొక్కటే యున్నదని తలచుచున్నాను. కాని లోకమంతట జీవులు కొందరు ఊర్ధ్వలోకప్రాప్తికరము లగుసత్కర్మల నాచరించుటను మరికొందరు అధోలోకప్రాపకము లగుమహాపాపముల నాచరించుటను, ఏఒక్కరో వేదాంతవాక్యశ్రవణాదులను సర్వకర్మ సన్న్యాసపూర్వకముగా నొనర్చుటను చూచుచున్నాను.

3 వివర్తోపి ప్రపంచో మే సత్యవ ద్భాతి సర్వదా
ఇతి సంశయపాశేన బద్ధోహం భింధి సంశయమ్.

తా॥ భ్రాంతునకు భాసించు రజ్జుసర్ప మెట్లు రజ్జువునందు కల్పితమో మరుభూమియందు దుదక మెట్లు కల్పితభాసమానమో యట్లే అద్వితీయబ్రహ్మమం దీప్రపంచమంతయు కల్పిత మని వినియుంటిని.

కాని నాకు సర్వకాలసర్వావస్థలందును ఈజగత్తు యథార్థమైనదిగానే భాసించుచున్నది. కాన ఓ సద్గురుస్వామీ! ఈనా సందేహమును పోగొట్టి నన్నిపాశబంధమునుండి విడిపింపుము.

4 ఇతి శిష్యవచ శ్శ్రుత్వా గురు రాహోత్తరం స్ఫుటమ్
నాజ్ఞానం, నచ బుద్ధిశ్చ న జగ న్నచ సాక్షితా.

తా॥ ఇట్లు సవినయముగాను శాస్త్రీయముగాను గురూపసదన మొనర్చిన శిష్యుని గాంచి అపరోక్షాత్మసాక్షాత్కారము నొందినగురు విట్లాశిష్యునకు స్పష్టముగా నుపదేశించుచున్నాడు. ఓ శిష్యా! పరమార్థదశయందు నీవు చెప్పినట్లు అజ్ఞానముగాని, బుద్ధిగాని, జగత్తుగాని సాక్షిమాత్రుడుగా నుండుటగాని ఎంతమాత్రమును లేదుసుమా- అజ్ఞానావస్థయందు మిథ్యయగు దేహేంద్రియసంఘాతమా యావిషయప్రసక్తమై యుండునపుడుగదా మనస్సు ఆయా విషయముల నాలోచించి సంకల్పించుట! అపుడుగదా అట్టిమనోవృత్తులకును ఇంద్రియవృత్తులకును సాక్షిగా నుండుట! దేహాదికమే మిథ్య యనుజ్ఞానము రూఢమైనపుడు ఇక సాక్షిప్రసక్తి ఏముండును? గాన దేహాదికము ద్వారా ఆత్మను నీకు బోధించుటకు సాక్షి యని చెప్పబడినది గాని వాస్తవముచే నాత్మకు సాక్షిత్వధర్మ మెంతమాత్రమును లేదు.

5 బంధమోక్షాదయ స్సర్వే కృతా స్సత్యేఽద్వయే త్వయి
భాతీ త్యుక్తే జగ త్సర్వం సద్రూపం బ్రహ్మ తద్భవేత్.

తా॥ అద్వితీయమును నీ నిజరూపము నగునాత్మయందు దేహాదిక మధ్యస్తమైనపుడు జాతి, వర్ణ, ఆశ్రమాదులును, విధినిషేధశాస్త్రములును, బంధమోక్షములును కల్పింపబడినవి. నీ స్వరూపజ్ఞానము నీకు కలిగినపుడు నీ వఖండచైతన్యప్రకాశముతో వెలుగొందు బ్రహ్మ వగుటచే నీదేహాదికమే గాక దానితోబాటిజగ మంతయు సచ్చిదానందబ్రహ్మరూప మగునీరూపమే యగుచున్నది.

6 సర్పాదౌ రజ్జుసత్తేవ బ్రహ్మసత్తైవ కేవలమ్
ప్రపంచాధారరూపేణ వర్తతే త జ్జగ న్నహి.

తా॥ అదెట్లనగా ఒకరజ్జువును జూచి సర్పమని భ్రాంతినొందిన వానికి ఆభ్రాంతికాలములోనిసర్పమే యథార్థజ్ఞాన మగురజ్జుస్వరూప మును తెలిసికొనినతరువాత రజ్జు వగుట లోకసిద్ధమేగదా! అపుడు వాడు 'నేను భ్రాంతికాలములో దేనిని సర్పమని తలచితినో ఇపుడదియే రజ్జువైనది'. యని ఎట్లుతలచునో అట్లే అజ్ఞానులై అనాద్యవిద్యావాస నచే దేహాత్మధ్యానతో నొప్పుపామరులు దేనిని విచిత్ర మగుజగ త్తుగా తలతురో వారే బ్రహ్మవిద్యాశ్రవణాదులచే నపరోక్షాత్మజ్ఞాను లైనపుడు అద్దానినంతను స్వస్వరూప మగుబ్రహ్మముగా తలంతురు.

7 యథేక్షు మభిసంవ్యాప్య శర్కరా వర్తతే తథా
ఆశ్చర్యబ్రహ్మరూపేణ త్వం వ్యాప్నోసి జగత్త్రియమ్.

తా॥ ఒక చెరుకుగడ నామూలాగ్రముగా నెట్లు తన్మధురరసము వ్యాపించియున్నదో యట్లే సర్వజగమును నీ వాత్మరూపముతో వ్యాపించియున్నావు. ఎంత ఆశ్చర్యము! ఆ చెరుకుగడ ఎట్లు మధుర రసముకంటె వేరుగాదో యట్లే జగత్తు నీనిజరూప మగుబ్రహ్మము కంటె వేరుగా లేదు.

8 మరుభూమౌ జలం సర్వం మరుభూమాత్రమేవ తత్
జగత్త్రియ మిదం సర్వం చిన్మాత్రం సువిచారతః.

తా॥ ఊసరక్షేత్రమున (చవిటినేలను) దూరమునుండి చూచు మూఢులకచట ఉదక మున్నట్లు భ్రాంతి కలుగును. విచారించి చూడగా వా డదివరలో భ్రాంతిచే తలచినజల మంతయు ఊసరక్షేత్ర మాత్రమే ఎట్లగునో అట్లే భ్రాంతులకు భాసించు ఈ విచిత్రజగ మంతయు ఆత్మవిచారమొనర్చగా చైతన్యమాత్ర మగుబ్రహ్మమే యగును.

9 బ్రహ్మాది స్తంబపర్యంతాః ప్రాణిన స్త్వయి కల్పితాః
బుద్బుదాదితరంగాంతా వికారా స్సాగరే యథా.

తా॥ నీళ్ళయందు పుట్టు బుడగలు నురుగు తరంగములు మొద లగునవి ఎట్లు సముద్రమునందలి జలవికారములై ఒకప్పు డొకచోటనుండి

మరియొకప్పుడు మరొకపోనుండి నశించుచు, సముద్రముకంటె నెట్లు భిన్నములైనవి గావో యట్లే యీయాత్మరూపమందు స్థావరజంగమాత్మకమును, అతలాది సత్యలోకపర్యంతము నగుపిజగమంతయు కల్పింపబడి బ్రహ్మాత్మకంటె ఎంతమాత్రమును భిన్నము గాదు.

10 తరంగత్వం ధ్రువం సింధు ర్న వాంఛతి యథా తథా
విషయానందవాంఛా తే న మహానందరూపతః.

తా॥ ఉదాహరణమం దధిష్ఠాన మగుసముద్ర మెట్లు బుడగలను నురుగును తరంగములను తనయందు కలుగవలెనని నిజముగా కోరుట లేదో, యట్లే నీయాత్మకూడ నాయాఇంద్రియములతో ననుభవింపబడువిషయానందముల నెంతమాత్రము కోరుటలేదు. నీయాత్మయే పరమానందరూపముగాన విషయానందము లన్నియు తల్లేశములే యైనందున విషయానందవాంఛ ఎంతమాత్రము పొసగదు.

11 పిష్టం వ్యాప్య గుడం యద్వ న్మాధుర్యం నహి వాంఛతి
పూర్ణానందో జగ ద్వ్యాప్య తథానందం న వాంఛతి.

తా॥ బెల్లముతో కలియుని పిండి మాధుర్యము నెట్లు తనకు కావలెనని కోరదో, యట్లే సమస్తబ్రహ్మాండమును వ్యాపించియున్న యానందరూపమగు బ్రహ్మాత్మ ఎట్టివిషయసుఖములను కోరదు.

12 దారిద్ర్యాశా యథా నాస్తి సంపన్నస్య తథా తవ,
బ్రహ్మానందనిమగ్నస్య విషయాశా న సంభవేత్॥

తా॥ కోటీశ్వరున కెట్లు దారిద్ర్యము కావలయు ననుకోరిక యుండదో, యట్లే సంపూర్ణానందరూపుడ వగునీయాత్మకుగూడ విషయవాంఛ యుండదు. ఐశ్వర్యమునకు దారిద్ర్య మెట్లు విరుద్ధమైనదో బ్రహ్మభావమునకు విషయవాంఛ యట్లు విరుద్ధమైనదని తాత్పర్యము.

13 విషం దృష్ట్వాఽమృతం దృష్ట్వా విషం త్యజతి బుద్ధిమాన్
ఆత్మానమపి దృష్ట్వా త్వం త్యజానాత్మాన మాదరాత్.

తా॥ విషము చంపుననియు అమృతము బ్రతికించుననియు తెలిసికొన్న బుద్ధిమంతుడు ఆవిషామృతములు రెండును ఉన్నను అందమృతమునుమాత్రము పరిగ్రహించి విషము నెట్లు పరిత్యజించునో, యట్లే నీవుగూడ జననమరణ ప్రవాహరూపమై సంసారహేతు వగు దేహాత్మభ్రాంతిని ఎదలి జననమరణనివర్తక మగు సత్య, జ్ఞాన, అనంత, ఆనంద, రూప మగుబ్రహ్మమే నీయాత్మరూపమని తెలుపుజ్ఞానమును పరిగ్రహింపుము.

14 ఘటావభాసకో భాను ర్ఘటనాశే న నశ్యతి।
దేహావభాసక స్సాక్షీ దేహనాశే న నశ్యతి–

తా॥ దేహమే నీ నిజరూప మైనచో దేహము నశించగానే నీవు నశింతువు. అట్లైనచో పుట్టుకలోనే కొందరు గ్రుడ్డి కుంటి మొదలగువికలాంగులై పుట్టుచున్నారే; వార లట్లు పుట్టుటకు కారణమేమి? కర్మఫలమైనచో జాతమాత్రున కీజన్మలో నపుడు కర్మఫల మేమున్నది? కాన నవశ్యము పూర్వజన్మయందలికర్మఫలమని యంగీకరింపక తప్పదు. అట్లైనచో పూర్వజన్మయందు దేహమే తానైనవాడు చచ్చెనుగదా! వానికర్మ మె ట్లీజన్మలోని కనువృత్త మాయెను? కావున ఈదేహమే తానుగాక మరియొక టెద్దియో గలదనియు అది దేహము నశించినపుడు నశింపకయుండి ఆదేహముతో నొనర్చినపుణ్యాపాపములను మరియొకజన్మలో ననుగత మొనర్చుననియు అవశ్య మంగీకరింపక తప్పదుగదా! ఇది నీచక్షురాదీంద్రియగోచరము గానిదియు నీబుద్ధికి గోచరము గానిదియు నగుటచే నిట శాస్త్రోపదేశమును విశ్వసించుటకంటె గత్యంతరము లేదు. శాస్త్ర మిట్లు చెప్పుచున్నది. ఘటపటాదిపదార్థముల నన్నిటిని సూర్యుడు ప్రకాశింపజేయుచున్నట్లు మన కందరకు తెలియును. ఆఘటాదులు నశించినచో సూర్యుడుగూడ నాశమొందునా? ఎన్నటికి నశింపడు. అట్లే ఈదేహాదికమును ప్రకాశింపజేసి ఆయాఇంద్రియవ్యాపారముల నొనరింపజేయుచు సాక్షిగా నుండునాత్మ దేహము నశించినపుడు నశింపడు.

15 నిరాకారం జగత్సర్వం నిర్మలం సచ్చిదాత్మకమ్
ద్వైతాభావాత్కథం కస్మాద్భయం పూర్ణస్య మే వద.

తా॥ అట్టిసాక్షి లేనిచో దేహ మొకక్షణకాలముగూడ నుండ నేరదు. అట్టిసాక్షి సర్వజీవదేహములను వ్యాపించియున్నందున సర్వ వ్యాపకము. సాక్షిమాత్రుడేగాన ఆనందరూపుడు. దేహాదులకు విలక్షణు డైనందున నశింపకపోవుటచే సత్యరూపుడు. సర్వాంతఃకరణములకు ప్రేరకుడుగాన జ్ఞానరూపుడు, చైతన్యరూపుడును. కావుననే ఎట్టి ఆకారము నియతిముగా లేనివాడును. ఉపాధికే మాలిన్య ముండును గాని సాక్షి కుండదుగాన నిర్మలుడు నయియున్నాడు. ఇట్టి ఆత్మకంటె వేరుగా జగత్తు లేనందున సర్వత్ర పూర్ణముగా నిండియున్న యీ యాత్మ కెవరివలన భయ ముండునో చెప్పుము? అనగా ఒకనికి రెండవ వానివలనగదా భయ ముండుట - రెండవవస్తువే లేనపుడు భయ ముండదని భావము.

16 బ్రహ్మాదికం జగత్సర్వం త్వయ్యానందే ప్రకల్పితమ్
త్వయ్యేవ చ విలీనం హి జగత్తత్త్వం కథం వద.

తా॥ కావున నానందరూపుడ వగునీయాత్మరూపమందు, చతుర్ముఖాది పిపీలికాంత మగుజగత్తంతయు పరికల్పింపబడినది. ఇయ్యది అధిష్ఠాన మగుబ్రహ్మమందే లయమగును. ఎట్లనగా రజ్జువును జూచి సర్ప మనుభ్రాంతిజ్ఞానము నొందినవాని కాసర్పము ఆరజ్జువునందే జనించెను. ఆక్షణము మొదలతనికి యథార్థ మగురజ్జుస్వరూపజ్ఞానము గలుగువరకు ఆసర్ప మారజ్జువునందే స్థితి గల్గియున్నది. యథార్థ జ్ఞానము గల్గినక్షణములో నాసర్ప మారజ్జువులోనే లయ మొందినది. ఇట్లాసర్పముయొక్క సృష్టిస్థితిలయములు మూడును ఎట్లు అధిష్ఠాన మగురజ్జువు కారణముగా గలవియో యట్లే ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములు మూడును బ్రహ్మమే కారణముగా గలవి - ఇపుడు జగత్తుయొక్క యథార్థభావ మెట్టిదో చెప్పుము?

17 నహి ప్రపంచో నచ భూతజాతం
న చేంద్రియం ప్రాణగణో న దేహః
న బుద్ధిచిత్తం న మనో న కర్తా
బ్రహ్మైవ సత్యం పరమాత్మరూపమ్.

తా॥ ఈ పరిదృశ్యమాన మగుప్రపంచముగాని ఈచరాచర జీవులుగాని చక్షురాదీంద్రియములుగాని ప్రాణాపానాదివాయువృత్తులుగాని ఈ దేహముగాని బుద్ధిగాని చిత్తముగాని మనస్సుగాని ఆయాకార్యములలో ఆత్మకు కర్తృత్వముగాని, వాస్తవము గాదు. ఒకానొక కాలమందు కొందరికిమాత్రమే అగుపడుచు నశించునట్టివి – ఒక్క పరబ్రహ్మమాత్రమే సత్యమై పైఅన్నిరూపములుగా భాసించుచున్నది.

18 సర్వం సుఖం విద్ధి సుదుఃఖనాశాత్
సర్వం చ సద్రూప మసత్యనాశాత్
చిద్రూపమేవ ప్రతిభానయుక్తం
తస్మా దఖండం పరమాత్మరూపమ్.

తా॥ ఈప్రపంచమందలిదుఃఖము లన్నియు దేహాది అంతఃకరణ పర్యంత మగుసంఘాతమునకేగాని యాత్మ సుఖరూపముగాన దానికెంతమాత్రము దుఃఖము లేదుగాన, దేహాదులందు తాదాత్మ్యబుద్ధి పోయినవానికి ఆనందమేగాని దుఃఖలేశముగూడ లేదనిభావము. అట్లే నశించుచు నసత్యములైనవి దేహాదులేగాన ఆత్మ సర్వకాలసర్వావస్థలందును ఏకరీతిగా నుండుసత్యమైనది. ప్రతిజీవుడును చక్షురాదీంద్రియములద్వారా పొందురూపాదివిజ్ఞానము, ఆయాపదార్థాదిరూపము నొందినయాత్మచైతన్యభావమేగాని యయ్యాది చక్షురాదీంద్రియములస్వరూపధర్మముగాని ఘటాదిపదార్థములస్వరూపధర్మముగాని ఎంతమాత్రము గాదు. ఇక అంతరింద్రియ మగుమనస్సుగూడ నీచక్షురాది తుల్యకోటిలోనే పడును. ఏలననగా పూర్వదృష్ట మగుకాశీక్షేత్రమును ఇపుడు మనస్సు స్మరించగా ఆమనస్సుకంటె ముందుగానే వానియాత్మచైతన్య మాకాశీక్షేత్రముగా భాసించుచు వానిమనోవిషయ మగు

టచే మానసికస్మరణాదిజ్ఞానములకు ఆత్మచైతన్యమే కారణమగుచు న్నది. అందుచే నీపరమాత్మరూపము ప్రతిజీవాపేక్షయా విభజింప వీలులేనట్టి అఖండమైనది, స్వప్రకాశమైనది.

19 చిదేవ దేహాస్తు చిదేవ లోకాః
చిదేవ భూతాని చిదింద్రియాణి
కర్తా చిదంతఃకరణం చిదేవ
చిదేవ సత్యం పరమార్థరూపమ్-

తా॥ చైతన్యము దేహధర్మమైనచో మృతదేహమునకు గాన వచ్చుట లేదుగాన దేహధర్మ మెంతమాత్రము గాదు - లోకములు ప్రళయకాలమందు లేవుగనుక వానికి చైతన్యము ధర్మము గాదు. జను లివ్వేళ నుండి రేపు కనుపించుట లేదు గాన చైతన్యము జనుల ధర్మము గాదు. ఆకాశాదిపంచభూతములు, జడములుగా నున్నందు వలనను భూమ్యాదులు ఉదకాదితమతమకారణములందు లయమొం దుచున్నందువలనను చైతన్యము పంచభూతధర్మము గాదు. ఇంద్రి యము లగుచక్షురాదులకు సుషుప్త్యవస్థయందు చైతన్య మగుపడుట లేదుగాన చైతన్య మింద్రియధర్మము గాదు. అంతఃకరణముగూడ నిద్రా సుషుప్తియందు నిశ్చేతనముగా నున్నందున చైతన్య మంతఃకరణ ధర్మము గాదు. కావున చైతన్య మనునది పైయన్నిటికిని అధిష్ఠాన మగుబ్రహ్మరూపమే. అదియే సర్వకాలసర్వదేశసర్వావస్థలందును ఏక రీతిగాను సత్యముగాను ఆనందరూపముగాను ఉండు నీఆత్మరూపము.

20 న మే బంధు, ర్న మే ముక్తి, ర్న మే శాస్త్రం, న మే గురుః
మాయామాత్రవిలాసో హి మాయాతీతోఽహ మద్వయః.

తా॥ ఇట్టియాత్మవేత్త నగునాకు బంధముగాని మోక్షముగాని శాస్త్రముగాని గురువుగాని లేనేలేరు. నేనే సర్వజగద్రూపుడను, జగ త్తుగాని బంధమోక్షాది శాస్త్రముగాని గురువుగాని ఇవన్నియు అవి ద్యావస్థయం దుండునుగాని పరమార్థదశయందు లేవు.

21 రాజ్యం కరోతు విజ్ఞానీ, భిక్షా మటతు నిర్భయః.
దోషైర్న లిప్యతే శుద్ధః, పద్మపత్ర మివాంభసా-

తా॥ ఇట్టిజ్ఞాని యగువాడు, మనుష్యసుఖమునకు పరమావధి యగు సమస్త భూమండలాధిపత్యము లభించినను సంతోషింపడు దుఃఖమునకు పరమావధి యగుభిక్షాటన చేయవలసినను దుఃఖింపడు. అతడు నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావు డగుటచే తామరయాకు నీటి కెట్లు అంటకయుండునో యట్లే ప్రాపంచికసుఖదుఃఖములతో నంటకయుండును.

22 పుణ్యాని పాపకర్మాణి స్వప్నగాని న జాగ్రతి
ఏవం జాగ్రత్పుణ్యపాపకర్మాణి నహి మే ప్రభోః.

తా॥ స్వప్నావస్థయందలి పుణ్యకర్మలుగాని పాపకర్మలుగాని యాజీవుని జాగ్రద్దశలో నెట్లు స్పృశింపవో యట్లే బ్రహ్మవేత్త కెట్టి పుణ్యాపాపసంబంధము నుండదు. కాన స్వప్న మెట్టియధార్థమో ప్రాపంచికవ్యవహార మట్టిదని బ్రహ్మవేత్త భావించును

23 కాయః కరోతు కర్మాణి వృథా వా గుచ్యతా మిహ
రాజ్యం ధ్యాయతు వా బుద్ధిః పూర్ణస్య మమ కా క్షతిః?

తా॥ బ్రహ్మవేత్త జగత్తునుగూర్చి యిట్లు తలచును. "శరీర మాయాపనులను చేయుగాక; వాక్కు దానికి వచ్చినట్లు మాట్లాడుగాక; బుద్ధి రాజ్యాదికమును ధ్యానించుగాక; సర్వవ్యాపక మగు బ్రహ్మానందమం దున్న నాకు పైవానితో నేమిసంబంధ మున్నది?" యని. కాన బ్రహ్మవేత్త క్షుత్పిపాసాదులకై దేహవ్యాపార మొనర్చుచున్నాడని ఇతరు లనుకొనవలసినదేగాని ఆయనకు దేహభావ మెంతమాత్రము నుండదనిభావము.

24 ప్రాణా శ్చరంతు తద్ధర్మైః కామై ర్వా హన్యతాం మనః
ఆనందామృతపూర్ణస్య మమ దుఃఖం కథం భవేత్?

తా॥ ఆబ్రహ్మవేత్తయొక్క జగద్విషయక చింతనమే ఈశ్లోకముచేగూడ చెప్పబడుచున్నది.

"ప్రాణాపానాదివాయువిశేషము లన్నియు తమతమవృత్తులను నెరవేర్చుచుండుగాక, మన స్సాయాకోరికలను కోరుచు దుఃఖించుగాక. బ్రహ్మానందానుభవము నొందుచున్న నాకు పైప్రాణమనస్సులతో నెట్టిసంబంధము లేనందున నా కెట్టిదుఃఖలేశముగూడ లేదు.

25 ఆనందాంబుధిమగ్నోసౌ దేహే తత్రి న దృశ్యతే
లవణం జలమధ్యస్థం యథా తత్ర లయంగతః.

తా॥ ఆబ్రహ్మవేత్త సర్వాత్మభావము నొంది ఆనందరూపుడై యున్నందున ఆవానిపూర్వదేహమందుమాత్రమే లేడు. అవిద్యాగ్రస్తు లందరును తమదేహములందుమాత్రమే యుందురు. ఈబ్రహ్మవేత్త సమస్తబ్రహ్మాండమందు నుండును. ఇందుల కుదాహరణమేమనగా ఉప్పు సముద్రమం దున్నపుడు సముద్రోదకమంతటిలోను లయమొందియున్నది. బయటకు వచ్చినపుడుమాత్రము లవణకణ మగుచున్నది. ఈదృష్టాంతముచే సముద్రోదకతుల్యుడు బ్రహ్మవేత్తయు, లవణకణములతో తుల్యు లీజీవు లనియు తెలియదగినది.

26 ఇంద్రియాణి మనఃప్రాణా అహంకారః పరస్పరమ్
జగత్సంగతి ముత్సృజ్య మగ్నా మయి చిదర్ణవే.

తా॥ ఆబ్రహ్మవేత్తయుక్క దేహమును ఇంద్రియములును మనస్సును ప్రాణాదులును అహంకారము మొదలగున వన్నియు పాంచభౌతిక మగుజగత్తుతో సంబంధమును వదలి చైతన్యరూపుడగు నీబ్రహ్మాత్మయందు లీనమగుచున్నవి.

27 ఆత్మాన మంజసా వీక్ష్య త్వజ్ఞానం ప్రపలాయితమ్
కర్తృత్వ మద్య మే నష్టం కర్తవ్యం వాపి న క్వచిత్.

తా॥ ఈఆత్మవేత్త స్వస్వరూపముతో నున్నట్లు గుర్తించిన తరువాత వీనినుండి అంతకుముం దనేకజన్మలనుండి అనుగత మగుచున్న

యజ్ఞానము భయముతో చాలదూరమునకు పారిపోయెను. కానతనకు కర్తృత్వముగాని చేయదగినకార్యముగాని యెంతమాత్రమును లేదు- అని యతఁడు తలచును.

28 చిదమృతసుఖరాశౌ చిత్తఫేనం విలీనం
ప్రియ మధిగతరూపో వృత్తిచంచత్తరంగః
స్తిమితసుఖసముద్రో నిర్విచేష్ట స్సుపూర్ణః
కథ మిహ మమ దుఃఖం సర్వదైకోఽహ మస్మి

తా॥ "ఉదకముమీఁద నుండు నురు గెట్లుదకమందు లయమగునో యట్లు నాచిత్తము చైతన్యమందు లయమాయెను. తరంగములు సముద్రోదకమందువలె, అంతఃకరణవృత్తులన్నియు నాచైతన్య స్వరూపమందు లయమాయెను. నే నిపుడు నురుగు, బుడగలు, తరంగములు మొదలగువికారములు లేని, స్తిమితసముద్రమువలె, ఆనందరూపముతో నుంటిని. సర్వలోకములనువ్యాపించి నిండియుంటిని. ఇట్టినాకు దుఃఖ మెట్లుగలుగును?" అని బ్రహ్మవేత్త యనుకొనును.

29 ఆనందరూపోఽహ మఖండబోధః
పరాత్పరోఽహం ఘనచిత్ప్రకాశః
మేఘా యథా వ్యోమ నచ స్పృశంతి
సంసారదుఃఖాని న మాం స్పృశంతి.

తా॥ "నే నిపు డానందరూపుడను. అద్వితీయజ్ఞానరూపుడను, దేహాదిజగత్తు కంతకు నధిష్ఠానరూపుడను. స్వయంప్రకాశక చైతన్య రూపుడను. ఇట్టినన్ను, మేఘము లాకసమునువలె సంసారదుఃఖము లెవ్వియు స్పృశింపజాలవు.

30 అస్థిమాంసపురీషాంత్రచర్మలోమసమన్వితః
అన్నోత్థస్థూలదేహాంత స్తమోఽహం శుద్ధచిద్ఘనః.

తా॥ ఎముకలు, మాంసము. మూత్రము, పేగులు, చర్మము, వెండ్రుకలతో నొప్పి, అన్నముచే నేర్పడినస్థూలదేహాదిసంఘాతము లన్నిటికిని, నే నంతర్యామినై శుద్ధచైతన్యమూర్తినై యున్నాను.

31 స్థూలదేహాశ్రితా ఏతే స్థూలా ద్భిన్నస్య మే నహి
లింగం జడాత్మకం నాహం. చిత్స్వరూపోహ మద్వయః.

తా॥ ఈ వెనుక చెప్పిన అస్థిమాంసాదులన్నియు స్థూలదేహము నాశ్రయించినవి. నే నట్టిదేహముకంటె భిన్నుడనుగాన. నా కాయస్థి మాంసాదులతో నెట్టిసంబంధమును లేదు. స్వప్నావస్థ ననుభవించు లింగదేహము (సూక్ష్మదేహము) స్వతంత్రముగా జడమైనందునను, నేను, చైతన్యరూపుడ నైనందునను, నేను సూక్ష్మదేహ మెంత మాత్రము గాదు.

32 క్షుత్పిపాసాంధ్య బాధిర్య కామక్రోధాదయోఽఖిలాః
లింగదేహాశ్రితా ఏతే నైవాలింగస్య మే విభోః.

తా॥ ఆకలి, దప్పిక, గ్రుడ్డితనము, చెవుడు, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము మొదలగునవన్నియు, లింగదేహధర్మములుగాన నాకు వానితో నెట్టిసంబంధమును లేదు.

33 అనాద్యజ్ఞానమే వాత్ర కారణం దేహ ఉచ్యతే;
నాహంకారో న దేహోపి స్వప్రకాశో నిరంజనః.
జడత్వప్రియ మోదత్వధర్మాః కారణ దేహగాః
న సంతి మమ నిత్యస్య నిర్వికారస్వరూపిణః.

తా॥ పోనీ కారణదేహమే నేనని తలచేయెడల అనేకజన్మల నుండియు జీవుని ననుగమించుచున్నయవిద్యయే కారణదేహ మనబడును అట్టిఅవిద్యచేతనే అహంకార మను ప్రథమాధ్యాస ఏర్పడుచున్నది. కారణదేహ మగునజ్ఞానమైనను జడమైనది. దుఃఖరూపమైనది. దానికి ప్రియ మనునదియే శిరస్సు. మోద మనునది దక్షిణభాగము. ప్రమోద మనునది యుత్తరభాగము. ఆనందమే మధ్యదేహము. దీనికి ప్రతిష్ఠ యనగా నాధారము; లేక యధిష్ఠానము బ్రహ్మమే. నేను అధ్యాస లేనివాడను. చైతన్యరూపుడను. సుఖరూపు

డను. గాన నే నట్టికారణదేహ మెంతమాత్రము గాక దాని కధిష్ఠాన మగుబ్రహ్మమే నైతిని అనియిట్లు నిశ్చయముతో నుండువాడే బ్రహ్మవేత్త యనబడును.

34 జీవాద్భిన్నః పరేశోస్తి పరేశత్వం కుతస్తవ ?
ఇత్యజ్ఞజనసంవాదే విచారః క్రియతేధునా.

తా॥ కించిద్జ్ఞత్వాది లక్షణుడగు జీవుడు పరతంత్రుడు. సర్వజ్ఞత్వాది లక్షణు డగు నీశ్వరుడు స్వతంత్రుడు. గావున "తత్త్వమస్యాది" వాక్యముల బట్టి యాజీవేశ్వరుల కైక్యమెట్లు పొసగును ? అనెడి భేదవాదులగు అజ్ఞానుల పూర్వపక్షమునకు సమాధానము జెప్పుటకై జీవపరమాత్మ తత్త్వవిచార మిపుడు చేయబడుచున్నది.

35 అధిష్ఠానం చిదాభాసో బుద్ధి రేతత్త్రయం యదా
అజ్ఞానా దేకవద్భాతి జీవ ఇత్యుచ్యతే తదా.

తా॥ ఒకరజ్జువును సర్పముగా భ్రమించినట్లు నిర్విశేష (కూటస్థ) చైతన్యమునే సాభాసాంతఃకరణముగా భ్రమించి; ఆచైతన్యరూపాధిష్ఠానమునున్ను; దానియందు దోచిన బుద్ధినిన్నీ; ఆబుద్ధియందలి చిదాభాసునిన్నీ కలిపి యాసాభాసాంతఃకరణాధిష్ఠానచైతన్యమునే కించిద్జ్ఞత్వాదిలక్షణు డగుజీవుడని వ్యవహరింతురు. ఇదియే అహం (నేను) అనుపదమునకు రూఢ్యర్థము. ఇదియే ప్రథమగ్రంథిరూపము, అన్యోన్యాధ్యాసకృతము.

36 అధిష్ఠానం న జీవస్స్యాత్ప్రత్యేకం నిర్వికారతః
అవస్తుత్వా చ్చిదాభాసః నాస్తి తస్యచ జీవతా.

37 ప్రత్యేకం జీవతా నాస్తి బుద్ధేరపి జడత్వతః
జీవ ఆభాస, కూటస్థ, బుద్ధి, త్రయ మతోభవేత్.

తా॥ ఒకగృహమున కవయవములగు మృద్దారుశిలాదులను ప్రత్యేకముగా పరికించి విచారించినచో నేయొక్కదానినిగూడ గృహ

మని పిలచుటకు వీలులేనట్లే, పై జీవపదవాచ్య మగుత్రితయములో 1 అధిష్ఠానచైతన్యము నిర్వికారమగుటవలనను, 2 చిదాభాసుడు వ్యవహారదశలోగూడ ఘటజలాకాశప్రతిబింబమువలె స్వతంత్రవస్తువే కాకుండుటవలనను, 3 చిదాభాస అధిష్ఠానచైతన్యముల వివక్ష చేయనిచో కేవలబుద్ధి యన్యావభాసకము కాజాలనందున జడమగుటవలనను, ఏయొక్కటిగూడ ప్రత్యేకము జీవుడనుటకర్హములుగావు.

38 మాయా, భాసో, విశుద్ధాత్మా, త్రియమేత న్మహేశ్వరః
మాయాభాసో హ్యవస్తుత్వా త్ప్రత్యేకం నేశ్వరోభవేత్.

39 పూర్ణత్వా న్నిర్వికారత్వా ద్విశుద్ధాచి న్న హీశ్వరః
జడత్వహేతో ర్మాయాయా మీశ్వరత్వం సుదుర్ఘటమ్.

40 తస్మా దేత త్త్రియం మిథ్యా తదర్థో నేశ్వరోభవేత్.

తా॥ పై జెప్పిన జీవాత్మవిచారమువలెనే పరమాత్మవిచారమును గూడ గావించినచో వివిధజగదాకారపరిణామి మాయాధిష్ఠానమగువిశుద్ధాఖండచైతన్యమున్నూ, రజ్జుసర్పమువలె తదధ్యస్త మగు మాయయున్నూ, అశుద్ధసత్వప్రధాన మగుమాయయందు మేఘాకాశప్రతిబింబమువలె తోచెడి చిత్ప్రతిబింబాత్మక మాయాభాసుడున్నూ, కలిసి ఒకేవస్తువుగా నెపుడు తోచునో అపుడా సాభాసమాయాధిష్ఠానాఖండచైతన్యమునే సర్వజ్ఞత్వాదిలక్షణు డగునీశ్వరుడని వ్యవహరింతురు.

కాని పై జీవవిచారమందువలెనే వివేకదృష్టితో నేతత్త్రియమునుగూడ విచారించినచో సాభాసమాయాధిష్ఠాన మగుకేవలాఖండచైతన్యమాత్రమునకు ఈక్షణ సంకల్పాది వికార పరిచ్ఛేదాదులు పొసగనందువలనను, చిదధ్యస్తమాయాగత కేవలచిదాభాసుడు మేఘాకాశప్రతిబింబమువలె వ్యవహారదశలోగూడ స్వతంత్రవస్తువే గాకపోవుటవలనను, చిదధ్యస్త మగుచిదాభాసరహిత కేవలమాయ సూర్య

ప్రతిబింబరహిత కేవలదర్పణమువలె యన్యావభాసకము గానందున జడమగుటవలనను, ప్రత్యేకగృహావయవములగు మృద్దార్వాదులకు గృహనామము పొసగనిభంగి ఈశ్వరత్వ మీమూటిలో దేనికిని ఘటించదు.

గావున సర్వజ్ఞత్వాదిలక్షణముగా జూడబడు నేతత్త్రితయరూప వస్తువు మృద్దార్వాదిసంఘాతము గృహమైనట్లే మిథ్యయగును గాన నీసంఘాతరూపార్థ మీశ్వగతత్త్వము గానేరదు.

ఇతి జీవేశ్వరా భాత స్స్వాజ్ఞానా న్నహి వస్తుతః.

తా॥ పైరీతిగా నవివేకదృష్టితో కల్పితోపాధులనుబట్టి జీవుడు ఈశ్వరుడు భిన్నరూపులుగా దోచెదరేగాని నిజమగు తదుభయ స్వరూపమును విచారించినచో భేదావాదావకాశ మణుమాత్రము గూడ లేదు, అదియెట్లనిన

41 ఘటాకాశమఠాకాశౌ మహాకాశే ప్రకల్పితౌ
ఏవం త్వయిచిదాకాశే జీవేశౌ పరికల్పితౌ.

తా॥ అవకాశాత్మక మగు మహాకాశములో నొకమఠమును నిర్మించినచో నామఠములోని యాకాశమును మఠాకాశమనియు, అందులోనొక ఘటమునుంచినచో దానిలోనియాకాశమును ఘటాకాశమనియు, ఆమహాకాశమునే వేరువేరు నామరూపములతో వ్యవహరించిన చందమున సద్గుర్వనుగ్రహమాత్రసమధిగమ్యమై అఖండ చైతన్యరూపమగు నీ నిజాత్మతత్వమందె "కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః" ఇత్యాదిప్రమాణములబట్టి యావరణ, విక్షేపాత్మక మాయా, బుద్ధి, రూపోపాధి కల్పనలచే జీవేశ్వరభావములు కల్పితములుగాని వాస్తవములుగావు.

42 మాయా, తత్కార్య, విలయే నేశ్వరత్వం న జీవతా
తత శ్శుద్ధచిదేవాహం వ్యోమవ న్నిరుపాధికః.

తా॥ మాయ, బుద్ధు, లనెడి యావరణ, విక్షేపో, పాధులను సద్గుర్వనుగ్రహాకృత సమ్యగ్దర్శనప్రబోధముచే నిరాకరించినవో జీవేశ్వరలక్షణములగు కించిద్ జ్ఞత్వ సర్వజ్ఞత్వ, పారతంత్ర్య స్వాతంత్ర్య, నియమ్య నియామకత్వాదులన్నియు స్వప్రబోధసమకాలమునసెస్వాత్మమాత్రాధ్యస్థులగుటచే నఖండచిన్మాత్రాత్మస్వరూపులగు స్వస్వాప్నిక ప్రజాప్రభువులవలె యస్తమించును.

అపుడు వివిధ భేదవాది విభ్రాంత్యంధతామిస్రమాత్ర ప్రత్యుప స్థాపిత జీవపరభేదవాదగ్రహము లన్నియు "తత్త్వమస్యాదివాక్యోత్థ సమ్యగ్జీజన్మమాత్రతః అవిద్యా సహకార్యేణ నాసీ దస్తి భవిభవిష్యతి" ఇత్యాది ప్రమాణములబట్టి నిజాఖండాత్మసాక్షాత్కార మధ్యాహ్నమార్తాండ ప్రచండప్రభా పరాభూతములగును.

అపుడే "కార్యకారణతాం హిత్వా కేవలాత్మా వశిష్యతే" ఇత్యాదిప్రమాణప్రమిత నిరావరణవిక్షేప నిర్విశేషాద్వితీయాఖండ చిదానందాత్మమాత్ర స్థితిరూప కైవల్యసామ్రాజ్యపట్టాభిషిక్తుడగును. ఇదియే పరమాద్వైత సిద్ధాంతైక సమధిగమ్యమగు పరమపురుషార్థము. ఇదియే చతుర్వేదపరమరహస్యము.

43 సత్యచిద్ఘన మనంత మద్వయం
సర్వదృశ్యరహితం నిరామయమ్
యత్పదం విమల మద్వయం సుఖం
తత్సదాహ మితి మౌన మాశ్రయే.

తా॥ కావున నిట్టిబ్రహ్మజ్ఞాని యైనవాడు సత్యము చైతన్య ఘనము సర్వవ్యాపకము సజాతీయ విజాతీయస్వగతభేదరహితము దృశ్యప్రపంచముతో నెట్టిసంబంధము లేనిదియు (రజ్జువున కెట్లు సర్పముతో సంబంధములేదో యట్లు జగత్తుతో బ్రహ్మమున కెట్టిసంబంధము లేదనియు అధిష్ఠాన మగురజ్జువువంటిది బ్రహ్మమనియు ప్రాతిభాసిక

మగుసర్పమువంటిది జగత్తనియు భానము) ఎట్టిదుఃఖములు లేనిది శుద్ధమైనది ఆనందరూపము నగుబ్రహ్మమే నేనని దృఢనిశ్చయముతో ఎల్లప్పుడు మౌనియై యుండును.

పూర్ణ మద్వయ మఖండచేతనం
విశ్వభేదకలనావివర్జితమ్
ద్వితీయ పరసంవిదంశకం
తత్సదాహ మితి మౌన మాశ్రయే॥

తా॥ బ్రహ్మవేత్త సమస్తబ్రహ్మాండములలో నిండియున్నట్టియు అద్వితీయమును అఖండచైతన్యాత్మకమును ననేకభేదములతో నొప్పు జగత్తుతో నెట్టిసంబంధము నొందనిదియు జ్ఞానరూపమునకు బ్రహ్మమే నే ననుదృఢనిశ్చయము గల్గి మౌనము నాశ్రయించియుండును,

45 జన్మమృత్యుసుఖదుఃఖవర్జితం
జాతినీతికులగోత్రదూరగమ్,
చిద్వివర్తజగతోఽస్యకారణం
తత్సదాహ మితి మౌన మాశ్రయే.

తా॥ "జననమరణాదులుగాని సుఖదుఃఖాది ద్వంద్వములుగాని జాతికులగోత్రములుగాని విధినిషేధములుగాని నాకు లేవు. రజ్జువునందు సర్పమువలె నాయందు దేహాదిజగత్తంతయు వివర్తమైనదిగాన అధిష్ఠాన మగునేనే ఈజగత్తునకు నిమిత్తకారణము ఉపాదానకారణము నయితిని. నేనే ఆనందరూపుడ నగుబ్రహ్మమునుగాన మౌనము నాశ్రయింతును" అని బ్రహ్మవేత్త తలచును.

46 ఉలూకస్య యథా భానా అంధకారః ప్రతీయతే
స్వప్రకాశే పరానందే తమో మూఢస్య భాసతే.

తా॥ సూర్యుడు సహస్రకిరణములతో ప్రకాశించుచున్నను గుడ్లగూబ కెట్లంధకారముగానే యుండునో అట్లే విద్యాగంధ మెరుగని మూఢునకు స్వయంప్రకాశ మగునాత్మచైతన్యము నిత్యము స్ఫురిం

చుచున్నను ఉపనిషత్తులు నిత్యములై స్వతఃప్రమాణములై వెలుగొందుచున్నను యథావిధిగా నుపసదన మొనర్చుశిష్యులకు బ్రహ్మవిద్య నుపదేశింప సిద్ధముగా నున్నసద్గురువులు విరాజిల్లుచున్నను జననమరణాదిసంసారబంధ మనునంధకారము పోకుండగ వృద్ధిపొందుచునే యున్నది.

47 యథా దృష్టినిరోధార్త స్సూర్యో నాస్తీతి మన్యతే
తథా జ్ఞానావృతో దేహీ బ్రహ్మ నాస్తీతి మన్యతే.

తా॥ నేత్రములు లేనివాడు సూర్యుడు లేనే లేడని తలచునట్లు అజ్ఞానియై దేహమే తా ననుభ్రాంతిలో నుండుమూఢుడు బ్రహ్మమే లేదని తలచును.

48 యథాఽమృతం విషా ద్భిన్నం విషదోషై ర్న లిప్యతే
న స్పృశామి జడా ద్భిన్నః జడదోషా న్ప్రకాశయన్.

తా॥ "విషామృతములు రెండును పరస్పరవిరుద్ధధర్మములు గలవి. అం దమృతము విష మందలిదోషములచే నెట్లు స్పృశింపబడదో అట్లే సత్యజ్ఞానానందరూపుడ నగునేను అనృత, జడ, దుఃఖాత్మక మగునీదేహాదిజగత్తుకంటె విలక్షణుడను గనుకనే భిన్నుడనై ఆదేహాదిక మందలిదోషములను తెలిసికొని ప్రకాశింపజేయుచు ఆదోషములచే నే నెంతమాత్రము స్పృశింపబడను" అని బ్రహ్మవేత్త దృఢనిశ్చయముతో నుండును.

49 స్వల్పాపి దీపకణికా బహుళం నాశయే త్తమః
స్వల్పోపి బోధో మహతీ మవిద్యాం శమయే త్తథా.

తా॥ స్వల్పదీపమైనను గొప్పచీకటి నెట్లు పోగొట్టగలదో అట్లే వేదాంతజ్ఞానము కొంచెమైనను గొప్పయవిద్యను పోగొట్టును.

50 చిద్రూపత్వా న్న మే జాడ్యం సత్యత్వా న్నానృతం మమ
ఆనందత్వా న్న మే దుఃఖం అజ్ఞానా ద్భాతి త త్త్రియమ్.

తా॥ నేను జ్ఞాన (చైతన్య) రూపుడనుగాన జడభావ మెంతమాత్రము నాకు లేదు. నేను సత్యరూపుడనుగాన అనృతదోషము

నాకు లేదు. నేను ఆనందరూపుడనుగాన నాకు దుఃఖ మెంతమాత్ర మును లేదు. ప్రజడ అనృతదుఃఖములు దేహాధర్మము లేగాని నాయాత్మ ధర్మములు గావు గాన దేహామే నే ననుతలంపుతో నుండునజ్ఞానిని పై జాడ్యాదిత్రయము నిరంతరము బాధించుచునే యుండును.

51 కాలత్రయే యథా సర్పః రజ్జౌ ర్నాస్తి తథా మమ
అహంకారాది దేహాంతం జగ న్నా స్త్యహ మద్వయః.

తా॥ రజ్జువును గాంచి సర్ప మనుభ్రాంతిజ్ఞాన మొందువానికి భయకంపాదికము గల్గును. గాని, యారజ్జువునకుమాత్రము భ్రాంతుని యజ్ఞాన కాలమందుగాని యథార్థజ్ఞాన కాలమందుగాని భ్రాంతుడు దానిని జూడకమునుపు కాలమందుగాని యాసర్పముతో గాని దానివలన భ్రాంతునకు గలుగుభయకంపాదులతోగాని ఎట్టిసంబంధము లేనట్లు గానే, అపరోక్షబ్రహ్మసాక్షాత్కారము నొందిననాకు అహంకార దేహాదికములతో నెట్టిసంబంధమును లేదు. రజ్జువున నెట్లు సర్ప మసలే లేదో, జ్ఞానినైన బ్రహ్మము నగునాయందు దేహాదిక మసలే లేదు.

52 భానౌ తమః ప్రకాశిత్వా న్నాంగీకుర్వంతి సజ్జనాః
తమ స్తత్కార్యసాక్షీతి భ్రాంతిబుద్ధి రహో మయి.

తా॥ ప్రకాశాత్మకుం డగుసూర్యునియందు తమ స్సుండుననని సజ్జను లెట్లు విశ్వసించరో యట్లే సత్యజ్ఞానానందరూపుడ నగునా యందు తమ స్సనగా నజ్ఞాన మున్నదని, నాయజ్ఞానకార్య మగు సుఖదుఃఖాదికము జననమరణాదులును, ఉండు ననుటగూడ నంత విశ్వసింపదగినదే- ఎంతయాశ్చర్యము! ఈయజ్ఞానకార్యములకు అనగా దేహేంద్రియవ్యాపారమునకు ఆత్మ సాక్షి యనుటగూడ నంత ఆశ్చర్య కరమైనదే - ఏలననగా దేహాదికము సత్య మైనపుడుగదా, తత్సాక్షి త్వము సత్యమగుట- దేహాదికము కల్పితమైనపుడు సాక్షిత్వముగూడ కల్పితమే యగును.

53 యథా శీతం జలం వహ్నిసంబంధా దుష్ణవ ద్భవేత్
బుద్ధితాదాత్మ్యసంబంధా త్కర్తృత్వం వస్తుతో నహి.

తా॥ స్వభావముచే చల్లని వగునుదకములు అగ్నిసంబంధముచే నెట్లు వేడిగానుండుచున్నవో యట్లే ఆత్మగూడ స్వభావముచే సత్యజ్ఞానానందరూపమైనను బుద్ధితో తాదాత్మ్యసంబంధమువలన కర్తృత్వాదిక మున్నట్లు భాసించుచున్నది. అంతేగాని ఆత్మకు నిజముగా కర్తృత్వము లేదు.

54 జలబిందుభి రాకాశం న సిక్తం నచ శుద్ధ్యతి
తథా గంగాజలే నాయం న శుద్ధో నిత్యశుద్ధతః.

తా॥ ఆకాశము వర్షజలబిందువులచే నెట్లు తడపబడి శుద్ధముగా నేరదో యట్లే యీబ్రహ్మాత్మగూడ గంగాదిపుణ్యజలస్నానాదులచే తడపబడనేరదు. పవిత్రము గానేరదు. నిత్యశుద్ధ, బుద్ధ, ముక్తస్వభావ మగునీయాత్మకంటె వేఱుగ వస్త్వంతరమే లేకపోవుటచే గంగాదులుగూడ జగదంతఃపతితము లగుటచే మిథ్య యగుచున్నవి.

55 వృక్షోత్పన్నఫలై ర్వృక్షో యథా తృప్తిం న గచ్ఛతి
మయ్యధ్యస్తాన్నపానాద్యై స్తదా తృప్తి ర్న విద్యతే.

తా॥ వృక్షము తనయొక్క పండ్లచే నెట్లు సంతృప్తినొందదో యట్లే బ్రహ్మాత్మ నగునాయందు అధ్యస్తము లగుఅన్నపానాదులచే నాకు తృప్తియుండదు. ఇట వృక్షము తనఫలములను తా నెట్లు తినదో, అట్లే బ్రహ్మాత్మ జగత్తంతయు తానేగాన తనను తాను తినదనిభావము.

56 స్థాణౌ ప్రకల్పిత శ్చోర స్స స్థాణుత్వం న బాధతే
స్వస్మి న్కల్పితజీవశ్చ న స్వం బాధితు మర్హతి.

తా॥ చీకటిలో నుండునొకకొయ్యమొద్దును చూచి ఒకానొకడు దొంగవాడని భ్రాంతినొందెను. అట్టిదొంగ యాస్థాణుధర్మముల నెట్లు బాధింపలేడో యట్లే బ్రహ్మాత్మయందు కల్పింపబడినజీవుడు బ్రహ్మమును గాని బ్రహ్మధర్మము లగు సత్య, జ్ఞాన,ఆనందాదులనుగాని బాధింపలేడు. ఇచట స్థాణువువలె యథార్థవస్తువై అధిష్ఠానమైనది బ్రహ్మాత్మ - దొంగవలె భ్రాంతిచే కల్పితమై భ్రాంతులకుమాత్రమే దొంగగా కను

పించుచు, యథార్థజ్ఞాన మనగా స్థాణుజ్ఞానోదయానంతర కాలమందు దొంగ గానట్లు జీవుడుగూడ భ్రాంతి లేక యవిద్యచే కల్పితుడై అవిద్యాగ్రస్తులకుమాత్రమే జీవుడుగా కనుపించుచు, యథార్థబ్రహ్మ జ్ఞానోదయానంతరకాలమందు జీవుడు గాక, బ్రహ్మమే యగు చున్నాడని భావము.

57 అజ్ఞానే బుద్ధివిలయే నిద్రా సా భణ్యతే బుధైః
విలీనా జ్ఞానతత్కార్యే మమ నిద్రా కథం భవేత్.

తా॥ జీవునియజ్ఞానము వానిబుద్ధియందు లయమొందినకాలమే నిద్రావస్థగా బుధులచే పరిగణింపబడుచున్నది. బ్రహ్మాత్మ నగునాకు అజ్ఞానమును తత్కార్యమును సమూలముగా పోయినందున ఇపుడు నాకు (బ్రహ్మ) నిద్ర ఎట్లు కలుగును ? అనగా నిద్రావస్థ దేహము నకేగాని ఆత్మకు లేదని తాత్పర్యము.

ఈ 58 వ శ్లోకమునుండి, 66 వ శ్లోకము వరకుగల తొమ్మిది శ్లోకములచే, బ్రహ్మవిదనుభవము వర్ణింపబడుచున్నది.

58 బుద్ధేః పూర్ణవికాసోయం జాగరః పరికీర్త్యతే,
వికారాదివిహీనత్వా జ్జాగరో మే న విద్యతే.

తా॥ జీవునిబుద్ధి సంపూర్ణముగా వికసించినపు డాయాఇంద్రియములు తమతమవిషయములను గ్రహించును. ఇదియే జాగ్రదవస్థ యనబడుచున్నది. బ్రహ్మాత్మ నగునేను నిర్వికారచిన్మాత్రుడ నగుటచే నాకు జాగ్రదవస్థ యనునదియే లేదు. అనగా వికారి యగుదేహము నకు జాగ్రదవస్థ యుండునుగాని నిర్వికార మగునాత్మకు కుండదని యభిప్రాయము.

59 సూక్ష్మనాడీషు సంచారో బుద్ధేః స్వప్నః ప్రజాయతే
సంచారధర్మరహితే స్వప్నో నాస్తి తథా మయి.

తా॥ బుద్ధి సూక్ష్మనాడులందు సంచరించునపుడు స్వప్నావస్థ గలుగుచున్నది. బ్రహ్మాత్మ నగునేను సర్వబ్రహ్మాండములోను నిండి

యున్నానుగాన నాకు సంచారధర్మము లేదు. అందుచే బ్రహ్మము నగునాకు స్వప్న మెంతమాత్రమును లేదు.

60 పరిపూర్ణస్య నిత్యస్య శుద్ధస్య జ్యోతిషో మమ
ఆగంతుకమలాభావా త్కిం స్నానేన ప్రయోజనమ్ ?

తా॥ సమస్తబ్రహ్మాండమందును నిండియున్నట్టియు సర్వకాల సర్వావస్థలయందు నిత్యముగా నుండునట్టియు ఎటువికారములు లేక పరిశుద్ధమైనట్టియు స్వయంజ్యోతిస్స్వభావము గలిగినట్టియు బ్రహ్మము నగునాకు ఇతరప్రదేశమునుండి వచ్చి సంక్రమించిన మలము లేకపోవుటచే స్నానముతో నేమిప్రయోజన మున్నది ?

61 దేశాభావా త్క్వ గంతవ్యం స్థానాభావా త్క్వవా స్థితిః?
పూర్ణే మయి స్థానదేశౌ కల్పితౌ వహ మద్వయః.

తా॥ నేను సర్వలోకములను వ్యాపించినందున నాకంటె వేరగు ప్రదేశమే లేకపోవుటచే నే నెచ్చటికి వెళ్లుదును? నాకంటె వేరగు స్థానమే లేనందున నే నెచ్చట నుండెదను? ఇట్టి బ్రహ్మాత్మ నగునాయందు స్థానమును దేశమును కల్పింపబడినవి. నే నొక్కడనే ఈ బ్రహ్మాండమంతట నుండుజగత్తుగా నుంటిని.

62 ప్రాణసంచారసంశోషా త్పిపాసా జాయతే ఖలు
శోషణానర్హచిద్రూపే మయ్యేషా జాయతే కథమ్?

తా॥ దేహమునందలినాడులలో ప్రాణవాయువు సంచరించుట వలన నాడులు శోషించినపుడు దప్పిక గల్గును. దేహాదులకంటె విలక్షణుడనై చైతన్యఘనాత్ముడ నగునాయందు నాడులుగాని ప్రాణముగాని శోషక్రియగాని వాస్తవముగా లేనందున నాకు దాహ మెట్లు గల్గును?

63 నాడీషు పీడ్యమానాసు వాయ్వగ్నిభ్యాం భవేత్ క్షుధా
తయోః పీడనహేతుత్వా త్సంవిద్రూపే కథం మయి ?

తా॥ శరీరగతనాడులు జారరాగ్నిచేతను ప్రాణాపానాదివాయు వృత్తులచేతను పీడింపబడుచుండగా జీవున కాకలి కల్గును. నే నగ్ని వాయ్వాదులకుగూడ కారణరూపుడగు బ్రహ్మమునుగాన నా కాకలి యెట్లు కల్గును?

64 శరీరస్థితిశైథిల్యం శ్వేతరోమసమన్వితమ్
జరా భవతి సా నాస్తి నిరంశే మయి సర్వగే.

తా॥ శరీరమందలియెముకలు నరములు సంధులుమొదలగున వన్నియు శిథిలములై వెండ్రుకలు తెల్లగా నరయుట ముసలితనమనబడు చున్నది. సమస్తబ్రహ్మాండములో నిండియుండి అవయవములు లేక విభాగానర్హ మగునా కాముసలితనము లేదు.

65 యోషిత్క్రీడాసుఖస్వాంతః గర్వాఢ్యం యౌవనం కిల
ఆత్మానందే పరే పూర్ణే మయి నాస్తిహి యౌవనమ్

తా॥ గొప్పగర్వముతో గూడినయౌవనమునందలిసుఖమునకు స్త్రీసాంగత్యమే పరమావధిగదా. బ్రహ్మాత్మ నగునేను నిరతిశయా నందరూపుడనై అంతట నిండియుండుటచే నాకు యౌవన మను నవస్థయే లేదు.

66 మూఢబుద్ధిపరివ్యాప్తం దుఃఖానా మాలయం సదా
బాల్యం కోపనశీలాంతం న మే సుఖజలాంబుధేః.

తా॥ బుద్ధిమాంద్యముతో కూడియుండి నిరంతరము దుఃఖము లనే యనుభవించుచు, కోపస్వభావముతో నుండు బాల్యావస్థ ఆనందరూపుడ నగునా కెంతమాత్రము లేనే లేదు.

67 ఏవం తత్త్వవిచారార్థే నిమగ్నానాం సదా నృణామ్
పరమాత్మైకవిజ్ఞాన మపరోక్షం న సంశయః.

తా॥ ఈవిధముగా వేదాంతార్థవిచారణయందు నిరంతరము నిమగ్ను లగుసత్పురుషు లైనజిజ్ఞాసువులకు అపరోక్షబ్రహ్మసాక్షాత్కార మచిరకాలములో తప్పక గలుగును.

# మాయాపంచకము

1 నిరుపమనిరంశకేప్యఖండే
మయి చితి సర్వవికల్పనాదిశూన్యే
ఘటయతి జగదీశ భేదభావం
త్వఘటితఘటనాపటీయసీ మాయా.

తా॥ ఎట్టిశబ్దాదిగుణములు లేనిది, సర్వత్ర వ్యాపించియున్నట్టిది, సాటిలేనిది, సజాతీయవిజాతీయస్వగతభేదములు లేనిది, విభజింప నలవి కానిది, ఎట్టివికల్పములకు ఆస్పదముగానిది, చైతన్యైకరూపమైనది అగు బ్రహ్మమే యగునాయందు, శబ్దాదిగుణములతో నొప్పిన పరిచ్ఛిన్నమైన సాటిగల సజాతీయవిజాతీయస్వగతభేదములుగల విభజింప నలవియైన సర్వవికల్పములకు ఆస్పదమైన జడమైన జగత్తును కల్పించిన మాయ ఎంతగొప్పది! ఎంత ఆశ్చర్యము! మఱియు, జీవులని ఈశ్వరుడని భేదములను కల్పించిన దీమాయయే. ఇట్లు తమఃప్రకాశంబులంబోలె పరస్పరవిరుద్ధము లగువస్తువులలోగూడ నొకదానియందు మరియొకటి యనుభ్రాంతిని కలుగజేయుమాయ ఎంతగొప్పది! మరియు కూర్చుటకు వీలులేనివస్తువులనుగూడ కడుసమర్థతతో కూర్చునట్టి యీమాయ ఎంతగొప్పది!

2 శ్రుతిశతనిగమాంతశోధకాన
ప్యహరహ రాహరతో ధనాని సద్యః
కలుషయతి చతుష్పదాద్యభిన్నా
నఘటితఘటనాపటీయసీ మాయా.

తా॥ అర్థజ్ఞానములేని కేవలవేదపారకులను, ఆచరణలేని విద్యావంతులను, ప్రతిక్షణమునందు ప్రతిదినమునందు, ధనాదిలోభముచే పశుతుల్యులనుగా నొనర్చు ఈమాయ ఎంతగొప్పది! అనగా ఆహార, నిద్రా, భయ, మైథునాదులు పశువులకును మనుష్యులకును సమానమే యైనందున కేవలము వానియందుమాత్రమే ప్రవృత్తుడగుచుండు మనుష్యు డెట్టివిద్యలను పఠించినను వాడు పశుతుల్యుడే యగును.

3 సుఖచిదఖండవిబోధ మద్వితీయం
వియదనలాదివినిర్మితే వియోజ్య
భ్రమయతి భవసాగరే నితాంతం
త్వఘటితఘటనాపటీయసీ మాయా.

తా॥ ఆనందరూపమై, చైతన్యఘనమై, సజాతీయాదిభేద రహితము, అద్వితీయజ్ఞానరూపము అగుబ్రహ్మమును ఆకాశాది పంచభూతములతో కలిపి, జననమరణాదిరూపసంసారచక్రమందు నిరంతరము త్రిప్పునట్టి మాయ ఎంతగొప్పది!

4 అపగతగుణవర్ణజాతిభేదే
సుఖచితి విప్రవిదాద్యహంకృతిం చ
స్ఫుటయతి సుతదారగేహమోహం
త్వఘటితఘటనాపటీయసీ మాయా.

తా॥ ఆనందరూపమై చైతన్యఘనమై సత్త్వాదిగుణభేద వర్ణభేద జాతిభేదములు లేనట్టి బ్రహ్మమందు బ్రాహ్మణుడని విద్వాంసుడని యీ మొదలగునహంకారమును గలుగజేసి, ధనేషణ, దారేషణ, పుత్త్రైషణ మొదలగుమోహమును గలుగజేసినమాయ ఎంతగొప్పది!

5 విధి హరి హరభేదమ ప్యఖండే
బత! విరచయ్య బుధా నపి ప్రకామమ్
భ్రమయతి దురహంకృతిప్రమత్తా
నఘటితఘటనాపటీయసీ మాయా.

తా॥ అఖండసచ్చిదానంద మగుబ్రహ్మమందు బ్రహ్మవిష్ణుమహేశ్వరాదివిభేదమును కల్పించి విద్యావంతులలోగూడ కొందరు బ్రహ్మము నారాధించుచు శివవిష్ణువులను ద్వేషించువారుగాను, మరికొందరు విష్ణువు నారాధించుచు బ్రహ్మరుద్రులను ద్వేషించు వారుగాను, మరికొందరు రుద్రు నారాధించుచు బ్రహ్మవిష్ణువులను ద్వేషించువారుగాను ప్రవర్తించునట్లు చేయుమాయ ఎంతగొప్పది! ఇట్లఘటితపదార్థముల ఘటింపజేయునదియే మాయ యనబడును.

# ఆత్మలక్షణము

## — సత్యజ్ఞానానంతానంద వివరణము —

### — సత్య మెద్ది —

శ్రు॥ సదితి శ్రౌతప్రతీతిలక్ష్యం సత్యమ్, అసది త్యవాచ్యం సత్యమ్, త్రికాలాబాధ్యం సత్యమ్, త్రికాలానుస్యూతం సత్యమ్, య దస్తి త త్సత్యమ్. ఏకమే వాద్వితీయం సత్యమ్, సజాతి విజాతి భేదరహితం సత్యమ్. సర్వకల్పనాధిష్ఠానం వా సత్యమ్.

తా॥ వేదములచే నిరూపింపబడు లక్ష్యమయినవస్తు వేదియో అదే సత్యము. అసత్తని దేనిని చెప్పగూడదో అది సత్యము మూడు కాలములయందున బాధింపబడని దేదియో అదే సత్యము. త్రికాలములయందును విడివడక చేరియుండున దేదియో అదే సత్యము. ఏది యున్నదో అది సత్యము. రెండవది లేక ఒక్కటేయైన దేదియో అదే సత్యము. సజాతి విజాతిభేదరహితమైనది సత్యము. సకలకల్పనలకును అధిష్ఠానమై యుండున దేదియో అదే సత్యము.

### — జ్ఞాన మెయ్యది —

శ్రు॥ స్వప్రకాశం జ్ఞానం, సర్వప్రకాశకం జ్ఞానం, నిరావరణ చిన్మాత్రం జ్ఞానం, అనాద్యనన్తం నిరంతర మవృత్తి వృత్తి సాక్షి చైతన్యమేవ జ్ఞానమ్.

తా॥ తనంతట తాను ప్రకాశించునదే జ్ఞానము. సమస్తమును ప్రకాశింపజేయునదే జ్ఞానము. ఆవరణము లేని చిన్మాత్రస్వరూపమే జ్ఞానము. అనాదిగను అనంతముగను నిరంతరముగను వృత్తిలేనిదిగను వృత్తికి సాక్షిగను నుండు చైతన్యమే జ్ఞానము.

### — అనంత మేది —

శ్రు॥ ఉత్పత్తివినాశరహిత మనన్తం, షడ్భావవికారరహిత మనన్తం, సర్వోపాధి వినిర్ముక్త మనన్తం, మృద్వికారేషు

మృదివ స్వర్ణవికారేషు స్వర్ణమివ తన్తువికారేషు తన్తురివ,
అవ్యక్తాది సృష్టిప్రపంచేషు వ్యాప్య పూర్ణ మవినాశి చైతన్య
మనన్తమ్.

తా॥ ఉత్పత్తియును నాశమును లేనిదే అనంతము. షడ్భావ
వికారములు లేనిదే అనంతము. ఉపాధు లేవియు లేనిది అనంతము.
కుండ, మూకుడు మొదలగువానియందు మట్టివలెను, కటక కేయూ
రాదులందు బంగారమువలెను, అంగవస్త్రములు మున్నగువానియందు
నూలువలెనుండునది అనంతము. అవ్యక్తము మొదలగు సృష్టిప్రపంచ
మునందు వ్యాపించి పూర్ణమై నాశరహితమై యుండుచైతన్యము
అనంతము.

.♦ ఆనన్ద మెయ్యది ♦.

శ్రు॥ అమ్బుసా మర్ణవ ఇవ సుఖచేతనానా మధిష్ఠాన నిత్య శుద్ధా
ఖణ్డాద్వైత చిదానందైకరస మానన్దమ్.

తా॥ జలములకు సముద్రమువలె సుఖరూపమైన చేతనములకు
ఆధారమై శాశ్వతమై శుద్ధమై అఖండమై అద్వైతమై చిదానందమై
ఏకరసమై యుండున దేదియో అదే ఆనందము.

—♦ ఆత్మయే సర్వోత్కృష్టము ♦—

విత్తా త్పుత్రః ప్రియం, పుత్రా త్పత్ని, పత్న్యా శ్శరీరకమ్,
ఇంద్రియేభ్యః ప్రియాః ప్రాణాః, ప్రాణా దాత్మా పరః ప్రియః.

తా॥ లోకములో నందరకు ధనకనక వస్తువాహనగృహక్షేత్రా
దిక మగుతనమైశ్వర్యసంపదయందు ఎక్కువప్రీతి యుండును, దాని
కంటెగూడ తన పుత్రునియందును, అంతకంటె భార్యయందును,
అంతకంటె తన దేహేంద్రియసంఘాతమునందును, అంతకంటె ప్రాణ
ములందును, ఉత్తరోత్తరముగా ప్రీతి హెచ్చుగానుండును. అట్టిప్రాణ
ములకంటెను తనయాత్మయందు ప్రీతి ఎక్కువగా నుండును. ఇంత
కంటె ఎక్కువప్రీతి గలవస్తు వెచ్చటను చెప్పబడలేదు.

### —♦ ఆ త్మ హ త్య ♦—

ఇట్టి వేదాంతవాక్యవిచారణకొరకెవడు ప్రయత్నింపడో వా డాత్మహత్యచేసినవా డగునని శాస్త్ర ముపదేశించుచున్నది, ఎట్లనగా

యస్స్వాత్మముక్త్యై న యతేత మూఢధీః
స ఆత్మహా స్వం వినిహంత్యసద్గ్రహాత్

తా॥ ఎవడు స్వస్వరూప మెట్టిదో తెలిసికొని జననమరణప్రవాహరూప మగుసంసారసాగరములోనుండి విడువబడి ముక్తుడగుట కొరకు ప్రయత్నింపడో, అట్టిమూఢుడు తననిజరూప మెరుగక దేహేంద్రియాదులే తననిజరూప మనుభ్రాంతిలో నుండి వ్యవహరించుచున్నందున వా డాత్మహంతకు డనబడును.

ఇచట మోక్ష మనునది వేదాంతవాక్యవిచారణద్వారా ఆత్మబోధవలనమాత్రమే సిద్ధించునుగాని ఇతరసాధనములచే నెంతమాత్రము సిద్ధింపనేరదనిగూడ శాస్త్ర మిట్లుపదేశించుచున్నది.

### —♦ ము క్తి సా ధ న ము ♦—

ఆత్మైక్యబోధేన వినా విముక్తిః
న సిధ్యతే బ్రహ్మశతాంతరేపి.

తా॥ ఇపు డీజగము నంతను సృష్టించు చతుర్ముఖబ్రహ్మ సత్యలోకములోనికాలమానముచేత నూరుసంవత్సరములకాలము ఈ జగద్వ్యాపారము నొనర్చును. ఆపైని మరియొకకల్పమంతకాలమే మరియొకచతుర్ముఖబ్రహ్మ జగద్వ్యాపార మొనర్చును. ఇట్లు నూర్గురుచతుర్ముఖబ్రహ్మలపరిపాలనాకాల మంతయు మూఢుడు పుట్టుచు చచ్చుచు సంసారధర్మము నొందుచుండినను ఎన్నటికైన నీయాత్మైకత్వవిజ్ఞాన మొక్కదానితోనే ఈసంసారమునుండి ముక్తుడు కావలెనుగాని మరియొకసాధనము లేదు. ఈయర్థము "నాన్యః పంథా అయనాయ విద్యతే" యనుశ్రుతిమూలమున తెలియుచున్నది. ఇట్టియాత్మవిచారణ చేయుటకు తగినయంతఃకరణపరిపాకమునకు స్వస్వవర్ణాశ్రమధర్మాచరణమాత్రమే సాధనముగాని మరియొకటి లేదు.

చిత్తస్య శుద్ధయే కర్మ నతు వస్తూపలబ్ధయే
వస్తుసిద్ధి ర్విచారేణ న కించి త్కర్మకోటిభిః.

తా॥ వేదమందలికర్మకాండయంతయు చిత్తశుద్ధికి సాధనమగు నుగాని యథార్థవస్తు వగుబ్రహ్మముయొక్క ప్రాప్తికి సాధనము గాదు. ఎన్నికోట్లకర్మల నాచరించినను వేదాంతవాక్యవిచారణచేతమాత్రమే యథార్థవస్తుబ్రహ్మజ్ఞానము గలుగును. ఒకమేడ నెక్కుటకు మెట్లు సాధనములో యట్లే బ్రహ్మజ్ఞానము నొందుటకు కర్మాచరణచే గల్గినచిత్తశుద్ధి సాధనమగును. మరియు శుద్ధమైన అద్దమునందు ప్రతిబింబము చక్కగా కనుపించునట్లే శుద్ధమగు అంతఃకరణమందు ఆత్మస్వరూపము చక్కగా విచారణాపూర్వకముగా గోచరించును. కావున చిత్తశుద్ధి కలుగువరకు స్వస్వవర్ణాశ్రమాచారధర్మ మవశ్యాచరణీయము. లోకమందలిప్రేమాస్పదవస్తువు లన్నిటికంటెను తనయాత్మయె అత్యంతప్రియతరవస్తువుగాన నట్టియాత్మ ఎట్టిదో తెలిసికొనుట అత్యవసరము.



## గురూపసదనాదికము

పైలక్షణములుగల బ్రహ్మము నెట్లు తెలియవలెననగా.

శ్రు॥ తద్విజ్ఞానార్థం స గురు మే వాభిగచ్ఛే త్సమిత్పాణిః
శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్.

తా॥ వేదవేదాంగపారంగతుడును, సంప్రదాయసిద్ధముగా తదర్థమును గ్రహించినవాడును, అద్దాని నాచరించువాడును, తత్ఫలమగుబ్రహ్మభావమును పొందినవాడును బ్రాహ్మణోత్తముడు నగు గురువును సమిదాద్యుపహారమును గైకొని భక్తినమ్రుడై సమీపించి ఆత్మజ్ఞానము నుపదేశింపుడని ప్రార్థింపవలయును.

### గురులక్షణము

గుశబ్ద స్త్వంధకారే స్యా ద్రుశబ్ద స్తన్నిరోధకృత్
అంధకారనిరోధత్వా ద్గురు రిత్యభిధీయతే.

తా॥ గు అనగా అంధకారమనియు, రు అనగా దానిని పోగొట్టు వాడనియు నర్థము. గాన గురు వనగా అజ్ఞానాంధకారమును పోగొట్టు వాడని యర్థము.

తల్లిదండ్రులు పాంచభౌతికము అనిత్యము నగు దేహమునకు కారకు లగుచున్నారు. గురువన్ననో అనేకజన్మలనుండి వీని కనుగత మగుచున్న యజ్ఞానమును తొలగించి, ఇక వీని కెన్నటికి దేహబంధము లేనట్టిమోక్షోపాయముల నుపదేశించుచున్నాడు. కాన తల్లిదండ్రుల కంటెగూడ గురు పెక్కువగౌరవభావముతో చూడదగినవాడు. అట్టి గురువునొద్ద విద్య నభ్యసించుటకు మార్గములు చెప్పబడుచున్నవి.

గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా
అథవా విద్యయా విద్యా చతుర్థం నోపలభ్యతే.

తా॥ మొదటిమార్గము గురువునకు సర్వోపచారములను సలిపి వారియనుగ్రహమువలన విద్యను సంపాదించుట. రెండవది గురువునకు పుష్కలధనము నిచ్చి విద్యను సంపాదించుట. మూడవది గురువునకు తా నొకవిద్యను చెప్పి ఆగురువునుండి తనకు కావలసినవిద్యను గ్రహించుట- ఈమూడుతప్ప గురువువలన విద్యను గ్రహించుటకు నాల్గవ సాధనము లేదు.

గీత॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః.

తా॥ జ్ఞానసంపన్ను లగుగురువులను దేవతాభావముతో నమస్కరించుటచేతను సవినయముగా జిజ్ఞాసతో ప్రశ్నించుటచేతను నిరంతరము సర్వవిధముల సేవించుటచేతను శిష్యుడు గురువులవలన విద్యను తెలిసికొన ప్రయత్నింపవలెను. అట్లైనచో బ్రహ్మవేత్త లగునాగురువులు సచ్ఛిష్యునకు జ్ఞానము నుపదేశింపగలరు.

—♦ గురుశుశ్రూషాభేదములు ♦—

గురుశుశ్రూష- ఎన్నివిధములో వివరింపబడుచున్నది.

1 స్థానశుశ్రూష - యనగా గురువుగారి యింటికి తోటకు ఉద్యానవనమునకు పొలమునకు అవసరమగు పనులను చేయుట. దీని యంతరార్థ మేమనగా అకారము ఉకారము మకారము అనునవి ప్రణవాంగములు. వీనికి లక్ష్యార్థ మగు ద్రష్టృస్థానమును అనగా బ్రహ్మపదమును ఎరుక మరపులు లేనియునికితో విచారణచేయుటయే.

2 అంగశుశ్రూష - యనగా గురువుగారిశరీరమందలి సర్వావయవములకు సేవచేయుట. దీనియంతరార్థ మేమనగా అపరబ్రహ్మమునకు అనగా నుపాస్యబ్రహ్మమునకు, సూర్యచంద్రులే నేత్రములు. అగ్నియే వాగింద్రియము. దిక్కులే శ్రోత్రములు, ఇత్యాదిగా ఆయా అవయవములన్నియు నాయాదేవతలనుగా తెలిసికొని సేవించుటయే.

3 భావశుశ్రూష - యనగా గురువే పరబ్రహ్మ మనుభావమును సర్వకాలసర్వావస్థలందును కలిగియుండుట. దీనియంతరార్థ మేమనగా పరబ్రహ్మము జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూడవస్థలయందును బాధింపబడనిది, ఆయాయవస్థలలోని వృత్తులు మారుచున్నను మూడింటిపరంపరయందనుగతిమగుచు, తత్తత్సాక్షిగా నుండునది. అట్టిబ్రహ్మమే నే ననువిమర్శనతో నొప్పు స్థిరాంతఃకరణవృత్తియే.

4 ఆత్మశుశ్రూష- యనగా గురువు కోరువస్తువులను గురువున కావశ్యకము లగువస్తువులను తెచ్చియిచ్చుచుండుట. దీనియంతరార్థ మేమనగా ఆత్మకు ఆత్మయే ప్రియతమ మనియు, ధనముకంటె పుత్రులకంటె భార్యకంటె ఇంద్రియములకంటె ప్రాణములకంటెను గూడ అత్యంతప్రియతమమనియు, ఇట్టిప్రత్యగాత్మ వాస్తవముగా ధనపుత్రాదు లెట్టివికారము నొందుచున్నను నిర్వికారమై కూటస్థమైయుండి, అజ్ఞానావస్థయందు తాను వేరు బ్రహ్మము వేరునని తలంచినను, అట్టిభ్రాంతిని పోగొట్టుకొని తానే జగత్తనియు జగత్తే తాననియు బ్రహ్మమే జగత్తనియు తానే బ్రహ్మమనియు దృఢనిశ్చయముతో నుండుటయే.

## గురునమస్కారవిధి

ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా
పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోఽష్టాంగ ఉచ్యతే.

తా॥ 1. వక్షస్స్థలముతోను 2. శిరస్సుతోను 3. దృష్టితోను 4. మనస్సుతోను 5 వాక్కుతోను 6. పాదములతోను 7. చేతులతోను 8. చెవులతోను ఈ యెనిమిది అవయవములతోను, నమ్రభావమును తెలుపునట్టిభావనావిశిష్టశరీరవిన్యాసవిశేషమే సాష్టాంగనమస్కార మనబడును. గురువు నీ విధముగా నమస్కరింపవలెను. ఇట్టి జిజ్ఞాసువు లగుసాధకుల కుండవలసినలక్షణములు వివరింపబడుచున్నవి.

## జిజ్ఞాసులక్షణము

అమానిత్వము

విద్యైశ్వర్యతపోరూపగుణవర్ణాశ్రమాదిభిః
సంజాతాహంకృతే స్త్యాగ స్త్వభిమానవిసర్జనమ్.

తా॥ నేనే విద్వాంసుడను నేను గొప్పయైశ్వర్యవంతుడను నేను తపస్విని, నేను సద్గుణములు గలవాడను, నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను, నేను గృహస్థుడను, నేను బ్రహ్మచారిని, నేను స్వధర్మానుష్ఠానము యథావిధిగా నెరవేర్చుచున్నాను- ఇత్యాదిక మగు నహంకారమును వదలిపెట్టుట యమానిత్వ మనబడును.

అదంభిత్వము

ధ్యానపూజాదికం లోకదృష్టివ్యాప్త్యర్థే కరోతి యః
పారమార్థికధీహీన స్స దంభాచార ఉచ్యతే.

తా॥ దేవతాజపాద్యనుష్ఠానమును, స్నానసంధ్యాదికమును, దేవ గురు బ్రాహ్మణ పూజాదికమును, పారమార్థికబుద్ధితో కాక లోకమందలిజనులు చూచుటకొరకును వారలచే శ్లాఘింపబడుటకును, ఎవ డాచరించునో వాడు దాంభికు డనబడును. అట్టిది లేక ఇతరులు

చూడకుండునట్లు గుప్తముగను, పారమార్థికబుద్ధితోను పైజప తపః పూజాదుల నాచరించుటయే అదంభిత్వమనబడును. ఇట్టి గుణముల నలవరచుకొని వేదాంతవాక్యశ్రవణమననాదు లొనర్చవలయును. ఏలననగా.

## ——♦ శ్రవణమనన నిదిధ్యాసలక్షణము ♦——

శ్రవణాన్మననా ద్ధ్యానా త్తాత్పర్యేణ నిరంతరమ్
బుద్ధే స్సూక్ష్మత్వ మాయాతి తతో వస్తూపలభ్యతే
మందప్రజ్ఞావతాం తస్మా త్కరణీయం పునః పునః
శ్రవణం మననం ధ్యానం సమ్యగ్వస్తూపలబ్ధయే.

తా॥ వేదాంతవాక్యములను శ్రవణమొనర్చుటచేతను తదర్థమును నిరంతరము మననమొనర్చుటచేతను అంతఃకరణమందు తదేక దృష్టితో ధ్యానమొనర్చుటచేతను బుద్ధికి సూక్ష్మత్వము వచ్చును. అనగా చిత్తమునకు విక్షేపము తగ్గును. కాన మందబుద్ధిగలవారు నిరంతర మీశ్రవణమననాదుల నొనర్చుచున్నచో క్రమముగా సమ్యగ్వస్తు వగుబ్రహ్మముయొక్క జ్ఞానోపలబ్ధి కలుగును.

## ——♦ శ్రవణలక్షణము ♦——

సర్వవేదాంతవాక్యానాం షడ్భి ర్లింగై స్తదద్వయే
పరే బ్రహ్మణి తాత్పర్యనిశ్చయం శ్రవణం భవేత్.

తా॥ ఏవీధిలోనో ఏపురాణప్రవచనమందో యొకానొక వేదాంతవాక్యమును విన్నంతమాత్రమున నయ్యది శ్రవణ మనబడదు. సద్గురువులను యథావిధిగా నుపసదనమొనర్చి వారివలన సర్వవేదాంత వాక్యముల నధ్యయనమొనర్చుచు, 1. ఉపక్రమము, 2. ఉపసంహారము, 3. అభ్యాసము, 4. అపూర్వతాఫలము, 5. అర్థవాద, 6. ఉపపత్తి యను ఆరులింగములతో సత్యజ్ఞానానంతానందబ్రహ్మమందే అన్నివేదాంతములకు పరమతాత్పర్యమని నిశ్చయించుపరకు వారియొద్ద విద్యను గ్రహించుటయె శ్రవణ మనబడును.

## —♦ మననలక్షణము ♦—

శ్రుత స్యైవాద్వితీయస్య వస్తునః ప్రత్యగాత్మనః
వేదాంతవాక్యానుగుణయు క్తిభి స్త్వనుచింతనమ్
మననం త చ్ఛ్రుతార్థస్య సాక్షాత్కారస్య కారణమ్.

తా॥ అఖండసచ్చిదానందబ్రహ్మమందే సర్వవేదాంతములకు తాత్పర్యమనియు, అట్టిబ్రహ్మమే తాననియు, గురువునొద్ద వరించినపుడు వినినవేదాంతార్థమునే లౌకికయుక్తులతో, దృష్టాంతములతో, తనమనస్సులో దృఢమగునట్లు చింతించుటయే మనన మనబడును. ఈమననము గురువుకడ విద్య నభ్యసించునపుడు తత్త్వవివరణమువలన గల్గినపరోక్షబ్రహ్మజ్ఞాన మపరోక్షమగుటకు సాధనమగుచున్నది.

## —♦ తత్త్వ వివరణము ♦—

వరాహోపనిషత్తు

శ్రు॥ చతుర్వింశతితత్త్వాని కేచి దిచ్ఛంతి వాదినః కేచిత్ షట్త్రింశ త్తత్త్వాని కేచి త్షణ్ణవతీనిచ తేషాం క్రమం ప్రవక్ష్యామి సావధానమనాః శ్రుణు.

తా॥ తత్త్వములు 24 అని కొందరు, కొందరు 36 అనియును మరికొందరు 96 అనియును చెప్పెదరు. ఆవివరము నెరింగించెదను సావధానచిత్తుడవై వినుము.

## —♦ చతుర్వింశతి 24 తత్త్వములు ♦—

శ్రు॥జ్ఞానేంద్రియాణి పంచైవ శ్రోత్రత్వ గ్లోచనాదయః కర్మేంద్రియాణి పంచైవ వాక్పాణ్యంఘ్రా్యాదయః క్రమాత్ చతుర్వింశతి తత్త్వాని బ్రహ్మవిదో విదుః.

1. చెవి, చర్మము, నేత్రము, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియములు 5.
2. నోరు, చేయి, కాలు, గుదము, ఉపస్థ అను కర్మేంద్రియములు 5.

3. ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము అను ప్రాణవాయువులు 5.

4. శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అను తన్మాత్రలు 5.

5. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను అంతఃకరణములు 4

ఇవి ఇరువదినాలుగును చతుర్వింశతి తత్త్వములని బ్రహ్మజ్ఞానులు తెలిసికొని యున్నారు.

—♦ షట్త్రింశత్ 36 తత్త్వములు ♦—

శ్రు॥ ఏతై స్తత్త్వై స్సమం పంచీకృతభూతాని పంచచ, పృధివ్యాప స్తథా తేజో వాయురాకాశ ఏవచ, దేహత్రయం స్థూల సూక్ష్మకారణాని విదు ర్బుధాః, అవస్థాత్రితయం చైవ జాగ్రత్స్వప్నసుషుప్తయః ఆహోత్య తత్త్వజాతానాం షట్త్రింశ న్మునయో విదుః.

తా॥ పైన చెప్పినతత్త్వములు 24 ను, పృథివి, జలము, తేజస్సు, (అగ్ని) వాయువు, ఆకాశము అను భూతములు 5.

స్థూల, సూక్ష్మ, కారణము, అను శరీరములు 3.

జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి అను అవస్థలు 3.

జీవుడు 1.

చేరి 36 తత్త్వములు అగుచున్నవి.

—♦ షణ్ణవతి 96 తత్త్వములు ♦—

శ్రు॥ పూర్వోక్తై స్తత్త్వజాతై స్తు సమం తత్త్వానియోజయేత్, షడ్భావవికృతి శ్చాస్తి జాయతే వర్ధతేపిచ, పరిణామం క్షయం నాశం షడ్భావవికృతిం విదుః, అశనాచ పిపాసాచ, శోకమోహౌ జరామృతీ, ఏతే షడూర్మయః ప్రోక్తాష్షట్కోశానథ వచ్మి తే, త్వక్చ రక్తం మాంస మేదో మజ్జాస్థీని నిబోధత, కామ క్రోధౌ లోభ మోహౌ మదమాత్సర్య మేవచ, ఏతేరిషట్కం విశ్వశ్చ తైజసః ప్రాజ్ఞఏవచ, జీవత్రయం సత్త్వరజ స్తమాగ్

సిచ గుణత్రయం, ప్రారబ్ధాగామ్యార్జితాని కర్మత్రయ మితీరి
తం, వచనాదానగమనవిసర్గానందపంచకం, సంకల్పోధ్యవసా
యశ్చ క్రియానిర్వృతి శేవచ అభిమానోవధారణా, ముదితా
కరుణామైత్రీ ఉపేక్షాచ చతుష్టయం, దిగ్వాతార్క ప్రచేతో
శ్వివహ్నీంద్రో పేంద్ర మృత్యుకాః, తథా చంద్రశ్చతుర్వక్త్రో
రుద్రక్షేత్రజ్ఞ ఈశ్వరాః, ఆహత్య తత్త్వజాతానాం షణ్ణవత్య
స్తు కీర్తితాః పూర్వోక్త తత్వజాతానాం వైలక్షణ్య మనా
మయం, విముక్తాజ్ఞాన తత్కార్యా జీవన్ముక్తా భవంతి తే.

తా॥ పైనచెప్పిన 36 తత్త్వములతోగూడ, అస్తి (ఉండుట) జన్మము, వృద్ధి, పరిణామము, క్షీణించుట, నాశమొందుట, అనువికారములు 6 ఆరు, ఆకలి, దప్పి, శోకము, మోహము, ముదిమి, మరణము 6 సంసారసాగరతరంగము లనబడు షడూర్ములు, చర్మము, రక్తము, మాంసము, కొవ్వు, మజ్జ, అస్థి అను నీయారు కోశములును కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను అరిషడ్వర్గము 6 ఆరును, విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, అనుజీవులు, 3 ముగ్గురును, సత్వము, రజస్సు, తమస్సు, అనుగుణములు 3 మూడు, ప్రారబ్ధము అగామి, సంచితము. అను కర్మలు 3 మూడు, మాటలాడుట, ఎత్తుట, నడచుట, మలజలము లను విసర్జించుట విషయానందము అనునీకర్మేంద్రియవ్యాపారములు 5 అయిదు, సంకల్పము, ప్రయత్నము, అభిమానము, నిశ్చయము అనునీ 4 నాలుగు అంతఃకరణ చతుష్టయము, సంతోషము, దయ, స్నేహము, ఉపేక్ష అనునీ 4 నాలుగు గుణవిశేషములును, దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీదేవతలు, అగ్ని, ఇంద్రుడు, మృత్యువు, చంద్రుడు చతుర్ముఖబ్రహ్మ విష్ణువు, రుద్రుడు, క్షేత్రజ్ఞుడు, ఈశ్వరుడు అనునివి యన్నియును చేరి 96 తొంబదియారు తత్త్వములు అని చెప్పబడును. ఈచెప్పిన తత్త్వములకు విలక్షణమైనదియు అనామయమైనదియు, సత్యజ్ఞానానంతానందరూపమయిన పరమేశ్వరుని దర్శించువారు అజ్ఞానము, తత్కార్యములు అనువీనినుండి విడివడి జీవన్ముక్తు లయ్యెదరు.

—♦ నిదిధ్యాసలక్షణము ♦—

విజాతీయశరీరాదిప్రత్యయత్యాగపూర్వకమ్
సజాతీయాత్మవృత్తీనాం ప్రవాహాకరణం యథా
తైలధారావదచ్ఛిన్నవృత్త్యా త ద్ధ్యాన ముచ్యతే.

తా॥ నానిజరూపము సత్య, జ్ఞానానంద, అనంతమైనది. అనృత, జడ, దుఃఖ, పరిచ్ఛిన్నమైన దీదేహాదిజగత్తు. అనేకజన్మలనుండి అవిద్యావశమున ఈదేహాదికమే నేనని తలచుచు వ్యవహరించుట పరిపాటియైనది. కాన దేహాదికమే నే ననువిజాతీయవ్యవహారజ్ఞానవృత్తుల నెంతమాత్రము రానీయక బ్రహ్మమే నే నను వృత్తినిమాత్రమే అంతఃకరణమందు అవిచ్ఛిన్నతైలధారవలె నుంచుటయే ధ్యానము లేక నిదిధ్యాసన మనబడును. అంతఃకరణము బహుచంచలమైనందున ప్రతిక్షణమందును ఎద్దియో యొకవృత్తిని గల్గియేయుండును. కాన నట్టియంతఃకరణవృత్తికి దేహేంద్రియాదిజగత్తును విషయముగానీయక నిరంతరముబ్రహ్మము నే విషయముగా నొనర్చుటయే నిదిధ్యాసన మనబడును. ఇట్టిజిజ్ఞాస పాపములు లేక శుద్ధమగు అంతఃకరణము గలవారికిమాత్రమే కలుగును అట్టిపాపక్షయమునకు యమ, నియ, మాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధు లనునెనిమిది అంగములతో నొప్పుయోగము సాధనమని పతంజలిసూత్ర మిట్లున్నది.

—♦—

## యోగవివరణము

సూ॥ యోగాంగానుష్ఠానా దశుద్ధిక్షయే జ్ఞానదీప్తి రావివేకఖ్యాతేః

తా॥ యోగాంగముల ననుష్ఠించుటచే పాపక్షయము కాగా వివేకము పుష్కలముగా గల్గువరకును జ్ఞాన ముద్దీపించును

యోగాంగములనగా

సూ॥ యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా. ధ్యాన, సమాధయోఽష్టా వంగాని–

తా॥ యమాదు లెనిమిదియు నని పతంజలి నుడివెను.

## —♦ యమలక్షణము ♦—

సూ॥ అహింసా, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, అపరిగ్రహా యమాః.

తా॥ ఇతరులను హింసింపకుండుట, సత్యవదనము, దొంగతనము చేయకపోవుట, బ్రహ్మచర్యము ఇతరులవస్తువుల నెట్టిస్థితిలోను ఎంత మాత్రము గ్రహింపకుండుట యనునవి యమము లనబడును.

## —♦ నియమలక్షణము ♦—

సూ॥ శౌచ, సంతోష, తపః, స్వాధ్యాయ, ఈశ్వరప్రణిధానాని నియమాః

తా॥ బాహ్యమలమును మృజ్జలాదులతో ప్రక్షాళన మొనర్చుట బాహ్యశౌచ మనబడును. సర్వభూతములందును మైత్రితో నుండుట యాభ్యంతరశౌచ మనబడును. ఎల్లప్పుడు దురాశారహితుడై తృప్తి నొందియుండుట సంతోష మనబడును. తపస్సు, వేదాధ్యయనము, ఈశ్వరధ్యానము లనునవి నియమము లనబడును.

## —♦ ఆసనలక్షణము ♦—

సూ॥ స్థిరసుఖ మాసనమ్.

తా॥ శరీరమున కెట్టికదలిక లేక ఎట్టిఉద్వేగములు లేకయుండు నట్లు చేల, అజిన, కుశాదులపై పద్మాసనాదికముతో కూర్చుండుట యాసన మనబడును.

## —♦ ప్రాణాయామలక్షణము ♦—

సూ॥ తస్మిన్సతి శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః

తా॥ పైన జెప్పబడిన స్థిరసుఖ మగునాసనము సిద్ధించగా లోపలినుండి బయటకు వచ్చుగాలి యగుశ్వాసను బయటనుండి లోపలకు పీల్చుగాలి యగుప్రశ్వాసమును పోనీయకుండ నిరోధించు టయే ప్రాణాయామ మనబడును. అందు బయటకు వచ్చుగాలి యగు

శ్వాసయొక్క గతినిరోధమే రేచక మనబడును. బయటనుండి లోపలకు పీల్చుగాలి యగు ప్రశ్వాసయొక్క గతినిరోధమే పూరక మనబడును. లోపల నీ రెంటిని స్తంభింపజేయుటయే కుంభక మనబడును.

—♦ ప్రత్యాహార లక్షణము ♦—

సూ॥ స్వవిషయాసంప్రయోగే, చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం, ప్రత్యాహారః.

తా॥ జాగ్రద్దశలో ఆత్మచైతన్యప్రతిబింబవిశిష్ట మగునంతఃకరణము చక్షురాదీంద్రియములతో కలియుట. ఆ ఇంద్రియములు ఘటాదిపదార్థములతో కలియుటచేత ఘటాదిరూపవిజ్ఞానములు కలుగుచున్నవి. ఈ ప్రాణాయామానంతరకాలములో చక్షురాదీంద్రియముల నన్నిటిని రూపాదివిషయ బాహ్యవిషయములతోగాని స్మృతిరూప ఆంతరవిషయములతోగాని కలుపక ఆ ఇంద్రియములను అంతఃకరణమందే లీనమగున ట్లొనర్చుట ప్రత్యాహార మనబడును. ఈ కాలములో ఇంద్రియములు తమవిషయములనుండి మరలింపబడి తమ కారణమందు లయమైనవానివలె నుండుటచే ప్రత్యాహార మనునన్వర్థ సంజ్ఞ గల్గినది.

—♦ ధారణాలక్షణము ♦—

సూ॥ దేశబంధ శ్చిత్తస్య ధారణా.

తా॥ నాభిచక్ర, నాసాగ్రాది, ప్రదేశవిశేషమందు చిత్తమును బంధించి, ఎట్టివిషయసంకల్పములను చిత్తములోనికి రానీయకుండ స్థిరీకరించుటయే ధారణ యనబడును.

—♦ ధ్యానలక్షణము ♦—

సూ॥ తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్.

తా॥ ఏనాసాగ్రాదిప్రదేశవిశేషమందు చిత్తము స్థిరముగా ధరింపబడియుండెనో ఆప్రదేశమందే జ్ఞానమును విసదృశపరిణామము లేకుండునట్లుగా ధారణయం దేది ఆలంబనముగా నొనర్పబడెనో

దానినే యాలంబనముగా గైకొని నిరంతరముగా నుంచుట ధ్యాన మనబడును. అనగా అంతఃకరణమున కేట్టియీశ్వరుని విషయముగా నొనర్చి, లేక ఆలంబనముగా గైకొని స్థిరమొనర్పబడెనో లేక ధారణ యొనర్పబడెనో యట్టి ఈశ్వరాకారపరిణతమగునట్లు చిత్తముండి తదితరములను చిత్తములోని కెంతమాత్రము రానీయకుండుటయే ధ్యాన మనబడును.

—♦ సమాధిలక్షణము ♦—

సూ॥ తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః

తా॥ ఆ ధ్యానమే ధ్యేయవస్తుపరిణత మగునంతఃకరణవృత్తి యైనపుడు చిత్తము; చిత్తముగాక ధ్యేయవస్తువే యగునపుడు సమాధి యనబడును అనగా ధ్యానమందు ధ్యాత యగుతాను ధ్యేయుడగు ఈశ్వరుడు ధ్యానరూపక్రియ లనుమూడువస్తువులయొక్క భాన ముండును. ఈ మూటిలో రెండు నశించి సర్వము ధ్యేయమాత్రమే యైనపుడు సమాధి యనబడును.

ఇ ట్లష్టాంగములు సలక్షణముగా వివరింపబడినవి ఇందు ధారణా ధ్యాన, సమాధులు మూడును ఒకే ఈశ్వరవిషయమందు కూడి యుండుటయే సంయమ మనబడును.

ఇందలి ధ్యానమె వేదాంతవాక్యశ్రవణ మననములయనంతర మైన దగునిదిధ్యాస యనబడును. ఆనిదిధ్యాసయొక్క పరిపాకదశయే సమాధి యనబడును.

ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమా ద్ధ్యేయైకగోచరమ్
నివాతదీపవ చ్చిత్తం సమాధి రభిధీయతే.

తా॥ చిత్తము ధ్యాతను ధ్యానక్రియను క్రమముగా విడిచి ధ్యేయమొక్కటియె విషయముగా గలదగుచు గాలి లేని(పె)దేశమందున్న దీపమువలె నిశ్చలముగా నెపుడుండునో అపుడు సమాధి యని చెప్పబడును.

—♦—

## సమాధి భేదములు

ఇక నీ, సమాధిభేదములు వివరింపబడును.

—♦ సవికల్పక సమాధి ♦—

జ్ఞాత్రాద్యవిలయేనైవ జ్ఞేయబ్రహ్మణి కేవలే
తదాకారాకారితయా చిత్తవృత్తే రవస్థితిః
సద్భి స్సఏవ విజ్ఞేయ స్సమాధి స్సవికల్పకః.

తా॥ తెలిసికొనువాడగుజ్ఞాత తెలిసికొనుట యనుక్రియ తెలిసికొనబడుబ్రహ్మ మనునీమూటిలో జ్ఞాతృ, జ్ఞానములభానము పోకుండగనే తనచిత్త మద్వితీయబ్రహ్మమందు బ్రహ్మాకారాకారితవృత్తితో నొప్పియుండుటయే సవికల్పకసమాధి యనబడును

♦ నిర్వికల్పక సమాధి ♦

స్వానుభూతిరసావేశా ద్దృశ్యశబ్దానపేక్షితః
నిర్వికల్పసమాధి స్స్యా న్నివాతస్థితదీపవత్.

తా॥ జ్ఞాతృ, జ్ఞానము లనుభావమును వదలిపెట్టునట్లుచేయు స్వాత్మానందానుభవరసావేశముచే జగద్భానముగాని అంతకుపూర్వము తాను శ్రవణమొనర్చిన వేదాంతవాక్యజ్ఞానభానముగాని లేక గాలిలేని ప్రదేశమం దున్నదీపమువలె చలింపక బ్రహ్మాకారమునొందిన యంతఃకరణరూపముతో నుండుటయే నిర్వికల్పకసమాధి యనబడును.

—♦ సంప్రజ్ఞాత సమాధి ♦—

బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహోఽహంకృతిం వినా
సంప్రజ్ఞాతసమాధి స్స్యా ద్ధ్యానాభ్యాసప్రకర్షతః.

తా॥ దేహమే నేననిగాని దేహముతో నాకు సంబంధ మున్నదనిగాని ఇంద్రియవృత్తులకు తాను కర్తననిగాని ఎట్టిఅభిమానమును లేక నిరంతరముగా ఉత్కృష్ట మగుధ్యానము నభ్యసించుచు తత్పరిపాకదశయందు బ్రహ్మాకార మొందిన, మనోవృత్తిప్రవాహమే సంప్రజ్ఞాతసమాధి యనబడును.

## —♦ అసంప్రజ్ఞాత సమాధి ♦—

ప్రశాంతవృత్తికం చిత్తం పరమానందదీపకమ్
అసంప్రజ్ఞాతనామాయం సమాధి ర్యోగినాం ప్రియః.

తా॥ మనస్సు ఎట్టిసంకల్పాదివృత్తులు లేక ప్రశాంతమైయుండి తాను పరమానందరూపుడుగా వెలుగొందుచుండుటయే అసంప్రజ్ఞాత సమాధి యనబడును. ఇయ్యది జ్ఞానయోగుల కత్యంతప్రియమైనది.

దీనిలక్షణము మరియొకచోట నిట్లు చెప్పబడినది.

## —♦ యోగుల ముఖ్యసమాధి ♦—

వృత్తిహీనం మనః కృత్వా క్షేత్రజ్ఞం పరమాత్మని
ఏకీకృత్య విముచ్యేత యోగోఽయం ముఖ్య ఉచ్యతే

తా॥ మనస్సులో నెట్టిసంకల్పాదివృత్తియు లేకుండునట్లు జేసి తనదేహమందు సాక్షిగా నుండుఆత్మయే పరమాత్మయను జీవ బ్రహ్మైభేదజ్ఞాననిశ్చయముతో నుండుటయే మోక్షమునకు ముఖ్య సాధనముగా చెప్పబడినది.

వృత్తయస్తు తదానీ మజ్ఞాతా అప్యాత్మగోచరాః
స్మరణా దనుమీయంతే వ్యుత్థితస్య సముత్థితాత్.

తా॥ ఈ సమాధిసామాన్యమందు మనోవృత్తి లేనపుడు ధ్యేయైకగోచరత్వముమాత్ర మున్నదని ఎట్లు నిశ్చయింపనగుననగా ఆసమాధినుండి లేచినవానికి 'ఇంతకాలము నేను సమాధిలోనుంటిని' అను స్మరణమువలన సమాధికాలమం దాత్మయే గోచరవిషయముగా గలమనోవృత్తులున్న ట్లనుమానప్రమాణముచే నూహింపబడుచున్నవి.

వృత్తీనా మనువృత్తిస్తు ప్రయత్నా త్ప్రథమాదపి
అదృష్టాసకృదభ్యాససంస్కారసచివా ద్భవేత్.

తా॥ అంతఃకరణవృత్తులకు పురుషప్రయత్న ముండవలెను. ప్రతిక్షణమందును ప్రతిచిత్తవృత్తివిశేషమునకును బ్రతివాడు ప్రయత్నించుచుండుట లోకసిద్ధము. గాన పైసమాధికాలమందు ధ్యేయ

మగునాత్మమాత్రమే గోచరముగా గలవృత్తులయొక్క ప్రవాహము నకు సమాధిలో నున్నసాధకునిప్రయత్న మెంతమాత్రము లేదుగదా. లేక ప్రయత్నమున్నదన్నచో నయ్యది సమాధియే గాకపోవును. ప్రయత్నమే లేదన్నచో నావృత్తులప్రవాహ మెట్లు గల్గును? అను నాశంక గలుగ నద్దానికి సమాధాన మిట్లుచెప్పబడుచున్నది. సమాధ్యారంభ కాలిక మగుధ్యేయైకగోచరప్రయత్నమువలనను అనేకజన్మలందీత డాచరించినపుణ్యకర్మప్రభావముచేతను అనేకపర్యాయము లిత డొనర్చిన వేదాంతవాక్యమననసామర్థ్యమువలనను గల్గును. ఇందు కనువగునిర్గుణోపాసనము వివరింపబడుచున్నది.

## — ♦ నిర్గుణోపాసనము ♦ —

శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్.

తా॥ వేదాంతవాక్యశ్రవణమననములను పుష్కలముగా నొనర్చిన పరమహంసలయనుష్ఠానవిశేషమే నిర్గుణోపాసన మనబడును. మనస్సు నాత్మయం దుంచుటయనగా ఈ జగమంతయు ఆత్మయేగాని యంతకంటె వేరుగా నెద్దియు లేదనుస్థిర మగునిశ్చయముతో నుండి ఎట్టితొందరపాటును లేక క్రమముగాను నెమ్మదిగాను ధైర్యముతో నొప్పుబుద్ధిదార్ఢ్యముచేత ఇంద్రియవృత్తులనుగాని ప్రాపంచవస్తువిషయక సంకల్పాదులనుగాని ప్రసరింపనీయకుండుటయే నిర్గుణోపాసన మనబడును.

నిశ్చిత్య సకృదాత్మానం యదాపేక్షేత దైవతమ్
వక్తుం తం తం తథా ధ్యాతుం శక్నోత్యేవ హి తత్త్వవిత్.

తా॥ ఒకసారి తనయాత్మయథార్థస్వరూపమును నిశ్చయముగా తెలిసికొని బ్రహ్మమే తా ననుసాక్షాత్కారము నొందినవాడు తన కిష్టమైనపుడు తన యాత్మానుభవము నితరులకు చెప్పుటకును ఎపుడైనను తనస్వరూపసాక్షాత్కార మొందుటకును ధ్యానాదులు సల్పుటకున

ఇతరులచే సల్పించుటకును సమర్థుడగును. ఇట్టివాడే తత్త్వదర్శి. ఇతడే నిర్గుణోపాసకు డనబడును.

యావ ద్విజ్ఞానసామీప్యం తావ చ్ఛ్రైష్ఠ్యం వివర్ధతే
బ్రహ్మజ్ఞానాయతే సాక్షా న్నిర్గుణోపాసనం శనైః.

తా॥ ఇట్టినిర్గుణోపాసన చేయుచుండగా అభ్యాసపాటవముచేత ఎంతహెచ్చుకాల మిట్లు వినియోగింపగలుగునో అంతబ్రహ్మభావమునకు సమీపమునొందును. దీనిపరిపాకదశయే బ్రహ్మజ్ఞాన మనబడును. ఎట్లనగా.

నిర్గుణోపాసనం పక్వం సమాధి స్స్యా చ్ఛనై స్తతః
య స్సమాధి ర్నిరోధాఖ్య స్సోఽనాయాసేన లభ్యతే.

తా. ఇట్టినిర్గుణోపాసనము పరిపాకమునొందగా నయ్యది మెల్లగాను, క్రమముగాను, సవికల్పకసమాధి యగును. అటనుండి క్రమముగా నిరోధమనుపేరుగల నిర్వికల్పసమాధి సులభముగా పొందబడును. ఇట్టినిర్వికల్పసమాధిస్థితిలో నుండువాడే బ్రహ్మజ్ఞాని యనబడును.

నిరోధలాభే పుంసోంత రసంగం వస్తు శిష్యతే,
పునఃపున ర్వాసితేస్మి న్వాక్యా జ్జాయేత తత్త్వధీః.

తా॥ ఇట్టినిరోధ మనుపేరుగలనిర్వికల్పసమాధి లభింపగా అసంగచిద్రూపము మాత్రమే వానికి భాసించును. దేహేంద్రియాంతఃకరణాదిక మెంతమాత్రము భాసింపదు. ఇట్లు అసంగచిద్రూపభానము మాటిమాటికి ప్రతిసమాధియందును కలుగుచుండగా ఆత్మైకత్వప్రతిపాదక మగుమహావాక్యములవలన గలిగినజ్ఞానముతో నీయసంగచిద్రూపమే తా నను నిశ్చయము గల్గును. ఎట్లనగా

నిర్వికారాసంగనిత్యస్వప్రకాశైకపూర్ణతాః
బుద్ధౌ ఝటితి శాస్త్రోక్తా ఆరోహం త్యవివాదతః,

తా॥ శాస్త్రమందు తాను పఠించిన ఆత్మలక్షణములగు నిర్వికారత్వము, అసంగత్వము, నిత్యత్వము, స్వప్రకాశత్వము, ఏకత్వము, పూ ము మొదలగునవి ఈకాలమందు తన కనుభవములోనికి

రాగా పరోక్షబ్రహ్మజ్ఞాన మపరోక్షమగును. అపుడు తానే బ్రహ్మ మనునిశ్చయము గల్గును.

ఉపాసనం నాపి పక్వ మిహ యస్య పరత్ర సః
మరణే బ్రహ్మలోకే వా తత్త్వం విజ్ఞాయ ముచ్యతే.

తా॥ ఇట్లు సంపూర్ణ మగునిశ్చయజ్ఞానము గలుగువరకు నిరంతర మీయభ్యాస మొనర్చినవారికి విదేహముక్తియే గల్గును. కాని ఈనిర్గుణోపాసనము పక్వమగువరకు నిటనే యభ్యసించుచుండగా వీని కీప్రకృత దేహము నశించు నెడల నపు డీతడు కార్యబ్రహ్మలోకమునకు పోవును. అచట అపరోక్షాత్మానుభవము నొంది క్రమముగా ముక్తుడగును.

నిర్గుణోపాస్తిసామర్థ్యా త్తత్ర తత్త్వ మవేక్షతే
పునరావర్తతే నాయం కల్పాంతే చ విముచ్యతే.

తా॥ అట్టివాడు మరుజన్మలో బ్రహ్మలోకమందు పుట్టుటతోడనే ఇచట నాచరించిన నిర్గుణోపాసనాసామర్థ్యముచే నీ జ్ఞానమంతయు నచట గల్గి ఆపైతరువాయినిమాత్రమే పూర్తిచేసి అపరోక్షాత్మానుభూతి నొందును. అచట బ్రహ్మమానముచే నూరుసంవత్సరము లుండి యనంతర మాబ్రహ్మలోకాధిపతితోపా టీతడుగూడ ముక్తుడగును అంతేగాని అతడు తిరిగి జననమరణాది సంసారధర్మమునుమాత్రము పొందడు.

ఇహ వా మరణే చాస్య బ్రహ్మలోకేఽథవా భవేత్
బ్రహ్మసాక్షాత్కృతి స్సమ్య గుపాసీనస్య నిష్ఫలమ్.

తా॥ కాన నిట్టినిర్గుణోపాసకున కిపుడుగాని మరణానంతరమందు బ్రహ్మలోకమునగాని తప్పక అపరోక్షబ్రహ్మసాక్షాత్కారము గల్గును.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యా మంతకాలేపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి.

తా॥ ఈపై జెప్పబడినదియె 'బ్రాహ్మీస్థితి' యనబడును. ఇట్టిస్థితి నొందినవాడు తిరిగి మోహరూపసంసారము నెన్నటికిని

పొందడు. ప్రాణోత్క్రమణసమయమం దిట్టిబ్రాహ్మీస్థితి నొందినను విదేహముక్తిని పొందును.

అనుభూతే రభావేపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్
అప్యస త్ప్రాప్యతే ధ్యానా న్నిత్యాప్తం బ్రహ్మ కిం పునః?

తా॥ అపరోక్షాత్మజ్ఞానము లేకున్నను 'అహం బ్రహ్మాస్మి' యనగా నేనే బ్రహ్మమును అని నిరంతరము తదేకదృష్టితో ధ్యానించు వాడు తప్పక ఆధ్యానబలముచేతనే బ్రహ్మమును పొందగలడు. ధ్యానముయొక్క సామర్థ్యముచేత పరమార్థసత్యములుగానట్టి దేవతాదులుగూడ పొందబడుచుండగా సర్వులకును నిత్యముగా పొందబడియున్న బ్రహ్మము పొందబడుట కేమి సందేహము గలదు ? తప్పక పొందబడును. అట్టినిరంతరధ్యానమువలన ద్వైత మగుప్రపంచమందు గర్హ్యభావ మేర్పడును.

ద్వైతావజ్ఞా సుస్థితా చే దద్వైతే ధీ స్స్థిరా భవేత్
స్థైర్యే తస్యాః పుమా నేష జీవన్ముక్త ఇతీర్యతే.

తా॥ ఈ పరిదృశ్యమానమై అనృత, జడ, దుఃఖ, పరిచ్ఛిన్న స్వభావ మగు జగత్తునందు హేయభావము విచారణచే స్థిరముగా గలుగగా అద్వితీయబ్రహ్మమందు స్థిరమగుబుద్ధి ఏర్పడి అట్టివాడైన ఈసాధకు డపుడు జీవన్ముక్తుడని చెప్పబడును. అంతకాల మనగా,

న దద్వైతేఽనృతద్వైతే యదన్యోన్యైక్యవీక్షణమ్
తస్యాంతకాల స్తద్భేదబుద్ధిరేవ న చేతరః.

తా॥ సత్య, జ్ఞాన, అనంత, ఆనందరూప మగునాత్మను, అనృత జడ, పరిచ్ఛిన్న, దుఃఖరూపమగు దేహేంద్రియాది ద్వైతమును, కలిపి ఒకదానియందు రెండవదానిదృష్టి గలిగియుండుటయు, అట్లే ఒకదాని ధర్మములందు రెండవదానిధర్మము లనెడిభ్రాంతి కల్గియుండుటయు, లోకమున ఆబాలగోపాలప్రసిద్ధముగా ఆజన్మసిద్ధమై యున్నది. ఇదియే అధ్యాసయనియు అవిద్యయనియు చెప్పబడును. ఇట్టి వ్యవహారమును

చేయువాడు ద్వైతి యనబడును. ఇవి రెండును పరస్పరవిలక్షణములని తెలిసికొని ఈయభేదభావమును తొలగించి ఈరెంటికి భేదమును గ్రహించి భిన్నభిన్నములనుగా గ్రహించుటయే ద్వైతావస్థ యనబడును. ఇదియే అద్వైతమందలిస్థిరబుద్ధి యనిగూడ ననబడును. ఇట్టి బుద్ధి గలుగుమొదటిక్షణము వెనుకజెప్పిన ద్వైతావస్థకు తుదిక్షణమగును.

యద్వాంతకాలః ప్రాణస్య వియోగోస్తు ప్రసిద్ధితః
తస్మిన్కాలేపి న భ్రాంతే ర్గతాయాః పునరాగమః.

తా॥ మరియొక పక్షమందు లోకప్రసిద్ధి ననుసరించి ప్రాణోత్క్రమణకాలమే అంతకాలమనబడును. అట్లైనను అద్వైతజ్ఞానముగల్గి ద్వైతభ్రాంతిని పోగొట్టుకొన్నవానికి ఆయంతకాలమందుగూడ తిరిగి ఆద్వైతభ్రాంతి రానేరదు. ఇట్టి అవిద్యను మూడువిధములుగా పెద్దలు విభజించిరి. ఇదియే మలమని పాపమనిగూడ చెప్పబడును.

♦ మలత్రయ వివరణము ♦

ఆణవం గర్భసంబంధ మణురూపవ్యవస్థితమ్
మాయికం జాతిభేదం చ మోహా ఇత్యభిధీయతే.
కార్మికం దర్వ్యసంబంధ మీషణత్రయసంయుతమ్
ఇదం మలత్రయం దోషం గురుశ్చైవ విమోచయేత్.

తా॥ ఆణవమలము మాయికమలము కార్మికమలము- అని మలము మూడువిధములు.

1. పూర్వజన్మయందలిపాపము సూక్ష్మరూపమును ధరించి ఈజన్మారంభకాలమందు తల్లిగర్భములో నున్నపుడు ఆ తల్లిదండ్రుల యొక్క శుక్లశోణితసంబంధముచేతను గర్భవాససంబంధముచేతను ఇతనికి సంక్రమించినమలము ఆణవమల-మనబడును.

2. బ్రాహ్మణాదిజాతులలో నాయాజాతియందు పుట్టుటకు కారణమైనట్టియు నేను ఈజాతివాడను నేను గొప్పవాడను నేను

విద్యావంతుడను, ఇత్యాదిమోహమునకు కారణమైనట్టియు పాపము మాయికమల మనబడును.

3. తనచే ననుభవింపబడు వస్తువులసంబంధముచే గల్గినదియు ధనేషణ దారేషణ పుత్రేషణలకు కారణమైనదియు నగుపాపము కార్మికమల మనబడును. ఇట్టిమూడువిధము లగుమలములు సద్గురువుచేతనే పోగొట్టబడదగినవి. ఇందాణవికమలము, అంతఃకరణమునకు పరబ్రహ్మవిద్య బోధపడకుండునట్లు ప్రతిబంధించును మాయికమలము ప్రపంచముయొక్క అస్థిరత్వము నెంతచెప్పినను బోధపడకుండునట్లు ప్రతిబంధించును. కార్మికమలము కేవలైహికసుఖముల కొరకు మాత్రమే పురుషుని ప్రవర్తింపజేయుచు ఈషణత్రయముతో వానిని నిరంతరము బాధించుచు ఆముష్మికశ్రేయస్సాధనముల నెంతచెప్పినను అనుష్ఠించుటకు ప్రతిబంధములను కలుగజేయును ఈమల మనబడు పాపమే వాచిక, కాయిక, మానసికభేదములచే మరియొకవిధముగా విభజింపబడినది. అందు వాచికమలమువలన-

పారుష్య మనృతం చైవ పైశున్యం చాపి సర్వశః
అసంబద్ధప్రలాపశ్చ వాఙ్మయం స్యా చ్చతుర్విధమ్.

తా॥ ఇతరులహృదయములకు వేదన కలుగజేయునట్టిపరుష వాక్కులను మాట్లాడుటయు అసత్యములాడుటయు ప్రతివారియందును ఏద్దియో యొకదోషము నారోపించుటయు వ్యర్థప్రసంగముల నొనర్చుటయు గల్గును. ఇట్టివాచకమలము నీజన్మలో ప్రాయశ్చిత్తాదులచే పోగొట్టుకొననియెడల-

శ్రు॥ వాచికై ర్మృగపక్షితామ్.

తా॥ అట్టివాడు ముందుజన్మలో మృగయోనులందును పక్షియోనులందును పుట్టును. ఇక మానసికమలమువలన-

పరద్రవ్యే ష్వభిధ్యానం మనసానిష్టచింతనమ్
వితథాభినివేశశ్చ త్రివిధం కర్మ మానసమ్.

తా॥ పరద్రవ్యములను నిరంతరము కోరుచుండుటయు ఎల్లప్పుడు ఇతరులకు కీడును తలచుచుండుటయు అసత్యమందును అన్యాయమందును ప్రీతి గల్గియుండుటయు దేహమే ఆత్మ యనుభావము వీరి కెంతమరల్చబడినను పోదు. ఇట్టిమానసికమలము నీజన్మలో ప్రాయశ్చిత్తాదులచే పోగొట్టుకొననియెడల నట్టివారు.

శ్రు॥ మానసై రంత్యజాతితాం.

తా॥ మరుజన్మలో చండాలాద్యంత్యజాతియందు పుట్టుదురు.

ఇక కాయికమలమువలన

అదత్తానా ముపాదానం హింసా చైవావిధానతః
పరదారోపసేవా చ శారీరం త్రివిధం స్మృతమ్.

తా॥ తనకు ఇవ్వబడనిద్రవ్యమును గ్రహించుటయనగా పరద్రవ్యమును అన్యాయముగా తాను గ్రహించుటయు శాస్త్రనిందితములగుహింసల నొనర్చుటయు, పరస్త్రీలను సేవించుటయు గల్గును. ఇట్టి కాయికమలము నీజన్మలో ప్రాయశ్చిత్తాదులచే పోగొట్టుకొననియెడల నట్టివారు

శ్రు॥ శరీరజైః కర్మదోషై ర్యాతి స్థావరతాం నరః

తా॥ మరుజన్మలో చెట్లు గుట్టలు మొదలగుస్థావరములుగా పుట్టుదురు.

## —♦ పుణ్యపరిపాకము ♦—

ఇట్లు పూర్వజన్మలోనికర్మలో పాపకర్మలు వానికార్యములు వివరింపబడినవి. ఇక పుణ్యకర్మలు వివరింపబడును. ఇవిగూడ వాచిక, కాయిక, మానసికములని మూడువిధములు. అందు వాచిక శుభకర్మ గలవా రీజన్మలో మృదుమధురముగా మాట్లాడువారును సత్యనిరతులును ఇతరులయందు గుణములను మాత్రమే గ్రహించువారును యుక్తియుక్తముగాను స్వప్రయోజనముగాను మాట్లాడువారును అగుదురు.

మానసికశుభకర్మ గలవా రీజన్మలో సర్వులకు సర్వకాలము నందును శ్రేయస్సును కోరువారును దయార్ద్రహృదయులును, పరధన పరస్త్రీలం దెంతమాత్రము కోరిక లేనివారుగను ఉందురు. కాయిక శుభకర్మ గలవా రీజన్మలో ఇతరులకు తమశక్తి ననుసరించి దాన మిచ్చువారును పరోపకారులును దేవప్రతిష్ఠా తీర్థయాత్రాదికార్యో త్సాహులు నగుదురు.

ఈశుభకర్మ ప్రవృత్తికర్మయనియు నివృత్తికర్మయనియు ముఖ్య ముగా రెండువిధములుగా నుండును. వానిఫల మిట్లు చెప్పబడినది.

ప్రవృత్తికర్మ సంసేవ్య దేవానా మేతి సామ్యతామ్
నివృత్తిం సేవమానస్తు భూతా న్యత్యేతి పంచ వై.

తా॥ శుభకర్మపరిపాకముచే నీజన్మలో ప్రవృత్తికర్మల నొన ర్చువాడు దేవతాసామ్యమును పొందును. ఎట్లనగా వేదమందలి కర్మ కాండలో ప్రతిపాదింపబడిన తమతమవర్ణాశ్రమధర్మము నాచరించు టయే ప్రవృత్తికర్మ యనబడును. అందగ్నిహోత్ర దర్శేష్ట్యాదులందు

శ్రు॥ "దేవస్య త్వా, సవితుః ప్రసవే అశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యా మాదదే".

తా॥ సర్వజగత్తును ప్రసవించి సర్వజీవులయంతఃకరణవృత్తులకు ప్రేరకుడగు సవిత యను దేవునిప్రేరణ గల్గుచుండగా అశ్వినీదేవత లధిష్ఠానదేవతలుగా గలనాబాహువులతో పూష యను దేవత అధిష్ఠాన దేవతగా గలనాహస్తములతో నిన్ను గ్రహించుచున్నాను.

శ్రు॥ 'బృహస్పతే ర్మూర్ధ్నా హరామి'

తా॥ బృహస్పతి యధిష్ఠానదేవతగా గలనాశిరస్సుతో నిన్ను మోయుచున్నాను. ఈప్రకారము తన దేహావయవముల నన్నిటిని ఆయా అధిష్ఠానదేవతలనుగా భావించుట చెప్పబడినది. ఇట్లు నిరంత రానుష్ఠానపాటవముచే తనయవయవముల నన్నిటిని ఆయా దేవతలనుగా భావించుటచే మరుజన్మలో తాను దేవతాసామ్యము నొందుననుట యుక్తియుక్తమేగదా- ఇట్టిప్రవృత్తికర్మ గృహస్థాశ్రమధర్మము.

నివృత్తికర్మ యనగా సర్వకర్మసన్న్యాసపూర్వక తురీయాశ్రమ స్వీకార మొనర్చినపరమహంసలధర్మము. వారొనర్చు వేదాంతవాక్య శ్రవణమనననిదిధ్యాసాదులే నివృత్తికర్మ యనబడును.

శ్రు॥ త మేవం విదిత్వాఽతిమృత్యు మేతి
నాన్యః పంథా విద్య తేఽయనాయ.

తా॥ అపరోక్షాత్మసాక్షాత్కారము నొందిన పరమహంసలు జననమరణప్రవాహరూప మగుసంసారము నతిక్రమించి మోక్షము నొందెదరు. ఇట్టి వేదాంతశ్రవణాదిద్వారా గల్గుజ్ఞానముకంటె వేరగు మరియొక మార్గము ఎంతమాత్రము మోక్షసాధనము గాదు.

అట్టివారికి తమయాత్మరూపమే సర్వజగత్కారణ మగుబ్రహ్మ మగును. ఎట్లనగా

## భాగత్యాగ లక్షణము

### —♦ తత్త్వమసి వాక్యార్థము ♦—

పరాపరాత్మనో రేవం యుక్త్యా సంభావితైకతా
తత్త్వమస్యాది వాక్యై స్సా భాగత్యాగేన లక్ష్యతే.

తా॥ జాగ్రదవస్థయందు శబ్దాదివిషయములు వేరువేరుగానున్నను తత్త్వజ్ఞానముమాత్ర మేకరీతిగా నున్నది. అట్లే స్వప్నావస్థయందు గూడ అస్థిరమయినను ఆయావిషయజ్ఞానముమాత్ర మేకరీతిగా నున్నది. ఇక సుషుప్త్యవస్థయందుగూడ సుషుప్త్యనంతరక్షణమందలి యానంద జ్ఞానస్మరణముచే జ్ఞానమున్న ట్లూహింపబడుచున్నది. ఇట్లీమూడవస్థలందును జ్ఞాన మేకరీతిగా నుండి ఎన్నిసంవత్సరములు గడచినను జ్ఞానము నిత్యముగా గోచరించుచున్నది ఈజ్ఞానమే యాత్మ-ప్రతి వానికిని ప్రేమయొక్క- పరమావధి ఈయాత్మయందే గోచరించు చున్నందున ఈయాత్మ ఆనందరూపమని స్ఫుటమగుచున్నది. ఇట్లను భవసిద్ధ మగుయుక్తిచేతనే ఆత్మ సచ్చిదానందరూపమని తేలుచున్నది. పరబ్రహ్మగూడ సచ్చిదానందరూపమే యని వేదాంతములందుప దేశింపబడుచున్నది. గాన వీరిద్దరకు ఏకత్వము యుక్తిచేత సిద్ధించు

చున్నది. ఇదియే 'తత్త్వమసీ' త్యాది వాక్యములచే భాగత్యాగ లక్షణావృత్తిచే తెలుపబడుచున్నది.

జగతో యదుపాదానం మాయా మాదాయ తామసీమ్
నిమిత్తం శుద్ధసత్త్వాంతా ముచ్యతే బ్రహ్మ తద్గిరా.

తా॥ సృష్ట్యాదియందు పూర్వకల్పమందలి జీవులందరయొక్క పుణ్యపాపము లుద్బుద్ధముకాగా అందు ప్రతిబింబించినబ్రహ్మచైతన్యముతో నొప్పు, పై పుణ్యపాపకర్మఫలసమూహమే ప్రకృతి యనబడును. ఇయ్యది సత్త్వరజస్తమోగుణాత్మకము. ఇది శుద్ధసత్త్వప్రధానమైనపుడు మాయయనియు మలినసత్త్వప్రధానమైనపు డవిద్యయనియు తమస్సు ప్రధానమైనపుడు, ఆకాశాది పంచభూతముల ఉత్పత్తికి, కారణమనియు చెప్పబడును. మాయోపాధిగాగలది అపరబ్రహ్మ యనియు నీశ్వరుడు అవిద్యోపాధిగాగలది జీవుడనియు చెప్పబడును. అపరబ్రహ్మమే జగత్తునకు నిమిత్తకారణమును ఉపాదానకారణమును అగుచున్నది ఇపుడు 'తత్త్వమసి' యనువాక్యము ఛాందోగ్యోపనిషత్తునందలి షష్ఠప్రపాఠకమం దున్నది. ఆప్రకరణము యొక్క ఉపక్రమోపసంహారాదులనుబట్టి యీవాక్యమున కర్థవిచారణచేయబడవలెనుగదా! అందు 1 తత్, 2 త్వం, 3 అసి, అనుమూడుపదము లున్నవి. తత్=అనగా ఆప్రకరణములో పూర్వమందు చెప్పబడినదని యర్థము. అట్టిది జగత్తునకు నిమిత్తకారణమును ఉపాదానకారణమును నగు అపరబ్రహ్మము.

ఇక త్వం అనుపదమున కర్థము విచారింపబడుచున్నది.

యదా మలినసత్త్వాంతాం కామకర్మాదిదూషితామ్
ఆదత్తే తత్పరంబ్రహ్మ త్వంపదేన తదోచ్యతే.

తా॥ మలినసత్త్వప్రధానమును కామకర్మాదులచే దూషితము నగు అవిద్య నుపాధిగా గ్రహించిన యపరబ్రహ్మమే జీవు డనబడునని లోగడ చెప్పబడినది. అట్టిజీవుడే యిచట 'త్వం' అనుపదముచే చెప్పబడుచున్నాడు.

ఇక "అసి" అనుపదమున కర్థమేమనగా.

త్రితయీమపి తాం ముక్త్వా పరస్పరవిరోధినీమ్
అఖండం సచ్చిదానందం మహావాక్యేన లక్ష్యతే.

వెనుక చెప్పబడిన 1 శుద్ధసత్వప్రధానమై జగదుపాధి యగు ప్రకృతియు, 2 మలినసత్వప్రధానమై జీవోపాధి యగుప్రకృతియు, 3 తమఃప్రధానమై ఆకాశాదిపంచభూతకారణ మైనప్రకృతియు, పరస్పరవిరుద్ధధర్మములు గలవి. ఇట్టి మూటిని విడిచిపెట్టి సచ్చిదానంద రూపమగు అద్వితీయబ్రహ్మ మీ 'అసి' అనుపదముచే చెప్పబడు చున్నది. ఇట్లు చెప్పురీతికి భాగత్యాగలక్షణావృత్తి యనిపేరు. ఎట్లనగా దేవదత్తు డనుపేరుగలవానిని ఒకదేశమందు ఒకకాలమందు చూచి, పరిచయము గలయొకవ్యక్తి మరికొంతకాలమునకు మరియొకదేశములో ఆవ్యక్తి ఆదేవదత్తుని చూచి 'సోఽయం దేవదత్తః' అనిపలికెను. అనగా లోగడ నేను చూచిపరిచయముచేసికొన్న దేవదత్తుడే వీడు, అని. లోగడ ఇతడు చూచిన దేవదత్తుడు చిన్నపిల్లవాడు, ఈరోజున దేవదత్తుడు పెద్దవాడు. అపుడు చిన్నతనమునకు తగిన దుస్తులు ధరించియున్నాడు, ఇపుడు పెద్దతనమున కనువగువస్త్రములను ధరించియున్నాడు. అపుడు గడ్డము మీసములు లేవు; ఇపు డున్నవి. ఇట్లైనను వాడే వీడు ఎట్లాయెనో అట్లే యిచటగూడ జీవుడనగా మలినసత్వప్రధాన మగుప్రకృతి యుపాధిగాగల బ్రహ్మచైతన్యము. ఈయుపాధి ఉదాహరణలోని దేవదత్తునివస్త్రాదివేషమువంటిది. గాన పూర్వకాలిక దేవదత్తునకును ఇప్పటి దేవదత్తునకును గలవస్త్రాది విరుద్ధభాగములను త్యజించి, ఎట్లైక్యము సిద్ధమాయెనో అట్లే యిచట గూడ తత్, త్వం, పదములవాచ్యార్థ మగుజీవబ్రహ్మములకు విరుద్ధ భాగత్యాగలక్షణచే ఐక్యము సిద్ధమగుచున్నది.

## జహదాది లక్షణాభేదములు

తత్త్వంపదాభ్యా మభిధీయమానయోః
బ్రహ్మాత్మనో శ్శోధితయో ర్యథావత్

శ్రుత్వా తయో స్తత్త్వమసీతి సమ్యక్
ఏకత్వమేవ ప్రతిపాద్యతే ముహుః.

తా॥ తత్త్వమసి యనుశ్రుతిలో తత్ అనుపదముచే వాచ్యముగా చెప్పబడు ఈశ్వరునకును, త్వం అనుపదముచే వాచ్యముగా చెప్పబడుజీవునకును, విరుద్ధాంశము లగుసర్వజ్ఞత్వ, కించిద్జ్ఞత్వాది ధర్మములను విడిచి లక్షణావృత్తిచే లక్ష్యార్థ మగుచైతన్యమాత్ర స్వీకారమువలన జీవేశ్వరులకు ఐక్యమే బాగుగ బోధింపబడుచున్నది. లక్షణావృత్తి యనునది మూడువిధములుగ శాస్త్రమందు చెప్పబడినది.

1 జహల్లక్షణ, 2 అజహల్లక్షణ, 3 జహదజహల్లక్షణ యని.

1 జహల్లక్షణ యనగా వాచ్యార్థమును పూర్తిగా విడిచిపెట్టి లక్ష్యార్థమును గ్రహించుట.

ఉదాహరణము– "గంగాయాం ఘోషః" గంగయందు గొల్లపల్లెయున్నది. ఇక గంగాయా మనగా వాచ్యార్థము గంగాప్రవాహము. ఇందు గొల్లపల్లె యుండనేరదుగాన వాచ్యార్థ మగుగంగాప్రవాహమనునర్థమును విడిచి గంగాయా మనుపదమునకు గంగాతీరమందు అనులక్ష్యార్థము చెప్పబడుచున్నది.

2 అజహల్లక్షణ యనగా వాచ్యార్థమును విడిచిపెట్టకుండగనే దానితోబాటు లక్ష్యార్థమునుగూడ గ్రహించుట.

ఉదాహరణము– "మంచాః క్రోశంతి" మంచెలు అరచుచున్నవి యనునది పై వాక్యమునకు వాచ్యార్థము. అచేతనములగుమంచెలు అరచుట యసంభవము గాన ఇచట మంచెలపై నున్న మనుష్యులుగూడ లక్ష్యార్థమగుచున్నారు. కేవలమనుష్యులే యైనచో ఎల్లపుడు అరచుట యసంభవముగాన ఇట మంచాః అనుశబ్దమునకు మంచెలును దానిపై నుండుమనుష్యులునని యర్థము. ఇట మంచశబ్దమునకు వాచ్యార్థ మగుమంచెలను పూర్తిగా వదలకయే లక్ష్యార్థముగూడ కలుపుకొనబడినందున నిది అజహల్లక్షణ యనబడును.

3 జహదజహల్లక్షణ యనగా వాచ్యార్థములో కొంతభాగ మును విడిచియు, మరికొంతభాగమును విడువకయు లక్ష్యార్థమును గ్రహించుట

ఉదాహరణము- 'సోయం దేవదత్తః' ఆ దేవదత్తుడే యితడు- ఇచట విరుద్ధధర్మములగు ఆదేశము ఈదేశము, ఆకాలము ఈ కాలము, ఆవయస్సు ఈవయస్సు- మొదలగు విరుద్ధాంశములు విడిచి పెట్టబడినవి. ఆకళ్లే ఆముక్కే- ఆముఖమే అనడకయే ఆపోలికతో యిపు డీతనియందుగూడ నున్నందున వానిని విడువలేదు. ఇట్లు వాచ్యార్థ మగు దేవదత్తునిలోనే కొన్నియంశములు విడువబడి మరి కొన్నియంశములు గ్రహింపబడినందున నిది జహదజహల్లక్షణ యన బడును

ఈ ప్రకారము ప్రకృతము "తత్త్వమసి" అను వేదాంత వాక్యముయొక్క- అర్థమును లక్షణావృత్తిచేత గ్రహింపవలయును. అనగా వాచ్యార్థములో కొన్నియంశములను విడిచి మరికొన్నియంశ ములను గ్రహించి జహదజహల్లక్షణావృత్తిచే నర్థమును చెప్పుట. ప్రకృతము తత్ పదవాచ్యార్థమందు ఈశ్వరత్వము సర్వజ్ఞత్వము మాయోపాధికత్వము సత్యత్వము జ్ఞానత్వము అనంతత్వము ఆనంద రూపత్వములు గలవు. ఇక త్వంపదవాచ్యార్థమందు జీవత్వము కించిద్ జ్ఞత్వము అవిద్యోపాధికత్వము సత్యత్వము జ్ఞానత్వము అనంతత్వము ఆనందరూపత్వములు గలవు. ఇం దీరెంటిలోను సత్యత్వాదులు గ్రహింపబడి సర్వజ్ఞత్వకించిద్ జ్ఞత్వాదులు విడిచిపెట్టబడి 'సోయం దేవదత్తః' ఇత్యాది స్థలములలోవలె జహదజహల్లక్షణావృత్తిచే నర్థము చెప్పుచో సత్యత్వాది ఆనందరూపత్వాంతము లగుధర్మములు జీవేశ్వరు లిద్దరకును సమానముగా నున్నందున జీవేశ్వరుల కైక్యము కుదిరి, అఖండసచ్చిదానందపరబ్రహ్మ మీమహావాక్యమునకు లక్ష్యార్థ మగుచున్నది.

ఇట్లొక్క-ఛాందోగ్యోపనిషత్తుమాత్రమేగాక అన్ని వేదములం దును ఈయైక్యమే బోధింపబడుచున్నది. ఎట్లనగా

## —♦ చతుర్వేద మహావాక్య వివరణము ♦—

ఋగ్వేదమునందు - ప్రజ్ఞానం బ్రహ్మ

యజుర్వేదమునందు - అహం బ్రహ్మాస్మి

సామవేదమునందు - తత్త్వమసి

అథర్వణవేదమునందు - అయ మాత్మా బ్రహ్మ

అని నాలుగువేదములందు నీయభిప్రాయమును బోధించు మహావాక్యములే గలవు. ఇందు తత్త్వమసి యనువాక్యములోని తత్, అనగా ఈఛాందోగ్యోపనిషత్తులోని షష్ఠప్రపాఠకారంభమందు "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయం" అనువాక్యముచే ప్రతిపాదింపబడిన సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత మైనట్టి నామరూపములు లేనట్టి సృష్టికి పూర్వమందు సృష్ట్యనంతరమందు ఏకరూపముగా నుండునట్టి సద్రూపమైనట్టి వస్తువు. ఈతత్ శబ్దమునకు వాచ్యార్థము 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత' ఇత్యాదిఛాందోగ్యోపనిషత్ష ష్ఠప్రపాఠకకథరిత మగుతేజ ఆదిభూత సృష్టికి కారణ మగునట్టి బహుభవనసంకల్ప మొనర్చినట్టి మాయోపాధికచైతన్య మగునీశ్వరరూపము. ఈతత్ శబ్దలక్ష్యార్థము సద్వస్తువు లేక పరమాత్మ. ఇక త్వం అనగా ఈశ్రుతియందలిశ్రోత యగు శ్వేతకేతువుయొక్క దేహేంద్రియాదుల కతీతమై సాక్షిభూత మగుచైతన్యము. ఈ త్వం పద వాచ్యార్థము జీవస్వరూపము. ఈ త్వం పద లక్ష్యార్థము సాక్షియగు ప్రత్యగాత్మ. ఇక అసి యనగా జీవేశ్వరు లిద్దరును, కల్పితోపాధివిలయమందు వాస్తవముచే నేకరూపులే- అనగా ప్రత్యగాత్మయే పరమాత్మ యని తాత్పర్యము.

ఐక్యం తయో ర్లక్షితయో ర్న వాచ్యయో
ర్నిగద్యతేఽ న్యోన్యవిరుద్ధధర్మిణోః
ఖద్యోతభాన్వోరివ, రాజభృత్యయోః
కూపాంబురాశ్యోః, పరమాణుమేర్వోః

తా॥ మిణుగురుపురుగు. సూర్యుడు- రాజు, భృత్యుడు- బావి, సముద్రము- పరమాణువు, మేరుపర్వతము- ఈజంట లెంతతారతమ్యముగలవో జీవేశ్వరు లిద్దరు నంతతారతమ్యము గలవారుగాన ఐక్యము వాచ్యార్థముచే వీ రిద్దరి కెంతమాత్రము కుదురదు. లక్ష్యార్థముచే ననగా జహదజహల్లక్షణావృత్తిచే వీరి కిద్దరికి ఐక్యము శ్రుతిచే ప్రతిపాదింపబడుచున్నది.

ఏతా వుపాధీ పరజీవయో స్తయో
స్సమ్యఙ్నిరాసే, న పరో, న జీవః
రాజ్యం నరేంద్రస్య భటస్య ఖేటతః
తయో రపోహే న భటో, న రాజా.

తా॥ ఈశ్వరోపాధి యగుమాయను జీవోపాధి యగునవిద్యను పుష్కలముగా తొలగింపగా శుద్ధచైతన్యముమాత్రమే ఉభయత్ర సమానమైనందున అట్టికాలమం దీయుభయులకు నైక్యమేగాని ఎట్టి భేదము నుండదు. ఎట్లనగా. రాజ్యమును పరిపాలించునపుడు రాజనబడును. వానికి సర్వవిధముల దాస్య మొనర్చునపుడు భటు డనబడును. లేక యుద్ధమునం దాయుధవిశేషమును ధరించినపుడు యోధు డనబడును. వానికి రాజ్యముపోయి వీనికి యుద్ధము లేనపు డిద్దరును కరచరణాద్యవయవవిశేషాకారముచే సమానులే యగుచున్నారుగదా!

శ్రు॥ జీవేశా వాభాసేన కరోతి, మాయా చావిద్యా చ స్వయమేవ భవతి.

తా॥ మాయ, అవిద్య యనునవి అనిర్వచనీయశక్తిగలవై ఈశ్వరుడని జీవుడని భిన్నలక్షణులనుగా భాసింపజేయుచున్నవేగాని వాస్తవముచే వీరలు భిన్నులుగారు. లక్షణావృత్తి మూడువిధములై యున్నను ప్రకృతమహావాక్యతాత్పర్యనిర్ణయమందు జహల్లక్షణగాని, అజహల్లక్షణగాని ఆశ్రయణీయముగాక మూడవదగు జహదజహల్లక్షణయే ఆశ్రయణీయ మగుచున్నదని పెద్ద లిట్లు చెప్పిరి.

స దేవదత్తోఽయ మితీహ చైకతా
విరుద్ధధర్మాంశ మపాస్య కథ్యతే
యథా తథా తత్త్వమసీతి వాక్యే
విరుద్ధధర్మా నుభయత్ర హిత్వా.

తా॥ "ఆదేవదత్తుడే ఇతడు" అనుస్థలమం దెట్లు విరుద్ధధర్మభాగమును వదలి, ఐక్యము చెప్పబడెనో యట్లే తత్త్వమసి యనుస్థలమందుగూడ జీవేశ్వరు లిద్దరియొద్ద విరుద్ధధర్మములను ఔపాధికములగుటచే వదలి

సంలక్ష్య చిన్మాత్రతయా సదాత్మనో
రఖండభావః పరిచీయతే బుధైః
ఏవం మహావాక్యశతేన కథ్యతే
బ్రహ్మాత్మనో రైక్య మఖండభావః.

తా॥ ఇద్దరియందును సాధారణ మగు చైతన్యమాత్రమును లక్ష్యార్థముగా గ్రహించి వీరల కిద్దరకు అఖండమగు ఐక్యభావము చెప్పబడుటయేగాక అనేకులు పూర్వులు తమయనుభవముచేగూడ నిట్టియైక్యము నే జూచిరి. ఇట్లీ తత్త్వమసి యనునొక్క వాక్యము నందేగాక సర్వవేదాంతవాక్యములందును ఇట్టియైక్యమే ప్రతిపాదింపబడియున్నది.

ఇట్టినిశ్చయజ్ఞానము గలవాడే జీవన్ముక్తు డనబడునని యిట్లు చెప్పబడినది.

క్రియానాశా ద్భవే చ్చింతానాశోఽస్మా ద్వాసనాక్షయః
వాసనాప్రక్షయో మోక్ష స్స జీవన్ముక్తి రిష్యతే.

తా॥ తానే బ్రహ్మ మనునిశ్చయజ్ఞానము గలుగుటతోనే యట్టివాని కెట్టిక్రియాకలాపముతోను పనిలేనందున నిష్క్రియుడగును. అందుచే అంతఃకరణమందలిచింత పోవును. అద్దానివలన ననేక జన్మలనుండి యున్నవాసన లన్నియు నశించును. ఇదియే జీవన్ముక్తి

యనబడును. అట్టివానికి దేహ మున్నదనియు, క్షుత్పిపాసాదు లున్నవనియు చూచువార లనుకొనవలసినదేగాని వానికిమాత్రము దేహభాన మెంతమాత్రము నుండ నేరదు.

ఘటాకాశో మహాకాశ ఇవాత్మానం పరాత్మని
విలాప్యాఖండభావేన తూష్ణీంభవ సదా మునే.

తా॥ ఘట మనునుపాధిలో నున్నయాకాశ ముపాధిలయమందెట్లు మహాకాశమందు లయమగునో, ఉపాధిలో నున్నపుడుగూడ అదెట్లు మహాకాశముకంటె భిన్నముగాదో యట్లే నీవుగూడ నీయుపాధిలో సాక్షిగానుండుప్రత్యగాత్మ పరమాత్మయే యనియు నంతకంటె భిన్న డెంతమాత్రము గాదనియు నిశ్చయించుము- అని శిష్యునకు గురు వుపదేశించుచున్నాడు. ఇట్టినిశ్చయజ్ఞానము గలవాడు బాలునివలెను నిద్రించువానివలెను తూష్ణీంభావముతో నుండును. ఇట్టివాడే జీవన్ముక్తు డనబడును. ఇందుకు సాధనము.

ఉపవిశ్యోపవిశ్యైకం చింతకేన ముహుర్ముహుః
నశక్యతే మనో జేతుం వినా యుక్తి మనిందితామ్.
అంకుశేన వినా మత్తో యథా దుష్టమతంగజః.

తా॥ కూర్చుండిగాని నిలబడిగాని నడచుచుగాని, ఎద్దియో యొకవిషయము నాలోచించుచుండుమనస్సు స్వభావముచే బహు చంచల మైనది. దీనిని జయించుట సామాన్యులకు సాధ్యము గాదు. మదించినయేను గెట్లు మావటివానియంకుశమునకుమాత్రమే లొంగునో తదితరమున కెన్నిటికైన నెట్లు లొంగదో అట్లే యీమనస్సుగూడ శాస్త్రీయవిషయమనన మనుయుక్తిచేమాత్రమే జయింపనలవియగునుగాని తదితరముల కెంతమాత్రము జయింప సాధ్యము గాదు ఆయుక్తి సద్గురువులద్వారా పొందదగినదేగాని తనంతట తనకు లభించునది గాదు.

ఆయుక్తియొక్క క్రమ మెట్టిదనగా,

అధ్యాత్మవిద్యాధిగమ స్సాధుసంగతి రేవ చ
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పందనిరోధనమ్
ఏతా స్తా యుక్తయః పుష్టా స్సంతి చిత్తజయే క్రమాత్.

తా॥ ఈయుక్తి నాలుగుసోపానము లనగా మెట్లుగా నున్నది. మొదటిది వేదాంతవాక్యముల కన్నిటికి ఆదిమధ్యావసానములందు పుష్కలమగుతాత్పర్య మద్వితీయచిన్మాత్రబ్రహ్మమందే యని తెలుపువిద్యను సద్గురువుద్వారా గ్రహించుట.

రెండవది సత్పురుషు లగుబ్రహ్మవేత్తలతో సహవాసము.

మూడవది అనేకజన్మలనుండి వీని కనుగతమగు వాసనల నన్నిటిని పూర్తిగా పరిత్యజించుట.

నాల్గవది ప్రాణాపానాదివాయుప్రసారనిరోధము.

ఇందొక్కొక్కదానిని యథావిధిగా పుష్టికరమగునట్లొనర్చుకొని ఆపైన పైసోపానముకొరకు యత్నింపవలెను. ఇట్లీక్రమమున నీ నాలుగుయుక్తులను గురూపదిష్టవిధానమున అభ్యసించినవానికి చిత్తజయము గల్గును.



# మనస్స్వరూపవివరము

శ్రు॥ కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధా అశ్రద్ధా ధృతి రధృతిః
హ్రీః ధీః భీ రిత్యేతత్సర్వం మనఏవ.

తా॥ కామము, సంకల్పము, సంశయము, కర్మలందును దేవతలందును వేదమందును ఆస్తిక్యబుద్ధియు, నాస్తిక్యబుద్ధియు, ధైర్యము, అధైర్యము, సిగ్గు, ప్రజ్ఞా, భయము మొదలగునవియే మన స్సనబడును. అనగా మనస్సనునది దృష్టిగోచర మగునది గాదు. ప్రత్యక్షముగా నిట్టిదని చూపింప వీలులేనిది. దానిధర్మములగు కామసంకల్పాదులచే నద్దానిని దెలిసికొనవలయును. గాన మనోజయమనగా కామ సంకల్పాదులను జయించుట అనగా కామాదులు లేకుండుట యని తాత్పర్యము.

శ్రు॥ మనోహి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధ మేవ చ
అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్.

తా॥ పైజెప్పినకామసంకల్పాదులతో నొప్పుచున్న మనస్సు అపరిశుద్ధమన స్సనియు, కామసంకల్పాదులతో నొప్పనపుడు శుద్ధ మనస్సనియు చెప్పబడును. ఇట్లు మనస్సు రెండువిధములుగా పరిగణింపబడినది.

ఈ ద్వివిధమనస్సులకు ఫల మిట్లు చెప్పబడినది.

శ్రు॥ మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్.

తా॥ నిర్మలమనస్సు మనుష్యునకు మోక్షకారణ మగుచున్నది. మలినమై అపరిశుద్ధ మగుమనస్సు మనుష్యునకు బంధకారణ మగుచున్నది. ఇట్లు మనస్సు మనుజునకు శ్రేయస్సాధనమును, అహిత సాధనమునుగూడ నగుచున్నది. కామసంకల్పాదులు పెరిగినకొలదియు ఆధ్యాత్మికదృష్టి తగ్గిపోయి, విషయతృష్ణ పెరిగి క్రమముగా నీచాతి నీచయోనులందు జన్మించుటకు దారితీయును. కామసంకల్పాదులు తగ్గినకొలదియు విషయతృష్ణ తగ్గుచు క్రమముగా స్వర్గాద్యూర్ధ్వలోక ప్రాప్తికిని క్రమముక్తికిని సాధన మగుచున్నది.

శ్రు॥ యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తి రిష్యతే
అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా.

తా॥ మనస్సుకు కామాదులు విషయములై పురుషుని బంధించుచున్నవి. మనస్సు నిర్విషయమైనపుడు ముక్తి గల్గుచున్నది. అనగా మనస్సే సూక్ష్మదేహ మనబడుచున్నది. ఇదియే స్వప్నావస్థయం దెట్టి బాహ్యవస్తువు నపేక్షింపకయే రథాదులను రథయోగములను సృజించుచున్నది. అనేకపూర్వజన్మలందలిపుణ్యపాపము లన్నియు వాసనారూపముగా నీమనస్సు నాశ్రయించియుండును. ఈమనస్సు నిర్విషయ మగుటయె సూక్ష్మదేహనాశ మనబడును. అపు డట్టిస్థితి

మోక్షమనబడును. గాన మోక్షము నపేక్షించువాడు మున్ముందు మనస్సును నిర్మలముగా నొనర్చుటకు నిత్యము ప్రయత్నింపవలెను.

శ్రు॥ నిరస్తవిషయాసంగం సంనిరుద్ధం మనో హృది;
యథా యా త్యాత్మనో భావం తదా తత్పరమం పదమ్.

తా॥ హృదయమనగా "హృది అయం" ఆత్మ యుండుస్థానము. మనస్సును కామసంకల్పాదివిషయసంపర్కము లేకుండజేసి హృదయమందు లయింపజేసి ఆహృదయము నాత్మయందు లయింపజేయుటయే మోక్ష మనబడును.

శ్రు॥ తావదేవ నిరోద్ధవ్యం యావ ద్ధృదిగతం క్షయమ్
ఏతత్ జ్ఞానం చ ధ్యానం చ శేషో న్యాయస్య విస్తరః.

తా॥ ఈమనస్సును జయించుటకు పరమావధి హృదయమందీమనస్సును లయమొందించుటయే. ఇదియే జ్ఞానమనియు ధ్యానమనియు చెప్పబడును. మిగిలినశాస్త్ర మంతయు యుక్తియుక్తముగా నీమనోలయమునుగూర్చి విపులముగా బోధించుట కేర్పడినదే.

## ఆత్మవిద్యామనన ప్రకారము

శ్రు॥ నైవ చింత్యం న చాచింత్యం నచింత్యం చింత్యమేవ తత్
పక్షపాతవినిర్ముక్తం బ్రహ్మ సంపద్యతే తదా.

తా॥ చింతనమనునది మనస్సుతో చేయునాలోచన. బ్రహ్మము మనస్సుతో నాలోచింప నలవిగానిది. యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసాసహ యనుతైత్తిరీయశ్రుతి వాక్యములుగాని మనస్సుగాని ఆబ్రహ్మమును పలుకుటకును ఆలోచించుటకును సమర్థములు గావని తెలుపుచున్నది. పోనీ,అచింతనీయ మగుదుష్టపదార్థమో లేక శశవిషాణాదులవంటి అసత్పదార్థమో యనుకొనుటకు వీలులేనట్టిసద్వస్తువు. గాన అచింత్యమును గాదు. ఇట్లాలోచనలో గోచరముగానిది ఆలోచించదగినది యనుపరస్పరవిరుద్ధక్రియ లొకేవస్తువునం దెట్లు కుదురుననగా మనస్సుతో నాలోచించగా గోచరమగువిషయజాత

మంతయు అనిత్యము, అసత్యము, జడము, పరిచ్ఛిన్నము, దుఃఖ రూపము నగుచున్నది. ఈయనిత్యాసత్యాదిశబ్దములు నిషేధఘటితములుగాన వీని కాశ్రయమగు నిత్య, సత్యాదిరూపవస్తు వొకటి అవశ్య ముండితీరవలయునుగదా. అదియే బ్రహ్మముగాన బ్రహ్మబోధకతద్వ్యాప్తివృత్తిరూపముగా మానసికచింతనము సాధనమగుచున్నది.

శ్రు॥ స్వరేణ సంధయే ద్యోగ మస్వరం భావయే త్పరమ్
అస్వరే ణానుభావేన న భావో భావ ఇష్యతే.

తా॥ యోగమును స్వరముతో లేక నాదముతో చేర్చవలయును. అట్టిస్వరమున కతీతమైనదానినిగా బ్రహ్మమును భావింపవలెను. స్వరరహితముగా భావనచేయుటచే ఆబ్రహ్మ మున్నదే యగునుగాని లేనివస్తువు గాదు.

శ్రు॥ తదేవ నిష్కళం బ్రహ్మ నిర్వికల్పం నిరంజనమ్
తద్బ్రహ్మాహ మితి జ్ఞాత్వా బ్రహ్మ సంపద్యతే ధ్రువమ్

తా॥ ఇట్టినిష్కళము నిర్వికల్పము నిరంజనము అయినదే బ్రహ్మము. అట్టిబ్రహ్మమే నేనను నిశ్చయముతో నొప్పుయోగిపుంగవుడు బ్రహ్మమే యగును.

శ్రు॥ నిర్వికల్ప మనంతం చ హేతుదృష్టాంతవర్జితమ్
అప్రమేయ మనాదిం చ యత్ జ్ఞాత్వా ముచ్యతే బుధః.

తా॥ బ్రహ్మమును వికల్పరహితమైనదానినిగాను సర్వవ్యాపకమైనదానినిగాను అదియే సర్వకారణముగాని దానికి కారణము మరియొకటి లేదనియు దానితో సమానమైనవస్త్వంతరము లేనట్టి అద్వితీయమైనదానినిగాను ఇంద్రియాదివృత్తిజ్ఞానమునకు విషయముగాక సర్వేంద్రియవృత్తులకును అధిష్ఠానమనియు సర్వేంద్రియవృత్తులకును సాక్షిమాత్రుడనియు త్రికాలాబాధ్యమనియు తెలిసికొన్నజ్ఞాని మోక్షము నొందును.

శ్రు॥ న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో నచ సాధకః
న ముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా.

తా॥ లోకములో జన్మించినవాడు తాను జననమరణాదిసంసార బద్ధుడనని తలచి అందుండి బయటపడదలచి మోక్షమును కోరి తత్సాధనము లగుశ్రవణమననముల నొనర్చి, నిదిధ్యాసలో పరిపాకావస్థ యగునిరోధ మనుపేరుగల నిర్వికల్పసమాధి నొంది ఆపైన ముక్తుడగును. అట్టివానికి మోక్షానంతరము తాను బద్ధుడనుతలంపు మొదలు నిరోధమువరకు తాను గ్రహించినసాధనములనుగూడ లేని వానినిగానే తలంచును. ఏరు దాటినతరువాత తెప్పను తిగులపెట్టినట్లు సంసారసముద్రమును దాటినముక్తున కీసాధనము లన్నియు తిగులపెట్టబడినవానితో సమానము లగును.

శ్రు॥ ఏక ఏవాత్మా మంతవ్యో జాగ్రత్స్వప్నసుషుప్తిషు
స్థానత్రయవ్యతీతస్య పునర్జన్మ న విద్యతే.

తా॥ సాధకుడు నిర్గుణము నిర్వికారము నిరంజనము ఇత్యాది సర్వధర్మరహితమగు అద్వితీయాత్మవస్తుతత్త్వము నెరుగుటకు జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూడవస్థలును సాధనము లగుచున్నవి. ఎట్లనగా దేహమే యాత్మ యనుభ్రాంతి గలవానికి స్వప్నావస్థలో దేహము విశ్రమించియున్నను, దేహవ్యాపారముల నన్నిటిని అనుభవించుటచేత ఈదేహమే యాత్మ గాదని తెలినది. అప్పటియింద్రియములు లేక మనస్సు ఆత్మ యనుకొన్నవానికి సుషుప్త్యవస్థలో తద్రాహిత్యమైనను తిరిగి మెలకువ రాగానే పూర్వానుభూతిస్మృతివలన ఆయింద్రియ మనస్సు లాత్మ గాదని తేలుచున్నది. గాన జాగ్రదాదులందు శబ్దస్పర్శాదు లనువిషయభేదమున్నను వానియన్నిటియందు ననుగతమగు జ్ఞానము మాత్రము జాగ్రత్స్వప్నసుషుప్తులం దన్నిటియందును ఎన్నిరోజులకైనను సంవత్సరములకైనను ఏకరీతిగాను, నిత్యముగాను సత్యముగాను కనుపించుచున్నది. ఇట్టిజ్ఞానమే తన యాత్మరూపమని నిరంతర మననాదులచే తేలుచున్నది. కాన నిట్టివాడు తిరిగి జననమరణ ప్రవాహరూప మగుసంసారధర్మము నెన్నటికిని పొందనేరడు.

శ్రు॥ ఏక ఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః
ఏకధా బహుధాచైవ, దృశ్యతే జలచంద్రవత్.

తా॥ సృష్ట్యాదికాలమందుగూడ సిద్ధవస్తువేగాని సాధ్యవస్తువుగానట్టియీయాత్మయే ప్రతిజీవునియందు నున్నది. ఆకసమునం దున్న ఒక్కడే చంద్రుడు బావిలోనిజలమందును సముద్రోదకమందును తటాకోదకమందును ఇత్యాదిస్థలవిశేషము లన్నిటియందును ఆచంద్రుడే ప్రతిబింబించి, అనేకములుగా కనుపించునట్లే యీఆత్మచైతన్యము గూడ మనుష్యులందు దేవతలందు పితరులందు గరికపోచయందును, సర్వజీవోపాధులందును అనేకములుగా భాసించుచున్నది.

శ్రు॥ ఘటసంవృత మాకాశం నీయమానే ఘటే యథా,
ఘటో నీయేత నాకాశ స్తద్వ జ్జీవో నభోపమః.

తా॥ సర్వవ్యాపక మగునాత్మచైతన్యమే జీవుడైనచో జీవాశ్రిత గమనాదిక్రియ లెట్లుకుదురు ననగా ఒకఘటమందలియాకాశ మా ఘట మెన్నిచోట్లకు త్రిప్పబడుచున్నను అందలియాకసముగూడ తిరుగుచున్న ట్లుండును. వాస్తవముచే ఆకాశము సర్వవ్యాపకమైనది గదా, అయినను నిజముగా ఘటమే కదల్చబడుచుండ అందలియాకాశము కదలుచున్న దనువ్యవహార మెట్టిదో యట్లే జీవోపాధి యగు దేహము తిరుగుచుండ అందలిఆత్మచైతన్యము సంచరించుచున్న దనునదిగూడ అజ్ఞజనవ్యవహారమాత్రమేగాని వాస్తవముచే సర్వవ్యాపక మగునీయాత్మకు చలనమే లేదు.

శ్రు॥ ఘటవ ద్వివిధాకారం భిద్యమానం పునఃపునః
తద్భేదే చ న జానాతి స జానాతి చ నిత్యశః.

తా॥ ఘటమువంటియుపాధియే నీశరీరము – ఆకాశమువంటిదే నీయాత్మ – కుండ, చట్టి, మూకుడు, పిడత మొదలగువాని ఆకారములు పరస్పరభిన్నము లైనట్లే జీవుల దేహములుగూడ పరస్పరవిలక్షణములు– ఆఘటాదులు పగిలిపోయినపు డవి తాము పగిలిన ట్లెరుంగజాలనట్లే యీజీవదేహములు నశించినపు డాదేహ

ములు తాము నశించిన నెఱుంగనేరవు. నిత్యుడై ఆదేహవ్యాపారాదులకు సాక్షిగా నుండువాడుమాత్రి మాదేహనాశ మెఱుంగుచున్నాడు.

శ్లో॥ శబ్దమాయావృతో నైవ తమసో యాతి పుష్కలే
భిన్నే తమసి చైకత్వ మేక ఏవానుపశ్యతి.

తా॥ మాయాకల్పితమును ఆకాశాదిపంచభూతవికారమును అగు దేహాదిజగత్తనునంధకారమందు శబ్దాదివిషయములచే నాక్రమింపబడుచు తిరుగువాఁ డెంతకాలమునకైనను దానిని దాటలేడు. ఈప్రపంచము మాయాకల్పితమని తెలిసికొన్నజ్ఞానోదయక్షణమందే అంధకారమువంటి ఆయజ్ఞానము నశించును. అపుడు జ్ఞాని సర్వజగత్తును అద్వితీయ చిన్మాత్రబ్రహ్మముగానే చూచును.

శ్లో॥ శబ్దాక్షరం పరం బ్రహ్మ తస్మిన్ క్షీణే య దక్షరమ్
తద్విద్వా నక్షరం ధ్యాయే ద్యదీచ్ఛే చ్ఛాంతి మాత్మనః.

తా॥ క్షరమనగా నాశము. అక్షరమనగా నాశము లేనిది. అకారాది క్షకారాంతవర్ణము లన్నియు అక్షరములని ప్రసిద్ధిగలదు. అయ్యవి ఉచ్చారణధ్వనిరూపములు. పరబ్రహ్మమును తెలిసికొనుట కట్టి శబ్దరూపము లగునక్షరసముదాయమే సాధనము. ఈ సముదాయమే వేద మనబడుచున్నది. అది ప్రతియధికారిచేతను ఉచ్చరింపబడి ఆ ధ్వనిమాత్రము క్షణములో నశింపుచున్నను నద్దానిచే ప్రతిపాద్యమగుపరబ్రహ్మమాత్రము అక్షరముగా ననగా నాశరహితముగా నుండుచున్నది. జననమరణప్రవాహములో పడి అందుండి బయటపడుటకు ఆతురపడుచున్న జిజ్ఞాసువు అట్టివేదవేద్య మగుపరబ్రహ్మమునే నిరంతరము ధ్యానింపవలెను.

శ్లో॥ గ్రంథ మభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః
పలాలమివ ధాన్యార్థీ త్యజే ద్గ్రంథ మశేషతః.

తా॥ ధాన్యమును గోరువాఁడు పైరులో నుండు ధాన్యమును కోసి, కొట్టి, యందలి గడ్డి రెల్లు తుక్కు మొదలగు ధాన్యేతర పదార్థ

భాగమునంతను పరిత్యజించి శుద్ధ మగుధాన్యమును గ్రహించునట్లే ముముక్షువు వేదాంతగ్రంథ మంతయు నామూలాగ్రముగా సద్గురువులద్వారా పఠించి అందు ప్రతిపాదింపబడిన అర్థవిశేషమును చక్కఁగా నవగత మొనర్చుకొని దానిని మనన మొనర్చి తానట్లాచరించి కృతార్థుడు కావలయును. అంతేగాని ఆగ్రంథమును అనగా మూలమంత్రమును నిరంతరము పఠించుచున్నదో వాని కెంతమాత్రము ఆగ్రంథముతో ప్రయోజనము ఘటింపదు. కావున అర్థమును గ్రహించి మూలగ్రంథమును పరిత్యాగ మొనర్చవలెను.

శ్రు॥ గవా మనేకవర్ణానాం క్షీరస్యా ప్యేకవర్ణతా
క్షీరవ త్పశ్యతే జ్ఞానం లింగినస్తు గవాం యథా.

తా॥ గోవులు కొన్ని తెల్లగాను, కొన్ని ఎఱ్ఱగాను, కొన్ని నల్లగాను ఇట్లనేకవర్ణములతో నున్నను వానియన్నిటియందలి క్షీరము లెట్లు ఏకరీతిగా తియ్యగాను, తెల్లగాను, సమానముగాను నుండునో అట్లే ప్రపంచమందలి జీవులు, మనుష్య, పశు, పక్ష్యాదిభేదములతో నొప్పియున్నను వారి యందరియందును ఉండు ఆత్మచైతన్యము ఏకరీతిగా నుండును.

శ్రు॥ ఘృతమివ పయసి నిగూఢం,
భూతే భూతే చ, వసతి విజ్ఞానమ్,
సతతం మనసి మథయితవ్యం
మనో మంథానుభూతేన.

తా॥ పాలయందు నెయ్యి, నిగూఢముగా నుండి కాచుట, పెరుగుగా మార్చుట, కవ్వముతో చిలుకుట, వెన్నను కరగించుట మొదలగు వ్యాపారములచే నయ్యది బహిర్గత మగుచున్నట్లే సర్వజీవులందును బ్రహ్మచైతన్యము నిగూఢముగ నున్నది. అద్దానిని వేదాంతవాక్యశ్రవణము పలుమారులు మనస్సులో మనన మొనర్చుట మొదలగు వ్యాపారముచే బహిర్గత మగునట్లు లేక నభివ్యక్త

మగునట్లనగా తన నిజరూపమే బ్రహ్మమనునిశ్చయజ్ఞాన మొందుటకు తగుప్రయత్న మొనర్పవలయును.

శ్లో॥ జ్ఞాన నేత్రం సమాధాయ, చరే ద్వహ్ని మతః పరమ్
నిష్కలం నిశ్చలం శాంతం, తద్బ్రహ్మాహ మితి స్మృతమ్.

తా॥ కర్మకాండలో నగ్నిని మథించుటకు ఉత్తరారణి, అధరారణి యను రెండు అవసరము. జ్ఞానియైనవాడు ఆ రెండు అరణులను తన మనస్సునే చేసి జ్ఞాన మనుఅగ్నిని మథనముచే పుట్టించి అందు అవిద్య నంతను పుష్కలముగా హోమ మొనర్చి సత్య, జ్ఞానా, నందానందరూప మగుబ్రహ్మము తానే యనునిశ్చయఫలమును పొందును.

శ్లో॥ సర్వభూతాధివాసం చ, యద్భూతేషు వసత్యధి
సర్వానుగ్రాహకత్వేన, తద స్మ్యహం వాసుదేవః.

తా॥ ప్రపంచమున కంతకును అధిష్ఠానమై సర్వజీవులయందును ఏకరూపమై చైతన్యాత్మకమై సర్వబుద్ధివృత్తులకు సాక్షిగాను అంతర్యామిగాను ఉండునట్టిదైన వాసుదేవపరబ్రహ్మమే నేను అను నిశ్చయమాతని కపుడు గల్గును.

# అజ్ఞానభూమికలు

జ్ఞాన, అజ్ఞానభూమికలు వివరింపబడుచున్నవి.

అజ్ఞానభూ స్సప్తవిధా, జ్ఞానభూ స్సప్తధైవహి.

తా॥ అజ్ఞానభూమికలు ఏడువిధములు. జ్ఞానభూమికలు ఏడువిధములు.

బీజజాగ్ర త్తథా జాగ్ర న్మహాజాగ్ర త్తథైవ చ
జాగ్రత్స్వప్న స్తథా స్వప్నః, స్వప్నజాగ్ర త్సుషుప్తికమ్
ఇతి సప్త విధో మోహః.

తా॥ 1 బీజజాగ్రత్, 2 జాగ్రత్, 3 మహాజాగ్రత్, 4 జాగ్రత్స్వప్నము, 5 స్వప్నము, 6 స్వప్నజాగ్రత్, 7 సుషుప్తి యను నీ యేడును అజ్ఞానభూమికలనబడుచు మోహాభేదమే యగును.

1 అందు బీజజాగ్రత్తనగా

ప్రథమం చేతనం యత్స్యా దనాఖ్యం నిర్మలం చితః
భవిష్య చ్చిత్త జీవాదినామశబ్దార్థభాజనమ్
బీజరూపస్థితం జాగ్ర ద్బీజజాగ్ర త్తదుచ్యతే.

తా॥ నామరూపాది కల్పన కధిష్ఠానమై నిర్మల చైతన్యరూపమగు ఆత్మకు పూర్వజన్మ లందలి పాపకర్మాతిశయమువలన ఈ జన్మలో ననుభవింపదగియున్న దేహాదికము తద్భోగ్యవస్తువులు మొదలగున దంతయు సూక్ష్మమగు బీజరూపములోనుండి నీయాత్మనావరించుటయే బీజజాగ్రత్తనబడును. ఇయ్యది గర్భోత్పత్తికాలములో మాతాపితరుల శుక్లశోణిత మిశ్రబిందువే ఉపాధిగాగల ఈ జీవుని ఆశ్రయించి యుండును.

2 జాగ్రత్తనగా

నవప్రసూతస్య పరా, దయం చాహ మిదం మమ
ఇతి యః ప్రత్యయ స్స్వస్థ స్త జ్జాగ్ర త్ప్రాగభావనాత్.

తా॥ తల్లిగర్భమునుండి బయటకు రాగానే దేహమే తానని తలచుట, క్షుత్పిపాసాదికము, తల్లియని ఇతరులని భేదమును గుర్తించుట మొదలగు యవిద్యావిశేషవైభవము జాగ్రత్తనబడును.

3 మహాజాగ్రత్తనగా.

అయం సోహ మిదం తన్మే ఇతి జన్మాంతరోదితః
పీవరః ప్రత్యయః ప్రోక్తో మహాజాగ్ర దితి స్ఫుటమ్.

తా॥ కొంతవయస్సు రాగానే పూర్వజన్మసంస్కారవశముచే 'నేను గొప్పవాడను కావలెను, మంచి భోగ్యవస్తువుల ననుభవింపవలెను' ఇత్యాది సంకల్పముల నొనర్చుట మహాజాగ్రత్తనబడును.

4 జాగ్రత్స్వప్న మనగా.

ఆరూఢ మధవా రూఢం సర్వథా తన్మయాత్మకమ్
యజ్జాగ్రతో మనోరాజ్యం తజ్జాగ్ర త్స్వప్న ఉచ్యతే.

తా॥ ఇంకను కొంతవయస్సు వచ్చినతరువాత తన జన్మాంతర పుణ్యాపాపములనుబట్టి ప్రబలమైనట్టిగాని దుర్బలమైనట్టిగాని మనస్సు ఆయా కోరికలను కోరుచుండగా నీత డద్దానితో తాదాత్మ్యము నొంది ఆమన స్సీతని నెట్లెట్లు త్రిప్పునో అట్లట్లు సంచరించును. ఇదియే జాగ్రత్స్వప్న మనబడును.

5 స్వప్న మనగా.

అల్పకాలం మయా దృష్ట మేత న్నోదేతి యత్రహి
పరామర్శః ప్రబుద్ధస్య స స్వప్న ఇతి కథ్యతే.

తా॥ స్వప్నమందు అనుభవింపబడు క్షణిక సుఖ దుఃఖము లను చూచి మేల్కొనినపుడుగూడ అట్టి క్షణికసుఖములకొరకు అనగా ప్రాపంచికసుఖము లన్నియు క్షణికసుఖములే యైనను అవి క్షణికము లను తెలివి లేక నిరంతరము పాటుబడుటయే స్వప్న మన బడును.

6 స్వప్నజాగ్ర త్తనగా.

చిరసందర్శనాభావా దప్రిఫుల్లం బృహద్వచః
చిరకాలానువృత్తిస్తు స్వప్నో జాగ్ర దివోదితః
స్వప్నజాగ్రదతి ప్రోక్తం జాగ్రత్యపి పరిస్ఫురత్.

తా॥ ఒక మహారాజుయొక్క ఐహిక భోగములను ఒక వడ్రంగియొక్క శిల్పనైపుణ్యమును. ఒక కుట్టుపనివాని కుట్టునేర్పును-ఇత్యాదులను చూచి తానుగూడ అట్టివాడను గావలయునని దురాశ పుట్టి నిరంతర మా ఐశ్వర్యాదులనే తాను ధ్యానించుచు తనకట్టి ఐశ్వర్యము లేకపోయెనను బాధతో నుండుటయే స్వప్నజాగ్ర త నబడును.

7 ఇక సుషుప్తి యనగా.

షడవస్థాపరిత్యాగే జడా జీవస్య యా స్థితిః
భవిష్య ద్దుఃఖబోధాఢ్యా సుషుప్తి స్సోచ్యతే గతిః
జగ త్తస్యా మవస్థాయా మంత స్తమసి లీయతే.

తా॥ పైయారు మోహభేదములతో క్రమముగా మునిగిపోయి అట్లు ప్రవర్తించి తత్పరిణామ మగుదుఃఖ మనుభవమునకు రాగా, అపు డేమిచేయుటకును తోచక జడునివలె నుండి ఇంకను ముందు దుఃఖములు రాబోవుచున్నవని తెలిసి గాఢాంధకారములో సంచరించు వానివలె నుండుటయే సుషుప్తి యనబడును.

ఇట్టి యేడును, అజ్ఞానముయొక్క భూమికలు. అనగా అవస్థా విశేషములు.

## జ్ఞా న భూ మి క లు

ఇక జ్ఞానభూమికలు వివరింపబడుచున్నవి.

జ్ఞానభూమి శ్శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా
విచారణా ద్వితీయాతు తృతీయా తనుమానసీ
సత్త్వాపత్తి శ్చతుర్థీ స్యా త్తత స్సంసక్తినామికా
పదార్థాభావనా షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా.

తా॥ జ్ఞానభూమికలు ఏడు. 1 శుభేచ్ఛ, 2 విచారణ, 3 తనుమానసీ, 4 సత్త్వాపత్తి, 5 సంసక్తి, 6 పదార్థాభావన, 7 తుర్యగ యనునవి. వీనిలక్షణములు క్రమముగా వివరింపబడుచున్నవి.

1 అందు శుభేచ్ఛ యనగా.

స్థితః కిం మూఢ ఏవాస్మి ప్రేక్షేహం శాస్త్ర సజ్జనైః
వైరాగ్యపూర్వ మిచ్ఛేతి శుభేచ్ఛే త్యుచ్యతే బుధైః.

తా॥ నే నెంత మూఢుడను ? పశుపక్ష్యాదు లన్నియు ఆహార నిద్రాభయాదులు గల్గియున్నట్లును వానికొరకే ప్రవర్తించుచున్నట్లును

మనుష్యుడనగు నేనుగూడ ప్రవర్తించుచున్నానేమి! అట్లైన వానికిని నాకును భేద మేమిగలదు? కావున ఈ విషయములో శాస్త్ర మేమి చెప్పనో సజ్జను లేమిపల్కుదురో విచారించి తెలిసికొందునుగాక యనితలచుట శుభేచ్ఛ యనబడును.

2 విచారణ యనగా-

శాస్త్ర సజ్జన సంపర్క వైరాగ్యాభ్యాసపూర్వకమ్
సదాచార ప్రవృత్తి ర్యా ప్రోచ్యతే సా విచారణా.

తా॥ సద్గురువులయొద్ద శాస్త్ర మభ్యసించుచు, సజ్జనులతో సహవాసమొనర్చుచు, వార లేయే విషయములం దెట్లెట్లు ప్రవర్తించుచున్నారో గమనించుచు, ప్రాపంచిక విషయ సుఖములను క్రమముగా తగ్గించుట నభ్యసించుచు, వేదోదితమై అనాదికాలము నుండి శిష్టులచే నాచరింపబడుచున్న తమతమ వర్ణాశ్రమ ధర్మముల నాచరించుచు నుండుటయే విచారణ యనబడును.

3 తనుమానసి యనగా.

విచారణా శుభేచ్ఛాభ్యా మింద్రియార్థేషు రక్తతా
యత్ర సా తనుతా మేతి ప్రోచ్యతే తనుమానసీ.

తా॥ పై శుభేచ్ఛచేతను విచారణచేతను గల్గినజ్ఞానమువలన దేహేంద్రియవ్యాపారములందు అనురాగము క్రమముగా తగ్గించుటయే తనుమానసి యనబడును.

4 సత్త్వాపత్తి యనగా.

భూమికాత్రితయాభ్యాసా చ్చిత్తేఽర్థవిరతే ర్వశాత్
సత్త్వాత్మని స్థితే శుద్ధే సత్త్వాపత్తి రుదాహృతా.

తా॥ పై జెప్పబడిన మూడు భూమికల నభ్యసించుటవలన అంతఃకరణమందు విషయతృష్ణ తగ్గుచు, నిర్మలమై శుద్ధసత్త్వప్రధానమగు చిత్తము గల్గుటయే సత్త్వాపత్తి యనబడును. వీనికే వేదాంత

వాక్యశ్రవణము పూర్తియగును. ఇట్టి స్థితిలో నుండువాడు బ్రహ్మవేత్త యనబడును.

5 అసంసక్తి యనగా

దశాచతుష్టయాభ్యాసా దసంసర్గఫలా తు యా
రూఢసత్త్వచమత్కారా, ప్రోక్తా సంసక్తినామికా.

తా॥ వెనుక జెప్పబడిన నాల్గుదశలను అభ్యసించుటవలన, తాను చేయు ప్రతిపనియందును ఏవిధమైన ఫలాపేక్షయు లేక వేదాంత వేద్య మగుబ్రహ్మముయొక్క పరోక్షజ్ఞానముతో సర్వాంతర్యామి యగు ఈశ్వర ప్రేరణచేతనే జగత్తులోని చమత్కార మంతయు జరుగుచున్నదని నిశ్చయముతో నుండుటయే అసంసక్తి యనబడును. తన దేహేంద్రియాది వ్యాపారమునకు తాను సాక్షి మాత్రుడనే యని నిశ్చయించును. ఇట్టివాడు బ్రహ్మవిద్వరు డనబడును.

6 పదార్థాభావన యనగా.

భూమికాపంచకాభ్యాసా త్స్వాత్మారామతయా భృశమ్
ఆభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానా మభావనాత్
పరప్రయుక్తేన చిరం ప్రయత్నే నావబోధనమ్
పదార్థాభావనా నామ షష్ఠీ భవతి భూమికా.

తా॥ పై అయిదు భూమికలను చక్కగా నభ్యసించుటచే కేవల మంతర్ముఖుడై తానే బ్రహ్మమునని కొంతకాలముమాత్రము నిశ్చయించుచు మరికొంతకాలము తాను బ్రహ్మము కానట్లు భాసింప జేయు దేహేంద్రియాది ఆభ్యంతరపదార్థములను ఘటపటాదిబాహ్య పదార్థములను ఆయాలోకప్రసిద్ధ కల్పితరూపములతో భావనచేయక వానియం దనుగత మగుచైతన్యమాత్రమునే చూచుటకు ప్రయత్నించుచుండు కాలమే పదార్థాభావన యనబడును. వీనికి నెల్లపుడు పరోక్షబ్రహ్మసాక్షాత్కార ముండునుగాని అపరోక్షాత్మాను

భవము మాత్రము కొంతకాల ముండక కొంతకాల ముండుచుండును. ఇట్టివాడు బ్రహ్మవిద్వరిష్ఠు డనబడును.

7 తుర్యగ మనగా.

షడ్భూమికా చిరాభ్యాసా ద్భేద స్యానుపలంభనాత్
యత్స్వభా వైకనిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః.

తా॥ పై ఆరుభూమికలను క్రమముగా పెక్కుమార్లు అభ్యసింపగా సమస్త బ్రహ్మాండమందలి సర్వవస్తువులలోను ఏకరీతిగా నుండు సత్యా, జ్ఞానా, నంతా, నంద, బ్రహ్మమే తానను నిశ్చయము పుష్కలముగా గల్గియుండుట యనగా అపరోక్షాత్మసాక్షాత్కారము నొందుటయే తుర్యగ యనబడును. ఇట్టివాడు జీవన్ముక్తు డనబడును.

భూమికాసప్తకం చైత ద్ధీమతామేవ గోచరమ్
సదేహా వా అదేహా వా తే ముక్తా నాత్ర సంశయః.

తా॥ ఈప్రకార మీయేడుజ్ఞానభూమికలును మంచిబుద్ధిమంతులకుమాత్రమే గోచరించును. ఈయేడింటి నీక్రమముగా నీజన్మలోనే పూర్తిగా నభ్యసించువారు జీవన్ముక్తులే యనుట కెట్టిసందియమును లేదు. ఒకవేళ నీభూమికలలో కొన్నింటినిమాత్రమే అభ్యసించగా నీదేహము పడిపోయినను, ఉత్తరజన్మలో నీవాసన లుండి ఆపైభూమికలనే యభ్యసించి క్రమముగా తప్పక మోక్షమునొందుటకును నెట్టి సందేహము లేదు.

అవబోధం విదు ర్జ్ఞానం తదిదం సాప్తభూమికమ్
ముక్తిస్తు జ్ఞేయ మిత్యుక్త్వా భూమికాసప్తకా త్పరమ్.

తా॥ అపరోక్షాత్మసాక్షాత్కారమే మోక్ష మనబడును. అట్టిజ్ఞానమే మోక్షము. అయ్యది యీసప్తభూమికలద్వారా కల్గునదై వీనికంటె పరమై యున్నది. కాన దృఢాపరోక్షాత్మవిజ్ఞాన మెట్టిసంశయ విపర్యయములును లేక కలిగి నిత్యానందరూపుడై యుండుటయే ఈ

జ్ఞానభూమికలపర్యవసానము. ఇట్టిదే తురీయాతీత మనబడును. వెనుక జెప్పిన తుర్యగకును ఈతురీయాతీతమునకును భేద మేమనగా-

ఏషాహి జీవన్ముక్తేషు తుర్యావస్థేతి విద్యతే
విదేహముక్తివిషయం తుర్యాతీత మతఃపరమ్.

తా॥ పైసప్తభూమికలలో చివరది యగుతుర్యగము, జీవన్ముక్తావస్థ యనబడును. ఈతురీయాతీతావస్థ విదేహముక్తి యనబడును. ఇందు కనువగు పూర్వోదాహృత చతుర్వేదస్థ మహావాక్యముల యర్థము వివరింపబడుచున్నది.

---

# మహావాక్యార్థ వివరణము

## ఋగ్వేదము — (1) ప్రజ్ఞానం బ్రహ్మ

1. యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ,
స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితమ్.

తా॥ చక్షురింద్రియముయొక్క దర్శనశక్తియు శ్రోత్రేంద్రియముయొక్క శ్రవణశక్తియు జిహ్వేంద్రియముయొక్క రుచిచూచు శక్తియు ఈప్రకార మాయా యింద్రియము లన్నిటియొక్క ఆయా శక్తిసామర్థ్యము లేచైతన్యశక్తివలన కలుగుచున్నవో అట్టిచైతన్యశక్తియే ప్రజ్ఞాన మనబడును.

2. చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు
చైతన్య మేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి.

తా॥ ఇట్టిచైతన్యము మనుష్యులయందేగాక చతుష్పాత్తులగుపశువులందును క్రిమికీటాదులందును పక్షిసర్పాది అండజములందును ఓషధివనస్పతిగుల్మాదులందును ఇంద్రాదిదేవతలందరియందును ఏకరీతిగానున్నది. అదియే సర్వవ్యాపకమై అన్నిటికంటె గొప్పదియై

యన్నందున బ్రహ్మమనబడును. జాగ్రత్స్వప్నసుషుప్తు లనునవస్థలు మారినను బాల్య యౌవన కౌమార వార్ధకాద్యవస్థావిశేషములు మారిన నీయన్నిటియందును అనుగతమగుచున్న ఈచైతన్యమే నాయొక్క నిజరూపముగాన నేనే బ్రహ్మమును.

## యజుర్వేదము — (2) అహం బ్రహ్మాస్మి

1. పరిపూర్ణః పరాత్మాస్మి న్దేహే విద్యాధికారిణి
బుద్ధే స్సాక్షితయా స్థిత్వా స్ఫుర న్నహ మితీర్యతే.

తా॥ స్వభావముచే దేశకాలవస్తుపరిచ్ఛేదము లేక అంతట నిండియున్నట్టి పరబ్రహ్మమే, ఈమాయాకల్పితజగత్తునందు శమ దమాదిసాధనసంపద, నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థఫల భోగవిరాగము, ముముక్షుత్వము ఇత్యాదులను సంపాదించి వేదాంత వాక్యశ్రవణమననాదిక మొనర్చు నీయధికారులదేహమందు బుద్ధి వృత్తులకును ఆయాఇంద్రియవ్యాపారాదులకును సాక్షిగా నుండి ఎట్టి వికారమును జెందకయుండి ప్రకాశించునట్టి ప్రత్యగాత్మయే ఈమహా వాక్యమందలి "అహం" అను పదముచే లక్షణావృత్తిచే చెప్పబడు చున్నాడు.

2. స్వతః పూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః
అస్మీ త్యైక్యపరామర్శ స్తేన బ్రహ్మ భవా మ్యహమ్.

తా॥ సర్వప్రపంచములో నిండియున్న సచ్చిదానందపరబ్రహ్మమే ఈమహావాక్యమందలి బ్రహ్మ శబ్దముచే జెప్పబడుచున్నది. ఈవాక్యమందలి అస్మి యనుపదముచే నీప్రత్యగాత్మపరమాత్మల యైక్యము బోధింపబడుచున్నది అందుచే నేను బ్రహ్మము నేగాని తద్భిన్నుడ నెంతమాత్రము గాను.

## సామవేదము — (3) త త్త్వ మసి

1. ఏక మే వాద్వితీయం స న్నామరూపవివర్జితమ్.
సృష్టేః పురాఽధునాప్యస్య తాదృక్త్వం తదితీర్యతే.

తా॥ ఈఛాందోగ్యోపనిషత్తులోని షష్ఠప్రపాఠకారంభమందు సృష్టికి పూర్వము సజాతీయవిజాతీయస్వగతభేదరహిత మగునట్టియు, నామరూపాదివికారవర్జితమైనట్టియు, ఏ సద్వస్తువు "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయ" మనువాక్యముచే ప్రతిపాదింపబడి నదో ఇప్పుడు సృష్ట్యుత్తరకాలమందుగూడ ఆవస్తువు అట్లే యుండునట్లు విచారదృష్ట్యా నిశ్చయింపబడుచున్నది. అదియే ఈ "తత్త్వమసి" యనుమహావాక్యమందలి తత్ అనుపదముచే లక్షణావృత్తిచే జెప్ప బడుచున్నది.

2. శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర త్వంపదేరితమ్
ఏకతా గ్రాహ్యతేఽసీతి తదైక్య మనుభూయతామ్

తా॥ నిత్యానిత్యవస్తువివేకాది సాధనచతుష్టయసంపత్తి గల్గి వేదాంతవాక్యశ్రవణాదిక మొనర్చునట్టిసాధకుని దేహేంద్రియాదుల కతీతమై తద్వ్యాపారము లన్నిటికి సాక్షిగా నుండి నిర్వికారుడై యుండుప్రత్యగాత్మయే ఈ "తత్త్వమసి" వాక్యమందలి త్వం అను పదముచే జెప్పబడుచున్నది. ఇందలి "అసి" అనుపదముచే ఈప్రత్య గాత్మకును ఆసద్వస్తువునకును ఐక్యము గ్రహింపజేయబడుచున్నది. లోకమందలిసాధకు లందరును అట్టి ఐక్యజ్ఞానము నొందుదురుగాక.

అధర్వణవేదము — (4) అయ మాత్మా బ్రహ్మ

స్వప్రకాశాపరోక్షత్వ మయ మిత్యుక్తితో మతమ్
అహంకారాదిదేహాంతా త్ప్రత్యగాత్మేతి గీయతే.

తా॥ ఈవాక్యమందలి అయం అనుశబ్దముచే స్వయంప్రకాశ మానము అపరోక్షము నగువస్తువు చెప్పబడును. పుణ్యపాపములవలె నియ్యది అదృశ్యముగాదనియు ఘటాదిప్రాపంచికవస్తువులవలె పర ప్రకాశ్యము గాదనియు, ఈ "అయం" అనుపదమువలన తెలియు చున్నది. ఇక నీవాక్యమందలి ఆత్మా యనుపదమునకు అహంకారము ప్రాణము, మనస్సు, ఇంద్రియాదులు, దేహము మొదలగువాని కన్ని టికి అధిష్ఠానమై సాక్షియై అంతర్యామియై యుండువస్తు వని యర్థము.

2. దృశ్యమానస్య సర్వస్య జగత స్తత్త్వ మీర్యతే
బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకమ్,

తా॥ ఈవాక్యమందలి బ్రహ్మశబ్దముచే మాయాకల్పితమగు ఈచరాచరప్రపంచమున కంతకును అధిష్ఠానమై యుండుపరమార్థసత్యమగుబ్రహ్మము చెప్పబడుచున్నది. గాన ఈమూడుపదములతో నొప్పునీమహావాక్యతాత్పర్య మేమన దేహాదిజగత్తంతయు మాయా కల్పితమై ప్రతిభాసించుచున్నదనియు, దీని కధిష్ఠానము సచ్చిదానంద స్వయంజ్యోతిస్స్వభావ సర్వాపరోక్షబ్రహ్మ మనియు అదియే నాయాత్మయథార్థభావ మనియు తాత్పర్యము.

అనాత్మదృష్టే రవివేకనిద్రా
మహం మమ స్వప్నగతిం గతోఽహమ్
స్వరూపసూర్యేఽభ్యుదితే స్ఫుటోక్తేః
గురో ర్మహావాక్యపదైః ప్రబుద్ధః.

తా॥ ఆత్మ గానట్టిదేహేంద్రియసంఘాతమునే యాత్మయని తలచి యవివేక మనునిద్రను జెంది అందు "దేహమే నేను దారాపత్య గృహక్షేత్రాదులే నేను" ఇత్యాది స్వప్నములను గంటిని- ఆత్మస్వరూపజ్ఞాన మనుసూర్యుడు స్ఫుటముగా నుదయింపగా సద్గురువు వేదాంతమహావాక్యాదుల యర్థమును చక్కగా వివరించి చెప్పగా నేను మేల్కొని ఆనిద్రను ఆకలలను వివేకముచే పోగొట్టుకొంటిని. అనగా అది స్వప్నజ్ఞానతుల్యమని తెలిసికొంటిని.

వాచ్యం లక్ష్యమితి ద్విధార్థసరణీ వాచ్యస్యహి త్వం పదే
వాచ్యం భౌతిక మింద్రియాదిరపి య ల్లక్ష్యం త్వమర్థశ్చ సః
వాచ్యం తత్పద మీశతాకృతమతి ర్లక్ష్యంతు సచ్చిత్సుఖా
నందబ్రహ్మ తదర్థఏవ చ తయో రైక్యం త్వసీదం పదమ్.

తా॥ ప్రతిశబ్దమునకు వాచ్యార్థమనియు లక్ష్యార్థమనియు రెండువిధములుగా నర్థము చెప్పురీతి శాస్త్రప్రసిద్ధమై యున్నది. మహావాక్యములయర్థమును చెప్పుటలో నీరీతులు రెంటిలో నేది యా

ప్రకరణసందర్భము ననుసరించి సరిపడునో యారీతి యాశ్రయణీయ మగును ప్రకృతము "తత్త్వమసి" యనువాక్యమందు త్వం అను పదమునకు పాంచభౌతిక మగుదేహేంద్రియసంఘాతము వాచ్యార్థ మగుచున్నది. ఈ త్వం పదమునకు లక్ష్యార్థము ఈదేహాదికమునకు సాక్షి యగునిర్వికార, అసంగ చిద్రూప, ప్రత్యగాత్మ యగుచున్నది. ఈవాక్యమందలి తత్ అనుపదమునకు వాచ్యార్థము మాయోపాధి కము జగత్కారణము అగునీశ్వరుడును లక్ష్యార్థము సచ్చిదానంద పరబ్రహ్మమును అగుచున్నది. ఇక నీవాక్యమందలి 'అసి' అనుపద ముచే పైరెండుపదము లగు తత్, త్వం ల యొక్క లక్ష్యార్థములకు ఐక్యము ప్రతిపాదింపబడుచున్నది.

త్వమితి, తదితి, కార్యే, కారణే సత్యుపాధౌ,
ద్వితయ మితరథైకం, సచ్చిదానందరూపమ్.

తా॥ కార్య మగుమలినసత్త్వప్రధాన త్రిగుణాత్మక అవిద్యయే ఉపాధిగాగలవాడు త్వంఅని వాచ్యార్థముచే బోధింపబడును. కారణ మగు శుద్ధసత్త్వప్రధాన త్రిగుణాత్మక మాయయే ఉపాధిగా గల వాడు తత్ అనుపదముయొక్క వాచ్యార్థ మగుచున్నాడు.

ఇట్లీ యిద్దరు ఉపాధితాదాత్మ్యముతో గ్రహింపబడినపుడు వేరువేరుగా లేక భిన్నులుగా భాసింతురు; గాని ఆయుపాధులను రెంటిని అవిద్యాకల్పితము లనుహేతువుతో లయమొందించి స్వరూప మాత్రమును లక్షణావృత్తిచే గ్రహించినచో ఆరెండును సచ్చిదానంద పరబ్రహ్మమే యగుచున్నవి.

కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః
కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే.

తా॥ కార్యోపాధిగలవాడు జీవుడు, కారణోపాధిగలవా డీశ్వ రుడు గాన నీకార్యకారణములు రెండనుభావము తత్త్వవిచారణచే విడిచిపెట్టబడగా సర్వవ్యాపకము, జ్ఞానరూపమునగు ఒకేవస్తు వీరెండు

చోట్లను నిలచియుండును. కార్య మనునది కారణముయొక్క అవస్థా విశేషమేగాని వస్త్వంతర మెంతమాత్రము గాదు.

శ్రు॥ అవ్యక్త మక్షరే విలీయతే అక్షరం తమసి విలీయతే
తమః పరే దేవే ఏకీభవతి.

తా॥ అవ్యక్త మగువాయ్వాదిభూతములు నాల్గును అక్షర మగునాకాశమందు లయమొందును. ఆయాకసము మూలప్రకృతి యందును అది పరబ్రహ్మమందును లయమగును.

యేన విశ్వ మిదం వ్యాప్తం య న్న వ్యాప్నోతి కించన,
ఆభారూప మిదం సర్వం యం భాంత మనుభా త్యయమ్.

తా॥ ఎవ్వనిచే నీజగ మంతయు వ్యాపింపబడియుండెనో ఎవని నెట్టివస్తువును వ్యాపింపలేదో ఈజగ త్తంతయు అధిష్ఠాన మగునెవని యందు కల్పింపబడినదో ఎవనిప్రకాశమువలన నీజగత్తులోని చంద్ర సూర్యాదులన్నియు కాంతిమంతము లగుచున్నవో అదియే సర్వులకు ప్రత్యగాత్మయు, పరబ్రహ్మమును అయియున్నది.

యస్య సన్నిధిమాత్రేణ దేహేంద్రియమనోధియః
విషయేషు స్వకీయేషు వర్తంతే ప్రేరితా ఇవ.

తా॥ ఎవనిసన్నిధిమాత్రముచేతనే సర్వులయొక్క దేహములు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ప్రేరణజేయబడినవానివలె తమతమ వ్యాపారముల నెల్లపుడు నేకరీతిగా నొనర్చుచున్నవో అతడే ప్రత్య గాత్మ యనియు పరబ్రహ్మమనియు చెప్పబడును.



## ఉపనిషదుపదేశములు

### ఋగ్వేదము — ఐతరేయోపనిషత్తు

శ్రు॥ ఆత్మావా ఇద మేక ఏవాగ్ర ఆసీత్. నాన్య త్కిఞ్చన
మిషత్. స ఈక్షత లోకాన్ను సృజా ఇతి.

తా॥ ఈ ప్రపంచము సృష్టికి పూర్వ మొక్కటిగా శుద్ధమై వికారరహితమై, ఆత్మగానే యుండెను. ఇతరమైన దేదియు లేదు. ఏవ్యాపారమును లేదు. ఆయాత్మ లోకమును సృష్టించెదనుగాక అని ఆలోచించెను.

శ్రు॥ స ఇమాం ల్లోకా నసృజత. అమ్భోమరీచీర్మరమాపోఽదోఽమ్భః పరేణ దివం ద్యౌః ప్రతిష్ఠాన్తరిక్షం మరీచయః, పృథివీ మరోయా అథస్తా త్తా ఆపః.

తా॥ ఆపరమాత్మ యీలోకములను సృజించెను. అవి అంభస్సు అనగా (1) అంభ స్సనెడిలోకము. ఇది ద్యులోకమున కావల నున్నది. దీనికి ద్యులోక మాధారము, ద్యులోకమునకు దిగువ (2) అంతరిక్ష లోక మున్నది. ఇచ్చట సూర్యకిరణము లుండుటంబట్టి దీనికి మరీచ లోకమనియు పేరుగలదు. (3) మర మన భూలోకము, ఎచ్చట సకల భూతములు మరణమునొందుచున్నవో ఆలోకము మర మనబడును. భూలోకమునకు దిగువ (4) అప్పు జలములుగల లోకములుగలవు. పంచ భూతాత్మకములైనప్పటికి అప్పులు విశేష మగుటంజేసి సకలలోకములు అప్ శబ్దవాచ్యములయినవి. ఈవిధముగా పరమాత్మ ప్రాణులెల్లరు కర్మఫలము ననుభవించుటకొరకు ఒకదానిక్రింద నొకటి, అంభస్సను లోకము, దానిక్రింద మరీచిలోకము, దానిక్రింద భూలోకము, దాని క్రింద ఆపః లేక జలలోకము సృజించెను. భూమికంటె దిగువ క్రిందుగా ఉన్నలోకము అప్పులుగా చెప్పబడుచున్నది.

శ్రు॥ స ఈక్షతేమేను లోకా లోకపాలాన్ను సృజా ఇతి, సోఽద్భ్యఏవ పురుషం సముద్ధృత్యామూర్ఛయత్.

తా॥ ఆపరమాత్మ నాచే సృజించబడిన లోకములను పాలించు వారు లేనిచో నాశనమగునని తలంచి కుమ్మరి కుండలు చేయుటకు భూమియందుండి మంటిని ముద్దచేసి యొత్తునట్లు జలమునందుండి పురుషుని శిరఃపాదాద్యవయవములతో నెత్తెను. ఏ ఉదకములే ప్రధాన

ముగా గలపంచభూతిములనుండి అంభస్సు మొదలగు లోకములను సృజించెనో వానినుండియే పురుషుని సృజించెను.

శ్రు॥ త మభ్యతప త్తస్యాభిత ప్తస్య ముఖం నిరభిద్యత యథాఽ ణ్డం, ముఖా ద్వా గ్వాచోఽగ్ని ర్నాసికే నిరభిద్యేతాం. నాసి కాభ్యాం ప్రాణః ప్రాణా ద్వాయు రక్షిణీ నిరభిద్యేతాం. అక్షి భ్యాం చక్షు శ్చక్షుష ఆదిత్యః కర్ణౌ నిరభిద్యేతాం. కర్ణా భ్యాం శ్రోత్రం శ్రోత్రా ద్దిశ స్త్వ జ్నిరభిద్యత. త్వచో లోమాని లోమభ్య ఓషధివనస్పతయో హృదయం నిరభిద్యత. హృదయా న్మనో మనస శ్చన్ద్రమా నాభి ర్నిరభిద్యత, నాభ్యా అపానోఽపానా న్మృత్యుః శిశ్నం నిరభిద్యత. శిశ్నా ద్రేతో రేతస ఆః

తా॥ ఆపరమాత్మ పురుషాకృతి యనుపిండమునుగూర్చి ఆలో చించెను. ఇక్కడ తపస్సనగా ఆలోచించుటగాని తపస్సు గాదు ఆపిండమునకు నోరు పక్షిగ్రుడ్డువలె చీలెను, లేక కలిగెను, ఆముఖము నుండి వాక్కు కలిగెను, వాక్కునుండి అగ్ని కలిగెను, ముక్కు కలిగెను. ముక్కులయందుండి ప్రాణములు కలిగెను. ప్రాణములనుం వాయువు కలిగెను. నేత్రములు కలిగెను. నేత్రములనుండి ప్రకాశము కలిగెను, చెవులు కలిగెను. చెవులనుండి శబ్దము కలిగెను. శబ్దముల నుండి దిక్కులు కలిగెను, చర్మము కలిగెను, చర్మమునుండి వెంట్రు కలు కలిగెను. వెంట్రుకలనుండి చిన్నచెట్లు మానులు కలిగెను. హృదయము కలిగెను. హృదయమునుండి మనస్సు కలిగెను, మనస్సు నుండి చంద్రుడు కలిగెను, నాభినుండి అపానము కలిగెను, అపాన వాయువునుండి మృత్యుదేవత కలిగెను, శిశ్నము కలిగెను, శిశ్నము నుండి రేతస్సు కలిగెను, రేతస్సునుండి జలములు కలిగెను. ఇట్లు పరమాత్మ పురుషాకృతి పిండమునకు వాక్కు మొదలగువానిని వానికి నింద్రియములను ఆయింద్రియముల కధిదేవతలను సృజించెను.

శ్రు॥ తా ఏతా దేవతాః సృష్టా అస్మిన్మహత్యర్ణవే ప్రాపతన్
త మశనాయాపిపాసాభ్యా మన్వవార్జత్. తా ఏన మబ్రువ
న్నాయతనం నః ప్రజానీహి యస్మిన్ ప్రతిష్ఠితా అన్న మదా
మేతి.

తా॥ సృజింపబడిన ఆయగ్న్యాదిదేవత లీసంసారమను గొప్ప సముద్రమునందు పడినవారైరి. ఆపరమాత్మ (పిండాకృతియైన) వానికి ఆకలిదప్పులను కలుగచేసెను. ఇట్లానర్చినందున ఆపిండమునుండి పుట్టిన అగ్న్యాదిదేవత లందరు ఆకలిదప్పులచే పీడింపబడినవారై తమ్ము సృజించినపరమాత్మనుగూర్చి మే మేయధిష్ఠానమును పొంది ఆకలిదప్పులను నివర్తిచేసికొనదగునో అట్టి యధిష్ఠానమును మాకు కలుగజేయు మని ప్రార్థించిరి

శ్రు॥ తాభ్యః పురుష మానయ త్తా అబ్రువన్ సుకృతం
బతేతి పురుషోవావ సుకృతం. తా అబ్రవీ ద్యథాయతనం
ప్రవిశ తేతి.

తా॥ ఆపరమాత్మ దేవతలకొరకు పురుషాకృతిని లేక మనుష్యాకారమును గనుపరచెను. ఆదేవతలు బళీ సుకృతము! అని సంతోషించి ఇట్లు చెప్పిరి. పురుషుడేగదా సుకృతము అనిచెప్పిన యాదేవతలను జూచి పరమేశ్వరుడు మనుష్యునియందు తగినస్థానములలో ప్రవేశింపుడని ఆదేవతలకు చెప్పెను.

శ్రు॥ అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశ ద్వాయుః ప్రాణో
భూత్వా నాసికే ప్రావిశ దాదిత్య శ్చక్షు ర్భూత్వాఽక్షిణీ
ప్రావిశ ద్దిశః శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశ న్నోషధివనస్ప
తయో లోమాని భూత్వా త్వచం ప్రావిశం శ్చన్ద్రమా
మనో భూత్వా హృదయం ప్రావిశత్ మృత్యు రపానో భూత్వా
నాభిం ప్రావిశ దాపో రేతో భూత్వా శిశ్నం ప్రావిశన్.

తా॥ అగ్ని వాక్కు అయి నోటిని ప్రవేశించెను. వాయువు ప్రాణవాయువై ముక్కురంధ్రములను ప్రవేశించెను. సూర్యుడు నేత్రేంద్రియమై (తేజస్సై) నేత్రములను ప్రవేశించెను. దిక్కులు శ్రోత్రేంద్రియమై చెవులను ప్రవేశించెను. ఓషధివనస్పతులు (పుష్పించి కాచునట్టివి, పుష్పించక కాచునట్టివి యగువృక్షములు) శరీరమందలి రోమములై చర్మమును ప్రవేశించెను. చంద్రుడు మనస్సయి హృదయమును ప్రవేశించెను. మృత్యువు అపానవాయువై నాభిని ప్రవేశించెను. జలము శుక్లమయి శిశ్నమును ప్రవేశించెను.

శ్రు॥ స ఈక్షత కథం న్విదం మదృతే స్యాదితి. స ఈక్షత కతరేణ ప్రపద్యా ఇతి. స ఈక్షత యది వాచాభివ్యాహృతం, యది చక్షుషా దృష్టం, యది శ్రోత్రేణ శ్రుతం, యదిచ త్వచా స్పృష్టం, యది మనసా ధ్యాతం, యద్యపానే నాభ్యపానితం, యది శిశ్నేన విసృష్ట మథ కోఽహమితి.

తా॥ ఆపరమేశ్వరు డీదేహేంద్రియాది సంఘాతము తాను లేనియెడల నెట్లుజీవించునని యాలోచించి, తానుమాత్రమే దేహేం ద్రియాది సకలవ్యాపారములకును సాక్షియై భోక్తయై యుండెదనని నిశ్చయించి యీశరీరమం దేమార్గముగా ప్రవేశింప నగునని యాలో చించెను. ఆపరమాత్మ వాక్కుచేత మాటలాడునెడల, ప్రాణవాయువు ఘ్రాణముచేత ప్రాణవ్యాపారము సేయునెడల, నేత్రముచేత చూడబడునెడల, చెవిచేత వినబడునెడల, చర్మముచేత తాకుట యగునెడల, మనస్సుచేత తలంచుట యగునెడల, అపానవాయువుచేత మ్రింగుటయగునెడల, మేఢ్రముచేత విసర్జనముచేయునెడల, అప్పుడీవాగాదీంద్రియములచే జేయంబడువ్యాపారముల నన్నిటిని ప్రత్యేక ప్రత్యేకముగా ఇది ఇది అని విభజించి తెలిసికొనెడినేను ఎవడను ? అని విచారించెను

శ్రు॥ స ఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత సైషా విదృతిర్నామ ద్వా స్తదేత న్నాన్దనమ్, తస్య

తృతీయ ఆవసథాః, త్రయః స్వప్నా అయ మావసథోఽయ మావసథోఽయ మావసథ ఇతి.

తా॥ ఆపరమాత్మ నాకార్యముల నన్నిటిని నెరవేర్చుటకు నా సేవకుడైన ప్రాణము ప్రవేశించుమార్గములు రెంటిలో నేను శిరోగ్రభాగమున బ్రహ్మరంధ్రమును భేదించుకొని ప్రవేశింతునుగాక యని నిశ్చయించి కపాలమును చీల్చికొని ప్రవేశించెను చీల్చబడినది గనుక ఆయీద్వారము విదృతి యను పేరుగలది. ఈమార్గ మానన్ద మయ మనబడును. జీవరూపములతో ప్రవేశించినపరమాత్మకు మూడు క్రీడానివాసస్థానములు గలవు. జాగ్రత్కాలమునందు కుడి కన్ను, స్వప్నకాలమునందు మనస్సు సుషుప్తికాలమునందు హృదయాకాశము అనునివి స్థానములు. ఇచ్చట జాగ్రి, త్స్వప్న, సుషుప్తులు మూడును స్వప్నములుగా గ్రహించునది. జాగ్రత్తయను స్వప్నమెట్లన పరమార్థ జ్ఞానము లేనందున జాగ్రితయు స్వప్నమువలె నున్నది. ఇది వివేకులకు తెలియును. ఇట్లు ముమ్మారు చెప్పుట ఆదరార్థము.

శ్రు॥ స జాతో భూతా న్యభివ్యైక్షత్ కి మిహాన్యం వావదిష దితి. సఏత మేవ పురుషం బ్రహ్మ తతమ మపశ్య దిద మ దర్శమితి.

తా॥ ఆపరమాత్మ జీవరూపముగా పుట్టినవాడై జననమరణాదులచే సంకటమొంది భూమ్యాకాశములను సకలజీవులను జూచెను. నే నివన్నియు బ్రహ్మముకంటె భిన్నమైనవని చెప్పుదునా ఏమి అని యాలోచించి బ్రహ్మమునకంటె భిన్నమైన దేదియు లేదని నిశ్చయించెను. దేహేంద్రియాదులయందలి తాదాత్మ్యభ్రమచేత నేను దుఃఖిని, నేను మనుష్యుడను, నేను గ్రుడ్డివాడను, నేను సుఖిని, అని యిట్లు శరీరసంబంధ మగుకార్యముల నన్నింటిని తనవిగా తలంచి ఆత్మ లేదని యెంచి యున్నప్పుడు పరమకృపానిధి యగు సద్గురునిచే ఆత్మజ్ఞానబోధము నొసంగుటకై శబ్దించుచున్న వేదాంతభేరి మ్రోగు

చుండగా శరీరమును జొచ్చియున్న జీవాత్మను ఆకాశమువలె సర్వత్ర వ్యాపించియున్న పరబ్రహ్మమని తెలిసికొని ఆశ్చర్యము నొందెను.

శ్రు॥ తస్మాదిదన్ద్రో నామేదన్ద్రోహవై నామ త మిదన్ద్రం సన్త మిన్ద్ర ఇత్యాచక్షతే పరోక్షేణ, పరోక్షప్రియా ఇవ హి దేవాః పరోక్షప్రియా ఇవహి దేవాః.

తా॥ ఆ కారణమువలన జీవాత్మ ఆపరబ్రహ్మమును ప్రత్యక్షముగా జూచినందున ప్రత్యక్షమగు పరమాత్మయే ఇంద్రుడను పేరు గలవాడుగా నగుచున్నాడు. ఇంద్రుడనగా ఉండునట్టివాడు గనుక నింద్రుడని వివేకులు ప్రత్యక్షముగా గనంబడిన ఆ పరబ్రహ్మము నింద్రుడని చెప్పుచున్నారు. దేవత లట్టిపరమాత్మను దర్శించుటయం దిష్టముగలవారే యైయున్నారు.

శ్రు॥ గర్భేను సన్నన్వేషా మవేద మహం దేవానాం జనిమాని విశ్వా, శతం మాపర ఆయసీ ररక్ష న్నధః శ్యేనో జవసా నిరదీయ మితి.

తా॥ వామదేవు డనుఋషి గర్భమునం దుండియే యిట్లు చెప్పియున్నాడు. (ఈజీవుడు) గర్భమునందుండియే పూర్వజన్మము నందు జేయబడిన వేదాంతశ్రవణాదిసామగ్రివశమున వాక్కు మొదలగు దేవతలయొక్క సమస్తజన్మలను క్రమముగా తెలిసికొంటిని; అన్నిటికి మూలకారణమైన ఆత్మస్వరూపమును తెలిసికొంటిని; లోహవికారములవంటి అనేకశరీరము లధోలోకములయందు డేగ తన సామర్థ్యముచేత వలను భేదించుకొనివచ్చినట్లు నే నాత్మజ్ఞానమున, కల్గినసామర్థ్యముచేత పూర్వమందలి సంసారాజ్ఞానబంధమునుండి బయలువెడలివచ్చినాడ నని పల్కెను.

శ్రు॥ గర్భ ఏవ శయానో వామదేవ ఏవ ముహాచ.

తా॥ దీనిని వామదేవమహర్షి గర్భమునందే యుండి యిట్లు చెప్పెను

శ్రు॥ స ఏవంవిద్వా నస్మా చ్ఛరీరభేదా దూర్ధ్వ ఉత్క్ర-మ్యాముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్ కామా నాప్త్వా-మృతః సమభవ త్సమభవత్.

తా॥ ఆవామదేవమహర్షి యీవిధముగా ఆత్మస్వరూపము తెలిసికొన్నవాడై సమస్తములగు కోరికల నిచ్చటనే పొంది ఈ దేహ పాతానంతరమున, పరమార్థస్వరూపుడై అధోరూపసంసారమునుండి లేచి స్వర్గమైన ఆత్మలోకమునందు ముక్తుడు లేక బ్రహ్మము ఆయెను.

శ్రు॥ స ఏష బ్రహ్మ ఏష ఇన్ద్ర ఏష ప్రజాపతి రేతే సర్వే దేవా ఇమాని చ పఞ్చమహాభూతాని పృథివీవాయురాకాశ ఆపోజ్యోతీంషీ త్యేతానీమానిచ క్షుద్రమిశ్రాణీవ బీజా నీతరాణి చేతరాణి చాణ్డజానిచ జారుజానిచ స్వేదజాని చోద్భి జ్జాని చాశ్వా గావః పురుషా హస్తినో యత్కించేదం ప్రాణి జఙ్గమంచ పతత్రిచ యచ్చ స్థావరం సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞా నం బ్రహ్మ.

తా॥ సర్వజీవుల అంతఃకరణమునందు, జలమునందు ప్రతిబింబించినసూర్యబింబమువలె ప్రవేశించియుండుహిరణ్యగర్భ డనుపేరు గలప్రాణరూప మగుఆత్మ ఈప్రజ్ఞానాత్మయే. అగ్న్యాదిసకలదేవ తలును భోక్తృభోజ్యము లగుఅన్నాన్నాదలక్షణము లైన పృథివ్యప్తే జోవాయ్వాకాశము లనుపంచమహాభూతములుగా నున్నవి అనిచెప్ప బడుచున్నవి. మరియు నివి అల్పములతోగూడిన బీజముగా అగు చున్నది.

అండజానిచ = గ్రుడ్డునందుండి కలుగునవి. జారుజానిచ=కోశము నందుండి కలుగునవి. స్వేదజానిచ = చెమ్మటయందుండి కలుగునవి ఉద్భిజ్జానిచ = భూమినిచీల్చుకొని కలుగునవి. అశ్వాః = గుఱ్ఱములు. గావః = ఆవులు. పురుషాః = మనుష్యులు. హస్తినః = ఏనుగులు.

మరియు నేది జంతువులై పాదములతో నడుచునవిగాను పక్షులుగాను నున్నదో ఏది స్థావరముగా ఉన్నదో ఆసర్వము ప్రపంచము. అంతయు ప్రజ్ఞానమునందే యున్నది. అనగా నీసమస్తమును ప్రజ్ఞానమనునేత్రము గలపరమాత్మే. బ్రహ్మస్వరూపము. ప్రజ్ఞయే (జ్ఞానమే) నేత్రముగా గలది. దేనిచే చూడబడుచున్నదో అది జ్ఞాననేత్రము. సర్వప్రపంచమును జ్ఞానమునే నేత్రముగా గల్గియున్నది. బ్రహ్మాది స్తంబపర్యంతము పరమాత్మస్వరూపమే.



# య జు ర్వే ద ము

## తైత్తిరీయోపనిషత్తు – భృగువరుణసంవాదము

శ్రు॥ భృగుర్వై వారుణిః. వరుణం పితర ముపససార. అధీహి భగవో బ్రహ్మేతి.

తా॥ వరుణపుత్రు డగుభృగువు తండ్రి యగువరుణుని శాస్త్రీయముగా గురూపసదనవిధితో నమస్కరించి "ఓభగవంతుడా నాకు బ్రహ్మవిద్య నుపదేశింపు" మని సవినయముగ ప్రార్థించెను. ఇచట భృగువు వరుణునిగూర్చి "హేభగవః" అని సంబోధించుటంబట్టి శిష్యునకు గురువునం దుండదగిన భావవిశేషము శ్రుతిచే నుపదేశింపబడుచున్నది. తండ్రి యనుభావముగాని సాధారణవిద్యలను బోధించు నుపాధ్యాయు డనుభావముగాని లేక యాభృగువు వరుణుని వరుణనామముతో సంబోధించక "హేభగవః" అని సంబోధించుటచే గురువునందు భగవద్భావము శిష్యునకుండవలసినట్లు శ్రుతితాత్పర్యము.

శ్రు॥ తస్మై ఏతత్ప్రోవాచ- అన్నం ప్రాణం చక్షుః శ్రోత్రం మనో వాచ మితి.

తా॥ ఇట్లు యథావిధిగా నుపసదన మొనర్చినయోగ్యశిష్యు డగు భృగువున కావరుణు డిట్లుపదేశించెను. అన్న మనగా శరీరమును దానికి లోపల అనుభవకర్తగా నుండుప్రాణమును ఉపలబ్ధిసాధనము లగుచక్షుశ్శ్రోత్రమనోవాక్కు లనుద్వారములును పుష్కలముగా

విమర్శించుచో బ్రహ్మబోధ కల్గును. అనగా అన్నాదిద్వారముగా ఈబ్రహ్మమును ఈలక్షణముతో విమర్శించి తెలిసికొనుము. అన్నమున కేఅదనసామర్థ్యము గలదో ప్రాణమున కేప్రాణనసామర్థ్యము గలదో చక్షురాదుల కేరూపగ్రహణాదిసామర్థ్యములు గలవో అట్టి వస్తువును బ్రహ్మలక్షణసమన్వయముతో విచారణాపూర్వకముగా పరిశీలింపుము. ఆపైని నీకు నేను చెప్పగల్గ ప్రమేయ మవగత మగుటకు తగుయోగ్యత నీకు కలుగగలదు అని తాత్పర్యము.

శ్రు॥ తగ్ంహోవాచ యతో వా ఇమాని భూతాని జాయంతే; యేన జాతాని జీవంతి; య త్ప్రయం త్యభిసంవిశంతి; త ద్విజిజ్ఞాసస్వ; త ద్బ్రహ్మేతి.

తా॥ పై విమర్శన కనువగుబ్రహ్మలక్షణము నిట్లు చెప్పదొడంగెను. ఈచరాచరప్రపంచమందలి సర్వజీవులు నెట్టికారణవస్తువునుండి పుట్టుచున్నవో, జీవు లన్నియు నేకారణవస్తువుచే జీవించుచున్నవో, ఈజీవు లన్నియు నేకారణవస్తువునందు లయ మొందుచున్నవో, అట్టి కారణవస్తువే బ్రహ్మమని తెలిసికొనుము. అని— అంతట భృగువు పూర్వోపదిష్టమగు అన్నప్రాణ, చక్షుశ్శ్రోత్ర, మనోవాక్కులద్వారా ఈబ్రహ్మలక్షణ మెద్దానియందు సమన్వయ మగునో విచారింప దొడంగెను.

శ్రు॥ స తపోఽతప్యత, స తప స్తప్త్వా, అన్నం బ్రహ్మేతి వ్యజానాత్. అన్నా ద్ధ్యేవఖ ల్విమాని భూతాని జాయంతే; అన్నేన జాతాని జీవంతి; అన్నం ప్రయం త్యభిసంవిశం తీతి.

తా॥ ఈవిచారణయే తప స్సనబడును. అట్టి తపంబొనర్చి అన్నమే బ్రహ్మమని మొదట నూహించెను. ఎట్లనగా ఈభూతము లన్నియు అన్నమువలననే అనగా అన్నపరిణామ మగుశుక్లశోణిత ములవలననే జన్మించుట, ఈ అన్నముచేతనే జీవించుట, మరణానంతర మీయన్నకారణ మగుపృథివియందు లయమగుట లోకసిద్ధముగాన

భూతములజన్మస్థితిలయములకారణ మనులక్షణ మిచట పట్టుటచే ఈ యన్నమే బ్రహ్మమగును. అని-కాని, వాని కొక సంశయ ముదయిం చెను. ఏమనగా ఈఅన్నముగూడ ఓషధులందును, అయ్యవి పృథివీ జలాదికారణములచేతను పుట్టుచుండుటచే నియ్యది స్వతంత్రకారణ మెట్లగును? ఈ అన్నమే బ్రహ్మమగుచో గురూపదేశమం దన్న మొక్కటియేగాక ప్రాణచక్షుశ్శ్రోత్రమనోవాక్కు లేల చెప్పబడినవి? అనుసీసందేహములను నివారించుకొనుట కాతడు

శ్రు॥ త ద్విజ్ఞాయ పున రేవ వరుణం పితర ముపససార; అధీహి భగవో బ్రహ్మేతి. తగ్ం హోవాచ. తపసా బ్రహ్మ విజిజ్ఞా సస్వ. తపో బ్రహ్మేతి.

తా॥ తిరిగి తండ్రియగువరుణుని సమీపించి యాతని భగవ ద్విశిష్టతో సంబోధించి బ్రహ్మము నుపదేశింపుమని ప్రార్థించెను. అం తట నావరుణు డీతనివిచారణకు సంతసించి తిరిగి అట్టివిచారణనే కొనసాగించి బ్రహ్మమును తెలిసికొమ్మనియు, చక్షురాది బహిరింద్రి యములయొక్క అంతఃకరణముయొక్క ఏకాగ్రతయే తప స్సనబడు ననియు, అదియే ఉత్తమసాధనమనియు, హితబోధ నొసగెను. తపస్సనగా మతియొక రీట్లుచెప్పిరి.

కోఽహం, ముక్తిః కథం, కేన సంసారం ప్రతిపన్నవాన్ ?
ఇత్యాలోచన మర్థజ్ఞా స్తప శ్శంసంతి పండితాః.

తా॥ నే నెవడను? నాకు జననమరణప్రవాహరూప మగు సంసారబంధ మెట్లు తొలగిపోవును? ఎందుచేత నా కీ సంసారబంధము వచ్చినది? ఇత్యాదివిషయముల నాలోచించుటయే తపస్సనబడునని పండితులు పల్కుచున్నారు.

శ్రు॥ స తపోఽతప్యత. స తప స్తప్త్వా; ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్. ప్రాణా ద్ధ్యేవఖ ల్విమాని భూతాని జాయంతే; ప్రాణేన జాతాని జీవంతి; ప్రాణం ప్రయం త్యభిసంవిశం తీతి.

తా॥ ఆభృగు వట్లు తపమాచరించి ప్రాణశక్తివలననే యీ జీవులందరు పుట్టుచుండుటచేతను జీవించుటచేతను ప్రాణమందు లయమొందుటచేతను ప్రాణమే బ్రహ్మమని తెలిసికొనెను

శ్రు॥ తద్విజ్ఞాయ, పునరేవ వరుణం పితర ముపససార; అధీహి భగవో బ్రహ్మేతి. తగ్ం హోవాచ తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ, తపో బ్రహ్మేతి.

తా॥ కాని యాభృగువున కీప్రాణముగూడ మనస్సు కారణముగా గల్గినదగుటచే కార్యమే యగుచున్న దనుసందేహము తోచి తిరిగి వరుణుని సమీపించి బ్రహ్మము నుపదేశింపుమని ప్రార్థింప నాతడు తిరిగి తపమాచరింపు మనియు, నదియే సాధనోత్తమ మనియు బోధించె.

శ్రు॥ స తపోఽతప్యత. స తప స్తప్త్వా; మనో బ్రహ్మేతి వ్యజానాత్. మనసో హ్యేవఖ ల్విమాని భూతాని జాయంతే, మనసా జాతాని జీవంతి; మనః ప్రయం త్యభిసంవిశం తీతి.

తా॥ ఆభృగువు తిరిగి తపమాచరించి మనస్సంకల్ప మను మూలకారణముచేతనే ఈ జీవులందరు పుట్టుచుండుటచేతను ఆమనో వృత్తులచేతనే జీవించుటచేతను ఆమనస్సునందే లయించుటచేతను మనస్సే బ్రహ్మమని గ్రహించెను.

శ్రు॥ తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితర ముపససార; అధీహి భగవో బ్రహ్మేతి. తగ్ం హోవాచ తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ, తపో బ్రహ్మేతి.

తా॥ కాని సుషుప్తికాలమం దీమనస్సు లేకుండుటచేతను అదియు జడమగుటచేతను కారణవస్తు వెట్లగు ననుసందేహ మాభృగువునకు తోచి తిరిగి గురువును సమీపించి బ్రహ్మము నుపదేశింపు మని ప్రార్థింప నాతడు తిరిగి తప మాచరింపుమనియు తపస్సే తత్సాధన మనియు బోధించెను.

శ్రు॥ స తపోఽతప్యత. స తప స్తప్త్వా, విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్. విజ్ఞానా ద్ధ్యేవఖ ల్విమాని భూతాని జాయంతే; విజ్ఞానేన జాతాని జీవంతి; విజ్ఞానం ప్రయం త్యభిసంవిశం తీతి.

తా॥ భృగు వట్లు తపంబొనర్చి, ఈ జీవులందరును విజ్ఞాన మను మూలకారణమువలననే పుట్టుటచేతను, జీవించుటచేతను, విజ్ఞానమందు లయ మొందుటచేతను విజ్ఞానమే బ్రహ్మమని తెలిసికొనెను

శ్రు॥ త ద్విజ్ఞాయ, పునరేవ వరుణం పితర ముపససార; అధీహి భగవో బ్రహ్మేతి. తగ్ం హోవాచ. తపసా బ్రహ్మ విజిజ్ఞా సస్వ, తపో బ్ర

తా॥ కాని యాతనికి సుషుప్తియం దీవిజ్ఞానముగూడ లేకుండు టచే నిది కారణవస్తు వెటగునని సందేహము తోచి తిరిగి గురూప సదనమొనర్చి బ్రహ్మోపదేశమును గోర నావరుణుడు వెనుకటివలెనే తప మొనర్చుమని నుడివెను.

శ్రు॥ స తపోఽతప్యత. స తప స్తప్త్వా; ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్. ఆనందా ద్ధ్యేవఖ ల్విమాని భూతాని జాయంతే; ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయం త్యభిసంవిశం తీతి.

తా॥ భృగు వట్లు తపంబొనర్చి ఆనందమే ఈజీవుల యుత్పత్తికి, స్థితికి, లయమునకు కారణమని తెలిసికొనెను. జాగ్రత్స్వప్నసుషుప్త్తు లం దీయానంద మేకరీతిగా ననుగతమగుచు సర్వకాలములందును నశింపక సత్యమై జ్ఞానరూపమై సర్వవ్యాపకమై యున్నట్లు పుష్కల ముగా గ్రహించెను.

శ్రు॥ సైషా భార్గవీ వారుణీ విద్యా పరమే వ్యోమ న్ప్రతిష్ఠితా. య ఏవం వేద ప్రతితిష్ఠతి. అన్నవా నన్నాదో భవతి, మహా న్భవతి ప్రజయా పశుభి ర్బ్రహ్మవర్చసేన, మహా న్కీర్త్యా.

తా॥ ఈ పర్యాయ మీభృగువున కెట్టిసందేహము లేక నిశ్చయ జ్ఞానము గలిగెను. ఇదియే వరుణునిచే నుపదేశింపబడి భృగువుచే

గ్రహింపబడిన బ్రహ్మవిద్య. సర్వోత్కృష్టమగుచు హృదయాకాశ గుహాయం దానందరూపమగు అద్వితీయసచ్చిదానందబ్రహ్మమందు పరిసమాప్తమైనది. ఇట్లు అన్నమయాదిగా తపస్సాధనములవలన ఈ సచ్చిదానందపరబ్రహ్మమును గ్రహించినవాడు అన్నము గల్గియుండుట, దీప్తాగ్నితో నన్నమును తినుట, ప్రజా పశు బ్రహ్మవర్చసాదులు గల్గియుండుట మొదలగులౌకికఫలములను బొందుటయేగాక బ్రహ్మభావమునే పొందును. ఇట్టీ తైత్తిరీయశ్రుతి సర్వోపనిషత్సారభూతమై వేదాంతవాక్యముల కర్థనిర్ణాయక మగుబ్రహ్మమీమాంసా శాస్త్రమందు (1) అథాతో బ్రహ్మజిజ్ఞాసా, (2) జన్మాద్యస్య యతః, (3) శాస్త్రయోనిత్వాత్- అను ప్రారంభసూత్రములకు మూలాధారమై యలరారుచున్నది. మిగిలినసూత్రజాల మంతయు నీ ప్రారంభసూత్రములకు వ్యాఖ్యానరూపమే యగుచున్నది.

గీత॥ ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః.

తా॥ బ్రహ్మవిద్య అనేకఋషులచే పృథక్కులముగా నుపదేశింపబడియున్నది. వేరువేరు వేదశాఖలలో వేరువేరు రీతులతో నొక్కే సిద్ధాంతము ప్రతిపాదింపబడినది. ఆసిద్ధాంతమే యుక్తియుక్తముగా మనకు మననమొనర్చుట కనువగు హేతువులతో విచారణాపురస్సరముగా బ్రహ్మసూత్రములందు వివరింపబడినది. ఇట్లు శ్రుతిప్రస్థానము, సూత్రప్రస్థానము, ఆర్ష లేక గీతాప్రస్థానము లనెడి ప్రస్థానత్రియముచే నొక్కేసిద్ధాంత ముపదేశింపబడినది.

ఉదాహరణమునకు తైత్తిరీయశ్రుతిలోనియర్థమే బ్రహ్మసూత్రములందు మొదటిమూడుసూత్రములచే ప్రతిపాదింపబడినట్లు చెప్పబడెనుగదా. కాన గీతాప్రస్థానమునుండిగూడ ఉదాహరింపబడుచున్నది.

గీత॥ అవినాశి తు త ద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి.

తా॥ ఈ బ్రిహ్మాండ మంతయు ఏసద్వస్తువుచే వ్యాప్తమై యున్నదో ఆసద్వస్తువు సర్వదేశ సర్వకాల సర్వావస్థలందును నశిం పక సత్యమై యుండునదని తెలిసికొనుము. జడ మగువస్తువు సత్య మగుటకు వీలులేదు కాన ఈవస్తువు చైతన్యరూపము లేక జ్ఞాన రూపము దుఃఖకర మగువస్తువు చైతన్యాత్మకముగాని, సత్యముగాని, సర్వవ్యాపకముగాని యగుటకు వీలులేనందున ఈవస్తువు ఆనంద రూపము. ఇట్టి ఈ సద్వస్తువును ఎవరును ఏ దేశకాలములందును గూడ నాశమును పొందింపలేరు.

గీత॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః.

తా॥ నిజముగా లేనివస్తువగు రజ్జుసర్పమునకు స్థితి లేదు; అనగా నిజమగు ఉనికి లేదు. నిజముగానున్నట్టి రజ్జువునకు ఏ కాలమందును అభావము లేదు. అనగా లేకపోవుట లేదు. రజ్జువును జూచి సర్పమను భ్రాంతిజెందినవానికి ఆ భ్రాంతికాలమందు మాత్రమే సర్పమున్నట్లు భాసించెనుగాని నిజముగా నచటనున్నది రజ్జువేగాని సర్ప మెంత మాత్రము గానట్లు దేహేంద్రియసంఘాతము సర్పమువంటిదియు ఆత్మ రజ్జువువంటిదియు అగుటచే తత్త్వవేత్తలగువారు ఈ దేహాదిజగత్తును అనృతజడదుఃఖపరిచ్ఛిన్నధర్మములు గల దగుటచే భ్రాంతికాలమందు మాత్రమే భాసించుసర్పమువంటి దానినిగాను; సత్య, జ్ఞాన, ఆనంద, అనంతాత్మకమగుటచే నాత్మ రజ్జువువలె సర్వకాలసర్వావస్థలందును ఉండుదానినిగాను; ఇట్లీ దేహాత్మలను రెంటిని వేరుజేసి వ్యవహరింతురు.

శ్రు॥ సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ.

తా॥ ఆత్మయొక్క నిజరూపము సత్యమనగా సర్వదేశకాలా వస్థలందును ఏకరీతిగాను సత్యముగాను ఉండునది. సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమైనది. చైతన్యమే రూపముగాగలది సర్వవ్యాపకమైన దగుటచే అన్నిటికంటెను గొప్పది పరమానందరూపమైనది.

శ్రు॥ యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్ సోఽ
శ్నుతే సర్వా న్కామా న్సహ బ్రహ్మణా విపశ్చితేతి.

తా॥ ఎవడు సర్వోత్కృష్టమగు నీ బ్రహ్మమును తనదేహేంద్రియ సంఘాతమునకు అంతరమైనదానినిగాను కారణమైనదానినిగాను గుర్తించునో వాడు సర్వకామములను పొందుటయేగాక బ్రహ్మభావమునే పొందును. అనగా సర్వబ్రహ్మండము వ్యాపించిన సర్వజీవ ఆత్మ భావమును పొందును.

శ్రు॥ బ్రహ్మవి దాప్నోతి పరమ్.

తా॥ బ్రహ్మవేత్త సర్వాత్మభావము నొందును. అనగా తానే జగత్తునంతను వ్యాపించియున్న బ్రహ్మమగును. ఇదియే మోక్షమనబడును. యజుర్వేద మీవాక్యముచే బోధించినట్టి యర్థవిశేషమునే ఋగ్వేదముగూడ బోధించియున్నట్లు దార్ఢ్యముకొరకు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్ సోశ్నుతే సర్వాన్కామా న్సహ బ్రహ్మణా విపశ్చితేతి" యను వాక్యము లుదాహృతములు.

శ్రు॥ తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః. ఆకాశా
ద్వాయుః. వాయో రగ్నిః. అగ్నే రాపః. అద్భ్యః పృథివీ.
పృథివ్యా ఓషధయః. ఓషధీభ్యోఽన్నం. అన్నా త్పురుషః.
సవా ఏష పురుషోఽన్నరసమయః.

తా॥ అట్టి ఈ ఆత్మవలన ఆకాశమును, ఆకాశమువలన వాయువును, దానినుండి అగ్నియు, దానినుండి ఉదకమును, దానినుండి పృథివియు, దానినుండి ఓషధులును, వానినుండి అన్నమును వరుసగా ఏర్పడినవి. ఆ అన్నరసవికారమే ఈ పురుషుడు గాన ఈపురుషునికి కారణము ఓషధీ, పృథివీ, జల, అగ్ని, వాయు, ఆకాశాదద్వారా బ్రహ్మమే యగుచున్నది.

## —♦ కఠోపనిషత్తు ♦—

నచికేతునకు యముడిట్లుపదేశించుచున్నాడు.

(1) శ్రు॥ అన్య చ్ఛ్రేయోఽన్య దుతైవ ప్రేయ
స్తే ఉభే నానార్థే పురుషగ్ం సినీతః
తయో శ్శ్రేయ ఆదదానస్య సాధు
భవతి హీయతేఽర్థా ద్య ఉ ప్రేయో వృణీతే.

తా॥ నిశ్శ్రేయసము, మోక్షము వేరయినట్లు ప్రేయస్సు అభ్యుదయమును వేరయినవి. ఆశ్రేయఃప్రేయస్సులు రెండును భిన్న భిన్నప్రయోజనములు గలవియగుచు వర్ణాశ్రమవిశిష్టుడు నధికారియు నగుపురుషుని బంధించుచున్నవి. ఆశ్రేయఃప్రేయస్సు లను రెంటిలో శ్రేయస్సును గ్రహించునట్టివానికి శుభము కల్గుచున్నది. ఎవ్వడు ప్రేయస్సును వరించునో వాడు పరమపురుషార్థమునుండి విడువబడు చున్నాడు. వానికి మోక్షము లేదు.

(2) శ్రు॥ శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేత
స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః
శ్రేయోహి ధీరోఽభిప్రేయసో వృణీతే
ప్రేయో మందో యోగక్షేమా ద్వృణీతే.

తా॥ శ్రేయస్సు ప్రేయస్సు మనుష్యుని పొందుచున్నవి. విద్వాంసుడగువాడాశ్రేయఃప్రేయస్సులను మనసుచేత బాగుగా విచారించి యెయ్యది శ్రేష్ఠమో యెయ్యది నికృష్టమో అని విభజించి ధీరుడగువాడు ప్రేయస్సుకంటె శ్రేయస్సునే వరించుచున్నాడు. అల్ప బుద్ధి గలవాడు దేహసంరక్షణార్థము పశుపుత్రాదిలక్షణ మగు సంపత్తుకొరకు ప్రేయస్సునే వరించుచున్నాడు.

(3) శ్రు॥ స త్వం ప్రియా న్ప్రియరూపాంశ్చ కామా
నభిధ్యాయ న్నచికేతోఽత్యస్రాక్షీః

నైతాగ్ం సృంకాం విత్తమయీ మవాప్తో
యస్యాం మజ్జంతి బహవో మనుష్యాః.

తా॥ ఓ నచికేతూ ! నీవు ఆ ప్రియులగు పుత్రాదులను మనోహరరూపిణు లగుఅప్సరసలు తద్భోగములు మొదలగుకామములను బాగుగా ఆలోచించుకొన్నవాడవై యీఅప్సరసలు మొదలగు భోగజాత మనిత్యమని వివేకముచేత గ్రహించినవాడవై వదలినాడవు. అనేక లఘుమూఢులు ఏసంసారమునందు మునిగిమునిగిపోవుచున్నారో అట్టి ధనప్రాయమయిన యీసంసారరూప మగుకుత్సితమార్గమును నీవు పొందకపోతివి.

(4) శ్రు॥ దూర మేతే విపరీతే విషూచీ
అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా
విద్యాభీప్సినం నచికేతసం మన్యే
న త్వా కామా బహవోఽలోలుపంత.

తా॥ అవిద్యయనియు, విద్యయనియు తెలిసికొనబడుచున్న యీరెండును దూరముగా వేరువేరయినవియు విభిన్నప్రయోజనము గలవియు నగుచున్నవి. నచికేతసుడని పిలువబడుచున్ననిన్ను విద్యను కోరుచున్నవానినిగా నేను తలంచుచున్నాను. కావున నిన్ను అనేకములగుకోరికలు లోభమును కలుగజేయజాలకపోయెను.

(5) శ్రు॥ అవిద్యాయా మంతరే వర్తమానాః
స్వయం ధీరాః పండితంమన్యమానాః
దంద్రమ్యమాణాః పరియన్తి మూఢాః
అంధేనైవ నీయమానా యథాంధాః

తా॥ సంసారమధ్యమునం దున్నవారై తామే బుద్ధిమంతులమనియు శాస్త్రజ్ఞులమనియు తలంచుచున్నవారై అనేకరూపకుటిలగతులను పొందుచున్నమూఢులు గ్రుడ్డివానిచే తీసికొనిపోబడుచున్న గ్రుడ్డివారివలె దుఃఖితులయి అంతట తిరుగుచున్నారు.

(6) శ్రు॥ న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యంతం విత్తమోహేన మూఢమ్
అయం లోకో నాస్తి పర ఇతి మానీ
పునఃపున ర్వశ మాపద్యతే మే.

తా॥ పరలోకగమనసాధనవిశేషము పుత్రపశ్వాదిప్రయోజనాసక్తిచే ప్రమాదమును పొందుచు ధనమోహముచేతను అజ్ఞానముచేతను కప్పబడియున్నవివేకహీనునిగూర్చి ప్రకాశింపదు. వివేకరహితునకు పరలోకవిషయమును స్ఫురింపదు. ఈకనబడుచున్న స్త్ర్యన్నపానాదివిశిష్టమగునదియే ప్రాప్తవ్యమనియు పరలోక మనునది లేదనియు ఈవిధముగా తలంచువాడు మాటిమాటికి నా అధీనమగుచున్నాడు- అనగా చచ్చుచు పుట్టుచుండును-

(7) శ్రు॥ శ్రవణాయాపి బహుభి ర్యో న లభ్యః
శృణ్వంతోపి బహవో యం న విద్యుః
ఆశ్చర్యో వక్తా కుశలోస్య లబ్ధా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః.

తా॥ ఆయాత్మ అనేకులకు శ్రవణముచే పొందబడుట లేదు. ఆయాత్మ ననేకులు వినుచున్నను తెలిసికొనజాలరు. ఆత్మతత్త్వమును చెప్పునట్టివా డరుదు. ఈఆత్మలక్షణమును నిపుణముగా గ్రహించువాడును అరుదు. నిపుణుడైన ఆచార్యునిచేత శిక్షితుడైనజ్ఞాతయు అరుదు.

(8) శ్రు॥ న నరే ణావరేణ ప్రోక్త ఏష
సువిజ్ఞేయో బహుధా చింత్యమానః
అనన్యప్రోక్తే గతి రత్ర నాస్తి
అణీయా న్హ్యతర్క్య మణుప్రమాణాత్.

తా॥ ఈయాత్మతత్త్వము హీనుడైనమనుష్యునిచేత చెప్పబడి అనేకవిధములుగా చింతింపబడుచు సుఖముగా తెలిసికొనగాకుండును.

ఆత్మసాక్షాత్కారముగల ఆచార్యునిచేత చెప్పబడినయెడలనే ఆత్మ యందస్తినాస్తిత్యాదిక మగువికల్పరూప గతి లేకుండును. కావున సువిజ్ఞేయము. మరియు ఆత్మ అణుప్రకంటె నణుతరుడు కావున స్వబుద్ధి నూహించుట కలవికాదు. కనుక సద్గురుపుద్వారా పొందదగినది.

(9) శ్రు॥ నైషా తర్కేణ మతి రాపనేయా
ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ
యాం త్వ మాప స్సత్యధృతి ర్బతాసి
త్వాదృఙ్నో భూయా న్నచికేతః ప్రష్టా.

తా॥ ఆత్మ యీబుద్ధి అనగా ఆత్మ ఆగమప్రతిపాద్యుడను బుద్ధి యొక్క తర్కముచేతను స్వబుద్ధిచేతను ఊహించుటమాత్రముచే పొందింపశక్యముగాదు- మరియు ఆత్మ ఆగమప్రతిపాద్యుడనుదృఢ స్వబుద్ధ్యధీనతర్కముచేత తీసివేయుతగినదియు కాదు- ప్రియుడవైన ఓనచికేతుడా! తార్కికాదులకంటె అన్యుడయినయాగమజ్ఞుడగు నాచార్యునిచే చెప్పబడినదే సుజ్ఞానముకొరకగుచున్నది. నీవట్టిబుద్ధిని పొందితివిగనుక నీవు సత్యమయినధృతి గలవాడవయితివి. ఆశ్చర్యము ఓనచికేతుడా! నీవంటి శిష్యుడు పృచ్ఛకుడు మాకు కలుగుగాక-

(10) శ్రు॥ జానా మ్యహగ్ం శేవధి రిత్యనిత్యం
నహ్యధ్రువైః ప్రాప్యతేహి ధ్రువం తత్
తతో మయా నచికేత శ్చితోగ్ని
రనిత్యై ర్ద్రవ్యైః ప్రాప్తవా నస్మి నిత్యమ్.

తా॥ ఓనచికేతుడా! కర్మఫలలక్షణ మగునిధి శాశ్వతమైనది కాదని నే నెరుంగుదును. అనిత్యములయినవానిచే ఆత్మతత్త్వము పొందబడజాలదు. ఆయాత్మతత్త్వము శాశ్వతమయినది. నే నగ్ని చయనము చేసి అనిత్యములయిన ద్రవ్యములచేత నిత్యమయినదానిని పొందితిని. ఈయామ్యపదవియు ననిత్యమయినను నిత్యమని చెప్పుట ఆపేక్షికనిత్యమేగాని నిరపేక్షికనిత్యము కాదు. అనిత్యసాధనములచేత

నిత్య మగుబ్రహ్మము లభింపజాలదని యెరిగియు నేను కర్మనార్చితిని; గనుక నాకంటె నీవే అధికప్రజ్ఞ గలవాడవని యముడు నచికేతుని ప్రశంసించెను.

(11) శ్రు॥ కామ స్యాప్తిం జగతః ప్రతిష్ఠాం
క్రతో రానన్త్య మభయస్య పారమ్
స్తోమ మహ దురుగాయం ప్రతిష్ఠాం
దృష్ట్వా ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః.

తా॥ ఓనచికేతుడా! కామముయొక్క సమాప్తిని జగత్తుయొక్క ప్రతిష్ఠను సత్కర్మాచరణముయొక్క ఫలరూపమగు నన న్తమైనహిరణ్యగర్భపదవిని అభయ మగుదానియొక్క పరమమయిన నిష్ఠను కొనియాడదగినఅణిమాద్యష్టైశ్వర్యమహిమను విస్తీర్ణమయిన గతిని ప్రతిష్ఠను ధీరుడవయిననీవు చూచి ధైర్యముచే వదలినాడవు.

(12) శ్రు॥ తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం
గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్
అధ్యాత్మయోగాధిగమేన దేవం
మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి.

తా॥ ఆపరమాత్మ అతిసూక్ష్ముడైనవాడగుటచేత చూచుటకు శక్యముకానివాడును గూఢమైనదానిని ప్రవేశించినవాడును ప్రాణుల యొక్క బుద్ధిగుహయందున్నవాడును అతికష్టమయినప్రదేశమునందున్నవాడును పురాతనుడయిన దేవుని అధ్యాత్మయోగప్రాప్తిచేత ధీరుడయినవాడుతలంచి గ్రహించి హర్షశోకములను వదలుచున్నాడు.

(13) శ్రు॥ ఏత చ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః
ప్రవృహ్య ధర్మ్య మణు మేత మాప్య
స మోదతే మోదనీయం హి లబ్ధ్వా
వివృతగ్ం సద్మ నచికేతసం మన్యే.

తా॥ మనుష్యు డీచెప్పబోవు ఆత్మతత్త్వమును విని ఆత్మ భావముతో బాగుగా పరిగ్రహించి ధర్మసంబంధమైనదీనిని శరీరాదిక మునుండి వేరుపరచి అతిసూక్ష్మమైనదీనిని పొంది విద్వాంసుడై సంత సించుచున్నాడు. నచికేతునిగూర్చి బ్రహ్మలోకము తెరచియుంచబడి నదిగా నేను తలంచుచున్నాను అనగా నచికేతుడు మోక్షార్హుడని తాత్పర్యము. నచికేతు డిట్లు పలుకుచున్నాడు.

(14) శ్రు॥ అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మా
దన్య త్రాస్మా త్కృతాకృతాత్
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ
య త్తత్పశ్యసి తద్వద,

తా॥ శాస్త్రవిహిత మైనధర్మముకంటె వేరయినచోట అధ ర్మముకంటె వేరైనచోట కార్యకారణభూత మయినదీనికంటె వేర యినచోట జరిగినదానికంటె వర్తమాన మైనదానికంటెను వేరైన చోట అపరిచ్ఛిన్నమైన దెయ్యదిగలదో సర్వవ్యవహారగోచరము గాక అతీత మైనదానిని నీ వెఱింగియున్నావు. కావున అట్టిదానిని నాకు బోధింపుమని ప్రార్థించెను. యముడు నచికేతువున కట్టివస్తువును సవిశేషముగ నిట్లు చెప్పుచున్నాడు.

(15) శ్రు॥ సర్వే వేదా య త్పద మామనన్తి
తపాంసి సర్వాణి చ య ద్వదంతి
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి
త త్తే పదం సంగ్రహేణ బ్రవీ మ్యో మిత్యేతత్.

తా॥ వేదములన్నియు నేవస్తువును పొందదగినదానినిగ ఏక గ్రీవముగా పలుకుచున్నవో తపస్సులన్నియు దేనిని చెప్పుచున్నవో ఏవస్తువును కోరుచు గురుకులవాసముతో బ్రహ్మచర్యమును చేయుచున్నారో ఆవస్తువును నీకు సంగ్రహముగ చెప్పుచున్నాను. నీ వెరుంగదగిన యీవస్తువు ఓమ్ అని గ్రహింపుము.

(16) శ్రు॥ ఏత ద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏత ద్ధ్యేవాక్షరం పరమ్
ఏత ద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్.

తా॥ ఈయక్షరమే యాబ్రహ్మము. ఈయక్షరమే యాపర బ్రహ్మ . ఈ అక్షరప్రణవమునే యెవ్వడు బ్రహ్మమని యెరింగి ఉపాసిం నో యెవ్వడు దేనిని కోరుచున్నాడో వాని కయ్యది సిద్ధించును.

(17) శ్రు॥ ఏత దాలంబనగ్ం శ్రేష్ఠ మేత దాలంబనం పరమ్
ఏత దాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే.

తా॥ ఈ యోంకారరూపము బ్రహ్మప్రాప్తిసాధనభూతా లంబనములన్నిటిలో శ్రేష్ఠమయినది. ఇదియే పరాపరబ్రహ్మసంబంధ మైనది, దీని నెరింగినవాడు బ్రహ్మలోకమునందు పూజ్యు డగుచున్నాడు. పరబ్రహ్మమునందును అపరబ్రహ్మమునందును బ్రహ్మము వలెనే ఉపాస్యు డగుచున్నాడు. ఇక్కడ బ్రహ్మమే లోకము కావున బ్రహ్మలోక మని గ్రహించునది. బ్రహ్మైవలోకః బ్రహ్మలోకః.

(18) శ్రు॥ న జాయతే మ్రియతే వా విపశ్చి
న్నాయం కుతశ్చి న్న బభూవ కశ్చిత్
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.

తా॥ సర్వజ్ఞ మగునీయాత్మ పుట్టుట లేదు, చచ్చుటయు లేదు. మరియొకనివలన మరియొకకారణమువలన కాలేదు. ఒక్కటియు కాలేదు. ఆత్మ పుట్టుక లేనిది. నిత్య మయినది. అపక్షయవిరహిత మైనది. పురాణ మైనది. దేహము శస్త్రాదికముచేత కొట్టబడు చున్నప్పటికిని నరకబడుచున్నప్పటికిని నీఆత్మ చంపబడదు.

(19) శ్రు॥ హంతా చే న్మన్యతే హంతుగ్ం హత శ్చే న్మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయగ్ం హంతి న హన్యతే.

తా॥ చంపునట్టివాడు చంపుటకు తలచినయెడల చంపబడిన వాడు చంపబడినవానినిగా తలంచినయెడల వా రిద్దరు తెలిసికొనిన

వారలు కారు. ఇతడు చంపుట లేదు, ఇతరునిచేత చంపబడుటయు లేదు.

(20) శ్రు॥ అణో రణీయా న్మహతో మహీయా
నాత్మాస్య జంతో ర్నిహితో గుహాయామ్
త మక్రతుః పశ్యతి వీతశోకో
ధాతుప్రసాదా న్మహిమాన మాత్మనః

తా॥ ఆత్మతత్త్వము సూక్ష్మపరిణామము గలవ్యోమాకాదికము కంటె మిక్కిలిసూక్ష్మమైనది. మహాపరిణామము గలపృథివ్యాదికము కంటె మిక్కిలిగొప్పదైనట్టి ఆత్మ యాబ్రహ్మాది స్తంబపర్యంత ప్రాణిజాతముయొక్క బుద్ధిగుహయం దుంచబడియున్నాడు. అట్టి యాత్మను దృష్టాదృష్ట బాహ్యవిషయోపరతబుద్ధిగలవాడు చూచుచున్నాడు, మనస్సు మున్నగునింద్రియసముదాయముయొక్క ప్రసన్నత్వమువలన ఆయాత్మయొక్క మాహాత్మ్యమును చూచుచున్నాడు. మరియు శోకరహితుడు నగుచున్నాడు. కర్మనిమిత్తమైనవృద్ధిక్షయ రహితమైనదానిని సాక్షాత్తుగా నెరుంగునని తాత్పర్యము. మరియు ఆత్మవిజ్ఞానమువలన శోకనాశమును కల్గుచున్నది.

(21) శ్రు॥ అశరీరగ్ం శరీరే ష్వనవస్థే ష్వవస్థితమ్
మహాంతం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి.

తా॥ బుద్ధిమంతు డాత్మను శరీరవిరహితునిగను అనిత్యములగు శరీరములం దున్నవానిగను గొప్పవానిగను సర్వవ్యాప్తిగలవానిగను తలంచి దుఃఖింపడు.

(22) శ్రు॥ నాయ మాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన
యమే వైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్.

తా॥ ఈఆత్మ అనేక వేదాధ్యయనముచేత పొందుటకు వీలయిన వాడు కాడు. గ్రంథార్థధారణాశక్తిరూప మగుమేధచేత పొందుటకు వీలయినవాడు కాడు, కేవలము విశేషపాండిత్యముచేత పొందదగిన వాడు కాడు. సాధకు డేయాత్మను వరించుచున్నాడో వానిచేత పొందదగినవాడు. ఆత్మకాము డగునట్టివాని కీయాత్మ పారమార్థిక మగుతననిజస్వరూపమున ప్రకాశించుచున్నదని తెలిసి ప్రకాశింప జేయుచున్నాడు.

(23) శ్రు॥ నావిరతో దుశ్చరితా న్నాశాంతో నా సమాహితః
నాశాన్తమనసో వాపి ప్రజ్ఞానే నైన మాప్నుయాత్.

తా॥ శ్రుతిస్మృత్యవిహితమైన పాపకర్మమునుండి విరమింపనివా డీయాత్మను పొందజాలడు. ఇంద్రియచాపల్యముగలవాడును నీఆత్మను పొందజాలడు. ఏకాగ్రచిత్తము లేనివాడును విక్షిప్తమనస్కుడును నీయాత్మను పొందజాలడు, బహువిషయములందు వ్యాప్తమయిన మనస్సు గలవాడును నీయాత్మను పొందజాలడు. బ్రహ్మవిజ్ఞానము చేతనే యీఆత్మను పొందును.

ఋతం పిబంతౌ సుకృతస్య లోకే
గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధ్యే
ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి
పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః

తా॥ ఎవ్వరు ణాచికేతులో పంచాగ్నులో అట్టిబ్రహ్మ వేత్తలు స్వయంకృత మగుకర్మయొక్క ప్రారబ్ధఫలము ననుభవించు చున్నవారలయి శరీరమునందుగల శ్రేష్ఠమయినబ్రహ్మస్థాన మగుబుద్ధి గుహను ప్రవేశించియున్నజీవాత్మ పరమాత్మలను నీడ యెండలవలె పరస్పరవిలక్షణధర్మము గలవారినిగా బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు.

యస్తు విజ్ఞానవా న్భవతి సమనస్క స్సదా శుచిః
సతు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో న జాయతే.

తా॥ ఎవ్వడు జ్ఞానము గలవాడును యుక్తమయినమనస్సు గలవాడును ఎల్లప్పుడు పవిత్రుడును అగుచున్నాడో అట్టివాడు పొంద బడిన యేస్థానమునుండి మరల పుట్టజాలడో ఆస్థానమును పొందు చున్నాడు.

విజ్ఞానసారథి ర్యస్తు మనఃప్రగ్రహవా న్నరః
సోధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్.

తా॥ ఏమనుష్యుడు వివేకయుత మైనబుద్ధియే సారథిగా గల్గి మన స్సనుప్రగ్గము నంతర్ముఖమునకు లాగి అనగా స్వాధీనమయిన మనస్సు గలవాడగునో అట్టిమనుష్యుడు సంసారసాగరముయొక్క అవతలియొడ్డును చేరి వ్యాపనశీలు డగుపరమాత్మయొక్క శ్రేష్ఠ మయినపరబ్రహ్మమును పొందుచున్నాడు.

ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః
మనసశ్చ పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహా న్పరః

తా॥ శబ్దాదివిషయము లింద్రియములకంటె సూక్ష్మము లయి నవి. మనస్సు శబ్దాదివిషయములకంటె సూక్ష్మతరమైనది. సంకల్ప వికల్పలక్షణ మగుమనస్సుకంటె అధ్యవసాయాత్మక మగుబుద్ధి సూక్ష్మ తరమైనది. బుద్ధికంటె సర్వమహత్త్వ మగుహిరణ్యగర్భాఖ్యతత్వము సూక్ష్మతరమయినది. బుద్ధికంటె ఆత్మ సర్వప్రాణిబుద్ధులకు ప్రత్య గాత్మభూత మగుటచేత మహత్తరము. సర్వమహత్త్వముచు ప్రథమ జాతమును హిరణ్యగర్భనామకమును బోద్ధృబోధాత్మకమును అగు ఆత్మ బుద్ధికంటె పరతత్వమని గ్రహించునది.

మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః
పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః.

తా॥ మహత్త్వముకంటె అవ్యక్తము మహత్తరమైనది. ఆయ వ్యక్తముకంటె పురుషుడు మహత్తరుడు పురుషునికంటె మహత్తర మయినది కొంచెమైనను లేదు. అదియే అంతమైనది. అదియే శ్రేష్ఠ

మైనగతి. కావున సర్వవిధమయినగతి గలసంసారుల కీపురుషుడే పరాగతి.

గీత॥ యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ.
అని గీతావాక్య మీవిషయమునే బోధించుచున్నది.

శ్రు॥ ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః.

తా॥ ఈపురుషుడు సకలప్రాణులందు గూఢముగా నున్నవాడై ఆత్మగా ప్రకాశించుట లేదు. ఏకాగ్రత్వము కలిగి సూక్ష్మమై వస్తునిరూపణపరమైనబుద్ధితో సూక్ష్మమైనఆత్మవస్తువు చూచుటయందు సమర్థు లగుపండితులచేతనే చూడబడుచున్నాడు.

యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః
అథ మర్త్యోఽమృతో భవ త్యేతావ దనుశాసనమ్

తా॥ ఆత్మతత్త్వమును పయివిధమున తెలిసినపురుషున కిచట జీవించియుండగనే హృదయగ్రంథు లన్నియు నశించిపోవుచున్నవి. పిమ్మట మరణరహితు డగుచున్నాడు. ఇదియే సర్వవేదాంతముల యొక్క ఉపదేశము లేక ఆజ్ఞ.

## —♦ యజుర్వేదీయ మహానారాయణోపనిషత్ ♦—

శ్రు॥ అహం వృక్షస్య రేరివ. కీర్తిః పృష్ఠం గిరేరివ. ఊర్ధ్వపవిత్రో వాజినీవ స్వమృత మస్మి. ద్రవిణగ్ం సవర్చసం. సుమేధా అమృతోక్షితః. ఇతి త్రిశంకో ర్వేదానువచనమ్.

తా॥ నేను నీసమస్తజగత్తనెడి వృక్షమున కంతర్యామిని, ప్రేరకుడను, నాఖ్యాతి మేరుపర్వతశిఖరమువలె స్వర్గవ్యాపినియై వెలయుచున్నది. నేను పరమాత్మభూతుడను, పవిత్రుడను, సంసారాతీతమును విశుద్ధము నగుఆత్మతత్త్వరూపుడను. సర్వజీవులయొక్క అంతఃకరణవృత్తుల కన్నిటికిని సాక్షిభూతుడను. అమృత మనుజ్ఞానమే నా

నిజరూపము అని తలచునని సర్వవేదసారమును గ్రహించినట్టి త్రిశంకునివచనము. ఇంతేగాక.

శ్రు॥ అసన్నేవ స భవతి; అస ద్బ్రహ్మేతి వేదచేత్. అస్తి బ్రహ్మేతిచే ద్వేద; సంత మేనం తతో విదు రితి.

తా॥ ఎవడు బ్రహ్మమును లేనివస్తువుగా తెలిసికొనునో వాడే లేనివా డగుచున్నాడు. ఎవడు బ్రహ్మమును ఉన్నవస్తువుగా తెలిసికొనునో యనగా సమస్తదేహేంద్రియ వ్యాపారప్రవృత్తికి ప్రేరకమై సాక్షియై అంతర్యామిగా నుంకుననియు, సర్వవికల్పశూన్యమనియు తెలిసికొనునో వాడు సద్వస్తువే యగును. అట్టివాడు

చిదేవ దేహస్తు, చిదేవ లోకాః, చిదేవ భూతాని, చిదింద్రియాణి, కర్తా చి, దంతఃకరణం చిదేవ, చిదేవ సత్యం పరమార్థరూపమ్

తా॥ దేహమును అతలాదిలోకములను ఆకాశాదిభూతముల నన్నిటిని జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను అంతఃకరణమును వీని నన్నిటిని చిద్రూపముగానే భావించును. అనగా పైవాని కన్నిటికి నధిష్ఠానమగు చిదానందరూపమే సత్యమై యున్నది. రజ్జువును జూచి సర్పభ్రాంతి నొందినట్లు సర్వత్ర వ్యాపించియున్నను ఆత్మచైతన్యమును జూచి అవిద్యాగ్రస్తు డగువాడు దేహమని లోకములని ఇంద్రియములని అంతఃకరణమని ఇత్యాదిభ్రాంతిని పొందుచున్నాడు. విద్వాంసు డట్టిభ్రాంతి నొందక చిదానందమునే సర్వత్ర యున్నదానినిగా గ్రహించుచున్నాడు.

అట్టి అభిప్రాయవిశేషమును సంగ్రహముగా ప్రదర్శించుచు 8 సంవత్సరములవయస్సు గల బ్రాహ్మణబాలున కీయభిప్రాయము నుపదేశించి క్రమముగా వాని నుత్తమపురుషార్థము నొందున ట్లుపదేశించుచున్న దెద్దియో అదియే గాయత్రి యనబడును ఇది ఉపనయన కాలమందు బాలున కుపదేశింపబడి అటనుండి ప్రతిదినము త్రికాలము లందు వానిచే విధిగా ననుష్ఠానము చేయింపబడుచున్నది.

—◆ ప్రకట గాయత్రి ◆—

శ్రు॥ త త్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్.

తా॥ ఏ పరమేశ్వరుడు సర్వజీవులయందు నంతర్యామి రూపముగా నుండి సర్వేంద్రియబుద్ధివృత్తులను ప్రేరణజేయుచున్నాడో అట్టిసర్వజగత్కారణ మగు (సవిత) దేవునియొక్క శ్రేష్ఠ మగుతేజస్సును ధ్యానింతును. ఇదియే క్రమముగా నా బాలుడు వేదవేదాంగముల నర్థయుక్తముగా నభ్యసించి విజ్ఞానమును సంపాదించినమీదట అట్టిఅంతర్యామియే తాననెడిఅనుభవమును సంపాదించినపు డీమంత్రార్థ మగుధ్యానమే జీవబ్రహ్మైక్యజ్ఞాన మనబడును. అద్దానివిశేషములు గురుముఖైకవేద్యములు. ఇందు

త త్సవితు ర్వరేణ్యం-అను ఏడక్షరములు 7, భర్గో దేవస్య ధీమహి-అను ఎనిమిదక్షరములు 8, ధియో యో నః ప్రచోదయాత్-అను ఎనిమిదక్షరములు 8, కనుపించుచున్నవి. ఇందు చివర నున్న "యాత్" అనునది యొకేఅక్షరముగా పలుకవలెను.

పైసంఖ్యనుబట్టి 23 అక్షరములే మొత్తముమీద కనుపించుచున్నవి. దీనికి సంబంధించినశ్రుతి "చతుర్వింశత్యక్షరా త్రిపదా గాయత్రీ" యని 24 అక్షరములు కలదని మూడుపాదములు గలదని బోధించుచున్నది. మరియు బృహదారణ్యోపనిషత్తునందు "అష్టాక్షరం హ వా ఏకై కం గాయత్ర్యై పదం" అనుటచే గాయత్రీ మంత్రములోని ప్రతిపాదమందును, ఎనిమిదేసి అక్షరము లున్నట్లు తెలియుచున్నది. దానంజేసి మొదటిపాదమందు 8 అక్షరములున్నట్లు తెలియుచున్నది. ఇందు శ్రుతి "ణ్యా మితి ద్వే" యని బోధించుచున్నందున మొదటిపాదమందలి ణ్యం అను అక్షరమును అక్షరసంఖ్యాగణనసమయమందు అనగా లెక్కించునపుడు మాత్రము ణి+యం. - అని రెండక్షరములుగా గ్రహింపవలెను. ఇట్టివి వేదమందు మరికొన్నిదృష్టాంతములుగూడ గలవు. ఎట్లనగా "ఘృణి స్సూర్య ఆదిత్యోం" అను

వేదమంత్రమం దేడక్షరములే కనుపించుచున్నవి. ఇందు "ఘృణిరితి ద్వే అక్షరే సూర్య ఇతి త్రీణి ఆదిత్య ఇతి త్రీణి" అని శ్రుతిలో వినబడు టచే "సూర్య" అనుపదమునందు మూడక్షరములను సూ + రి + య సంఖ్యతో లెక్కించునపుడు గ్రహింపవలసినట్లు తెలియుచున్నది. ఉచ్చారణకాలమందు "సూర్య" యనియే పలుకవలెను.

ఈ మంత్రమును వేదమంతను స్వరసహితముగా ఉచ్చరించు నట్లే సస్వరముగా నుచ్చరింపవలెను. లేనిచో

శ్రు॥ మంత్రో హీన స్స్వరతో వర్ణతోవా మిథ్యాప్రయుక్తో న తమర్థ మాహా, స వా గ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రు స్స్వరతో౽పరాధాత్,

తా॥ ఏ వేదమంత్రమునైనను స్వరవిపర్యాసముగాని వర్ణవిప ర్యాసముగాని లేకుండగనే యథాశ్రుతముగానే పలుకవలెను. అపుడే దానియర్థమును చక్కగా బోధించుచు ఫలప్రద మగును. అట్లుకాక స్వర, వర్ణవిపర్యాసముతో పలుకుచో ఆ యర్థము నిచ్చి అందలిఫలము నీయకపోగా విపరీతమగు ననర్థమునుగూడ గలుగజేయును ఒకానొకడు ఇంద్రశత్రుః అనుమంత్రమును స్వరభేదముతో నుచ్చరించి యనర్థ మును పొందెను.

ఇదియే ప్రకటగాయత్రి యనబడును. ఇందు చతుర్థపాదము గూడ శ్రుతియందు వినవచ్చుచున్నది.

—♦ తురీయ గాయత్రి ♦—

శ్రు॥ పరోరజసే౽సావదోమ్,

తా॥ అనగా పైత్రిపదగాయత్రిచేత ప్రతిపాదింపబడు నుపా స్యరూప మగుసగుణరూపమున కతీతమై సర్వజగత్తునకు నధిష్ఠానరూప ముగా నున్నది. ఎట్లనగా బృహదారణ్యోపనిషత్తునందీగాయత్రీవిషయ మిట్లుపదేశింపబడినది. అందలిపంచమాధ్యాయమందు హృదయాద్య నేకోపాధివిశిష్ట మగుబ్రహ్మముయొక్క ఉపాసనాప్రకార ముపదేశింప

బడి గాయత్ర్యుపాధివిశిష్ట మగుబ్రహ్మముయొక్క ఉపాసన చెప్పబడి నది. వేదమందలి త్రిష్టుప్, జగత్యాదిఛందస్సులన్నిటిలోను గాయత్రీఛందస్సు గొప్పది. గయములనగా ప్రాణములను రక్షించుటచే గాయత్రి యనబడుచున్నది. అనగా గాయత్రీజప మొనర్చువానిప్రాణములను రక్షించునది యని భావము. సర్వఛందస్సులకు నాత్మభూతమైన ప్రాణమే ఈగాయత్రి. ప్రాణములనగా సకలేంద్రియములు. అందు త్రిష్టుభాదిఛందస్సు లోకైకఇంద్రియాధిపతులు. ఈగాయత్రి యన్ననో సర్వేంద్రియవృత్తులకు ఆత్మయైనదని భావము. అందువలననే యియ్యది బ్రహ్మవిద్య కుత్తమాధికారక మగుద్విజత్వప్రాపక మగుచున్నది.

ఈగాయత్రియొక్క ప్రథమపాదమందు పృథివ్యంతరిక్షద్యులోక దృష్టియు, ద్వితీయపాదమందు ఋగ్యజుస్సామవేదదృష్టియు, తృతీయ పాదమందు ప్రాణాపానవ్యానదృష్టియు ఉంచి ఉపాసించవలెను. ఇట్టి శబ్దరూప మగుత్రిపాదాత్మకగాయత్రి కభిధేయ మగుచతుర్థపాదము అయ్యది యాదిత్యమండలాంతర్గతుడును రజశ్శబ్దవాచ్య మగుసర్వ లోకములకు అధిష్ఠానము నగునపరబ్రహ్మమే. అందుచే నీత్రిపద గాయత్రి చతుర్థపాదమందు ప్రతిష్ఠింపబడియున్నది. దీని నాభిచారిక మగుశత్రుసంహారమందుగూడ వినియోగించుటను పైఖాణ్వశాఖ బృహదారణ్యశ్రుతియే బోధించుచున్నది. ఎట్లనగా.

శ్రు॥ తస్యా ఉపస్థానం, గాయత్ర్యస్యేకపదీ, ద్విపదీ, త్రిపదీ, చతుష్పద్యపదసి నహి పద్యసే నమస్తే తురీయాయ దర్శితాయ పదాయ, పరోరజసేఽసావదో మాప్రాపదితి, యం ద్విష్యాదసా వస్మై కామో మాసమృద్ధతివా, నహైవాస్మై సకామ స్సమృద్ధ్యతే, యస్మా ఏవ ముపతిష్ఠతే, అహ మదః ప్రాప మితివా.

తా॥ ఈగాయత్రిని "గాయత్ర్యసి" ఇత్యాదిమంత్రముతో నుపస్థానమొనర్పవలెను. ఓగాయత్రీ! నీవు త్రైలోక్యపాదముచే నేక

పదవి. వేదత్రయపాదముతో ద్విపదివి. ప్రాణాదిపాదముతో త్రిపదివి. నాలవపాదముతో నుపాస్యబ్రహ్మరూపమవు. ఆపైన నిరుపాధిక మగునిజాత్మచే పరబ్రహ్మమవు. అట్టినీవు "నేతి, నేతి" ఇత్యాదివాక్యములచే ఈపరిదృశ్యమాన సత్తులోని సర్వవస్తువులను బ్రహ్మము గాదని నిషేధింపగా మిగిలినసచ్చిదానందరూపవుగాన నీ వుపాసకులచే తమకంటె వేరగువస్తువును పొందినట్లు పొందబడదగినదానవు గావు. గాన వ్యవహారవిషయ మగునీరూపముకొరకు నమస్కారము. ——ఈ పేరుగలనాశత్రువు——ఈఆపదను పొందుగాక. నిన్ను నేనుపొందుటకు విఘ్నమును కలుగజేయునవిద్య నశించుగాక యనితాత్పర్యము.

## —♦ గు ప్త గా య త్రి ♦—

గుప్తగాయత్రి యనునది గలదుగాని దానిని గ్రంథమందు వ్రాయ వీలులేదు. సద్గురువువలన తెలిసికొనదగినదిమాత్రమే.

## —♦ హం స గా య త్రి ♦—

దీనినే కొన్ని వేదశాఖలు అజపాగాయత్రియనియు పేర్కొన్నవి. అనగా పురుషప్రయత్నము లేకయే అప్రయత్నముగా జపింపబడుచు సాధకుని రక్షించునదియని తాత్పర్యము. ఇట్టివి ఉచ్ఛ్వాస నిశ్వాసములే. ఇవి జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూడవస్థలందు నెట్టి భేదములేక పురుషప్రయత్నానపేక్షితమై వెడలుచున్నవి. వీని ధ్వని అహం సః——సోహం అనురీతిగా గోచరించును. దీనితాత్పర్య మేమనగా నేను ప్రాకృతజనుడను గాను. దేహేంద్రియసంఘాతము గాను. స్థూలసూక్ష్మకారణదేహములు గాను. సర్వవేదములచే ప్రతిపాదింపబడిన సచ్చిదానందపరబ్రహ్మమునే నేను అని. సర్వజీవులకు నివి సమానమైనను అందరకు నీయభిప్రాయ ముండదుగాన అందరును తత్ఫలము నొందజాలరు. ప్రతిదేహమందును చైతన్యము స్ఫుటముగా గోచరించుచున్నను అజ్ఞులెట్లు దానిని బ్రహ్మముగా గుర్తించి కృతార్థు లగుటలేదో యట్లే ఈ అజపాగాయత్రీజపము సర్వజీవులందును జరుగుచున్నను అందరును కృతార్థు లగుటలేదు.

ఇట్టి అజపాగాయత్రీ విశేషములుగూడ సద్గురువుల నాశ్రయించి గ్రహింపవలసినవేగాని గ్రంథమందు వ్రాయ వీలుగాదు.

శ్రు॥ అతఃపరం నాన్య దణీయసగ్ంహి పరాత్పరం య న్మహతో మహాంతం; య దేక మవ్యక్త మనంతరూపం ం పురాణం తమసః పరస్తాత్.

తా॥ దోమలు మొదలగు సూక్ష్మజీవులకంటె సూక్ష్మతరము లగుజీవు లుదకమందును క్షీరాదికమందును కేవల చక్షురింద్రియము నకు గోచరింపక దుర్భిణ్యాదియంత్రసహాయముతో గోచర మగు చున్నవి. అట్టిజీవులందు దేహమును చైతన్యమును రెండును కలవు గదా. కాన అట్టి యణుపరిమాణకదేహములలోగూడ ఈచైతన్య మంతకంటె నణుతరరూపముతో నున్నదిగాన నిట్టియాత్మకంటె నణు తమ మగువస్త్వంతర మెచటను లేదు.

లోకమందు కార్యకారణవస్తువులు రెంటిలో కారణవస్తువు గొప్పదిగాను, కార్యవస్తువు చిన్నదిగాను ఉండుట ప్రత్యక్షముగా నున్నది. మృత్ అనుకారణవస్తువు గొప్పది. ఘట మనుకార్యవస్తువు చిన్నది. అట్లే ఓషధు లనెడికార్యమునకు కారణ మగుపృథివి గొప్పది. అంతకంటె తత్కారణ మగుజలము గొప్పది. అంతకంటె తత్కారణ మగుఅగ్ని గొప్పది. అంతకంటె తత్కారణ మగువాయువును అంత కంటె తత్కారణ మగుఆకాశమును గొప్పది. ఇట్టిగొప్పదైన ఆకా శముకంటెగూడ తత్కారణమైనబ్రహ్మ మింకను గొప్పది. ఈబ్రహ్మ మునకు మరియొకకారణము లేదు. ఇదియే సర్వకారణముగాన దీని కంటె గొప్పవస్తువు లేదు. ఇట్టిబ్రహ్మము సజాతీయవిజాతీయస్వగత భేదశూన్యమైనది. పామరులకు గోచరింపనిది. సర్వవ్యాపకమైనది. సర్వ లోకరూపమైనది. ఎంతపూర్వకాలమందును నూతనముగా నున్నది. త్రికాలాబాధ్యమైనది. స్వయంప్రకాశమానమైనది అగుచున్నది.

ఈ యభిప్రాయమునే చెప్పుచు మరికొంతవిశేషమునుగూడ నీక్రిందిశ్రుతి బోధించుచున్నది.

శ్రు॥ అణో రణీయా న్మహతో మహీయా నాత్మా గుహా
యాం నిహితోఽస్య జంతోః. త మక్రతుం పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్.

తా॥ పరమాత్మ అణువుకంటెను మిక్కిలిసూక్ష్మమైనవాడు, గొప్పదగు నాకాశముకంటెను గొప్పవాడు. దేవమనుష్యాదిప్రాణిసమూహముయొక్క హృదయపుండరీకమధ్యవర్తి యగు బుద్ధిగుహయందుపొందవిగినవాడు, విద్యాసాధనముచేత నట్టిబుద్ధియందు సాక్షిగా భాసించుచున్నట్లు గ్రహింపదగినవాడు. సంకల్పాదిమనోధర్మరహితమైనట్టి గొప్పవాడగు నాబ్రహ్మ మంతఃకరణ, బాహ్యకరణములయొక్క నైర్మల్యమువలన అనగా వానిని బాహ్యప్రాపంచికవిషయములందు ప్రవర్తింపనీయక ఆత్మవిషయమందుమాత్రమే ప్రవర్తింపజేయుట వలన నట్టిబ్రహ్మమును గుర్తించినవాడై జననమరణప్రవాహరూపమగుసంసారశోకము నెన్నటికిని పొందడు.

శ్రు॥ అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జన
యంతీగ్ం సరూపాం. అజో హ్యేకో జుషమాణోఽనుశేతే;
జహా త్యేనాం భుక్తభోగా మజోఽన్యః.

తా॥ ఎపుడు పుట్టినదో చెప్పుటకు వీలులేని యొకానొక సత్త్వరజస్తమోగుణాత్మకమైన మాయ, సమానమగురూపముగల అనేకప్రజలను పుట్టించుచు బ్రహ్మాత్మభావమును మరపించి, దేహధారియనియు, సుఖదుఃఖాదిప్రాపంచికధర్మవిశిష్టుడనియు భ్రాంతిని కలుగజేయును. సద్గురువులవలన శాస్త్రీయరీతితో వేదాంతవాక్యశ్రవణాదిక మొనర్చి క్రమముగా నపరోక్షబ్రహ్మసాక్షాత్కారము నొందినవాడేతన్మాయాతీతుడై మాయాకార్యమగుజననమరణాదిసంసార

ధర్మము నొందదు. అవిద్యాగ్రస్తు డట్టిశ్రవణాదిక మొనర్పక, జనన మరణాదికమును నిరంతరము పొందుచుండును.

శ్రు॥ హగ్ంస శ్శుచిష ద్వసు రంతరిక్షస ద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్, నృష ద్వరస దృతస ద్వ్యోమ సదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్.

తా॥ శుద్ధ మగుజ్యోతిర్మండల మగుసూర్యగోళములోనుండి సర్వజీవులయొక్క ప్రాణప్రవర్తకుడై వెలుగువాడును త్రేతాగ్నులలో హోమనిష్పాదక మగుఆహవనీయాగ్నిరూపముతో నుండి సాధకుల అవిద్యను క్రమముగా పోగొట్టువాడును అతిథిరూపముతో వచ్చి సత్కరింపబడి వైశ్వానరరూపముతో సంతసించి ప్రజా, పశు, పుణ్యాదులను వృద్ధిపొందించువాడును కర్మాధికారు లగుమనుష్యాదులందు యజమానరూపముతో నుండువాడును, కాశి ద్వారవతి మొదలగు పుణ్యక్షేత్రములరూపముతో నుండువాడును సత్యముగా శ్రేయస్సాధనము లగువేదోదితకర్మలందు ఫలరూపమున ఉండువాడును ఆకాశ మందలి నక్షత్రాదికాంతిమంతము లగుజ్యోతిస్సుల రూపముతో నుండువాడును ఉదకమునందు శంఖమకరాదిరూపముతో నుండువాడును గోవులందు క్షీరరూపమున నుండువాడును సత్యవచస్సులందు కీర్తిరూపమున నుండువాడును కొండలనుండి వృక్షనిర్ఝరాదిరూపమున పుట్టుచుండువాడును- ఇవి యవి యననేల? ఈజగమంతయు నాయాఉపాధిద్వారా వ్యాపించియుండున దంతయు పరబ్రహ్మమే.

శ్రు॥ యస్మాత్పరం నాపర మస్తి కించి ద్యస్మా న్నాణీయో న జ్యాయో స్తి కశ్చిత్. వృక్షఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేక స్తే నేదం పూర్ణం పురుషేణ సర్వమ్.

తా॥ శ్రేష్ఠ మగువస్తువుగాని నికృష్ట మగువస్తువుగాని బ్రహ్మము కంటె వేరుగా లేదు. ఈబ్రహ్మముకంటె చిన్నవస్తువుగాని, పెద్దవస్తువుగాని ఎచటను లేదు. ఈబ్రహ్మము వృక్షమువలె నిశ్చలమై స్వప్రకాశమై యున్నది. జగమంతయు నీబ్రహ్మముచేతనే నిండియున్నది.

ఈ యభిప్రాయమునే చెప్పుచు మరికొంతవిశేషమునుకూడ నీక్రిందిశ్రుతి బోధించుచున్నది.

శ్రు॥ అణో రణీయా న్మహతో మహీయా నాత్మా గుహాయాం నిహితోఽస్య జంతోః. త మక్రతుం పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్.

తా॥ పరమాత్మ అణువుకంటెను మిక్కిలిసూక్ష్మమైనవాడు. గొప్పదగు నాకాశముకంటెను గొప్పవాడు. దేవమనుష్యాదిప్రాణిసమూహముయొక్క హృదయపుండరీకమధ్యవర్తి యగు బుద్ధిగుహయంపిపొందదగినవాడు, విద్యాసాధనముచేత నట్టిబుద్ధియందు సాక్షిగా భాసించునట్లు గ్రహింపదగినవాడు. సంకల్పాదిమనోధర్మరహితమైనట్టి గొప్పవాడగు నాబ్రహ్మ మంతఃకరణ, బాహ్యకరణములయొక్క నైర్మల్యమువలన అనగా వానిని బాహ్యప్రాపంచికవిషయములందు ప్రవర్తింపనీయక ఆత్మవిషయమందుమాత్రమే ప్రవర్తింపజేయుట వలన నట్టిబ్రహ్మమును గుర్తించినవాడై జననమరణప్రవాహరూపమగుసంసారశోకము నెన్నటికిని పొందడు.

శ్రు॥ అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపాం. అజో హ్యేకో జుషమాణోఽనుశేతే; జహా త్యేనాం భుక్తభోగా మజోఽన్యః.

తా॥ ఎపుడు పుట్టినదో చెప్పుటకు వీలులేని యొకానొక సత్త్వరజస్తమోగుణాత్మక మైన మాయ, సమాన మగురూపముగల అనేకప్రజలను పుట్టించుచు బ్రహ్మాత్మభావమును మరపించి, దేహధారియనియు, సుఖదుఃఖాదిప్రాపంచికధర్మవిశిష్టు డనియు భ్రాంతిని కలుగజేయును. సద్గురువులవలన శాస్త్రీయరీతితో వేదాంతవాక్యశ్రవణాదిక మొనర్చి క్రమముగా సహోక్తిబ్రహ్మసాక్షాత్కారము నొందినవా డేతన్మాయాతీతుడై మాయాకార్య మగుజననమరణాదిసంసార

ధర్మము నొందదు. అవిద్యాగ్రస్తు డట్టిశ్రవణాదిక మొనర్పక, జనన మరణాదికమును నిరంతరము పొందుచుండును.

శ్రు॥ హగ్ంస శ్శుచిష ద్వసు రంతరిక్షస ద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్, నృష ద్వరస దృతస ద్వ్యోమ సదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్.

తా॥ శుద్ధ మగుజ్యోతిర్మండల మగుసూర్యగోళములోనుండి సర్వజీవులయొక్క ప్రాణప్రవర్తకుడై వెలుగువాడును శ్రేతాగ్నులలో హోమనిష్పాదక మగుఆహవనీయాగ్నిరూపముతో నుండి సాధకుల అవిద్యను క్రమముగా పోగొట్టువాడును అతిథిరూపముతో వచ్చి సత్కరింపబడి వైశ్వానరరూపముతో సంతసించి ప్రజా, పశు, పుణ్యాదులను వృద్ధిపొందించువాడును కర్మాధికారు లగుమనుష్యాదులందు యజమానరూపముతో నుండువాడును, కాశి ద్వారవతి మొదలగు పుణ్యక్షేత్రములరూపముతో నుండువాడును సత్యముగా శ్రేయస్సాధనము లగువేదోదితకర్మలందు ఫలరూపమున ఉండువాడును ఆకాశమందలి నక్షత్రాదికాంతిమంతము లగుజ్యోతిస్సుల రూపముతో నుండువాడును ఉదకమునందు శంఖమకరాదిరూపముతో నుండువాడును గోవులందు క్షీరరూపమున నుండువాడును సత్యవచస్కులందు కీర్తిరూపమున నుండువాడును కొండలనుండి వృక్షనిర్ఝరాదిరూపమున పుట్టుచుండువాడును- ఇవి యవి యననేల? ఈజగమంతయు నాయాఉపాధిద్వారా వ్యాపించియుండున దంతయు పరబ్రహ్మమే.

శ్రు॥ యస్మాత్పరం నాపర మస్తి కించి ద్యస్మాన్నాణీయో న జ్యాయో౽స్తి కశ్చిత్. వృక్షఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేక స్తే నేదం పూర్ణం పురుషేణ సర్వమ్.

తా॥ శ్రేష్ఠ మగువస్తువుగాని నికృష్ట మగువస్తువుగాని బ్రహ్మము కంటె వేరుగా లేదు. ఈబ్రహ్మముకంటె చిన్నవస్తువుగాని, పెద్దవస్తువుగాని ఎచటను లేదు. ఈబ్రహ్మము వృక్షమువలె నిశ్చలమై స్వప్రకాశమై యున్నది. జగమంతయు నీబ్రహ్మముచేతనే నిండియున్నది.

శ్రు॥ న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః పరేణ నాకం నిహితం గుహాయాం విభ్రాజ దేత ద్యతయో విశంతి.

తా॥ అగ్నిహోత్రాదికర్మాచరణచేగాని, సంతానముచేగాని, ధనముచేగాని, మోక్షమురాదు. ఏని త్యాగముచేతనే అనగా ధనేషణ, దారేషణ, పుత్రేషణాదులను వదలి సర్వకర్మసన్న్యాసమొనర్చి వేదాంతశ్రవణమనననిదిధ్యాసాదుల గావించుటద్వారానే మోక్షము సిద్ధించునుగాని మరియొకసాధనము లేదు.

శ్రు॥ వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్వాః. తే బ్రహ్మలోకే తు పరాంతకాలే పరామృతా త్పరిముచ్యంతి సర్వే.

తా॥ ఎవరు వేదాంతవాక్యశ్రవణమననాదులచే జీవబ్రహ్మైక్యమనువిషయముమాత్రమే బుద్ధిగోచరముగా గలవారై క్రమముగా తామే బ్రహ్మమనురూఢి గల్గి అంతఃకరణాదులకు బాహ్యవస్తువులను విషయములు గానీయక శుద్ధచిత్తులై యుందురో అట్టివారు పరాంతకాలమం దనగా సమూలముగా నవిద్య నశించినపిదప కలుగు దేహపాతకాలమందు అవ్యాకృతము లేక అవ్యక్తము లేక కారణదేహము లేక అవిద్య యనబడునది పుష్కలముగాను సమూలముగాను అత్యంతనాశ మగుటచే ముక్తిని పొందుదురు. ఇదియే విదేహముక్తి యనబడును. ప్రళయకాలమందు జ్ఞానులు గానివారికిగూడ స్థూల, సూక్ష్మదేహములు నశించునుగాని కారణదేహనాశము గలుగదు. కాన వారలు తిరిగి సృష్టిలో తమతమకర్మానురూపము లగుదేహములను ధరింతురు.

ఇట్టితత్త్వజ్ఞానము గలుగుటకు సూ పాయ ముపదేశింపబడుచున్నది.

శ్రు॥ దహ్రం విపాపం పరమేశ్మభూతం య త్పుండరీకం పురమధ్య సగ్ స్థం తత్రాపి దహ్రం గగనం విశోక స్తస్మిన్ యదంత స

తా॥ అత్యల్పమైనట్టియు పరిశుద్ధమైనట్టియు శిలవలె దృఢమైనట్టియు దేహమధ్యభాగమం దున్నట్టియు హృదయపద్మమందు గల యల్పమగునాకాశమందు శోకరహిత మగునాత్మ గలదు. దానిని గ్రహించి అదియే దేహవ్యాపారాదుల కన్నిటికి కారణమైనదానినిగా నుపాసింపవలయును.

శ్రు॥ యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః తస్య ప్రకృతిలీనస్య యః పర స్స మహేశ్వరః.

తా॥ వేదముయొక్క ఆదియందును అంతమందును గలఓంకారమందు లీనమైనపరమేశ్వరుని గుర్తింపవలయును.

(1) సహస్రశీరుషం దేవం విశ్వాక్షం విశ్వశమ్భువమ్
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్.

తా॥ అనేకశిరస్సులు, అనేకనేత్రములు కల్గి ప్రపంచమునకు సుఖమును కలుగజేయుచు జగదాత్మకుడు జగత్కారణము పంచమహాభూతమయుడు, నాశనరహితుడు, శ్రేష్ఠుడు, జ్ఞానులచే పొందబడువాడు నగుమహేశ్వరుని ధ్యానించవలెను.

(2) విశ్వతః పరమా న్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్
విశ్వమేవేదం పురుష స్త ద్విశ్వ ముపజీవతి.

తా॥ జడవర్గ మగుజగత్తుకంటె శ్రేష్ఠుడు శాశ్వతుడు సర్వాత్మకుడు నారాయణాఖ్యుడు అజ్ఞానమును హరించువాడు నగుపరమేశ్వరుని ధ్యానించుచున్నాను. ఈప్రపంచమే పరమాత్మ; ఆపరమాత్మయే ప్రపంచము. స్వవ్యవహారనిర్వహణార్థ మాయీశ్వరు నాశ్రయించుచున్నాను.

(3) పతిం విశ్వ స్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్.

తా॥ ప్రపంచమునకు పాలకుడగుటచే అధిపతియు, జీవుల కీశ్వరుడును, అవిచ్ఛిన్నముగా నుండువాడును మంగళస్వరూపుడును, నాశనరహితుడును నారాయణుడును తెలిసికొనదగినతత్త్వములలో ప్రౌఢుడగుటచేత మహాజ్ఞేయుడును జగదుత్పత్తికారణ మగుటచే ప్రపంచమే ఆత్మగాగలవాడును ప్రపంచాధారుడును అగుపరమేశ్వరుని ధ్యానించెదను.

(4) నారాయణపరో జ్యోతి రాత్మా నారాయణః పరః
నారాయణపరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః
నారాయణపరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః

తా॥ నారాయణుడే శ్రేష్ఠ మగుజ్యోతిస్స్వరూపము. నారాయణుడే పరమాత్మ. నారాయణుడే శ్రేష్ఠము, వేదాంతవేద్యమునగు సద్వస్తువు. నారాయణుడే శ్రేష్ఠు డగువేదాన్తాధికారి. నారాయణుడే ధ్యానము, నారాయణుడే పాపాత్ములకు శత్రువు. ఇట్టినారాయణమూర్తిని ధ్యానించవలయును.

(5) యచ్చ కించి జ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా
అంత ర్బహిశ్చ త త్సర్వం వ్యాప్య నారాయణ స్థితః.

తా॥ ఈప్రపంచమునం దేది చూడబడుచున్నదో, వినబడుచున్నదో యాసర్వమునకు లోపలను వెలుపలను అంతట నారాయణ పరమాత్మ వ్యాపించియున్నాడు.

(6) అనంత మవ్యయం కవిగ్ం సముద్రేంతం విశ్వశంభువమ్
పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్.

తా॥ దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యుడును, వినాశరహితుడును చిద్రూపముచే సర్వజ్ఞుడును సంసారసాగరమునం దవసానభూతుడును సంసారసుఖోత్పత్తికి కారణభూతుడును సర్వసుఖములకు కారణ

భూతుడు నగునారాయణపరబ్రహ్మము నుపాసించెదను తామర మొగ్గతో సమానమై యధోముఖ మగుహృదయకమల మున్నది.

(7) అధో నిష్ట్యావితస్త్యాంతే నాభ్యా ముపరి తిష్ఠతి.
జ్వాలమాలాకులం భాతి విశ్వ స్యాయతనం మహాత్.

తా॥ గ్రీవాభాగముయొక్క క్రిందిభాగమునందు నాభిప్రదేశము యొక్క ఊర్ధ్వభాగమునందు ద్వాదశాంగుళి (12 అంగుళముల, పరిమితిగలప్రదేశముయొక్క చివరభాగమునందు హృదయపుండరీకము గలదు. బ్రహ్మాండమున కాధారభూతమై ప్రకాశపరంపర లతో కూడుకొనియున్నపరబ్రహ్మ మాహృదయపుండరీకమందు ప్రకాశించుచున్నది. (ఉండుచున్నది)

(8) సంతతగ్ం శిలాభి స్తు లంబత్యా కోశసన్నిభమ్
తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మి న్త్సర్వం ప్రతిష్ఠితమ్.

తా॥ తామర మొగ్గతో సమాన మగుహృదయకమలమునం దధోముఖముగా వ్రేలాడుచున్నది. ఆహృదయకమల మనేకనాడుల చేత శరీరమంతట వ్యాపించియున్నది ఆహృదయ సమీపమునందు సూక్ష్మమగురంధ్రము గలదు. ఆరంధ్రమునం దీజగ త్తంతయు న్నాశ్రిత మయియున్నది.

(9) తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః
సోగ్రభు గ్విభజం స్తిష్ఠ న్నాహార మజరః కవిః
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ స్తస్య స న్తతాః.

తా॥ ఆసుషుమ్నానాడియొక్క మధ్యభాగమునందు ప్రౌఢ మగునగ్ని గలదు. అది అధికములగుజ్వాలలు గలది. నలువైపుల వ్యాపించినముఖము గలది. ఆయగ్ని తనకు ముందున్నదాని ననగా అన్నాదికమును భుజించును. భుజించిన యా ఆహారము నాయా యవయవములకు సమానముగా విభాగించుచుండును. తాను నశిం

పనివాడై సర్వజ్ఞుడై యుండును. ఆయగ్నియొక్క జ్వాల లడ్డముగా ని · వుగా వ్యాపించినవై శరీరమంతట వ్యాపించియున్నవి.

(10) సంతాపయతి స్వం దేహ మాపాదతలమ స్తగః
తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః.

తా॥ ఆయగ్ని పాదములు మొదలుకొని శిరస్సువరకు వ్యాపించి యున్నదై స్వకీయ మగుదేహము నెల్లప్పుడు సంతాపమును కలుగ జేయుచున్నది. ఆదేహమునం దంతయు వ్యాపించియున్నయగ్నిజ్వాలల యొక్క మధ్యభాగమునం దొకఅగ్నిజ్వాల సూక్ష్మమైనదై ఊర్ధ్వ ప్రసారము గలదై విశేషముగా నున్నది. ఇది అతిసూక్ష్మమైనదై సుషుమ్నానాడీమార్గముచేత బ్రహ్మరంధ్రమువరకు ఊర్ధ్వముఖ ముగా వ్యాపించియున్నది.

(11) నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా
నీవారశూకవ త్తన్వీ పీ·తా భాస్వ త్యణూపమా.

తా॥ ఆవహ్నిశిఖ నీలమేఘముయొక్క మధ్యభాగమునం దున్నమెరుపుతీగవలె ప్రకాశించుచున్నదైయున్నది. నీవారధాన్యపు గింజయొక్క కొనయందుండువడ్లువలె సూక్ష్మమయినది, పీతవర్ణము గలది, కాంతి గలది, సూక్ష్మవస్తువుల కుపమానభూతమయినది

(12) తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః
స బ్రహ్మ స శివ స్స హరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమ స్స్వరాట్.

తా॥ ఆసూక్ష్మ మగువహ్నిజ్వాలాగ్రముయొక్క మధ్యభాగ మునందు పరమేశ్వరు డున్నాడు. అతడే చతుర్ముఖబ్రహ్మ. ·తడే శివుడు. అతడే విష్ణువు. అతడే యింద్రుడు. అతడే నాశరహితుడు శుద్ధచిద్రూపుడు. అతడే స్వరాట్టు.

గీత॥ (క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే)

మాయారహితుడు మరియు పరాధీనుడుగాక స్వయముగా ప్రకాశించువాడు. సర్వమును ప్రకాశింపజేయువాడు.

ఈ యర్థమునే శ్రీ శంకరభగవత్పాదు లిట్లు నుడివిరి.

హృదయకమలమధ్యే దీపవ ద్వేదసారం
ప్రణవమయ మతర్క్యం యోగిభి ర్ధ్యానగమ్యమ్
హరిగురుశివయోగం సర్వభూతస్థ మేకం
సకృదపి మనసా వై చింతయే ద్య స్స ముక్తః.

తా॥ సాధకుడు తనహృదయకమలమధ్యమందు దీపమువలె ప్రకాశించుచు సర్వవేదములసారమై ప్రణవరూపుడై ఇట్టిదని ఊహింప నలవిగాక యోగీశ్వరులకు ధ్యానమందుమాత్రము గోచరించుచు బ్రహ్మ, విష్ణు, రుద్రాదిసర్వదేవతాసమూహరూపుడై సర్వప్రాణి జాతమం దేకరీతిగా చైతన్యరూపముతో నుండుపరమాత్మ నొకమా రైనను ధ్యానించువాడు క్రమముగా ముక్తుడగును. అనగా నీ ధ్యానము క్రమముగా సమాధియై అపరోక్షాత్మవిజ్ఞానము గల్గిన తోడనే మోక్షము నొందును.

—♦ ఏ క శ్లో కీ ♦—

కిం జ్యోతి స్తవ? భానుమా నహని మే; రాత్రౌ? ప్రదీపాదికం;
స్యా దేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే?
చక్షు; స్తస్య నిమీలనాదసమయే కిం? ధీ; ర్ధియో దర్శనే
కిం? తత్రాహం; మతో భవా న్పరమకం జ్యోతి; స్త దస్మి ప్రభో!

తా॥ ఆత్మ స్వయంప్రకాశ మనిచెప్పుటకు లోకానుభవపుర స్సర మగుప్రశ్నప్రతివచనము లీశ్లోకమందు తెలియబడుచున్నవి.

ప్రశ్న— నీవు ఏవెలుగువలన పదార్థములను గుర్తించెదవు?

సమాధానము— పగటియందు సూర్యతేజము— రాత్రియందు దీపము.

ప్రశ్న— సూర్య, దీపాదులను గ్రహించుటకు వెలు గేది?

సమా— చక్షురింద్రియము.

ప్రశ్న— ఆచక్షురింద్రియము మూసికొన్నప్పు డేది వెలుగు?

సమా— బుద్ధి. (అనగా స్వప్నావస్థయం దనిభావము.)

ప్రశ్న- ఆబుద్ధి లేనట్టిసుషుప్తియందేది వెలుగు ?

సమా- నే నపుడు వెలుగురూపుఁడను.

ప్రశ్న- అందుచే నీవే ప్రకాశరూపుడవని గ్రహింపుము.

(తత్త్వమసి)

సమా- చిత్తము నేనే ప్రకాశరూపుడ నగు ఆత్మను.

(అహం బ్రహ్మాస్మి)

శ్రు॥ న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతో௨య మగ్నిః. తమేవ భాంత మను భాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి.

తా॥ ఆత్మను సూర్యుడుగాని చంద్రుడుగాని నక్షత్రములుగాని మెరుపుగాని అగ్నిగాని ప్రకాశింపజేయలేవు. వీనికి ప్రకాశశక్తి స్వతంత్రముగా లేనేలేదు. ఆబ్రహ్మమాత్రమే ప్రకాశరూపము గాని యీసూర్యాదు లందరు ఆబ్రహ్మప్రకాశముచేతనే ప్రకాశవంతులు. ఆబ్రహ్మమే అఖిలలోకమును ప్రకాశింపజేయుచున్నది.

ఖమధ్యే కురు చాత్మాన మాత్మమధ్యే చ ఖం కురు
ఆత్మానం ఖమ్మయం కృత్వా న కించిదపి చింతయేత్.

తా॥ హృదయాకాశమధ్యమందు పరమాత్మ ననుసంధాన మొనర్పుము. ఆహృదయ మాత్మయందు కల్పింపబడినదేగాని వాస్తవ మైనది గాదు. కావున నీకంటె నాహృదయాకాశము వేరుగాదనియు నీఆత్మయం దయ్యది కల్పితమనియు గ్రహింపుము. అపుడు నీవే ఆకాశమయుడవై అనగా ఆకాశశరీరకమగుబ్రహ్మ మగుదువు. సద్గురువులవలన నీరీతిని గ్రహించి క్రమముగా మోక్షము నొందుము.

సంశాంతసర్వసంకల్పా యా శిలాంతరివ స్థితిః
జాడ్యనిద్రావినిర్ముక్తా సా స్వరూపస్థితి ర్మతా.

తా॥ మనస్సు ఎట్టివిషయసంకల్పాదికమును చేయక ఇంద్రియ ములందు ప్రసరింపక, శిలవలె స్థిరముగా నుండి, హృదయమందలి

ఆత్మను మాత్రమే గ్రహించుచు ఆత్మయందు క్రమముగా లీనమై భూతాకాశమువలె జడముగాక సుషుప్త్యవస్థయందువలె కారణరూపముగా నుండుఅవిద్య లేక యుండుటయే స్వరూపస్థితి యనబడును. అట్టిదాని పరిపాకావస్థయే జీవన్ముక్తి యనబడును.

కఠ శ్రు॥ ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవచ.
ఇంద్రియాణి హయా నాహు ర్విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః.

తా॥ కర్మఫలానురూప మగుదేహమును ధరించినజీవుడు రథస్వామివంటివాడును, శరీరము రథమువంటిదియు, బుద్ధి సారథివంటిదియు, మనస్సు గుఱ్ఱపుకళ్ళెమువంటిదియు, చక్షురాదీంద్రియములు గుఱ్ఱములవంటివియు, ప్రపంచమందలి శబ్దస్పర్శాదివిషయములన్నియు రథము సంచరించుమార్గములవంటివియు నయియున్నవి. ఇట్టి విషయేంద్రియబుద్ధులతో గూడినవాడే భోక్త యనబడును. విషయేంద్రియమనోబుద్ధులతో నెట్టిసంబంధమును లేక కేవలస్వస్వరూపనిష్ఠలో నుండుటయే మోక్షసాధన మగును.



## సామవేదము

### కేనోపనిషత్తు

శ్రు॥ కే నేషితం పతతి ప్రేషితం మనః
కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః
కేనేషితాం వాచ మిమాం వదంతి
చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి

తా॥ మన స్సెవనిచే కోరబడి ప్రేరేపింపబడినదై తనవిషయములనుగూర్చి వెళ్లుచున్నది? సర్వేంద్రియములకు ప్రధాన మగుప్రాణము

ఎవనితో కూడినదై తనవ్యాపార మొనర్చుచున్నది? లోక మంద రును ఎవనిప్రేరణతో కూడినవాక్కును మాట్లాడుచున్నారు? చక్షుశ్శ్రోత్రాదీంద్రియముల నాయారూపశబ్దాదివిషయములం దే దేవుడు కూర్చుచున్నాడు?

శ్రు॥ శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచం. స ఉ ప్రాణస్య ప్రాణః, చక్షుష శ్చక్షు రతిముచ్య ధీరాః ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి.

తా॥ శ్రోత్రేంద్రియ మొనర్చు శ్రవణవ్యాపారమునకు కారణ మైనదే బ్రహ్మము. మనస్సుయొక్క మననవ్యాపారకారణ మైనట్టియు, ప్రాణేంద్రియముయొక్క రూపదర్శనకారణమైనట్టియు వస్తువును తెలిసికొన్నవిద్వాంసు లీలోకమునుండి పోయి మరణధర్మము లేనివా రగుచున్నారు. అనగా చక్షురాదీంద్రియములు స్వతంత్రముగా రూప గ్రహణాదిసామర్థ్యము లేనివనియు జడములనియు ఒకానొక చైతన్య శక్తిప్రేరణచే నాయాసామర్థ్యములు గల్గియున్నవనియు నట్టిచైతన్య మే బ్రహ్మమనియు గ్రహింపవలెను.

శ్రు॥ న తత్ర చక్షు ర్గచ్ఛతి, న వా గ్గచ్ఛతి. నో మనః.
న విద్మో న విజానీమో యథైత దనుశిష్యాత్
అన్యదేవ త ద్విదితా దథో అవిదితా దధి
ఇతి శుశ్రుమ పూర్వేషాం యే న స్త ద్వ్యాచచక్షిరే.

తా॥ ఆపరబ్రహ్మము చక్షురింద్రియమునకుగాని వాగింద్రియము నకుగాని మనస్సునకుగాని గోచరముకాదు. అట్టిదానిని జిజ్ఞాసువుల కెట్లు బోధింపవలెనో తెలియుట కష్టముగానున్నది. ఇంద్రియగోచర మగు నీప్రపంచముకంటె బ్రహ్మము విలక్షణమైనది. ఇంద్రియగోచరము గాని అవ్యాకృతముకంటెను అనగా అవిద్యకంటెను విలక్షణమైనది. గాన సృష్ట్యాదినుండి నేటివరకు నవిచ్ఛిన్నగురుపరంపరచే నెట్లు శిష్యుల కీబ్రహ్మవిద్య ఉపదేశింపబడుచున్నదో అదియొక్కటియే రీతి.

ఈ యభి్రాయమునే తైత్తిరీయ్రుతిగూడ నిట్లు బోధించు చున్నది.

శ్రు॥ యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచనేతి.

తా॥ ఈబ్రహ్మము అంతరింద్రియమునకుగాని బాహ్యేంద్రియ ములకుగాని గోచరమగునది కాదు. ఆనందమే బ్రహ్మము. గాన అట్టి బ్రహ్మము నింద్రియవిషయముగాని ఆనందరూపముగా గ్రహించిన వాడు లోకమంతయు తానే యగుటచేతను తనకంటె వేరగురెండవ వస్తు వెంతమాత్రమును లేకపోవుటచేతను భయమునొందడు.

శ్రు॥ సర్వేఽస్మై దేవా బలి మావహంతి.

తా॥ ఇంతేగాక లోక మందరిచేతను పూజింపబడుచున్న ఇం ద్రాదిదేవత లందరుగూడ పైజెప్పబడినబ్రహ్మవేత్తను పూజింతురు.

ఇట్లు సామవేదము బ్రహ్మను సాక్షాత్తుగా బోధించుట బహుకష్టమని చెప్పి పరంపరగా నిట్లు బోధించుచున్నది.

శ్రు॥ య ద్వాచానభ్యుదితం యేన వా గభ్యుద్యతే
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే.

తా॥ సాలగ్రామ, విగ్రహాదులందు దేవతాభావము నుంచి లోకమందు సాధకు లుపాసించుచున్నారు. అయ్యది వాస్తవముగా బ్రహ్మము గాదు. ఆకాశాదిపంచభూతములతో సంబంధించిన ఆకార ముగలయాశ్వరుడే ఉపాస్యవిషయ మగుచున్నాడుగాని అది బ్రహ్మ ము గాదు. బ్రహ్మ మనునది వాగింద్రియముచే చెప్ప నలవికానిది- ఆబ్రహ్మసామర్థ్యముచేతనే వాగింద్రియము మాట్లాడుచున్నదని తెలిసికొనవలయును.

శ్రు॥ య న్మనసా న మనుతే యే నాహు ర్మనో మతః
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే.

తా॥ జనులందరు నేబ్రహ్మమును మనస్సుతో నూహింప జాలరో ఇటువంటిదని నిశ్చయింపజాలరో మనస్సునకు గలమననాది సామర్థ్య మేకారణమువలన గల్గియున్నదో, అట్టికారణవస్తువే బ్రహ్మ మని తెలిసికొనుము. అంతేగాని జను లుపాసించుదేవతామాత్రమే బ్రహ్మము గాదు.

శ్రు॥ య చ్చక్షుషా న పశ్యతి యేన చక్షూగ్ంషి పశ్యతి
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే.

తా॥ జను లేబ్రహ్మమును నేత్రములతో చూడజాలరో నేత్రేంద్రియ మెట్టిబ్రహ్మమువలన రూపగ్రహణసమర్థత గల్గియున్నదో అట్టిదే బ్రహ్మమని గ్రహింపవలయును. అంతేగాని ఉపాస్య దేవతయే పరబ్రహ్మము గాదు.

శ్రు॥ య చ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్ర మిదం శ్రుతమ్
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే.

తా॥ జను లేబ్రహ్మమును చెవితో వినజాలరో శ్రోత్రేంద్రియ మునకు శ్రవణసామర్థ్య మేబ్రహ్మమువలన గలుగుచున్నదో అదియే బ్రహ్మమని తెలిసికొనవలయును. అంతేగాని పరబ్రహ్మము నీ కుపాస్య విషయము గాదు.

శ్రు॥ య త్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే.

తా॥ ఘ్రాణేంద్రియముచే గంధమువలె బ్రహ్మము గ్రహింప బడదగినది గాదు. ఆఘ్రాణేంద్రియమునకు గలశక్తి యేకారణముచే గల్గినదో ఆకారణమే బ్రహ్మ మనబడును. అంతేగాని బ్రహ్మ ముపాస నావిషయము గాదు. అనగా ఉపాసన యనునది అంతఃకరణము యొక్క వ్యాపారవిశేషమేగాన బ్రహ్మ మంతఃకరణవిషయ మెంత మాత్రమును గాదు.

శ్రు॥ యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపం యదస్య త్వం యదస్య దేవేషు అథను మీమాంస్య మేవ తే మన్యే విదితమ్.

తా॥ నీవు బ్రహ్మమును బాగుగా తెలిసికొంటి ననితలచితివేని నీ వతిస్వల్పముగానే తెలిసికొంటివని యర్థము. ఏలననగా నీబుద్ధికి గాని ఇంద్రియములకుగాని గోచరముగాబోని విశేషమగుబ్రహ్మమును నీ వెట్లు తెలిసికొనగలిగితివి? కాన నీవు నీదేహేంద్రియాదికమున కంతకును కారణమైనదానినిగా బ్రహ్మమును తెలిసికొనుటయేగాక దేవాదిదేహములకుగూడ కారణమైనదానినిగా తెలిసికొనవలయును. అంతేగాని ఇంద్రాదిదేవతలవలె నొకానొకదేవతావిశేషమే బ్రహ్మ మని నీవు తెలిసికొన్నయెడల నీకు బ్రహ్మ మతిస్వల్పముగానే తెలిసిన దనవలెను. ఇంకను నీవు గురూపదిష్టరీతిని శాస్త్రయుక్తులతో ననుభవమొనర్చుకొని సచ్చిదానందరూప మగునీప్రత్యగాత్మయే పర బ్రహ్మమని తెలిసికొనవలయును.

శ్రు॥ నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చ
యో న స్తద్వేద తద్వేద నో న వేదేతి వేద చ.

తా॥ పైవిధ మగునుపదేశమును చక్కగా అనుభవమొనర్చు కొన్నశిష్యు డిట్లు పలుకుచున్నాడు "నేను బ్రహ్మమును చక్కగా తెలిసికొంటినని తలచుటలేదు. తెలిసికొంటిననిగాని తెలిసికొనలేదని గాని చెప్పను. నావంటిశిష్యులలో నెవ్వడైనను నేను చెప్పినదాని యభిప్రాయమును పుష్కలముగా గ్రహించినచో వాడు బ్రహ్మ విదుడే యగును." దీనియభిప్రాయమే "అన్యదేవ త ద్విదితా దథో అవిదితా దధి" అను ఆచార్యోక్తమంత్రాభిప్రాయము.

శ్రు॥ యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్.

తా॥ ఏబ్రహ్మవేత్తకు బ్రహ్మము తెలియబడలే దనునిశ్చయ ముండునో వాడే బ్రహ్మవిదుడు. ఎవనికి బ్రహ్మము తెలియబడిన

దనునిశ్చయ ముండునో వాడు బ్రహ్మవిదు డనబడనేరడు. అనగా తెలియబడువస్తువులు, ఇంద్రియమనోబుద్ధ్యాదికమే యగునుగాన విదిక్రియకు కర్మ యగునది ఆత్మ ఎంతమాత్రము గాదు. కాన నట్లు గ్రహించినవాడు బ్రహ్మవిదు డనబడనేరడు.

శ్రు॥ ప్రతిబోధవిదితం మత మమృతత్వం హి విందతే
ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతేఽమృతమ్.

తా॥ బ్రహ్మస్వరూపము ప్రతిబుద్ధివృత్తియందును ప్రతీంద్రియ వృత్తిచే గలుగువిజ్ఞానమందును సాక్షిగా నుండున ట్లెవరు గ్రహించిరో వారు మోక్షము నొందుదురు. ఐశ్వర్య, మణి, మంత్ర, ఔషధ, తపో, యోగాదులవలన కలిగినసామర్థ్యముచే మృత్యువు ననగా జననమరణప్రవాహరూప మగుసంసారము నతిక్రమింప వీలుగాదు. ఆత్మరూప సాక్షాత్కారముచేతమాత్రమే సంసారము నతిక్రమింప వీలగును. ఇంతేగాక బ్రహ్మవేత్త తాను మోక్షము నొందుటయే గాక సర్వజగత్తునకు తానే ప్రేరకుడును నైయున్నాడు.

## ఛాందోగ్యోపనిషత్తు

శ్రు॥ శ్వేతకేతు ర్హారుణేయ ఆస. తగ్ంహ పితోవాచ. శ్వేతకేతో వస బ్రహ్మచర్యం నవై సోమ్య అస్మత్కులీనోఽన నూచ్య బ్రహ్మబంధురివ భవతి.

తా॥ ఆరుణి యనువానికుమారుడు శ్వేతకేతు వనువాడుండెను. వానినిగూర్చి తండ్రి ఇట్లు పలికెను. ఓయీ మనవంశమందెవరును వేదవిద్యాభ్యాస మొనర్పనివారు లేరుగాన నీవు బ్రహ్మచారివై వేదాభ్యాస మొనర్పుము.

శ్రు॥ సహ ద్వాదశవర్ష ఉపేత్య చతుర్విగ్ంశతివర్ష స్సర్వాన్వేదా నధీత్య మహామనా అనూచానమాన స్తబ్ధ ఏయాయ. తగ్ంహ పితోవాచ.

తా॥ ఆ శ్వేతకేతు వంతట పన్రెండు సంవత్సరముల వయస్సు గలవాడై గురుకులమునకు వెళ్ళి 24 సంవత్సరముల వయస్సు వచ్చువరకు గల 12 సంవత్సరముల కాలములో గురుకులమునందు వేదాధ్యయన మొనర్చి యంతమాత్రముచేతనే నేనే గొప్పవిద్వాంసుడ నను నహంకారముతో తండ్రియొద్దకు తిరిగివచ్చెను.

ఆతండ్రి వానితో నిట్లు పలుకుచున్నాడు.

శ్రు॥ శ్వేతకేతో యన్ను సోమ్యేదం మహామనా అనూచాన మానీ స్తబ్ధోసి. ఉత త మాదేశ మ ప్రాక్ష్యః. యేనాశ్రుతం శ్రుతం భవతి. అమతం మతం అవిజ్ఞాతం విజ్ఞాతమితి.

తా॥ ఓ శ్వేతకేతూ! నీవు మహాగర్వముతో నున్నట్లు కనుపించుచున్నావు. ఎట్టివిద్య నభ్యసించుటచే ప్రపంచమందలి సర్వపదార్థములు సర్వేంద్రియములద్వారా గోచరించునో అట్టివిద్యను గురువుగారి నడిగి తెలిసికొంటివా? అని ప్రశ్నించెను.

శ్రు॥ కథంను భగవ స ఆదేశో భవతీతి.

తా॥ ఈవాక్యము శ్వేతకేతువున కసంగతముగా తోచి, "ఓ పూజ్యు డగుతండ్రీ! మీరు న న్నడిగినప్రశ్నవిషయము నే నేగురువులను అడుగలేదు. నాకది అసంగతముగా తోచుచున్నది. కాన ఆవిషయ మెట్లు సంభవించుట కర్హమైయుండునో తమరే చెప్పు"డని ప్రార్థించెను.

శ్రు॥ యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతగ్ం స్యా ద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్.

తా॥ ఓ ప్రియమైన శ్వేతకేతూ! కారణద్రవ్య మొక్కటి తెలియబడునో తత్కార్యద్రవ్యము లన్నియు తెలియబడును. ఒక్క మృత్తికయొక్క స్వరూపాదికము తెలిసినపుడు తత్కార్యము లగు

ఘటశరావాదిభేదము లన్నియు తెలియబడునుగదా. కారణమగు మృత్తికకును, కార్యములగు ఘటశరావాదులకును నామభేదము, రూపభేదము మాత్రమే; గాని పదార్థగుణము లన్నియు సమానమగు చున్నవిగదా. ఘటాదికార్యములు సృష్టింపబడుటకు పూర్వమందు కారణ మగుమృద్రూపములే. స్థితికాలమందును మృద్రూపములే. లయకాలమందుగూడ తమకారణ మగుమృత్తికయందే లయమగును గాన కారణవస్తువు నిత్యముగా నుండును. కార్యవస్తువు లనిత్యము లుగా నుండును. ఇట్లింకను ఉదాహరణము లిచ్చి తిరిగితిరిగి ఈవిష యమునే తండ్రి బోధింపగా నాశ్వేతకేతు విట్లు పలుకుచున్నాడు.

శ్రు॥ నవై నూనం భగవంత స్త ఏత దవేదిషుః యద్ధ్యేత దవేదిష్య న్కథం మే నావక్ష్య న్నితి భగవాం స్త్వేవ మే త ద్బ్రవీ త్వితి తథా సోమ్యేతి హోవాచ.

తా॥ ఓతండ్రీ! నాకు వేదవిద్యాధ్యాపన మొనర్చినగురువు లీవిషయము తెలిసియున్నవారుకారని తలచెదను. వా రట్లు ఈవిష యము తెలిసినవారైనచో నాకు బోధించియేయుందురని తలచెదను. గాన మీరే ఈవిషయము నాకు పూర్తిగా బోధింపుడని తనకు పూర్వమున్నగర్వమును విడిచి సవినయముగా ప్రార్థించెను. అప్పు డాతండ్రి యిట్లుపదేశింపదొడగెను.

శ్రు॥ సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయమ్.

తా॥ ఓయీ ఈ జగత్తంతయు సృష్టికి పూర్వకాలమందు సజాతీయవిజాతీయస్వగతభేదములు లేని సద్వస్తువై యొక్కటిగానే యుండెను.

శ్రు॥ తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి. త త్తేజోఽ సృజత. త త్తేజ ఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి. త దపోఽసృజత. తా ఆప ఐక్షంత. బహ్వ్యస్స్యామ ప్రజాయేమహీతి. తా అన్న మసృజంత.

తా॥ ఆ సద్వస్తువు తాను బహురూప మగునట్లు సంకల్పించి, తేజస్సును సృష్టించెను ఆ తేజస్సు బహురూప మగుటకు సంకల్పించి ఉదకమును సృజించెను. ఆయుదకములు బహురూపులగుటకు సంకల్పించి యన్నమును సృజించెను.

శ్రు॥ సేయం దేవతైక్షత, హంతాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవేన ఆత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి.

తా॥ అంతట నాసద్వస్తు విట్లు తలచెను. "నే నీ తేజస్సు, ఉదకము, అన్నము, అనునీమూడు దేవతలను నాస్వరూప మగు ఈజీవభావముతో ప్రవేశించి నామరూపాదులద్వారా విస్తృత మొనర్చుదునుగాక" యని.

శ్రు॥ తాసాం త్రివృతం త్రివృతం ఏకైకాం కరవాణీతి సేయం దేవతా ఏతా స్తిస్రో దేవతా అనేనైవ జీవే నాత్మనాను ప్రవిశ్య నామరూపే వ్యాకరోతి.

తా॥ ఆసద్వస్తు వట్లు తలచి తనఆత్మరూప మగుజీవభావముతో నా తేజోఽబన్నములందు ప్రవేశించి వాని నీమూటిని పరస్పరసంబద్ధములగునట్లుగా నొనర్చెను. ఎట్లనగా తేజస్సులోని సగభాగమును, ఉదకములోని నాల్గవభాగమును అన్నములోని నాల్గవభాగమును కలిపి దానికి త్రివృత్కృతతేజస్సని పేరిడెను అట్లే ఉదకమందలి సగభాగమును తేజస్సులోని నాల్గవభాగమును అన్నములోని నాల్గవభాగమును కలిపి దానికి త్రివృత్కృతోదకమని పేరిడెను. అట్లే అన్నములోని సగభాగమును తేజస్సులోని నాల్గవభాగమును ఉదకములోని నాల్గవ భాగమును కలిపి దానికి త్రివృత్కృతాన్నమని పేరిడెను.

శ్రు॥ య దగ్నే రోహితగ్ం రూపం తేజస స్తద్రూపం య చ్ఛుక్లం తదపాం, య త్కృష్ణం త దన్న స్య. అపాగా దగ్నే రగ్నిత్వం, వాచారంభణం వికారో నామధేయం. త్రీణి రూపాణీత్యేవ సత్యమ్.

తా॥ త్రివృత్కృతము లగుపై మూఁడుభూతములే యీప్రపంచము. ఆభూతములకంటె వేరుగా జగత్తు లేదు. ఈలోకమందు ప్రసిద్ధ మగునగ్నియం దెఱ్ఱగా నుండురూపము తేజస్సుయొక్క రూపము. తెల్లగా నుండుభాగ ముదకముయొక్క రూపము. నల్లగా నుండుభాగ మన్నముయొక్క రూపము. ఈమూఁడు రూపములకంటె వేరుగా నగ్ని యనెడునామమును, అగ్ని యను ద్రవ్యమును వాగ్వికారమాత్రమేగాన అనృత మగుచున్నది. కాన కార్యజాత మంతయు కారణముకంటె నతిరిక్తమైనది గాదు. కారణ జ్ఞానముచే కార్యవిశేషము లన్నిటియొక్క పరిజ్ఞానమును కలుగుచున్నది. ఇట్లే సర్వకారణకార్యరూపములను గ్రహింపవలయును.

శ్రు॥ ఏతద్ధస్మవై తద్విద్వాగ్ంస ఆహుః పూర్వే మహాశాలా మహాశ్రోత్రియా. న నోఽద్య, కశ్చనాశ్రుత మమత మవిజ్ఞాత ముదాహరిష్యతీతి హ్యేభ్యో విదాంచకుః.

తా॥ ఇట్టికార్యకారణస్వరూపధర్మాదులను శ్రుత్యుక్తరీతితో గ్రహించినపెద్ద లందరు పూర్వకాలికగృహస్థులును బహుశ్రుతాధ్యయనసంపత్తి గలవారునయి మహాభూతధర్మములై యుండెడి ఎఱుపు, తెలుపు, నలుపు- అనుమూఁడురూపములవలననే సర్వజగద్వస్తుస్వరూపములను పుష్కలముగా నిశ్చయించిరి. కనుక ప్రాచీనులుగాని యేతత్కాలీనులుగాని యెవరైనను శ్రవణముచేయబడని దానిని మననముచేయబడనిదానిని నిదిధ్యాసచే నిశ్చయింపబడని దానిని ఇట్లు తా మనుభవించనివస్తువు నితరులకు బోధించుట లేదు.

శ్రు॥ లవణ మేత దుదకేఽవధాయాథ, మా ప్రాత రుపసీదథా ఇతి. స హ తథా చకార. తగ్ంహోవాచ, యద్దోషా లవణ ముదకేఽవాధా, అంగ తదాహరేతి. తద్ధావమృశ్య న వివేద, యథా విలీన మేవాంగ.

తా॥ పై సిద్ధాంత మతనికి సుబోధమగుట కిట్లుదాహరణము ప్రదర్శింపబడుచున్నది. ఓ శ్వేతకేతూ ! ఘనీభవించిన ఈయుప్పును

నీటికుండలో వేసి, ఈరాత్రియంతయు నుంచి రేపు ప్రాతఃకాలమందు నాయొద్దకు తీసికొనిరమ్మని పలికెను. ఆత డట్లొనర్చి ప్రాతఃకాలమందు తిరిగి రాగా అపు డాశ్వేతకేతువునుగూర్చి తండ్రి "రాత్రి నీ వుదకమం దుంచినలవణమును తీసికొనిరమ్మ"ని కోరగా నాతడు ఆకుండలో వెదకి లవణమును గానక విచారపడుచుండగా తండ్రి వానికి దర్శన, స్పర్శములకు గోచరముగాకపోయినంతమాత్రముచేత నాకుండలో లవణము లేదనుటకు ఏలులేదనుచు, ఆయుదకమందు లవణ మున్నదని యాశ్వేతకేతువునకు బోధింపదలచి యిట్లు పలికెను.

శ్రు॥ అస్యాంతా దాచామేతి. కథమితి? లవణమితి. మధ్యా దాచామేతి, కథమితి? లవణ మిత్యంతా దాచామేతి, కథమితి? లవణమితి అభిప్రాశ్యైత దథ మోపసీదథా, ఇతి. తద్ధ, తథాచకార. త చ్ఛశ్వ త్సంవర్తతే. తగ్ంహోవా చాత్ర వావ కిల, సత్సోమ్య, న నిభాలయసేఽత్రైవ కిలేతి.

తా॥ ఈ ఘటోదకములో పైభాగము నాచమనమొనర్చి యెట్లున్నదో చెప్పుమనగా నాశ్వేతకేతు వట్లొనర్చి యుప్పగా నున్నదనెను. తిరిగి తండ్రి ఆఘటోదకమధ్యభాగమునుండి యాచమన మొనర్చి యెట్లున్నదో చెప్పుమనగా నాతడు లవణముగా నున్నదనెను. తిరిగి యాఘటోదకమందలి అడుగుభాగములోనుండి ఆచమన మొనర్చి యెట్లున్నదో చెప్పుమనగా లవణముగానున్నదని శ్వేతకేతువు బదులుచెప్పెను. ఈ ప్రకార ముదకమందు విలీనమై దర్శన, స్పర్శనాదులకు గోచరముగాకపోయినను లవణముయొక్క స్వరూపము జిహ్వచే గ్రహింపబడినట్లు సర్వజగత్కారణభూతమైన అధిష్ఠానసత్త వలన,ఉత్పన్నమైయుండెడి తేజోఽబన్నము లనుమహాభూతములయొక్క వికార మయిన దేహేంద్రియసంఘాతమునందు లీనమై సూక్ష్మరూపముగా వ్యాపించియుండెడి సద్వస్తువుయొక్క స్వరూపమును బాహ్యేంద్రియములచేతను మలిన మగుమనస్సుచేతను తెలిసికొనుటకు శక్యముగానంతమాత్రముచే సద్వస్తువు లేదనరాదు. లవణత్వము త్వగింద్రియ, చక్షురాదీంద్రియములకు గోచరము గాకపోయినను

జిహ్వేంద్రియమునకు గోచరమయినట్లు ఈసద్వస్తువుగూడ వివేక వైరాగ్యములతోగూడి శాస్త్రాచార్యోపదేశముల నొందిన పరిశుద్ధ మగు నంతఃకరణముచే తెలియదగియున్నది.

అని శ్వేతకేతువున కుద్దాలకు డనుతండ్రి బోధించెను.

శ్రు॥ స య ఏషోఽణి మైతదాత్మ్య మిదం సర్వం త త్సత్యం
స ఆత్మా త త్త్వ మసి శ్వేతకేతో ఇతి.

తా॥ పూర్వమంత్రమందు నిరూపింపబడినప్రకారము సమస్త ప్రపంచమును వ్యాపించియుండి మలినమగు అంతరింద్రియ బాహ్యేంద్రియములకు గోచరము గాకుండెడిస్వరూపము గలసద్వస్తు వేది గలదో అదియే సర్వజగదధిష్ఠానసత్తామాత్ర మైనకారణము, ఈసర్వ ప్రపంచమును ఆసత్తామాత్రస్వరూపమే అయియున్నది. అదియే కూటస్థము నిర్వికారము సత్యము జ్ఞానము ఆనందము అనంతము ఆత్మ బ్రహ్మ యనుశబ్దములచే బోధింపబడును. అదియే సర్వదేహేంద్రియవృత్తులకు సాక్షిగా నుండునది. అట్టి కర్తృత్వాద్యుపహితవిజ్ఞాన సాక్షిస్వరూపమే నీవు. అని ఉద్దాలకు డుపదేశింప శ్వేతకేతు వింకను సందేహము వీడక యిట్లనెను.

శ్రు॥ భూయ ఏవ మా భగవా న్విజ్ఞాపయ త్వితి తథా సోమ్యేతి హోవాచ.

తా॥ ఓ పూజ్యుడా! తిరిగి ఈవిషయము నా కింకను సుబోధ మగునట్లు వివరించి బోధింపు డని ప్రార్థింప నాయుద్దాలకు డిట్లుప దేశింప గడంగెను.

శ్రు॥ యథా సోమ్య పురుషం గంధారేభ్యోఽభినద్ధాక్షమానీయ తం తతోఽతిజనే విసృజే త్స యథా తత్ర ప్రాఙ్వోద ఙ్వాధరాఙ్వా ప్రత్యఙ్వా ప్రధ్మాయీతాభినద్ధాక్ష ఆనీతోఽభినద్ధాక్షో విసృష్టః.

తా॥ గంధారదేశసంబంధి యగుపురుషు నొకని చోరులు పట్టుకొని కన్నులు కనుపడకుండునంతగట్టిగా గంతలుగట్టి పాశబద్ధుని చేసి గాంధారదేశములోనుండి కొనివచ్చి ఇతరదేశమం దొక అరణ్యప్రదేశమందు విడిచి వెళ్ళిపోయిరి. అంత నాపురుషుడు దీనుడై తనస్థితిని వర్ణించుచు ఆక్రోశించుచుండెను.

శ్రు॥ తస్య యథాభినహనం ప్రముచ్య ప్రబ్రూయా దేతాం దిశం గంధారా ఏతాం దిశం వ్రజేతి స గ్రామాద్గ్రామం పృచ్ఛన్పండితో మేధావీ గంధారానే వోపసంపద్యే తైవమే వే హాచార్యవా న్పురుషో వేద. తస్య తావదేవ చిరం. యావ న్న విమోక్ష్యేఽథ సంపత్స్య ఇతి.

తా॥ ఓ శ్వేతకేతూ! అట్లు సింహవ్యాఘ్రచోరాదిసంకుల మగుమహారణ్యమందు తనబంధమును విడిపించి తనస్వస్థానమునకు తాను వెళ్లుమార్గము నెవరైన నుపదేశింతురా యను నాక్రోశముతో నున్నయాపురుషునకు అదృష్టవశమున నొక మహాపురుషు డగుపడి వానిబంధముల నూడదీసి కళ్ళు తెరపించి వానిస్వస్థాన మగుగాంధార దేశమునకు పోవుమార్గము నుపదేశింపగా నాపురుషు డావాక్యము వలన స్వదేశమార్గమున పోవుచు త్రోవలో నొకగ్రామమునుండి మరియొకగ్రామమునకు పోవుచు కనుపించినవారిని గాంధారదేశమునకు త్రోవనడుగుచు తనబుద్ధిబలముచే క్రమముగా స్వదేశమునకు చేర గలుగును.

ఇట్లే తనపుణ్యపాపకర్మఫల మనుదొంగలచే అవిద్యామోహ పటముచే బంధింపబడినవస్తుదృష్టి గలిగి అధిష్ఠానసన్మాత్రబ్రహ్మ స్వరూపస్థితినుండి పరిచ్యుతుడై ఆకాశాదిభూతపంచకవికారమైన ట్టియు వాత పిత్త కఫాది దోషయుక్తమును చర్మ మాంస రుధిర మేదో మజ్జాస్థిస్నాయువు లనుసప్తధాతువు లనెడి దుష్టమృగ సంకులంబును శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములతో నొప్పియున్న ఈ దేహ మనెడి యరణ్యమందు ప్రవేశింపబడి దార పుత్ర

మిత్ర, పశు, బంధు, ధన, క్షేత్రారామాదులందలి తృష్ణ యనెడి పాశముచే నిరోధింపబడి తనయందు మనుష్యత్వ, బ్రాహ్మణత్వ, గృహస్థత్వాదిధర్మముల నారోపించుకొని నాకు వీరు బంధువులు, వీరు శత్రువులు నేను సుఖము ననుభవించుచున్నాను. దుఃఖము ననుభవించుచున్నాను. నేను మూఢుడ నైతిని. నేను పండితుడను, ధార్మికుడను, బాల్యయౌవనాద్యవస్థల నొందితిని, నాకు ధననష్టము గలిగెను. నే నేవిధముగా జీవించెదను? నా కేమిగతి? నా కెవరు రక్షకులు? అని దీనుడై మొరపెట్టుచు కొంతకాలమునకు పూర్వజన్మపుణ్యవిశేషమున దయామయుడును బ్రహ్మస్వరూపనిష్ఠచే ముక్తబంధనుడునగు సద్గురువుయొక్క అనుగ్రహమునకు పాత్రుడై వారిశుశ్రూష చేసి వేదాంతవాక్యశ్రవణ మొనర్చి అందలి మహావాక్యములవలన. కర్తృత్వాదిసంసారధర్మము నీకు లేదనియు సర్వప్రపంచాధిష్ఠానసత్తామాత్రమై యుండెడి అద్వితీయబ్రహ్మస్వరూపమే నీవై యున్నావనియు బోధింపబడి యవిద్యామోహపటమునుండి విముక్తుడై మిథ్యాజ్ఞానకల్పితమై యుండెడి ఐహికాముష్మిక, భోగవిషయములందు విరక్తిని బొంది, అహంకారాదిసర్వవృత్తులకును సాక్షియై యుండెడి నిర్వికారాసంగచిద్రూప, ప్రత్యగాత్మస్వరూపమును కూటస్థాద్వితీయాఖండైకరసపరిపూర్ణబ్రహ్మమాత్రమే తానని గ్రహించి తనస్వస్వరూపముతో కేవలనిరతిశయానందానుభవతృప్తుడగుచున్నాడు.

ఈ ప్రకార మాచార్యోపదేశమువలన దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానముతో నిత్యతృప్తుడుగా నుండునాపురుషునకు పూర్వకర్మవాసనారబ్ధ మైనదేహేంద్రియసంఘాతముయొక్క వియోగము కలుగుటతో వాసనాక్షయమై విదేహముక్తి సంభవించును. గనుక ప్రారబ్ధకర్మఫలరూప మగువర్తమానదేహపతనమాత్రమే బ్రహ్మస్వరూపప్రాప్తికి విలంబమగునని "తస్య తావ దేవ చిరం; యావ న్న విమోక్ష్యే అథ సంపత్స్యే" అను శ్రుతియొక్కయభిప్రాయము. కావున సన్మాత్రబ్రహ్మస్వరూపసాక్షాత్కారము గల్గినతరువాత కర్మారబ్ధ మగు

దేహేంద్రియాదిక మారబ్ధకర్మ ననుసరించి ప్రవర్తించుచు ప్రారబ్ధ క్షయమై తర్వాత బ్రహ్మస్వరూపప్రాప్తి యయియుండుటచే తిరిగి దేహసంబంధ ముండదు.

ఇట్లు దృఢాపరోక్షబ్రహ్మసాక్షాత్కారము గల్గినయనంతరము గూడ బ్రారబ్ధము ననుసరించి కర్మక్షయపర్యంత మీ దేహేంద్రియ సంబంధ మున్నదని చెప్పినయెడల ఈజన్మమునందు జ్ఞానోత్పత్తికి పూర్వము చేయబడి అనారబ్ధఫలములై యుండెడికర్మలును ప్రారబ్ధ కర్మవలెనే ఫలసంబంధము కలుగవలసినవిగానే యున్నందున అట్టి కర్మానురూప మైనదేహాంతరము రావలసియుండును. ఇట్లే జ్ఞానోత్పత్త్యనంతర మీ దేహేంద్రియాదికముచే జేయబడెడి, కర్మఫలానుభవనిమిత్తమై మరియొకజన్మమును సంభవింపవలసియుండును. ఇంతే గాక ఈప్రకారము సంభవించుచుండెడి యా యాజన్మలందు చేయబడెడికర్మల కుత్తరోత్తరముగా అవిచ్ఛిన్నజన్మపరంపర ఉండవలసిన స్వర్పడును. అట్టియర్థమునే యంగీకరించుచో—

"తస్య తావదేవ చిరం, యావ న్న విమోక్ష్యే, అథ సంపత్స్యే"

"క్షీయంతే చాస్య కర్మాణి తస్మి న్దృష్టే పరావరే"

ఇత్యాదిశ్రుతులును,

"జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా"

ఇత్యాదిస్మృతులును ఈయర్థము చెప్పుట నంగీకరింపవు.

కావున జ్ఞానప్రాప్తిసమకాలమందే సర్వకర్మక్షయమై సద్రూప బ్రహ్మప్రాప్తి గల్గుననియు, అదియే మోక్షమనియు చెప్పవలెను. ఏలననగా కర్మలలో ప్రవృత్తఫలములని అప్రవృత్తఫలములనియు భేద మున్నది. వానిలో జ్ఞానియొక్క దేహేంద్రియాదికముచే జ్ఞానోత్పత్తికి పూర్వమందును పరమందును చేయబడినకర్మలు జ్ఞానసమకాల మందు ఫలారంభకములై యుండలేదు. కాన నివి అప్రవృత్తము

లనబడును. అట్లే జ్ఞానియొక్క వర్తమానదేహారంభక మగుప్రారబ్ధ కర్మమాత్రము ప్రవృత్తఫలకర్మ యనబడును. కావున ప్రవృత్తఫలక మగుప్రారబ్ధకర్మ, ధనుస్సునందు సంధింపబడి లక్ష్యమును వేధించుటకు విడువబడిన బాణమువలె లక్ష్యవస్తువేధవరకు ప్రయోక్తచే ఉపసంహరింప జేయబడుటకు వీలు లేనట్లనుభవించితీరవలసిన దేగాన జ్ఞానోదయ మైనను ప్రారబ్ధముమాత్రము తప్పక యనుభవించితీరవలసినదే. ఈ అర్థము "భోగేన త్వితరే క్షపయిత్వా" అను బ్రహ్మసూత్రముచే గూడ నిరూఢమగుచున్నది.

ఇక నప్రవృత్తఫలములై యుండు కర్మఫలములగు ఆగామి, సంచితములు ధనుస్సునందు సంధింపబడి లక్ష్యముపై విడువబడనిబాణ మెట్లుపసంహరింప సాధ్యమో అట్లే జ్ఞానముచే నశింపజేయ సాధ్య మగును. ఏలననగా ఆకర్మల నాచరించినసమయమందు దేహాదిక మందు తాదాత్మ్యధ్యాసతో నున్నవాడు కర్త- ఇపుడాతడే తా నకర్తనని దేహాదివిలక్షణుడనని స్థిరనిశ్చయముతో నున్నందున అట్టికర్మఫలములను నశింపజేయగలడు. ఈ అభిప్రాయమునే "క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" ఇత్యాదిశ్రుతు లును "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" ఇత్యాది స్మృతులును బోధించుచున్నవి.

"తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ
అనారబ్ధకార్యే ఏవతు పూర్వే తదవధేః"

ఇత్యాది బ్రహ్మసూత్రములందు యుక్తియుక్తమైనసర్వ శ్రుత్యర్థవిచారణాపురస్సరముగా నీయభిప్రాయమే వివరించి నిశ్చ యింపబడినది.

శ్రు॥ స య ఏషోఽణి మైతదాత్మ్య మిదగ్ం సర్వం. త త్సత్య గ్ం స ఆత్మా. త త్త్వ మసి శ్వేతకేతో ఇతి- భూయఏవ మా భగవా న్విజ్ఞాపయత్వితి, తథా సోమ్యేతి హోవాచ.

తా॥ పూర్వమంత్రమున ఆచార్యోపదేశమూలముగానే తెలియదగినదున్న స్వస్వరూపము నిర్ణయింపబడియున్నదో అదియే సత్తామాత్రబ్రహ్మస్వరూపమై యుండెడి సూక్ష్మార్థమై యున్నది. గనుక ఈ ప్రత్యక్షాదివిషయమై యుండెడిప్రపంచమంతయు ఈ సత్తామాత్ర స్వరూపము గలది. అదియే కూటస్థనిత్యమై యుండెడియబాధిత సత్యస్వరూపము. అదియే అహంకారాదిసర్వవృత్త్యధిష్ఠానమై యుండెడిప్రత్యక్స్వరూపము. అదియే నీవు అని ఉద్దాలకుడు శ్వేతకేతువునకుపదేశింప, నాతడు తిరిగి వివరించిబోధింపు మని ప్రార్థించెను. ఇందలి యాతనియభిప్రాయ మేమనగా ఆచార్యోపదేశమువలన గ్రహించిన ప్రమేయము నేక్రమమున నెట్లు గ్రహించిన బ్రహ్మప్రాప్తి గలుగునో అట్టివిశేషములను తెలియగోరెనని భావము.

అంతట తిరిగి ఉద్దాలకు డిట్లుపదేశింపదొడంగెను.

శ్రు॥ పురుషగ్ం సోమ్యోపతాపినం జ్ఞాతయః పర్యుపాసతే, జానాసి మాం, జానాసి మా మితి, తస్య యావన్న వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణ స్తేజసి, తేజః పరస్యాం దేవతాయాం, తావ జ్జానాతి.

తా॥ ఓ శ్వేతకేతూ! మరణ మాసన్నమైన దనుకొనదగుకాలమందు జ్వరాదికముతో నున్నపురుషుని బంధువులు సమీపించి "న న్నెరుగుదువా? నే నెవరను?" ఇత్యాదిగా ప్రశ్న చేయుచుందురు. ఆజ్వరగ్రస్తుని వాక్కు మొదలగుఇంద్రియములు అంతఃకరణమందును, అది ముఖ్యప్రాణమందును, అది ఉష్ణతారూపముగా శరీరమంతటను వ్యాపించియుండు వైశ్వానరతేజస్సునందును అయ్యది ఈదేహాదిజగత్తంతకును అధిష్ఠానమై కేవలసద్రూప మగుపరదేవతయందును లయము నొందకుండునంతవరకు ఆతడు వారి నందరను గుర్తింపగలడు.

శ్రు॥ అథ యదాస్య వాక్ మనసి సంపద్యతే. మనః ప్రాణే, ప్రాణ స్తేజసి, తేజః పరస్యాం దేవతాయా మథ న జానాతి.

తా॥ ఎపుడు వీనిబాహ్యేంద్రియము లంతరింద్రియమందును. అది ప్రాణమందును, అది తేజస్సునందును, అది పరదేవతయందును లయమగునో అపు డీజ్వరాదిపీడితుడు తనబంధువులను గుర్తింపలేడు.

శ్రు॥ స య ఏషోఽణి మైతదాత్మ్య మిదగ్ం సర్వం తత్సత్యం స ఆత్మా, తత్త్వ మసి శ్వేతకేతో ఇతి- భూయఏవ మా భగవా న్విజ్ఞాపయత్వితి. తథా సోమ్యేతి హోవాచ.

తా॥ ఈ క్రమమున సర్వేంద్రియవృత్తులకును అధిష్ఠానమైన దేవతాస్వరూప మేదియో అదియే సర్వజగత్కారణత్వోపలక్షిత సత్తామాత్రమగుసూక్ష్మవస్తువగు బ్రహ్మమగుచున్నది ఇదియే ఈ జగత్తంతకును నిజరూపము. అదియే అబాధిత నిత్యస్వరూపము. కర్తృత్వ భోక్తృత్వ ధర్మోపలక్షితజీవాధిష్ఠాన మదియే. నీవుగూడ అదియే- అని ఉద్దాలకుడు బోధింపగా నాశ్వేతకేతువునకు ఇట్లు వాగాది సకలేంద్రియవృత్తులును సన్మాత్రమునందు లయించుట, జ్ఞానికిని, అజ్ఞానికిని సమమైయుండగా జ్ఞానికిమాత్రము పునరావృత్తి లేకుండుటకును, అజ్ఞానికి తిరిగి దేహాంతరప్రాప్తికిని గలకారణము గోచరింపక తెలిసికొనగోరి తండ్రిగారిని తిరిగి ఆవిషయమును బోధింపుమని ప్రార్థించెను- ఉద్దాలకు డిట్లు చెప్పదొడంగెను.

శ్రు॥ పురుషగ్ం సోమ్యోత హస్తగృహీత మానయం త్య పహార్షీత్ స్తేయ మకార్షీ త్పరశు మస్మై తపతేతి. స యది తస్య కర్తా భవతి, తత ఏవానృత మాత్మానం కురుతే, సోఽనృతాభిసంధోఽనృతే నాత్మాన మంతర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి. స దహ్యతే. అథ హన్యతే.

తా॥ లోకమందు, దొంగతనము చేసియుండవచ్చునను సంశయమున కాస్పదమగు మనుజుని రాజభటులు పట్టుకొనిపోయి దండాధికారి సమీపమున నొకఇనుపగొడ్డలిని ఎఱ్ఱగాకాల్చి, దానిని పట్టుకొను

మని ఈదొంగగా నూహింపబడిన మనుష్యున కాజ్ఞాపింపగా, నాతడట్లు పట్టుకొనవలయును. అది వీనిని తగులపెట్టెనచో, ఆపురుషుడు దొంగితన మొనర్చుట నిజముగాన, నాతడు దొంగయని నిర్ణయింపబడి, శిక్షింప బడును.

శ్రు॥ అథ యది తస్యాకర్తా భవతి, తత ఏవ సత్య మాత్మా నం కురుతే, స సత్యాభిసంధ స్సత్యే నాత్మాన మంతర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి, స న దహ్యతే. అథ ముచ్యతే.

తా॥ వాడు, తప్తపరశువును గ్రహించి, ఎట్టిబాధను పొందని యెడల వాడు దొంగ కాడని నిర్ణయించి వానిని స్వేచ్ఛగా వదలి పెట్టెదరు.

శ్రు॥ స యథా తత్ర న దాహ్యేత ఐతదాత్మ్య మిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా, తత్త్వ మసి శ్వేతకేతో ఇతి, తద్ధాస్య విజజ్ఞావితి విజజ్ఞావితి.

తా॥ పైయుదాహరణములోవలె ఒకేతప్తపరశువు, సత్యా ములను నిర్ణయించి, దొంగను తగులపెట్టుట దొంగకానివానిని తగుల పెట్టకపోవుట ఎట్లు సిద్ధముగుచున్నదో అట్లే వాగాదిసకలేంద్రియవృత్తు లును సద్వస్తువునందు లయమొందుట జ్ఞానికిని అజ్ఞానికిని సమాన మైనను అజ్ఞాని అసత్యములగు దేహేంద్రియాదులందు తాదాత్మ్య ముతో వ్యవహరించుచున్నందున తిరిగి దేహసంబంధముచే జన్మ మరణాదికము నొందుచున్నాడు. జ్ఞాని సత్య, జ్ఞాన, అనంత, ఆనంద రూపమే తాననునిశ్చయముతో నున్నందున నాతడు అసత్య, జడ, దుఃఖ, పరిచ్ఛిన్నరూప మగుదేహసంబంధము నెన్నటికిని పొందడు.

# అధర్వణ వేదము

## — మాండూక్యోపనిషత్తు —

### ప్రణవ విచారము

శ్రు॥ ఓ మిత్యేత దక్షర మిదగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానం భూతం భవ ద్భవిష్యదితి సర్వ మోంకారఏవ, యచ్చాన్య త్త్రికాలాతీతం తద ప్యోంకారఏవ.

తా॥ ప్రణవమన ఓంకారము. ఈఅక్షరము బ్రహ్మవాచకమును బ్రహ్మమును అగుచున్నది. ఈ పరిదృశ్యమానరూపమగు చరాచరప్రపంచము అంతయు నీ ప్రణవమే.

గతించినట్టి జరుగుచున్నట్టి జరుగబోవునట్టి కాలములందలి ప్రపంచ మంతయు ప్రణవమే.

భూతభవిష్యద్వర్తమానకాలత్రయము నతిక్రమించినట్టి అవ్యాకృతముగూడ నీప్రణవమే.

శ్రు॥ సర్వగ్ హ్యేత ద్బ్రహ్మయ మాత్మా బ్రహ్మ సోఽయ మాత్మా చతుష్పాత్.

పరిదృశ్యమానప్రపంచ మంతయు పరబ్రహ్మము,. ఈజీవాత్మయే పరబ్రహ్మము. ఆఓంకారాభిధేయుడు పరాపరస్వరూపుడు నగునీయాత్మ నాల్గుపాదములు గలవాడు.

### ప్రథమ పాదము

శ్రు॥ జాగరితస్థానో బహిః ప్రజ్ఞ స్సప్తాంగ ఏకోనవింశతిముఖః స్థూలభు గ్వైశ్వానరః ప్రథమః పాదః.

తా॥ జాగరితమే స్థానముగా గలిగినట్టియు, అవిద్యాకృతమైనట్టియు, బాహ్యవిషయమునందు జ్ఞానము గల్గినట్టియు, ఏడవయవములు గల్గినట్టియు (1) శిరస్సు = ద్యులోకము (2) నేత్రము =

సూర్యుడు, (3) ప్రాణము = వాయువు, (4) సందేహము = ఆకాశము లేక దేహమధ్యభాగము, (5) పొత్తికడుపు = అన్నము, (6) పాదములు = భూమి, (7) ముఖము = అహవనీయాగ్ని. ఇవి సప్తాంగములు 7.

19 పందొమ్మిది ముఖములు అనగా.

| | | |
|---|---|---|
| 1. | త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణము | 5 |
| 2. | వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ | 5 |
| 3. | ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము | 5 |
| 4. | మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము | 4 |

అను నివియే 19 ముఖములు.

ఇట్టిస్థూలము లగుశబ్దాదివిషయముల ననుభవించుచున్నవాడు శ్వానరుడు.

2 ద్వితీయ పాదము

శ్రు॥ స్వప్నస్థానోఽంతఃప్రజ్ఞ స్సప్తాంగ ఏకోనవింశతిముఖః ప్రవివిక్తభు క్తైజసో ద్వితీయః పాదః.

తా॥ స్వప్నమే స్థానముగాగలవాడును అంతఃప్రజ్ఞ గలవాడును. సప్తాంగములు గలవాడును, పందొమ్మిదిముఖములు గలవాడును, వాసనామాత్రసూక్ష్మప్రజ్ఞయే భోగముగా గలవాడును తైజసుడు.

3 తృతీయ పాదము

శ్రు॥ యత్ర సుప్తో నకంచన కామం కామయతే నకంచన స్వప్నం పశ్యతి త త్సుషుప్తం. సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభు క్చేతోముఖః ప్రాజ్ఞ స్తృతీయః పాదః

తా॥ ఏ స్థానమునందు సుషుప్తిని పొందినవాడై ఏకోరికను కోరడో ఏస్వప్నమును చూడడో అది సుషుప్తము. సుషుప్తియే స్థానముగా గలవాడును, ఏకరూపము గలవాడును ఘనీభవించిన ప్రజ్ఞ గలవాడును, ఆనందమయుడు, ఆనందము ననుభవించువాడును (ఇది స్థూలము, ఇది సూక్ష్మము అనెడి భేదము లేక అవ్యాకృతమై గాఢాంధకారమగ్న మగుప్రపంచసమన్విత మగుఅహస్సు స్వకీయరూప మగుమనోబుద్ధ్యాదిసాధనములను వదలక కారణరూపమును అజ్ఞానావస్థను పొందినజీవుడు. ఏకీభూతుడు) చేతోముఖుడు (స్వప్నజాగ్రత్ప్రతిబోధరూపచైతన్యమే ముఖముగా గలవాడు కావున చేతోముఖుడు లేక స్వప్నజాగ్రిదవస్థలనుగూర్చి వచ్చుట పబోధలక్షణ మగుచైతన్యమే ద్వారముగాగలవాడు కావున చేతోముఖుడు) నగు ప్రాజ్ఞుడు.

4 చతుర్థ పాదము

శ్రు॥ ఏష సర్వేశ్వర ఏషసర్వజ్ఞ ఏషో న్తర్యా మ్యేష యోని స్సర్వస్య ప్రభవాప్యయౌహి భూతానామ్,

తా॥ ఈ ప్రాజ్ఞుడు సాధిదైవిక మగుభేదజాతమున కంతకు నీశ్వరుడు లేక చైతన్యప్రధానుడయి స్వరూపమందున్న యీప్రాజ్ఞుడే సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు. మరియు భూతములయొక్క అంతఃకరణబుద్ధి గుహాయందు ప్రవేశించి ఆభూతములను నియమించువాడు. ఈప్రాజ్ఞుడు సమస్తమునకు కారణము. ఈప్రాజ్ఞుడు సకలప్రాణులకు నుత్పత్తి లయములకు స్థానభూతుడు.

శ్రు॥నాన్తఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞం అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్యమలక్షణ మచింత్య మవ్యపదేశ్య మైకాత్మ్యప్రత్యయసారం ప్రపంచోపశమం శాన్తం శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః.

తా॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాతీతుడైన తురీయుడగు ఆత్మ అంతఃప్రజ్ఞ కలవాడు కాడనియు, బాహ్యప్రజ్ఞ గలవాడు కాడనియు, జాగ్రత్స్వప్నావస్థలకు మధ్యభాగావస్థయం దుండు ప్రజ్ఞ గలవాడు కాడనియు, ప్రజ్ఞానఘనమయినవాడు కాడనియు ఒకేపర్యాయము సర్వవిషయప్రజ్ఞ గలవాడు కాడనియు, చైతన్యరహితుడైనవాడు కాడనియు, జ్ఞానేంద్రియములకు గోచరింపనివాడనియు, వ్యవహారమునకు యోగ్యత లేనివాడనియు, గురుతులు లేనివాడనియు, ఊహింపనలవిగానివాడనియు, చింతింప నలవికానివాడనియు, శబ్దములచేత చెప్పవీలులేనివాడనియు, జాగ్రత్స్వప్నసుషుప్త్యాది స్థానములం దీయాత్మ యొక్కడే యనెడి యచంచల జ్ఞానముచేత అనుసరింపదగినవాడనియు, జాగ్రదాదిరూపప్రపంచవిరహితమైనవాడనియు, శాంతమైన వాడనియు, కల్యాణస్వరూపుడనియు, భేదవికల్పరహితుడనియు, అంతట వ్యాపించి ప్రకాశించుచుండువాడనియు, తలంపవలెను. తురీయుడగు నిట్టి యాత్మయే తెలిసికొనదగినవాడు.

ప్రణవం హీశ్వరం విద్యా త్సర్వస్య హృది సంస్థితమ్
సర్వవ్యాపిన మోంకారం మత్వా ధీరో న శోచతి.

తా॥ ప్రణవమును సర్వజీవులయందును అంతర్యామిరూపముగా నుండి బుద్ధీంద్రియాదివృత్తులకు ప్రేరకుడై సాక్షిగానుండు పరబ్రహ్మముగా తెలిసికొనిన విద్వాంసుడు జననమరణాది సంసారదుఃఖము నొందడు.

కారి॥ అమాత్రోఽనంతమాత్రశ్చ ద్వైత స్యోపశమ శ్శివః
ఓంకారో విదితో యేన సముని ర్నేతరో జనః.

తా॥ మాత్ర యనగా ఉచ్చారణకాలము. అట్టిమాత్ర లేనిదియు అనంతమగు మాత్రగలదియు, ద్వైతమగుప్రపంచమున కుపశాంతికరమైనదియు, సుఖకరమైనదియు నగుప్రణవము నెవరు గుర్తింతురో వారు మును లనబడుదురు. ఇంతేగాక ఇందలిఅవయవములయభిప్రాయ మిట్లు వివరింపబడినది.

అకారో నయతే విశ్వ ముకారశ్చాపి తైజసమ్
మకారశ్చ పునః ప్రాజ్ఞం నామాత్రే విద్యతే గతిః.

తా॥ స్థూలదేహమందు తాదాత్మ్యాభిమాని యగుజీవుడు విశ్వుడనియు సూక్ష్మదేహమం దట్టియభిమానము గలజీవుడు తైజసుడనియు కారణదేహమం దట్టియభిమానము గలజీవుడు ప్రాజ్ఞుడనియు చెప్పబడును. ఈప్రణవమందు గల అకార, ఉకార, మకారము లనెడి మూడవయవముల చేతను వరుసగా నీవిశ్వతైజసప్రాజ్ఞులు సూచింపబడుదురు. ఈమూడవయవములకు పైనగలయమాత్రాపదార్థముచే బ్రహ్మము సూచింపబడుచున్నది. గాన ఈప్రణవము నుచ్చరించునపుడకారమందు విశ్వదృష్టిని ఉకారమందు తైజసదృష్టిని మకారమందు ప్రాజ్ఞదృష్టినుంచి యనగాభావించి అకారమాత్రను ఉకారమునందును, ఉకారమాత్రను మకారమునందును, మకారమాత్రను అమాత్రపదార్థ మగుప్రణవమందును లయమొనర్పవలెను. అందలిభావనా విశేష మేమనగా స్థూలదేహమును సూక్ష్మదేహమందును, దానిని కారణదేహమునందును, దానిని పరబ్రహ్మమందును లయమొనర్చుటయను ప్రక్రియయే. ఏవస్తువైనను దానికారణవస్తువునందు లయమగునుగాని తదితరవస్తువునం దెంతమాత్రము లయము గాదు. గాన స్థూలదేహమునకు సూక్ష్మదేహము కారణమనియు, నద్దానికి కారణదేహము కారణమనియు, దానికి పరబ్రహ్మము కారణమనియు గ్రహించి ఈక్రమముచే లయమొనర్పగా మిగిలినపరబ్రహ్మమే తానని గుర్తించుటయే ఈప్రణవోపాసనయందలి తాత్పర్యము. అట్టివాడు నిరంతరాభ్యాసమనన నిదిధ్యాసాదులచే క్రమముగా తాను బ్రహ్మమే యనునిశ్చయముతో నుండి ముక్తుడగును.

అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమశ్శివోఽద్వైత ఏవ మోంకార ఆత్మైవ సంవిశ త్యాత్మనాత్మానం, య ఏవం వేద, య ఏవం వేద.

తా॥ మాత్రారహిత మగు నీ ఓంకారమందలి నాల్గవపాదము సర్వవ్యవహారాతీతమైనది, ప్రపంచవాసనారహితమైనది, సుఖరూప

మైనది, సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమైనది, సర్వజీవులకు నాత్మ యగునట్టిది పరబ్రహ్మమే. ఇట్లు దీనిని గుర్తించినవాడు బ్రహ్మమే యగును.

## ♦ ప్రశ్నోపనిషత్తు ♦.

శ్లో॥ అధ హైనం కౌశల్య శ్చాశ్వలాయనః పప్రచ్ఛ భగవ
న్కుత ఏష ప్రాణో జాయతే కధ మాయా త్యస్మి ఞ్ఛరీర
ఆత్మానంవా ప్రవిభజ్య కధం ప్రాతిష్ఠతే కేనోత్క్రమతే కథం
బాహ్య మభిధత్తే కధ మధ్యాత్మమితి.

తా॥ ఆశ్వలాయనునిగోత్రోత్పన్నుడగుకౌశల్యమహర్షి పిప్ప లాదమహర్షిని మహాత్మా! అని సంబోధించి (1) యీప్రాణము దేని వలన బుట్టుచున్నది (2) యీశరీరమునం దెట్లు ప్రవేశించుచున్నది (3) తనను విభజించికొని యేవిధముగా నుండుచున్నది, (4) ఏవృత్తి విశేషముచేత నీశరీరమునుండి బయటికి వెడలిపోవుచున్నది (5) బాహ్య మగుఅధిభూత అధిదైవతముల నెటుల ధరించుచున్నది. (6) అధ్యాత్మ మగుజగత్తు నెటుల ధరించుచున్నదని యడిగెను.

శ్లో॥ తస్మై స హోవా చాతిప్రశ్నా న్పృచ్ఛసి బ్రహ్మిష్ఠోసీతి
తస్మాత్తేఽహం బ్రవీమి.

తా॥ అతడా కౌశల్యమహర్షితో చెప్పబోవువిధముగా పలికెను- నీవు మిగుల గూఢములగుప్రశ్నములను అడుగుచున్నావు నీవు బ్రహ్మ విదుడవు. నేను సంతుష్టుడనైతిని. కావున నేను నీకు చెప్పుచున్నాడను.

శ్లో॥ ఆత్మన ఏష ప్రాణో జాయతే, యథైషా పురుషే
చ్ఛాయైతస్మి న్నేత దాతతం. మనోకృతే నాయా త్యస్మి
ఞ్ఛరీరే.

తా॥ ఈప్రాణ మాత్మనుండి పుట్టుచున్నది. ఏవిధముగా పురు షునియందు నీడ కలుగుచున్నదో ఆవిధముగా నీఆత్మయందు ఛాయా

స్థానీయమును అసత్యము నగుప్రాణాఖ్యమగుతత్త్వము సత్యరూపు డగుపురుషునియందు అనగా బ్రహ్మమునందు సమర్పిత మగుచున్నది. (లీనమగుచున్నది)

శ్రు॥ యథా సమ్రాడే వాధికృతా న్వినియుఙ్క్తే ఏతా న్గ్రామా నధితిష్ఠస్వే త్యేవమే వైష ప్రాణ ఇతరా న్ప్రాణా న్పృథక్పృథగేవ సంనిధత్తే.

తా॥ సార్వభౌము డగుభూపాలు డా యా ఉద్యోగస్థులను తన ఆజ్ఞను పరిపాలించునిమిత్త మీయీగ్రామములం దుండుమని ఆజ్ఞాపించుచున్న యాప్రకారముగానే యీముఖ్యప్రాణ మితరములగుచక్షురాదీంద్రియములను వేర్వేరుగా నియోగించుచున్నది.

శ్రు॥ పాయూపస్థే౽పానం చక్షుఃశ్రోత్రే ముఖనాసికాభ్యాం ప్రాణః స్వయం ప్రాతిష్ఠతే మధ్యేతు సమానః. ఏష హ్యేత ద్ధుత మన్నం సమం నయతి. తస్మా దేతా స్సప్తార్చిషో భవంతి.

తా॥ అపానవాయురూపమున పాయూపస్థలయందుండి మలమూత్రములను విడుచుచున్నది. ప్రాణవాయువు తాను చక్షుశ్శ్రోత్రములయందుండి ముఖనాసికాద్వారములనుండి బయలువెడలుచు స్వయముగా ప్రభువవలె ఉండుచున్నది. ప్రాణాపానస్థానములయొక్క మధ్యభాగమునం దనగా నాభియందు సమానవాయువుగా ఉండుచున్నది. ఈసమానవాయు వాత్మాగ్నియందు హుత మొనర్చిన యీ యన్నమును సమముగా ఆయానాడులనుగూర్చి పొందించుచున్నది. ఆ యుదరాగ్నినుండి యీస ప్తజ్వాలలు పుట్టుచున్నవి.

శ్రు॥ హృది హ్యేష ఆత్మా అత్రైత దేకశతం నాడీనాం తాసాం శతం శత మేకైకస్యాం ద్వాసప్తతి ర్ద్వాసప్తతిః ప్రతిశాఖానాడీసహస్రాణి భవం త్యాసు వ్యాన శ్చరతి.

తా॥ పుండరీకాకారమాంసపిండ మగుహృదయమునం దీజీవాత్మ యుండుచున్నాడు. ఈ హృదయపుండరీకమునందు నూట

యొక్క ప్రధాననాడు లున్నవి. ఆనూటయొక్కనాడులలో ఒక్కొక నాడియందు నూరేసినాడు లున్నవి. ఒక్కొకక్కశాఖానాడికి 72 వేల ప్రతిశాఖానాడీసహస్రము లగుచున్నవి. ఈ నాడులందు వ్యాన వాయువు సంచరించుచున్నది. (వ్యాన మన వ్యాపించునది)

శ్రు॥ అథైకయోర్ధ్వ ఉదానః పుణ్యేన పుణ్యం లోకం నయతి. పాపేన పాప ముభాభ్యా మేవ మనుష్యలోకమ్.

తా॥ ఉదానవాయు వానూటయొక్క ప్రధాననాడులలో నొక్కటియగు సుషుమ్నానాడిచేత ఊర్ధ్వగమనము గలదై శాస్త్ర విహిత మగుపుణ్యకర్మచేత దేవాదిస్థానలక్షణ మగుపుణ్యలోకమును పొందించుచున్నది. శాస్త్రనిషిద్ధ మైనపాపకర్మచేత తిర్యగ్యోన్యాది లక్షణ మగునరకమును పొందించుచున్నది.

శ్రు॥ ఆదిత్యోహవై బాహ్యః ప్రాణ ఉదయ త్యేష హ్యేనం చాక్షుషం ప్రాణ మనుగృహ్ణానః పృథివ్యాం యా దేవతా సైషా పురుష స్యాపాన మవష్ట భ్యాంతరా యదాకాశ స్సమానో వాయు ర్వ్యానః.

తా॥ సూర్యుడు బాహ్యప్రాణమయి యుదయించుచున్నాడు. ఈసూర్యుడే ఆధ్యాత్మిక నేత్రసంబంధ మగుప్రాణము ననుగ్రహించు చున్నాడు. భూమియం దాపృథివ్యభిమానినియై ఏదేవత గలదో ఆసమాన మనెడివాయువు దేహమునం దున్న సమానవాయువు నను గ్రహించుచున్నది. సామాన్యముగా వెలుపలనుండెడి వ్యానవాయువు దేహమునందలి వ్యానవాయువు ననుగ్రహించుచున్నది.

శ్రు॥ తేజోహవై ఉదాన స్తస్మా దుపశాంతతేజాః పునర్భవ మింద్రియై ర్మనసి సంపద్యమానైః.

తా॥ బాహ్యముగా నేతేజస్సు గలదో అది ఉదానమని చెప్పబడుచున్నది. అందువలన శాంతించినతేజస్సు గలవాడు మనస్సు నందు ప్రవేశించుచున్న జన్మాంతరమును లేక శరీరాంతరమును పొందుచున్నాడు.

శ్రు॥ యచ్చిత్త స్తేనైష ప్రాణ మాయాతి ప్రాణ స్తేజసా యుక్తః, సహాత్మనా యథా సంకల్పితం లోకం నయతి.

తా॥ జీవుడు మరణకాలమందే చిత్తముకలవాడగుచున్నాడో ఆచిత్తముతోడనే ముఖ్యప్రాణవృత్తిని పొందుచున్నాడు. ప్రాణము తేజస్సుతో కూడుకొన్నదై భోక్తయగుజీవునితో సంకల్పము ననుసరించి యేర్పడినశరీరమును పొందించుచున్నది.

శ్రు॥ య ఏవం విద్వాన్ప్రాణం వేద నహ్యాస్య ప్రజా హీయతేఽమృతో భవతి తదేష శ్లోకః.

తా॥ ఏ విద్వాంసు డీవిధముగా ప్రాణమును తెలిసికొనుచున్నాడో అతనిపుత్రపౌత్రాదిరూపసంతానము నశింపదు. దేహపాతానంతరము ప్రాణసాయుజ్యమును పొంది మరణరహితు డగుచున్నాడు. ఈమంత్ర మిట్లు చెప్పబడినది.

శ్రు॥ ఉత్పత్తి మాయతిం స్థానం విభుత్వంచైవ పంచధా అధ్యాత్మంచైవ ప్రాణస్య విజ్ఞా యామృత మశ్నుతే.

తా॥ సాధకు డగువిద్వాంసుడు ప్రాణనామకు డగుపరమాత్మయొక్క పుట్టుకను ఆప్రాణముయొక్క ఆగమనమును ఈశరీరమునందు ప్రాణమునకు గలస్థానమును అయిదువిధము లగువ్యాపకత్వములను శరీరసంబంధమైన ఉనికిని తెలిసికొని అమృతత్వమును పొందుచున్నాడు.

శ్రు॥ విశ్వరూపం హరిణం జాతవేదసం పరాయణం జ్యోతిరేకం తపన్తం సహస్రరశ్మి శ్శతధా వర్తమానః ప్రాణః ప్రజానా ముదయ త్యేష సూర్యః.

తా॥ బ్రహ్మవేత్త లగువారలు స్వాత్మయగుసూర్యుని సర్వప్రపంచాత్మకునిగను కిరణములు గలవానిగను ప్రజ్ఞాయుక్తునిగను సకలజీవులకు నాశ్రయభూతునిగను సర్వప్రాణులకు చక్షుర్భూతునిగను అద్వితీయునిగను అంతర్బహిస్తాపమును కలుగజేయువానిగను తెలిసికొనుచున్నారు. ఈస్వాత్మయగుసూర్యు డనేకకిరణములు గల

వాడయి అనేక విధములుగా ఉన్న ప్రాణులకు ప్రాణభూతుడై యున్నాడు.

## —♦ ముండకోపనిషత్తు ♦—

మూ॥ ఓం. బ్రహ్మా దేవానాం ప్రథమ స్సంబభూవ.

(1) విశ్వస్య కర్తా భువనస్య గోప్తా స బ్రహ్మవిద్యాం సర్వ
విద్యాప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ.

తా॥ సకలప్రపంచమునకు సృష్టికర్తయు, ఉత్పన్న మైన సకల ప్రపంచమునకు సంరక్షకుడు నగుహిరణ్యగర్భుడు దేవతలలో ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యాది గుణములచేత మొదటివాడుగా స్వయముగా నావిర్భవించెను. ఆబ్రహ్మ సర్వవిద్యలకు నాశ్రయభూత మగుబ్రహ్మ విద్యను పెద్దకుమారు డగు అథర్వునికొరకు నుపదేశించెను.

(2) అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మా థర్వాతాం పురోవా
చాంగిరే బ్రహ్మవిద్యామ్. స భారద్వాజాయ సత్య
వాహాయ ప్రాహ. భారద్వాజోఽంగిరసే పరావరామ్.

తా॥ బ్రహ్మ యేబ్రహ్మవిద్య నథర్వునికొరకు నుపదేశించెనో ఆబ్రహ్మవిద్య నంగిరసునికొరకు నథర్వుడు పూర్వకాలమునం దుప దేశించెను. ఆయంగిరసుడు భరద్వాజగోత్రోద్భవు డగుసత్యవాహుని కొరకు ఉపదేశించెను. భారద్వాజగోత్రోత్పన్ను డగుఆసత్యవాహు డంగి రసు డనుతనశిష్యునకు పరావర యగునీబ్రహ్మవిద్య నుపదేశించెను.

(3) శౌనకో హ వై మహాశాలోఽంగిరసం విధివ దుపసన్నః
పప్రచ్ఛ. కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం
భవతీతి.

తా॥ మహాగృహస్థు డగుశౌనకుడు భరద్వాజశిష్యు డగునంగి రసుని శాస్త్రానుసారము సమీపించినవాడై మహాత్మా ఏవస్తువు తెలియబడిన నీసకలము తెలియబడిన దగు నని ప్రశ్న చేసెను.

(4) తస్మై స హోవాచ ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ యద్బ్రహ్మవిదో వదంతి పరా చైవాపరా చ.

తా॥ ఆశౌనకునికొరకు ఆంగిరసుడు చెప్పుచున్నాడు. బ్రహ్మవేత్తలకు రెండువిద్యలు తెలిసికొనదగినవి. అవి పర యనియు, అపర యనియు చెప్పబడును.

(5) తత్రాపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వవేద శ్శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి. అథ పరా యయా త దక్షర మధిగమ్యతే.

తా॥ ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము. అధర్వణవేదము. శిక్ష, కల్పసూత్రము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము, ఇవి అపరావిద్య అని చెప్పబడును. దేనిచేత ఆ అవినాశి యగుబ్రహ్మము పొందబడుచున్నదో అది పరావిద్య యని చెపబడును.

(6) యత్త దద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షు శ్శ్రోత్రం త దపాణిపాదం, నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం త దవ్యయం య ద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః.

తా॥ ఏ బ్రహ్మతత్త్వము ముందుచెప్పబడగలదో ఆబ్రహ్మతత్వము బుద్ధీంద్రియములచేత గ్రహించుటకు శక్యముకానిది, కర్మేంద్రియములచేత గ్రహించుటకు శక్యముకానిది, కాశ్యపాదిగోత్రములు లేనిది. స్థూలత్వాదిధర్మములును లేనిది. శుక్లనీలాదివర్ణములును లేనిది. నేత్రములు చెవులు లేనిది. ఆబ్రహ్మతత్త్వము మరియు పాణిపాదములు లేనిది. నాశము లేనిది. బ్రహ్మాదిస్థావరాంతప్రాణిభేదాకారమున అంతట వ్యాపించినది. ఆకాశమువలె సర్వగత మయినది. మిక్కిలి సూక్ష్మ మైనది. అవ్యయ మైనది. ఇట్టి చింతింపరాని అక్షర మగుబ్రహ్మతత్త్వమును ధీమంతులు సకలభూతములకు కారణభూత మయినదానినిగా చూచుచున్నారు లేక తెలిసికొనుచున్నారు.

(7) యస్మాత్పరం నాపర మస్తి కించి ద్యస్మాన్నాణీయో న జ్యాయో஽స్తి కశ్చిత్. వృక్షఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్.

తా॥ ఏ యక్షరస్వరూపు డగుపరమాత్మకంటె శ్రేష్ఠమయినది అన్యమయినది అగుపదార్థము కొంచెమైనను లేదో ఏఅక్షరస్వరూపు డగుపరమాత్మకంటె సూక్ష్మమైనది సర్వత్రవ్యాపించునది ఒకానొకటియును లేదో ఏ అక్షరస్వరూపు డగుపరమాత్మకంటె స్థూలమైనది లేక సర్వేశ్వరత్వము సర్వవ్యాపకత్వము గలది యింకొకటి లేదో ఒక్కఁడగు ఏ అక్షరస్వరూపు డగు పరమాత్మ పరమపదమునందు వృక్షమువలె ప్రణవస్వభావుఁడై జగత్తునకు ప్రధానభూతుఁడుగ ఉన్నాఁడో అట్టిపురుషునిచేత నీఆకాశాదిసర్వప్రపంచము వ్యాపింపబడియున్నది.

(8) యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతేచ యథా పృథివ్యామోషధయ స్సంభవంతి. యథా సతః పురుషాత్కేశలోమాని తథాఽక్షరా త్సంభవతీహ విశ్వమ్.

తా॥ సాలెపురు గేవిధముగా తంతువులను సృజించుచున్నదో మరల లోనికి గ్రహించుచున్నదో, ఏవిధముగా పృథివియం దోషధులు పుట్టుచున్నవో ఏవిధముగా జీవించియున్నపురుషునినుండి కేశములు లోమములు పుట్టుచున్నవో అదే విధముగా నీసంసారమండలమునం దక్షరునివలన ప్రపంచము సర్వము పుట్టుచున్నది.

(9) పరీక్ష్య లోకా న్కర్మచితా న్బ్రాహ్మణో నిర్వేద మాయా న్నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛే త్సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్.

తా॥ బ్రాహ్మణుఁడు లోకమును కర్మచేత నిర్వర్తింపబడినదిగా పరీక్షించి మోక్షము కర్మలచేత లేదని వైరాగ్యమును పొందవలయును. అట్టివైరాగ్యమును పొందిన బ్రాహ్మణు డాయమృతస్వరూప

మును తెలిసికొనుటకు సమిధలు హస్తమునందు గలవాడై వేదాధ్యయనసంపద, బ్రహ్మనిష్ఠగల గురువునుగూర్చియే పోవలయును.

(10) తస్మైస విద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్.

తా॥ బ్రహ్మవేత్త యగునాగురువు తనసమీపమునకు బ్రహ్మవిద్యార్థియై లెస్సగా శమించినయంతర్బాహ్యేంద్రియదోషములు గలవాడు నగునట్టి శిష్యునికొరకే బ్రహ్మజ్ఞానవిద్యచేత సత్యమే స్వరూపముగా గలవాడును నాశరహితుడును పూర్ణుడు నగుపరమాత్మను తెలిసికొనవీలగునో అట్టిబ్రహ్మవిద్యను చక్కగా ఉపదేశించవలయును.

(11) తదేత త్సత్యం యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగా స్సహస్రశః ప్రభవంతే సరూపాః తథాక్షరా ద్వివిధా స్సోమ్య భావాః ప్రజాయన్తే తత్ర చైవాపియన్తి.

తా॥ ఈచెప్పబోవు అక్షరవిషయము సత్యమైనది. భూతభవిష్యద్వర్తమానకాలములయం దేకరూపమున నుండునది. బాగుగా మండుచున్నయగ్నినుండి వేలకొలది సమానరూపములుగల అగ్నికణము లేవిధముగా పుట్టుచున్నవో ఆప్రకారమే నాశనరహిత మగు పరబ్రహ్మమునుండి నానావిధములగు జీవులు పుట్టుచున్నారు. ఆ యక్షరపరబ్రహ్మమునందే లీనమగుచున్నారు అని శౌనకున కుపదేశించెను.

(12) దివ్యో హ్యమూర్తః పురుష స్స బాహ్యాభ్యంతరో హ్యజః. అప్రాణో హ్యమనా శ్శుభ్రో హ్యక్షరా త్పరతః పరః.

తా॥ స్వయంజ్యోతి యగుటచేత ప్రకాశించువాడును వివిధములైనఆకారములు లేనివాడును పూర్ణుడగుటచేత పూర్ణశబ్దవాచ్యుడును బాహ్యాభ్యంతరములతో కూడియుండువాడును పుట్టుక లేనివాడును

సుప్రసిద్ధుడును మరియు ప్రాణము లేనివాడును సంకల్పవికల్పాత్మక మగుమనస్సు లేనివాడును నందువనే శుద్ధుడును నామరూపబీజోపాధి లక్షితస్వరూపముకంటె వేరయినసుప్రసిద్ధుడు, పరమపురుషుడు.

(13) ఏతస్మా జ్జాయతే ప్రాణో మనస్స ర్వేంద్రియాణిచ.
ఖంవాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ.

తా॥ ఈనామరూప బీజోపాధిలక్షితు డగుపురుషునినుండియే అవిద్యావిషయ వికారభూతమును నామధేయసహితమును అగు ప్రాణము పుట్టుచున్నది. మనస్సు, సకలేంద్రియములు పుట్టుచున్నవి. ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకములు, ప్రపంచమును ధరించుచున్న భూమియు పుట్టుచున్నవి. మరియు సకలము నీపురుషునినుండియే పుట్టుచున్నవి.

(14) పురుష ఏ వేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతమ్
ఏత ద్యో వేద నిహితం గుహాయాం సోఽవిద్యాగ్రంథిం
వికిర తీహ సోమ్య.

తా॥ ఈప్రపంచమంతయు పురుషుడే, అగ్నిహోత్రాదిరూప మగుకర్మయు, జ్ఞానమును పురుషుడే, శౌనకా! ఎవ్వడు ప్రాణుల బుద్ధిగుహాయం దున్నట్టి యీజగదాత్మకబ్రహ్మమును తెలిసికొనుచున్నాడో వాడిక్కడనే జీవించియుండగానే ముడివలె దృఢమయిన అజ్ఞానవాసనను నశింపజేయుచున్నాడు.

(15) ఆవిస్సన్నిహితం గుహాచరం నామ మహాత్పద మత్రైత
త్సమర్పితమ్. ఏజ త్ప్రాణ న్నిమిషచ్చ య దేత జ్జానథ
సదసద్వరేణ్యం పరం విజ్ఞానా ద్య ద్వరిష్ఠం ప్రజానామ్.

తా॥ ప్రకాశస్వరూపమును, దేవమనుష్యతిర్యగాది సకలవిధ ప్రాణులయొక్క హృదయమునందు దర్శన, శ్రవణ, మనన, విజ్ఞానాద్యుపాధిధర్మములచేత ఆవిర్భూతమై యేబ్రహ్మము ప్రకాశించుచున్నదో ఆబ్రహ్మము బుద్ధిగుహాయం దుండునదిగా సుప్రసిద్ధమై

యున్నది. మరియు నన్నిటికంటె శ్రేష్ఠమయినది. సర్వపదార్థములకు స్థానభూత మైనదగుటచేత అన్నిటిచేతను పొందబడుచున్నది. ఏల యనగా నీబ్రహ్మమున నంతయు నిరుసునందు బండిఆకులవలె ప్రవేశించి యున్నది. చరించుచున్నపక్షులు మున్నగుప్రాణిజాతమును ప్రాణాపానములు గలమనుష్యపశ్వాదులును రెప్పపాటులుగల ప్రాణుల యొక్క సమూహమును చరాచరమువలన రెప్పపాటులేనిప్రాణసమూహమును ఏయది గలదో యీసకలము నీబ్రహ్మమునందే స్థిరమై యున్నది శిష్యులారా మీరు మూర్తామూర్తస్వరూపము కలిగినట్టియు నిత్యమయినదగుటచే అందరిచేత ప్రార్థింపదగినదియు ప్రజలయొక్క విజ్ఞానముకంటె వేరైనదియు నన్నిపదార్థములకంటె శ్రేష్ఠమయినదగుటచే కోరదగినదియు నగు అట్టి యీబ్రహ్మమును మీరు తెలిసికొనుడు.

(15) యదర్చిమద్య దణుభ్యోऽణు చ యస్మిన్ లోకా నిహితా లోకినశ్చ తదేతదక్షరం బ్రహ్మ స ప్రాణ స్తదు వాఙ్మనః తదేత త్సత్యం తదమృతం త ద్వేద్ధవ్యం సోమ్య విద్ధి.

తా॥ ఎయ్యది ఆదిత్యాదికాంతిమత్పదార్థము లన్నిటికంటె ఎక్కువగా కాంతి గలదియో ఏయది అతిసూక్ష్మములగు శ్యామాకాదికములగు అణువులకంటె సూక్ష్మమయినదో చకారమువలన స్థూలములయిన పదార్థములకంటె మిక్కిలి స్థూలమయినదియో దేని యందు భూమ్యాదిచతుర్దశ లోకములును ఆలోకములందుండు చైతన్యాశ్రయములగు మనుష్యాదిప్రాణిసమూహములును ఉన్నారో ఆయీసర్వాశ్రయ మయినదియే, నాశరహితమగు పరబ్రహ్మము. అదియే ప్రాణము. అదియే వాక్కును, మనస్సును, ఇంద్రియ సముదాయమును అగుచున్నది. ప్రాణము మున్నగు వాని లోపల చైతన్యాత్మకముగ ఏయక్షరస్వరూపము గలదో ఆ యీ యక్షరమే సత్యము. అదియే నాశరహిత మయినది. ప్రియదర్శనుడవగు ఓ శౌనకుడా! ఆయమృత స్వరూపమయిన ఆత్మయే మనస్సుచేత

కొట్టదగినది, అనగా ఆపరమాత్మయందు మనోలయము చేయవల యును. ఆయక్షరమునందు మనస్సును లయింపచేయుటను గురుముఖ మున తెలిసికొనుము.

(16) ధను గ్గృహీ త్వౌపనిషదం మహాస్త్రం శరం హ్యుపాసా
నిశితం సంధీయత ఆయమ్య తద్భావగతేన చేతసా లక్ష్యం
తదే వాక్షరం సోమ్య విద్ధి.

తా॥ ఓ ప్రియదర్శనుడా! నీవు ఉపనిషత్ప్రసిద్ధమయినట్టి గొప్ప యస్త్రమగు ధనుస్సును గ్రహించి ఇష్టదేవతా ధ్యానరూపమగు ఉపా సనచేత వాడిగలదిగా చేయబడిన బాణమును ధనుస్సునందు సంధానము చేయవలయును. ఆయక్షరస్వరూపుని ధ్యానమును పొందినచిత్తము చేత లాగి ఆపూర్వోక్తమగు అక్షరస్వరూపమునే లక్ష్యముగా తెలిసి కొనుము.

(17) ప్రణవో ధను శ్శరో హ్యాత్మా బ్రహ్మ త ల్లక్ష్య
ముచ్యతే. అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్.

తా॥ ఓంకారము ధనుస్సు. జీవుడు బాణము. ఆ సుప్రసిద్ధ మగుబ్రహ్మము లక్ష్యము అని చెప్పబడుచున్నది. ప్రమాదరహిత మయిన చిత్తముచేత అనగా ఏకాగ్రచిత్తముచేత లక్ష్యభూత మగు బ్రహ్మము కొట్టదగినది. అప్పుడు బాణమువలె ఆ లక్ష్యభూత బ్రహ్మ స్వరూపు డగుచున్నాడు.

బాహ్యవిషయములందు లగ్నమగుట యనుప్రమాదమును వదలి విరక్తుడయి జితేంద్రియుడై ఏకాగ్రమయిన చిత్తముతో బ్రహ్మమునే భావించునతడు ఆకర్ణాంతము లాగి లక్ష్యమునందు గురి జూచి వదలబడిన వాడిమొన గల్గిన బాణము లక్ష్యమునం దైక్యమగు నటుల బ్రహ్మమునందు తాను లీనమగును. దేహాదిసంఘాతము నందు ఆత్మబుద్ధిని వదలి తాను బ్రహ్మస్వరూపుడనను దృఢప్రత్యయము గలుగుటయే ఇచట ప్రణవోపాసనా ఫలము.

(18) యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం మన స్సహ
ప్రాణై శ్చ సర్వైః తమే వైకం జానథాత్మాన మన్యా
వాచో విముంచథ అమృత స్యైష సేతుః.

తా॥ ఓ శిష్యులారా ! ఏయక్షరాత్మకు డగుపురుషుని యందు ద్యులోకమును, భూమియును, ఆకాశమును సమస్తములగు ఇంద్రియములతోడ మనస్సును కూడుకొనియున్నదో, అద్వితీయుడగు ఆ అక్షరస్వరూపునే మీరాత్మనుగా తెలిసికొనుడు. ఇతరములగు మాటలను వదలిపెట్టుడు. ఈ యాత్మజ్ఞానము అమృతమునకు లేక మోక్షమునకు సేతువువంటిది.

(19) అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః స
ఏషోంత శ్చరతే బహుధా జాయమానః. ఓమిత్యేవం
ధ్యాయథాత్మానం స్వస్తివః పారాయ తమసః పరస్తాత్.

తా॥ బండియొక్క బొడ్డునందు బండియాకులవలె, ఏ హృదయమునందు దేహామం దంతట వ్యాపించిన నాడులు కూడుకొని యున్నవో ఆహృదయమధ్యమునందే ఆ యీజీవుడు అనేకవిధములుగా అగుచున్నవానివలె నున్నాడు. హృదయమధ్యభాగమునం దటుల నున్నప్రత్యగాత్మను ఓంకారమని యీప్రకారము ధ్యానముచేయుడు. నాయుపదేశానంతరము మీరు బ్రహ్మవిద్యాభిలాషులుగనుక కర్మలను శాస్త్రీయముగా పరిత్యజించి మోక్షమునం దభిముఖులై అవిద్యాసంబంధము లేశమైనను లేని బ్రహ్మసాక్షాత్కారము నొంది అజ్ఞానముయొక్క అవతలిగట్టు అనగా మోక్షము నొందెదరుగాక.

(20) య స్సర్వజ్ఞ స్సర్వవి ద్య స్యైష మహిమా భువి. దివ్యే
బ్రహ్మపురే హ్యేష వ్యోమ న్యాత్మా ప్రతిష్ఠితః. మనో
మయః ప్రాణశరీర నేతా ప్రతిష్ఠితోన్నే హృదయం సం
నిధాయ తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరా ఆనందరూప
మమృతం య ద్విభాతి.

తా॥ ఎవ్వఁడు సర్వజ్ఞుఁడో అనగా సామాన్యముగా సర్వము తెలిసినవాఁడో, సర్వవేత్తయో అనగా విశేషముగా సర్వము తెలిసినవాఁడో ఎవ్వనికి భూమియందు నిట్టి యీ సంపద గలదో అయీ ఆత్మ ప్రకాశించునట్టి హృత్పుండరీకమునందుగల హృదయాకాశమునందు ప్రతిష్ఠింపబడినవానివలె గనంబడుచున్నాఁడు. మనోమయోపాధిసహితుఁడును, ప్రాణశరీరముల కభిమానియు నగు ఆయాత్మ హృదయాకాశమును పొంది అన్నముచేత వృద్ధిక్షయములు పొందుచున్న స్థూలశరీరమునందు ప్రతిష్ఠింపబడినవానివలె తోచుచున్నాఁడు. విద్వాంసులగువారలు శాస్త్రముచేతను సదాచార్యునిచేతను ఉపదేశింపబడినట్టియు శమదమాది ధ్యానసర్వత్యాగవైరాగ్యాది సమన్వితమును అగు ఆత్మజ్ఞానముచేత ఆనందమే స్వరూపముగా గల్గియున్న అమృతస్వరూపము గల్గి సర్వకాలసర్వావస్థలయందును ప్రకాశించుచున్న అట్టి ఆత్మతత్త్వమును అంతట చూచుచున్నారు. అనగా ఆయాత్మతత్వమును పొందుచున్నారు.

(21) భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.

తా॥ కార్యకారణస్వరూపముచేత అవరుఁడనియు, పరుఁడనియు వ్యవహరింపబడుచున్న ఆపరమాత్మ చూడబడినదగుచుండగా అవిద్యావాసనలయొక్క దృఢమైన సంబంధము సడలిపోవుచున్నది. సంశయములన్నియు నాశమును పొందుచున్నవి. ఈ సంశయరహితుఁడగు బ్రహ్మవేత్తయొక్క అప్రవృత్తఫలములగు కర్మలు నశించిపోవుచున్నవి.

(22) హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలమ్
తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్య దాత్మవిదో విదుః.

తా॥ స్వయంప్రకాశమానమును శ్రేష్ఠమును అగు హృదయకోశమునందు దోషరహితమును, అవయవరహితమును అగు బ్రహ్మము గలదు. ఆబ్రహ్మము పరిశుద్ధమయినది. ఏకారణమువలన దానిని ఎవ్వరు తెలిసికొనుచున్నారో వారలే ఆత్మవేత్తలు.

(23) న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా
విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః. తమేవ భాంత
మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి.

తా॥ సర్వప్రకాశకు డగుసూర్యుడు ఆత్మభూతుడగు పరబ్ర
హ్మమునందు ప్రకాశించుటలేదు. చంద్రుడు నక్షత్రములును ప్రకా
శించుటలేదు. మెరుపులు ప్రకాశించుటలేదు. మనకన్నులకు ఎదుట
కనబడుచున్న అగ్నిహోత్రుడు ఎటుల ప్రకాశించును? ప్రకాశించుట
లేదు. అంతయు ప్రకాశించుచున్న పరమేశ్వరునిగూర్చియే అనుసరించి
ప్రకాశించుచున్నది. ఈ ప్రపంచమంతయు పరమేశ్వరునియొక్క
ప్రకాశముచేతనే ప్రకాశించుచున్నది.

(24) బ్రహ్మైవేద మమృతం పురస్తా ద్బ్రహ్మ పశ్చా ద్బ్రహ్మ
దక్షిణత శ్చోత్తరేణ. అధ శ్చోర్ధ్వం చ ప్రసృతం
బ్రహ్మైవేదం విశ్వ మిదం వరిష్ఠమ్.

తా॥ పూర్వభాగమునందుగల యీసమస్తము నాశరహిత
మగుబ్రహ్మమే; వెనుకనున్న యీసమస్తము బ్రహ్మమే, దక్షిణ
దిగ్భాగమునందును ఉత్తరదిశయందునుగల ఇది యంతయు బ్రహ్మమే.
అధోదిగ్భాగమునందును ఊర్ధ్వదిగ్భాగమునందును మరియు అంత
టను వ్యాపించియున్న ఇది యంతయు బ్రహ్మమే. ఈ కనంబడు
చున్న ప్రపంచ మంతయు శ్రేష్ఠ మగుబ్రహ్మమే. రజ్జువునందు సర్ప
భ్రమ అవిద్యావశమున ఎట్లు కలుగుచున్నదో అట్లే సత్యమగు
బ్రహ్మమునందుకూడ అవిద్యావశమున బ్రహ్మముకంటె భిన్నమగు
కార్యరూప ప్రపంచబుద్ధి తోచుచున్నది. ఇది ఉపనిషత్సిద్ధాంతము.

## ఈశావాస్యోపనిషత్తు

### శుక్లయజుర్వేద వాజసనేయసంహిత

(1) మం॥ ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం
జగత్, తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్వి ద్ధనమ్.

తా॥ ఈప్రపంచమంతయు మిథ్య. పరమార్థస్వరూపుడును ఆత్మయు అగునాతకంటె ఇతరము లేదు. ఈ కల్పిత ప్రపంచమును విడిచిపెట్టుము. ఇట్లువిడుచుటయే సన్న్యాసము. ఈసన్న్యాసమును అవలంబించి నిన్ను నీవు రక్షించుకొనవలయును. సత్యమయిన ఆత్మ కంటె మరియొకదానిని ఆశింపకుము. ధనాశను పొందవలదు. ధనము ఎవ్వనికి గలదు.

(2) కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవి చ్ఛతగ్ం సమాః,
ఏవం త్వయి నాన్య థేతో౽ స్తి న కర్మ లిప్య

తా॥ ఈలోకమందు విహితములైన అగ్నిహోత్రాది కర్మలను ఆచరించుచునే నూరుసంవత్సరములు జీవింపగోరవలయును. ఇట్టిజీవి తేచ్ఛగల మనుష్యమాత్రాభిమానివగు నీకు విధివిహితములగు అగ్నిహోత్రాదికర్మలను ఆచరించుటకంటె ప్రకారాంతరము లేదు. ఇట్లు విహితములగు అగ్నిహోత్రాది విధుల నాచరించుచున్న నీకు పాప కర్మ అంటదు.

(3) అసుర్యానామ తే లోకా అంధేన తమసా వృతాః
తాగ్ స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః.

తా॥ ఆకర్మఫలములు అసురులకు సొమ్ము అనుట ప్రసిద్ధియే గదా. కావున ఆలోకములు అనగా జన్మలు, అదర్శనాత్మకమయిన అజ్ఞానముచేత ఆవరింపబడియున్నవి. ఏజనులు ఆత్మహింసకులో అట్టి ఆత్మహింసకు లగువారలు మరణించి ఆజన్మములను పొందుచున్నారు.

(4) అనేజ దేకం మనసో జవీయో నైన ద్దేవా ఆప్నువ
న్పూర్వ మర్షత్. తద్ధావతో న్యా నత్యేతి తిష్ఠత్ తస్మి
న్నపో మాతరిశ్వా దధాతి.

తా॥ చలనము లేనిదియు ఏకరూపమయినదియు సర్వభూత ములయందును తాను ఒక్కటే అయినదియు సంకల్పాది లక్షణ మయినమనస్సుకంటె అధికవేగమయినదియు అగు ఈ ఆత్మతత్వ

మును ప్రకాశించుచున్న ఇంద్రియములు పొందలేకపోయెను. ఏల యనగా మిక్కుటమయిన వేగముగలమనస్సుకంటె ముందుగనే ఆత్మ తత్వము పోయియుండును. ఆయాత్మతత్వము వేగముగా పోవుచున్న తనకంటె విలక్షణమయిన మనోవాగింద్రియాది ఇతరములను అతిక్ర మించి తానే ముందు నిల్చియుండును ఆయాత్మతత్వము ఉండబట్టియే అంతరిక్షమున తిరుగునట్టివాయువు సర్వప్రాణుల చేష్టలను విభజించు చున్నాడు. మరియు ఇతడు సర్వప్రాణభృత్తు, క్రియాత్మకుడు, సర్వజగ ద్ధారియగు హిరణ్యగర్భుడు.

(5) తదేజతి తన్నైజతి తద్దూరే తద్వ దన్తికే తద న్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః.

తా॥ ఆయాత్మత త్త్వము చలించును, అది చలింపదు. ఆయా త్మత త్త్వము దూరమునం దుండును. అనగా కోటిసంవత్సరములకైనను అజ్ఞానులకు పొందరానిది; కావున దూరమం దున్నదానివలె తోచును. అదేవిధముగా సమీపమునం దేయున్నది. ఎట్లనగా విద్వాంసులే ఆత్మ స్వరూపులు; కావున వారికి మిక్కిలి సమీపమునందే యుండును. ఆ యాత్మత త్త్వమే యీసమ స్తమయిన నామరూప క్రియాత్మకమగు జగత్తుయొక్క లోపల గలదు. అదియే సమ స్తమయిన యీజగత్తు యొక్క వెలుపలను ఉన్నది.

(6) యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యే వానుపశ్యతి. సర్వ భూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే.

తా॥ ఎవ్వడు సమ స్తములయిన భూతములను అనగా అవ్యక్తాది స్థావరాంతములగు వానిని ఆత్మయగు తనయందే చూచు చున్నాడో అవ్యక్తాదిస్థావరాంతములగు సకలభూతములందును ఆత్మ యగుతనను చూచుచున్నాడో యీరీతి నెరిగినవాడు ఇతరుని నింద చేయడు.

(7) యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవా భూ ద్విజానతః
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః.

తా॥ ఏసమయమునందు (హృత్పుండరీక) బుద్ధిగుహయందుగల యధార్థవస్తువు నెరుంగునో వానికి సమస్తములయిన భూతములు తానే అగును. ఆసమయమునందు ఏకత్వమును అనగా ఆత్మ యొకటియే యధార్థవస్తువుగాని తదితరము వేరేదియు లేదని ఎరింగినట్టి విద్వాంసుడగువానికి శోకమోహములు లేవు.

(8) స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం శుద్ధ
మపాపవిద్ధమ్. కవి ర్మనీషీ పరిభూ స్స్వయంభూ ర్యథా
తథ్యతో ర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్య స్సమాభ్యః.

తా॥ ఆపరమాత్మ ఆకాశమువలె అంతటవ్యాపించి ప్రకాశించుచున్నాడు. మరియు అనంతుడు, అతడు సూక్ష్మస్థూలకారణశరీరములు లేనివాడు, నాడులు లేనివాడు, నిర్మలుడు, అతనికి పుణ్యమనియు పాపమనియు లేదు. అతడు సర్వద్రష్ట, సర్వజ్ఞుడు. సర్వభూతంబులకును, మనస్సునకు ప్రభువు అయినవాడు. అన్నిటికంటె మీదమీద లేకపైన నుండువాడు. సర్వము తానే అయియున్నవాడు. అట్టి నిత్యముక్తస్వరూపు డగుపరమాత్మ ఆయాకర్మఫలములకు సాధనములగు నర్థములను తదనురూపముగా నిత్యులయిన సంవత్సరములను పేరుగల ప్రజాపతులకొరకు విభజించి నిర్మించెను.

(9) అంధంతమః ప్రవిశంతి యే అవిద్యా ముపాసతే. తతో
భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః.

తా॥ ఎవ్వరు కేవలము అగ్నిహోత్రాదిలక్షణ మగుకర్మలయందే ఆసక్తిగలిగి వానిని మాత్రమే ఆచరించుచున్నారో వారు అంధకారమువంటి అజ్ఞానమున ప్రవేశించుచున్నారు. ఎవ్వరు అగ్నిహోత్రాదిరూప మగుకర్మలను విడిచి కేవలదేవతలను ఆరాధించుచున్నారో వారు పయి (అంధకారముకంటె) అజ్ఞానముకంటె మిక్కిలి గొప్పదగు తమస్సును లేక గొప్ప అజ్ఞానమున ప్రవేశించుచున్నారు.

(10) అన్యదేవాహు ర్విద్యయా అన్యదేవాహు రవిద్యయా
ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్తద్వ్యాచచక్షిరే.

తా॥ దేవతోపాసనముచేత వేరయినఫలమే కలుగునని వేద ములు చెప్పుచున్నవి. కర్మలచేత వేరయినఫలములు కల్గునని వేద ములు చెప్పుచున్నవి. మరియు నీవిషయమును మాకు తత్వమును బోధించిన గురువులు చెప్పియున్నారు.

(11) హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ త త్త్వం
పూష న్నపావృణు సత్యధర్మాయ దృష్టయే.

తా॥ సువర్ణ వికారమైనదానితో సమమగు నీ ఆదిత్యమండ లమునందున సత్యమయిన బ్రహ్మముయొక్క ద్వారము జ్యోతిర్మ యమైన పాత్రముచేత కప్పివేయబడియున్నది. వర్ణాశ్రమాచార విహితములయిన కర్మల ననుష్ఠించుచు సత్యమైన యాబ్రహ్మమును ఉపాసించుచున్ననాకు తద్దర్శనము కలుగుటకయి, ఆ జ్యోతిర్మయ మగుపాత్రమును అనగా బ్రహ్మద్వారమును ఆచ్ఛాదించి యున్న దానిని తొలగింపుము.

(12) పూష న్నేకర్షేయ మసూర్య ప్రాజాపత్య వ్యూహరశ్మీన్
సమూహ తేజో య త్తే రూపం కల్యాణతమం త త్తే
పశ్యామి యోఽసా వసౌ పురుష స్సోహ మస్మి.

తా॥ ఓ జగత్పోషకా, ఏకాకివై తిరుగునట్టివాడా, సకల మును నియమించువాడా, ప్రాణములను రసములను స్వీకరించువాడా, ప్రజాపతిపుత్రుడా ఓ సూర్యుడా! నీ కిరణములు తొలగింపుము. నీ కాంతిని ఒకటిగాచేయుము నీ కిరణములను ఉపసంహరింపుము. నీ యొక్క మంగళకరమైన నిజరూపము ఏది గలదో ఆరూపమును నీ యొక్క అనుగ్రహమువలన నేను చూచుచున్నాను. ఆదిత్యమండలాం తర్వర్తి యగుపురుషపదవాచ్యు డెవడో అతడే నేను అగుచున్నాడను.

ఇక్కడ పురుషుడన ప్రాణబుద్ధ్యాత్మ డగుపరమాత్మ అని గ్రహించునది.

ఇట్లే మరియొక వేదశాఖలోగూడ ఆత్మరూప ముపదేశింపబడినది.

—♦ బృహదారణ్యోపనిషత్-ఖాణ్వశాఖ ♦—

(1) శ్రు॥ తద్వా అస్యై తదతి ఛందా. అపహతపాప్మ అభయగ్ం రూపం తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద, నాంతరం, ఏవ మే వాయం పురుషః ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరం-తద్వా అస్యైత దాప్తకామ మాత్మకామ మకామగ్ం రూపగ్ం శోకాంతరమ్.

తా॥ జీవునియొక్కనిజరూప మగునాత్మ, ఎట్టికోరికలుగాని, మనస్సంకల్పాదికముగాని, ఇంద్రియవృత్తులుగాని, పాపపుణ్యములు గాని, భయముగాని లేనట్టిది. లోకవ్యవహారమందు భర్త కామావేశము నొంది భార్యతో సంగతుడైన సమయమం దెట్లు బాహ్యప్రపంచముగాని, అంతఃకరణమం దితరవ్యాపారములుగాని, భాసింపవో అట్లే జీవుడు సుషుప్త్యవస్థయం దున్నపుడు బాహ్యములగు శబ్దస్పర్శాదికములుగాని, ఆంతరములగు సంకల్పాదులుగాని, లేక యుండును. అదియే పొందబడిన కామముగలుగుట యనగా సర్వేంద్రియవృత్తులకు ఆత్మయే విషయమగుట- గాన శబ్దాదిగుణములు శోకప్రదము లగుటచే నాయాత్మ కపుడు శబ్దాదిప్రవృత్తి లేనందున శోక మెంతమాత్రమును ఉండదు. కామసంకల్పాదిక మంతఃకరణధర్మముగాన నాయాత్మకపుడు కామసంకల్పాదిక మెంతమాత్రమును లేదు.

(2) శ్రు॥ జనకో హ వై దేహః కూర్చా దుపావసర్ప న్నువాచ. నమస్తేఽస్తు యాజ్ఞవల్క్య, న మా శాధీతి. సహోవాచ, యథా వై సంమ్రా ణ్మహా న్త మధ్వానమేష్య న్రథం వా

నావం వా సమాదదీ తైవమే వైతాభి రుపనిషద్భి స్సమాహితాత్మా స్యేవం బృందారక ఆఢ్య స్సన్నధీతవేద, ఉక్తోపనిషత్క ఇతో విముచ్యమానః క్వ గమిష్యసీతి. నాహం తద్భగవ న్వేద. యత్ర గమిష్యామీ త్యథవై తేహం త ద్వక్ష్యామి. యత్ర గమిష్యసీతి. బ్రవీతు భగవానితి.

తా॥ విదేహదేశప్రభువగు జనకమహారాజు ఆసనమునుండి లేచి, యాజ్ఞవల్క్యమహర్షియొద్దకు వెళ్ళి నమస్కరించి నాకు తత్త్వోపదేశమొనర్చి శిక్షింపుమని కోరగా నామహర్షి యిట్లనుచున్నాడు.

ఓ జనకమహారాజా ! నీవు లోకమునం దెచటికైనను వెళ్ళదలచినపుడు రథమునుగాని నావనుగాని సాధనముగా గైకొని వెళ్ళునట్లుగానే ఉపనిషత్తులందు ప్రతిపాదింపబడినబ్రహ్మ మనుదూరదేశమును పొందుటకు గురువులను సాధనముగా గైకొంటివి. నీవు సర్వవేదపారంగతుడవై దేవతానుగ్రహపాత్రుడవై సకలసుఖములను పొందుచుంటివి. నీ వీదేహము నశించినవెనుక నెచటికి వెళ్ళెదవు? అని ప్రశ్నించగా నాజనకుడు "ఓభగవంతుడా! నా కావిషయము తెలియదు" అని చెప్పగా యాజ్ఞవల్క్యుడే "నీ వీదేహపతనానంతర మెచటికి పోవుదువో నేను చెప్పెదు" ననెను. అంత నాజనకుడు చెప్పుమనెను.

శ్రు॥ తస్మిన్ శుక్ల ముత నీల మాహుః పింగళగ్ం హరితం లోహితం చ ఏష పంథా బ్రహ్మణా హానువి త్తః తే నైతి బ్రహ్మవి త్పుణ్యకృ త్తైజసశ్చ

తా॥ యోగదర్శనానుయాయులు యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధు లనుపేరుగల యెనిమిది అంగములతో నొప్పు యోగాభ్యాసముచేత సుషుమ్న మొదలగు నాడులద్వారా మోక్షమునొందుటను చెప్పుదురు. అందొకనాడి శుక్లవర్ణముగాను, మరియొకటి నీలవర్ణముగాను ఇత్యాదిభిన్నభిన్నముగా

నుండును. గాన ఒక్కొక యోగి మోక్షమార్గము శుక్లముగా నుండు నని, మరియొక యోగి మోక్షమార్గము నీలముగా నుండునని పలువిధ ముల పలుకుదురు. ఇదియంతయు జగత్తులో నొకపుణ్యభాగవిశేష మగుబ్రహ్మలోకమార్గమేగాని మోక్ష మెంతమాత్రము గాదు. ఆత్మ స్వరూపజ్ఞానము గల్గి ఆత్మకాముడుమాత్రమేయై చక్షురాదిసర్వేంద్రి యములకు నధిష్ఠానమాత్రమే ఆత్మయని తెలిసికొని వాని నన్నిటిని ఆత్మయందు సమవనయనమొనర్చుటయే మోక్ష మనబడును. ఇది సర్వకర్మసన్న్యాసమొనర్చి వేదాంతశ్రవణమననాదిక మొనర్చిన బ్రాహ్మణునిస్వరూపమే యని గుర్తింపబడినది. అట్టే ఎప్పటికి నట్టి వారియందరచేత గుర్తింపబడవలెను. అట్టివాడు మున్ముందగ్ని హోత్రాదివేదవిహితసత్కర్మల నీశ్వరార్పణబుద్ధితో నాచరించి, ఆ పైన సర్వకర్మసన్న్యాసమొనర్చి స్వప్రకాశ మగుపరబ్రహ్మతేజస్సు నందు తనఆత్మరూపమును కలసినట్లు గుర్తించును. ఇదియే మోక్ష ముగాని యింతకంటె వేరుగా మోక్షమనునది పదార్థాంతరము గాదు.

శ్రు॥ ఆత్మానం చే ద్విజానీయా దయ మస్మీతి పూరుషః
కి మిచ్ఛ న్కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్.

తా॥ ఈ మంత్రముచే జీవన్ముక్తు డగుమహామహుని తృప్తి వర్ణింపబడుచున్నది. స్వరూపముచే సచ్చిదానందరూపుడయ్యును అనృత జడదుఃఖపరిచ్ఛిన్న మగుదేహేంద్రియసంఘాతముతో అధ్యాసను బొంది వ్యవహరించుజీవుడిచట పురుషశబ్దమున కర్థము. అట్టివ్యవ హారమునకు కారణ మగునధ్యాసను పోగొట్టుకొని తననిజరూప మగు సత్యజ్ఞానానంతానందరూపమే తా నను నిశ్చయము నొందినపుడు వాని కంటె భిన్న మగుజగత్తు లేనందున వాడే సర్వము నగుటచే వాని కెట్టి కోరికయు నుండదు.

శ్రు॥ యస్యానువిత్తః ప్రతిబుద్ధ ఆత్మాస్మి న్సందేహ్యే గహనే ప్రతిష్ఠః స విశ్వకృ త్సహి సర్వస్య కర్తా తస్య లోక స్స ఉ లోక ఏవ.

తా॥ బాహ్యప్రపంచమందలి ప్రతివస్తువును పాంచభౌతికమై యున్నది. గాన పంచభూతకార్యము లగుచక్షుశ్శ్రోత్రాదీంద్రియముల ద్వారా అనుభవింపబడుచున్నది. ఈ చక్షురాదు లాత్మచైతన్య సత్తవలననే ఆయారూపగ్రహణాదిసామర్థ్యము గలవి యగుచున్నవి. ఏలయనగా శబ్దస్పర్శాదిగుణములద్వారా ఆకాశాదిభూతము లన్నియు విషయములే యగుచున్నవి. గాన చక్షురాదీంద్రియములుగూడ విషయకోటిలోనే పడుచున్నవి. అనగా కర్మ లగుచున్నవి. వీనికి కర్త యుండితీరవలయునుగదా. ఈ లోకసిద్ధన్యాయముచేతనే చక్షురాది సర్వేంద్రియవ్యాపారమందును తదాశ్రయమైనఆత్మ స్ఫుటముగా గోచరించుచున్నది. ఇట్లబ్రహ్మవేత్తకు ప్రతివిషయమందును ప్రతీంద్రియవృత్తియందును ఆత్మ గోచరించునో వానికి దేహమందును ఇంద్రియములందును భౌతికదృష్టి పోయి, దేహాశ్రియ సుఖదుఃఖాద్యనర్థము లుండవు. వాడే సమస్తబ్రహ్మాండమునకు నాత్మ యగును. వాడే బ్రహ్మాండ మగును. వాడే సర్వము- సర్వము వాడే అగును

శ్రు॥ అతః పాప మకరవ మిత్యతః కల్యాణ మకరవ మి
ఉహైవేష ఏతే తరతి నైనం కృతాకృతే తపతః.

తా॥ ఇట్టిబ్రహ్మజ్ఞానము కలుగకపూర్వము జీవుడు తా నున్న స్థితికంటె గొప్పస్థితిని పొందుటకు వేదముచే శ్రేయస్సాధనములుగా బోధింపబడినపుణ్యకర్మ లొనర్చి శ్రేయస్సును బొందును. స్వభావసిద్ధమగుప్రవృత్తివలన ప్రాప్తమగు అభక్ష్యభక్షణాదులవలనను శ్రేయస్సాధనము లగుకర్మల నాచరింపకపోవుటవలనను పాపమును పొందును. గాని యీబ్రహ్మవేత్త తానే సర్వమునగుటచే నీతని కాపుణ్యపాప సంబంధ ముండ నేరదు.

శ్రు॥ తదేత దృచాభ్యుక్తం ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న వర్ధతే కర్మణా నో కనీయాన్, తస్యైవ స్యాత్పద విత్తం విదిత్వా న లిప్యతే కర్మణా పాపకేనేతి తస్మా దేవంవి

చ్ఛాన్తో దాంత ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వా
ఆత్మన్యే వాత్మానం పశ్యతి సర్వ మాత్మానం పశ్యతి,
నైనం పాప్మా తరతి. సర్వం పాప్మానం తరతి.
విపాపో విరజో విచికిత్సో బ్రాహ్మణో భవ త్యేష
బ్రహ్మలోక స్సమ్రా డితిహోవాచ యాజ్ఞవల్క్యః.

తా॥ ఇట్లసత్యజడదుఃఖపరిచ్ఛిన్న మగు దేహాదిజగత్తును, సత్య జ్ఞానానందానంత మగుబ్రహ్మమును పరస్పరవిలక్షణములగుటచే వేరు చేసి తనదేహము నాత్మకంటె భిన్నమైనదానినిగా చూడక అట్లే సర్వ లోకమును తనఆత్మకంటె వేరుగాదని నిశ్చయము గలవాడైన బ్రాహ్మ ణునియొక్క బ్రహ్మభావము సర్వకాలములందు నేకరీతిగా నుండును. పుణ్యకర్మలచే వృద్ధినిగాని పాపకర్మలచే క్షయమునుగాని బొందదు. కాన ఇట్టిబ్రహ్మవేత్తకు పుణ్యపాపము లుండవు.

అట్టిస్థితిని సంపాదించుటకు ముందు బాహ్యేంద్రియముల యొక్కయు నంతరింద్రియములయొక్కయు నిగ్రహము గలవాడై యెట్టికోరికలు లేనివాడై శీతోష్ణాదిద్వంద్వములను సహించువాడై ఏకాగ్రబుద్ధితో వేదాంతవాక్యమననాదిక మొనర్చి అట్టిబ్రహ్మభావ మును పొందును. అట్టివానికి పాపముగాని సందేహముగాని పుణ్య కర్మానుష్ఠానముగాని యుండదు. సర్వస్వరూపము తానే యనునిశ్చ యముతో బ్రాహ్మణుడగును. ఇదియే బ్రహ్మలోక మనబడును.

ఇట్లు పైసిద్ధాంతమే బోధింపబడినది. ఇంకను నీబృహదార ణ్యోపనిషత్తునందే మరియొకఘట్టము ప్రదర్శింపబడుచున్నది.

## —♦ మైత్రేయీబ్రాహ్మణము ♦—

శ్రు॥ అథహ యాజ్ఞవల్క్యస్య ద్వే భార్యే బభూవతుః. మై
త్రేయీచ కాత్యాయనీచ. తయోర్హ మైత్రేయీ బ్రహ్మ
వాదినీ బభూవ. స్త్రీప్రజ్ఞైవ తర్హి కాత్యాయనీ- అథహ
యాజ్ఞవల్క్యోఽన్య ద్వృత్త ముపాకరిష్యన్.

తా॥ యాజ్ఞవల్క్యుడనుమహర్షికి కాత్యాయని యనుపేరు గలయొకభార్యయు, మైత్రేయి యనుపేరుగల వేరొకభార్యయు గలరు. అందు లోకమందలిస్త్రీసామాన్య స్వభావము గలది కాత్యాయని- మైత్రేయిమాత్రము బ్రహ్మవాదిని యయ్యెను- ఒకానొకపుడు యాజ్ఞవల్క్యుడు గృహస్థాశ్రమములో నుండి సన్న్యాసాశ్రమమును స్వీకరింపదలచి

శ్రు॥ మైత్రేయీతిహోవాచ యాజ్ఞవల్క్యః ప్రవ్రజిష్యన్వా అరే అహ మస్మాత్ స్థానా దస్మి. హంత తేఽనయా కాత్యాయన్యా అన్తం కరవాణీతి

తా॥ మైత్రేయిని బిలిచి 'నేను సన్న్యాసాశ్రమస్వీకారము చేయదలచితిని. నాయొక్క స్థిరచరరూప మగుఆస్తిని నీకును కాత్యాయనికిని సమానముగా పంచియిచ్చెదను ర'మ్మని చెప్పెను.

శ్రు॥ సాహోవాచ మైత్రేయీ. యన్ను మ ఇయం భగోస్సర్వా పృథివీ విత్తేన పూర్ణా స్యాత్, స్యాన్న్వహం తేన అమృతా ఆహో నేతి- నేతి హోవాచ యాజ్ఞవల్క్యః. యథైవోపకరణవతాం జీవితం తథైవ తే జీవితం స్యాత్ - అమృతత్త్వస్యతు నాశాస్తి విత్తేనేతి.

తా॥ అంతట మైత్రేయి యిట్లనెను. "ఓపూజ్యుడా, మనుష్యలోకమందలి ఐశ్వర్యమునకు పరమావధి సమస్తభూమండలాధిపత్యము గదా. గాన నీఆస్తిగాని ఇంతకంటెగొప్పఆస్తి యగుసర్వభూమండలా ముగాని సర్వధనధాన్యములతో తులతూగునీభూమియంతయు గాని నాకు స్వాధీనమైనచో నే నట్టిదానిచేత మరణధర్మరహిత మగు మోక్షమును పొందగలనా? తెల్పుడని ప్రార్థించెను. అందుకు యాజ్ఞవల్క్యుడు "ధనవంతు లనుభవించుఐహికసుఖముల ననుభవించుటకు సాధ్యమగునుగాని మోక్షము పొందుట కది యెంతమాత్రము సాధ్యము గాజేరద" ని బదులుచెప్పెను.

శ్రు॥ సాహోవాచ మైత్రేయీ; యే నాహం నామృతా స్యాం కి మహం తేన కుర్యాం. య దేవ భగవా న్వేత్థ త దేవ మే విబ్రూహీతి.

తా॥ అంతట నామైత్రేయి యిట్లనెను "ఓపూజ్యుడా! నేను మోక్షమును పొందుటకు సాధనముగాజాలని ఆస్తి నపేక్షింపను. నాకు నీధనధాన్యాదిక మక్కరలేదు. మీరెట్టిమోక్షముకొరకు సన్న్యాసాశ్రమస్వీకార మొనర్చుచుంటిరో అట్టిమోక్షమునే నేనుగూడ పొంద తలచితిని. నాకందులకు సాధనము నుపదేశించి నన్ను కృతార్థురాలనుగా నొనర్పుడని సవినయముగా ప్రార్థించెను.

శ్రు॥ సహోవాచ యాజ్ఞవల్క్యః. ప్రియాబైఖలు నో భవతీ సతీ, ప్రియ మవృధ ద్ధంత, తర్హి భవ త్యేత ద్వ్యాఖ్యాస్యామి తే, వ్యాచక్షాణస్య తు మే నిదిధ్యాసస్వేతి.

తా॥ ఓమైత్రేయీ! నీవు నాకు ప్రియురాలవై ప్రియమునే నాకెల్లపుడు వృద్ధిపొందించితివి. అందుచే నేను సంతోషించి నీవు కోరినమోక్షసాధనము నుపదేశింతును. సావధానురాలవై వినుమని యాజ్ఞవల్క్యుడు పల్కెను.

శ్రు॥ సహోవాచ, నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి. ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి.

తా॥ భార్య తనయొక్కతుష్టికొరకే భర్తను ప్రేమించుచున్నది గాని భర్తృతుష్టికొరకు భర్తను ప్రేమించుట లేదు.

శ్రు॥ నవా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవతి, ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి.

తా॥ భర్త తనయొక్కతుష్టికొరకే భార్యను ప్రేమించుచున్నాడుగాని భార్యతుష్టికొరకు భార్యను ప్రేమించుట లేదు.

శ్రు॥ నవా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవంతి, ఆత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవంతి.

తా॥ తల్లిదండ్రులు తమతుష్టికొరకే పుత్రులను ప్రేమించు చున్నారుగాని పుత్రులతుష్టికొరకు పుత్రులను ప్రేమించుట లేదు.

శ్రు॥ నవా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవతి.
ఆత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి.

తా॥ తనయొక్క తుష్టికొరకే తనకు విత్తము ప్రియమగు చున్నదిగాని విత్తముయొక్క తుష్టికొరకు తనకు విత్తము ప్రియ మగుటలేదు.

శ్రు॥ నవా అరే పశూనాం కామాయ పశవః ప్రియా భవంతి. ఆత్మనస్తు కామాయ పశవః ప్రియా భవంతి.

తా॥ తనతుష్టికొరకే తనకు పశువులు ప్రియము లగుచున్నవి గాని పశువులతుష్టికొరకు తనకు పశువులు ప్రియము లగుట లేదు.

శ్రు॥ నవా అరే బ్రహ్మణః కామాయ బ్రహ్మ ప్రియం భవతి.
ఆత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి.

తా॥ తనతుష్టికొరకే తనకు బ్రాహ్మణజాతి ప్రియమగు చున్నదిగాని బ్రాహ్మణజాతితుష్టికొరకు తనకు బ్రాహ్మణజాతి ప్రియ మగుట లేదు.

శ్రు॥ నవా అరే క్షత్రస్య కామాయ క్షత్రం ప్రియం భవతి.
ఆత్మనస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి.

తా॥ తనతుష్టికొరకే క్షత్రియజాతి తనకు ప్రియమగుచున్నది గాని, క్షత్రియజాతియొక్కతుష్టికొరకు తనకు క్షత్రియజాతి ప్రియ మగుట లేదు.

శ్రు॥ నవా అరే లోకానాం కామాయ లోకాః ప్రియాభవంతి
ఆత్మనస్తు కామాయ లోకాః ప్రియా భవంతి.

తా॥ తనతుష్టికొరకుమాత్రమే తనకు సర్వలోకములును ప్రియ ములగుచున్నవేగాని, లోకములయొక్క తుష్టికొరకు తనకు సర్వలోక ములు ప్రియములగుట లేదు.

శు॥ నవా అరే దేవానాం కామాయ దేవాః ప్రియా భవంతి.
ఆత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవంతి.

తా॥ తనయొక్క తుష్టికొరకుమాత్రమే తనకు దేవతలందరు ప్రియమైనవారగుచున్నారుగాని ఆదేవతలతుష్టికొరకు తనకు దేవతలు ప్రియమగుట లేదు.

శు॥ నవా అరే వేదానాం కామాయ వేదాః ప్రియా భవంతి.
ఆత్మనస్తు కామాయ వేదాః ప్రియా భవంతి.

తా॥ తనయొక్క తుష్టికొరకు మాత్రమే తనకు వేదములు ప్రియము లగుచున్నవిగాని వేదములతుష్టికొరకు తాను వేదములను ప్రేమించుట లేదు.

శు॥ న వా అరే భూతానాం కామాయ భూతాని ప్రియాణి
భవంతి. ఆత్మనస్తు కామాయ భూతాని ప్రియాణి భవంతి.

తా॥ తనయొక్క తుష్టికొరకుమాత్రమే తాను సర్వభూతములను ప్రేమించుచున్నాడుగాని భూతములయొక్క తుష్టికొరకు తాను భూతములను ప్రేమించుట లేదు.

శ్రు॥ నవా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి.
ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి.

తా॥ తనయొక్క తుష్టికొరకుమాత్రమే ప్రతిజీవియు సర్వవస్తువులను ప్రేమించుచున్నాడుగాని సర్వవస్తువులయొక్క తుష్టికొరకు తాను సర్వవస్తువులను ప్రేమించుట లేదు.

శ్రు॥ ఆత్మావా అరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యా
సితవ్యః. మైత్రేయి ఆత్మనిఖ ల్వారే దృష్టే శ్రుతే మతే విజ్ఞాతే
ఇదం సర్వం విదితమ్.

తా॥ ఇట్టిప్రేమకు పరమాస్పద మగుతా నెవరో తననిజరూప మెట్టిదో తెలిసికొనదగియున్నది. అట్లు తెలిసికొనుటకు సాధనము శ్రవణము మననము నిదిధ్యాసము.

పై జెప్పబడినవస్తువులు సమస్తజగత్తునకు నుపలక్షణములై యున్నవి. వాని యన్నిటియందును తనప్రేమాస్పదత్వ ముండుటకు తానే కారణముగాన ఆసర్వజగద్వస్తువులును తననిజరూపమూలక ములే యగుచున్నవి. ఒక కారణవస్తుపరిజ్ఞానమువలన తత్కార్యము లగుసర్వవస్తుపరిజ్ఞానమును కలుగుట లోకసిద్ధము. ఒక మట్టియను కారణవస్తువువలన కుండ, చట్టి, మూకుడు, పిడత, బాన మొదలగు కార్యవస్తువు లనేకము లేర్పడుచున్నవి. కాన మట్టిలోనిపదార్థవిశేష ములు శక్తిసామర్థ్యములు స్వరూపస్వభావాదులు పుష్కలముగా తెలిసికొన్నవానికి తత్కార్యము లగుకుండచట్టిమొదలగు నన్నివస్తు వులయొక్క స్వరూపస్వభావాదులు గోచరమగునుగదా. అట్లే ఆత్మ మూలక మగుసర్వజగత్తులోను ప్రేమాస్పదత్వ మాత్మమూలక మగుటచే, ఆత్మ కారణ మగుచున్నందున అట్టి ఆత్మపరిజ్ఞానమువలన తత్కార్య మగుసర్వజగద్వస్తుతత్త్వము స్ఫుటముగా గోచరమగును.

శ్రు॥ స యథా ఆర్ద్రైధాగ్నే రభ్యాహితస్య పృథగ్ధూమా విని శ్చరం త్యేవంవా అరే అస్య మహతో భూతస్య నిశ్శ్వసితమే వైత ద్యదృగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకా స్సూత్రా ణ్యను వ్యాఖ్యానాని వ్యాఖ్యానా నీష్టగ్ం హుత మాశితం పాయిత మయంచ లోకః పరశ్చ లోక స్సర్వాణిచ భూతా న్యస్యై వైతాని సర్వాణి నిశ్శ్వసితాని.

తా॥ తడికట్టెలమంటవలన వచ్చుపొగలువలె ఈమహాభూత మగుబ్రహ్మమువలన నిశ్శ్వాసములు, పురుషప్రయత్నము లేకుండగనే వెడలినట్లేలోకప్రసిద్ధ మగు ఋగ్వేద, యజుర్వేద, సామవేద అథర్వణ వేదములు బయలువెడలినవి. ఇతిహాస, పురాణ, విద్యా, ఉపనిషత్, శ్లోక, సూత్రాదు లన్నియు ఈవేదములోని యవాంతరవిభాగములే యైయున్నవి. అగ్నిహోత్రాదియాగములు హోమద్రవ్యము లగు

పయోదధ్యాజ్యామిక్షాచరుపురోడాశాదులు, ఉదకాదులు, ఇహ లోకమంతయు పరలోకములన్నియు, సర్వభూతములు-
బ్రహ్మముయొక్క- నిట్టూర్పులవంటివే- సముద్రము, సమస్తోదకము లకు ముఖ్యస్థాన మైనట్లు సమస్తస్పర్శలకు త్వగింద్రియము ముఖ్య స్థానమైనట్లు, సర్వరసములకు జిహ్వేంద్రియము ముఖ్యస్థాన మైనట్లు సర్వగంధములకు ఘ్రాణేంద్రియము ముఖ్యస్థానమైనట్లు సర్వరూపము లకు చక్షురింద్రియము ముఖ్యస్థానమైనట్లు సర్వశబ్దములకు శ్రోత్రేంద్రి యము ముఖ్యస్థానమైనట్లు సర్వసంకల్పములకు మనస్సు ముఖ్యస్థాన మైనట్లు సమస్తవిద్యలకు హృదయము ముఖ్యస్థానమైనట్లు సమస్త కర్మలకు హస్తములు ముఖ్యస్థానమైనట్లు సమస్తానందములకు ఉపస్థేం ద్రియము ముఖ్యస్థానమైనట్లు సమస్తవిసర్గక్రియలకు పాయ్వింద్రియము ముఖ్యస్థానమైనట్లు సర్వగమనక్రియలకు పాదములు ముఖ్యస్థానమైనట్లు ఈ వేదములు సర్వవిజ్ఞానములకు ముఖ్యస్థానము లైనవి. అట్టివేదము లీబ్రహ్మమునకు నిశ్వాసములవలె నప్రయత్నోద్భూతము లైనవి.

శ్రు॥ స యథా సైంధవఘనోఽనంతరోఽబాహ్యః కృత్స్నో రసఘనఏవ ఏవం వా అరే అయ మాత్మాఽనంతరోఽ బాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘనఏవ. ఏతేభ్యో భూతేభ్య స్సము త్థాయ తాన్యే వానువినశ్యతి, న ప్రేత్య సంజ్ఞాస్తీ త్యరే బ్రవీమీతి హోవాచ యాజ్ఞవల్క్యః.

తా॥ దృశ్యము, కార్యము నగునీజగత్తంతయు కారణమగు బ్రహ్మమం దెట్లు లయమగుననగా, ఉప్పుకల్లు లోపలను బయటను అంతట రసఘనమైనట్లు ఈ బ్రహ్మాత్మగూడ ఘనీభూతవిజ్ఞానరూప మైనందున పంచభూతాత్మక మగునీ దేహమం దున్నను, ప్రజ్ఞానఘన రూపమున కెట్టిబాధయు లేక ఆదేహమందలి సకలేంద్రియవృత్తుల లోను ప్రజ్ఞానఘనరూపముతో భాసించుచు ఆదేహము నశించినపుడు ఆయింద్రియవృత్తిజ్ఞానముమాత్రము నశించునుగాని ప్రజ్ఞానఘన రూపముతో నశించక నిత్యముగా నుండును, అనగా అపరోక్షబ్రహ్మ

సాక్షాత్కారము నొందినజ్ఞాని నిత్యజ్ఞానరూపముగా నుండి తిరిగి యెన్నటికిని జననాదిప్రవాహరూపసంసారము నొందడు.

శ్రు॥ స ఏష నేతినేత్యాత్మా, అగృహ్యో నహి గృహ్యతే అశీర్యో నహి శీర్యతే, అసంగో నహి సజ్జతే, సితో నవ్యథతే నరిష్యతి విజ్ఞాతార మరే కేన విజానీయా దిత్యుక్తానుశాస నాసి మైత్రేయి! ఏతావ దరే ఖల్వమృతత్వమితి హోక్త్వా యాజ్ఞవల్క్యో విజహార.

తా॥ లోకమందలి సర్వవస్తువులును వేద్యపదార్థము లగుటచే తెలిసికొనుట యనుక్రియలో కర్మ (object) కోటిలో పడును. ఈ క్రియకు కర్త యుండితీరవలయునుగాన అదియే ఆత్మ- మనస్సు, ఇంద్రియములుగూడ కర్మకోటిలోనే చేరును. అట్టియాత్మను తెలిసి కొనుటకు వేద్య మగుజగద్వస్తువుల నన్నిటిని "ఇది జ్ఞానవిషయ మైనందున నాత్మ గాదు" అని తలచుచు పోగా, చివర కెట్టిసాక్షిబోధ స్వరూపము నిల్చునో అదియే బ్రహ్మాత్మయని నిశ్చయింపవలయును. ఇయ్యది గ్రహణక్రియకుగాని సంబంధక్రియకుగాని శాధ యనుక్రియ కుగాని ఇట్లు సర్వక్రియలకును విషయముగాక విషయి యైనందున దీనిని వైరీతిగా గ్రహింపవలయునేగాని వేరురీతిగా గ్రహింప నలవి గాదు. అనగా జ్ఞాతకంటె వేరుగా నుండక సాక్షిబోధమాత్రరూపుడని భావము. ఇట్లు నిశ్చయముగా గ్రహించినవాడే మోక్షమునొందును. ఇదియే నీకు చెప్పదగినమోక్షసాధనవిద్య యని యాజ్ఞవల్క్యుడు మైత్రేయి కుపదేశించి, సన్న్యసించెను.

—♦ యజుర్వేద సూక్తము ♦—

శ్రు॥ సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్, స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్.

తా॥ సర్వప్రాణిసమష్టిరూపుడగు విరాట్పురుషుడు, అనేక శిరః పాదనేత్రాదులు గలవాడు, అనగా సర్వజీవుల శిరః పాదాదు

లును, ఆయన అంగములేగాని వేరుగావు. ఆయన ఈబ్రహ్మాం గోళము నంతను ఆవరించుటయే గాక, ఇంకను అధికముగా వ్యాపించి యుండెను.

శ్రు॥ పురుష ఏ వేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యం,
ఉతామృతత్వ స్యేశానః య దన్నే నాతిరోహతి.

తా॥ భూత భవిష్య ద్వర్తమానకాలము లన్నిటియందును ఉండు ఈజగమంతయు, ఆనారాయణు డనుపురుషుడే. ఆయన అమృ తత్వమున కధిపతి. ఈయన సర్వప్రాణులకు భోగ్యమగు ఆహారాది నిమిత్తముచే తనకారణావస్థ నతిక్రమించి, జగద్రూపము నొందును.

శ్రు॥ ఏతావా నస్య మహిమా అతో జ్యాయాగ్ శ్చ
పూరుషః పాదోస్య విశ్వాభూతాని, త్రిపాద స్యామృతం దివి.

తా॥ త్రికాలములందలి జగత్తును, ఈయన సామర్థ్య విశేషమే. నిజముగా ఈయన అంతకంటెగూడ అధికుడు. ఈజగ మంతయు ఈయనలో నొకనాల్గవవంతు భాగముమాత్రమే. మిగిలిన మూడుభాగములును స్వప్రకాశముగా నుండును.

శు్రి॥ త్రిపా దూర్ధ్వ ముదై త్పురుషః పాదో స్యేహా భవా
త్పునః తతో విష్వ జ్వ్యక్రామత్. సాశనానశనే అభి.

తా॥ ఈజగత్తుయొక్క స్పర్శలేని మూడుభాగములు గల బ్రహ్మరూపుడు ఈ అజ్ఞానకార్య మగుసంసార గుణదోషములచే స్పృశింపబడకుండును. వీని నాల్గవభాగము మాత్రము మాయావశ మున మాటిమాటికి సృష్టిసంహారాదులచే జగద్రూపము నొందును. ఆసృష్టిలో దేవ, మనుష్య, పశు, పక్ష్యాదిరూపముతో స్థావరజంగ మాది వివిధరూపు డగును.

శ్రు॥ తస్మా ద్విరా డజాయత విరాజో అధి పూరుషః
స జాతో అత్యరిచ్యత పశ్చా ద్భూమి మథో పురః

తా॥ ఈతనివలన బ్రహ్మాండమంతయు తనదేహముగా గల విరాట్టు పుట్టెను. అందుండి ఆదేహమునం దభిమానము గలపురుషుడు పుట్టెను. అనగా పరమాత్మయే తనమాయచే విరాట్టును బ్రహ్మాండమును సృజించి అందు జీవరూపముతో ప్రవేశించి బ్రహ్మాండాభిమాని యగువాడాయెను. ఆతరువాత దేవ, మనుష్యాది వివిధ రూపుడై భూమ్యాదులను సృజించి శరీరములను సృజించెను.

శ్రు॥ య త్పురుషేణ హవిషా, దేవా యజ్ఞ మతన్వత
వసంతో అస్యాసీ దాజ్యం గ్రీష్మ ఇధ్మ శ్శర ద్ధవిః.

తా॥ ఆ దేవశరీరము లేర్పడినతరువాత ఆదేవత లుత్తరసృష్టి కొరకు సాధనముగా నొకయజ్ఞము నొనర్చిరి. అప్పటికి బాహ్యద్రవ్యములు సృజింపబడకపోవుటచే ఆపురుషునిస్వరూపమునే, మనస్సుతో హవిస్సుగా సంకల్పించి మానసికయాగము నొనర్చిరి. అందు వసంతఋతువును ఆజ్యముగాను, గ్రీష్మఋతువును ఇధ్మముగాను, శరదృతువును హవిస్సుగాను సంకల్పించిరి.

శ్రు॥ సప్తాస్యాస న్పరిధయః త్రిస్స ప్త సమిధః కృతాః
దేవా య ద్యజ్ఞం తన్వానాః అబధ్న న్పురుషం పశుమ్.

తా॥ గాయత్ర్యాది సప్తచ్ఛందస్సులును, పరిధులాయెను. దర్శాదీష్టి యాగములందు ఆహవనీయపరిధులు మూడును, ఉత్తరవేది సంబంధములగు పరిధులు మూడును, తూర్పుదిక్కున రాక్షసాదులను పారదోలు ఆదిత్యరూపుడగు పరిధియు గలిసి ఏడుపరిధులును, గాయత్ర్యాది ఛందస్సులే ఆయెను. అట్లే 12 మాసములును 5 ఋతువులును (ఇచట హేమంతశిశిరఋతువులు ఒకే ఋతువుగా పరిగణింపబడెను.) 3 భూమ్యంతరిక్షద్యులోకములు మూడును. ఆదిత్యుడును అనునీ 21 యు సమిధలాయెను. ప్రజాపతియొక్క ప్రాణేంద్రియరూపులగు దేవతలు ఇట్టి మానసికయాగమందు విరాట్పురుషునే పశువుగా భావించిరి.

శ్రు॥ తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాత మగ్రతః
తేన దేవా అయజంత సాధ్యా ఋషయశ్చ యే.

తా॥ ఇట్లు సృష్టిసాధనయోగ్యు లగుప్రజాపతి ప్రాణరూపులును, తదనుకూల మంత్రద్రష్టలును అట్టి పశువుచే మానసయజ్ఞము నొనర్చుచు, యూపమందు పశువును బంధించి ప్రోక్షించిరి.

శ్రు॥ తస్మాద్యజ్ఞాత్సర్వహుతః సంభృతం పృషదాజ్యం పశూగ్
స్తాగ్శ్చక్రే వాయవ్యాన్ ఆరణ్యాన్ గ్రామ్యాశ్చ యే.

తా॥ సర్వాత్మకుడగు పురుషుడు పశువుగాగల యామానసికయాగముచే పెరుగు, నెయ్యి మొదలగు భోగ్యజాతమును వాయు వధిష్ఠానదేవతగాగల గ్రామములం దుండు పశువులును, అరణ్యమం దుండు పశువులును పుట్టెను.

శ్రు॥ తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ యజు స్తస్మా దజాయత.

తా॥ ఆ యజ్ఞమువలననే ఋగ్యజుస్సామము లనువేదత్రయము గాయత్ర్యాదిఛందస్సులును పుట్టెను.

శ్రు॥ తస్మా దశ్వా అజాయంత యే కే చోభయా దతః గావో హ
జజ్ఞిరే తస్మాత్ తస్మా జ్జాతా అజావయః.

తా॥ ఆ యజ్ఞమువలననే అశ్వములును, గాడిద, కంచర గాడిద మొదలగు ఊర్ధ్వాధోదంతయుక్త జంతువులును, గోవులు మేకలును, గొఱ్ఱెలును పుట్టెను.

శ్రు॥ యత్పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్. ముఖం కి
మస్య కౌ బాహూ కా వూరూ పాదా వుచ్యేతే.

తా॥ కొందరు బ్రహ్మవాదు లిట్లు ప్రశ్నించిరి. "ప్రజాపతి ప్రాణరూపులగు నాదేవత లొనర్చుమానసికయాగములోని పశుస్థానీయుడగు విరాట్పురుషు నెన్నివిధములుగా కల్పించిరి ? ఆవిరాట్పురు

షునిముఖ మేది ? బాహువు లెవ్వి? తొడ లెవ్వి ? పాదము లెవ్వి?" యని. అందుకు శ్రుతియే ఇట్లు సమాధాన మిచ్చుచున్నది.

శ్రు॥ బ్రాహ్మణోస్య ముఖ మాసీత్. బాహూ రాజన్యః కృతః. ఊరూ త దస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత.

తా॥ ఆపురుషునకు బ్రాహ్మణజాతియే ముఖము. క్షత్రియ జాతియే బాహువులు. వైశ్యజాతియే తొడలు. శూద్రజాతియే పాదములు ఆయెను.

శ్రు॥ చంద్రమా మనసో జాతః చక్షో స్సూర్యో అజాయత ముఖా దింద్ర శ్చాగ్నిశ్చ ప్రాణా ద్వాయు రజాయత.

తా॥ ఆపురుషుని మనస్సువలన చంద్రుడును, నేత్రమువలన సూర్యుడును. ముఖమువలన ఇంద్రుడు, అగ్నియు, ప్రాణమువలన వాయువును పుట్టిరి.

శ్రు॥ నాభ్యా ఆసీ దంతరిక్షం శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత పద్భ్యాం భూమి ర్దిశ శ్శ్రోత్రాత్, తథా లోకాగ్ం అకల్పయన్.

తా॥ ఆపురుషుని నాభివలన అంతరిక్షలోకమును, శిరస్సువలన ద్యులోకమును, పాదములవలన భూలోకమును, శ్రోత్రేంద్రియమువలన దిక్కులును ఏర్పడెను.

శ్రు॥ వేదాహ మేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమ సస్తు పారే. సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వా ఒభివద న్య దాస్తే.

తా॥ ఇట్టిపురుషుని సాక్షాత్కారము నొందిన మంత్రద్రష్ట తనధ్యానానుభవము నిట్లు ప్రకటించుచున్నాడు. "ఏపురుషుడు దేవ మనుష్యాది శరీరములను, ఆయాజీవులపేర్లను, వివిధముగాచేసి వివిధ ముగా వ్యవహరించుచున్నాడో, అట్టి గొప్పపురుషశ్రేష్ఠుని, అజ్ఞాన మున కావల సూర్యునివలె ప్రకాశించుచున్నవానినిగా నేను చూచితిని."

శ్రు॥ ధాతా పురస్తా ద్య ముదాజహార శక్రః ప్రవిద్వా న్ప్రదిశ శ్చతస్రః త మేవం విద్వా నమృత ఇహాభవతి నాన్యః పంథా అయనాయ విద్య తే.

తా॥ సర్వదిక్కులందు నుండు ప్రాణుల నందరను పూర్తిగా గుర్తించు పరమేశ్వరు డగు ప్రజాపతి ఏ విరాట్పురుషుని ప్రకటింప జేసెనో వానిని ఈరీతిగా సాక్షాత్కారమొనర్చుకొన్న వాడీజన్మ యందు మరణరహితుడగును. అనగా ఏ సాధకుడు "నేనే విరాట్పురుషుడ" నని నిశ్చయముగా గుర్తించునో వానికి అమృతత్వము సిద్ధించును. ఇంతకంటె వేరుగా మోక్షమునకు మరియొక మార్గము లేదు.

శ్రు॥ యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః. తాని ధర్మాణి ప్రథ మాన్యాసన్ తేహ నాకం మహిమాన స్సచంతే యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః.

తా॥ ప్రజాపతి ప్రాణరూపు లగు దేవతలు మానసిక యజ్ఞము చే ప్రజాపతి నారాధించుటయే జగద్రూప వికారములకు ధారకమగు ముఖ్యధర్మ మాయెను. విరాట్ప్రాప్తిరూప మగునాకలోకమందు ఈవిరాట్పురుషోపాసనచే విరాట్తాదాత్మ్యము నొందినపూర్వసాధకు లందరు కలరు. ఈ ఉపాసకుడుగూడ అట్టినాకలోకము నొందును.

శ్రు॥ అద్భ్య స్సంభూతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణ స్సమ వర్తతాధి తస్య త్వష్టా విదధద్రూప మేతి తత్పురుషస్య విశ్వ మాజాన మగ్రే.

తా॥ ఈ విరాట్పురుషుడు పాలయందు వెన్నవలె పృథివ్యప్తేజోవాయ్వాకాశములందుండి జగత్కర్త యగుపరమేశ్వరునివలన పుట్టి బ్రహ్మాండాభిమానియై చతుర్దశ భువనములు తన కవయవములుగా గల్గియుండి దేవమనుష్యాది సర్వజగములను పుట్టించుచున్నాడు.

శ్రు॥ వేదాహ మేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ త మేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పంథా విద్య తేఽయనాయ.

శ్రు॥ ప్రజాపతి శ్చరతి గర్భే అంతః అజాయమానో బహుధా విజాయతే తస్య ధీరాః పరిజానంతి యోనిం మరీచీనాం పద మిచ్ఛంతి వేధసః.

తా॥ బ్రహ్మాండమధ్యమందు ప్రజాపతినై చరించుచున్నాడు. ఇతడు వాస్తవముచే సత్యజ్ఞానానందరూపుడైనను, మాయావశముచే స్థావరజంగమాది బహురూపు డగుచున్నాడు. వాని జగత్కారణ రూపమును విద్వాంసులు గుర్తింతురు. సృష్టికర్త లగుమరీచ్యాదులు ఆప్రజాపతి నుపాసించియే తద్బలముచే సృష్టికర్త లైరి.

శ్రు॥ యో దేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః పూర్వో యో దేవేభ్యో జాతః నమో రుచాయ బ్రాహ్మయే.

తా॥ ఆ పరమేశ్వరుడే దేవతలయొక్క దేవత్వ సిద్ధికొరకు వారలయందు చైతన్యరూపుడై యుండెను. అతడే దేవతలకు పురోహితు డగుబృహస్పతిరూపుడై యుండెను. అతడే దేవత లందరికంటెను ముందు హిరణ్యగర్భరూపముతో పుట్టెను. అట్టి స్వప్రకాశు డగు వేదవేద్యునకు నమస్కారము.

శ్రు॥ రుచం బ్రాహ్మం జనయంతః దేవా అగ్రే త దబ్రువన్ యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్ తస్య దేవా అస న్వశే.

తా॥ దేవతలందరు బ్రహ్మవిద్యా సంప్రదాయ ప్రవర్తనకాలమందు బ్రహ్మచైతన్య తత్వమును విద్యచే తెలిసికొని ఇట్లు పలికిరి. ఓ పరమాత్మా! ఏ బ్రాహ్మణుడు నిన్నిట్లు తెలిసికొనునో అట్టి బ్రహ్మవేత్తకు సర్వదేవతలు వశమం దుందురు.

శ్రు॥ హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ అహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూపం అశ్వినౌ వ్యాత్తం ఇష్టం మ నిషాణ అముం మ నిషాణ సర్వం మ నిషాణ.

తా॥ లజ్జాభిమాని దేవతయు, ఐశ్వర్యాభిమాని దేవతయు నీకు భార్యాస్థానీయులు. అహోరాత్రములు నీకు పార్శ్వస్థానీయములు. నక్షత్రములు నీకు శరీరస్థానీయములు. అశ్వినీదేవతలు నీతెరువబడిన ముఖస్థానీయులు. అట్టి ఓ విరాట్పురుషా! మాచే కోరబడు ఆత్మైక త్వబోధను ఐహికమగు పశుపుత్రాదైశ్వర్యమును సర్వమును ఇచ్చి మమ్ముల ననుగ్రహింపుము.

## —♦ చతుర్వేదసార నారాయణోపనిషత్తు ♦—

ఋగ్వేదము:—

శ్రు॥ అథ పురుషోహవై నారాయణోఽ కామయత. ప్రజాః సృజేయేతి.

తా॥ అంతట నిండియున్ననారాయణుడు అనగా సర్వజీవుల యొక్క నిజరూప మగుబ్రహ్మము సృష్ట్యారంభకాలమందు "నేను బహురూపుడనై ప్రజలను సృజించగల" నని కోరెను.

శ్రు॥ నారాయణా త్ప్రాణో జాయతే. మనస్సర్వేంద్రియాణి చ. ఖం, వాయుః, జ్యోతి, రాపః, పృథివీ విశ్వస్య ధారిణీ.

తా॥ ఆ నారాయణునివలన 25 తత్వములు గలిగెను.

1. ప్రాణా, పాన, వ్యానో, దాన, సమానము లనెడిప్రాణవృత్తులు 5
2. శ్రోత్ర, త్వ, గక్షి, రసనా, ఘ్రాణము లనుజ్ఞానేంద్రియములు 5
3. వాక్పాణిపాదపాయూపస్థ లనుకర్మేంద్రియములు 5
4. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము లనుఅంతరింద్రియములు 4
5. పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనుభూతములు 5

జీవుడు 1

మొత్తము తత్త్వములు 25

శ్రు॥ నారాయణా ద్బ్రహ్మా జాయతే. నారాయణా ద్రుద్రో జాయతే. నారాయణా దింద్రో జాయతే. నారాయణా త్ప్రజాపతిః ప్రజాయతే. నారాయణా ద్ద్వాదశాదిత్యా, రుద్రా వసవ స్సర్వాణి ఛందాంసి, నారాయణా దేవ సముత్పద్యంతే, నారాయణా త్ప్రవర్తంతే, నారాయణే ప్రలీయంతే.

తా॥ ప్రజాపతి, రుద్రుడు, ఇంద్రుడు, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు, సర్వ వేదములు మొదలగుజగత్తంతయు ఆనారాయణునిలోనే పుట్టి, అందే స్థితి నొంది, అందే లయమగుచున్నవి.

శ్రు॥ అథ నిత్యో నారాయణః బ్రహ్మా నారాయణః శివశ్చ నారాయణః శక్రశ్చ నారాయణః ద్యావాపృథివ్యౌచ నారాయణః కాలశ్చ నారాయణః దిశశ్చ నారాయణః విదిశశ్చ నారాయణః ఊర్ధ్వంచ నారాయణః అధశ్చ నారాయణః అంతర్బహిశ్చ నారాయణః నారాయణ ఏవేదం సర్వం. యద్భూతం యచ్చ భవ్యం. నిష్కళంకో నిరంజనో నిర్వికల్పోని రాఖ్యాత శ్శుద్ధో దేవ ఏకో నారాయణః. న ద్వితీయోస్తి కశ్చిత్. య ఏవం వేద, స విష్ణు రేవ భవతి, స విష్ణు రేవ భవతి.

తా॥ ఈనారాయణుడు నిత్యుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు, శుద్ధుడు, సజాతీయవిజాతీయ స్వగతభేదరహితుడు. ప్రజాపతి, రుద్ర, విష్ణు, ఇంద్ర, వసు, రుద్రాదిత్యాది దేవతలును, మనుష్యులును, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు, జరాయుజములు, మొదలగు సర్వజీవరాసులును ఈకాలమం దుండునవి, పూర్వకాలమం దున్నవి, ముందు భవిష్యత్కాలమం దుండబోవునవి- అన్నియు ఈనారాయణుడే. రెండవ వస్తు వెంతమాత్రము లేదు. ఇట్లు గుర్తించినవాడు నారాయణుడే యగుచున్నాడు.

<u>యజుర్వేదము:—</u>

శ్రు॥ ఓమి త్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, నారాయణే త్యుపరిష్టాత్, ఓ మిత్యేకాక్షరం, నమ ఇతి ద్వే అక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి. ఏతద్వై నారాయణ స్యాష్టాక్షరం పదం. యోహవై నారాయణాష్టాక్షరం పద మధ్యేతి, అనుపబ్రువ స్సర్వ మాయు రేతి. విందతే ప్రాజాపత్యం రాయస్పోషం గౌపత్యం, తతోఽమృతత్వ మశ్నుతే, అమృతత్వ మశ్నుత ఇతి–

తా॥ "ఓంనమోనారాయణాయ" అనునది నారాయణాష్టాక్షరీ మంత్రము. దీనిని నిరంతర మేకాగ్రచిత్తముతో నభ్యసించువాడు సర్వాయువు నొంది ధనపశుసమృద్ధి నొంది, ప్రజాపతిలోకము నొంది మరణధర్మరాహిత్యము నొందును. దీనియనుష్ఠానవిశేషము సద్గురుముఖైకవేద్యమై యున్నది.

సామవేదము:—

శ్రు॥ ప్రత్యగానందం బ్రహ్మపురుషం ప్రణవస్వరూపం, అకార ఉకారో మకార ఇతి. తా నేకధా సమభవత్, తదేత దోమితి య ముక్త్వా ముచ్యతే యోగీ జన్మసంసారబంధనాత్. ఓంనమో నారాయణాయేతి మంత్రోపాసకః వైకుంఠభువన లోకం గమిష్యతి. త దిదం పరం పుండరీకం విజ్ఞానఘనం తస్మా త్తటిదాభమాత్రం. బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః సర్వభూతస్థ మేకం నారాయణం కారణ పురుషం అకారణం పరబ్రహ్మోమ్.

తా॥ సర్వజీవసాక్షీ యగుప్రత్యగాత్మ నిత్యానందరూపుడు, ఇదియే ఓంకారస్వరూపము. అందు అకార, ఉకార, మకారము లనుమూడవయవములు గలవు.

అ=బ్రహ్మ లేక స్థూలదేహము.
ఉ=విష్ణువు లేక సూక్ష్మదేహము,
మ=రుద్రుడు లేక కారణదేహము.

కాన ప్రణవమనగా జగత్సృష్టి, స్థితి, సంహారకారణు లగు బ్రహ్మవిష్ణురుద్రులకుగూడ కారణమైనబ్రహ్మము- అట్లే సర్వజీవులకు స్థూల, సూక్ష్మ, కారణదేహములు మూటికిని కారణ మగుఅధిష్ఠాన చైతన్యము. ఈమంత్రానుష్ఠానరీతిని ఆకాలమందు చేయదగిన భావనా విశేషమును సద్గురుమూలకముగా గ్రహించి, ఆరీతిగా ఉపాసించువారు సత్యలోక మనుపేరుగలవైకుంఠలోకమును పొందెదరు.

శ్రు॥ శోకమోహవినిర్ముక్తం విష్ణుం ధ్యాయ న్న సీదతి. ద్వైతా ద్వైత మభయం భవతి. మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ

తా॥ ఓంకార పరబ్రహ్మము, సకలభూతములయం దుండు వాడును కారణపురుషుడును తనకు కారణము లేనివాడును ఓంకార పదవాచ్యుడును అయియున్నాడు. మరియు దుఃఖమోహములు లేని వాడు సర్వవ్యాపకుడును అగునారాయణుని సద్గురువుద్వారా బుద్ధి గుహయం దుండుపరమాత్మగా తెలిసికొని ధ్యానించువాడు దుఃఖం పడు. ద్వైతమునుండి భయములేని అద్వైత మధిగమించుచున్నాడు. ఎవడీలోకమునందు నేను నీవు వాడు వీడు అనెడుభేదబుద్ధితో జూచునో వాడు మృత్యువునుండి మృత్యువును అనగా జననమరణరూపసంసారా నేకజన్మలను బొందుచున్నాడు.

శ్రు॥ హృత్పద్మమధ్యే సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానేత్రే ప్రతి ష్ఠితం ప్రజ్ఞానేత్రే లోకః ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ. స ఏతేన ప్రజ్ఞేనాత్మనా స్మాల్లోకా దుత్క్రమ్యాముష్మిం త్స్వర్గే లోకే సర్వాన్ కామా నాప్త్వాఽమృత స్సమభవ త్సమభవత్.

తా॥ హృదయకమలమధ్యమందు సర్వస్వరూపియు ప్రజ్ఞయే నేత్రముగా గలదియు నగుబ్రహ్మ మున్నది. ఆప్రజ్ఞానము నందే

యున్నది. ప్రజ్ఞానమే ప్రాణులకు నేత్రము. ప్రజ్ఞానమే స్థానము. ప్రజ్ఞానమే బ్రహ్మము. ఇట్లెరింగిన ఉపాసకుడు ప్రజ్ఞాన మనెడిఆత్మచేతనే యీలోకమును విడిచి పరమైన స్వర్గలోకమునందు సకలకామములను బొంది మరణములేనివా డగుచున్నాడు. ఇట్టివా డిక్కడనే జీవన్ముక్తుడై విదేహముక్తిని పొందుచున్నాడు. లేక పరబ్రహ్మ మగుచున్నాడు.

శ్రు॥ యత్ర జ్యోతి రజస్రం యస్మిన్ లోకేఽభ్యర్హితం తస్మిన్మాం ధేహి ప్లవమానామృతే లోకే అక్షితే అమృతత్వం చ గచ్ఛత్యోం నమః.

తా॥ ఏలోకమునందు సదా పరంజ్యోతి ప్రకాశించుచున్నదో, ఏలోకమునందు పూజింపబడుచున్నదో అట్టి అమృతము ప్రవహించుచుండెడి కొరతలేనిలోకమునందు నన్నుంచుము. అమృతత్వమును బొందుచున్నాను; ఓం నమః.

శ్రు॥ ప్రగళితనిజమాయోఽహం నిస్తులదృశి రూపవస్తుమాత్రోఽహమ్। అస్తమితాహంతోఽహం ప్రగళితజగదీశజీవభేదోఽహమ్

తా॥ నేను మాయలేనివాడను, జ్ఞానస్వరూప మయినవస్తుమాత్రుడను. అహంకారము లేనివాడను. జగము, ఈశ్వరుడు, జీవుడు అనుభేదము లేనివాడను.

శ్రు॥ ప్రత్యగభిన్నపరోఽహం విధ్వస్తాశేషవిధినిషేధోఽహమ్ సముదస్తాశ్రమకోఽహం ప్రవితతసుఖపూర్ణసంవిదేవాహమ్.

తా॥ బ్రహ్మమునకు భిన్నముకాని ఉత్తముడను, సకలవిధినిషేధములు లేనివాడను, చక్కగా విడువబడిన ఆశ్రమముగలవాడను, విస్తృతమైనసుఖపూర్ణజ్ఞానవంతుడను.

శ్రు॥ సాక్ష్యహ మనపేక్షోఽహం నిజమహిమని సంస్థితోఽహ మచలోఽహమ్। అజరోఽహ మవ్యయోఽహం పక్షవిపక్షాది భేదవిధురోఽహమ్.

తా॥ నేను సాక్షిగను అపేక్ష లేనివాడుగను నున్నాడను, నేను నామహిమచేతనే యుండువాడను, చలనము లేనివాడను, వార్ధక్యము లేనివాడను, నాశము లేనివాడను, నాపక్షము ఇతరులపక్షము అనెడిభేదము లేనివాడను.

శ్రు॥ అవబోధైకరసోహం మోక్షానన్దైకసిన్ధురేవాహమ్,
సూక్ష్మోహ మక్షరోహం విగళితగుణజాలకేవలాత్మాహమ్.

తా॥ జ్ఞానమునే ముఖ్యరసముగా గలవాడను, మోక్ష మనెడి ఆనందసముద్రముగనే యున్నాడను, సూక్ష్మముగా నున్నాడను, మారుపాటు లేనివాడనై యున్నాను. గుణసమూహములు లేని ఆత్మస్వరూపమాత్రముగ నున్నాడను.

శ్రు॥ నిస్త్రైగుణ్యపదోహం కుక్షిస్థానేకలోకకలనోహమ్
కూటస్థచేతనోహం నిష్క్రియధామాహ మప్రతర్క్యోహమ్.

తా॥ సత్త్వరజస్తమము లనెడిత్రిగుణరహితస్థానముగ నున్నాడను. ఉదరమునం దుండులోకములయొక్క సృష్టి కలవాడుగ నున్నాడను. కూటస్థుడై యుండుచేతనుడుగ నున్నాడను. ఏవిధమైనకార్యమును లేనిజ్యోతిస్స్వరూపుడుగ నున్నాడను.

శ్రు॥ ఏకోహ మవికలోహం నిర్మలనిర్వాణమూర్తిరేవాహమ్
నిరవయవోహ మజోహం కేవలసన్మాత్రసారభూతోహమ్.

తా॥ నేను ఊహవలన దెలియదగినవాడను కాను. నే నొక్కడనే పరిపూర్ణుడనై యున్నాడను, నిర్మల మైనమోక్షస్వరూపిగ నున్నాడను. అవయవములు లేనివాడను. జన్మరహితుడను. సత్తామాత్రసారముగ నున్నాడను.

శ్రు॥ నిరవధినిజబోధోహం శుభతరభావోహ మప్రభేద్యోహమ్ । విభు రహ మనవద్యోహం, నిరవధినిస్సీమసత్త్వమాత్రోహమ్.

తా॥ ఎల్ల లేనిస్వజ్ఞానమాత్రిమై యున్నాడను. అధికమంగళకర మైనస్వరూపిగ నున్నాడను. భేదింపగూడనివాడుగ నున్నాడను. సర్వత్ర వ్యాపించి యుండువాడుగ నున్నాడను. దోషము లేనివాడుగ నున్నాడను. ఎల్లయు (సాటి) అంతమును లేని సత్తామాత్రముగ నున్నాడను.

శ్రు॥ వేద్యోహ మాగమాంతై రారాధ్యోహం సకలభువన హృద్యోహమ్।పరమానందఘనోహం పరమానందైకభూమ రూపోహమ్.

తా॥ నేను వేదాంతముచే దెలియదగినవాడను. నేను ఆరాధింపదగినవాడను, నేను సకలలోకములకును ప్రియుడను. పరమానందఘనుడుగ నున్నాడను. పరమానందమాత్ర మైనసుఖస్వరూపిగా నున్నాడను.

శ్రు॥ శుద్ధోహ మద్వయోహం సంతతభావోహ మాదిశూన్యోహమ్।శమితాఙ్గత్రితయోహం బుద్ధో ముక్తోహ మద్భుతాత్మాహమ్.

తా॥ నేను శుద్ధుడను, నేను రెండవది లేనివాడను, నేను శాశ్వతుడను, నేను ఆదిలేనివాడను, నేను స్థూలసూక్ష్మకారణ శరీరములు లేనివాడను. నేను జ్ఞానస్వరూపుడను, నేను ముక్తుడను, నేను ఆశ్చర్యస్వరూపము గలవాడను.

శ్రు॥ శుద్ధోహ మాన్తరోహం శాశ్వతవిజ్ఞానసమరసాత్మాహమ్।శోధితపరతత్త్వోహం బోధానందైకమూర్తిరేవాహమ్.

తా॥ నేను నిర్మలుడను. నేను అంతర్యామిని. నేను శాశ్వతమైనవిజ్ఞానసమరసస్వరూపుడను. నేను స్ఫుట మైనపరతత్త్వము. నేను సత్యజ్ఞానానందానందస్వరూపుడను. ఇంతకంటె నుత్తమాధికారులు దానిస్వరూపమును పుష్కలముగా నపరోక్షసాక్షాత్కారము నొనర్చుకొని జీవన్ముక్తులై విదేహాముక్తి నొందుదురు.

అధర్వణవేదము:—

శ్రు॥ ఏతదధర్వశిరోఽధీతే; ప్రాత రధీయానో రాత్రికృతం పాపం నాశయతి. సాయ మధీయానో దివసకృతం పాపం నాశయతి. తత్సాయం ప్రాతరధీయానః పాపో అపాపో భవతి, మధ్యందిన మాదిత్యాభిముఖోఽధీయానః పంచమహా పాత కోపపాతకా త్ప్రముచ్యతే. సర్వవేద పారాయణపుణ్యం లభతే. నారాయణసాయుజ్య మవాప్నోతి. నారాయణ సాయుజ్య మవాప్నోతి

తా॥ పైరీతిగా ఈఅధర్వవేదమందలి ఉపనిషత్తును, సద్గురు మూలకముగా అర్థమెరిగి ఉపాసనారీతిని తెలిసికొని, ప్రాతఃకాలమందు పారాయణ చేయువాడు రాత్రియం దొనర్చిన పాపమును పోగొట్టుకొనును. సాయంకాలమందు పారాయణ మొనర్చినచో పగలు చేసిన పాపముపోవును. మధ్యాహ్నకాలమందు సూర్యాభిముఖముగా పారాయణచేసినచో పంచమహాపాతక ఉపపాతకాది దోషములు తొలగిపోవును. నారాయణ సాయుజ్యము నొందును. ఇందలి భావనా విశేషములలో ఎట్టిఅధికారి ఎట్టిభావన యొనర్చునో వానికి తదనురూపమగు ఫలమే వచ్చును. ఉత్తమాధికారియై గురూపదిష్టరీతిగా దీని నుపాసించువాడు బ్రహ్మవేత్త యగును.

—♦ జిజ్ఞాసువునకు నిరంతరము బ్రహ్మానుచింతనమె కర్తవ్యము ♦—

అహమేవ పరం బ్రహ్మ నిశ్చిత్తం చిత్త చింత్యతామ్
చిద్రూపత్వా దసంగత్వా దబాధ్యత్వా త్ప్రయత్నతః.

తా॥ ఓచిత్తమా! చిద్రూపుఁడను స్వయంప్రకాశమానవిజ్ఞానఘనస్వరూపుఁడ నగుటచేతను, అసంగుఁడనగుటచేతను, బాధారహితుఁడనగుటచేతను నేనే పరబ్రహ్మస్వరూపము. ఇట్లు ప్రయత్నపూర్వకముగఁ జింతించుమా.

అహమేవ పరం బ్రహ్మ నచాహం బ్రహ్మణః పృథక్
ఇత్యేవం సముపాసీత బ్రాహ్మణో బ్రహ్మణి స్థితః.

తా॥ స్వస్వరూపభూతమగు బ్రహ్మస్వరూపమాత్రమై యున్న నేనే పరబ్రహ్మమును; బ్రహ్మముకంటె నే నన్యుఁడఁగానని యీవిధముగ బ్రహ్మానుచింతనము సేయవలెను.

భావాద్వైతం సదా కుర్యా త్క్రియాద్వైతం న కర్హిచిత్
అద్వైతం త్రిషు కాలేషు నాద్వైతం గురుణాసహ.

తా॥ భావమందు సర్వదా "సర్వంఖల్విదం బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి" సర్వాత్మక మగుపరబ్రహ్మస్వరూపమే నేనని తననిజస్వరూపము ననుసంధించుచుండవలెను. ఇంతియేగాని క్రియాద్వైతము నెన్నడును జేయరాదు. (అనఁగాఁ గులగోత్రములతోను బుణ్యాపాపములతోను వావివరుసలతోను నాకు నిమిత్తము లేదని కొందఱు అచల వేదాంతినామముల నిడుకొని మఱికొందఱు గోపాలకృష్ణ వల్లభమత వైష్ణవనామములు గైకొని తత్తత్సంప్రదాయరహస్యముల గుర్తెఱుఁగక నీనాసందున నున్నభూతాకాశమె బ్రహ్మమనియు నేపాపముల నొనర్చినను బ్రపత్తితోఁ జెల్లనియు భావించి పరిదృశ్యమాన శరీరాద్యుత్పత్తి వినాశములే జగన్మిథ్యాత్వనిరూపకములనియు శివుఁడు దేవుఁడు గాఁడనుటయె విష్ణుప్రపత్తియనియు వాదించుచు నుచ్ఛృంఖలావృత్తిగ సంచరించుచున్నట్లు సంచరించరాదని భావము) పైవిధముగ భావాద్వైతము త్రికాలములయందుఁ గావింపవలెను. అనఁగా నాదావంతేచ యన్నాస్తి వర్తమానేపి తత్తథా" యని శ్రీగౌడపాదాచార్యులవారు చెప్పినట్లు కల్పితపదార్థములెల్ల స్వప్నగజాదులవలెఁ బూర్వాపరకాలములలో లేమిని వర్తమానకాలములోఁగూడ లేవని తెలిసి వివర్తవాదదృష్టితోఁ జూచినచోఁ ద్రికాలములయందుఁగూడఁ దత్తత్కల్పనాధిష్ఠానభూతమై వెలుఁగుచున్నయద్వైతాత్మతత్త్వము నే చూడగలుగును. ఇంతియేగాని సద్గురువుతో నద్వైతభావన గూడదు; అనఁగా నిజగురుస్వరూపము పూర్వోక్తరీతిని నిజస్వరూపమైనను బ్రహ్మసాక్షాత్కారోపయోగి యగునిర్గ్రంధికాంతఃకరణమును దదవచ్ఛేదకీభూతస్థూలశరీరమును దనకు "తస్య తావదేవ చిర"మ్మనెడి శ్రుతిమ

ర్యాద ననుసరించి బాధితాధ్యాసానువృత్తిగ స్ఫురించినంతవఱకు (యావజ్జీవము లేక యావదారబ్ధము) నిరంతర ముపాస్యమె యగునని భావము.

బాహ్యాచింతా న కర్తవ్యా తథై వాంతరచింతనమ్
సర్వచింతాం పరిత్యజ్య స్వస్థో భవ సదా మునే !

తా॥ బాహ్యాభ్యంతరచింతల వదలి "నాంతఃప్రజ్ఞం నబహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం...ప్రజ్ఞానఘన"మ్మని బాహ్యాభ్యంతరాది జ్ఞానరహితమై విజ్ఞానఘనమైన స్వస్వరూపమాత్రమందే సుఖముగ నుండుము. స్వస్మిన్ తిష్ఠతీతి స్వస్థః=తనయందే తా నుండువాఁడు స్వస్థుఁడు. అనఁగా నహంకారాది దేహాంతము తా ననుకొనినప్పుడు తాను గృహాదులయం దుండె; నేఁ డనేకకోటిబ్రహ్మాండకల్పనాధిష్ఠానచిన్మాత్రుఁడ ననుకొనుటచే "స్వే మహిమ్ని...ప్రతిష్ఠితమ్" ఇత్యాది శ్రుత్యుక్తరీతిగా స్వస్థుఁడవై యుండుమాయని తాత్పర్యము.



## బ్రహ్మానుచింతనము

— జగద్గురు శ్రీశంకర భగవత్పాదాచార్యకృతము —

అహ మాత్మా న చాన్యోస్మి బ్రహ్మైవాహం న శోకభాక్
సచ్చిదానందరూపోహం నిత్యముక్తస్వభావవాన్.

తా॥ నే నాత్మస్వరూపుఁడనేగాని యన్య (దేహాది) స్వరూపుఁడఁగాను. బ్రహ్మస్వరూపుఁడనెగాని శోకాశ్రయుఁడఁగాను. సచ్చిదానంద స్వరూపుఁడను. నిత్యముక్తస్వభావుఁడనై యున్నాను. నిముక్తత్వమనఁగా బంధ మెన్నఁడును లేకుండుట. అనఁగా నేను బద్ధుఁడను సంసారిని సుఖదుఃఖాదులు కలవాఁడ నని పరిభ్రమించిననాఁడ గూడ నీదేహాదులతోఁ బరిభ్రమించినట్లుండినను స్వప్నగజాదులతోఁ బరిభ్రమించుటవంటిదే గావున నాద్యంతకాలశూన్యస్వభావములగు నాయావస్తువులు వర్తమానకాలమున నున్నట్లు తోఁచినను రజ్జుసర్పముభంగి లేనివేగావునఁ ద్రికాలములయందుఁగూడఁ దత్తద్వస్తు

వులుగాని తత్కృతబంధములుగాని మిథ్యాస్వరూపములగుటచే నాత్మ నిత్యముక్తమని భావము. అట్టిస్వరూపమే నేనని యనుసంధించవలెను.

అజ్ఞానా ద్బ్రహ్మణో జాత మాకాశం బుద్బుదోపమమ్
ఆకాశా ద్వాయు రుత్పన్నో వాయో స్తేజ స్తతః పయః.

అద్భ్యశ్చ పృథివీ జాతా తతో వ్రీహియవాదికమ్
పృథ వ్యప్సు పయో వహ్నౌ వహ్ని ర్వాయౌ నభ స్యసౌ.

నభోఽప్యవ్యాకృతే తచ్చ శుద్ధే శుద్ధోఽస్మ్యహం హ్యజః

అహం విష్ణు రహం విష్ణు రహం విష్ణు రహం హరిః
కర్తృభోక్త్రాదికం సర్వం త దవిద్యోత్థ మేవచ.

తా॥ అజ్ఞానవశమున బ్రహ్మమం దాకాశము (వాయువశమున మహార్ణవమున బుద్బుదములవలె) జనించె. అట్లు బ్రహ్మతాదాత్మ్యాపన్న మగునాకాశమునుండి వాయువు, దానివలనఁ దేజస్సు, దానివలన జలమును జనించె. అట్టి జలమువలనఁ బృథివి జనించె. ఆపృథివివలన వ్రీహియవాదికము జనించె. తిరిగి పృథివి జలమందునను, జలము తేజమందునను, దేజస్సు వాయువునందునను, వాయు వాకాశమందునను, ఆకాశ మవ్యాకృతమందునను, అవ్యాకృతము కేవల విశుద్ధ బ్రహ్మమునందునను లయించును. కావున నీవిధముగ సర్వబాధావధీభూతమై అజస్వరూప మగుబ్రహ్మమే నేనని సిద్ధాంతము; గావున నీవిధముగ ముమ్మాటికిని విశ్వవ్యాపక విష్ణుస్వరూపమగు హరిస్వరూపమే నే నగుటచేఁ గర్తృభోక్త్రాదిస్వరూపము లన్నియుఁ బూర్వోక్తావిద్యామాత్రకల్పితములని తెలియవలెను.

అచ్యుతోఽహ మనంతోఽహం గోవిందోఽహ మహం హరిః
ఆనందోఽహ మశేషోఽహ మజోఽహ మమృతోఽస్మ్యహమ్.

తా॥ నే నచ్యుతుఁడను. నే ననంతుఁడను. నేను గోవిందుఁడను. నే నానందస్వరూపుఁడను. నే నశేషస్వరూపుఁడను. నే నజుఁడను. నే నమృతుఁడను.

నిత్యోఽహం నిర్వికల్పోఽహం నిరాకారోఽహ మవ్యయః
సచ్చిదానందరూపోఽహం పంచకోశాదిగోఽస్మ్యహమ్.

తా॥ నేను నిత్యుఁడను నిర్వికల్పుఁడను నిరాకారుఁడను. అవ్యయుఁడను సచ్చిదానందరూపుఁడను. పంచకోశాదులఁ (తత్సృష్ట్వా తదే వానుప్రావిశ దిత్యాదిప్రమాణోక్తరీతిగ) ప్రవేశించియున్నవాఁడను.

అకర్తాహ మభోక్తాహ మసంగః పరమేశ్వరః
సదా మత్సన్నిధానేన చేష్టతే సర్వ మింద్రియమ్.

తా॥ నే నకర్తను. అభోక్తను. అసంగుఁడను. పరమేశ్వరుఁడను. సర్వేంద్రియవర్గముకూడ మత్సన్నిధానముచేత (సర్వేంద్రియగుణాభాస మనెడుప్రమాణము ననుసరించి) వ్యవహరించుచున్నది.

ఆదిమధ్యాంతముక్తోఽహం న బద్ధోఽహం కదాచన
స్వభావనిర్మల శ్శుద్ధ స్సఏ వాహం నసంశయః.

తా॥ ఆదిమధ్యాంతరహితుఁడను. సర్వదా బంధరహితుఁడను. స్వభావనిర్మలుఁడు శుద్ధుఁడు నగుపరమాత్మయే నేను. సంశయము లేదు.

బ్రహ్మైవాహం న సంసారీ ముక్తోఽహ మితి భావయేత్
అశక్నువ న్భావయితుం వాక్య మేత త్సదాభ్యసేత్.

తా॥ నేను బ్రహ్మమేయనియు సంసారిని గా ననియు భావించవలెను. అట్లుభావించుట కసమర్థుఁ డగువాఁడు (బ్రహ్మైవాహం న సంసారీ) 'నేను బ్రహ్మము నే; సంసారిని గా' ననెడివాక్యమునైన నిరంతర మభ్యసింపవలెను.

యదభ్యాసేన తద్భావో భవే ద్భ్రమరకీటవత్
అత్రాపహాయ సందేహ మభ్యసే త్కృతనిశ్చయః.

తా॥ ఏయభ్యాసమున అహం బ్రహ్మాస్మి యనెడు పరోక్షబ్రహ్మాప్తిచేత సాధకుఁడు భ్రమరకీటన్యాయముగ బ్రహ్మభావము

నొందునో కృతనిశ్చయుఁడై నిస్సంశయముగ నట్టియభ్యాసముచే చేయవలెను.

ధ్యానయోగస్తు మాసైకా ద్బ్రహ్మహత్యాం వ్యపోహతి
సంవత్సరం సదాభ్యాసా త్సిద్ధ్యష్టక మవాప్నుయాత్
యావజ్జీవం సదాభ్యాసా జ్జీవన్ముక్తో భవే ద్యతిః

తా॥ ఒకమాసము ధ్యానయోగ మొనర్చినచో బ్రహ్మహత్యాదోషముగూడఁ దొలఁగును. నిరంతరముగ సంవత్సర మభ్యసించినవో నణిమాద్యష్టసిద్ధులు గల్గును. యతియై యావజ్జీవము నభ్యాస మొనర్చినచో జీవన్ముక్తుఁ డగును.

నాహం దేహో నచ ప్రాణో నేంద్రియాణి తథైవచ
న మనోఽహం న బుద్ధిశ్చ నైవ చిత్త మహంకృతిః
నాహం పృథ్వీ న సలిలం నచ వహ్ని స్తథానిలః
నచాకాశో న శబ్దశ్చ నచ స్పర్శ స్తథా రసః
నాహం గంధో న రూపంచ న మాయాఽహం న సంసృతిః
సదా సాక్షిస్వరూపత్వా చ్ఛివఏ వాస్మి కేవలః॥

తా॥ నేను దేహము గాను. ప్రాణము గాను. ఇంద్రియములు గాను. మనస్సు గాను బుద్ధి గాను. చిత్తము గాను. అహంకారము గాను. పృథివి గాను. జలము గాను. వహ్ని గాను. వాయువు గాను. ఆకాశము గాను. శబ్దము గాను. స్పర్శము గాను. రసము గాను. గంధము గాను, రూపము గాను. మాయ గాను. సంసారమును గాను. సర్వసాక్షిస్వరూపుఁడ నగుటవలనఁ గేవల పరశివమూర్తినే యై యున్నాఁడ.

మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్
మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మా స్మ్యహ మద్వయమ్॥

తా॥ నాయందే సకల ముత్పన్నమైనది. నాయందే సర్వము ప్రతిష్ఠిత మైనది, నాయందే సర్వము లయించుచున్నది గావున

("యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని, జీవన్తి యత్ప్రయ న్త్యభిసంవిశంతి" "జన్మాద్యస్య యత" ఇత్యాదిప్రమాణసిద్ధమగు) నీ యద్వితీయపరబ్రహ్మమే నేను.

సర్వజ్ఞోహ మనంతోహం సర్వేశ స్సర్వశక్తిమాన్
ఆనందసత్యబోధోహ మితి బ్రహ్మానుచింతనమ్.

తా॥ నేను (య స్సర్వజ్ఞ స్సర్వవి ద్యస్య జ్ఞానమయం తప ఇత్యాదిశ్రుత్యుక్తరీతిగ) సర్వజ్ఞుఁడను ననంతుఁడను సర్వేశ్వరుఁడను సర్వశక్తియుక్తుడను సచ్చిదానందరూపుఁడ ననుభావనయే బ్రహ్మాను చింతనము.

అయం ప్రపంచో మిథ్యైవ సత్యం బ్రహ్మాహ మవ్యయమ్
అత్ర ప్రమాణం వేదాంతా గురవోఽనుభవ స్తథా.

తా॥ ఈప్రపంచము మిథ్యయే. సత్య మగుబ్రహ్మమే నేను. ఈవిషయములో సమస్తవేదాంతములు అనఁగా "వాచారంభణం వికారో నామధేయం" "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "తత్త్వ మసి" ఇత్యాదులును సద్గురువులు—అనఁగా "బ్రహ్మ సత్యం జగ న్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపర" ఇత్యాద్యాదేశకు లగుశ్రీమద్భగవత్పాదులు, విద్వదనుభవము—అనఁగా "అర్థా దర్థాంతరం చిత్తే యాతి మధ్యేహి యా స్థితిః।నిరస్తమననాయాసా స్వరూపస్థితి రుచ్యతే" "నద్వైతం భాసతే నాపి నిద్రా తత్రాస్తి య త్సుఖం" "సంశాంతసర్వసంకల్పా యా శిలాంతరివస్థితిః। జాడ్యనిద్రావినిర్ముక్తా సా స్వరూపస్థితి ర్మతా" ఇత్యాదిస్వరూపము— ఇవి యన్నియుఁ బ్రమాణములు.

బ్రహ్మైవాహం న సంసారీ న చాహం బ్రహ్మణః పృథక్
నాహం దేహో న మే దేహః కేవలోఽహం సనాతనః.

ఏకమే వాద్వయం బ్రహ్మ బ్రహ్మణో నేహ కించన.

తా॥ నేను బ్రహ్మమునే. సంసారిని గాను. బ్రహ్మముకంటె వేఱు గాను. నేను దేహము గాను. నాకు దేహము లేదు. కేవలము

సనాతనస్వరూపుఁడను, సజాతీయవిజాతీయస్వగతభేదరహిత మగు బ్రహ్మమొకంటె నిచట వేఱొకటి యేదియు లేదు.

హృదయకమలమధ్యే దీపవ ద్వేదసారం
ప్రణవమయ మతర్క్యం యోగిభి ర్ధ్యానగమ్యమ్
హరిగురుశివయోగం సర్వభూతస్థ మేకం
సకృదపి మనసా వై చింతయే ద్య స్స ముక్తః.

తా॥ ఏసాధకుఁడు హృదయకమలమధ్యమందు దీపమువలెఁ బ్రకాశించునట్టియు, వేదసారమైనట్టియుఁ, బ్రణవరూప మైనట్టియు, నూహింప సాధ్యము కానట్టియు, యోగివర్యులకు ధ్యానగమ్యమైన ట్టియు, సర్వభూతస్థితమైనట్టియు, నేకమైనట్టి (హరిగురుశివయోగ) రూప మగుపరతత్త్వము నొక్కపర్యాయమైనఁ జింతించునో వాఁడు ముక్తుఁడేయని తెలియవలెను.

ద్వైతం మయ్యఖిలం సముత్థిత మిదం మిథ్యామనఃకల్పితం
తోయం తోయవివర్జితే మరుతలే భ్రాంత్యైవ సిద్ధం నహి
యద్యేవంఖలు దృశ్య మేత దఖిలం నాహం నవాత్మా మమ
ప్రౌఢానందచిదేకసన్మయవపు శ్శుద్ధో స్మ్యఖండో స్మ్యహమ్.

తా॥ మిథ్యాభూత మగుమనస్సుచే నాయందే నిఖిలద్వైత ప్రపంచము కల్పితమై నిర్జలప్రదేశ మగుమరుభూమియందు భ్రాంతి కల్పితతోయముభంగి భాసించుచున్నది. అట్టి యీదృశ్యప్రపంచమం తయు నేను గాను, నాకు సంబంధించినది గాదు. నేను నిరతిశయానంద సచ్చిద్ఘనస్వరూపుఁడను, విశుద్ధస్వరూపుఁడను, అఖండస్వరూపుఁడను.

కిం న ప్రాప్య మతః పురా, కి మధునా లబ్ధం విచారాత్మనా
యస్మా త్తత్సుఖరూపమేవ సతతం జాజ్వల్యమానో స్మ్యహమ్
కింవాపేక్ష్య మిహాపి మ య్యతితరాం మిథ్యావిచారాదికః
ద్వైతాద్వై జ సమరసే మానం పరం సమ్మతమ్.

తా॥ విచారింపకపూర్వ మింతకంటెఁ బొందని దేమున్నది ? ఇప్పుడు విచారముచేసి నే నంతకంటెఁ బొందిన దేమున్నది? (ఏమియు లేదనిభావము) ఏకారణమువలన నిరతిశయానందస్వరూపుఁడనై నిరంతరము జాజ్వల్యమానుఁడనై యుంటినో యందుచే నాకింతకంటె నపేక్షింపఁదగినది యేమిగలదు ? విచారాదిక మంతయు మిథ్యాభూతమే గావునఁ బూర్వశ్లోకోక్తరీతిగ ద్వైతాద్వైతాదివివర్జితమై సమరసమై యున్న స్వరూపమునందు మౌనమే సమ్మతమై యున్నది.

దృశిస్వరూపం గగనోపమం పరం।సకృద్విభాతం త్వజ మేకమక్షరమ్
అలేపకం సర్వగతం యదద్వయం।తదేవ చాహం సకలం విముక్తమ్.

తా॥ దృఙ్మాత్రస్వరూపమై, గగనతుల్యమై, నిరతిశయమై, సద్గురువనుగ్రహముచే నొకక్షణమందు నాకు సాక్షాత్కరించి, యుత్పత్తిరహితమై, యేకమై, వినాశరహితమై, నిష్కళంకమై, సర్వగతమై, యద్వితీయమై యేపరతత్త్వము గలదో యదియే నేను. అట్టినేను సమస్తజ్ఞాతృజ్ఞేయాత్మక ప్రపంచవిముక్తుఁడను.

వ్యవహారో లౌకికో వా శాస్త్రీయోవాఽ న్యథాపి వా
మమాకర్తు రలేపస్య యథారబ్ధం ప్రవర్తతామ్.

తా॥ లౌకికవ్యవహారముగాని శాస్త్రవిహితవ్యవహారముగాని శాస్త్రనిషిద్ధవ్యవహారముగాని నిర్లిప్తుఁడనై యకర్తనైన (పరతత్త్వస్వరూపుఁడనగు) నాకు లేవు. దేహేంద్రియ మనఃప్రాణాద్యుపాధులు చిత్తాదాత్మ్యాధ్యాసరహితములై యారబ్ధానుసారముగఁ బ్రవర్తించుఁగాక.

పరాయా మపురీభూతా పశ్యంత్యాం ద్విదళీకృతా
మధ్యమాయాం ముకుళితా వైఖర్యాం వికసీకృతా.

తా॥ పరాపశ్యంతీమధ్యమావైఖరీరూపము లగుయోగభూమికలయం దంతఃకరణము క్రమముగ నపురీభూతము, ద్విదళీకృతము, ముకుళీకృతము, వికసితమునై యుండును.

శ్రు. యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని
జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే త్తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని.

తా॥ అభ్యాసయోగి యగువాఁడు వాక్కును మనస్సునందు నను, మనస్సును విజ్ఞానమందునను, విజ్ఞానమును మహత్తునందునను, దానిని బరబ్రహ్మమందునను, గ్రమముగ లయింపఁజేయవలయును.

ఇట్లు క్రమసాధనముచే నహమాదివృత్తివిలయవశమునఁ జిత్త సాక్షిత్వ మేర్పడి నిజానందాభివ్యక్తి గలుగును. ఏతద్విషయ మంతయు "యావ ద్యావ దహంకారో విస్మృతోఽభ్యాసయోగతః । తావ త్తావ త్సూక్ష్మదృష్టి ర్నిజానందోఽభిజాయత" ఇత్యాదిరీతుల యోగా నందప్రకరణమున శ్రీవిద్యారణ్యాచరణులు విస్తరించియున్నారు.

జగద్భావం పరిత్యజ్య బ్రహ్మమాత్రత్వభావనా
వాసనాప్రక్షయోపాయ స్సులభ స్సూరిసమ్మతః.

తా॥ బ్రహ్మవివర్తనరూప మగుజగత్తునందు జగద్భావమును బరిత్యజించి నిరంతర మధిష్ఠానబ్రహ్మభావనము సేయునెడల సులభ ముగ జగద్వాసనలు నశించును-అపుడె ముక్తి లభించును. "వాసనా ప్రక్షయో మోక్షః" వాసనలు నిశ్శేషముగ లయించుటే మోక్షమని చెప్పిన యోగవాసిష్ఠాది విద్వత్సమ్మతమార్గ మిదియేయని యెఱుఁగ వలెను.

న నిజం నిజవ ద్భాతి హ్యంతఃకరణజృంభణాత్
అంతఃకరణనాశేన సంవిన్మాత్రస్థితో హరిః

తా॥ మనోవిజృంభణమువలనఁ బరమార్థసత్య మగుసచ్చిదా నందమూర్తి భాసించుటలేదు. పైవిధముగ నంతఃకరణము లయమొం దినచోఁ జిన్మాత్రస్వరూపుఁ డగుశ్రీహరియె నిలిచియుండును. అనఁగాఁ దరంగము సముద్రాంతర్గతమై లయించినపుడు సముద్రమాత్రమే యుండునట్లు దెలియవలెను.

సజాతీయప్రవాహేణ విజాతీయతిరస్కృతిః
నియమోహి సదానందో నియమాత్క్రియతే బుధైః

తా॥ ఏవస్తువును దానను సంధించుచుండెనో తద్భిన్నమగు నణుమాత్రమైనవస్తువుగూడఁ దన్మననకాలములో స్ఫురించకుండ నియమించుటయే ధ్యాననియతియనియు, నపుడే సదానందస్థితియనియు, యోగవిదులు పాటించుచుందురు.

యస్సర్వత్ర బ్రహ్మదృష్ట్యా సర్వం బ్రహ్మైవ పశ్యతి
వాసనాస్తస్య లీయంతే స్వకార్యైస్సహసా సహ॥

తా॥ ఎవ్వఁడు సర్వవస్తువులయందును బ్రహ్మదృష్టిని జేయుచున్నాఁడో యనఁగా బ్రహ్మారోపిత మగుజగత్తు బ్రహ్మసత్తాతిరిక్త సత్తాకము గాదుగావున రజ్జుసర్పమును రజ్జ్వనతిరిక్తమనినట్లు బ్రహ్మమాత్రస్వరూపముగనే జగత్తును జూచుచుండెనో వానికిఁ దత్తద్వస్తుసత్యత్వభ్రాంతిరూపబీజమూలకము లగుతత్తద్వస్తువిషయకవాసన (సంస్కారము) లన్నియు నిర్బీజము లగుటచేఁ బునస్స్మృతిజనకములు గూడఁ గాఁజాలక లయించును. అపుడు "పున స్స్మరణం మన్యే సాధో విస్మరణం పరమ్" తిరిగి స్మృతి గలుగకుండు నట్లుగా సర్వవిస్మృతి గలిగి చిన్మాత్రరూపముగ నుండుటె ముక్తియని యోగవాసిష్ఠమందుఁ జెప్పఁబడినట్లు పరమపదస్థితి గలుగును.

అనుభూతే రభావేపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్
అప్యసత్ప్రాప్యతే ధ్యానా న్నిత్యాప్తం బ్రహ్మ కింపునః?

తా॥ అపరోక్షబ్రహ్మాత్మైక్యవిజ్ఞానము లేనివాఁడు గూడ నావిధమగుజీవబ్రహ్మైక్యపరోక్షజ్ఞానము దృఢమై యున్నచో సద్గురూపదేశము నొంది "యహం బ్రహ్మాస్మి" యని నిరంతరభావనాభ్యాస మొనర్చినచో నపరోక్షానుభూతి గలిగి బ్రహ్మభావము నొందును. ఒకతృణకీటకము నిరంతరభావన చేసినంతమాత్రమున నసదూపమగు భ్రమరస్వరూపమును బొందుచుండ, నొకజీవుఁ డనేకసంస్కారసమవ

ధాన వశమున వివిధస్వాప్నికాకారములఁ బొందుచుండ నిత్యప్రాప్తమైయున్న బ్రహ్మవస్తువును విస్మృత స్వకంఠస్థ మణిహారమువలె లేక దశమునివలెఁ బొందుటలో నాశ్చర్య మేమి గలదు? కావున శ్రవణానధికారియగువాని కట్టియపరోక్షబోధకొఱకుఁ బరోక్షభావనాభ్యాస మత్యావశ్యకము. ఈవిషయమునె "విచారాక్షమమర్త్యాశ్చ తచ్ఛ్రుత్యోపాసతే గురోః" ఈవిధముగా విద్యారణ్యులు సెలవిచ్చిరి.

క్రియానాశే భవే చ్చింతానాశోఽస్మా ద్వాసనాక్షయః
వాసనాప్రక్షయో మోక్ష స్సా జీవన్ముక్తి రిష్యతే॥

తా॥ సర్వకర్మలు నౌపాధికములు, నజ్ఞానకల్పితములే గాని యాత్మస్వరూపభూతుఁడ నగు నాసంబంధములు కావని "తమేత మవిద్యాఖ్య మాత్మానాత్మనో రితరేతరాధ్యాసం పురస్కృత్య సర్వే ప్రమాతృప్రమాణప్రమేయవ్యవహారా లౌకికా వైదికాశ్చ ప్రవృత్తా స్సర్వాణిచ శాస్త్రాణి విధిప్రతిషేధమోక్షపరాణి" ఇత్యాది భగవత్పాదోక్తరీతిని దెలిసికొని యీవిధముగ నాకర్మల వదలినచో ననఁగాఁ దత్తదహంకారాది దేహాద్యుపాధితాదాత్మ్యాధ్యాసము వదలినచోఁ జింతలన్నియు నశించును. దానంజేసి వాసనానాశము ఘటించును. అదియే మోక్షము. అట్టినిర్వాసనా (నిర్గ్రంధిక) స్థితియే జీవన్ముక్తి యనిచెప్పఁబడును.

యద్య త్పశ్యతి చక్షుర్భ్యాం తత్త దాత్మేతి భావయేత్
యద్య చ్ఛృణోతి కర్ణాభ్యాం తత్త దాత్మేతి భావయేత్॥

తా॥ "సర్వంఖల్విదం బ్రహ్మ" సర్వము బ్రహ్మమయం దధ్యస్తమైనపదార్థజాతమే గావున నీచక్షుస్సులతో దేనిని జూతువో నీశ్రోత్రములతో దేనిని వినెదవో మఱి యీవిధముగఁ దత్తదింద్రియములచే నేయేవస్తువులఁ దెలిసికొందువో యాయావస్తువు లన్నియు నాత్మరూపములేయని భావింపనగును. అట్టివాఁ డేయేవ్యవహారములలో నున్నను సంగవిహీనుఁడే గావున "యోగరతోవా భోగరతోవా

సంగరతోవా సంగవిహీనః యస్య బ్రహ్మణి రమతే చిత్తం నందతి నందతి నందత్యేవ" యని శ్రీశంకరభగవత్పాదులు సెలవిచ్చినట్లు నిరంతరానందము నొందుచుండును. కావున నట్టిబ్రహ్మానుసంధానము నిరంతరము గావింపనగును.

క్షణమాత్రం న తిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీం వినా
యథా తిష్ఠంతి బ్రహ్మాద్యా స్సనకాద్యా శ్శుకాదయః.

తా॥ సనకాదులు శుకాదులు నేవిధముగ బ్రహ్మాకారాకారితాంతఃకరణవృత్తి లేక క్షణకాలమైన నుండరో యావిధముగనే జిజ్ఞాసువు లగుసాధకులు సిద్ధు లగుజీవన్ముక్తులును బ్రహ్మానుసంధానము లేక క్షణకాలమైన నుండరు.

ఆనంద మంత ర్నిజ మాశ్రయంత మాశాపిశాచీ మవమానయంతమ్
ఆలోకయంతం జగ దింద్రజాల మాప త్కథం మాంప్రవిశే దసంగమ్

తా॥ మనసులో నిజానందమునే నిరంతర మనుభవించుచు నాశాపిశాచమును దిరస్కరించి జగత్తు నింద్రజాల రూపముగఁ జూచుచున్న యసంగచిద్రూపుఁడ నగున న్నే విపత్తులు బాధించగలవు? ఈవిధముగ బ్రహ్మానుసంధాత యనుకొనును.

అపాణిపాదోఽహ మవాగచక్షు రప్రాణఏవ హ్యమనా హ్యబుద్ధిః
వ్యోమైకపూర్ణోస్మి వినిర్మలోస్మి సదావిముక్తోస్మి చిదేవ కేవలః

తా॥ నాకుఁ బాణిపాదమునవశ్చక్షుః ప్రాణములలో నొక్కటియు లేదు. నిత్యశుద్ధుఁడనై గగనము వాయ్వాద్యంతర్బహిఃపూర్ణమై యున్నట్లు నే ననేకకోటిబ్రహ్మాండముల కంతర్బహిఃపరిపూర్ణుఁడనై నిర్మలుఁడనై నిత్యముక్తకేవల స్వరూపమాత్రుఁడనై ప్రకాశించుచున్నానని యీవిధముగ బ్రహ్మానుసంధానము సేయనగును.

# భగవద్గీతోపదేశము

## 1 ప్రథమాధ్యాయము

### — అర్జునవిషాదయోగము —

1 గీ॥ తత్రాపశ్యత్ స్థితా న్పార్థః పితౄ నథ పితామహాన్
ఆచార్యా న్మాతులా న్భ్రాతౄ న్పుత్రా న్పౌత్రా న్సఖీం స్తథా

తా॥ అర్జునుడు యుద్ధభూమిలో సన్నద్ధులైయున్న వారిలో తనకు తండ్రివరుసలోనివారిని, తాతవరుసలోనివారిని, మామవరుస లోనివారిని ఇట్లే మాతుల, సోదర, పుత్ర, పౌత్రాదుల వావివరుసల లోనివారిని గురువులను చూచి, ఇట్టిబంధువులను యుద్ధమందు చంపుట ధర్మమా? అధర్మమా? యనుసందేహము నొంది, విచారించెను.

2 గీ॥ నిహత్య ధార్తరాష్ట్రా న్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన!
పాపమే వాశ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః.

తా॥ శ్రీకృష్ణునితో నిట్లనుచున్నాడు- దుర్మార్గప్రవర్తకు లగునీదుర్యోధనాదులను యుద్ధమందు చంపినందువలన మనకు పుణ్య మేమైన రాగలదా? పాపమే వచ్చునని తలచెదను.

3 గీ॥ యద్య ప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్.

తా॥ ఈయుద్ధమందు కులక్షయమును మిత్రద్రోహమును కలుగనున్నవి. అయ్యవి కౌరవపక్షమునకు వాటిల్లునా? లేక మనకే వాటిల్లునా? యని నాకు నిర్ణయము కాలేదు. దుర్యోధనాదులు లోభాద్యుపహతు లగుటచే ఈవిషయము నాలోచింపకున్నను మనమైన నాలోచింపవలయును.

4 గీ॥ కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన!

తా॥ ఇట్టికులక్షయకర మగుదోషము యుద్ధమం దున్నదని మనము గ్రహించి యీపాపమునుండి మరలవలయును.

5 గీ॥ యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్.

తా॥ నే నిట్లు ధర్మబద్ధుడనై యుద్ధమొనర్పకున్న నన్ను దుర్యోధనాదులు చంపునెడల అదియు నాకు శ్రేయస్కరమే యగును.

6 గీ॥ తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః.

తా॥ ఇట్లు యుద్ధమొనర్చుట ధర్మమో, యుద్ధమునుండి విరమించుట ధర్మమో తెలియక భూతదయతో గూడి శోకించుచున్న యాయర్జును నుద్దేశించి మధుసూదను డిట్లు పలుకుచున్నాడు-

## 2 ద్వితీయాధ్యాయము - సాంఖ్యయోగము

7 గీ॥ క్లైబ్యం మాస్మగమః పార్థ! నైత త్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వో త్తిష్ఠ పరంతప!

తా॥ ఓ పార్థా! విద్వాంసుడ వగునీ విట్లు శోకింపతగదు. అధర్మశిక్షణసమయమం దసామర్థ్యమును ప్రదర్శింపరాదు. నీమనో దౌర్బల్యమును వీడి, యుద్ధసన్నద్ధుడ వగుమని శ్రీకృష్ణుడు పలుకగా అర్జును డిట్లు తిరిగి పల్కుచున్నాడు-

8 గీ॥ నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్య చ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్. .....
పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః
శిష్య స్తేఽహాం, శాధి మాం త్వాం ప్రపన్నం

తా॥ నా కిపుడు యుద్ధ మొనర్చుట ధర్మమో, మానివేయుట ధర్మమో నిశ్చయము కలుగకున్నది. అందుచే నింద్రియముల నెల్ల శోషింపజేయుదుఃఖము కలుగుచున్నది. ఒకవేళ ఈయుద్ధమందు జయించి సామ్రాజ్యము ననుభవించినను ఈధర్మసందేహము బాధించుచునే యుండును. ఇట్టిధర్మనిర్ణయ మొనర్చుట తనకు చేతకానపుడు విద్యాగురువుల నడిగి తెలిసికొనుట లోకాచార మైయున్నది, గాన నీకు నేను శిష్యుడను. మిమ్ములను గురువులుగా నేను సర్వాత్మనా భావించుచున్నాను గాన నన్ను శాసింపుము అని ప్రార్థించెను- అందుకు శ్రీకృష్ణు డిట్లు ధర్మము నుపదేశించుచున్నాడు.

9 గీ॥ అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః.

తా॥ నీవు విద్వాంసునివలె కాన్పించుచున్నావు గాని దుఃఖింపదగనివారినిగూర్చి దుఃఖించుచున్నావు. పండితులు జీవించినవారిని గూర్చిగాని, మరణించినవారినిగూర్చిగాని దుఃఖింపరు.

10 శ్లో॥ ఋణానుబంధరూపేణ పశుపత్నీసుతాదయః
ఋణక్షయే క్షయం యాంతి కా తత్ర పరివేదనా.

తా॥ పూర్వజన్మలోని కర్మఫలమందలి, ఋణానుబంధమే ఈ జన్మలో మనభార్యా, పుత్ర, పశ్వాదులు. ఆఋణము తీరగానే వారు పోవుదురు. ఇందు దుఃఖింపదగిన దేమున్నది?

11 శ్లో॥ పక్వాని తరుపర్ణాని పతంతి క్రమశో యథా
తథైవ జంతవః కాలే కా తత్ర పరివేదనా.

తా॥ చెట్టుయొక్క ఆకులు మొదలగునవి పరిపాకకాలమందు రాలిపోయినట్లే జీవులందరు పరిపాకకాలమందు నశింతురు. ఇందుకు దుఃఖింపనేల?

12 శ్లో॥ ఇదం కాష్ఠ మిదం కాష్ఠం నద్యాం వహతి సంగమమ్
సంయోగాశ్చ వియోగాశ్చ కా తత్ర పరివేదనా.

తా॥ నదిలో అచ్చటచ్చట అరణ్యాదులలోనుండి కొట్టుకొని వచ్చు కొన్నికట్టెలు కలసికొని కొంతదూరము కలసిపోయి ఒకానొక దీవియందొకకట్టెయు మరొక పొదయందు మరియొక కట్టెయు చిక్కుకొని విడిపోవునట్లే జీవులుగూడ భిన్నభిన్నస్థలములనుండి వచ్చి కొంతకాలము కలసియుండి తిరిగి విడిపోవుదురు. ఇందు దుఃఖింపదగిన దేమున్నది?

13 శ్లో॥ ఏకవృక్షసమారూఢా నానాజాతివిహంగమాః
ప్రభాతే విదిశో యాంతి కా తత్ర పరివేదనా.

తా॥ రాత్రియందొక చెట్టు నాశ్రయించి యనేకజాతిపక్షు లుండి ప్రాతఃకాలమందు భిన్నభిన్న దిక్కులకు పోవునట్లే జీవులు కొంత కాలముమాత్రమే దారపుత్రాదిరూపముతో కలసియుండి తరువాత విడిపోవుచు భిన్నభిన్నకర్మఫలానురూపలోకములకు పోవుదురు. ఇందుకు వగవ నేల?

14 శ్లో॥ యావత్కాలం కరే కర్మ తావ త్తిష్ఠంతి జంతవః
తస్మిన్క్షీణే వినశ్యంతి కా తత్ర పరివేదనా.

తా॥ దేహ మనగా కర్మఫలమే. ఆకర్మఫలము ననుసరించి దేహవ్యాపార ముండును. ఆకర్మఫలము పూర్తికాగానే దేహము నశించును. ఇందుకు దుఃఖ మేల?

15 శ్లో॥ మృణ్మయాని చ భాండాని బహూని వివిధాని చ
భిన్నభాండం పరిత్యజ్య కా తత్ర పరివేదనా?

తా॥ పలురకము లగుమృణ్మయపాత్రలను మనము వాడు కొనుచు అందొక్కటి పగిలిపోయినపుడు తిరిగి క్రొత్తదానిని స్వీక రించుచున్నట్లే దేహములను వదలి క్రొత్తదేహములను స్వీకరింతుము. ఇందుకు వగవనేల?

ఇట్లు దేహపుత్రమిత్రకళత్రాదులతో నీకు గలసంబంధమును మనస్సులోనుండి తొలగించుకొనుము.

16 గీ॥ నత్వే వాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
నచైవ న భవిష్యామ స్సర్వే వయ మతఃపరమ్.

తా॥ నీవు, నేను, ఈయుద్ధరంగమందలిరాజులు, వీరువారననేల, సర్వజీవులును భూత, భవిష్య, ద్వర్తమానకాలము లన్నిటియందును ఉన్నవారమేగాని యొకకాలమం దుండి మరొకకాలమం దుండనివారము గాము. దేహములు పుట్టుట చచ్చుట సర్వలోకప్రత్యక్షముగాన సర్వజీవులు దేహముకంటె విలక్షణులనియు, అట్టివారి నిజరూపము నిత్యమనియు భావము.

17 గీ॥ దేహినోఽస్మి న్యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి.

తా॥ దేహి యగువానికెల్ల ఈదేహమందు బాల్య, కౌమార, యౌవన, వార్ధకాదు లెట్టిపరిణామములో అనేకదేహములప్రాప్తి గూడ నట్టిపరిణామమే గాన విద్వాంసు డీదేహముల జననమరణాదులనుగూర్చి సుఖ, దుఃఖముల నొందడు.

18 గీ॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః

తా॥ సద్వస్తువనగా సత్యమై ఏకాలమందును బాధింపబడనిది. అది యెల్లపు డుండునేగాని దానియభావ మెన్నటికి నుండదు. అసత్తనగా అసత్యమై ఒకకాలమందుమాత్రమే ఒకనికి మాత్రమే భాసించునట్టిది. అట్టివస్తువున కెన్నటికిని పరమార్థసద్భావ ముండదు. వేదవేత్తలచే నీదేహములన్నియు అసద్వస్తువులనియు దేహాధిష్ఠాన మగు నాత్మ యొక్కటియే సద్వస్తువనియు నిర్ణయింపబడినది.

19 గీ॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి

తా॥ ఆసద్వస్తువే సర్వజగమును వ్యాపించియుండి ఎన్నటికిని నశింపక నిత్యముగా నుండును. దీనికి వినాశ మెవరును కలిగింపజాలరు.

20 గీ॥ య ఏనం వేత్తి హంతారం య శ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి, న హన్యతే

తా॥ ఇట్టి దేహాధిష్ఠాన మగునాత్మను చంపువానినిగా తలచు వాడును, చంపబడువానినిగా తలచువాడును వీరిద్దరు ఆత్మజ్ఞానము లేనివారే. ఏలననగా ఈయాత్మ చంపునది గాదు, చంపబడునది గాదు.

21 గీ॥ న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతో౽యం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.

తా॥ ఈయాత్మ, జన్మ, ఉనికి, వృద్ధి, విపరిణామము, అపక్షయము, నాశము అను ఆరుభావవికారములలో నెద్దియు లేనిది. భూత భవిష్యద్వర్తమానకాలము లన్నిటియందు నేకరీతిగా నుండునది. ఈశరీరము నశించినను నశింపక నిత్యముగా చిరస్థాయిగా పురాతన కాలమందుగూడ నూతనముగా నెట్టిహెచ్చుతగ్గులు లేకుండగా నుండునది.

22 గీ॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరో౽పరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.

తా॥ లోకమందు ప్రాతవస్త్రమును పరిత్యజించి నూతనవస్త్రమును ధరించినట్లే జీవు లందరును జీర్ణ మగుశరీరములను పరిత్యజించి నూతనశరీరముల నొందెదరు.

23 గీ॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః.

తా॥ ఈ ఆత్మను శస్త్రములు భేదింపలేవు. అగ్ని తగులబెట్ట లేదు. ఉదకము తడుపలేదు. గాలి యెండింపజేయలేదు.

24 గీ॥ నిత్య స్సర్వగత స్థాణు రచలోయం సనాతనః
అవ్యక్తోయ మచింత్యోయ మవికార్యోయ ముచ్యతే.

తా॥ ఈ ఆత్మ నిత్యమైనది. సర్వవ్యాపకమైనది గనుకనే వ్యాపించదగినప్రదేశాంతరము లేకుంటచే చలనరహితమైనది. ఇంద్రియములకు గోచరము గానిది. మనస్సుతోగూడ ఇట్టిదని ఊహింపరానిది. ఎట్టివికారములను బొందింప నలవిగానిది.

25 గీ॥ జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేऽర్థే న త్వం శోచితు మర్హసి.

తా॥ లోకములో జన్మించినప్రతివ్యక్తికి నెన్నటికైనను మరణము తప్పదు. అట్లే మరణించినవానికి తిరిగి జన్మ తప్పదు. గాన పరిహరింప వీలుగాని యీజననమరణములను గూర్చి నీవు దుఃఖింపదగదు.

26 గీ॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్.

తా॥ ఇట్టిఆత్మస్వరూపమును క్రొత్తగా విన్నవారిలో కొందరాశ్చర్యముగా చూచుటయు, మరికొందరాశ్చర్యముగా పలుకుటయు, నింకకొంద రాశ్చర్యముగా వినుటయు, వేరొకకొంద రాశ్చర్యముగా వినియుగూడ తెలిసికొనకుండుటయు తటస్థించును

27 గీ॥ అథచే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి.

తా॥ నీవు క్షత్రియుడవు, గృహస్థువు, గాన నీధర్మ మగుదుష్టశిక్షణరూప మగునీయుద్ధ మొనరింపకపోవుదువేని స్వధర్మత్యాగదోషము వచ్చుటయేగాక నీ కిదివర కున్నకీర్తిగూడ పోవును.

28 గీ॥ సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే.

తా॥ అట్టియపకీర్తి వచ్చుటకంటె మరణమే మేలు. మరణముకంటెగూడ అపకీర్తి రాదగియుండుపనియే గొప్ప అనర్థహేతువగును.

29 గీ॥ హతోవా ప్రాప్స్యసి స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీమ్.

తా॥ నీ వీయుద్ధమందు గెల్చినచో రాజ్యసౌఖ్యముల ననుభవింపగలవు. ఓడిపోయినచో స్వర్గసౌఖ్యము ననుభవింతువు.

30 గీ॥ నేహాఽభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్పమ ప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.

తా॥ కర్మలన్నియు వర్ణాశ్రమముల ననుసరించియుండిన ఆరంభనాశసంబంధదోషరహితములగును. వీనిని కొంతకాల మాచరించి విడిచినను దోషము లేదు. కాని ఈకర్మలన్నియు జ్ఞానమువలె సాక్షాత్తుగా మోక్షము నీయజాలనివైనను గొప్ప ఆపదలనుండి రక్షించుటకెట్టిచిన్నకర్మధర్మమును సమర్థమే యగును.

31 గీ॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన !
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్.

తా॥ ఐహికసుఖవిశేషములనుగాని, ఆముష్మికసుఖవిశేషములనుగాని అపేక్షించి వాని సిద్ధికొరకు వేదోపదిష్టకర్మల నాచరించు రీతు లనేకశాఖోపశాఖలుగా విస్తరించియున్నవి. మోక్ష మనునిరతిశయసుఖము నపేక్షించువారికి సాధనముగా వేదమం దుపదేశింపబడిన జ్ఞానముమాత్రి మొకేరీతిగా నున్నది.

32 గీ॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున !
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్.

తా॥ వేదములోనికర్మకాండ యంతయు సత్త్వరజస్తమోగుణములతో గూడినకర్మాచరణమును తదనురూప మగుఫలమును ప్రతిపాదించును. వేదములోనిజ్ఞానకాండయంతయు త్రిగుణాతీత మగు నాత్మను బోధించును. నీవు త్రిగుణాతీతుడవై శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వాతీతుడవై ఐహికసుఖముల నపేక్షింపక ఆత్మజ్ఞానివి కమ్మని.

33 గీ॥ యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే
తావా న్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః.

తా॥ వాపీ, కూప, తటాకాదులం దెట్టిఫల మున్నదో సముద్రమం దట్టిఫలము లన్నియు గలవు. అట్లే వేదమందలి అగ్నిహోత్రాది సత్రయాగపర్యంత మగు సర్వయాగములకు గలవేరువేరుఫలము లన్నియు బ్రహ్మజ్ఞానమందు గలవు. వాపీ, కూపాదులందు స్నాన మొనర్చుటచే ఒక్కొక్కదానియం దొక్కొక్కచిన్నఫలముమాత్రమే గలదు. సముద్రస్నానముచే సర్వనదీతీర్థస్నానఫల మంతయు వచ్చును. అట్లే అగ్నిహోత్రాదికమగు ఒక్కొకకర్మాచరణచే ఒక్కొకచిన్న ఫలముమాత్రమే గల్గును. బ్రహ్మజ్ఞానముచే సర్వక్రతుఫల మగునిరతిశయానందమును పొందును. ఇట్టిబ్రహ్మజ్ఞానేచ్ఛ గలుగవలయునన్న వా రీజన్మలోగాని పూర్వజన్మలోగాని ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మానుష్ఠాన మొనర్చి చిత్తశుద్ధి గల్గియుండవలెను.

34 గీ॥ శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.
అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్.
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్
యతతేచ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన.

తా॥ అట్టిచిత్తశుద్ధిగలవాడు క్రమముగా శమదమాదుల నలవరచుకొని నిత్యానిత్యవస్తువివేకము గల్గి ఐహికాముష్మికఫలవైరాగ్యము నొంది మోక్షేచ్ఛతో సర్వకర్మసన్న్యాస మొనర్చి వేదాంతవాక్యశ్రవణమననాదిక మొనర్చి మోక్షమునొందును. ఇట్లు ప్రయత్నించుమధ్యకాలమందే దేహము నశించినచో నాతడు మరుజన్మలో వేదవేత్తలయింటిలో జన్మించి పూర్వదేహ విద్యాకర్మసంబంధ మగు స్మృతి గలవాడై పూర్వజన్మలో తా నొనర్చినప్రయత్నమునకు పై ప్రయత్నమునుమాత్రమే కొనసాగించి మోక్షమునొందును.

35 గీ॥ కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన
మాకర్మఫలహేతు ర్భూ ర్మాతే సంగో స్త్వకర్మణి.

తా॥ నీకు వేదోక్తకర్మల నాచరించుటకుమాత్రమే అధికారము గలదుగాని తత్ఫలమునందు నీ కెంతమాత్రము నధికారము లేదు. స్వర్గాదులుగాని ఉత్కృష్ట దేవతాజన్మలుగాని కావలయు నను కోరిక లేక, ఈశ్వరార్పణబుద్ధితో నీవర్ణాశ్రమోచితకర్మల నాచరింపుము. అంతేగాని ఉదాసీనుడవై స్వధర్మము నాచరింపక యుండవద్దు.

36 గీ॥ బుద్ధియుక్తో జహా తీహ ఉభే సుకృతదుష్కృతే
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్.

తా॥ సుఖదుఃఖములందు సమబుద్ధి గలిగి అనగా పుణ్యపాప ఫలముల నపేక్షింపక ఈశ్వరార్పణబుద్ధితో కర్మల నాచరింపుము. కర్మలందు కౌశలమనగా నిదియే.

37 గీ॥ కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛం త్యనామయమ్.

తా॥ సుఖదుఃఖలాభాలాభములందు సమబుద్ధి గలపండితుడు కర్మఫలమును విడిచి జన్మాదిబంధమునుండి తొలగి ఎట్టిప్రమాదము లేని బ్రహ్మస్థానము నొందును.

38 గీ॥ యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ.

తా॥ ఎపుడు నీదేహాభిమానము పోవునో అపుడు నీవు క్రమముగా మనననిదిధ్యాస లొనర్చి కృతార్థుడ వగుదువు.

39 గీ॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి.

తా॥ వేదాంతవాక్యశ్రవణమందు నీబుద్ధి ఎపుడు స్థిరముగా నుండునో అపుడే నీ కీయోగము సిద్ధించినదని తెలిసికొనుము.

40 గీ॥ ప్రజహాతి యదా కామా న్సర్వా న్పార్థ మనోగతాన్
ఆత్మన్యే వాత్మనా తుష్ట స్స్థితప్రజ్ఞ స్తదోచ్యతే.

తా॥ అంతఃకరణ మెల్లప్పుడు నెద్దియో యొకవృత్తిని కల్గియే యుండును. అట్టిది లేకుండగా చేసి తనస్వరూపమాత్రముతో నుండు వాడే "స్థితప్రజ్ఞు" డనబడును.

[ఇందుకు విరుద్ధముగా మనస్సు ప్రవర్తించుచో గలుగబోవు అనర్థపరంపర వివరింపబడుచున్నది.]

41 గీ॥ ధ్యాయతో విషయా న్పుంస స్సంగ స్తేషూపజాయతే
సంగా త్సంజాయతే కామః కామా త్క్రోధోఽభిజాయతే
క్రోధా ద్భవతి సంమోహ స్సంమోహా త్స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి.

తా॥ శబ్దస్పర్శాదిప్రాపంచికవిషయములను ధ్యానింపగా వాని యందు వాంఛయు దానివలన ప్రాప్త్యుపాయాన్వేషణము, అది సిద్ధింపనిచో క్రోధము దానివలన పరవశతనుచెందుబుద్ధినాశము చివరకు నశించుట ఈ మొదలగుఅనర్థపరంపర గల్గును. కాన విషయములను మనస్సులోనికి ప్రసరింపజేయరాదు.

42 గీ॥ తస్మా ద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః
ఇంద్రియా ణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తా॥ కావున నెవడు తనచక్షురాదిబాహ్యేంద్రియములను మనస్సును ఆయావిషయములపై ప్రసరింపనీయక నిగ్రహించునో వాడు ప్రజ్ఞావంతుడగును.

43 గీ॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాస్యా మంతకాలేపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి.

తా॥ ఇట్టిస్థితియే "బ్రాహ్మీస్థితి" యనబడును. ఇదియే జీవన్ముక్తావస్థ యనిగూడ వ్యవహరింపబడును. ఈస్థితిని దుదకు ప్రాణోత్క్రమణకాలమందు పొందినను మోక్షమునొందునేగాని తిరిగి జనన

మరణపరివాహరూపసంసారధర్మము నొందదు. అర్జును డిట్లు ప్రశ్నించు చున్నాడు.

## 3 తృతీయాధ్యాయము - కర్మయోగము

44 గీ॥ జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన!
త త్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ!

తా॥ ఓకృష్ణా! ఈశ్వరార్పణబుద్ధితో చేయుకర్మానుష్ఠానము కంటె జ్ఞానము గొప్పదని చెప్పితివి. నన్ను తిరిగి ఘోర మగునీకర్మ యం దేల నియోగించుచుంటివో బోధపడకున్నది. గాన వివరింపుమన భగవానుడు చెప్పుచున్నాడు.

45 గీ॥ లోకేస్మి న్ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ!
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్.

తా॥ ఓఅర్జునా! నే నిదివరకు కర్మనిష్ఠను జ్ఞాననిష్ఠను చెప్పితిని. అందు ఆత్మానాత్మవివేకము గల్గి, సర్వకర్మసన్న్యాస మొనర్చినసాంఖ్యులు జ్ఞాననిష్ఠకును, గృహస్థులు కర్మనిష్ఠకును ఉత్తమాధికారు లగుదురు.

46 గీ॥ న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
నచ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి.

తా॥ పైనిష్ఠలు రెండును నామమాత్రములు గావు. కర్మలను ప్రారంభింపక పోయినంతమాత్రముచేతనే నైష్కర్మ్యము నొందడు. సన్న్యసించినంతమాత్రముననే మోక్షము నొందదు.

47 గీ॥ నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః.

తా॥ మనుష్యు డేపనిని చేయకుండ ఒకక్షణకాలముగూడ నుండజాలడు. తనప్రయత్నమున్నను లేకున్నను ప్రతివాడును స్వభావ సిద్ధ మగుకర్మఫలముచేతను సత్త్వరజస్తమోగుణములచేతను ప్రేరితుడై బలవంతముగా నొకానొకపని చేయింపబడుచున్నాడు.

48 గీ॥ య స్త్వింద్రియాణి మనసా నియ మ్యారభతేఽర్జున!
కర్మేంద్రియైః కర్మయోగ మస క్తస్స విశిష్యతే.

తా॥ చక్షురాదీంద్రియములను వివేకబుద్ధితో నిగ్రహించి ఫలాపేక్ష లేక కర్మేంద్రియములచేత కర్మయోగము నారంభించు వాఁడు గొప్పవాఁడు.

49 గీ॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః.

తా॥ నీవు నిత్యము లగుకర్మల నాచరింపుము. కర్మల నొనర్పక పోవుటకంటె కర్మలను జ్ఞాననిష్ఠ కలుగువరకు చేయుచుండుటయే మంచిది. ఇంద్రియములతో పనులు (కర్మలు) చేయకుండగా శరీర యాత్రయే సిద్ధింపదు. గాన నెద్దియో యొకపని చేయుటకంటె శాస్త్రీ యకర్మల నాచరించుటయే మంచిది, అట్లొనర్చినచో క్రమముగా చి త్తశుద్ధి గల్గి జ్ఞాననిష్ఠ కధికారి యగును.

50 గీ॥ సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వం ఏష వో స్త్విష్టకామధుక్.

తా॥ ప్రజాపతి సృష్ట్యారంభకాలమందు ప్రజలను యజ్ఞము లతోఁగూడ సృజించి "మీరు మీమీవర్ణాశ్రమోచితయజ్ఞముల నాచరించినచో మీకోరిక లన్నియు సిద్ధించును" అని మానవులకు బోధించెను, దీనినిబట్టి వర్ణాశ్రమధర్మములు సృష్ట్యాదిలో లేవనియు తరువాత జీవనముకొరకు వర్ణవిభాగమును వృత్తులవిభాగమును ఏర్ప రుపబడినవనియు చెప్పుపాశ్చాత్యవిజ్ఞానవంతులవాదము శ్రుతిస్మృతి విరుద్ధమని తెలియుచున్నది.

51 గీ॥ దేవా న్భావయతానేన తే దేవా భావయంతు వ
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ.
తై ర్దత్తా నప్రదా యైభ్యో యో భుం క్తే స్తేన ఏవ సః
యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః.

తా॥ "ఈయాగములచే మనుష్యులు దేవతల నారాధింపవలయును. వారు సకాలవర్షాదులద్వారా మనుష్యుల కుపకరింపవలెను. ఈప్రకార మన్యోన్యోపకారము చేసికొనుచుండవలె" నని ప్రజాపతి నియమించెను. కాన మనుష్యులు దేవతలవలన తమకీయబడిన సస్యాదికమందు భాగమును ప్రతిదినము దేవతల కీయకుండగనే భుజించునెడల వారు దొంగ లనబడెదరు. అట్లు వారికి భాగముల నిచ్చి ఆ శేషమును భుజించువారు సమస్తపాపనిర్ముక్తు లగుదురు.

ఇవియే దేవయజ్ఞము, మనుష్యయజ్ఞము, భూతయజ్ఞము, పితృయజ్ఞము, బ్రహ్మయజ్ఞము అనుపేర్లతో నున్నవి. అందు బ్రహ్మయజ్ఞము కేవలవేదాధ్యయనముమాత్రమే. మిగిలినయజ్ఞము లన్నియు నొకానొకదేవత నుద్దేశించి తనద్రవ్యమును త్యాగమొనర్చుక్రియారూపములేగాన ఆనాల్గింటిసమూహమే "వైశ్వదేవ" మనబడును. ఇది గృహస్థు చేయదగినయజ్ఞవిశేషము.

### —♦ జ్ఞానయజ్ఞము ♦—

శ్రు॥ తస్యైవం విదుషో యజ్ఞ స్యాత్మా యజమాన శ్శ్రద్ధా పత్నీ శరీర మిధ్మ మురో వేది ర్లోమాని బర్హి ర్వేది శ్శిఖా హృదయం యూపః కామ ఆజ్యం, మన్యుః పశు స్తపోగ్ని ర్దమ శ్శమయితా దక్షిణా వాగ్ఘోతా ప్రాణ ఉద్గాతా చక్షు రధ్వర్యు ర్మనో బ్రహ్మ శ్రోత్ర మగ్నీత్ యావద్ధ్రియతే సా దీక్షా య దశ్నాతి త ద్ధవి ర్య త్పిబతి త దస్య సోమపానం య ద్రమతే త దుపసదో య త్సంచర త్యుపవిశ త్యుత్తిష్ఠతేచ స ప్రవర్గ్యో య న్ముఖం త దాహవనీయో యా వ్యాహృతి రాహుతి ర్య దస్య విజ్ఞానం త జ్జుహోతి య త్సాయం ప్రాత ర త్తి త త్సమిధం య త్ప్రాత ర్మధ్యందినగ్ం సాయం చ తాని సవనాని యే అహోరాత్రే తే దర్శపూర్ణమాసౌ యేర్ధమాసాశ్చ మాసాశ్చ తే చాతుర్మాస్యాని య ఋతవ



స్తై పశుబంధా యే సంవత్సరాశ్చ పరివత్సరాశ్చ తే౽హర్గ
ణా స్సర్వవేదసంవా ఏత త్సత్రం య న్మరణం త దవభృథ
ఏతద్వై జరామర్య మగ్నిహోత్రగ్ం సత్రం య ఏవం విద్వా
నుదగయనే ప్రమీయతే దేవానామేవ మహిమానం గత్వా౽
౽దిత్యస్యచ సాయుజ్యం గచ్ఛ త్యథ యో దక్షిణే ప్రమీ
యతే పితౄణామేవ మహిమానం గత్వా చంద్రమస స్సాయు
జ్యగ్ం సలోకతా మాప్నో త్యేతౌ వై సూర్యాచంద్రమసో
ర్మహిమానౌ బ్రాహ్మణో విద్వా నభిజయతి తస్మా ద్బ్రహ్మ
ణో మహిమాన మాప్నోతి తస్మా ద్బ్రహ్మణో మహిమానమ్

తా॥ జ్ఞాని తనదేహేంద్రియవృత్తులనే యజ్ఞముగా భావించుట యెట్లనగా.

1 దేహేంద్రియాదికమునకు సాక్షిగా నుండువస్తువే యజమాని, 2 అతనిశ్రద్ధయే యీజ్ఞానయజ్ఞమందు పత్ని, 3 శరీరమే ఇధ్మము, 4 వక్షస్థలమే వేది, 5 రోమములే బర్హిస్సు, 6 శిఖయే యాగమందలి వేద మనుదర్భకట్ట, 7 హృదయమే యూపస్తంభము, 8 కామమే ఆజ్యము, 9 మన్యు వనగా కోపమే యాగపశువు, 10 తపస్సే యాగాగ్ని, 11 దమోగుణమే శమయిత (పశువిశసన మొనర్చువాడు), 12 సమర్థ మగువాగింద్రియమే హోత యనుఋత్విక్కు, 13 ప్రాణమే ఉద్గాత యనుఋత్విక్కు, 14 చక్షురింద్రియమే అధ్వర్యు డనుఋత్విక్కు, 15 మనస్సే బ్రహ్మ యనుఋత్విక్కు, 16 శ్రోత్రమే ఆగ్నీధ్రు డనుఋత్విక్కు, 17 శరీర మెంతవర కుండునో అదియే దీక్ష, 18 భుజించునదియే యాగీయహవిస్సు, 19 త్రాగునీళ్ళే యాగమందలి సోమపానము, 20 ఇంద్రియవృత్తులే ఉపసత్తులు, 21 సంచరించుట, కూర్చుండుట, లేచుటలే ప్రవర్గ్యలు. 22 ముఖమే ఆహవనీయము, 23 పలుకుటయే ఆహుతి, 24 (ఇంద్రియ) వృత్తిజ్ఞానహవనమే హోమ

మొనర్చుట, 25 సాయంప్రాతఃకాలములందు భుజించుటయే సమిధలు, 26 ప్రాతర్మధ్యందినసాయంకాలములే యాగమందలి ప్రాతస్సవన, మాధ్యందినసవన, తృతీయసవనములు, 27 అహోరాత్రములే దర్శ పూర్ణమాసయాగములు, 28 పక్షమాసములే చాతుర్మాస్యయాగ ములు, 29 ఋతువులే పశుబంధయాగములు, 30 సంవత్సరములే అహర్గణక్రతువులు, 31 దేహాయుర్దాయమంతయు సర్వస్వదక్షిణ, 32 మరణమే అవభృథము. ఇట్టి దృష్టితో భావించు నీజ్ఞాన యజ్ఞమే జరామరణ జన్మరాహిత్యము నొందించు నగ్నిహోత్ర యాగము.

ఇట్లు జ్ఞానియొక్క చారిత్రమును వేదోక్తాగ్నిహోత్రాది యాగముగా నుపాసించుసాధకు డుత్తరాయణమందు మరణించినచో దేవాద్యైశ్వర్యమును పొంది ఆదిత్యసాయుజ్యమునొందును. దక్షిణా యనమందు మరణించినచో అగ్నిష్వాత్తాదిపితృదేవతైశ్వర్యము నొంది చంద్రసాయుజ్యము నొందును. ఇట్టిసూర్యచంద్రులమహిమ నుపాసించుసాధకుడు కార్యబ్రహ్మలోకము నొంది కల్పాంతమువరకు నచట బ్రహ్మతో సమానముగ నుండి ఆపైని మోక్షము నొందును. అంతేగాని తిరిగి జన్మింపడు.]

51 గీ॥ అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్.

తా॥ అన్నమువలన జీవు లేర్పడెదరు. పర్జన్యునివలన అన్న మేర్పడును. యజ్ఞమువలన పర్జన్యు డేర్పడును. కర్మవలన యజ్ఞ మేర్పడును. కర్మ వేదమువలన నేర్పడును. వేదము బ్రహ్మమువలన నేర్పడెను. అందుచే బ్రహ్మము నిత్యమై సర్వవ్యాపకమై ప్రతికర్మ యందు ననుగతమై యున్నది.

52 గీ॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! స జీవతి.

తా॥ ఇట్లీశ్వరునిచే ప్రవర్తింపజేయబడినజగచ్చక్రము నెవ డనుసరింపడో వాడు పాపమే ఆయుస్సుగా గలవాడును ఇంద్రియలోలుడును వ్యర్థజీవియు నగును.

53 గీ॥ య స్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం నవిద్యతే.

తా॥ ఎవడు తననిజరూప మగుఆత్మయందే ఆసక్తి గల్గి అద్దానిచే తృప్తిచెంది తనస్వరూపనిష్ఠుడై యుండునో వానికి చేయదగినపని యేదియు లేదు.

54 శ్లో॥ [జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః
నైవాస్తి కించి త్కర్తవ్య మస్తిచే న్న స తత్త్వవిత్].

తా॥ మరణధర్మము లేక నిత్యమై సత్యమై ఆనందరూప మగు జ్ఞానముచే తృప్తినొంది కృతకృత్యు డగుజ్ఞానికి కర్తవ్య మెంతమాత్రమును లేదు. వానికి కర్తవ్యమే యున్నయెడల వాడు జ్ఞానియే గాడు.

55 గీ॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోకసంగ్రహమేవాపి సంపశ్య న్కర్తు మర్హసి.

తా॥ జనకుడు మొదలగువారు కర్మమార్గముచేతనే క్రమముగా మోక్షమునొందిరి కాన నీవుగూడ కర్మమార్గనిరతుడ వగుము. లోకులందరు కర్మల నాచరించుట కాదర్శముకొరకైనను నీవు కర్మల నాచరింపుము.

56 గీ॥ యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః
స య త్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే.

తా॥ లోకములో ఆ దేశమందును ఆ కాలమందును ఉన్నవారిలో శ్రేష్ఠు డెట్లాచరించునో సామాన్యజను లందరు నట్లే ఆచరింతురు. ఆశ్రేష్ఠు డెద్దానిని ప్రమాణముగా గైకొనునో సామాన్యు లందరు నద్దానినే యనుసరింతురు.

57 గీ॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి.

తా॥ నా కీమూడులోకములందును చేయదగినపని యెంత మాత్రము లేదు. నేను పొందనిది పొందదగినది ఎట్టిదియు లేదు. అయి నప్పటికి నేను కర్మల నాచరించుచునే యుంటిని. నేను దుష్టశిక్షణ, శిష్టరక్షణకొరకు ప్రవర్తించుచున్నందున నే నాచరించున ట్లితరు లాచరింపవలయు ననెడి యుద్దేశ్యముతో నేను కర్మల నాచరించు చున్నాను.

58 గీ॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్
జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్త స్సమాచరన్.

తా॥ తనకు జ్ఞానముగల్గి తాను కర్మల నాచరింపకున్నను కర్మ లయం దాసక్తిగలవానిని కర్మల నాచరింపవలదని బోధింపరాదు. తనకు జ్ఞానము గల్గి కర్మలవలన ప్రయోజనమున కతీతుడైనను తా నాచరించుచు ఇతరులచే నాచరింపజేయుచుండవలెను.

59 గీ॥ తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః
గుణా గుణేషు వర్తంతే ఇతిమత్వా న సజ్జతే.

తా॥ తత్త్వవేత్త గుణవిభాగమును కర్మవిభాగమును వివేక ముచే గుర్తించి ఇంద్రియరూప మగుగుణములు విషయరూపగుణము లందు ప్రవర్తించుచున్నవిగాని ఆత్మకు వీనితో నెట్టిసంబంధమును లేదు- అనునిశ్చయముతో నుండి ప్రాపంచికవ్యాపారములందు సక్తుడు గాడు.

60 గీ॥ యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేపి కర్మభిః.

తా॥ ఇట్టినావాక్యతాత్పర్యమును గ్రహించి అసూయ లేక శ్రద్ధగలవారై అట్లాచరించుచుందురో వారు ధర్మాధర్మరూపము లగు కర్మలనుండి విముక్తు లగుదురు.

61 గీ॥ యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్
సర్వజ్ఞానవిమూఢాం స్తా న్విద్ధి నష్టా నచేతసః.

తా॥ నేను చెప్పిన యీవైదికసిద్ధాంతము నెవ రసూయతో గూడి నిందించుచు ఆచరింపరో వారన్నిజ్ఞానములందు మూఢులై అవివేకు లగుదురని తెలిసికొనుము.

62 గీ॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి.

తా॥ ప్రతిజీవుడును తనజన్మాంతరకర్మవాసనల కనువుగా ప్రవర్తించును. కాన ఇహజన్మలో వేదోక్తసత్కర్మల నాచరించువారలు పరమం దుత్తమజన్మల నొందెదరు. ఆజన్మాంతరీయకర్మవాసనలే ప్రకృతి యనబడును. అట్టిదానిని మాన్పింప నెవరికిని శక్యముగాదు.

63 గీ॥ ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ.

తా॥ ప్రతీంద్రియ ప్రవృత్తియందును రాగద్వేషములు నియామకము లగును. అనగా తన కొకవస్తువు కావలయు ననురాగ మావస్తుప్రాప్తికొరకు ప్రేరేపించుచున్నది. ఆరాగద్వేషములే జీవునకు ప్రతిబంధకారణములుగాన వివేకి వానికి లోనుగారాదు.

64 గీ॥ శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

తా॥ బాగుగా నాచరింపబడిన ఇతరవర్ణాశ్రమధర్మముకంటె స్వల్పముగా నాచరింపబడిన తనవర్ణాశ్రమధర్మము చాల గొప్పశ్రేయస్సాధన మగును. తన ధర్మము నాచరించుచు నాశ్రమచే మరణించినను ఉత్తమలోకప్రాప్తి గల్గును. పరధర్మ మెంతచక్కగ నాచరించినను ఇహలోకమం దనర్థములును పరలోకమందు నీచజన్మలును గల్గును.

65 గీ॥ అథ కేన ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః.

తా॥ అర్జును డిట్లు కృష్ణుని ప్రశ్నించుచున్నాడు. పురుషులందరును తమకు కోరిక లేకున్నను బలాత్కారముగా నొకానొక శక్తిచే ప్రేరితులై పాపకార్యములందు ప్రవృత్తు లగుచుండుట లోకసిద్ధమై యున్నది. అట్టిశక్తి విశేష మెద్దియో నాకు తెలుపుము- అనిన అందుకు శ్రీకృష్ణు డిట్లు సమాధాన మిచ్చుచున్నాడు.

66 గీ॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.

తా॥ రజోగుణముయొక్క కార్యవిశేష మగు కామక్రోధలోభమోహాదులు పూర్వజన్మలో చేసినమహాపాపఫలితములై తీవ్రమైన ఆకలితో నీపురుషుని నాయాదుష్టకార్యములందు బలాత్కారముగా నియోగించుచున్నవి.

67 గీ॥ ధూమే నావ్రియతే వహ్ని ర్యథాదర్శో మలేన చ
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్.

తా॥ అగ్ని పొగచేతను, అద్దము మాలిన్యముచేతను, గర్భమందలిశిశువు మావిచేతను ఆవరింపబడియుండున ట్లీపురుషు డీకామక్రోధాదులచే నావరింపబడియుండును.

68 గీ॥ ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేన చ.

తా॥ ఈ కామక్రోధాదు లింద్రియగోచర మగునట్టిరూపము గలవిగావు. వానికార్యముద్వారా అవి గోచరింపవలసినవేగాని స్వరూపముచేత గోచరింపవు. వానిచేత నీపురుషుని వివేకవిజ్ఞాన మాచ్ఛాదింపబడియుండును. కాన వీనికి శత్రువు లాకామక్రోధాదులే.

## 4 చతుర్థాధ్యాయము - జ్ఞానయోగము

69 గీ॥ తస్మా త్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ!
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్.

తా॥ కాబట్టి నీ వింద్రియనిగ్రహ మొనర్చి శ్రేయఃప్రాప్తి సాధనమగు, వివేకవిజ్ఞానమునకు విరోధులు పాపఫలములు నగుకామక్రోధాదులను సంహరింపుము.

70 గీ॥ ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః.

తా॥ ఇంద్రియములకంటె మనస్సు, దానికంటె బుద్ధి, దానికంటె ఆత్మయు శ్రేష్ఠములని వ్యాపకములని కారణములని తెలియుము. ఆత్మయే సర్వకారణముగాన దానికంటె పర మగువస్తు వెద్దియు లేదు.

71 గీ॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్.

తా॥ కావున బుద్ధితో చేయుసర్వకార్యములకు నాత్మ నధిష్ఠానముగా తెలిసికొని నీ దేహాదిక మంతకును నీఆత్మయే అధిష్ఠానమని నిశ్చయించి కామక్రోధాదిశత్రువులను సంహరింపుము.

72 గీ॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్.

తా॥ ఇపుడు నేను నీ కుపదేశించినయోగవిద్యనే పూర్వకాలమందు నేను సూర్యున కుపదేశించితిని. అతడు వైవస్వతమనువునకు, అత డిక్ష్వాకువునకు చెప్పెను.

73 గీ॥ ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప!

తా॥ అట్లు పరంపరాక్రమముచే లోకమం దావిద్య వ్యాప్తి నొందెను. కాని నేటికాలమున కావిద్య లుప్తప్రాయమాయెను.

74 గీ॥ స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్.

తా॥ శ్రేష్ఠము రహస్యమునగు ఆవిద్యనే నే నిపుడు నీవు నాకు భక్తుడ వగుట ననుగ్రహము గల్గి చెప్పితిని.

ఈ మాట విని అర్జును డిట్లు ప్రశ్నించుచున్నాడు.

75 గీ॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి.

తా॥ నీవు నావయస్సు గలవాడవని బాల్యమునుండియు నాయనుభవమై యున్నది. వివస్వంతుడు కృతయుగమందు జన్మించి యున్నట్లు పురాణములందు వినియుంటిని. కాన నీ వాతని కీవిద్య నుపదేశించినట్లు నే నెట్లు గుర్తించగలనో చెప్పుము.

76 గీ॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప!

తా॥ ఓ అర్జునా నీకు నాకు అందరకును ఇదివర కనేకజన్మలు గడచియున్నవి. నే నాజన్మల నన్నింటిని తెలిసికొనియే యుంటిని. నీ వాజన్మల నెరుగవు.

77 గీ॥ అజోపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా.

తా॥ నేను జన్మాదివికారములుగాని నాశనముగాని లేక సర్వజీవులయందును సాక్షిగా నుండి వారల నియమించుచున్నను, నాప్రకృతి నధిష్ఠించి మాయచే పుట్టిన ట్లుందును.

78 గీ॥ యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్.

తా॥ ఎప్పుడు వైదికధర్మమునకు గ్లాని కల్గి అధర్మము ప్రబలునో అప్పుడు నామాయచే నేను పుట్టుచుందును.

79 గీ॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

తా॥ వైదికధర్మానుష్ఠానపరులను రక్షించుటకును తద్విరోధులను శిక్షించుటకును వైదికధర్మమును సుస్థిరమొనర్చుటకును అవసరమైనపుడెల్ల పుట్టుచుందును.

80 గీ॥ జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున!

తా॥ ఎవడు నాజన్మమును నాకర్మలను నే జెప్పసాంఖ్యయోగమును కర్మయోగమును నాప్రకృతిగుణములను పుష్కలముగా గుర్తించునో వా డీదేహమును విడిచినవెనుక మరల జన్మించక పరమాత్మరూప మగునాభావమును పొందును.

81 గీ॥ వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః.

తా॥ రాగద్వేషాదులు లేక తపస్సుచే పాపమును పోగొట్టుకొని జ్ఞానముచే నాఆత్మరూపు లైనబ్రహ్మవేత్త లనేకులు న న్నిట్లు తెలిసికొని తత్ప్రయోజనమును పొందిరి.

82 గీ॥ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహమ్
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః.

తా॥ ఎవ రెవ రెట్టిరీతితో న న్నుపాసింతురో వారలను నే నట్లే పొందుదును. లోకమందలిమనుష్యులు నామార్గము ననుసరింతురు.

83 గీ॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా.

తా॥ ఐహికాముష్మికసుఖమును గోరి దేవతలను వేదోదితరీతిగా మనుష్యులాయావర్ణాశ్రమధర్మముల ననుసరించి యారాధించునెడల తప్పక సిద్ధి కలుగును.

84 గీ॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్.

తా॥ పూర్వజన్మలోని సత్త్వాదిగుణవిభాగము ననుసరించియు స్వకర్మఫలము ననుసరించియు నాయాజీవులీజన్మలో బ్రాహ్మణ,క్షత్రియ వైశ్య, శూద్రు లనునాలుగువర్ణములలో నెద్దియో యొకవర్ణమందలి దంపతులకు జన్మింతురు. ఇట్లువారికర్మల ననుసరించి నేను సృష్టించు చున్నను నేను కర్తను గాను. ఏలననగా వారికర్మఫలమే అందుకు కారణముగాని నేను సాక్షిమాత్రుఁడనే.

85 గీ॥ న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా
మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే.

తా॥ నేను లోకసంగ్రహముకొరకు కర్మల నాచరించు చున్నను నాకు వానిఫలమం దెట్టివాంఛయు లేదనియు నాకు వానితో నెట్టిసంబంధమును లేదనియు నెవరు గుర్తింతురో వారి కందరకు కర్మ బంధ మెంతమాత్రము నుండదు.

86 గీ॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్.

తా॥ ఇట్లాత్మయాథార్థ్యమును గుర్తించినపూర్వకాలికజ్ఞానులు గూడ ఈదృష్టితో కర్మల నాచరించిరి. నీవంశమందలిపెద్ద లందరు అట్లే ప్రవర్తించిరి. కాన నీవుగూడ అట్లే ఆచరింపుము.

87 గీ॥ కిం కర్మ కి మకర్మేతి కవయో ప్యత్ర మోహితాః
త త్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.

తా॥ కర్మయన నేమో అకర్మ యనగా నెట్టిదో పూర్తిగా తెలియక విద్వాంసులుగూడ మోహితు లగుదురు. అట్టివిషయమును తెలిసికొన్నవారు సంసారబంధమునుండి విడిపింపబడెదరు. కాన నీ కావిషయము నుపదేశింతును.

88 గీ॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః.

తా॥ మోక్షమును గోరువాడు మున్ముందు అయావర్ణాశ్రమ
ములకు విధింపబడినకర్మలసిద్ధాంతమును నిషిద్ధకర్మలవిశేషాభిప్రాయ
మును అకర్మ మనగా కర్మసన్న్యాసమును (కామ్యకర్మత్యాగము
నిషిద్ధకర్మత్యాగము కర్మఫలత్యాగము సర్వకర్మపరిత్యాగము కర్మ
మాత్రపరిత్యాగము మొదలగుకర్మల నన్నిటిని శాస్త్రీయమార్గమున
త్యజించుట) తెలిసికొనవలయును.

89 గీ॥ కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్.

తా॥ దేహేంద్రియాదులందు తాదాత్మ్యము నొంది ఫలాపే
క్షతో తనకు విహిత మగుకర్మలందు అకర్మను (అనగా దేహేంద్రి
యాదులు తమతమవ్యాపారముల నొనర్చుచున్నవేగాని నా కేమియు
వీనితో సంబంధము లేదనుభావమును) చూచువాడును. అకర్మయందు
కర్మభావమును చూచువాడును మనుష్యులందరిలో వివేకియై సర్వ
కర్మల నాచరించినఫలముల నన్నిటిని పొందును. అనగా:—

1. దేహాదికము తానని తలచి తనకు విధింపబడినకర్మలను అర్థ
జ్ఞానరహితముగా కేవలము ఫలాపేక్షతో చేయువా రొకతరగతి.

2. కర్మఫలము నపేక్షింపక ఈశ్వరార్పణబుద్ధితో అర్థజ్ఞాన
పూర్వకముగా కర్మల నాచరించువారు రెండవతరగతి.

3. తాను దేహాదికముకంటె విలక్షణమగు ఆత్మ యనునిశ్చ
యము గల్గి లోకసంగ్రహముకొరకు కర్మల నాచరించుచున్నను ఆ
యాయింద్రియములాయాపను లొనర్చుచున్నవేగాని ఆత్మరూపుడ
నగునే నేకర్మను చేయుట లేదనునిశ్చయముతో నాచరించువారలు
మూడవతరగతి.

1 ఫలము – ఇందు మొదటికక్ష్యవారు కొంచెముసుఖము
నిచ్చుస్వర్గలోకమున జన్మించి తిరిగి కర్మఫలానురూపముగా నానా
యోనులందు జననమరణాదికము నొందెదరు.

2 ఫలము - రెండవ కక్ష్యవారు క్రమముగా బ్రహ్మలోకము నొంది, ఆబ్రహ్మమానముచే నూరుసంవత్సరములయనంతరమందు మోక్షము నొందెదరు. లేక చిత్తశుద్ధి గల్గి వేదాంతవాక్యశ్రవణ, మనన, నిదిధ్యాసలను క్రమముగా నొనర్చి ముక్తు లగుదురు.

3 ఫలము - మూడవ కక్ష్యవారు జీవన్ముక్తు లనబడుదురు.

శ్రు॥ క్రియమాణేంద్రియైః కర్మ ణ్యహం కరోమీ త్యధ్యాత్మ నిష్ఠతయా కృతం కర్మైవ కర్మ.

తా॥ ఇంద్రియములచేత చేయబడు కార్యములను "నేను చేయుచున్నాను" అని ఆత్మతో సంబంధింపజేసికొని చేయునట్టిపనియే కర్మయనబడును.

శ్రు॥ కర్తృత్వభోక్తృత్వా ద్యహంకారతయా బన్ధరూపం జన్మాదికారణం నిత్యనైమిత్తికయాగవ్రతతపోదానాదిషు ఫలానభిసంధానం యత్ త దకర్మ.

తా॥ నేను చేయుచున్నాను, నేను భోక్తను... ఇత్యాద్యహంకారముతో గూడినదియు బంధస్వరూప మైనదియు, జననాదులకు కారణమైనదియు నగు నిత్య, నైమిత్తిక, యాగ, వ్రత, తపో, దానాదులను ఫలాపేక్ష లేక చేయునది అకర్మ మనబడును.

శ్రు॥ దేహేంద్రియనిగ్రహ సద్గురూపాసన శ్రవణమనన నిదిధ్యాసనై ర్య ద్య ద్దృగ్దృశ్యస్వరూపం సర్వాంతరస్థం సర్వ సమం ఘటపటాదిపదార్థమనోవికారం వికారేషు చైతన్యం వినా కించి న్నాస్తీతి సాక్షాత్కారానుభవజ్ఞానం కర్మాకర్మ.

తా॥ చూచునట్టియు చూడబడునట్టియు స్వరూపముగను సకలమునందు అంతర్యామిగను సకలమునందు సమముగను ఘటపటాదులవలె వికారము లేనిదిగ నుండుచైతన్యముతప్ప పదార్థములందన్య మేదియు లేదని తెలిసికొని దేహేంద్రియాదుల నిరూపముగా గుర్తించుటయు సద్గురుమూలమున వేదాంతవాక్యశ్రవణ మనన నిది

ధ్యాసాదులచే కలుగుజ్ఞానముతో చేయుకర్మ కర్మగాను, అకర్మము గాదు. రెంటియందును సమదృష్టి గలబుద్ధిమంతుడు

90 గీ॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః.

తా॥ ఎవనిదేహేంద్రియవృత్తు లన్నియు ఫలాభిసంధి లేక తానే ఆత్మ యనియు దేహేంద్రియాదులు ప్రారబ్ధకర్మకార్యము లనియు అవి వానిప్రారబ్ధము ననుసరించి ఆయావిషయములందు ప్రవర్తించుచుండుననియు తనఆత్మకు వానివ్యాపారముతో నెట్టిసంబంధము లేదనియు తలచునో వాడే జ్ఞాని పండితుడు నని చెప్పబడును.

91 గీ॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మ ణ్యభిప్రవృత్తోపి నైవ కించి త్కరోతి సః.

తా॥ కర్మఫలాసక్తిని వదలి నిత్యము తృప్తిరూప మగుజ్ఞానము నొంది కర్మలనుగాని తత్ఫలమునుగాని ఆశ్రయింపక లోకసంగ్రహము కొరకు కర్మల నాచరించుచున్నను అట్టివాడు చేయనివాడే యగును.

92 గీ॥ నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్.

తా॥ ఎట్టికోరిక లేనివాడై ఇంద్రియనిగ్రహము గల్గి ఎట్టి వస్తువులను గ్రహింపక శరీరయాత్రార్థ మగుకర్మనుమాత్రమే చేయువా డెట్టిపాపమును బొందడు.

93 గీ॥ యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే.

తా॥ తనప్రయత్నము లేకయే లబ్ధమగుదానితో తృప్తినొంది శీతోష్ణసుఖదుఃఖాదులను సహించి ఎవరియందును మాత్సర్యము లేనివాడై కార్యము సిద్ధించినను సిద్ధింపకున్నను సమదృష్టితో నుండి కర్మల నాచరించువాడు బంధింపబడడు.

94 గీ॥ గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే.

తా॥ ప్రాపంచికవస్తువులం జాసక్తిని విడిచి కర్మఫలాసక్తి లేక ఈశ్వరార్పణబుద్ధితో యజ్ఞముకొరకు ప్రవర్తించువానికర్మ లన్నియు జ్ఞానమందు పరిసమాప్తము లగును.

95 గీ॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా.

తా॥ ఎవడు హవిస్సును అగ్నిహోత్రమును తనను తా నొనర్చు యాగమును బ్రహ్మభావముతో భావించునో వానిచే పొందదగిన ఫలముగూడ బ్రహ్మమే యగును. అట్టివానికి సర్వజగము బ్రహ్మము గానే భాసించును.

96 గీ॥ దైవమే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి.

తా॥ కొందరు దేవతల నారాధించుయజ్ఞము నొనర్చుచు న్నారు. మరికొందరు జీవబ్రహ్మైక్యానుసంధాన మనెడియజ్ఞము నొనర్చుచున్నారు.

97 గీ॥ శ్రేయా న్ద్రవ్యమయా ద్యజ్ఞాద్ జ్ఞాన యజ్ఞః పరంతప!
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే.

తా॥ చరువు ఆజ్యము దధి పురోడాశము మొదలగుద్రవ్యము లతో జేయుయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము గొప్పశ్రేయస్సు నిచ్చును. కర్మలన్నియు జ్ఞానమందు సమాపము లగును.

98 గీ॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః.

తా॥ అట్టిజ్ఞానయజ్ఞస్వరూపమును తెలిసికొనగోరినవాడు సద్గు రువులను సాష్టాంగనమస్కారపూర్వకముగా శాస్త్రీయముగ

గురూపసదన మొనర్చి వారిని సేవించి ప్రశ్నించినచో వారు నీకి జ్ఞానస్వరూపము నుపదేశింతురు.

99 గీ॥ యద్జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాండవ
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి.

తా॥ అట్టిజ్ఞానము నీకు గలిగినచో నిట్టిమోహము (భ్రాంతి) నెన్నటికిని పొందవు. ఆజ్ఞానముచేత సర్వభూతములందును నీఆత్మస్వరూపమును, నీయందే సర్వభూతములయాత్మను గుర్తింపగలవు.

100 గీ॥ అపిచే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి.

తా॥ ఎట్టిమహాపాపములు చేసినవాడైనను వానినన్నిటిని ఈ జ్ఞానము పోగొట్టుటకు సమర్థమైయున్నది.

101 గీ॥ యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున!
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా.

తా॥ అగ్ని కట్టెల నన్నిటిని భస్మమొనర్చునట్లు ఈజ్ఞానము సర్వపాపకర్మములను భస్మమొనర్చును. అనగా జ్ఞానోదయకాలమందే ఆగామి, సంచిత, ప్రారబ్ధము లనుకర్మవిశేషము లన్నియు నశించునని భావము.

102 గీ॥ నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
త త్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి.

తా॥ జ్ఞానముతో సమాన మగుపవిత్రవస్తు వెచటను లేదు. ఈశ్వరార్పణబుద్ధితో నొనర్చుకర్మలచేతను యమ, నియ, మాసన, ప్రాణాయామ ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధు లనెడియష్టాంగములతో నొప్పుయోగముచేతను చిత్తశుద్ధి నొంది సద్గురుమూలమున వేదాంతవాక్యశ్రవణాదులచే నట్టిజ్ఞానమును బడసి క్రమముగా నపరోక్షాత్మసాక్షాత్కారము నొందవలయును. ఇచ్చట సద్గురువు లభించుకాలమే జ్ఞానమునకు ప్రారంభకాలమని తెలియవలెను.

103 శ్రద్ధావా న్లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి.

తా॥ ఇంద్రియనిగ్రహము గల్గి గురుశాస్త్రములందు శ్రద్ధాభక్తులు గల్గి జ్ఞానమును సంపాదించినవెంటనే సంసారదుఃఖమునుండి విముక్తు డగును.

104 గీ॥ అజ్ఞ శ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకోస్తి న పరో న సుఖం సంశయాత్మనః.

తా॥ మూఢుఁడును గురుశాస్త్రములందు శ్రద్ధాభక్తులు లేనివాఁడును జ్ఞానము నొందలేక సంశయగ్రస్తుఁడై ఐహికాముష్మికసుఖము లందలేక నశించును. అనగా దుఃఖించును.

105 గీ॥ యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ!

తా॥ పరమాత్మతత్త్వమును తెలిసికొని జ్ఞానముచే సర్వసంశయములను పోగొట్టుకొన్నవానికి వర్తమాన దేహపాతాంతమువరకు దేహప్రారబ్ధమును దేహ మనుభవించుచున్నను వానికీదేహవ్యాపారముతో నెట్టిసంబంధము లేకుండును. మరియు వానికి ముందు జన్మగాని జన్మహేతు వగుకర్మఫలముగాని యెంతమాత్రము నుండదు.

శ్రు॥ భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మి న్దృష్టే పరావరే.

తా॥ అపరోక్షాత్మసాక్షాత్కారము నొందినక్షణములోనే దేహేంద్రియములందలి తాదాత్మ్యాభిమానమును, అంతఃకరణ ధర్మము లగుకామాదులును, సంచితకర్మలును, నశించును. ఇక వీనికి జన్మ యుండదు.

## 5 పంచమాధ్యాయము – కర్మసన్న్యాస యోగము

106 గీ॥ జ్ఞేయ స్స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధా త్ప్రముచ్యతే.

తా॥ ఎవఁడెవరిని ద్వేషించఁడో ఎట్టివస్తువును కోరఁడో సుఖమునుగాని దుఃఖమునుగాని సమముగా జూచునో అట్టివాఁడు నిత్యసన్న్యాసి యనబడి ముక్తుఁడగును.

107 గీ॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి.

తా॥ గృహస్థులు విద్యాసహితముగాను ఈశ్వరార్పణబుద్ధితోను చేయుకర్మమార్గము యోగ మనబడును. సర్వకర్మసన్న్యాసమొనర్చినపరమహంసలయొక్క వేదాంతవాక్య శ్రవణాదికమువలన గలుగుజ్ఞానము సాంఖ్య మనబడును. ఈరెంటికి ఫలము సమానము. అనగా ఉత్తమసాంఖ్యుఁడు సాక్షాత్తుగా జీవన్ముక్తుఁడై వర్తమానదేహ పతనానంతరమందు విదేహకైవల్యము నొందును. అంతదార్ఢ్యము లేనిమధ్యమసాంఖ్యుడును, ఉత్తమయోగియు వర్తమానదేహపతనానంతరమందు కార్యబ్రహ్మలోకమునకు వెళ్లి అచట కల్పాంతమువరకు నుండి, ఆపైన ముక్తు లగుదురు. ఇట్లు తెలిసికొన్నవాఁడే వివేకి యనబడును.

108 గీ॥ సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖ మాప్తు మయోగతః
యోగయుక్తో ముని ర్బ్రహ్మ న చిరే ణాధిగచ్ఛతి.

తా॥ కాని ఈజన్మలోగాని పూర్వజన్మలోగాని యోగము ననగా విద్యాసహితకర్మానుష్ఠాన మాచరించినవాఁడే యీజన్మలో సాంఖ్యుఁ డనగా సన్న్యాసి యగును.అట్టివాఁడు శ్రవణమననాదు లొనర్చి జీవన్ముక్తుఁడై క్రమముగా విదేహకైవల్యము నొందును.

109 గీ॥ నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశ న్జిఘ్ర న్నశ్న న్గచ్ఛ న్స్వప న్శ్వసన్
ప్రలప న్విసృజ న్గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్.

తా॥ తత్త్వవేత్త యనగా జీవన్ముక్తుడు తనదేహేంద్రియము లలో నేయింద్రియ మేవ్యాపారము నొనర్చుచున్నను 'ఆయాయింద్రియము లాయావిషయములందు ప్రవర్తించుచున్నవి. నా కేమి సంబంధ మున్నది ?' అనునిశ్చయముతో నెంతమాత్రము సక్తుడు గాక నిష్క్రియుడుగా నుండును.

110 గీ॥ లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా
సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహే నైవకుర్వ న్న కారయన్.

తా॥ అట్టివాడు సకలేంద్రియవృత్తులను మనస్సుతో వదలిపెట్టి నవద్వారసమన్విత మగుదేహమం దున్నను దేహముతో నెట్టితాదాత్మ్యమును పొందక తామరాకు నీటిబిందువులతో సంబంధము లేకుండున ట్లుండును

111 గీ॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.

తా॥ జీవన్ముక్తుడు తనయందు కర్తృత్వమునుగాని లోకసంబంధ మైనకర్మల నాచరించుటనుగాని కర్మఫలభోక్తృత్వమునుగాని తనయం దారోపింపక తానీసంబంధములేని అసంగచిద్రూపుడ ననుస్థిర నిశ్చయముతో నుండి లోకమందలిప్రవృత్తిస్వభావమేగాని ఆత్మకర్తృకము గాదని తలచును.

112 గీ॥ జ్ఞానేన తు త దజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్.

తా॥ ఎవరియొక్క ఆత్మజ్ఞానముచేత నజ్ఞానము నాశనమొనర్పబడెనో వారలకు స్వప్రకాశ మగుఆత్మరూపము సదా భాసించును.

113 గీ॥ యోఽంతస్సుఖోఽంతరారామ స్తథాంతర్జ్యోతి రేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి.

తా॥ ఆత్మసుఖము నొంది ఆత్మారాముడై ఆత్మస్వరూపుడై ఆత్మప్రకాశము గలవాడై బ్రహ్మభూతుడై ఈజన్మయందే ఈజ్ఞానోదయ క్షణమునుండియే ముక్తుడగును.

## 6. షష్ఠాధ్యాయము – ఆత్మసంయమయోగము

114 గీ॥ సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే

తా॥ ఎపుడు సర్వసంకల్పరహితు డగునో అపుడు జ్ఞానమును పొందినవాడని తెలియనగును. వాడే "యోగారూఢు" డనబడును.

115 గీ॥ ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః.

తా॥ ఎవరికి వారు మోక్షమునొందవలెనేగాని ఇతరులశమదమాదిసాధనసంపత్తివలన తదితరుల కవిద్యానివృత్తి గాదు. శాస్త్రమందు నిందింపబడినకర్మల నాచరించుటయే తనదుఃఖములకు హేతువు. అట్టినింద్యకర్మల నాచరింపక సత్కర్మల నీశ్వరార్పణబుద్ధితో నాచరించి చిత్తశుద్ధినొంది శ్రవణాదికముద్వారా తనప్రయత్నముచే తానే తరింపవలయును.

116 గీ॥ బంధు రాత్మాత్మన స్తస్య యే నాత్మై వాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్.

తా॥ ఎవడు తా నేమనస్సుచే దేహేంద్రియాదులను జయించునో ఆమనస్సే వానికి బంధువు. ఇంద్రియనిగ్రహము లేనివానికి వాని మనస్సే శత్రువు.

117 గీ॥ జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః.

తా॥ ఇంద్రియనిగ్రహము గల్గి శాంతచిత్తుడై శీతోష్ణాదులందును సుఖదుఃఖములందును సమబుద్ధి గల్గి కేవలాత్మవస్తువునుమాత్రమే ధ్యానించుచు క్రమముగా తనయందలిధ్యాతృభావమును ధ్యానక్రియను

ధ్యానించుగాక లేక బ్రహ్మానందమందు లీనమగుగాక. నే నీవ్యవహార మున కంతకును సాక్షిమాత్రుడనే. అంతేగాని నే నిపనులు చేయుట లేదు. చేయించుట లేదు. ఇట్లు చెప్పినచో కర్మానుష్ఠాతకును నాకును ఎట్టికలహము లేదు. దేహము వాగాదీంద్రియములు బుద్ధి వీనివిషయ మందుమాత్రమే మాఉభయులసిద్ధాంతమునకు భేదమున్నది. కర్మ ఫలమును దేహి పొందును. దేహవ్యాపారమునకు కర్తయు, భోక్తయు నగువిజ్ఞానమయ, ఆనందమయకోశములే ఆత్మయని కర్మరుల అభిప్రాయము. అకర్త, అభోక్తయై సాక్షిమాత్రుడే ఆత్మయని వేదాంతుల అభిప్రాయము.

ఏవం చాన్యోన్యవృత్తాంతానభిజ్ఞౌ బధిరావివ
వివదేతాం బుద్ధిమంతో హసంత్యేవ విలోక్య తౌ.

తా॥ ఈ ప్రకార మిద్దరు చెవిటివారు పరస్పరసంభాషణ మొనర్చుచు పరస్పరార్థగ్రహణము లేనట్లు ఈకర్మిరవేదాంతు లిద్దరు వివాదపడుటను చూచుబుద్ధిమంతుడు నవ్వును.

ఇంక జ్ఞానికి అజ్ఞానికి ప్రవర్తనయందలిభేదము ప్రదర్శింప బడుచున్నది.

చిత్ప్రత్యక్షా తతోన్యస్య మిథ్యాత్వం చానుభూయతే
నాద్వైత మపరోక్షం చే త్యేత న్న వ్యాహతం కథమ్.

తా॥ కూటస్థమును, స్వప్రకాశమును, నగుఆత్మచైతన్యము కంటె వేరుగా నెట్టివస్తువును లేదుగదా. ద్వైతముగా కనుపించు ఈజగత్తును అందలిమిథ్యాత్వమును ఈచైతన్యముచేతనే అనుభవించు చున్నందున అద్వైతజ్ఞానము ప్రత్యక్షము గోచర మగుచున్నందున నద్వైతము ప్రత్యక్షము గాదని చెప్పరాదు.

ఇత్థం జ్ఞాత్వా ప్యసంతుష్టాః కేచి త్కుత ఇతీర్యతామ్
చార్వాకాదేః ప్రబుద్ధస్యా ప్యాత్మా దేహఃకుతో వద.

తా॥ ఇట్లు జ్ఞానుల కద్వితీయాత్మజ్ఞానము ప్రత్యక్షమైనను కొంద రజ్ఞానులు తమబుద్ధి కీయద్వితీయాత్మస్వరూపము తెలియక

ఆత్మను మాత్రమే విషయముగా నొనర్చి ఇంద్రియగోచరముగాక కేవలబుద్ధిగోచరమగు ఆత్మానందము ననుభవించుచు అంతకంటె గొప్పలాభకరమగువస్త్వంతర మెద్దియు లేదనునిశ్చయముతో నుండి ఎంతగొప్పదుఃఖము చేతగూడ చలింపక ఆత్మస్వరూపమాత్రుడై యుండుటయే యోగమని లేక సమాధియని చెప్పబడును.

122 గీ॥ సంకల్పప్రభవా న్కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః
శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్.

తా॥ విషయములందలివాంఛను వదలి సర్వేంద్రియములను మనస్సులో లయమొందించి అట్టిమనస్సు నాత్మయందు లీనమొనర్చి ఆత్మేతరవిషయములను చింతింపక యుండుస్థితియే సమాధి యనబడును.

123 గీ॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.

తా॥ ఆత్మ సర్వభూతములందు నొకరీతిగా నున్నదనియు తన ఆత్మయందే సర్వదేహాదికములు కల్పితములనియు పైసమాధిలో నుండి గమనించుచు సర్వప్రపంచమంతయును స్వప్రకాశచైతన్యమాత్రమునే గుర్తించుచుండువాడు జీవన్ముక్తు డనబడును.

124 గీ॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి.

తా॥ ఎవడు సమస్తభూతములు తనయందున్నవనియు, తాను సమస్తభూతములందు నుండుననియు తెలిసికొనునో వానికిని నాకును భేద మెంతమాత్రము లేదు.

125 గీ॥ సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః
సర్వథా వర్తమానోపి స యోగీ మయి వర్తతే

తా॥ ఎవడు ద్వైతవర్జితుడై సర్వభూతములందును చైతన్య రూపమున నేకరీతిగ నున్న నన్ను గుర్తించి అట్టినిశ్చయము స్థిరముగా గలిగియుండునో వా డెట్టిప్రారబ్ధము ననుసరించినదేహవ్యాపారమునం దున్నను వాని కాయాత్మయాథాత్మ్యనిశ్చయము తొలగదుగాన అట్టి వాడు నాభావమునే పొందియుండును.

126 గీ॥ చంచలం హి మనః కృష్ణ ! ప్రమాథి బలవ ద్దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్.

తా॥ అర్జును డీపై విషయమును వినినతర్వాత సందేహముతో నిట్లుపల్కుచున్నాడు. ఓకృష్ణా! మనస్సు స్వభావముచే బహుచంచల మైనది. క్షోభముల కాస్పదమైనది. గట్టిది యగుటచే నట్టిమనస్సును నిగ్రహించుట గాలిని చేతితో పట్టుటవలె చేయ శక్యముగానిపని యని తోచుచున్నది. గాన ఆమనోనిగ్రహసాధనమును వివరింపుడు. అని-

127 గీ॥ అసంశయం మహాబాహో ! మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే
అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః.

తా॥ అందుకు శ్రీకృష్ణు డిట్లు సమాధాన మిచ్చుచున్నాడు. అర్జునా ! నీవు చెప్పినమాట లోకసామాన్యదృష్టిలో నిజమే; గాని ప్రాపంచికవస్తువులం దనురాగమును వదలి శమదమాదుల నభ్యసించి నిత్యానిత్యవస్తువివేచన మొనర్చి క్రమముగా వేదాంతార్థవిచారణ ద్వారా ఆత్మస్వరూపము నెరిగి అభ్యసించువాని కీమనోనిగ్రహము సాధ్యమే యగును. పై సాధనముల నభ్యసింపనివానికి మనోనిగ్రహము సాధ్యము గాదు.

128 గీ॥ అయతి శ్శ్రద్ధయోపేతః యోగా చ్చలితమానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ ! గచ్ఛతి ?
కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి.

తా॥ అందుపై అర్జును డిట్లు తిరిగి ప్రశ్నించుచున్నాడు. కృష్ణా! నియమాదులు లేనివాడై ఈయోగమందు శ్రద్ధ గలిగి అభ్యసించుచు అందు సిద్ధిని పొందకపోయినచో నట్టివా డెట్టియాముష్మికస్థితిని పొందునో తెలుపుడు. ఉభయభ్రష్టుడై, విడిపోయినమేఘమువలె నశింపడుగదా ! తెలుపుమని ప్రార్థించెను.

129 గీ॥ పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత ! గచ్ఛతి.

తా॥ అందుకు శ్రీకృష్ణు డిట్లు సమాధాన మిచ్చుచున్నాడు. ఓ పార్థా! అట్టివాని కీలోకమందుగాని పరలోకమందుగాని యెట్టినష్టము సంభవింపనేరదు. శాస్త్రీయమార్గమునందు ప్రవర్తించువాని కెన్నడును నష్టము రాదు.

130 గీ॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే
అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్
యతతేచ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన.

తా॥ అట్టివాడు పుణ్యలోకములందు చాలకాల ముండి మంచి వేద, వేదాంగముల నధ్యయన మొనర్చువంశమందు జన్మించి పూర్వ జన్మయందలి యోగప్రవృత్తిని విద్యాబలమును గుర్తించినవాడై ఆ పైప్రయత్నము చేసి సిద్ధికొరకు ప్రయత్నించును.

131 గీ॥ అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్
తపస్విభ్యోఽ ధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున!

తా॥ ఇట్లనేకజన్మల నెత్తుచున్నను పూర్వప్రయత్న మనుగతమైయుండి ఉత్తరప్రయత్నమునుమాత్రమే చేయుచు చివరకు మోక్షమునొందును. కేవలము కర్మల నాచరించువారికంటెను తపమాచరిం

చువారికంటెను శాస్త్రార్థ మెఱుఁగు పండితునికంటెను ఈయోగి గొప్ప వాఁడు. గాన నీవు యోగివగుటకు ప్రయత్నింపుము.

## 7. సప్తమాధ్యాయము – విజ్ఞానయోగము

132 గీ॥ మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుంజ న్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి త చ్ఛృణు.

తా॥ నాయందాసక్తి గలవాఁడవై నన్నాశ్రయించి యోగము నభ్యసించుచు పరిపూర్ణస్వరూపుఁడ నగునన్ను నిస్సంశయముగా నీవు తెలిసికొనువిధము నుపదేశింతును వినుము.

133 గీ॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః
యద్ జ్ఞాత్వా నేహ భూయోన్యద్ జ్ఞాతవ్య మవశిష్యతే.

తా॥ ఎట్టిజ్ఞానమును తెలిసికొన్నతరువాత సర్వజగత్తులోని విషయములును పుష్కలముగా తెలియబడి తెలియదగినవస్తు వేదియు మిగులదో అట్టిజ్ఞానమును నీకు పూర్తిగా చెప్పుచున్నాను.

134 గీ॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః.

తా॥ పెక్కువేలమనుష్యులలో నొకానొకఁడుమాత్రమే ఈ యోగముకొరకు ప్రయత్నించును. వారిలో నొకానొకఁడుమాత్రమే నన్ను యథార్థముగా గుర్తింప గల్గును.

135 గీ॥ భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా
అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో! య యేదం ధార్యతే జగత్.

తా॥ భూమి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము- అనునీయెనిమిదియు నాయొక్క అపరాప్రకృతి యనబడును. ఈసర్వజీవులు నాయొక్కపరాప్రకృతి యనబడును.

136 గీ॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా
మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ!
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.

తా॥ సమస్తజీవులు దేహము చైతన్యము అను రెండు వస్తువుల యొక్క కలయికనై యున్నందున ఈరెండును నాప్రకృతులేగాన ఈ జగమంతయు నేనే. నాకంటె వేరగుజగత్తు ఎంతమాత్రము లేదు. ఈ జగత్తు నాయందే సృజింపబడి స్థితిని పొంది లయమగుచున్నది. హార మందలిమణు లన్నియు దారముచే కూర్పబడిన ట్లీసర్వజగము నా యందే కూర్చబడినది.

137 గీ॥ రసోహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు.

తా॥ నే నుదకమందలిరసము, సూర్యచంద్రులందలి కాంతి, వేదములందలి ఓంకారము ఆకాశమందలి శబ్దము, మనుష్యులందలి పురుషత్వము నయియున్నాను.

138 గీ॥ పుణ్యో గంధః పృథివ్యాంచ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు
బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్
బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్
ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ

తా॥ భూమియందలి గంధము, అగ్నియందలి తేజస్సు, సర్వ భూతములందలి ప్రాణము, ఋషులయందలి తపస్సు, సర్వజీవులకు బీజము, బుద్ధిమంతులయందు ప్రజ్ఞావివేకము, తేజస్సుగలవారియందలి తేజస్సు, బలవంతులలోని కామరాగరహిత మగుబలము, సర్వభూత ములం దున్నధర్మవిరుద్ధముగాని కామమును నేనే.

139 గీ॥ యేచైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి.

తా॥ సత్త్వరజస్తమోగుణములు గలపదార్థము లన్నియు నావలననే యేర్పడుచున్నవి. నేను వానియందు లేను గాని అవి నాయందున్నవి. అనగా రజ్జువును జూచి సర్పమనుభ్రాంతి నొందినవానికి రజ్జువు సర్పమందు లేదుగాని సర్పము రజ్జువునం దున్నది. అట్లు అధిష్ఠానరజ్జువువంటివాడను నేను.ఆరోపితసర్పమువంటివి త్రిగుణములు.

140 గీ॥ త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్
దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే.

తా॥ ఇట్టిత్రిగుణాత్మికయు దైవసంబంధినియు నగునామాయ సామాన్యులచే నతిక్రమింప నలవికానిది. కాని నన్నాశ్రయించి నా నిజరూపమును పుష్కలముగా గుర్తించినవారుమాత్రి మీమాయ నవలీలగా నతిక్రమింతురు. నేను త్రిగుణాత్మక మగునీమాయ కతీతుడనై ఈజగత్తునంతను మోహింపజేయుదును.

141 న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః.

తా॥ పాపాత్ములు మూఢులు అధములు నగువారీమాయచే నపహరింపబడినజ్ఞానము గలవారై హింసానృతాది రాక్షసభావముల నాశ్రయించి నన్ను గుర్తింపలేరు.

142 గీ॥ చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియోహి జ్ఞానినోత్యర్థ మహం సచ మమ ప్రియః

ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామే వానుత్తమాం గతిమ్.

తా॥ దుఃఖముచే పీడితుడు, లౌకిక మగుధనాదిప్రయోజనము నపేక్షించినవాడు, ఆత్మజిజ్ఞాసువు, జ్ఞాని అనునీనలుగురుమాత్రమే నన్ను సేవింతురు. ఆనలుగురిలో సర్వజగత్తునం దేకాత్మబ్రహ్మభావము గలజ్ఞానియే నేను. నేనే అజ్ఞాని. ఆజ్ఞాని యెల్లపుడు నారూపముతోనే యుండును.

143 గీ॥ బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః.

తా॥ అనేకజన్మలందు చేసినసత్కర్మానుష్ఠానమువలన ఉపాసనలవలన చిత్తశుద్ధి గల్గి శ్రవణమననాదుల నొనర్చి, అపరోక్షాత్మ సాక్షాత్కారము నొంది, నిత్యానందస్వరూపుడై సర్వము తానే యై యుండుమహాత్ముడు బహుదుర్లభుడు.

144 గీ॥ స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే
లభతేచ తతః కామా న్మయైవ విహితా న్హితాన్.

తా॥ ఎవ రితరదేవతల నారాధింతురో వా రాదేవతలవలన నాయాకోరికలయొక్క సిద్ధిని బొందుదురు. నేనే ఆయాదేవతల రూపముతో నుండి అట్టి యారాధకుల కాయాకోరికల సిద్ధింప జేయుదును.

145 గీ॥ దేవా న్దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి
అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః
పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్.

తా॥ దేవతల నారాధించువారు దేవతలను బొందెదరు. నన్నారాధించువారు నన్ను బొందెదరు. బుద్ధిహీనులు నిత్యజ్ఞానరూపుడ నగునన్ను తెలిసికొనలేక మనుష్యమాత్రునిగా దలంచుచున్నారు.

146 నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః
మూఢోయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్.

తా॥ నేను యోగమాయాసమావృతులగు పామరజనులకు ప్రకాశింపను. నేను జన్మజరానాశాదివికారములు లేనిజ్ఞానరూపుడనని పామరులు గుర్తింపలేరు.

147 గీ॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున!
భవిష్యాణిచ భూతాని మాంతు వేద న కశ్చన.

తా॥ నేను భూతభవిష్యద్వర్తమానకాలములందలి సర్వ జీవదేహములకు నధిష్ఠానరూపుడనుగాన వాని నన్నిటి నెరుగుదును. ఆరోపితము లగునాభూతములు న న్నెరుగజాలవు.

148 గీ॥ యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః.

తా॥ పుణ్యకర్మల నాచరించి పాపమును పోగొట్టుకొని సుఖదుఃఖాదిద్వంద్వములందు మోహము చెందక ఆత్మజ్ఞానసంపాదనమం దిచ్ఛగలవారుమాత్రమే నన్ను సేవించి పొందుదురు.

149 గీ॥ జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే
తే బ్రహ్మ త ద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్
సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః
ప్రయాణకాలేపి చ మాం తే విదు ర్యుక్తచేతసః.

తా॥ పరబ్రహ్మస్వరూపుడ నగునన్ను వేదాంతవాక్యశ్రవణాదికముద్వారా తెలిసికొనుటకు ప్రయత్నించువారు బ్రహ్మవిద్యవలన నన్నధిభూతసహితునిగాను, అధిదైవసహితునిగాను, అధ్యాత్మసహితునిగాను తెలిసికొని జీవన్ముక్తులై ఈవర్తమానదేహపతనానంతరమందు విదేహముక్తిని బొందెదరు.

## 8. అష్టమాధ్యాయము - అక్షరపరబ్రహ్మయోగము

150 గీ॥ కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ!
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే
అధియజ్ఞః కథం కోఽత్ర దేహేస్మి న్మధుసూదన!
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోసి నియతాత్మభిః.

తా॥ ఇంతవరకు వినినతర్వాత అర్జును డిట్లు ప్రశ్నించు చున్నాడు, "ఓకృష్ణా! నీ యుపదేశములో పారిభాషికపదము లున్నవి. బ్రహ్మము, అధ్యాత్మము, అధిభూతము, అధిదైవము అనుపదముల యభిప్రాయ మేమి? ప్రయాణకాలమందు నియమించబడిన దేహేంద్రియవృత్తులతో ని న్నెట్లు గుర్తించవలయును? ఇందులకు దయతో సమాధాన మీయవలయు" నని.

151 గీ॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః
అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్
అధియజ్ఞోఽహమే వాత్ర దేహే దేహభృతాంవర!
అంతకాలే చ మామేవ స్మర న్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః

తా॥ శ్రీకృష్ణు డిట్లు సమాధాన మిచ్చుచున్నాడు, ఓపార్థా! సర్వజగత్కారణము, సర్వశ్రేష్ఠము, సర్వవ్యాపకము, సర్వమహత్తు నాశరహితము అగునదియే బ్రహ్మము. స్వభావమే అధ్యాత్మము, భూతములయొక్క స్వరూపమునకును ఉత్పత్తికిని కారణమగునది కర్మ మనబడును. నాశము గలదంతయు నధిభూత మనబడును. సర్వత్ర పరిపూర్ణు డగుపురుషుడే అధిదైవత మనబడును. దేహములం దుండుకూటస్థుడ నగునేనే అధియజ్ఞ మనబడెదను. ప్రాణోత్క్రమణ కాలమం దిట్టినన్ను స్మరించుచు పోవువాడు నాతాదాత్మ్యమునే పొందు ననుట కెట్టిసంశయము లేదు.

152 గీ॥ యం యం వాపి స్మర న్భావం త్యజ త్యంతే కళేబరమ్
తం త మే వైతి కౌంతేయ సదా తద్భావభావితః
తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుద్ధ్య చ
మయ్యర్పితమనోబుద్ధి ర్మామే వైష్య స్యసంశయః

తా॥ మరణకాలమం దెవరెవ రెట్టిభావవిశేషమును గల్గి యుందురో వారు వా రట్టిభావమునే పొందుదురు. అందుచే నీవు సర్వకాలసర్వావస్థలందును నన్నే స్మరించుచు అంతరింద్రియబహిరింద్రియముల నన్నిటిని నావిషయముగానే ప్రవర్తింపజేయుచు యుద్ధ మొనర్పుము. అట్లైనచో నీవు నాభావమునే పొందుదువు.

153 గీ॥ య దక్షరం వేదవిదో వదంతి
విశంతి య ద్యతయో వీతరాగాః
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
త త్తే పదం సంగ్రహేణ బ్రవీమి.

తా॥ వేదవేత్త లందరు దేనిని నాశరహితమని చెప్పుచున్నారో ప్రాపంచికవిషయములందు వాంఛలేనియతీశ్వరులు దేనిని ప్రవేశించుచున్నారో దేనిని కోరి బ్రహ్మచర్యాదివ్రతముల నాచరించుచున్నారో అట్టిప్రణవమునుగూర్చి నీకు సంగ్రహముగా బోధించుచున్నాను.

154 గీ॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్.

తా॥ ఇంద్రియనిగ్రహము గల్గి మనస్సు నాత్మయందే నిలిపి బ్రహ్మవాచక మగు 'ఓం' అను నొకేయక్షరమును పలుకుచు నన్ను మాత్రమే స్మరించుచు నెవడు దేహమును త్యజించునో వాడుత్తమ గతి నొందును.

155 గీ॥ మా ముపేత్య పున ర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః.

తా॥ ఇట్లు నన్ను పొందినమహాత్ములు మోక్షమునొంది వీరే సర్వవ్యాప్య మగుబ్రహ్మమై అసత్యజడదుఃఖపరిచ్ఛిన్న మగు దేహము నెన్నటికిని తిరిగి పొందరు.

156 గీ॥ ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున !
మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే.

తా॥ అతలాదిసత్యలోకాంత మగుపదునాలుగుభువనము లు అందలిజీవులు, జననాదిధర్మముల నొందుచునే యుందురు. నాభావము నొందినముక్తులుమాత్రమే జననాదికము నొందరు.

157 పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽ వ్యక్తా త్సనాతనః
య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి.

తా॥ సమస్తచరాచరజీవులయొక్క కారణరూపముతో నుండు నవిద్యకంటెగూడ విలక్షణమై సర్వోత్కృష్టమై ఇంద్రియముల కగోచరమై శాశ్వతమై యుండు పరబ్రహ్మమే సర్వజీవులందుండి, దేహములు నశించుచున్నను నశింపక యుండును.

158 గీ॥ అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవం త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవా వ్యక్తసంజ్ఞకే.

తా॥ సృష్టికాలమం దప్రకటిత మగుకారణరూపముతో నుండు జీవు లందరు నాబ్రహ్మమునుండియే జన్మించుచుందురు. ప్రళయకాలమం దాజీవులందరును తిరిగి కారణమందు లీనమయ్యెదరు.

159 గీ॥ అవ్యక్తోఽ క్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిమ్
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ
పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా
యస్యాంతస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్.

తా॥ అవ్యక్త మనగా నాశములేని బ్రహ్మవస్తు వని ఇచట అర్థము. అట్టి బ్రహ్మమే పరమగతి యనబడును. దానిని పొందినవాడు తిరిగి జననాదిసంసారధర్మము నొందడు. వానిచే అంతయు నిండి యుండునుగాన పురుషు డనబడును. వానియందే యీజగ మంతయు గలదు. అట్టిది వేదాంతవేద్యమే యగును. మరియొకమార్గముచే నది తెలియబడదు.

160 గీ॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు య త్పుణ్యఫలం ప్రదిష్టమ్
అత్యేతి త త్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్.

తా॥ అట్టి బ్రహ్మమును గుర్తించినజ్ఞాని వేదోపదిష్టయజ్ఞదాన తపఆదిపుణ్యఫలము లన్నిటికంటె గొప్పఫల మగుమోక్షము నొందును. అనగా వాడే బ్రహ్మ మగును.

161 గీ॥ అశ్రద్దధానాః పురుషాః ధర్మస్యాస్య పరంతప !
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని.

తా॥ నాధర్మములను నమ్మి పాటింపనివా రెన్నటికిని నన్ను పొందజాలక జననమరణాదిసంసారమును నిరంతరము బొందుచుందురు.

9. నవమాధ్యాయము – రాజవిద్యారాజగుహ్యయోగము

162 గీ॥ మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా
మత్ స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః
నచ మత్ స్థానిభూతాని పశ్య మే యోగ మైశ్వరమ్
భూతభృ న్నచ భూతస్థో మమాత్మా భూతభావనః
యథాకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ.

తా॥ ఇంద్రియగోచరముగానిస్వరూపము గలనాచే జగమంతయు నిండియున్నది. సర్వభూతములు నాయందే యున్నవి. నేను

మాత్రి మాభూతములు చేయువ్యాపారములతో నెట్టిసంబంధము లేక యుందును. ఇట్టి అఘటితఘటనాసామర్థ్యము నా కెంతయున్నదో చూడుము. అంతటను సంచరించువాయు వెల్లపుడు నెట్లాకాశమందే యుండునో అట్లే సర్వజీవులును నాయందే యెల్లపుడు నుండును.

163 గీ॥ సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాంతి మామికామ్
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్
ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్.

తా॥ కల్పాంతమందీభూతము లన్నియు నాయందే లీనము లగును. మరల కల్పారంభమందు వానివాని సుకృతదుష్కృతకర్మ వాసనల ననుసరించి ఆయాదేహములుగా పరిణమించును. ప్రకృతి వశముచే అస్వతంత్రము లగునీభూతముల నన్నింటిని నాస్వాధీనములో నుండుమాయ నవలంబించి నేనే సృజించి పాలించి సంహరించు చుందును.

164 గీ॥ నచ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ!
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు
మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్
హేతునానేన కౌంతేయ! జగ ద్విపరివర్తతే.

తా॥ నేను జగత్సృష్టిపరిపాలనాదికర్మలం దెంతమాత్రము సక్తుడను గాను. ఉదాసీనునివలె నుందును. అధిష్ఠాన మగున న్నాశ్ర యించి ప్రకృతియే చరాచరప్రపంచమును సృజించుచున్నది. ఈకార ణముచేతనే సర్వజీవులు నిరంతరము జననాదిసంసారప్రవాహము నొందుచున్నారు.

165 గీ॥ అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితః
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్,

తా॥ సర్వభూతనియామకుడ నగునన్ను యథార్థముగా తెలిసి కొనలేనిపామరులు మనుష్యమాత్రునిగా భావించుచున్నారు. నాధర్మమున కపకారముగూడ చేయుచున్నారు.

166 గీ॥ మహాత్మానస్తు మాం పార్థ ! దైవీం ప్రకృతి మాశ్రితాః
భజం త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్.

తా॥ మహాత్ములగువారు సాత్త్వికప్రకృతి గలవారై నన్ను నిజరూపముతో గుర్తించి పరమతాత్పర్యముతో నన్నే సేవించుచున్నారు.

167 గీ॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే.
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్.
తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే.

తా॥ ఎవరు మూడువేదములందు చెప్పబడినకర్మలయందాసక్తి గలవారై యజ్ఞాదులచే న న్నారాధించుచు ఆశేషమును భుజించి పాపముల పోగొట్టుకొనుచున్నారో వారాయజ్ఞాదికర్మఫలము ననుభవించుటకై స్వర్గలోకమందు జన్మించి అచట దివ్యమగుస్వర్గభోగముల ననుభవించి ఆపుణ్యఫలము నశింపగానే తిరిగి భూలోకమున జన్మించుచుందురు.

168 గీ॥ శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి.

తా॥ ఒకఫలాపేక్షతో చేయుకర్మలు తప్పక ఫలమిచ్చును, అద్దాని ననుభవించుట కవశ్యము జన్మించితీరవలెను. కాన ఈశ్వ

రార్పణబుద్ధితోను లోకసంగ్రహముకొరకును కర్మలు చేసినను వాని ఫలములలో నీ కెట్టిబంధమును గలుగదు. అట్టిసన్న్యాసయోగముతో నుండి సంసారబంధమును వీడి నన్ను బొందగలవు.

## 10. దశమాధ్యాయము - విభూతియోగము

169 గీ॥ న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః
యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్
అసంమూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే.

తా॥ దేవతలుగాని మహర్షులుగాని నాయుత్పత్తి నెరుగరు. నేను దేవతలు ఋషులు మొదలగుజీవు లందరకును మూలకారణమును, అధిష్ఠానమునయితినని ఎవరు గుర్తింతురో వారు సర్వపాపములతో విరహితులై శాశ్వతము సుఖరూపము నగుమోక్షము నొందెదరు.

170 గీ॥ బుద్ధి ర్జ్ఞాన మసంమోహః క్షమా సత్యం దమ శ్శమః
సుఖం దుఃఖం భవో భావో భయం చాభయ మేవచ
అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః.

తా॥ వివేకబుద్ధి, ఆత్మజ్ఞానము, వ్యాకులత లేకుండుట, ఓర్పు, సత్యము, అంతరింద్రియబహిరింద్రియనిగ్రహము, అహింస, సర్వభూతములందు సమదృష్టినుంచుట, సంతృప్తి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి మొదలగుగుణము లన్నియు సర్వులకు నావలననే కలుగుచున్నవి.

171 గీ॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః.

తా॥ కశ్యపాదిసప్తమహర్షులు, నలుగురు మనువులును నామ సంకల్పమాత్రముచే బుట్టిరి. వారు మద్భావభావితులై యీచరా చరప్రపంచము నంతను సృజించిరి.

172 గీ॥ ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః
సో౽వికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః.

తా॥ నాయథార్థరూపమును, ఈజగద్రూప మగువిభూతిని, నాసర్వజ్ఞత్వాదిసామర్థ్యమును ఎవరు పుష్కలముగా గుర్తింతురో వారు స్థిర మగుమోక్షము నొందెదరు.

173 గీ॥ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్
ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాస స్స్వయంచైవ బ్రవీషి మే
సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ!
నహి తే భగవ న్వ్యక్తిం విదు ర్దేవా న దానవాః
స్వయమే వాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ!
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే!

తా॥ అర్జును డిట్లు పల్కుచున్నాడు– "ఓకృష్ణా! భృగువు, నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు మొదలగు మహర్షు లందరు నిన్ను పరబ్రహ్మముగాను, సర్వజగత్కారణముగాను, శాశ్వ తునిగాను, స్వప్రకాశరూపునిగాను జననాదిధర్మరహితునిగాను చెప్పు చున్నారు. నీవుగూడ అట్లే నాకు బోధించగా నేను యథార్థమని విశ్వసించితిని. దేవతలుగాని, దానవులుగాని, నీయథార్థభావమును గుర్తింపలేరు. నీభావమును పొందిన బ్రహ్మవేత్తలు మాత్రమే నిన్ను ఎరుగుదురు.

ఇట్లు కృష్ణుడు పల్కుచున్నాడు–

174 గీ॥ అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవచ.

తా॥ నేను సర్వులయొక్క అంతఃకరణమం దుండు ఆత్మను. సర్వజీవులయొక్క ఉత్పత్తిస్థితిలయములకు కారణమై యున్నాను.

175 గీ॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున!
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్.

తా॥ ప్రపంచములోని యన్నిజాతులలో నెక్కువ తేజస్సు గల ప్రతివ్యక్తియు నారూపమే. ఇవియవి యననేల! నేను నాయొక్క భాగముచే మాయ నధిష్ఠించి ఈజగత్తుగా నుంటిని.

## 11. ఏకాదశాధ్యాయము - విశ్వరూపసందర్శనయోగము

176 గీ॥ మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్
య త్త్వయోక్తం వచ స్తేన మోహోఽయం విగతో మమ.

తా॥ అర్జును డిట్లు పల్కుచున్నాడు. నాయం దనుగ్రహముతో నీయధ్యాత్మరూపరహస్యమును నీవు బోధింపగా నామోహము పోయినది.

177 గీ॥ ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ!

తా॥ నీఈశ్వరరూపమును చూడ కుతూహల మున్నదిగాన అనుగ్రహించి ఆరూపమును ప్రదర్శింపుడని ప్రార్థింపగా శ్రీకృష్ణుడు తనవిశ్వరూపమును ప్రదర్శించెను.

178 గీ॥ ఇహైకస్థం జగ త్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్.

తా॥ ఓఅర్జునా! ఈజగత్తంతయు నాదేహమందే యున్నదిగాన చూడుము. అది చూచి అర్జును డిట్లు పలుకుచున్నాడు.

179 గీ॥ త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే.

తా॥ ఓకృష్ణా! నీవు ముముక్షువులచే తెలిసికొనదగిన అక్షర మగుపరబ్రహ్మమవు. నీవే యీజగ మంతకు నాధారభూతుడవు. నీవు నాశరహితుడవు. నిత్యుడవు. ధర్మమును పాలించువాడవు. నీవే పురాణపురుషుడవు.

180 గీ॥ కస్మాచ్చ తే న నమేర న్మహాత్మ
న్గరీయసే బ్రహ్మణో ప్యాదికర్త్రే
అనంత దేవేశ జగన్నివాస
త్వ మక్షరం సదస త్తత్పరం యత్.
త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప!

తా॥ ఓమహాత్మా! నీవు అందరు దేవతలకంటె గొప్పవాడవు, ఆదికారణమవు, సద్వస్తువులకంటెను అసద్వస్తువులకంటెను విలక్షణమై వానికి మూలకారణ మగుబ్రహ్మమవు.

181 గీ॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి!
అజ్ఞానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి.

తా॥ ఇట్టినీమహిమను తెలిసికొనక స్నేహితుడవని తలచి గాని ప్రమాదమువలనగాని కృష్ణా యని యాదవా యని బావా యని మిత్రమా యని పిలిచితిని. ఆహార, విహార, శయ, నాసనాదులందు నిన్ను పరిహాసముగూడ చేసియుంటిని. వాని నన్నిటిని క్షమించి నన్ను గ్రహింపుము.

182 గీ॥ పితాసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్

న త్వత్సమో ఽస్త్యభ్యధికః కుతో ఽన్యో
లోకత్రయే ఽప్యప్రతిమప్రభావ!
తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్.

తా॥ నీవు లోకమున కంతకును తండ్రివి. నీప్రభావము నిరుపమానము. నీవు పూజ్యుడగుగురువువు. నీకంటె నధికు లెచటను లేరు. నీకు సాష్టాంగనమస్కార మొనర్తును. నే నిదివరలో నీవిషయమై చేసినతప్పుల నన్నిటిని క్షమించి నన్ననుగ్రహింపుము- అని ప్రార్థించెను. అందుకు శ్రీకృష్ణు డిట్లు తిరిగి పలుకుచున్నాడు.

183 గీ॥ మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్
తేజోమయం విశ్వ మనంత మాద్యం
య న్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్.

న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై
ర్నచ క్రియాభి ర్న తపోభి రుగ్రైః
ఏవం రూపం శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర!

తా॥ సత్యజ్ఞానానంతానందరూపము గలనేను నీయం దనుగ్రహముచేతనే యిట్టిరూపమును నీకు ప్రదర్శించితిని. నీవుతప్ప ఇతరుల కెవరికిని ఈరూపము జూడ శక్యముగాదు. వేదాధ్యయన, తదుదిత కర్మాచరణ, దాన, తపో, బ్రహ్మచర్యాదులచేత నాయిట్టిరూపమును దర్శింప సాధ్యముగాదు.

184 గీ॥ సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసి య న్మమ
దేవా అ ప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః.

తా॥ నీ విపుడు చూచిననారూపము నెల్లపుడు దేవతలుగూడ చూడగోరుదు రేగాని వారలకుగూడ చూడ శక్యము గాదు.

## 12. ద్వాదశాధ్యాయము - భక్తియోగము

185 గీ॥ ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ?

తా॥ అర్జును డిట్లు తిరిగి ప్రశ్నించుచున్నాడు.

ఓకృష్ణా! ఎవ రీరీతిగా నీయం దెల్లపుడును నిష్ఠగలవారై ధ్యానించుచుందురో ఎవ రీవ్యక్తమగు అక్షరపరబ్రహ్మమును ధ్యానించుచుందురో వారిద్దరిలో నెవరు శ్రేష్ఠులో తెలుపుడు- అని ప్రార్థించెను. అందుకు శ్రీకృష్ణు డిట్లు సమాధాన మిచ్చుచున్నాడు.

186 గీ॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః

తా॥ నాయందు మనస్సు నుంచి నిత్యయుక్తు లగుచు శ్రద్ధాభక్తులతో న న్నెవ రుపాసింతురో వారు శ్రేష్ఠులు.

187 గీ॥ యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్
సన్నియ మ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితే రతాః.

తా॥ ఇంద్రియనిగ్రహము గల్గి సర్వవస్తువులందు సమానమగుచైతన్యమాత్రజ్ఞానము గల్గి, నాశరహితమును మనోవాచామగోచరమును సర్వవ్యాపకమును కూటస్థము నగునాబ్రహ్మదృష్టిని సంతత ముంచుదురో వారె నేను, నేనే వారు.

188 గీ॥ యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి న చిరా త్పార్థ మయ్యావేశిత చేతసామ్.



తా॥ ఎవరు సర్వకర్మలను నాయందీశ్వరార్పణబుద్ధితో నుంచి నాయందాసక్తిగలవారై ఏకాంతభక్తియోగముతో నన్నుపాసింతురో అట్లు నాయందే చిత్తలయమొనర్చినవారి నీసంసారమునుండి యుద్ధరింతును.

ఇచట ఏకాంతభక్తితో నాయందు చిత్తలయ మొనర్చినవారిని తత్క్షణము సంసారమునుండి ఉద్ధరింతునని కృష్ణు డనెనుగదా. అనేక జన్మలనుండియు వచ్చుచున్న ఈసంసారబంధ మెట్లు తత్క్షణమే నివృత్తి యగును? అనుసందేహమునకు సమాధానమేమనగా ఒకగుహాయందు పెక్కువేలసంవత్సరములనుండి చీకటి యుండుచున్నను ఒకదీపము వచ్చినతత్క్షణమే ఆచీకటి పారిపోవుట మనకనుభవసిద్ధమేగదా.అటులనే సద్గురువులమూలమున వేదాంతవాక్యశ్రవణాదులను చేసి ఆత్మస్వరూప జ్ఞానము నొందినవానికనేకజన్మలనుండి అనుగతమగుఅవిద్య పోవును.

18। గీ॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః.

తా॥ నీవు నాయందే అంతరింద్రియబహిరింద్రియములవ్యాపారముల నుంచుము. అనగా కంటితో చూచినదానినంతను అందలి చైతన్యరూప మగునేనుగా భావింపుము. చెవితో వినుదాని నంతను చైతన్యరూపుడ నగునేనుగా భావింపుము. ఈవిధముగా సకలేంద్రియ వృత్తులకు విషయము లగుపాంచికవస్తువు లన్నిటియందు నేకరీతిగా అనుగతమగుచైతన్యమునుమాత్రమే గ్రహింపుము. ఇట్లైనచో నీవు నేనే, నేను నీవే యగుదుము.

190 గీ॥ అథ చిత్తం సమాధాతుం నశక్నోషి. మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ !

తా॥ నీవట్లు నాయందే సకలేంద్రియవృత్తి విషయముల నుంచుటకు తగుచిత్తదార్ఢ్యము లేనియెడల క్రమముగా యమ, నియ,మాసన, ప్రాణాయామాదుల నభ్యసించుము. అపుడు క్రమముగా నన్ను పొందగలవు.

191 గీ॥ శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్.

తా॥ ఆయోగాభ్యాసమువలన చిత్తనిరోధముగల్గి చిత్తస్థైర్య మేర్పడును. అందువలన ధ్యానయోగ మలవడును. దానిచే సర్వకర్మ ఫలత్యాగ మేర్పడును. దానివలన శాంతి యనగా మద్భావాప్తి గలుగునని చెప్ప, అందుపై అర్జును డిట్లు ప్రశ్నించుచున్నాడు.

## 13. త్రయోదశాధ్యాయము – క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

192 గీ॥ ప్రకృతిం పురుషంచైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ!

తా॥ కేశవా! ప్రకృతిని పురుషుని క్షేత్రమును క్షేత్రజ్ఞుని జ్ఞానమును జ్ఞేయమును గురించి పుష్కలముగా తెలిసికొనగోరుచున్నాను. అనుగ్రహింపుము అని ప్రశ్నింపగా శ్రీకృష్ణు డిట్లు సమాధాన మిచ్చుచున్నాడు.

193 గీ॥ ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః.

తా॥ ఈశరీరమే క్షేత్ర మనబడును. దీనితత్త్వమును గుర్తించినవాడే క్షేత్రజ్ఞు డనబడును.

194 గీ॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత!
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్తద్జ్ఞానం మతం మమ.

తా॥ ప్రతిదేహమందును క్షేత్రజ్ఞుడను నేనే. ఇట్లు ప్రతిదేహమందు నున్ననన్ను పుష్కలముగాను నిశ్చయముగాను తెలిసికొనుటయే నాజ్ఞానము లేక బ్రహ్మజ్ఞానము.

195 గీ॥ యత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్
సచ యో య త్ప్రభావశ్చ త త్సమాసేన మే శ్రుణు.

తా॥ క్షేత్ర మనగా నెట్టిదో ఎట్టిగుణములు గలదో, ఏ కార

ణముVలన ఏర్పడునో ఎట్టిభేదములతో నొప్పునో ఎట్టిప్రభావము గల దియో వివరింతును, వినుము.

196 గీ॥ ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః.

తా॥ ఈవిషయమే అనేక వేదశాఖలందును, అనేక మన్వాది ఋషులచే స్మృతులందును, యుక్తియుక్తము లగుబ్రహ్మసూత్రముల యందును ప్రతిపాదింపబడియున్నది.

197 గీ॥ మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః
ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్.

తా॥ ఆకాశాదిపంచభూతములు అహంకారము ప్రకటముగాక బీజరూపములో నుండు కారణదేహ మనబడునవిద్య, బుద్ధి, కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు, శబ్దస్పర్శాదివిషయములు, ఇచ్ఛాద్వేష సుఖదుఃఖాదిసమూహము, చైతన్యము గలిసినసమూహమునకే క్షేత్ర మని పేరు.

198 గీ॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః
ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ,
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్
అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు
మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది
అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్
ఏతద్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం య దతోఽన్యథా.

తా॥ దేహమందు తాదాత్మ్యాభిమానము లేకుండుట లోక శ్లాఘనముకొరకు ప్రవర్తింపకుండుట అహింస ఓర్పు ధర్మమార్గ ప్రవృత్తి పెద్దల సేవించుట శుచిగానుండుట చిత్తస్థైర్యము ఇంద్రియ నిగ్రహము ఇంద్రియవిషయములగు శబ్దస్పర్శాదులందు వైరాగ్యము అహంకారము లేకుండుట జన్మజరాదులందు దోషమును దుఃఖమును గుర్తించుట పుత్రదారగృహక్షేత్రాదులందాసక్తిగాని తాదాత్మ్యము గాని లేకుండుట సుఖదుఃఖాదులందెల్లపుడు సమబుద్ధి గల్గియుండుట బ్రహ్మము నగునాయందె చిత్త మేకాగ్రతతో నుంచుట ఏకాంత మందుండుట జనసమూహములోనికి వెళ్ళకుండుట బ్రహ్మవిచార మొనర్చుట- ఇవి యన్నియు గలిసి జ్ఞాన మనబడును. ఇంతకంటె విలక్షణ మగునదంతయు నజ్ఞాన మనబడును.

199 గీ॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే
సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్
సర్వత శ్శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి
సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ
బహి రంతశ్చ భూతానా మచరం చరమేవ చ
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్
అవిభక్తం చ భూతేషు విభక్త మివచ స్థితమ్
భూతభర్తృచ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ
జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్.

తా॥ జ్ఞేయమును తెలిసికొన్నవాడు మోక్షమును పొందును. గాన జ్ఞేయవస్తుస్వరూపమును వివరించుచున్నాను. వినుము- అయ్యది ఆది లేనిది, సద్రూపము లగుభూతరూపము గాదు. అసద్రూప మగు

కుండేటికొమ్ములవంటిది గాదు. దానికి సర్వతోముఖముగా కాళ్ళు చేతులు నేత్రములు ముఖములు చెవులు ఉండి జగత్తంతయు ఆవరించినది. ఎట్టి యింద్రియగుణములు లేనిది. అన్నియింద్రియగుణముల కాభాసమాత్రమైనది ఏవస్తువుతోను కలియదు. అన్నివస్తువులను భరించునది. ఎట్టిగుణములు లేనిది. గుణముల నన్నిటిని ప్రవర్తింప జేయుచు ననుభవించున ట్లుండునది. చరమైనది. అచరమైనది. సర్వభూతములకు లోపల బయటకూడ ఉండునది. అతిసూక్ష్మమైనది. మిగులగొప్పది. దూరమందు సమీపమందు నుండునది. సర్వభూతములతో వేరుచేయబడనిది, వేరుగా నున్న ట్లుండునది. భూతముల నన్నిటిని భరించునది, పుట్టించునది, సంహరించునది. ఆదిత్యచంద్ర అగ్న్యాదులకుగూడ తేజస్సు నిచ్చునది. చీకటి కవ్వల నుండునది. ప్రతివానియొక్క హృదయమం దుండునది. ఇట్టివస్తువే జ్ఞేయ మన బడును.

200 గీ॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్.

తా॥ ప్రకృతిని పురుషుని వీరిద్దరిని ఆది లేనివారలనుగా తెలిసికొనుము. వికారములు గుణములు మొదలగునవి ప్రకృతివలన ఏర్పడునవి.

201 గీ॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే
పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజా న్గుణాన్
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు.

తా॥ శరీరేంద్రియకర్తృత్వమునకు ప్రకృతియే కారణము. సుఖదుఃఖాదుల ననుభవించుటకు పురుషుడే కారణము. ఈపురుషుడు ప్రకృతియం దుండి ప్రకృతివలన పుట్టినగుణముల ననుభవించును. అదియే యీపురుషు డుత్తమాధమదేహములందు పుట్టుటకు కారణము.

202 గీ॥ ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేస్మి న్పురుషః పరః
య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ
సర్వథా వర్తమానోపి న స భూయోఽభిజాయతే.

తా॥ సమీపమందుండి ప్రేరేపించువాడును, అనుమోదించువాడును, భరించువాడును, భోక్తయు, మహేశ్వరుడును, పరమాత్మయు నని చెప్పబడుపురుషు డీదేహమందున్నను ఎట్టిదేహవ్యాపారములందు సక్తుడుగాక భిన్నుడుగానే యుండును. ఎవ డీరీతిగా ప్రకృతిని పురుషుని వేరువేరుధర్మములతో గ్రహించి ప్రవర్తించునో వాడు వర్తమానదేహపతనానంతరము తిరిగి జన్మించడు.

203 గీ॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి.

తా॥ సర్వభూతములందు కూటస్థరూపుడై యేకరీతిగా నుండి దేహాదులు నశించుచున్నను నశింపకుండునట్టి నాయథార్థరూపమును నిశ్చయముగా తెలిసికొనునో వాడే జ్ఞాని యనబడును.

204 గీ॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి.

తా॥ కర్మఫలరూప మగుప్రకృతియే యందు తాదాత్మ్యము నొందినజీవచైతన్యాభాసముతో గూడి ఆయాదేహేంద్రియవ్యాపారముల నొనర్చుచున్నను, తన్నకర్తనుగా నెరిగి, ఎట్టిదేహవ్యాపారసంబంధము లేక ప్రవర్తించువాడే జ్ఞాని యనబడును.

205 గీ॥ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయ మవ్యయః
శరీరస్థోపి కౌంతేయ! న కరోతి న లిప్యతే
యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే.

తా॥ పరమాత్మ ఆదిలేనివాడగుటచేతను, గుణములు లేనివాడగుటచేతను, నాశరహితుడై శరీరములం దున్నను ఎట్టివ్యాపారముల నొనర్పడు. వానిఫలములతోను బంధింపబడడు. సర్వలోకములను వ్యాపించియున్న యాకాశ మెట్లు లోకవస్తువులతో నంటియుండదో అట్లే ఈయాత్మగూడ దేహాదివ్యాపారముల నంటియుండదు.

206 గీ॥ యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత!
క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాంతి తే పరామ్.

తా॥ ఒకేసూర్యుడు సర్వలోకమును ప్రకాశింపజేయునట్లే క్షేత్రజ్ఞుడు క్షేత్రమగు దేహము నంతను ప్రకాశింపజేయును. ఇట్లు క్షేత్రజ్ఞులవిభాగసంబంధమును భూతములప్రకృతిని వికారములను మోక్షమును ఎవరు గుర్తింతురో వారు పరమగతిని పొందుదురు.

## 14. చతుర్దశాధ్యాయము – గుణత్రయ విభాగయోగము

207 గీ॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్
యద్జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః.

తా॥ ఇంకను నీకు విశేషముగా నుత్తమ మగుబ్రహ్మజ్ఞానము నుపదేశింతును. మునులందరును అజ్ఞానమువలననే మోక్షమునొందిరి.

208 గీ॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః
సర్గేపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ.

తా॥ ఈజ్ఞానము నొందినవారు నాలో నైక్యమై సృష్టిప్రళయకాలములం దెట్టిమార్పు లేక యేకరీతిగా నారూపముతోనే యుందురు.

209 గీ॥ మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మి న్గర్భం దధా మ్యహమ్
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత !

తా॥ నాప్రకృతియే సర్వజీవులయొక్క ఉత్పత్తికి కారణమగును. నే నాప్రకృతియందు చిదాభాసరూపముతో నుందును.

అందువలననే బ్రహ్మాది స్తంబపర్యంతము లగుసర్వభూతములయొక్క ఉత్పత్తి గల్గుచున్నది.

210 గీ॥ సర్వయోనిషు కౌంతేయ! మూర్తయ స్సంభవంతి యాః
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా
స త్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః
నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్.

తా॥ సమస్తయోనులందు నేదేహములు పుట్టుచున్నవో వాని కన్నిటికి ప్రకృతి తల్లివంటిది. నేను తండ్రివంటివాడను. సత్త్వము రజస్సు తమస్సు అనుప్రకృతిగుణములు స్వభావముచే అసంగ చిద్రూపు డగు జీవుని, దేహమందు బంధించుచున్నవి.

211 గీ॥ తత్ర స త్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ!
రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్
త న్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్
తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్యనిద్రాభి స్త న్నిబధ్నాతి భారత!

తా॥ ఆమూడుగుణములలో సత్త్వగుణము నిర్మలమైన దగుటచే సుఖసంగముచేత ఈశ్వరారాధనచేత ఇష్టాపూర్తాదులచేత జీవుని బంధించును.

రజోగుణము రాగమే స్వరూపముగ గలదియై విషయములందు తృష్ణను విపరీత మగునాసక్తిని కలుగజేసి అవి నెరవేరుట కనువగు వ్యాపారముల (కర్మల) నాచరింపజేయును. తమోగుణము అజ్ఞానము వలన పుట్టినదై అందరను మోహింపజేసి ప్రమాదమును అలసతను నిద్రను ఆవలింతలను జారత్వచోరత్వాదులందు ప్రేరణను కలుగజేయును.

212 గీ॥ స త్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత!
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత.

రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత!
రజ స్సత్వం తమ శ్చైవ తమ స్సత్వం రజ స్తథా.

తా॥ సత్వగుణము దేహిని సుఖమందును రజోగుణము కర్మ యందును తమోగుణము వివేకము నపహరించి ప్రమాదకార్యము లందును ప్రేరేపించును.

ఈమూడుగుణములలో ప్రతియొక గుణమును మిగిలిన రెంటిని తిరస్కరించి తానే ప్రబలముగా దేహముపై ప్రభుత్వ మొనర్ప ప్రయత్నించుట స్వభావమైనది.

213 గీ॥ సర్వద్వారేషు దేహేస్మి న్ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మిత్యుత.
లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమ స్స్పృహా
రజ స్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ!
అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ
తమ స్యేతాని జాయంతే వివృద్ధే కురునందన!

తా॥ అట్లొనర్చినసత్త్వగుణము ప్రభువైనచో దేహికి ప్రతీంద్రియ వృత్తియందును ప్రకాశమును వివేకమును ఈశ్వరారాధనాత్మజ్ఞానాదులందు ప్రవృత్తియు గోచరించును.

రజోగుణము ప్రభువైనచో దేహికి లోభమును ప్రతికార్యమందును ప్రవృత్తియు కర్మలనారంభించుటయు చిత్తశాంతి లేకుండుటయు అన్నివిషయములందు స్పృహయు నధికముగా గోచరించును.

తమోగుణము ప్రభువైనచో దేహి కేవస్తువును యధార్థముగా గ్రహింపకుండుటయు పొరపాటును మోహమును నింద్యకార్యములందు ప్రవృత్తియు నధికముగా గోచరించును.

214 గీ॥ యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్
తదోత్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే
రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే

కర్మణ స్సుకృత స్యాహు స్సాత్వికం నిర్మలం ఫలమ్
రజసస్తు ఫలం దుఃఖ, మజ్ఞానం తమసః ఫలమ్.

తా॥ సత్త్వగుణ మధికమగుకాలమందు దేహి మరణించినచో నుత్తమలోకముల నొందును.

రజోగుణాధిక్యకాలమందు మరణించిన దేహి కర్మాచరణ చేయుజాతియందు తిరిగి జన్మించును. తమోగుణాధిక్యకాలమందు మరణించినదేహి పశుపక్ష్యాదిమూఢయోనులందు జన్మించును.

కర్మ లనగా సత్వగుణము గల్గి చేయుకర్మలకు ఫలముగూడ నిర్మల మగుసుఖరూపముగా నుండును. రజోగుణము గల్గి చేయు కర్మలఫలము దుఃఖరూపముగా నుండును. తమోగుణము గల్గి చేయు కర్మలఫల మత్యంతాజ్ఞానరూపముగా నుండును.

215 గీ॥ సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవచ
ఊర్ధ్వం గచ్ఛంతి సత్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః

తా॥ సత్వగుణమువలన జ్ఞానమును, రజోగుణమువలన లోభమును, తమోగుణమువలన ప్రమాదము మోహము అజ్ఞానమును గలుగును. సత్వగుణము గలవా రూర్ధ్వలోకములను రజోగుణము గలవారు మధ్యలోకములను, తమోగుణము గలవా రధోలోకములను బొందెదరు.

216 గీ॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి.

తా॥ ఎపు డపరోక్షాత్మవిజ్ఞానము నొంది నన్ను త్రైగుణముల కతీతునిగా జూచునో అపుడు వాడే నేను.

217 గీ॥ గుణా నేతా నతీత్య త్రీ న్దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే.

తా॥ దేహముగా పరిణమించు నీత్రిగుణముల నతిక్రమించి ఎనికి నధిష్ఠానరూపముగా నుండుకూటస్థాత్మను గుర్తించినవాడు ముక్తుడై జననాదిసంసారధర్మముల నొందడు.

218 గీ॥ కైర్లింగై స్త్రీన్గుణా నేతా నతీతో భవతి ప్రభో!
కిమాచారః కథం చైతాం స్త్రీన్గుణా నతివర్తతే?

తా॥ అర్జును డిట్లు ప్రశ్నించుచున్నాడు. ఓకృష్ణా! ఇట్టిత్రిగుణముల నతిక్రమించినజ్ఞాని యెట్టియాచారవ్యవహారములతో నుండును? అట్టివానిని ప్రాకృతజను లెట్లు గుర్తింపగలరు? ఈగుణముల నాజ్ఞాని యెట్లతిక్రమించును? ఈసందేహములకు సమాధానమిమ్మని వార్థించెను. అందుకు శ్రీకృష్ణు డిట్లు సమాధాన మిచ్చుచున్నాడు.

219 గీ॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవచ పాండవ!
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి
ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే.

తా॥ ఎవడు సత్త్వగుణకార్య మగుప్రకాశమునుగాని రజోగుణకార్య మగుప్రవృత్తినిగాని తమోగుణకార్య మగుమోహమును గాని స్వభావముచే ప్రాప్తముగాగా వాని ననుభవించుచు, ప్రాప్తింపని వానిని కోరక ఉదాసీనుడై సుఖదుఃఖాదులచే చలింపక త్రిగుణపరిణామ మగు దేహేంద్రియాదికము త్రిగుణాత్మక మగుపాంచభౌతిక విషయములందు ప్రవర్తించుచున్నట్లును తన కద్దానితో నెట్టిసంబంధము లేదనియు దృఢనిశ్చయముతో నుండునో వాడే త్రిగుణాతీతు డగుజ్ఞాని యనబడును.

220 గీ॥ సమదుఃఖసుఖ స్స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః
మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే.

తా॥ సుఖదుఃఖములందును మట్టి బంగారములందును ప్రియ, అప్రియములందును స్తుతి నిందలందును మాన, అవమానములందును మిత్ర, శత్రువులందును, సమబుద్ధి గలవాడై ఎట్టి దేహేంద్రియ వ్యాపారాదులను బుద్ధిపూర్వకముగా చేయకుండువాడు గుణాతీతు డనబడును.

221 గీ॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణా న్సమతీ త్యైతా న్బ్రహ్మభూయాయ కల్పతే.
బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృత స్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాంతికస్య చ.

తా॥ ఎవడు న న్నేకాంతభక్తితో సేవించునో వాడు పైగుణ ముల నతిక్రమించి బ్రహ్మభావమునొందును. నేనే బ్రహ్మ, అవ్యయ, శాశ్వత,సుఖ, ధర్మ, ప్రతిష్ఠాదిశబ్దములచే చెప్పబడెదను. గాన ఆజ్ఞాని గూడ నీశబ్దములచేత చెప్పబడును.

## 15. పంచదశాధ్యాయము – పురుషోత్తమప్రాప్తియోగము

222 గీ॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్.

తా॥ ఈసంసారవృక్షము రేపుండునో ఉండదో తెలియబడనిది గాన అశ్వత్థ మనబడును. మరియు గాలి లేనపుడుగూడ అశ్వత్థవృక్ష పత్రము చలించును. అట్లే యీసంసారముగూడ ప్రతిక్షణవిలక్షణమైన దగుటచే అశ్వత్థ మనబడును. దీనికి మూలము బ్రహ్మము. దీని కొమ్మలు సత్యలోకాదిఅతలలోకమువరకు క్రిందకు ప్రసరించినవి. వేద ములన్నియు దీనియాకులు. ఎవ డీసంసారవృక్షయథార్థతను గుర్తిం చునో వాడే వేదవేత్త యనబడును.

223 గీ॥ అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః

అధశ్చ మూలా న్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే.
న రూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాది ర్నచ సంప్రతిష్ఠా
అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా.
తతః పదం త త్పరిమార్గితవ్యం
యస్మి న్గతా న నివ ర్తంతి భూయః
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ.

తా॥ ఈసంసారవృక్షమునకు జీవులనుశాఖలు తమతమకర్మల ననుసరించి ఊర్ధ్వాధోలోకములందు జన్మింతురు. త్రిగుణములచే నివి వృద్ధినొందును. శబ్దస్పర్శాదివిషయములే దీనికి చిగురుటాకులు. కర్మానుగుణముగా కర్మఫలము లను వేళ్ళు దీనిక్రింద వ్యాపించును. దీని కొకనియతరూపముగాని ఆదిగాని అంతముగాని కనుపించదు. దీని నసంగ మనగా ఎట్టిప్రపంచవ్యవహారమందు నాసక్తి లేకుండుట యను శాస్త్రముచే దృఢముగా తెగగొట్టి ఉత్కృష్ట మగుబ్రహ్మపదమును విచారింపవలెను. ఎట్టిబ్రహ్మమువలన నీవృక్షము ప్రసృతమైనదో దానిని గుర్తించినవాడు తిరిగి జన్మింపడు.

224 గీ॥ నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛం త్యమూఢాః పద మవ్యయం తత్.

తా॥ దేహామం దభిమానము మోహము ప్రాపంచికవస్తువు లందు వాంఛ లేనివారై, శీతోష్ణసుఖదుఃఖాదులభేదమును గుర్తింపని జ్ఞాను లట్టిబ్రహ్మపదమును పొందగలరు.

225 గీ॥ న త ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ.

తా॥ ఆబ్రహ్మపదమును సూర్యచంద్రాదులు ప్రకాశింపజేయ జాలరు. అదియే స్వప్రకాశము. దానిప్రకాశమువలననే ఈసూర్యాదులు ప్రకాశించుచున్నారు. అట్టిబ్రహ్మపదమును పొందినవారు తిరిగి జన్మింపరు.

226 గీ॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
మనష్షష్ఠాణీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి
శరీరం య దవాప్నోతి య చ్చాప్యుత్క్రామ తీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయు ర్గంధాని వాశయాత్.

తా॥ కూటస్థుడ నగునాయందు వానిపూర్వజన్మకర్మఫలరూపమగుబుద్ధి కల్పితము కాగా, అందు ప్రతిబింబించిననాచైతన్యమే జీవుడనబడును వీడు త్రిగుణములందలి ఇంద్రియములగు మనస్సును పొంది అవి చేయువ్యాపారము లన్నిటియందును తానే సక్తుడై అవియే యేశరీరముల నాశ్రయించిన వాని నన్నిటిని తానే ఆశ్రయించుచు సంసారధర్మము నొందుచున్నాడు.

227 గీ॥ శ్రోత్రం చక్షు స్స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే.

తా॥ ఈజీవుడు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనుజ్ఞానేంద్రియము లైదింటిని మనస్సును ఆశ్రయించి శబ్దాదివిషయములను సేవించుచున్నాడు.

గీ॥ ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః
యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితమ్
యతంతో ప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః.

తా॥ ఈదేహమును విడిచిపోవునప్పుడుగాని మరియొకదేహములో ప్రవేశించునప్పుడుగాని దేహమునం దుండునపుడుగాని విష

యముల ననుభవించునప్పుడుగాని ఈత్రిగుణములతో గూడియున్న జీవుని నిజరూప మగుకూటస్థుని మూఢులు చూడజాలరు. ఆత్మవేత్త లగుయోగులుమాత్రము చూడగలరు.

229 గీ॥ య దాదిత్యగతం తేజో జగ ద్భాసయ తేఽఖిలమ్
య చ్చంద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్
గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః.

తా॥ సూర్య, చంద్ర, నక్షత్రా, గ్న్యాదులందరిప్రకాశకశక్తి నాదేయని తెలియుము. నేను భూమిలో నుండు భూతధారకశక్తిని. నేను సోమునిలో నుండు అమృతరసశక్తిరూపముతో ఓషధుల నన్నిటిని పోషించుచున్నాను.

230 గీ॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్.

తా॥ నేను సర్వజీవులయొక్క జఠరమందు వైశ్వానరరూపముతో నుండి వారు భుజించుసర్వవిధాహారమును పచనమొనర్చి ప్రాణాదివాయువృత్తులద్వారా దేహమందలి భిన్న భిన్నావయవముల కవసర మగురసమును పొందించుచున్నాను.

231 గీ॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మ త్తస్స్మృతి ర్జ్ఞాన మపోహనం చ
వేదై శ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్.

తా॥ నేను సర్వజీవులయొక్క హృదయగుహాయం దుందును. నావలననే వారలకు యథార్థజ్ఞానముగాని భ్రాంతిజ్ఞానముగాని గల్గును. వేదము లన్నిటిచేతను నేనే తెలియదగినవాడను. వేదవేత్తయు నేనే.

232 గీ॥ ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః.

తా॥ అక్షరుడని, క్షరుడని రెండువిధము లగుపురుషులచే నీలోకము నిండియున్నది. అందు క్షరు డనగా సర్వజీవులనియు, అక్షరు డనగా కూటస్థు డనియు నర్థము. క్షర మనగా నశించువాడు, బుద్ధి ప్రతిబింబితకూటస్థచైతన్యరూపు డగుజీవుడు. అక్షర మనగా నాశరహిత మగుకూటస్థుడు. ఈతడు దేహమందుండి దేహవ్యాపారమునకు సాక్షిమాత్రుడుగా నుండు దేహపరిచ్ఛిన్నచైతన్యము లేక దేహోపాధిక చైతన్యము. ఈరెంటికంటె విలక్షణమై సర్వోపాధిపరిచ్ఛేదరహితమై సర్వవ్యాపకమై సత్యము జ్ఞానము ఆనందము రూపముగా గలయుత్తమ పురుషుడే పరమాత్మ యనబడును.

233 గీ॥ యస్మా త్క్షర మతీతోఽహ మక్షరా దపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః.

తా॥ నేను పైజెప్పినక్షరమునకు అక్షరమునవు విలక్షణుడ నగుటచే లోకమందును వేదమందును పురుషోత్తముడ నని వ్యవహరింపబడుచున్నాను.

234 గీ॥ యో మా మేవ మసంమూఢో జానాతి పురుషోత్తమః
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత!
ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మాయానఘ!
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత!

తా॥ ఎవడు బుద్ధిమాంద్యము లేక న న్నీరీతిగా సద్గురుమూలక వేదాంతవాక్యశ్రవణాదిద్వారా నిశ్చయముగా తెలిసికొనునో వాడే సర్వజ్ఞుడనైన నాభావము నొందుచున్నాడు. అర్జునా! రహస్య మగు బ్రహ్మవిద్యను నీ కుపదేశించితిని. నీవు గ్రహించి కృతార్థుడవు కమ్ము.

## 16. షోడశాధ్యాయము – దైవాసురసంపద్విభాగయోగము.

235 గీ॥ అభయం సత్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్
అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్
దయా భూతే ష్వలోలు ప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్
తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత !

తా॥ భయము లేకుండుట, చిత్తశుద్ధి, ఆత్మజ్ఞానేచ్ఛ, దానము, బాహ్యేంద్రియనిగ్రహము, అగ్నిహోత్రాదిశ్రుత్యుక్తకర్మాచరణము. వేదాధ్యయనము, తపస్సు, స్వవర్ణాశ్రమధర్మప్రవర్తన, సర్వభూతము లందును దయ, ఇంద్రియచాపల్యము లేకుండుట, అన్నింటియందు మృదుభావము, సిగ్గుపడుట, చాపల్యము లేకుండుట, బ్రహ్మవర్చస్సు, ఓర్పు, ధైర్యము శుచిభావము, ఎవరికిని ద్రోహ మొనర్పకుండుట, ఆత్మస్తుతిపరనిందలు లేకుండుట యనుగుణములు గలవారు దైవసంపద గలవా రనబడెదరు.

236 గీ॥ దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవచ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ ! సంపద మాసురీమ్.

తా॥ ఇతరులు తనను స్తుతించుట కనువుగా ప్రవర్తించునట్లు నటించుట, నేనే గొప్పవాడ ననుగర్వము, అభిమానము, కోపము, పరుష వాక్కులాడుట, అజ్ఞానము మొదలగుగుణములు గలవారు అసురసంపద గలవా రనబడెదరు.

237 గీ॥ దైవీసంప ద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా
మాశుచ స్సంపదం దైవీ మభిజాతోసి పాండవ !
ద్వౌ భూతసర్గౌ లోకేస్మి న్దైవ ఆసుర ఏవచ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ ! మే శ్రుణు.

తా॥ దైవీసంపద మోక్షకారణ మగును. మఱి ఆసురసంపద సంసారబంధకారణ మగును, నీవు దైవసంపద గలవాడవేగాన నీవు

దుఃఖింపవలదు. నీ కిదివరలో దైవీసంపద్గుణములు విపులముగా బోధించితిని. ఆసురసంపదవలనిగుణములు విపులముగా వివరింతును వినుము.

238 గీ॥ ప్రవృత్తించ నివృత్తించ జనా న విదు రాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే
అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్
అపరస్పరసంభూతం కి మన్య త్కామహైతుకమ్.

తా॥ ఏపనిచేయుటచే శ్రేయస్సు గల్గునో అందు ప్రవర్తించుటగాని, ఏపనిచేయుటచే అశ్రేయస్సు గల్గునో ఆపనినుండి విరమించుటనుగాని ఆసురసంపదగలవా రెరుగరు. వారలయందు శుచిభావముగాని సదాచారముగాని సత్యముగాని యెంతమాత్రము నుండదు. వారీ జగత్తు అసత్యమని కారణమగు నీశ్వరుడు లేడనియు స్వేచ్ఛచేతనే యేర్పడుననియు అంతియేగాని బ్రహ్మము మాయ ఆకాశము వాయువు అగ్ని ఉదకము పృథివి ఓషధులు అన్నము పురుషుడు అనునీక్రమమగు కార్యకారణభావము నంగీకరించరు.

239 గీ॥ ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః.

తా॥ వారు మలినచిత్తులగుచు బుద్ధియందు ప్రకాశముగాని యుక్తాయుక్తవివేకముగాని లేక ఉగ్రమైనట్టియు నీచమైనట్టియు క్రూరమైనట్టియు కర్మలను మహాపాపములను చేయుచు సత్పురుషులకు శత్రువులై తాము నరకమును పొందుటయేగాక ఇతరులనుగూడ నరకముల బొందించుబోధలు చేయుచుందురు.

240 గీ॥ కామ మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః
మోహా ద్గృహీత్వాసద్గ్రాహా న్ప్రవర్తంతేఽశుచివ్రతాః
చింతా మపరిమేయాం చ ప్రళయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః.

ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థసంచయాన్
ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇద మ స్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్.

తా॥ వీరు విపరీత మగుకామ, దంభ, మాన, మద, మోహ ములు గలవారై అశుచులై అశాస్త్రీయప్రవర్తన లొనర్చుచు చని పోవువరకు ధనధాన్యాదిలాభములకొరకుమాత్రమే ప్రయత్నించుచు ఆముష్మికచింత ఎంతమాత్రము లేక "నా కిది దొరకినది; ఇంక నీ కోరికలను పొందగలను. ఇది ఉన్నది. ఇది ఇకముందు పొందగలను" ఇత్యాదిగా ఆలోచించుచుందురు.

241 గీ॥ అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరానపి
ఈశ్వరోహ మహం భోగీ సిద్ధోహం బలవా న్సుఖీ
ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః
అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ
ఆత్మసంభావితా స్స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజంతే నామయజ్ఞైస్తే దంభే నావిధిపూర్వకమ్
అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః
మా మాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః.

తా॥ ఈశత్రువు నాచే చంపబడెను. మిగిలినశత్రువులను చంపగలను. నేను ప్రభువును. భోగిని. బలవంతుడను. సౌఖ్యము ననుభ వించుచుంటిని. మంచిసమర్థుడను. మంచివంశమందు పుట్టితిని. నాతో సాటి ఎవ రున్నారు ? యాగ మొనర్పగలను, దాన మీయగలను. సంతోషింతును. ఈప్రకారముగా అజ్ఞానముచే మోహితులై కామ భోగములందు లాలసులై అశుచి యగునరకమందు బాధలుపడి, తిరిగి జన్మించి, స్తబ్ధులై ధనమానమదాదులతో గూడి లోకముచే స్తుతింప

బడుట కవిధిపూర్వకముగా నామయజ్ఞముల నొనర్చి అనగా వర్ణాశ్రమ విహిత మగువేదోక్తకర్మల ననుష్ఠింపక ('రామనామసప్తాహము' మొదలగునవి నామయజ్ఞము లనబడును) తమదేహములందును, పర దేహములందు నున్నట్టిభగవంతుడ నగునన్ను ద్వేషింతురు.

242 గీ॥ తా నహం ద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమాన్
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు
ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని
మా మప్రాప్యైవ కౌంతేయ తతో యాం త్యధమాం గతిమ్
త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రియం త్యజేత్.

తా॥ అట్టియసురసంపద గలవారిని నేను నిరంతర మాసుర ప్రవృత్తి గలయోనులందే మాటిమాటికి పడవేయుదును. వా రసుర జన్మల నెన్ని పొందినను నావిషయిక మగుజ్ఞానముకొఱ కెంత మాత్రము ప్రయత్నింపక అధోగతిని పొందుదురు.

కామము క్రోధము లోభము- అనుమూడును ప్రతివానికి ననర్థకము లగుద్వారములు; గాన శ్రేయోభిలాషి తప్పక యీమూటిని పరిత్యజింపవలెను.

243 గీ॥ ఏతై ర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభి ర్నరః
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్.

తా॥ ఎవడైనను పైకామాదిత్రయమును విడిచి తనకు శ్రేయస్కర మగువేదోదితధర్మము నాచరించునో వాడు క్రమముగా పరమపదమును బొందును.

244 గీ॥ యః శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి.

తా॥ ఎవడు శాస్త్రవిధి నుల్లంఘించి తనకు తోచినట్లు ప్రవర్తించునో వాడైహికసుఖమునుగాని ఆముష్మికసుఖమునుగాని మోక్షమునుగాని పొందడు. అందుచే ఓఅర్జునా! నీకు కర్తవ్యాకర్తవ్యములందు శాస్త్రమొక్కటియే పరమప్రమాణము. గాన నీవు శాస్త్రవిధిని పుష్కలముగా తెలిసికొని దాని నాచరించి శ్రేయస్సును బొందవలయును.

## 17. సప్తదశాధ్యాయము - శ్రద్ధాత్రయ విభాగయోగము

245 త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు
సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్సఏవ సః.

తా॥ సర్వులకును స్వభావముచే మూడువిధము లగుశ్రద్ధ గలుగును. సాత్వికశ్రద్ధ, రాజసశ్రద్ధ, తామసశ్రద్ధ యని వానిపేర్లు. అవి వానియొక్క పూర్వజన్మలందలి గుణముల కనురూపముగానే యుండును. దేనియందు పురుషు డేకాగ్ర మగుశ్రద్ధతో నుండునో వాడదియే యగును.

246 గీ॥ యజంతే సాత్త్వికా దేవా న్యక్షరక్షాంసి రాజసాః
ప్రేతా న్భూతగణాం శ్చాన్యే యజంతే తామసా జనాః
అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః
కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాం చైవాంతశ్శరీరస్థం తా న్విద్ధ్యాసురనిశ్చయాన్.

తా॥ సాత్వికు లనగా సాత్వికశ్రద్ధ గలవారు దేవతలను తమ తమవర్ణాశ్రమానురూపముగా నారాధింతురు. రాజసశ్రద్ధ గలవారు యక్షులను రాక్షసులను ఆరాధింతురు. తామసశ్రద్ధ గలవారు ప్రేతములను భూతగణములను ఆరాధింతురు. అసురనిశ్చయము గలవారు శాస్త్రమందు విధింపబడని ఘోర మగుతపస్సును దంభముతోను

అహంకారముతోను గూడినవారై కామరాగములే బలముగా గల వారై, నిర్దాక్షిణ్యముగా శరీరమందలి అవయవములను తదధిష్ఠాన దేవతలను పరమాత్మ నగునన్ను కృశింపజేయుచు, నిరంతరము వర్తింతురు. ఇట్టివారి నాసురసంపద గలవారినిగా తెలిసికొనుము.

247 గీ॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు
ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః
రస్యా స్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్విక ప్రియాః
కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః
యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియమ్.

తా॥ ఆహారము స్వీకరించుట, యజ్ఞ మాచరించుట, తపం బొనర్చుట, దాన మొనర్చుట-ఇవన్నియు త్రిగుణములచే భిన్నభిన్న ములుగా నుండును. ఆహారమందు త్రిగుణభేద మెట్లనగా:-

ఆయుస్సును సత్త్వమును బలమును ఆరోగ్యమును సుఖమును ప్రీతిని వృద్ధిపొందించునట్టి రసముగలట్టి మృదువయినట్టి చమురుగలట్టి స్థిరమైనట్టి పదార్థములు సాత్త్వికులు భుజింతురు. కారము గలినట్టి పుల్ల నైనట్టి ఉప్పనైనట్టి మిక్కిలివేడిని గల్గించునట్టి తీక్ష్ణమైనట్టి దహింప జేయునట్టి దుఃఖమును శోకమును రోగమును గలుగజేయునట్టి ఆహార పదార్థములను రాజసగుణము గలవారు సేవింతురు.

వండినపదార్థము జాముకాల మైనతర్వాత భుజించుటయు సారముపోయినట్టియు, దుర్గంధము గలట్టియు, చల్లారిపోయినపదార్థ మును ఒకరు భుజింపగా మిగిలినపదార్థమును అపవిత్రపదార్థమును తామసగుణము గలవారు భుజింతురు.

248 గీ॥ అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సా ...

అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్
విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే.

తా॥ యాగవిషయక మగు త్రిగుణభేదము వివరింపబడుచున్నది. అందు సాత్వికగుణు లెట్టిఫలమును కోరక 'శాస్త్రము విధించినదిగాన మనము తప్పక చేయవలయు' ననునిశ్చయముతో మాత్రమే యజ్ఞాదుల నాచరింతురు.

రాజసగుణులు తమ కభిమతఫలము నభిలషించియు లోకము తమను స్తుతింపవలయు ననుకోరికతోను అగ్నిహోత్రాదియాగముల నాచరింతురు.

ఇక తామసగుణులు వేదముచేత విధింపబడనట్టియు అన్నదాన వర్జితమైనట్టియు మంత్రములుగాని శాస్త్రీయదక్షిణలుగాని లేనట్టియు శ్రద్ధలేనట్టియు యాగముల నాచరింతురు.

249 గీ॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే
అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే
మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ఉచ్యతే.

తా॥ ఇక తపస్సునందు త్రిగుణభేదములను వివరింపదలచి ముందు తపస్సు మూడవాంతరభేదములతో నొప్పియున్నదని వివరించబడుచున్నది.

1. శారీరతపస్సనగా- దేవతలను, ద్విజులను, గురువులను, విద్వాంసులను పూజించుట శుచిగా నుండుట సన్మార్గప్రవర్తన బ్రహ్మచర్యము ఏభూతమును హింసింపకుండుట.

2. వాచికతప స్సనగా-ఎవరికిని నొప్పిగలుగనట్లు మాట్లాడుట, సత్యమును ప్రియముగను, హితముగను పలుకుట, వేదాధ్యయనము.

3. మానసికతప స్సనగా- మనస్సును నిర్మలముగా నుంచుట సుఖముగ నుంచుట అనగా క్రూరత్వము లేకుండుట, మౌనము, ఇంద్రియనిగ్రహము, ఆయాదేవతలను ధ్యానించుట.

250 గీ॥ శ్రద్ధయా పరయా త ప్తం తప స్త త్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్వికం పరిచక్షతే
సత్కారమానపూజార్థం తపో దంభేనచైవ యత్
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్
మూఢగ్రాహే ణాత్మనో య త్పీడయా క్రియతే తపః
పర స్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్.

తా॥ పై త్రివిధతపస్సులలోను త్రిగుణభేదములు వివరింపబడు చున్నవి. శ్రద్ధతోను ఫలాపేక్షారహితముగను చేయుతపస్సు సాత్విక తప స్సనబడును.

ఇతరులచే సత్కరింపబడుటకును కొనియాడబడుటకును చిత్త చాంచల్యముతోను అస్థిరముగాను చేయుతపస్సు రాజసతప స్సనబడును.

మూఢులను వంచించుటకును దురాగ్రహముతోను తనకుగాని ఇతరులకుగాని పీడాకరముగాను చేయుతపస్సు తామసతప స్సనబడును.

251 గీ॥ దాతవ్యమితి య ద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్వికం స్మృతమ్
యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్
అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్.

తా॥ దానవిషయక మగు త్రిగుణభేదము వివరింపబడుచున్నది. శాస్త్ర మీదేశమం దీకాలమం దీపాత్రునకు దాన మీవలయునని

బోధించినదిగాన నేను దానమొనర్చుచుంటి ననుభావముతో తన కెట్టి ప్రత్యుపకారవాంఛయు లేక శాస్త్రీయ మగుదేశకాలపాత్రములందు దానమొనర్చుట సాత్త్వికదాన మనబడును. ప్రత్యుపకారముకొరకును, ఒకానొకఫలము నుద్దేశించియు తనమనస్సులో బాధపడుచు చేయు దానము రాజసదాన మనబడును. శాస్త్రీయ మగుదేశకాలముల నపేక్షింపక అపాత్రులకొరకు సత్కారరహితముగాను, తిరస్కార పూర్వకముగాను చేయుదానము తామసదాన మనబడును.

252 గీ॥ ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా
తస్మా దోమి త్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః
ప్రవ ర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్.

తా॥ ఓం, తత్, సత్ - అనుమూడుపదములలో నేయొక పదముచేనైనను బ్రహ్మము నిర్దేశింపబడును. అందులో ముందు 'ఓం' అనుపదతాత్పర్యము వివరింపబడుచున్నది. దానిచే బ్రాహ్మణులు వేదములు యజ్ఞములు విహితము లగును. అందుచే ప్రతివేదారంభ యజ్ఞారంభములందును 'ఓం' అని ముం దుచ్చరించియే బ్రహ్మవాదు లాయాకార్యముల నాచరింతురు.

253 గీ॥ త దిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః.

తా॥ 'తత్' అనుపదముయొక్క తాత్పర్యము వివరింపబడు చున్నది. యజ్ఞము తపస్సు దానము మొదలగుకర్మలలో మోక్షకాంక్ష కలవా రెట్టిఫలమును కోరకయే ప్రవర్తించుచున్నారు. గావున తత్ అను శబ్దమునకు మోక్షమని యర్థము.

254 గీ॥ సద్భావే సాధుభావే చ స దిత్యేత త్ప్రయుజ్యతే
ప్రశ స్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ ! యుజ్యతే.
యజ్ఞే తపసి దానే చ స్థితి స్స దితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం స దిత్యే వాభిధీయతే.

తా॥ మంచిభావమందు సాధువులభావమందును, ప్రశస్తమగు పనియందును, యజ్ఞదానతపస్సుల యభిరతియందును, అందుకొరకు చేయుపనియందును 'సత్' అనుశబ్దము వాడబడుచున్నది.

255 గీ॥ అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్
అస దిత్యుచ్యతే పార్థ! నచ త త్ప్రేత్య నో ఇహ.

తా॥ అశ్రద్ధతో చేయు హోమ, దాన, తపః, కర్మాదులు 'అసత్' అనుశబ్దముచే చెప్పబడుచు నైహికఫలములనుగాని, ఆముష్మికఫలములనుగాని యీయవు.

## 18 అష్టాదశాధ్యాయము – మోక్షసన్న్యాసయోగము

256 గీ॥ సన్న్యాసస్య మహాబాహో! త త్త్వ మిచ్ఛామి వేదితుమ్
త్యాగస్య చ హృషీకేశ! పృథ క్కేశినిషూదన!

తా॥ ఇందుపై అర్జునుడు "ఓకృష్ణా! సన్న్యాసముయొక్క నిజరూపమును త్యాగముయొక్క నిజరూపమును విడివిడిగా తెలుపుము"అని ప్రశ్నించుచున్నాడు.అందుకు శ్రీకృష్ణు డిట్లుసమాధానమిచ్చుచున్నాడు.

257 గీ॥ కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః.

తా॥ ఓఅర్జునా! ప్రజా, పశు, ధనాదులయెడ కోరికలు నెరవేరుటకొరకు చేయుకర్మలు కామ్యకర్మ లనబడును. అట్టికోరికతో ప్రవర్తింపక సర్వకామములను పరిత్యజించుటయే సంన్యాసమని వేదవేత్తలు పల్కుచున్నారు. నిత్యనైమిత్తికాదిసర్వకర్మలను ఫలాభిసంధిలేక ఈశ్వరార్పణబుద్ధితో నాచరించుట త్యాగ మనబడును.

258 గీ॥ త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్య మితి చాపరే
నిశ్చయం శ్రుణు మే తత్ర త్యాగే భరతసత్తమ!
త్యాగోపి పురుషవ్యాఘ్ర! త్రివిధ స్సంప్రకీర్తితః.

తా॥ కొందరు విద్వాంసులు దోషముతో కూడిన శ్యేనయాగాద్యాభిచారికకర్మలనుమాత్రమే త్యాగమొనర్పవలయు నందురు,

మరికొందరు యజ్ఞదానతపఃకర్మల నెంతమాత్రము త్యాగ మొనర్పరా దందురు. అందు నానిశ్చితాభిప్రాయమును వివరింతును వినుము. ఈ త్యాగముగూడ మూడువిధములు.

259 గీ॥ యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్
ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమమ్.

తా॥ యజ్ఞము దానము తపస్సు- అనునవి పాపమును పోగొట్టి పవిత్రతను గూర్చి బ్రహ్మవేత్తయగుటకు తగునర్హతను సంపాదింప జేయుటచే వీని నెంతమాత్రము వదలరాదు. చేసితీరవలసినదే; గాని వీనియందు ఫలములను ఫలాసక్తిని విడువవలెను.

260 గీ॥ నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః
సుఖ మిత్యేవ య త్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్.

తా॥ వారివారివర్ణమును ఆశ్రమమును అనుసరించి నిత్యకర్తవ్యములుగా విధింపబడినకర్మల నెన్నడును వదలరాదు. అజ్ఞానముచే వానిని వదలినవో తామసు డనబడును. "కర్మలవలన వచ్చుఫలము సుఖమేగాని కర్మల నాచరించుట చాలకాయక్లేశకరము" అనుభయముతో కర్మత్యాగమొనర్చినవాడు త్యాగఫలము నెంతమాత్రము పొందలేడు.

261 గీ॥ కార్య మిత్యేవ య త్కర్మ నియతం క్రియతేఽర్జున!
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః
న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః
నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః
య స్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే.

తా॥ ఈకర్మ వేదముచే విధింపబడినదిగాన చేసితీరవలసినదే యని తలచి దానియందును తత్ఫలమందును సంగమును వదలుటయే సాత్వికత్యాగ మనబడును. సాత్వికుడు మేధావియై యెట్టిసంశయములు లేనివాడై ఆయాససాధ్య మగుకర్మమైనను చేయును.

దేహధారి యైనవాడేకర్మయుచేయక క్షణకాలముగూడ నుండ నేరడు. గాన కర్మఫలత్యాగమే త్యాగ మనబడునుగాని కర్మలనే త్యాగముచేయుట త్యాగ మనబడదు.

262 గీ॥ అనిష్ట మిష్టం మిశ్రించ త్రివిధం కర్మణః ఫలమ్
భవ త్యత్యాగినాం ప్రేత్య నతు సంన్యాసినాం క్వచిత్.

తా॥ కర్మఫలత్యాగ మొనర్పక కామ్యకర్మలను వదలిపెట్టి నిత్యనైమిత్తికాదికర్మలను ఫలాపేక్షతో నాచరించువారికి పరలోకమం దిష్టఫలమని అనిష్టఫలమని మిశ్రఫలమని మూడువిధములగుకర్మఫలము సిద్ధించును.

263 గీ॥ పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్
అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధా చ పృథ క్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్
శరీరవాఙ్మనోభి ర్య త్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః.

తా॥ సర్వకర్మలు సిద్ధించుటకు సాధనము లగునీఅయిదుకారణములు సాంఖ్యులచేతను వేదముచేతను బోధింపబడినవి. 1. శరీరము; 2. అహంకారము; 3. చక్షురాదీంద్రియములు; 4. ప్రాణాదివాయుభేదములు వానివ్యాపారములు; 5. దైవము.

మనుష్యుడు శరీరముచేగాని వాక్కుచేగాని మనస్సుచేగాని న్యాయమైనట్టికర్మనుగాని అన్యాయమగుకర్మనుగాని ప్రారంభించుట కీయైదును కారణము లగుచున్నవి.

264 గీ॥ తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః
యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమా న్లోకా న్న హంతి న నిబధ్యతే.

తా॥ ఇట్టివైదుకారణము లుండగా తా నొక్కఁడే కర్తనని తలచువా డవివేకి యగుదుర్మతి యనబడును. ఎవనికికర్తృత్వాహంకార ముండదో ఎవనిబుద్ధి కర్మఫలమందాసక్తమై యుండదో వా డీలోకము నంతను హత్యజేసినను కర్మఫలబద్ధుడు కాజాలనంతటి దృఢముగా నుండును. ఇట్టివాడు జీవన్ముక్తుడు. వాడు స్వస్వరూపమందు దృఢమగు నపరోక్షానుభవము గల్గియుండును. సాక్షిమాత్రుడ నేగాని కర్తను భోక్తను అనుభావము వాని కేక్షణమందును పొరపాటుననైనను రాదు. పరమార్థాత్మభావముతో స్థిరముగా నుండి ప్రారబ్ధవేగముచే శరీర మేపనిచేసినను వాని కెంతమాత్రము సంబంధ ముండదు. కాన నీ వీమర్యోధనాదులతో తప్పక యుద్ధమొనర్చితీరవలయు ననుట. ప్రారబ్ధమగుశరీరవేగముతో నెంతమాత్రము తాదాత్మ్యము నొందక ఆత్మజ్ఞానివై దృఢనిశ్చయముతో నుండుము.

265 గీ॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః
జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి.

తా॥ జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాత అనుమువ్వురు కర్మప్రేరకులు. పరమాత్మ కర్తయు గాదు, భోక్తయు గాదు. నిత్యాసంగుడును చిద్రూపుడును. సాధనమని కర్మమని కర్తయని కర్మసంగ్రహము మూడువిధములు. అటులనే జ్ఞానము కర్మ కర్త యని గుణభేదముచే మూడువిధములు. వాని వివరమును వినుము.

266 గీ॥ సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్వికమ్

పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావా న్పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్
యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్
అతత్త్వార్థవ దల్పం చ త త్తామస ముదాహృతమ్.

తా॥ సర్వభూతములందు పరస్పరవిరుద్ధధర్మములు గలయుపాధులందు షడ్భావవికారరహితమై దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమైన పరమాత్మను తెలిసికొనుట సాత్వికజ్ఞాన మనబడును.

భిన్నప్రకార మగుదేహములు గలసర్వజీవులందును భిన్నలక్షణములతో గూడి అనేకజీవాత్మలు గలవని తెలిసికొనుజ్ఞానము రాజసజ్ఞాన మనబడును. దేహమే ఆత్మ యనెడిది విపరీతజ్ఞానము. దేహమే ఈశ్వరుడు దేహమే పరబ్రహ్మము. ఈదేహమే నేను. నాకన్న వేరగుదేవుడు లేడు- అనియీరీతిగ వదరుచు, శాస్త్రము నెంతమాత్రము పఠింపక, విశ్వసింపక తాను తలంచినదే సత్యమని గురుశాస్త్రములను ధిక్కరించుజ్ఞానమే తామసజ్ఞాన మనబడును.

267 గీ॥ నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ య త్త త్సాత్విక ముచ్యతే
యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహులాయాసం త ద్రాజస ముదాహృతమ్.

తా॥ వేదమం దుపదేశింపబడిన నిత్యనైమిత్తికాదికర్మలను రాగద్వేషరహితముగను ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణబుద్ధితోను ఆచరించుకర్మలు సాత్వికకర్మ లనబడును. కర్మఫలమం దాసక్తితోను గర్వముతోను చేయుకర్మలు రాజసకర్మ లనబడును.

268 గీ॥ అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్
మోహా దారభ్యతే కర్మ త త్తామస ముదాహృతమ్.

తా॥ ముందు రాబోవుమంచిచెడ్డలుగాని హింసాదిదోషములుగాని తనశక్తిసామర్థ్యములుగాని తెలియక మోహముతో చేయుకర్మలు తామసకర్మ లనబడును.

269 గీ॥ ముక్తసంగో ఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే
రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః
అయుక్తః ప్రాకృత స్స్తబ్ధ శ్శఠో నైష్కృతికో ఽలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే.

తా॥ కర్తృత్వమందలి త్రిగుణభేదములు వివరింపబడుచున్నవి. సాత్త్వికకర్తృభావ మహంకారవర్జితమును ధైర్యోత్సాహసహితమును సిద్ధియందు నసిద్ధియందు నెట్టివికారము లేకపోవుటయు దానియం దాసక్తిరహితము నగును. రాజసకర్తృత్వ మనురాగముతోను కర్మఫలమం దాసక్తితోను లుబ్ధతతోను హింసతోను అశుచిభావముతోను ఫలప్రాప్తియందు హర్షముతోను ఫలాప్రాప్తియందు శోకముతోను కూడియుండును. తామసకర్తృత్వము ప్రకృతివశముతోను కార్యాకార్యవిచక్షణావర్జనముతోను అలసతతోను దుష్కార్యములతోను పరపీడతోను పరావమానముతోను దీర్ఘాలోచనతోను గూడియుండును.

270 గీ॥ బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శ్రుణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ!
ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ
యయా ధర్మ మధర్మంచ కార్యం చాకార్య మేవచ
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ
అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా
సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ.

తా॥ బుద్ధియందలిత్రిగుణభేదము వివరింపబడుచున్నది. సాత్త్వికబుద్ధి యేకార్య మాచరింపవలెనో యేకార్య మాచరింప తగదో

దేనివలన సంసారబంధము గల్గునో దేనివలన మోక్షము గల్గునో వివేకముతో గ్రహించును. రాజసబుద్ధి ధర్మాధర్మములను కర్తవ్యాకర్తవ్యములను శాస్త్రవిపరీతముగా గ్రహించును. తామసబుద్ధి ధర్మము నధర్మముగాను అధర్మమును ధర్మముగాను ఇట్లే ప్రతివిషయమును తలక్రిందులుగా గ్రహించును.

271 గీ॥ ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః
యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ ।
యయాతు ధర్మకామార్థా న్ధృత్యా ధారయతేఽర్జున!
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ! రాజసీ
యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ.

తా॥ ధృతి యనగా ధైర్యముగూడ త్రిగుణములచే భేదించును. ఎట్లనగా మనస్సును ఇంద్రియములను ప్రాణాదివాయువృత్తులను నిశ్చలమగుయోగాభ్యాసముచే ధరించుట సాత్త్వికధృతి యనబడును. ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను అందలిఫలము నపేక్షించి ధరించుట రాజసధృతి యనబడును. స్వప్న భయ శోక విషాద మదాదులను విడిచిపెట్టక దుర్బుద్ధితో ప్రవర్తించుట తామసధృతి యనబడును.

272 గీ॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి
య త్త దగ్రే విషమివ పరిణామే ఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్
విషయేంద్రియసంయోగా ద్య త్త దగ్రే ఽమృతోపమమ్
పరిణామే విషమివ త త్సుఖం రాజసం స్మృతమ్
య దగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్.

తా॥ సుఖములోని త్రిగుణభేదము వివరింపబడుచున్నది. సాత్త్వికసుఖము- ప్రారంభమందు విషమువలె ఆయాసకరముగా నుండి పరిణామమం దమృతమువలె నుండును. అనగా సత్కర్మానుష్ఠానకాలమం దాయాసకరముగ నుండి తర్వాత స్వర్గాదిసుఖము నిచ్చును. అట్లే యమనియమాదు లభ్యసించుకాలమందు కష్టకరమై ఆత్మజ్ఞానానంతరమందు సుఖమగును. ఇది తనబుద్ధినైర్మల్యమువలన పుట్టును. రాజససుఖము- శ్రోత్రాదీంద్రియములకు శబ్దాదివిషయములకు సంబంధము గల్గినపుడు ప్రారంభమం దమృతమువలె నుండి పరిణామమందు విషమువలె నుండును. తామససుఖము- ఆదియందును పరిణామమందును తనయథార్థరూపమును మోహింపజేయుసుఖమువలె భాసించును. నిద్ర అలసత ప్రమాదము మొదలగువానివలన నిది పుట్టును.

273 గీ॥ న త ద స్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
సత్వం ప్రకృతిజై ర్ముక్తం య దేభి స్స్యా త్త్రిభి ర్గుణైః.

తా॥ పృథివ్యాదిలోకములం దేజీవుడుగూడ త్రిగుణసంబంధము లేనివాడు లేడు.

274 గీ॥ బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః
స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభ తే నరః
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి త చ్ఛృణు.

తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లనెడినాలుగువర్ణములవారుగూడ ఈజన్మాంతరీయకర్మఫలరూప త్రిగుణభేదముచేతనే ఆయావర్ణములందు జన్మింతురు. వారు తమతమవర్ణధర్మముల నాచరించి సిద్ధినొందెదరు.

275 గీ॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్
సహజం కర్మ కౌంతేయ ! సదోషమపి న త్యజేత్
సర్వారంభా హి దోషేణ ధూమే నాగ్నిరి వావృతాః.

తా॥ ఏపరమాత్మవలన నీజగ ముత్పన్న మగుచున్నదో అట్టి సర్వేశ్వరుని ప్రతివాఁడును తనవర్ణమునకు ఆశ్రమమునకు ననువగు కర్మతో నారాధించియే సిద్ధిని పొందును. పరధర్మ మెంతబాగుగా ఆచరించినను అది స్వల్పముగనైనను నాచరించినస్వధర్మముకంటె తక్కువఫలమునే యిచ్చును. అగ్ని పొగచే నావృతమై యున్నట్లు ప్రతిజీవుడును స్వభావసిద్ధ మగుదోషములచే ఆవరింపబడియున్నందున స్వధర్మానుష్ఠానముచేతనే అట్టియావరణలు తొలగగలవు.

276 గీ॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసే నాధిగచ్ఛతి
సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా.

తా॥ ప్రాపంచికవిషయములందు సక్తత లేనిబుద్ధితో నెట్టి కోరికయు లేక జ్ఞాననిష్ఠతో నుండి సంన్యాసయోగముచే నన్ను గుర్తించురీతిని సంగ్రహముగా తెల్పెదను.

277 గీ॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ
వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే
బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్

భక్త్యా మా మభిజానాతి యావా న్య శ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్.

తా॥ చిత్తశుద్ధిని సంపాదించి స్థైర్యముతో నియమముగల వాడై శబ్దాదివిషయములను రాగద్వేషాహంకారబలదర్పకామ క్రోధాదులను వదలిపెట్టి ఏకాంతమం దుండి లఘు వగుఆహారమును స్వీకరించి మనోవాక్కాయములను నియమించి వైరాగ్యము నొంది దేహాదికమం దెట్టిమమకారము లేక ధ్యానయోగముచే క్రమముగా బ్రహ్మభావము నొందును. అపుడు సర్వభూతములే తాను, తానే సర్వభూతములు నగుచు సుఖదుఃఖాదులు లేక నాభావము నొందును.

278 గీ॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్
చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ.

తా॥ అట్టివాడు దేహాదివ్యాపారములన్నిటియందును నాదృష్టి మాత్రమే గలవాడై సర్వము నారూపముగా భావించుచుండును. నీ వట్టిభావన గలవాడ వగుము.

279 మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథ చే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి
యదహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి.

తా॥ నీవు సర్వకాలసర్వావస్థలందును నాయందే చిత్తముంచి నచో నాపదల నన్నిటి నతిక్రమించగలవు. లేనిచో నశింపగలవు. నీ వట్టిదృష్టి లేక అహంకారము గల్గి 'నేను యుద్ధము చేయ' నంటివి. నీ వెంత ? నీ నిశ్చయ మెంత ? ప్రకృతి నిన్ను తప్పక నియోగించు చున్నది.

280 గీ॥ స్వభావజేన కౌంతేయ నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి య న్మోహా త్కరిష్య స్యవశోపి తత్.

తా॥ ఓపార్థా! నీవు నీస్వభావమువలన పుటినకర్మచే బంధింపబడి నీ కిష్టములేనిపనినైనను చేయగలవు.

281 గీ॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున! తిష్ఠతి
భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.

తా॥ సర్వజీవులయొక్క హృదయమం దీశ్వరు డుండి ఆయా వానికర్మానురూపముగా నాయాకార్యములందు ప్రవేశపించుచున్నాడు. కాన నీ వట్టియీశ్వరుని సర్వాత్మనా శరణు పొందుము. వానియనుగ్రహముచే సద్గతిని పొందగలవు.

282 గీ॥ ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా
విమృ శ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు
సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః
ఇష్టోసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్
మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోసి మే.

తా॥ ఓఅర్జునా! నీ కిట్లు పరమరహస్య మగుజ్ఞానమును నీయందలిప్రేమచే బోధించితిని. సార మేమనగా నాయందే మనస్సునుంచుము. నన్ను నమస్కరింపుము. నాయందే భక్తిగలిగి నన్నే యాగాదులచే నారాధించినచో నీవు తప్పక నన్నే పొందగలవు. నీవు నాకు ప్రియస్నేహితుడ వగుటచే నీ కీనిజ మగురహస్యమును జెప్పితిని. నేను చెప్పినదంతయు విమర్శించి నీయిష్టానుసార మొనర్పుము.

283 గీ॥ సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

తా॥ నీ వితరధర్మములనెల్ల వదలి న న్నొకనినే శరణు పొందుము. నేను ని న్నన్ని పాపములనుండియు వదలిపెట్టించగలను. శోకింపవద్దు.

284 గీ॥ ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి
య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామే వైష్య త్యసంశయః
నచ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః,
భవితా నచమే తస్మా దన్యః ప్రియతరో భువి
అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్ట స్స్యా మితి మే మతిః
శ్రద్ధావా ననసూయశ్చ శృణుయాదపి యో నరః
సోఽపి ముక్త శ్శుభా న్లోకా న్ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్
కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞానసంమోహః ప్రణష్ట స్తే ధనంజయ !

తా॥ ఈయుపదేశము తపస్సంపద లేనివానికి నాయందు భక్తి లేనివానికి శ్రవణమొనర్చినదాని నాచరించుటయం దిచ్ఛలేనివానికి వేదమును ఈశ్వరుని ద్వేషించువానికి నెన్నడును నాపరంపరలో వా రెవరును చెప్పరాదు. పై చెప్పినవానికంటె విరుద్ధలక్షణము లనగా తపస్సంపద గలవారు భక్తిగలవారు మొదలగుఅధికారలక్షణములు గలవా రెవ రీవిషయము నధ్యయనమొన ర్తురో ఎవ రీవిద్య నధికారు లగుశిష్యులకు బోధింతురో వా రుభయులును నన్నే పొందుదురు. వారలకంటె నెక్కువప్రేమపాత్రు లెవరును నాకు లేరు. వారు జ్ఞానయజ్ఞముచే న న్నారాధించినవా రగుదురు.

ఓఅర్జునా! నీ వీయుపదేశమును శ్రద్ధతో వింటివా? ఏకాగ్రచిత్తముతో గ్రహించితివా? ఇది వినినతరువాత నీమోహము పోయినదా? అని శ్రీకృష్ణుడు ప్రశ్నింపగా అర్జును డిట్లు పల్కుచున్నాడు.

285 గీ॥ నష్టో మోహ స్స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత!
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ.

తా॥ ఓకృష్ణా! నామోహము నశించినది. నానిజరూపస్మరణ కలిగినది. నీఅనుగ్రహపూర్వక మగునుపదేశముచే నాసందేహము లన్నియు తొలగిపోయినవి. నీ వాజ్ఞయిచ్చిన ట్లాచరింతును.

## బ్రహ్మసూత్రోపదేశము

(1) అథాతో బ్రహ్మజిజ్ఞాసా= (తపసా బ్రహ్మ విజిజ్ఞానస్వ)

తా॥ సాధనచతుష్టయసంపత్త్యనంతరము బ్రహ్మజిజ్ఞాస చేయవలయును. కాని యిక్కడ 'ధర్మజిజ్ఞాసానంతరము బ్రహ్మజిజ్ఞాస' అని చెప్పనందున ధర్మజిజ్ఞాసానంతరమే బ్రహ్మజిజ్ఞాస చేయవలయు నను నియమము లేదు. సాధనచతుష్టయసంపత్తి నొంది బ్రహ్మవిచారము చేయవలెను. ధర్మజిజ్ఞాసకు తద్విధులను తెలిసి అట్టికర్మాచరణ చేయవలసియున్నది, అట్లు చేసినను కర్మఫలము లపరోక్షములై యున్నవి. యథాశక్తి సాధనచతుష్టయసంపత్త్యనంతరమయినను బ్రహ్మజిజ్ఞాస చేయవచ్చును. ఇందుకు ఫలము సద్యఃఫలము. అదెట్లన 'బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి' అని ప్రమాణముండుటచే బ్రహ్మజిజ్ఞాస వస్తుతంత్రమును, ధర్మజిజ్ఞాస కర్తృతంత్రమును అయియున్నది. కర్తృతంత్రముయొక్కఫల మనిత్యము వస్తుతంత్రముయొక్కఫలము నిత్యము ప్రత్యక్షము శాశ్వతము నయియున్నందున కర్తృతంత్రముకంటె వస్తుతంత్రము సర్వవిధముల నిశ్శ్రేయసప్రద మయియున్నది.

సాధనచతుష్టయసంపత్తి.

(1) నిత్యానిత్యవస్తువివేకము— దృశ్యమానప్రపంచము నిత్యమా, తదితరము నిత్యమా, ఉభయము నిత్యమా, అనిత్యమా అని విమర్శించి తెలిసికొనుట,

(2) ఇహాముత్రార్థఫలభోగవిరాగము— ఇహపరలోకములయందలి స్రక్చందనవనితాదివిషయభోగములయం దెట్టికోర్కియు లేకుండుట.

(3) శమాదిషట్కసంపత్తి- (1) శమము-అంతరింద్రియనిగ్రహము, (2) దమము-బాహ్యేంద్రియనిగ్రహము, (3) ఉపరతి-విషయములపై త్యాగబుద్ధి, (4) తితిక్ష-సుఖదుఃఖ శీతోష్ణాది ద్వంద్వములయందు సమబుద్ధి (5) సమాధానము-అంతఃకరణవృత్తిని బహిర్విషయములనుండి మరలించి గురు వేదాంత వాక్యములయందు నిశ్చలబుద్ధినుంచుట, (6) శ్రద్ధ- గురువేదాంతవాక్యములయందు విశ్వాసము.

(4) ముముక్షుత్వము- మోక్షమునందిచ్ఛ. పయినాల్గుసాధనములును పడసినవారే బ్రహ్మజిజ్ఞాసార్హులు.

దేహాదిజగమంతయు జడభాగముతోను, చైతన్యభాగముతోను కూడియున్నది. ఇవి పరస్పరము విరుద్ధధర్మములైనను లోకమంతయు నీరెంటికలయికవలన వ్యవహరించుచున్నది. ఇందు చైతన్యభాగము లేనిచో చూచుట, నడచుట మొదలగు వ్యాపార ముండనేరదు. జడభాగము లేనిచో దేహము, ఇంద్రియములు, గ్రహించుట మొదలగు సాధనములు లేవు. గాన లోకవ్యవహారమంతయు ఈరెంటి పరస్పరసమ్మేళనముతో గూడియున్నది. ఇందు జడభాగమనిత్యము, అసత్యము, దుఃఖము, పరిచ్ఛిన్నమును అయియున్నది. చైతన్యభాగము సత్యము, ఆనందము, అనంతము నయినది. ఇట్లైనను లోకవ్యవహారము చైతన్యధర్మములను జడవస్తువునందును, జడధర్మములను చైతన్యమందును అన్యోన్యసాంకర్య మొనర్చియున్నది. ఇట్టి సాంకర్యమునకే "అధ్యాస" లేక "అవిద్య" యని పేరు. దీనిని తొలగించి ప్రతిజీవునకు చైతన్యరూపత్వమునే వాస్తవమైనట్లు బోధించుటకు సకలవేదాంతము లేర్పడినవి. అట్టివేదాంతమును తెలిసికొనగోరువాడు ముందు నిత్యమగుపదార్థ మేది? అనిత్యము లెవ్వి? అనుసందేహము నొంది, దేహముతో నెంతసుఖముకొరకు ప్రయత్నించినను చివరకు దుఃఖమే కల్గుటయు మరణించుటయు తటస్థించుచున్నదని వైరాగ్యమునొంది శమదమాదిసాధనముల నలవరచుకొని ఈదేహముతో నొందుజన్మజరామరణాదిధర్మములు గలదుఃఖములో

నుండి బయటబడుట ఎట్లు? అనుతీవ్రవేదన గల్గి, ఇందులకు ప్రతీ కారము నుపదేశించువానికొరకు వెదకును. వేదము దీని నుపదేశించు చున్నది. అందు వేదమండలికర్మకాండ, దేహాదీంద్రియము లన్నియు, అధిష్ఠానదేవతోపేతము లనియు ఆదేవతల నుద్దేశించి తనకర్మఫల రూప మగుద్రవ్యాదులను త్యాగమొనర్చువానికి క్రమముగా చిత్త శుద్ధి గల్గుననియు ఊర్ధ్వలోకములందు శ్రేష్ఠ మగుజన్మ గలుగు ననియు అందు కొంతకాల ముండి తిరిగి కర్మఫలానురూప మగు లోకాంతరముల నొందుననియు బోధింపబడినది. ఆవేదమండలి జ్ఞాన కాండయందు బ్రహ్మవేత్త యగువాడు బ్రహ్మమే యగుననియు, వాడు జన్మమరణాదుల నెంతమాత్రమును పొందడనియు బోధింప బడినది.

(2) జన్మాద్యస్య యతః= (యతోవా ఇమాని భూతాని జాయంతే)

తా॥ ఎవనివలన నీసమస్తభూతములు పుట్టుచున్నవో పుట్టిన సమస్తభూతములు నెవనిచేత జీవించుచున్నవో ప్రాణములను ధరించి వృద్ధిపొందుచున్నవో ప్రళయకాలమునందు దేనిని పొందుచున్నవో లేక తాదాత్మ్యమును పొందుచున్నవో అది బ్రహ్మము. అనగా బ్రహ్మ మందు లీనమగుచున్నవని భావము. మరియు భూతముల యుత్పత్తి స్థితిలయకాలములందు దేనితో సంబంధించి తదాత్మకములయి యుం డునో అది బ్రహ్మమునకు లక్షణము. అట్టిజగత్కారణ మగునదియే బ్రహ్మము. ఇట్టిబ్రహ్మమును తెలియుటకు తపస్సే ప్రధానము. తప స్సనగా

శ్లో॥ మనస శ్చేంద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః
త జ్జ్యాయ స్సర్వధర్మేభ్య స్స ధర్మః పర ఉచ్యతే.

తా॥ మనస్సుయొక్కయు ఇంద్రియములయొక్కయు ఏకాగ్రత శ్రేష్ఠ మగుతపస్సు. ఇది సకలధర్మములకంటె అధికమైనది. ఇదియే పరమ మైనధర్మము. అన్న, ప్రాణ, చక్షు, శ్రోత్ర, మనో, వాచములు బ్రహ్మోపలబ్ధికి ద్వారభూతములని వరుణుడు భృగువునకు చెప్పి యున్నాడేగాని సాక్షాత్తు బ్రహ్మమును నిర్దేశించి చెప్పలేదు. బ్రహ్మ

విజ్ఞానమునకు వెనుక చెప్పినసాధనాంతరము లపేక్షితములని భావము సాక్షాత్తుగానిర్దేశించి చెప్పుటకు వీలులేనిదికావున నిటులసావశేషముగ తనప్రియపుత్రుడైన భృగువునకు తండ్రి బోధించెను. వీలుండినయెడల సాక్షాత్తుగానే బ్రహ్మ మిట్టిదని బోధించియుండును. కాన బాహ్యాంతః కరణసమాధానద్వారముగనే బ్రహ్మమును పొందవలయును.

ఈజగత్తు నామరూపములచే విస్తరింపజేయబడి, అయాకార్యముల సిద్ధింపజేయుటకు ప్రయత్నించుచు ఆయాఫలముల ననుభవించు జీవులతో నొప్పియున్నది. ఇందలిజీవులలో ప్రతివానికిని దేశము, కాలము, నిమిత్తము, సాధనము, వ్యాపారము, ఫలము, భిన్నభిన్నముగా నున్నవి. ప్రతిదేహమందు ననేకసూక్ష్మనాడులు చర్మ, మాంస, రుధిర, మేదో, మజ్జా, స్నాయు, అస్థ్యాదిధాతువులును వ్యాపారభేదములును గనుపించుచున్నవి. సర్వులును బాల్య, యౌవన, కౌమార, వార్థకాద్యవస్థల నొందుచున్నారు. అట్లే జాగ్రత్స్వప్నసుషుప్తు లను దశల నొందుచున్నారు. ఇట్టిది ఎవ రెట్లు చేసిరి ? అని ఊహించుటకు గూడ సాధ్యము గాదు. అట్టిజగత్తుయొక్క సృష్టిస్థితిసంహారములకు కారణమైనదే బ్రహ్మ మనబడును.

(3) శాస్త్రయోనిత్వాత్ = (తత్తు సమన్వయాత్)

అస్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్య దృగ్వేదః ఇత్యాది శ్రుతులవలన సద్గురువుద్వారా శాస్త్రోక్తముగా వెనుక చెప్పినశ్రవణవిధి ప్రకారము శాస్త్రయోని అనగా బ్రహ్మము వేదాంతార్థశ్రవణమనన నిదిధ్యాస సద్గురూపదేశవిధిచే తెలియవలసినదై యున్నది.

శాస్త్రస్య యోనిః శాస్త్రయోనిః.

శాస్త్రము తెలియుటన దృఢాపరోక్ష ఆత్మసాక్షాత్కారము నొందుట. దృఢాపరోక్షాత్మసాక్షాత్కారము తెలిసిన శాస్త్రము తెలిసినట్లే అని పైసూత్రార్థమై యున్నది.

ఇక్కడ యోని కారణపదము అనగా శాస్త్రమునకు కారణము బ్రహ్మ మగుటచే బ్రహ్మము సర్వజ్ఞము-ఋగ్వేదాదిస్వరూ

పము గలశాస్త్రము సర్వజ్ఞుడును సర్వశక్తిమంతుడు నగుబ్రహ్మము కంటె వేరగుమరియొకనినుండి కలుగుట కెంతమాత్రము వీలులేనందున నిది శాస్త్రయోని అనబడును. వేదశాస్త్రములందు లోకములో నెవరికి నేప్రమాణముచేతను తెలిసికొనుటకు వీలులేని యనేకవిషయము లుపదేశింపబడియున్నవి. దేవతలు మనుష్యులు పశుపక్ష్యాదులు జీవవిశేషములో నొప్పు అతలాదిసత్యలోకపర్యంతము లగు చతుర్దశభువనములు, అందు నివసించుజీవులు, వారలవృత్తులు, భోగ్యవస్తువులు, ఆయాకారణములు మొదలగున వన్నియు పూర్తిగా నుపదేశింపబడియున్నవి. ఇట్టిశాస్త్రముగూడ (ఏ బ్రహ్మము యొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసములవలె అప్రయత్నముగా వెలువడినదో అది) బ్రహ్మము. ఈశాస్త్రమే ఆబ్రహ్మమును తెలిసికొనుటకు సాధనము గాని మరియొకసాధనము లేదు. సమస్తవేదశాఖలు నిట్టిజగత్కారణబ్రహ్మమునే బోధించుచున్నవని సమన్వయమొనర్చుట, వీని కెట్టివిరోధము లేదనుట, ఈబ్రహ్మప్రాప్తికి సాధన ముపదేశించుట, దీనిఫలము–అను నీనాలుగు ప్రధానవిషయములను పైబ్రహ్మసూత్రములు బోధించుచున్నవి.

(1) అథాతో బ్రహ్మజిజ్ఞాసా (2) జన్మాద్యస్య యతః
(3) శాస్త్రయోనిత్వాత్ (4) తత్తు సమన్వయాత్.

ఈనాల్గుసూత్రములకు మూలాధారము 'త ద్విజిజ్ఞాసస్వ; తద్బ్రహ్మేతి' అయియున్నది. మిగిలినసూత్రములెల్ల పయినాల్గుసూత్రముల వ్యాఖ్యానభూతములు.

## శాస్త్రవైయర్థ్యము

శ్లో॥ అనిర్వాచ్యం ప్రపంచం య । త్త న్న శక్యం సురైరపి
స్వాత్మప్రకాశరూపోతః । కిం శాస్త్రేణ ప్రకాశ్యతే॥

తా॥ జగత్స్వరూపము దేవతలచేగూడ నిర్వచింపఁబడఁదగినది కాదు. అనిర్వాచ్యము. అనఁగా నిదమిత్థమని చెప్పుటకు సాధ్యము కాదని భావము. ఇచట నీజగత్తును నిర్వచించుటకు మీకు శక్తి లేనిచో

నట్టిశక్తిని సంపాదించుకొని, నిర్వచింపుఁడని కొందఱు జగత్సత్యత్వ వాదులు గేలిసేయఁజూతురు. అపుడీక్రిందిఖండనఖండఖాద్యఖండమును వాదులకుఁ జవిచూపించవలయును. "యదపి నిర్వక్తు మసామర్థ్యే గురవ ఉపాస్యంతామ్. తేభ్యో నిరుక్తయ శ్శిక్ష్యన్తే- ఇత్యుపాలంభ వచనం తత్తదా శోభేత. యది మేయస్వభావానుగామి నీయ మనిర్వచనీయ తేతి నబ్రూయుః వక్తృదోషా దితిచ వదేయుః = సామాన్యముగ నిర్వచనసామర్థ్యము లేనిచో గురువుల నుపాసింతురుగాక. వారి కడఁ జదువుకొని యటుపిమ్మట జగన్నిర్వచనము సేయుదురుగాకయని పూర్వపక్షి యనినమాట తాను జగన్నిర్వచనమును జేసినచో నపుడు శోభించును. ఇపుడు జగన్నిర్వచనమును బూర్వవాదిగూడఁ జేయఁ జాలకుండెఁగావున నీయనిర్వచనీయత్వము వస్తుస్వభావాధీనమెగావునఁ బైవిధముగఁ బూర్వవాది చేసినయవజ్ఞ యతనినే యాశ్రయించెను.

సముద్ర మనుల్లంఘ్యమని యొకఁడు, గగన మనుల్లంఘ్యమని మఱియొకఁడు వచించునపుడు, సముద్రమును హనుమానుఁ డుల్లంఘించెనుగావునఁ దదనుల్లంఘ్యత్వము కర్తృసామర్థ్యకృతమేగాని వస్తుస్వభావము గాదనియు నాకాశానుల్లంఘ్యత్వమో వస్తుస్వభావమనియు ననినవిధముగాఁ బ్రస్తుతము జగదనిర్వచనీయత్వము వస్తుస్వభావమని తెలియనగును; మహత్తు, అహంకారము, ప్రకృతి, పరమాణువులు- ఈవిధముగఁ గొందఱు జగదారంభమును నిరూపింపఁ దొడఁగిరి అటుపైన నేయది? ఆవల నెయ్యది ? ఈవిధముగ నడుగఁగా నేమియుఁ జెప్పఁజాలకపోవుట తటస్థించుననియుఁ గావున జగత్స్వరూపవిచారమును గట్టిపెట్టి, యేతత్సర్వము మాయామయమనిమాత్ర మారూఢత నొందనగుననియు "నిరూపయితు మారబ్ధే నిఖిలైరపి పండితైః । అజ్ఞానం పురత స్తేషాం భాతి కక్ష్యాసు కాసుచిత్" "కిమిదమ్, కిమస్య రూపమ్, కథ మేత దభూ, దముష్య కో హేతుః? ఇతి నకదాపి విచింత్యం, చింత్యం మాయేతి ధీమతా నిత్య" మిత్యాద్యాచార్యవచనముల నిచట ననుసంధించుకొని జగదనిర్వచనీయత్వము దేవతలకుఁగూడ సమమేయని తెలియవలెను. ఇఁక నాత్మతత్త్వము

నిత్యాపరోక్షము. "యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ" బ్రహ్మము స్వయముగా నిత్యాపరోక్షము. "అహ మస్మీతి విజానన్ బ్రహ్మైవాసౌ స్వయం విజానాతి" నే నున్నానని యెఱిఁగినవాఁడెల్ల బ్రహ్మము నెఱిఁగినవాఁడే యనియు, "మానం ప్రబోధయంతం బోధంమాం నేన యే బుభుత్సంతే, ఏధోభిరేవ దహనం దగ్ధుం వాంఛంతి తే మహాత్మానః" ప్రత్యక్షాదిప్రమాణముల కన్నిటికి నవభాసకమై విజ్ఞానఘనమైనయాత్మతత్త్వమును, దత్తత్ప్రమాణములచేత నెఱుంగఁజూచుట యింధనములచే నగ్నిని దహింపఁజూచినట్లే యగుననియు శ్రీశంకర భగవత్పాదులుగూడ సెలవిచ్చియుండిరి. కావున శాస్త్రములతో నేమిప్రయోజనము గలదు ?

"అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా
విజ్ఞాతేఽపి పరే తత్త్వే శాస్త్రాధీతి స్తు నిష్ఫలా."

పరతత్త్వము విజ్ఞాతముకానిచో శాస్త్రాధ్యయనము నిష్ఫలము. అనగా- "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" యను నిత్యాది వచనములచేఁ బరతత్త్వ ముపనిషదేకగమ్యమని తెలియుచుండ శాస్త్రములవలనఁ బరతత్త్వము తెలియఁబడలేదనుటలో యథావిధిశాస్త్రాధ్యయనము చేయలేదనియే తేలును. కావున నట్టివిధివిరహితశాస్త్రాధ్యయనము పరతత్త్వావేదకము గామిని వ్యర్థమనిభావము. ఇట్లే పరతత్త్వము విజ్ఞాతమైనతరువాత శాస్త్రాధ్యయనముతో నిమిత్తములేదు. అనఁగా నద్యుత్తరణానంతరము నౌక నిష్ఫలమైనట్లు శాస్త్రము నిష్ఫలమని తెలియవలెను. ఈయర్థమునే, "వేదశాస్త్రపురాణాని పదపాంసుమివ త్యజే" త్తనునిట్టిప్రమాణము లుద్ఘోషించుచున్నయవి.

గ్రంథ మభ్యస్య మేధావీ । జ్ఞానవిజ్ఞానతత్పరః
పలాలమివ ధాన్యార్థీ । త్యజే ద్గ్రంథ మశేషతః.

తా॥ ఉపనిషదధ్యాత్మతత్త్వప్రతిపాదకగ్రంథజాతమును ముముక్షువగువాఁడు నిరంతర మభ్యసించి తత్ఫలభూత మగునపరోక్షబ్రహ్మసాక్షాత్కారము గలుగఁగనే తండులములు ప్రాప్తించినపిదపఁ దత్సం

బంధ మగుపోట్టునువలెనే యుపనిషదాదిగ్రంథమునుగూడఁ బరిత్యజించును.

## విద్యాకర్మవివేకము

### వేదానుశాసనము

శ్రు॥ వేద మనూ చ్యాచార్యో౽ంతేవాసిన మనుశాస్తి. సత్యం వద ధర్మం చర. స్వాధ్యాయా న్మా ప్రమదః. ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః. సత్యా న్న ప్రమదితవ్యం. ధర్మా న్న ప్రమదితవ్యం. కుశలా న్న ప్రమదితవ్యం. భూత్యై న ప్రమదితవ్యం. స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం. దేవకార్యాభ్యాం న ప్రమదితవ్యం. మాతృదేవో భవ. పితృదేవో భవ. ఆచార్య దేవో భవ. అతిథిదేవో భవ. యా న్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని. నో ఇతరాణి. యా న్యస్మాకగ్ం సుచరితాని తాని త్వయోపాస్యాని

తా॥ ఆచార్యుడు తనశిష్యునకు వేదమునంతయు సమగ్రముగా బోధించి తదధ్యయనానంతరము తదర్థమును సంగ్రహముగా నిట్లు బోధించుచున్నాడు. ఈ యుపదేశములన్నియు జ్ఞానోత్పత్తికంటె ముందవశ్యమాచరించవలయును. ఇవి పురుషునిచిత్తమును సంస్కరించును. చక్కగా తెలిసి కర్మల నాచరించుటచే వానిహృదయ మాత్మజ్ఞానమును వెంటనే యవగాహింపసమర్థ మగుటచే వాని కాత్మసాక్షాత్కారము సుస్పష్టముగా గోచరించును. ఈ కర్మలు జ్ఞానోత్పత్తికి సాధనములు కావున తప్పక ఆచరించవలయు నని గురువు శిష్యుని శాసించుచున్నాడు. ఈ యనుశాసనము ననుసరించక అతిక్రమించిన యెడల పాపములు వచ్చును. మరియు వానికి జ్ఞాన మెంతమాత్రము కలుగజాలదు. 1. సత్యమును పలుకుము, 2. ధర్మము అనగా వర్ణా,

శ్రమ ధర్మములనాచరింపుము, 3. వేదాధ్యయనమునందు వేదవిహిత కర్మల నాచరించుటయందు ప్రమాదమును పొందవలదు. పఠించిన వేదమును మఱచిపోవలదు, 4. విద్యోపదేశము చేసిన ఆచార్యునకు ప్రియమైనధనాదు లొసంగుము, సంతానవిచ్ఛిత్తిని కలుగజేయకుము. 5. ధర్మమునుండి ప్రమాదము నొందకుము, 6. కుశలమునుండి ప్రమాదము నొందకుము. అనగా దేహారోగ్యమునిమిత్త మౌషధసేవాదుల చేయకుండవలదు (చేయుము), 7. భూతినుండి, సత్సంపదకు న్యాయ్యమైనవైదికమునుండి ప్రమాదము నొందకుము, 8. స్వాధ్యాయమును నిత్యము చేయుము. చదువుటనుండి ప్రమాదమునొందకుము, 9. దేవకార్యము, యజ్ఞాదికర్మలనుండి, పితృకర్మలనుండి ప్రమాదమునొందకుము (వదలకుము), 10. తల్లిని, తండ్రిని, ఆచార్యుని, అతిథిని, దేవతగా పూజింపుము, 11 ఏపనులు శాస్త్రనింద్యముగావో ఆపనులనే ఆచరింపుము; నింద్యకార్యముల చేయవలదు- నింద్యములన- న సురాం పిబేత్, న పరదారాన్ గచ్ఛేత్, నానృతం వదేత్- ఇత్యాదికము. 12. మాయొక్క- (మేము చేయు) ఏమంచిపనులు గలవో యవి మాత్రము చేయదగినవి, మంచివి కాని వానిని చేయకుము.

శ్రు॥ అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్. యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః. యుక్తా ఆయుక్తాః. అలూక్షా ధర్మకామా స్స్యుః. యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః.

తా॥ నీకు కర్మనుగూర్చినసందేహముగాని, వర్ణాశ్రమాచారములనుగూర్చినసందేహముగాని సంభవించినయెడల ఆదేశమునందాకాలమునందే బ్రాహ్మణులు యుక్తాయుక్తవిచక్షణసమర్థు లగువారో వారి నడిగి వా రెట్లాయాకర్మలయందాసక్తి గలవారై యేవిధముగా చెప్పుదురో అట్లాచరింపుము, ఏ యాశ్రమమం దెట్లాచరింపవలసినది సూతసంహితయం దిట్లు వివరింపబడుచున్నది. గ్రంథ విస్తరభీతిచే తాత్పర్యము మాత్రము వివరింపబడును.

బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థోఽథ భిక్షుకః
అతివర్ణాశ్రమీ చేతి క్రమా చ్ఛ్రేష్ఠోఽవిచారణాత్.

తా॥ బ్రహ్మచారికంటె గృహస్థు, గృహస్థుకంటె వానప్రస్థుడు, వానప్రస్థునికంటె యతీశ్వరుడు (సన్న్యాసి) యతికంటె అతివర్ణాశ్రమి యిట్లు క్రమముగా ఒకరికంటె ఒకరు శ్రేష్ఠులు.

## బ్రహ్మచారిధర్మములు

తా॥ ఉపనయనము కాగానే గురుకులమందుండి వేదాధ్యయనము సర్థయుక్తముగా నొనర్చుచు (1) దండమును (2) యజ్ఞోపవీతమును (3) మేఖలను (4) కృష్ణాజినమును సమంత్రకముగా గ్రహించి మాధుకరవృత్తిచే నన్నమును సంపాదించి తెచ్చినదానిని గురువునకు నివేదించి తదనుజ్ఞచే భుజించి సకాలమున సంధ్యోపాసనను స్నానమును అగ్నికార్యమును చేయుచు గురుశుశ్రూష చేయుచు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు లేనివాడై బ్రహ్మయజ్ఞము దేవర్షి పితృతర్పణమును చేయుచు తల్లిదండ్రులు జ్యేష్ఠులు గురువులు మొదలగువారి కందరకు నమస్కరించుచు గురువును మనోవాక్కాయములచే ననుకూలముగాను దైవభావముతోను సేవించుచు విద్యను గ్రహింపవలెను. ఇట్లు సర్వవిద్యలు పూర్తిగా గ్రహించిన తరువాత, 1. నైష్ఠికబ్రహ్మచారిగా జన్మాంతమువరకు నచటనే యుండవచ్చును. 2. వివాహేచ్ఛ యున్నచో గుర్వనుజ్ఞను పొంది వానిచే సమావర్తన మనుకర్మ నొంది శాస్త్రీయమగురీతితో ననురూపమగుకన్యను వివాహమాడి చక్కగా గృహస్థాశ్రమధర్మమును నాచరింపవచ్చును. లేక సన్న్యాసాశ్రమస్వీకారము చేయవచ్చును.

## గృహస్థాశ్రమధర్మములు

స్వస్వకల్పసూత్రకారోపదిష్టరీతిగా శాస్త్రీయమగువివాహము నొనర్చుకొని సకాలమందు స్నాన, సంధ్యో, పాసనా, దేవతార్చన, బ్రహ్మయజ్ఞ, వైశ్వదేవాదికర్మల నవశ్య మాచరించుచు క్రమముగా అగ్న్యాధానమొనర్చి త్రేతాగ్నుల నుపాసించుచు అగ్ని

హోత్రదర్శపూర్ణమాసచాతుర్మాస్యాది హవిర్యాగములను అగ్నిష్టో మాదిసోమసంస్థల నాచరించుచు ఋతుకాలమందు సంతానము కొరకు భార్యాగమన మొనర్చుచు, జన్మించుపుత్రునకు జాతకర్మాది సంస్కారముల నొనర్చుచు, తనకొరకుమాత్రమే యింటియం దన్నమును వండక దేవతాతిథిభిక్షాదులకొరకు పాకక్రియ నొనర్చి వారికి వినియోగించి తచ్ఛేషమును ప్రసాదబుద్ధితో స్వీకరించుచు, యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము అనుషట్కర్మనిరతుడై ప్రతిదినము పంచమహాయజ్ఞము లొనర్చుచు, యతులకు బ్రహ్మచారులకు భిక్షను పెట్టుచు, సత్యవాక్యనిరతుడై కామక్రోధలోభమోహమదమాత్సర్యాదులను క్రమముగా తగ్గించుకొనుచు, దయా, శౌచము, అహింస, దానము, ధర్మము మొదలగుసద్గుణముల నలవరచుకొనుచు చివరకు తనకు సంపూర్ణ వైరాగ్యము గల్గినచో సంన్యాసాశ్రమస్వీకార మొనర్పవలయును. లేనియెడల వానప్రస్థాశ్రమమును స్వీకరింపవలయును. లేనియెడల గృహస్థాశ్రమమందే యుండి అగ్న్యుపాసన చేయుచు చివరకు తన దేహమును తనయుపాస్యదేవత యగుఅగ్నియందే లయ మొనర్పవలయును.

## వానప్రస్థాశ్రమధర్మములు

భార్యను కుమారులయొద్ద నుంచి అగ్నుల నాత్మారోపణచేసి అరణ్యమునకు వెళ్లవచ్చును. లేనిచో సపత్నీకుడై అగ్నిహోత్రములతోను నరణ్యమునకు వెళ్లి యమనియమాదుల నభ్యసించుచు, అరణ్యమందలికందమూలఫలాదుల నే ఆహారముగా గైకొని కేశశ్మశ్రులోమనఖాదులను పెంచుకొని వపనసంస్కారమును మానివేసి కామక్రోధాదులను నిశ్శేషముగా వదలి అగ్నిహోత్రారాధన తత్పరుడై తపస్సుచేయుచు, పంచయజ్ఞముల నాచరించుచు, వల్కలములను ధరించి, త్రిషవణస్నాన మాచరించుచు, సర్వభూతములందు దయగలిగి ఎట్టిప్రతిగ్రహము చేయక దినమున నొకపర్యాయము మాత్రమే భుజించుచు, ఇంద్రియనిగ్రహమును పూర్తిగా గల్గియుండి

భూమిమీదనే పరుండి కృచ్ఛ్రచాంద్రాయణాదితపంబుల నాచరించుచు నిరంతరము గాయత్రీజపతత్పరుఁడై ఉపనిషదభ్యాస మొనర్చుచు సంపూర్ణ మగువైరాగ్యము గల్గినచో సన్న్యసింపవలెను. లేనియెడల నట్లే ఆయాశ్రమధర్మముల నాచరించుచు దేహమును వదలవలెను.

## సన్న్యాసాశ్రమధర్మములు

సంపూర్ణవైరాగ్యము, నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థఫలభోగవిరాగము, శమదమాదిసాధనసంపద గల్గినపుడు సర్వకర్మసంన్యాస మొనర్పవలెను. అగ్నులను శాస్త్రీయమార్గమున ఆత్మారోపణ మొనర్చుకొని యథావిధిగా శిఖాయజ్ఞోపవీతములను త్యజించి సంన్యాసాశ్రమస్వీకార మొనర్చి అనాద్యవిచ్ఛిన్నగురుపరంపరలోని పరమహంసపరివ్రాజకాచార్యవర్యునిచే నుపదేశము నొంది కౌపీన, కంథా, దండ, కమండలుమాత్రపరిగ్రహుఁడై ప్రణవానుష్ఠానమును మాండూక్యోపనిషదాద్యుక్తభావనతో నొనర్చుచు గృహస్థులనుండి భిక్షలచే దేహవ్యవహారమును గనుచు నిరంతరము వేదాంతవాక్యశ్రవణ, మనన, నిదిధ్యాసనము లొనర్చుచు, సమాధినిష్ఠుఁడై జీవన్ముక్తావస్థలో నుండి, వర్తమానదేహపతనానంతరమందు విదేహకైవల్యము నొందవలెను.

## అతివర్ణాశ్రమిలక్షణము

శ్లో॥ అతివర్ణాశ్రమం రూపం సచ్చిదానందలక్షణమ్
యో న జానాతి సోఽవిద్వాన్ కదా ముక్తో భవిష్యతి?

తా॥ వర్ణాశ్రమాతీతమై సచ్చిదానందస్వరూప మగునాత్మతత్త్వము నేయజ్ఞాని గుఱుతింపలేఁడో, వాఁ డెప్పుడు ముక్తుఁ డగును? అనఁగా నట్టివిజ్ఞానము గలుగునంతవరకు జననమరణప్రవాహపరిభ్రమణము వానికి తప్పదనిభావము.

## —♦ కర్మాచరణాదుల వివరణము ♦—

1. శ్రు॥ సత్యం పరం పరగ్ం సత్యగ్ం సత్యేన న సువర్గా ల్లోకా చ్చ్యవంతే, కదాచన సతాగ్ంహి సత్యం. తస్మా త్సత్యే రమంతే.

తా॥ సత్యము పురుషార్థసాధనములలోనికెల్ల నుత్కృష్టమైనది. పురుషుడు యావజ్జీవసత్యవాక్యపరిపాలనచేత, స్వర్గలోకము నొంది శాశ్వతసుఖ మొందును. సజ్జను లనగా సత్యవాక్కులే.

2 శ్రు॥ తప ఇతి తపో నానశనా త్పరం యద్ధి పరం తప స్త ద్దుర్ధర్షం, త ద్దురాధర్షం. తస్మా త్తపసి రమంతే.

తా॥ తపస్సుగూడ మంచి పురుషార్థసాధనమే. భుజింపకుండుటమాత్రమే తపస్సు గాదు. పరమాత్మను తెలిసికొనుటకు చేయుప్రయత్నవిశేషమే తప స్సనబడును. అది సామాన్యజనులకు సాధ్యము గాదు. అందుచే గొప్పసాధకులు మాత్రమే అట్టితపస్సు నాచరింతురు.

3 శ్రు॥ దమ ఇతి నియతం బ్రహ్మచారిణ స్తస్మా ద్దమే రమంతే.

తా॥ నైష్ఠికబ్రహ్మచారులు దమమే అనగా ఇంద్రియనిగ్రహమే పురుషార్థసాధనమని తలచి దాని నాచరించుచున్నారు.

4 శ్రు॥ శమ ఇత్యరణ్యే మునయ స్తస్మా చ్ఛమే రమంతే.

తా॥ అరణ్యమం దుండువానప్రస్థులు శమమే పురుషార్థసాధనమని తలచి ఆచరించుచున్నారు.

5 శ్రు॥ దాన మితి సర్వాణి భూతాని ప్రశగ్ంసంతి, దానాన్నాతిదుశ్చరం తస్మా ద్దానే రమంతే.

తా॥ మరికొందరు దానమే పురుషార్థసాధన మనితలచి దానినే ఆచరించుచున్నారు.

6 శ్రు॥ ధర్మ ఇతి ధర్మేణ సర్వ మిదం పరిగృహీతం ధర్మాన్నాతిదుష్కరం తస్మా ద్ధర్మే రమంతే.

తా॥ వాపీకూపతటాకారామదేవాలయాది నిర్మాణరూప మగుధర్మమే పురుషార్థసాధన మని తలచువారు దానినే ఆచరించు చున్నారు

7 శ్రు॥ ప్రజన ఇతి భూయాగ్ంస స్తస్మా ద్భూయిష్ఠాః ప్రజా
యంతే, తస్మా ద్భూయిష్ఠాః ప్రజననే రమంతే.

తా॥ పలువు రపత్యోత్పాదనమే మోక్షసాధన మనితలచి అట్లాచరించుచున్నారు. అందువలన నధికముగా పుట్టుచున్నారు.

8 శ్రు॥ అగ్నయ ఇత్యాహ. తస్మా దగ్నయ ఆధాతవ్యాః.

తా॥ కొంద రగ్న్యుపాసనమే మోక్షసాధనమనితలచి అగ్న్యాధానము నొనర్చి ఉపాసింతురు.

9 శ్రు॥ అగ్నిహోత్ర మిత్యాహ. తస్మా దగ్నిహోత్రే రమంతే.

తా॥ మరికొందరు అగ్నిహోత్రయాగానుష్ఠానమే మోక్షసాధన మని తలచి చేయుచున్నారు.

10 శ్రు॥ యజ్ఞ ఇతి, యజ్ఞోహి దేవా స్తస్మా ద్యజ్ఞే రమంతే.

తా॥ మరికొందరు యజ్ఞానుష్ఠానమే మోక్షసాధనమని తలచి అం దారాధింపబడినదేవతలు మోక్షము నిత్తు రనునిశ్చయముతో యజ్ఞముల నొనరింతురు.

11 శ్రు॥ మానసమితి విద్వాగ్ంస స్తస్మా ద్విద్వాగ్ంస ఏవ,
మానసే రమంతే.

తా॥ కొందరు మనోవ్యాపార మగుధ్యానమే మోక్షసాధన మని తలచి దాని నాచరింతురు.

12 శ్రు॥ న్యాస ఇతి బ్రహ్మా.బ్రహ్మాహి పరః పరోహి బ్రహ్మా.తాని వా
ఏతా న్యవరాణి పరాగ్ంసి. న్యాస ఏవాత్య రేచయ ద్య ఏవం వేద.

తా॥ హిరణ్యగర్భు డనుపేరుతో వేదమందు ప్రసిద్ధికెక్కిన ప్రథమపురుషుడు పైసాధనము లన్నిటికంటె సంన్యాసమే మోక్షము నకు గొప్పసాధన మనిపలికెను. అనగా వేదము సన్న్యాసమే మోక్ష

సాధనమని పలికినందున వెనుకటిసత్యాదిసాధనము లన్నిటికంటెను సన్న్యాసమే మోక్షమున కంతరంగసాధనమని భావము.

13 శ్రు॥ య ఏవం వేదేత్యుపనిషత్.

తా॥ ఎవ రిట్లు సంన్యాసమే మోక్షమున కంతరంగసాధనమని గ్రహింతురో వారు బ్రహ్మవిద్యారహస్యమును గుర్తింపగలరు.

14 శ్రు॥ సవా ఏష పురుషః పంచధా పంచాత్మా, యేన సర్వ మిదం ప్రోతం పృథివీ చాంతరిక్షం చ ద్యౌశ్చ దిశ శ్చావాంతరదిశాశ్చ సవై సర్వ మిదం జగత్ స సభూతగ్ం సభవ్యం జిజ్ఞాసక్లుప్తఋత జారయిష్ఠా.

తా॥ ఎవడు సంన్యాసపురస్సరముగా తత్త్వజ్ఞానమును సంపాదించునో ఆపురుషుడే అయిదువిధములుగా నుండును. ఏబ్రహ్మముచే నీజగత్తంతయు ననుస్యూత మైనదో అంతరిక్షము, ద్యులోకము, దిక్కులు, అవాంతరదిక్కులు మొదలగుసర్వజగత్తును ఆబ్రహ్మమే గదా. భూతభవిష్యద్వర్తమానకాలములందలి జగ మంతయు ఆ బ్రహ్మమే. అదియే వేదాంతవిచారణచే సర్వాత్మకుడని నిశ్చయింపబడుచున్నాడు. సత్య మగు ప్రామాణికజ్ఞానముచేతను గురూపదేశముచేతను శ్రద్ధతోను ఆబ్రహ్మము పొందదగినది కాలత్రయాబాధ్యుడు, సత్యజ్ఞానానందరూపుడు నగు ఆబ్రహ్మమును తెలిసికొనుటయే మోక్ష మనబడును. అదియే గొప్ప దగుపురుషార్థము.

15 శ్రు॥ వసురణ్వో విభూరసి ప్రాణే త్వమసి సంధాతా బ్రహ్మ న్త్వమసి విశ్వధృ త్తేజోదా స్త్వమ స్యగ్నిరసి వర్చోదా స్త్వమసి సూర్యస్య ద్యుమ్నోదా స్త్వమసి. చంద్రమస ఉపయామగృహీతోసి బ్రహ్మణే త్వా మహసే.

తా॥ ఓపరమేశ్వరా! నీవు మమ్ముల ననుగ్రహించుటకు వస్తుతత్త్వము నుపదేశించువాడ వగుదువు. నీవు వివిధముగా ఉత్పన్నుడ వైనవాడవు. నీవు వాయురూప మగుప్రాణమునందు జీవాత్మ

యొక్క రూపమును కూర్చువాడవు. బ్రహ్మాండధారకి మగువాయు రూపుడవు నీవే. వర్చస్సు నిచ్చుఅగ్నిరూపుడవు నీవే నీవే బ్రహ్మవు. సూర్యరూపుడవై ప్రకాశించుచున్నావు. పితృలోకవర్తియగుచంద్రు నకు ప్రకాశరూప మగుధనము నొసంగువాడవు. యాగములందు సోమరూపుడవు. సర్వజగద్వ్యాపారములందును కర్తవు. అన్నివస్తువు లలో నంతర్యామిరూపముతో నుండి ప్రేరణచేయునిన్ను బ్రహ్మ తత్త్వము గోచరమగుటకొరకు భజించుచున్నాను.

16 శ్రు॥ ఓ మిత్యాత్మానం యుంజీత. ఏతద్వై మహోపనిపదం
దేవానాం గుహ్యమ్.

తా॥ ఆత్మను చిత్తమునందు ప్రణవరూపముతో చేర్చవల యును. ఈప్రణవమే సర్వవేదములచేత ప్రతిపాదింపబడినది. ఇది ఇంద్రాదిదేవతలకుగూడ గోపనీయ మగురహస్యవిషయము.

17 శ్రు॥ య ఏవం వేద బ్రహ్మణో మహిమాన మాప్నోతి,
తస్మా ద్బ్రహ్మణో మహిమాన మిత్యుపనిషత్.

తా॥ ఎవ డీవిధముగా బ్రహ్మతత్త్వము నెరుగునో వాడు బ్రహ్మ మహిమనే పొందును. సర్వావిద్యానివృత్తి గల్గి, బ్రహ్మముయొక్క మహత్వమును పొందును. కర్మకాండ పాపక్షయమునకును చిత్తశుద్ధి కిని స్వర్గలోకప్రాప్తికిని సాధన మగును. ఎట్లనగా పాపము 1. వర్త మానదేహరూపప్రారబ్ధముగనున్నది, 2. అతీతజన్మలలోను ఈజన్మలోను చేయబడి ముందుజన్మలో ఫలము నీయదగియుండునది అని రెండువిధ ములు. అయ్యది దేహము నాశ్రయించి కొంతయు, ఇంద్రియముల నాశ్రయించి కొంతయు, గృహక్షేత్రాద్యైశ్వర్యము నాశ్రయించి కొంతయు, అంతఃకరణము నాశ్రయించి మరికొంతయు నుండును.

దేహమనగా జన్మాంతరీయ కర్మఫలము, కూటస్థచైతన్యము అను రెంటికలయిక. ఇందు కూటస్థుడు సత్యజ్ఞానానందానంతుడును, కర్మఫలము అసత్య, జడ, దుఃఖ, పరిచ్ఛిన్న మైనదియు.

ఇందు కర్మఫలము 1 కారణరూపము, 2. సూక్ష్మరూపము, 3. స్థూలరూపము అనుమూడువిధములుగ నుండును. అందలికారణ రూపమునకే 'అవిద్య' యనిపేరు. ఈఅవిద్యయు కూటస్థుడును ఒకచోట నున్నంతమాత్రముచే దర్పణస్థానీయ మగునీఅవిద్యయందు కూటస్థుడు ప్రతిబింబింపగా నట్టిప్రతిబింబమునకు "ప్రాజ్ఞు" డనిసంజ్ఞ. అపు డీప్రాజ్ఞున కనువుగా నాఅవిద్య పరిణమించి అంతఃకరణ మనుసంజ్ఞ నొందును. ఇట్లీరెండు నన్యోన్యాశ్రయముగా పరిణామము నొందుచుండ ఆకర్మఫల మనుభవింపబడుచుండును. అట్టిఅంతఃకరణమున కనువుగ నీప్రాజ్ఞుడు పరిణమించి "తైజసు" డనుసంజ్ఞ నొందును. వీని కనువుగ నాఅంతఃకరణము పరిణమించి దేహేంద్రియాదిరూపము నొందును. అపు డీతైజసు డందుల కనువుగ పరిణమించి "విశ్వు" డనబడును. ఇట్లు

అవిద్య—కారణదేహము—ప్రాజ్ఞుడు.. వీరలసమష్టి ఈశ్వరుడు
అంతఃకరణము—సూక్ష్మదేహము—తైజసుడు...హిరణ్యగర్భుడు
దేహాదికము—స్థూలదేహము – విశ్వుడు ... విరాట్పురుషుడు

ఈరీతిగా నుండును. ఇందలివిశ్వుని చక్షురాదీంద్రియములలో నొక్కొకదాని యధిష్ఠానదేవతలే విరాట్పురుషునిచక్షురాదు లగు ఆదిత్యాదిదేవత లనబడెదరు. కాన ఆదిత్యాదిదేవతల నుద్దేశించి తన కర్మఫలమును అన్నిరూపములలో నున్నదానిని ప్రతిదినమును కర్మ లందు త్యాగమొనర్చుటయే కర్మకాండయుద్దేశము. ఇందుచే సాధకుని కర్మఫలము (అనగా పాపము) క్రమముగా తగ్గుచుండును. ఇది తగ్గినకొలది అంతఃకరణ నిర్మల మగుచుండును.

స్వర్గ మనగా సుఖమే. ఇయ్యది నూటికి నూరుపాళ్ళు పూర్తిగా సుఖరూపముగా నున్నపుడు "మోక్ష" మనబడును. నూరులో ఎంత భాగము తక్కువగా నుండుసుఖమైనను స్వర్గ మనబడును. కావున కర్మల నాచరించువారు తమకర్మానుష్ఠానదార్ఢ్యము ననుసరించి సుఖ తారతమ్యము నొందుచు అందుల కనువగులోకములం దుందురు.

ఈకర్మానుష్ఠానము 1 అంతరింద్రియవ్యాపారరూపము, 2 బహిరింద్రియవ్యాపారరూపము అని రెండువిధములు. ఇందలి అంతరింద్రియవ్యాపారమే "ఉపాసనము." తద్రహిత మగు కేవలబహిరింద్రియవ్యాపారమే "కర్మ" ఇట్టికర్మను మాత్రమే ఆచరించు వారు దక్షిణాయన (చంద్రి) మార్గముగుండ ఊర్ధ్వలోకముల నొంది అందు కర్మఫలమును కొంతకాల మనుభవించి తిరిగి క్రిందిలోకములకు వచ్చుచుందురు. ఇక అంతరింద్రియవ్యాపారరూప మగుకర్మ యనబడు "ఉపాసన" యనగా తనదేహావయవముల నాయా అధిష్ఠానదేవతలే యని నిరంతరము భావించుట – ఇట్లే యాగాంగములగు స్రుక్స్రువాదుల నాయాదేవతలనుగాను తనఅవయవసంబద్ధములనుగాను భావించుట, తాను భుజించుఆహారమునుసైతమీశ్వరార్పణచేయుచున్నట్లు భావించుట మొదలగు అంతఃకరణవ్యాపారవిశేషమే.

దీనిని కర్మానుష్ఠానములో కలిపియు చేయవచ్చును, విడిగాను చేయవచ్చును. వీరు "ఉత్తరాయణము" లేక అర్చిరాదిమార్గముగుండ బ్రహ్మలోకమునకు పోయి అచట కల్పాంతమువరకు ఉండి బ్రహ్మతో నొక్క జగద్వ్యాపారమునతప్ప మిగిలినవిషయములందు సమానులై యుండి కల్పాంతమందు మోక్షమునొందుదురు. వీరు తిరిగి సంసారబంధము నొందరు. ఇదియే క్రమముక్తి యనబడును.

## ఆధికారిక పురుషలక్షణము

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

తా॥ జగత్తులో నొకానొకప్పుడు వేదములను, ధర్మములను, బ్రహ్మవిద్యాసంప్రదాయములను పుష్కలముగా ప్రవర్తింపజేయుటకొరకు "ఆధికారికపురుషులు" గా (కోర్టులలో కమీషనరు రిసీవరువలె) వచ్చి ఆపని నెరవేర్చి తిరిగిపోవుదురు. రామ, కృష్ణ, వ్యాస, శంకరాచార్యాదులు పయివీరిలో కొందరు. ఇట్లని పరమేశ్వరుడే బహువారములు చాటియున్నాడు.

ఇక జ్ఞానకాండయనగా పైకర్మాదికముచే చిత్తశుద్ధి నొంది, నిత్యానిత్యవస్తు వివేకాదిసాధనచతుష్టయసంపత్తి గలిగి యథావిధిగా సర్వకర్మసంన్యాస మొనర్చి సద్గురువులయొద్ద వేదాంతశ్రవణ మొనర్చి మనననిదిధ్యాస లొనర్చి బ్రహ్మాత్మైకత్వవిజ్ఞాననిశ్చయమును అపరోక్షముగా నొంది జీవన్ముక్తులయి ప్రారబ్ధక్షయ (వర్తమానదేహపతన) అనంతరమందు విదేహకైవల్యము నొందెదరు. ఇది సాక్షాన్ముక్తిసాధన మనబడును.

## — విద్యా కర్మ వి చి కి త్స —

అయితే కర్మలే మోక్షమునకు సాధనములా; జ్ఞానము మోక్షసాధనము కాదా; లేక కర్మజ్ఞానసముచ్చయము మోక్షహేతువా అనుసందేహనివృత్తిపూర్వకముగా జ్ఞానమే మోక్షసాధనమని సిద్ధాంతీకరింపబడుచున్నది.

(1) కర్మము మోక్షసాధనము కాదు. అయినను నిష్కామకర్మమాత్ర మీశ్వరార్పణబుద్ధితో నాచరించిన చిత్తశుద్ధిద్వారా అద్వైతవాసనను కలిగించుట కుపయోగపడును.

(2) మోక్షము నిత్యము. లోకమునందు కర్మచేత పుట్టినది అనిత్యమగుట సుప్రసిద్ధము. కర్మలచేతనే మోక్షము సిద్ధించునెడల మోక్షముగూడ ననిత్య మగును. సంచితకర్మ–ఈజన్మలోను వెనుకటిజన్మలయందును బుద్ధిపూర్వకముగా చేయబడి దానిఫలకాలమందు ప్రారబ్ధరూపముగా దేహముచేత ననుభవింపబడునది. సంచితకర్మ యీజన్మమునం దనుభవముతోనే నివర్తించునను నియమము లేదు. నివర్తింపవచ్చును, నివర్తింపకపోవచ్చును. ఒకమంచికర్మ అనేకోత్తమజన్మల నీయవచ్చును. ఒకదుష్కర్మ అనేకనీచజన్మల నీయవచ్చును. మరియు ననేకజన్మలసంచితకర్మ యంతయు కలిసి యీదేహము రాలేదు. ఆగామికర్మ– ఈజన్మలో బుద్ధిపూర్వకముగా చేసినది, మరియు అబుద్ధిపూర్వకముగా చేసినది. అయితేఅబుద్ధిపూర్వకముగ చేసినకర్మను శాస్త్రోక్తప్రాయశ్చిత్తాదులచే నివృత్తిచేసికొనవచ్చును.

సంచిత మనగా వెనుకటిజన్మలలో చేయబడి ముం దనుభవమునకు ప్రారబ్ధరూపముతో వచ్చునదిగాక, మరియు ఇప్పుడు చేయబడు ఆగామికర్మయును మొత్తము సంచిత మవును. కావున కర్మశేషము గూడ నుండును. తత్కర్మానుభవనిమిత్తము శరీరోత్పత్తి తప్పక కలుగవలసియుండును. ఈసర్వకర్మలనివృత్తి యగుటకు జ్ఞానమే సాధనము. అందుకు శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసితవ్యః ... ... జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి ఇత్యాదిశ్రుతిస్మృతులు వినబడుచున్నందున కేవల కర్మోపాసనమువలన మోక్షము సిద్ధింపదు.

(3) విద్యాకర్మలకు విరోధము కావున విద్యాకర్మసముచ్చయము మోక్షసాధన మనుట కెంతమాత్రము కుదురదు. మరియు విద్య కర్తృకారకాదిశూన్యము. కర్మము కర్తృకారకాదిసాధ్యము. ఒకేవస్తువు వాస్తవముగా కర్తృకారకాదికము కల్గియున్నదనియు, కర్తృకారకాదిశూన్యమనియు ద్వివిధముగా నున్నదనుట న్యాయము కాదు. ఇందేదియో మిథ్య యగును అందుచే స్వాభావికాజ్ఞానమునకు విషయ మగుద్వైతమే మిథ్య యగును

శ్రు॥ వస్తుతంత్రో భవేద్ జ్ఞానం కర్తృతంత్ర ముపాసనమ్

తా॥ ఆత్మైవేదం సర్వం = ఒక్కటియే యని చూచునది. ఒక్కటియేగాని రెండవది లేదు. ఇదంతయు బ్రహ్మమే. ఇదంతయు ఆత్మయే. ఇట్టిఅర్థము నిచ్చుశ్రుతు లనేకములు గలవు. మరియు కర్మకర్తృ సంపాదనాది కారకభేదబుద్ధి యున్నగాని సిద్ధింపజాలదు. విద్యావిషయమునం దన్యత్వమును జూచుట తగ దనువచనములు వేలు గలవు. కావున జ్ఞానమునకు కర్మాచరణము విరోధి అని సుస్పష్టము. కావున విద్యాకర్మసముచ్చయమువలన మోక్షము సిద్ధించదు. ద్వైతము మిథ్య కావున కర్మ లాచరణీయములని విధిశ్రుతులు బోధించుచున్నవి. అందుకు హేతువు- కర్మబోధకశ్రుతులు పురుషార్థము నుపదేశించును. విద్యోపదేశకశ్రుతి సంసారమునుండి పురుషుని విముక్తుని చేయతలంచి సంసారమునకు హేతువగు అవిద్యనుండి

నివృత్తిచేయును. కావున కర్మప్రకాశక, జ్ఞానప్రకాశక శ్రుతులకు విరోధము లేదు. అందుచేత కర్మకర్త్రాదిద్వైతబుద్ధి సత్యమని యెంత మాత్రము బోధించుటలేదు- ప్రతిబంధ మున్నవానికి జ్ఞానోత్పత్తి యెంతమాత్రము కలుగదు. ఇయ్యది శాస్త్రప్రసిద్ధము. ప్రతిబంధము నశించిననే జ్ఞానోత్పత్తి యగును. జ్ఞానోత్పత్తివలన అవిద్య నశించును. అవిద్యానాశనమువలన సంసారనివృత్తి యగును.

(4) కామియగువాడు ఆత్మకానిదేహమునం దాత్మత్వమును గాంచి స్వవ్యతిరిక్తము లగుకామ్యపదార్థములు గలవని భావించును. వానికి తద్విషయక మగుకామము కల్గును. అందుచే కామియై కర్మల నాచరించును. చేయబడినకర్మఫల మనుభవించుటకు శరీరమును పొందును. ఇటుల సంసారము సిద్ధించును.

(5) జ్ఞాని దేహమునం దాత్మబుద్ధి లేక ఆత్మైకత్వమునే గాంచుచుండును. వానికి కోరదగినవిషయమే లేదు. కావున కామమే లేదు. ఆత్మయం దన్యత్వభ్రాంతి నివృత్త మగుటచేత కామమే కలుగదు. కావున ఆత్మావస్థానమే మోక్షము. ఇందువలన విద్యాకర్మలు కలసి మోక్షము నీయజాలవు. కనుక 'జ్ఞానాదేవ తు కైవల్య' మనుట సుస్పష్టము. ఆత్మజ్ఞానముచేతనే మోక్షము సిద్ధించును. అజ్ఞాననివృత్తి కింకొక మార్గము లేదు. 'నాన్యః పంథావిద్యతేఽయనాయ.' కావున కేవలకర్మలు, విద్యాకర్మసముచ్చయము రెండును నిషేధించబడినవి. కేవలజ్ఞానముచేతనే మోక్షమని పరమసిద్ధాంతము.

జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః
జానా మ్యధర్మం న చ మే నివృత్తిః
కేనాపి దేవేన హృది స్థితేన
యథా నియుక్తోఽస్మి తథా కరోమి.

తా॥ నేను ధర్మము నెరిగినను ధర్మమునందు నాకు ప్రవర్తనము లేదనియు, అధర్మము నెరిగినను నా కధర్మమునందు నివృత్తి లేదనియు బుద్ధియం దుండెడియొకానొక దేవునిచేత నేప్రకారము నియ

మింపబడుదునో ఆప్రకారము ధర్మాధర్మముల జేయుచుందుననియు జ్ఞాని నిశ్చయించుకొనును.

నార్థః పురుషకారేణే త్యేవం మాశంక్యతాం యతః
ఈశః పురుషకారస్వరూపేణాపి వర్తతే.

తా॥ ప్రవృత్తి యంతయు నీశ్వరాధీన మైనయెడల పురుష ప్రయత్నము వ్యర్థమని తలపరాదు. ఏకారణముచేత నీశ్వరుడు పురుష ప్రయత్నస్వరూపముగా వర్తించుచున్నాడో ఆకారణమువలన పురుష ప్రియత్నమువలన ప్రయోజనము లేదని చెప్పరాదు.

ఈదృగ్బోధే నేశ్వరస్య ప్రవృత్తి ర్నైవ వార్యతామ్
తథా పీశస్య బోధేన స్వాత్మాసంగత్వ ధీజనిః.

తా॥ పురుషప్రయత్నంబును, ఈశ్వరస్వరూపమయినయెడల అంతర్యామియొక్క ప్రేరకత్వము వ్యర్థమని తలపరాదు. ఈశ్వరుడు పురుషప్రయత్నాదిరూపముగాగూడ వర్తించుచున్నా డనెడిజ్ఞానము చేత అంతర్యామియొక్క ప్రేరణము నివారింపబడదు. అట్టియీశ్వర జ్ఞానముచేత స్వస్వరూపభూతు డగుప్రత్యగాత్మ అసంగు డనెడిజ్ఞానము కల్గుచున్నది. కనుక అంతర్యామియొక్క ప్రేరణయు వ్యర్థము కాదు.

తావతా ముక్తి రిత్యాహు శ్శ్రుతయ స్స్మృతయ స్తథా
శ్రుతిస్స్మృతీ మమైవాజ్ఞే హీత్యపీశ్వరభాషితమ్.

తా॥ ఆత్మ అసంగు డనెడిజ్ఞానముచేతనే ముక్తి కల్గుచున్నదని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. శ్రుతిస్మృతులు చెప్పినమాత్రముచేత ముక్తి కల్గునా అనిన శ్రుతిస్మృతులు రెండును నాయాజ్ఞలేయని యీశ్వరుడే చెప్పియున్నాడు. కనుక పురుషప్రయత్నమువలన సర్వము సిద్ధించుననియే వేదరహస్యము. అయితే జ్ఞానమునకు హేతుస్వరూప కార్యము లగుశ్రవణ, మనన, నిదిధ్యాసలు చేసినను జ్ఞాన మేల కల్గుట లేదు? అనుశంకకు సమాధాన మీక్రిందివిధమున చెప్పబడుచున్నది.

అందుకు కారణము (1) ప్రతిబంధవిశేషములు, (2) తీవ్రకృషి లోపము. తీవ్రకృషి యనగా—

ఆసుప్తే రామృతేః కాలం నయే ద్వేదాన్తచింతనే.

(1) ఉదయప్రభృతి నిద్రించువరకును, అట్లే మరణించువరకును సమ్యక్జ్ఞానము కల్గుటకై శ్రవణమననదిధ్యాసాదిక మొనర్చినను నీజన్మలో జ్ఞానము కలుగనియెడల 'అంతే మతి స్సా గతిః' అను న్యాయము ననుసరించి మరుజన్మలో ఆలస్యము లేక యోగికులమందు జన్మించి సమ్యక్జ్ఞానము కల్గువరకు పట్టుదలతో తీవ్రకృషి సల్పి వాసుదేవ 'స్సర్వ' మనెడి జ్ఞానము కల్గి మోక్షమునొందును.

(2) లేనియెడల సంచితకర్మప్రతిబంధము క్షయ మగువరకు యథోక్త శ్రవణాదుల సల్పుచు నీశ్వరార్పణబుద్ధితో కర్మల నాచరించుచు సంచితము తత్ఫలరూప ప్రారబ్ధము క్షయము కాగా కాగా ఉత్తరజన్మలయందు జ్ఞానాభివృద్ధి నొంది జ్ఞానియై మోక్షము నొందును. కనుక వానికి నేతజ్జన్మలోనిసంచితకర్మ అంతయు నశించునని నియమము లేదు. అందుచే అట్టిప్రతిబంధక్షయ మగువరకు సమ్యక్జ్ఞానము లభింపదు. అట్టిప్రతిబంధనివృత్తి అయినక్షణమందే యథార్థజ్ఞానము కల్గి ముక్తినొందును. అందుకే క్రిందిదృష్టాంతము చూపబడుచున్నది.

ఆగామిప్రతిబంధశ్చ వామదేవే సమీరితః
ఏకేన జన్మనా క్షీణో భరతస్య త్రిజన్మభిః.

తా॥ భావిప్రతిబంధ మనునది మరియొకజన్మను కలిగించుటకు హేతువయి సంచితములోనుండి వచ్చు ప్రారబ్ధకర్మవిశేష మగును. ఆభావిప్రతిబంధము వామదేవున కొకజన్మచేత క్షయించిన దనియు జడభరతునకు మూడుజన్మలచేత క్షయించినదనియు జెప్పబడినది. అనగా ఆభావిప్రతిబంధమునకు భోగముచేత తప్ప మరియొకదానిచేత నివృత్తి లేమిచే ఆభావిప్రతిబంధము నివృత్తియగుటకు కాలనియమము లేనందున అది నివృత్తి అగువరకు అపరోక్షాత్మవిజ్ఞానమునకు ప్రతిబంధము నిలిచియుండి, సమ్యక్జ్ఞానమును కలుగనీయదు.

నచేశ్వరత్వ మీశస్య హీయతే తావతా యతః
అవశ్యంభావితా ప్యేష ఈశ్వరేణైవ నిర్మితా.

తా॥ భావిప్రతిబంధరూపప్రారబ్ధమునకు పరిహార మీశ్వరుడైనను చేయలేడు. అటులయిన యెడల నీశ్వరత్వాప్రసంగము కలుగదా అనిన అందుచే నీశ్వరత్వము చెడదు. ఈభావిప్రతిబంధఫల మవశ్య మనుభవించవలెనని యీశ్వరుడే నిర్మించినందున అవశ్య మనుభవించవలెను. అందుచే నిట్టిభావిప్రతిబంధము తీరునంతవరకు శ్రవణాదులు చేసినను పుష్కలజ్ఞానము కల్గుటకు కొంత అవధి యుండును. అందుచే తీవ్ర కృషి చేయుడు.

న కించి ద్వేత్తి బాలశ్చే త్సర్వం వేత్త్యేవ తత్త్వవిత్
అల్పజ్ఞస్యైవ విధయ స్సర్వే స్యు ర్నాన్యయో ర్ద్వయోః.

తా॥ బాలుడు కొంచమైన నెరుగడు; జ్ఞాని సర్వము నెరిగినవాడు. జ్ఞాని కజ్ఞత్వము లేకపోయినను విధిలేమికి ప్రయోజక మగు సర్వజ్ఞత్వము కలదు. కనుక బాలకునివలెనే జ్ఞానికి విధిశాస్త్రము లేదు. అల్పజ్ఞునకు సర్వవిధులు గలవు. పర్యవసానమేమన అజ్ఞసర్వజ్ఞుల కిద్దరికి విధి లేదు. అనగా బాలునికి జ్ఞాని శాస్త్రము విధిని బోధించలేదు.

శాపాదేరపి సామర్థ్యం యస్యాసౌ తత్త్వవి ద్యది
త న్న శాపాదిసామర్థ్యం ఫలం స్యా త్తపసో యతః.

తా॥ వ్యాసాదిమునులవలె శాపానుగ్రహసామర్థ్యము గలవాడే జ్ఞానియని చెప్పరాదు. శాపానుగ్రహసామర్థ్యము తపస్సుయొక్క ఫలముగాని జ్ఞానఫల మెంతమాత్రము గాదు.

వ్యాసాదేరపి సామర్థ్యం దృశ్యతే తపసో బలాత్
శాపాదికారణా తస్య తపో జ్ఞానస కారణః

తా॥ తపస్సుయొక్క బలమువలన వ్యాసాదిమునివర్గమునకు శాపానుగ్రహసామర్థ్యము కనబడుచున్నది. అందుకు కారణము

శాపానుగ్రహముల నిచ్చుతపస్సుయొక్క సామర్థ్యము. మరియు అట్లే జ్ఞానమునకు కారణ మగుతపస్సుచేత అపరోక్షాత్మవిజ్ఞానము కలిగినది. తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ.

ద్వయం యస్యాస్తి తస్యైవ సామర్థ్యజ్ఞానయో ర్జనిః
ఏకైకంతు తపః కుర్వ న్నైకైకం లభతే ఫలమ్.

తా॥ వ్యాసాదులకు తత్త్వజ్ఞానంబును శాపానుగ్రహములను కలుగజేసెడిసామర్థ్యంబును రెండును వానియందు కనబడుటకు కారణము (1) శాపాదిసామర్థ్యమును కలిగించెడితపంబును (2) జ్ఞానమును కలిగించెడితపంబును. ఈరెండు ఏపురుషునికి గలవో వానికే శాపాదిసామర్థ్యతత్త్వజ్ఞానంబులు రెండును కల్గియుండును. అందుచే వ్యాసాద్యాధికారికపురుషుల కీరెండును సహజముగా నుండును. అయితే యీరెంటిలో శాపానుగ్రహసామర్థ్యమును కలిగించుతపంబుకంటె అపరోక్షాత్మవిజ్ఞానము కలుగచేయు జ్ఞానతపస్సు గొప్పది. ఇది సర్వాత్మనా నశించునది గాదు. శాపానుగ్రహసామర్థ్యము నిచ్చు తపఃఫలము సర్వాత్మనా నశించునది. అయితే ఇక్కడ శాపానుగ్రహసామర్థ్యములవలె జ్ఞానము పుట్టునది గాదు. మరి యేమనగా.

తతోఽభిజ్ఞాపకం జ్ఞానం న నిత్యం జనయ త్యదః
జ్ఞాపకాభావమాత్రేణ నహి సత్యం విధీయతే.

తా॥ ఏ కారణమువలన నీబ్రహ్మతత్త్వము సత్యమైనదో ఆకారణమువలన జ్ఞాన మాబ్రహ్మతత్త్వమును తెలుపునదియేగాని పుట్టించునది గాదు. బ్రహ్మతత్త్వముయొక్క జ్ఞప్తి లేనిమాత్రముచేత సత్యమగు బ్రహ్మము నశించదు, లేక లయించదు. జ్ఞానియొక్క బ్రహ్మభావము జ్ఞానముచేత పుట్టినదయినయెడల జ్ఞానము నశించుచుండగా తాను లయించుట లేదు. అట్లు లయమును పొందుట లేనందున బ్రహ్మతత్త్వము జ్ఞానముచే బుట్టినదిగాదని గ్రహించునది. జ్ఞానము కల్గినను వర్తమానదేహప్రారబ్ధక్షయ మగువరకు దేహము దేహకర్మలు నశించవు. అందుచేత ముక్తి కెంతమాత్రము బాధ లేదు.

నైతావతాపరాధేన తత్త్వజ్ఞానం వినశ్యతి
జీవన్ముక్తివ్రతం నేదం కింతు వస్తుస్థితిః ఖలు.

తా॥ తత్త్వజ్ఞానము కల్గినపిమ్మటగూడ మరల నేను మనుష్యుడ ననెడిబుద్ధియు, తత్కార్యములును కల్గుచుండును. అందుచేత వేదాంత ప్రమాణజనితజ్ఞానము బాధింపబడదు. ఎందుచేతనన మనుష్యత్వ బుద్ధ్యనుకరణలక్షణము గలజ్ఞానము నియమముగా ననుష్ఠింపదగిన జీవన్ముక్తివ్రతము కాదు. మరియేమన యథార్థజ్ఞానముచేత భ్రాంతి జ్ఞానము నివర్తించును. కనుక నిది వస్తుస్వభావమగును. ఆకారణము వలన ఒకానొకప్పుడు నేను మనుష్యుడ ననెడిబుద్ధి గలిగినను, మరల తత్త్వజ్ఞానముచేత ఆబుద్ధియే బాధింపబడునని తెలియవలెను.

దశమోపి శిరస్తాడం రుదన్ బుద్ధ్వా న రోదితి
శిరోవ్రణస్తు మాసేన శనైః శ్శామ్యతి నో తదా.

తా॥ రజ్జుసర్పస్థలమునందు విపరీతజ్ఞాననివృత్తి యగుచుండగా దానికార్య మగుదేహకంపాదిక మప్పుడే నశింపక కొంతకాలమువర కుండును. దశమునకు నేను దశముడనైతి ననెడిజ్ఞానోదయ మగుచుం డగా శిరస్తాడనపూర్వకముగా గలయేడ్పుమాత్రము నివర్తించు చున్నదేగాని అదివరకు దశముడు లేడని నెత్తిపై కొట్టుకొనుటచేత కలిగినవ్రణము కొంతకాలమునకు నశించునేగాని అప్పుడే నశింపదు. కనుక జ్ఞానము కల్గినను వర్తమానదేహప్రారబ్ధకర్మ అనుభవము చేతనే నివర్తించును అందుచే నీప్రారబ్ధ మనుభవించుటకును, జ్ఞాన మునకును నెంతమాత్రము సంబంధము లేదు.

బ్రహ్మవిదునికిః ప్రారబ్ధానుభవము లేదు

ప్రారబ్ధం బలవత్తరంఖలు విదాం భోగేన తస్య క్షయ
స్సమ్యగ్ జ్ఞానహుతాశనేన విలయః ప్రాక్సంచితాగామినామ్
బ్రహ్మాత్మైక్య మవేక్ష్య తన్మయతయా యే సర్వదా సంస్థితా
స్తేషాం తత్త్రితయం నహి క్వచిదపి బ్రహ్మైవ తే నిర్గుణమ్॥

తా॥ తత్త్వవేత్త లగువారికిఁగూడఁ బ్రారబ్ధము బలవత్తరమై యుండును. అనుభవముచేతనే క్షీణించునుగాని వేఱువిధముచే నశింపదు. సమ్యగ్జ్ఞాన (అపరోక్షబ్రహ్మసాక్షాత్కార) మనెడువహ్నిచే సంచితాగామికర్మములన్నియు దగ్ధములగును. ఈయర్థమందే "తస్య తావదేవ చిరమ్", "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" "ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం చితి బలా న్నాప్యుత్తరై శ్లిష్యతాం, ప్రారబ్ధం త్విహ భుజ్యతా మథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్," "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్" దిత్యాదిశ్రుతిస్మృతి సూత్రాదులు ప్రమాణములు.

ఇఁక బ్రహ్మాత్మైకత్వాపరోక్షజ్ఞానానంతరము "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి," "విదుష ఆత్మత్వాత్," మున్నగు శ్రుతిశాంకర గీతాభాష్యవచనములఁబట్టి బ్రహ్మవిత్తు నిరంతరము బ్రహ్మమాత్రముగ నుండువాఁడు గావున నారబ్ధముగూడ లేదని పరమార్థము. ఇట్లైనచోఁ బూర్వోక్తశ్రుత్యాదివిరోధము రాదాయని శంకగల్గును.

ఇందుకు సమాధానము:- "జ్ఞానే నాజ్ఞానకార్యస్య । సమూలస్య లయో యది । తిష్ఠ త్యత్ర కథం దేహ । ఇతి శంకావతో జడాన్ । సమాధాతుం బాహ్యదృష్ట్యా । ప్రారబ్ధం వదతి శ్రుతిః । నతు దేహాదిసత్యత్వ । బోధనాయ విపశ్చితామ్"

"అధిష్ఠానే తదా జ్ఞాతే । ప్రపంచే శూన్యతాం గతే
దేహస్యాపి ప్రపంచత్వా । త్ప్రారబ్ధావస్థితిః కుతః
అజ్ఞానజనబోధార్థం । ప్రారబ్ధ మితి చోచ్యతే"
"గుంజాపుంజాది దహ్యేత । నాన్యారోపితవహ్నినా
నాన్యారోపితసంసార । ధర్మా నేవ మహం భజే"

ఇత్యాద్యధ్యాత్మ, నాదబిందూపనిష, ద్విద్యారణ్యవచనముల ననుసరించి విచారించఁగా భ్రాంతు లగునిద్దఱిలో నొకనికి నధిష్ఠాన రజ్జుసాక్షాత్కారము గల్గినను నన్యారోపితసర్ప మన్యునకు యథా

పూర్వముగ భాసించుచుండును. అట్లే తత్త్వవిత్తునకు "సా నిశా పశ్యతో మునేః" "ఉదితవతి బోధభానౌ కిమపి న పశ్యామి కిన్విదం చిత్రమ్" "న బిభేతి కుతశ్చనేతి"- ఇత్యాదిశాస్త్రవిద్వదనుభవములను బట్టి విచారించఁగా జగత్తు లేక స్వరూపమాత్రస్థితి యబ్బినను భ్రాంతులగువారి యవిద్యచే నన్యస్వప్నమందు స్వీయదేహమునకు బాగోగులు దోఁచినట్లు స్వాజ్ఞానాధ్యాసముచే నజ్ఞునకు విద్వదుపాధియుఁ దోఁచుచుండును. అప్పుడజ్ఞానమంతయు సమ్యగ్దర్శనముచే నశించుచుండఁగా నీవిద్వదుపాధి యెటుల నిలిచెనని శాస్త్రవాసనలు కలయజ్ఞులశంకలకు సమాధానములఁ జెప్పుటకుమాత్రమే యాగామి సంచితములు నశించిన నారబ్ధము భోగమాత్రవినాశ్యమని సమాధానము చెప్పెడి తస్య తావదేవచిర మిత్యాదిపాగ్రుక్తశ్రుతిసూత్రాదులు ప్రవర్తించెనేగాని తత్త్వవేత్తకు దేహాదిసత్యత్వబోధనముకొఱకుఁ బ్రవర్తించలేదని పైయధ్యాత్మోపనిషదాదిప్రమాణములు చాటుచున్నవి. కాన నీయుభయవిధశ్రుత్యాదులకు నేమాత్రము విరోధము లేదు. అజ్ఞసమాధానార్థము తస్య తావదేవేత్యాదు లగు పైశ్రుత్యాదులును, దత్త్వనిత్స్వరూపమును జెప్పుట కధ్యాత్మోపనిషదాదులును బ్రవర్తించెఁగావునఁ బరమార్థమున నిర్గుణబ్రహ్మస్వరూపి యగుతత్త్వవేత్త కారబ్ధాదికర్మత్రితయము లేదు.



# వేదాంత పంచదశ్యుపదేశము

( విద్యారణ్యస్వామికృతము )

శబ్దస్పర్శాదయో వేద్యా వైచిత్ర్యా జ్జాగరే పృథక్
తతో విభక్తా తత్సంవి దైకరూప్యా న్న భిద్యతే.

తా॥ జాగ్రదవస్థయందు విజ్ఞానముచే తెలియబడుచున్న శబ్దస్పర్శరూపరసగంధాదివేద్యవస్తువులు నానావిధములుగా నున్నను, ఆశబ్దస్పర్శాదులకంటె వేఱై తద్విషయక మగుజ్ఞానము, మాత్రము

ఏకరీతిగా నున్నది. తెలియబడువిషయములు మారుచున్నను తెలివి మారకుండగ ఏకరీతిగా నున్నది.

తథా స్వప్నే౽త్ర వేద్యంతు న స్థిరం జాగరే స్థిరమ్
తద్భేదో౽త స్తయో స్సంవి దేకరూపా న భిద్యతే.

తా॥ అట్లె స్వప్నావస్థలోగూడ వేద్యము లగుపదార్థము లస్థిరము లగుటయేతప్ప జ్ఞానము (తెలివికి) నెట్టిమార్పును గోచరించుట లేదు. ఒకప్పుడు కంటితో రూపమును జూచి "ఇది రూప" మని తెలిసికొంటిమి. మరియొకప్పుడు చెవితో విని "ఇది శబ్దము"అని తెలిసికొంటిమి. ఇట్లే ప్రతిక్షణమందును అంతరింద్రియములతోగాని బాహ్యేంద్రియములతోగాని ఒక్కొక్కవేద్యమును గ్రహించి "ఇది" యని తెలిసికొనుచున్నాము. ఈ తెలివియే జ్ఞాన మనబడును. ఈ తెలివికి విషయము లగుశబ్దస్పర్శాదులు మారినను ఈజ్ఞానముమాత్రము మారుటలేదు.

సుప్తోత్థితస్య సౌషుప్తతమోబోధో భవే త్స్మృతిః
సా చావబుద్ధవిషయావబుద్ధం త త్తదా తమః.

తా॥ ఇక సుషుప్తిదశలో మన కెట్టి ఇంద్రియవిజ్ఞానము భాసించుట లేదు. కాని, సుషుప్త్యనంతరమందు ప్రతివాడును తా నానాడు రోగాదిబాధల ననుభవించుచున్నను "సుషుప్తిలో నే నెట్టి పదార్థవిజ్ఞానమును బొందలేదు; సుఖముగా నుంటిని" అని పలుకుచున్నాడు. ఇది సుషుప్త్యనంతరకాలమందు పల్కుచున్నందున స్మరణ మనబడును. స్మరణ మనునది యొకానొకప్పు డనుభవమై యుండవలె నను నియమ మున్నందున ఈస్మరణ మెప్పుడో ఒకప్పు డవశ్య మనుభవమై యుండితీరవలెను. కాన దీనినిబట్టి సుషుప్తిదశలో సుఖమును మన మందర మనుభవించుచుంటి మనుట నిర్వివాదము. దీనినిబట్టి జ్ఞానము లేక తెలివి సుషుప్తిదశలోగూడ నున్నట్లు ఋజువగుచున్నది.

న బోధో విషయా ద్భిన్నః న బోధా త్స్వప్నబోధవత్
ఏవం స్థానత్రయే ప్యేకా సంవి త్తద్వ ద్దినాంతరే

మాసాబ్దయుగకల్పేషు గతాగమ్యే ష్వనేకధా
నోదేతి నాస్తమే త్యేకా సంవి దేషా స్వయంప్రభా.

తా॥ ఆసుషుప్తియందలి 'నా కేమియు విజ్ఞానము భాసించ లే' దనునజ్ఞానానుభవము శబ్దస్పర్శాదివిషయముకంటె భిన్నమైనదియు తెలివికంటె వేరుగానిదయు నగుచున్నది.

జాగ్రత్స్వప్నములందలిజ్ఞానమువలెనే సుషుప్తియందలి ఆ అజ్ఞానానుభవజ్ఞానము గూడ ఏకరీతిగా నున్నది.

ఈరీతిగా నొకదినమందలి జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూడవస్థలందు నుండుజ్ఞాన మెట్టిభేదము లేక ఏకరీతిగా నుండుటచే మరియొకదినమందుగూడ నిట్లే యేకరీతిగా నుండుననుట యుక్తియుక్తమే గదా. ఈప్రకార మెన్నిమాసములు సంవత్సరములు యుగములు మన్వంతరములు కాలము గడచినను ఆజ్ఞానము నశింపక యేకరీతిగా నిత్యమై యుండును. ఈజ్ఞానము శరీరములోపల కలుగునది. అచట సూర్య, చంద్ర, దీపాదులకాంతి ఎంతమాత్రము ప్రసరింపదుగదా. చీకటిలో నెట్టివస్తువు గోచరింపకపోవుట అనుభవసిద్ధముగాన శరీరము లోపల ఈజ్ఞానము భాసించుటచేతను బాల్యమందు గల్గినజ్ఞానము వార్ధకమందుగూడ అనుగతమై ప్రకాశించుటచేతను ఈజ్ఞానము స్వయంప్రభ యనబడును. అనగా ఇతరసహాయము లేకయే తనంతట తాను ప్రకాశించునది యని అర్థము.

ఇదియే ఒకజీవునకు కలిగినట్లే ఇంకొకజీవునకుగూడ ఇట్లేకరీతిగా నుండుటచే సర్వజీవులందును ఈజ్ఞాన మేకమై యున్నది. ఇది నిత్యమగుటచే సత్య మగుచున్నది. సర్వజీవులందు నుండుటచే అనంతము లేక సర్వవ్యాపక మైనది.

ఇయ మాత్మా పరానందః పరప్రేమాస్పదం యతః
మా న భూవం హి భూయాస మితి ప్రేమాత్మ నీక్ష్యతే.

తా॥ ఈజ్ఞానమే ఆత్మ యనబడును. గొప్పప్రేమ కాస్పదమైనదే యనబడును. లోకమున ధనము పుత్రుడు భార్య మొదలగు

నవి ప్రేమపాత్రములు. వీనియన్నిటికంటె గొప్పప్రేమపాత్రము తానే. ఇట్టితానెల్లపుడు నుండునుగాని "నేను లేను" అని ఎవరును ఎప్పుడును అనరుగదా.

మరియు ప్రతిపనియు తనకొరకు చేయునుగాని ఇతరులకొరకు చేయడుగదా. భార్యను ప్రేమించుట తనప్రీతికొరకే. అట్లే పుత్రులను ప్రేమించుటయు తనప్రీతికొరకే; గాన ఆత్మ యనగా తననిజరూపమే సర్వోత్కృష్ట మగుప్రేమకు పాత్రమనుట లోకసిద్ధమును యుక్తిసిద్ధమును అగుచున్నది.

తత్ప్రేమాత్మార్థ మన్యత్ర నైన మన్యార్థ మాత్మని
అత స్తత్పరమం తేన పరమానంద తాత్మనః.

తా॥ తనకంటె వేరుగా నుండు ధనపుత్రభార్యాగృహక్షేత్రాదులం దుండుప్రీతి తనకొరకేగాని అన్యు లగుధనపుత్రాదులకొరకు తనకు ప్రీతి గలుగుట లేదు. కాన ఆత్మ పరమానందరూపము. తన లాభము లేక ప్రీతికొరకు సర్వకాలసర్వావస్థలందును ప్రతిజీవుడు శ్రమపడి ప్రయత్నించును. కాని వీనివలన తనకు గల్గునానందము క్షణికము. కొద్దికాలముమాత్రమే యుండి నశించునది. కాన ఆనంద రూపము నశించక నిత్యముగా నుండునుగాన దానికొరకు ప్రయత్నించ వలసియున్నది. ఈప్రయత్నమే వేదాంతవాక్యశ్రవణమననాదులు.

ఇత్థం సచ్చిత్పరానంద ఆత్మా యుక్త్యా తథావిధమ్
పరం బ్రహ్మ తయో శ్చైక్యం శ్రుత్యంతే షూపదిశ్యతే.

తా॥ ఈప్రకారము యుక్తిచేతనే ఆత్మ సర్వులయొక్క నిజ రూపమని నిత్యమని సత్యమని జ్ఞానరూపమని ఆనందరూపమని అనంతము లేక సర్వవ్యాపకమని తేలినది. వేదాంతము లనెడి ఉపనిషత్తులం దీలక్షణములే బ్రహ్మమునకు చెప్పబడియున్నవి. కాన ఈ యాత్మయే బ్రహ్మము. బ్రహ్మమే ఆత్మ.

అభానే న పరం ప్రేమ భానే న విషయే స్పృహా
అతో భానే ప్యభా తాసా పరమానందతాత్మనః.

ఈఆత్మ ఆనందరూపమైనను ఒకపుడు భాసించును. మరియొక పుడు భాసించదు. ఇట్లు భాసించుట భాసింపకుండుట యను రెండు ధర్మములు గోచరమగుచున్నవి. ఎట్లనగా ఆత్మయొక్క ఆనందరూప మసలే భాసింపకుండుచో ధనదారాదులకంటె గొప్పప్రేమాస్పదత్వము కుదురదు. అట్లైన ఆత్మ యొక్క యానందరూపము సర్వదా భాసించు చునే యుండునన్నచో గొప్పయానందరూపు డను (ఆత్మ) తాను క్షణికముగా ఆనందకరము లగువిషయములను కోరుట యసంభవము. కాన నీయానందరూపము ప్రకాశించును ప్రకాశింపదని చెప్పవలెను.

ఇట్టివిరుద్ధసంఘటన కుదురునా? లోకవిరుద్ధము గాదా? యను నాశంకకు సమాధాన మీయబడుచున్నది.

అధ్యేతృవర్గమధ్యస్థపుత్రాధ్యయనశబ్దవత్
భానే ప్యభానం భానస్య ప్రతిబంధేన యుజ్యతే.

తా॥ పదిమందిపిల్లలతో కలసి మనపిల్లవాడుగూడ వేదాధ్య యన మొనర్చుచుండగా మనపిల్లవానికంఠధ్వని మనకు భాసించు చున్నదా లేదా? రెండు నిజమే, అందరుపిల్లలకంఠధ్వనితో బాటు మనపిల్లవానికంఠధ్వనిగూడ కలసి మనకు భాసించుచున్నది. కాని ప్రత్యేకము మనపిల్లవానికంఠధ్వని 'ఇదియే' యని మనము విచక్షణగా గుర్తింపలేము. అట్లే ఈయాత్మయొక్క ఆనందరూపముగూడ దేహేం ద్రియవ్యాపారాదులవలన పుట్టువిషయానందములో కలసి మనకు భాసించుచున్నదేగాని విడిగా భాసించుట లేదు. దానికి కారణ మేమనగా.

తస్య హేతు స్సమానాభిహారః పుత్రధ్వనిశ్రుతౌ
ఇహానాది రవిద్యైవ వ్యామోహైకనిబంధనమ్.

తా॥ మనపిల్లవానికంఠధ్వని మిగిలినపిల్లల కంఠధ్వనితో కలసి యుండుటయే దీనికి కారణము- ఆత్మయొక్క ఆనందరూపము భాసింప కుండుట కనాదికాలప్రవృత్త మగునవిద్యయే కారణము-

అవిద్య యనగా నేమో వివరింపబడుచున్నది.

చిదానందమయబ్రహ్మప్రతిబింబసమన్వితా
తమోరజస్సత్త్వగుణా ప్రకృతి ర్ద్వివిధా చ సా
సత్త్వశుద్ధ్యవిశుద్ధిభ్యాం మాయాఽవిద్యే చ తే మతే.

తా॥ కల్పాంతరమందలి సర్వజీవులయొక్క పుణ్యాపాపకర్మ లనిర్వచనీయ మగురూపములో ప్రళయకాలమం దుండును. ఆరూపమునకే "ప్రకృతి" యని సంజ్ఞ. అందు కర్మఫలము ఉత్తమము, మధ్యమము, అధమము అని మూడురకములుగా నుండును. ఇవియే వరుసగా సత్త్వ, రజ, స్తమోగుణము లనబడును. ఈప్రకృతి యధార్థ భావము లేనిది స్వరూపముచే గోచరము గానిది. దానికార్యముచే మాత్రము గోచరమగునది. అధిష్ఠాన మగుబ్రహ్మసత్తయే దీనికిగూడ సత్తగాని అంతకంటె వేరుగా సత్త లేనిది- ఇందు ప్రతిబింబించిన బ్రహ్మముతో గూడినపుడే ప్రకృతి యనబడును. అనగా జగద్వ్యాపారమునంతను పుష్కలముగా చేయునదని యర్థము. ఇట్టి ప్రకృతిలోని సత్త్వరజస్తమోగుణములు మూడింటిలోను సత్త్వగుణ మధికభాగ ముండి (సత్త్వప్రధానమై) యున్నపు డీప్రకృతియే "మాయ" యనబడును. సత్త్వగుణము తక్కువభాగముతో గూడి మలినసత్త్వప్రధానమైనపు డీప్రకృతియే "అవిద్య" యనబడును. ఈఅవిద్యయే ఆత్మయొక్క ఆనందరూపము, ఎల్లపుడు భాసింపకుండుటకు గలప్రతిబంధము.

మాయను తనస్వాధీనమం దుంచుకొన్నవాడే ఈశ్వరుడు. లేక మాయయందు ప్రతిబింబించినబ్రహ్మచైతన్యమే ఈశ్వరుడు.

ఈఅవిద్యయే జీవునికారణశరీర మనబడును. ఈకారణశరీర మందు తాదాత్మ్యాభిమానము గలజీవుడే "ప్రాజ్ఞు" డనబడును. ఈశ్వరు డీప్రాజ్ఞు లందరిఆత్మతాదాత్మ్యమునొందును. అనగా ప్రాజ్ఞు లందరును నేనే అనుఅభిమానము గలవా డీశ్వరుడని భావము. ఇట్టి ఏకత్వవిజ్ఞానము ప్రాజ్ఞుల కుండదు గాన వారు "వ్యష్టి" యనుజీవు లనబడెదరు.

తమఃప్రధానప్రకృతే స్తద్భోగా యేశ్వరాజ్ఞయా,
వియత్పవనతేజోంబుభువో భూతాని జజ్ఞిరే
సత్వాంశైః పంచభి స్తేషాం క్రమా ద్ధీంద్రియపంచకమ్
త్రై రంతఃకరణం సర్వై ర్వృత్తిభేదేన తద్ద్విధా
రజోంశైః పంచభి స్తేషాం క్రమా త్కర్మేంద్రియాణి తు
తైః స్సర్వై స్సహితైః ప్రాణో వృత్తిభేదేన పంచధా
బుద్ధికర్మేంద్రియప్రాణపంచకై ర్మనసా ధియా
శరీరం సప్తదశభి స్సూక్ష్మం తల్లింగ ముచ్యతే.
ప్రాజ్ఞ స్తత్రాభిమానేన తైజసత్వం ప్రపద్యతే
హిరణ్యగర్భతా మీశ సయో ర్వ్యష్టిసమష్టితా.

తా॥ ఇట్టిప్రాజ్ఞులభోగముకొరకు ఈశ్వరేచ్ఛచే తమోగుణము ప్రధానముగా గలప్రకృతివలన ఆకాశ, వాయు, అగ్ని, జల, భూము లనుపంచభూతములు పుట్టెను.

ఆపంచభూతము లన్నిటియందు సాత్వికభాగములు రజోగుణ భాగములు తమోగుణభాగములు గలవు. ఏలననగా ఈభూతముల కుపాదానకారణము ప్రకృతిగాన అందలిమూడుగుణములు తత్కార్య మగుపంచభూతములందు నుండుట యుక్తియుక్తమే యగును.

అట్టిభూతములసాత్వికభాగసమూహముచే అంతఃకరణ ముత్పన్న మాయెను. అది యాలోచించుట సంశయించుట యనువృత్తినొంద ర్చుస్థితిలో "మనస్సు" అనబడును. నిశ్చయించువృత్తిలో నుండు నపుడు "బుద్ధి" యనబడును.

ఆకాశసాత్వికభాగమువలన శ్రోత్రేంద్రియము పుట్టెను.
వాయు సాత్వికభాగమువలన త్వగింద్రియము పుట్టెను.
అగ్ని సాత్వికభాగమువలన నేత్రేంద్రియము పుట్టెను.
జల సాత్వికభాగమువలన రసనేంద్రియము పుట్టెను.
భూమి సాత్వికభాగమువలన ఘ్రాణేంద్రియము పుట్టెను.

ఈ అయిదింటికి జ్ఞానేంద్రియములని పేరు.

పై పంచభూతములయొక్క రజోగుణభాగసమూహముచే 'ప్రాణము' పుట్టెను. అది వ్యాపారభేదముచే 1. ప్రాణము 2 అపానము 3. వ్యానము 4. ఉదానము 5. సమానము అని అయిదువిధముల భేదము గల్గియుండును.

ఆకాశరజోగుణభాగముచే వాగింద్రియము పుట్టెను.
వాయు రజోగుణభాగముచే పాణీంద్రియము పుట్టెను.
అగ్ని రజోగుణభాగముచే పాదేంద్రియము పుట్టెను.
జల రజోగుణభాగముచే పాయ్వింద్రియము పుట్టెను.
భూమి రజోగుణభాగముచే ఉపస్థేంద్రియము పుట్టెను.

ఈఅయిదింటికి కర్మేంద్రియములని పేరు.

| | |
|---|---|
| పై జెప్పబడిన మనస్సు బుద్ధి | 2 |
| జ్ఞానేంద్రియములు | 5 |
| కర్మేంద్రియములు | 5 |
| ప్రాణభేదములు | 5 |

ఈపదునేడవయవములయొక్క సమూహమే సూక్ష్మదేహము లేక లింగదేహము అనబడును.

ప్రాజ్ఞుడు వ్యష్టి యగునీసూక్ష్మదేహమందు తాదాత్మ్యాభిమానము నొందినపుడు "తైజసు" డనబడును. సమష్టి యగునీ సూక్ష్మదేహసమూహమందు తాదాత్మ్యాభిమానము నొందినయీశ్వరుడే "హిరణ్యగర్భు" డనబడును.

ఈసూక్ష్మదేహముగూడ సంకల్పమాత్రమును విజ్ఞానగ్రహణ మాత్రమునే చేయుటకు తగియున్నదిగాని విశేషవ్యాపారముల నొనర్ప జాలదు. కర్మఫలములోని త్రిగుణము లనుభవించితీరవలసియున్నవి. గాన తదనుభవముకొరకు యోగ్యమగు స్థూలదేహము నిర్మించవలసి వచ్చినది. అందులకు పంచభూతములను పంచీకరణమొనర్చుట యను సాంకర్యము నొందింపవలసివచ్చినది. తద్రీతి యిట్లు వివరింపబడినది.

తద్భోగాయ పున ర్భోగ్యభోగాయతనజన్మనే
పంచీకరోతి భగవా న్ప్రత్యేకం వియదాదికమ్
ద్విధా విధాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః
స్వస్వేతరద్వితీయాంశై ర్యోజనా త్పంచ పంచ తే.

తా॥ $\frac{1}{2}$ ఆకాశము $+1/8$ వాయువు $+1/8$ అగ్ని $+1/8$ జలము $+1/8$ భూమి = పంచీకృతాకాశము. $\frac{1}{2}$ వాయువు $+1/8$ ఆకాశము $+1/8$ అగ్ని $+1/8$ జలము $+1/8$ భూమి = పంచీకృత వాయువు, $\frac{1}{2}$ అగ్ని $+1/8$ఆకాశము $+1/8$వాయువు$+1/8$జలము $+1/8$ భూమి = పంచీకృతాగ్ని, $\frac{1}{2}$ జలము $+1/8$ ఆకాశము $+$ $1/8$ వాయువు $+1/8$ అగ్ని $+1/8$ భూమి = పంచీకృత జలము, $\frac{1}{2}$ భూమి $+1/8$ ఆకాశము $+1/8$ వాయువు $+1/8$ అగ్ని $+$ $1/8$ జలము = పంచీకృతభూమి.

తై రండ స్తత్ర భువనం భోగ్యభోగాశ్రయోద్భవః
హిరణ్యగర్భ స్థూలేస్మి న్దేహే వైశ్వానరో భవేత్
తైజసా విశ్వతాం యాతా దేవతిర్యఙ్నరాదయః
కుర్వతే కర్మ భోగాయ కర్మ కర్తుంచ భుంజతే
నద్యాం కీటా ఇవావర్తా దావర్తాంతర మాశు తే.

తా॥ అట్టిపంచీకృతపంచభూతములవలన స్థూలదేహము లేర్పరుపబడెను. అతలాదిపాతాళలోకము లేడు, భూరాద్యూర్ధ్వలోకము లేడు, ఈపదునాలుగు లోకములును, అందుండు నుద్భిజ్జ, స్వేదజ, అండజ, జరాయుజాది, సర్వజీవులస్థూలదేహములును ఏర్పడెను. ఈ స్థూలదేహమందు వ్యష్టిగా తాదాత్మ్యాభిమానము నొందిన 'తైజసుడు' ఇప్పడు 'విశ్వ'డనబడును. 'హిరణ్యగర్భ' డీసమష్టిస్థూలదేహసమూహమందు తాదాత్మ్యాభిమానము నొందినపుడు 'వైశ్వానరుడు' లేక 'విరాట్పురుషు' డనబడును. ఈ విశ్వులు చేసినకర్మల యొక్క ఫలము నీదేహముతో ననుభవించుటయు అందుకొరకు కర్మ చేయుటయు తదనుభవముకొరకు తిరిగి మరియొక దేహము నొందు

టయు నీరీతిగా నదీప్రవాహామందలిసుడిగుండములోని కీటములవలె
ెల కెన్నటికి ఒడ్డుచేరుట కవకాశము లేదు.

సత్కర్మపరిపాకా త్తే కరుణానిధి నోద్ధృతాః
ప్రాప్య తీరతరుచ్ఛాయాం విశ్రామ్యంతి యథాసుఖమ్
ఉపదేశ మవాప్యైవ మాచార్యా త్తత్త్వదర్శినః
పంచకోశవివేకేన లభంతే నిర్వృతిం పరామ్.

తా॥ ఒకానొకదయామయు డానదియందలి కీటమును తీర మందలిచెట్టునీడ నుంచి విశ్రమింపజేయునట్లీజీవునిగూడ దయామయుడును వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థుడు నగు గురూత్తము డీసంసారప్రవాహమునుండి మోక్షము నొందింపగలడు. అదియే వేదాంతవాక్య శ్రవణమననాదికము. ఈదేహేంద్రియసంఘాతము నైదుకోశములుగా విభజించి దీనికంటె విలక్షణమై దీని కధిష్ఠానముగా నుండుఆత్మను బోధించును. [పంచకోశములయొక్క స్వరూప మిదివరలోనే ప్రదర్శింపబడినది.]

అన్వయవ్యతిరేకాభ్యాం పంచకోశవివేకతః
స్వాత్మానం తత ఉద్ధృత్య పరం బ్రహ్మ ప్రపద్యతే
అభానే స్థూలదేహస్య స్వప్నే యద్భాన మాత్మనః
సోఽన్వయో వ్యతిరేక స్తద్భానేఽన్యానవభాసనమ్.
లింగాభానే సుషుప్తౌ స్యా దాత్మనో భాన మన్వయః
వ్యతిరేకస్తు తద్భానే లింగ స్యాభాన ముచ్యతే
సుషుప్త్యభానే భానం తు సమాధా వాత్మనోఽన్వయః
వ్యతిరేక స్త్వాత్మభానే సుషుప్త్యనవభాసనమ్
యథా ముంజా దిషీకైవ మాత్మా యుక్త్యా సముద్ధృతః
శరీరత్రితయా ద్ధీరైః పరం బ్రహ్మైవ జాయతే.

తా॥ ఈపంచకోశములలో నేయేకోశమం దేయేపదార్థము లనుగతము లగుచున్నవో అవి అన్వయ మనబడును, ఏయేవస్తువులు

మారిపోవుచున్నవో అవి వ్యతిరేక మనబడును. ఈరీతిచేత పంచకోశములవలన తదతిరిక్త మగు బ్రహ్మాత్మను గుర్తింప వీలగును.

అం దన్నమయకోశమే స్థూలదేహము. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములు కలసి సూక్ష్మదేహము. ఆనందమయకోశమే కారణదేహము. ఇందు జాగ్రత్స్వప్నము లనురెండుదశలలో స్థూలదేహముయొక్క వ్యవహార మొకజాగ్రద్దశలోమాత్రమే యుండి స్వప్నదశలో కనుపించుటలేదు. "నేను జాగ్రదవస్థను తరువాత స్వప్నావస్థను రెంటిని క్రమముగా అనుభవించితిని" అని సర్వుడు పల్కుచున్నాడు. ఇందు "నేను" అనునదిమాత్రమే అనుగతమగుచున్నది; లేక అన్వయ మగుచున్నది. స్థూలదేహముమాత్రము వ్యావర్తక మగుచున్నది లేక వ్యతిరేక మగుచున్నది. కాన తనకొకఅవస్థలో భాసించి మరియొక అవస్థలో భాసింపనిస్థూలదేహము లేక అన్నమయకోశము, తననిజరూపము కానేరదు; అనగా ఆ కాదు. ఇందుచే సూక్ష్మదేహములోని అవాంతరభేదము లగు ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు మూడును ఆత్మ కాదని నిర్ణయింపబడుచున్నది. ఇట్లే స్వప్నసుషుప్తు లనెడి రెండుదశలలో "ఏనేను స్వప్నము ననుభవించితినో ఆనేనే సుషుప్తి ననుభవించితిని" అని రెండవస్థలందును "నేను" ఏకరీతిగా నున్నది. స్వప్నమందు కలల ననుభవించినసూక్ష్మదేహము సుషుప్తియందు భాసింపలేదు; గాన సూక్ష్మదేహము నేను గాదు. ఇందు అట్లే సుషుప్తి సమాధు లనెడిరెండవస్థలలో "ఏనేను సుషుప్తి ననుభవించితినో ఆనేనే సమాధిలో నింతకాల ముంటిని" అని "నేను" అనువస్తువు రెండుకాలములందు నేకరీతిగా ననుగతమై యున్నది. సుషుప్తియందు కారణదేహ మనుఅవిద్య యున్నది. సమాధియందు కారణదేహము గూడ లేదు. కాన కారణదేహము నేను గాదు, ఆత్మ గాదు. ఇందుచే ఆనందమయకోశ మాత్మగాదని నిర్ణయింపబడుచున్నది.

ఈప్రకారము ముంజ యనుదర్భవిశేషములోనుండి దానిగర్భస్థసూక్ష్మరూపవిశేష మగు "ఇషీక" వేరుచేయబడినట్లు పంచ

కోశములలోనుండి ఆత్మ వేరుచేయబడగా మిగిలినఆత్మయే సర్వ వ్యాపక సత్య జ్ఞానానంద స్వయంజ్యోతి యగుబ్రహ్మ మగుచున్నది.

పరాపరాత్మనో రేవం యుక్త్యా సంభావి తైకతా
తత్త్వమస్యాదివాక్యై స్సా భాగత్యాగేన లక్ష్యతే.

తా॥ ఈప్రకారము యుక్తిచే దేహపరిచ్ఛిన్న మగుచైతన్య రూప మగుకూటస్థునకును పరబ్రహ్మమునకును ఏకత్వము కుదురు చుండగా "తత్త్వమసి" మొదలగు ఉపనిషత్తులందలిమహావాక్యములచే ఈయైక్యమే విరుద్ధము లగుభాగములను పరిత్యజించుట యనుభాగ త్యాగలక్షణావృత్తిచే గ్రహింపబడుచున్నది. (భాగత్యాగ లక్షణ వెనుక వివరింపబడియున్నది)

పరోక్షం బ్రహ్మ విజ్ఞానం శాబ్దం దేశికపూర్వకమ్
బుద్ధిపూర్వకృతం పాపం కృత్స్నం దహతి వహ్నివత్.

తా॥ సద్గురుమూలక వేదాంతవాక్యశ్రవణాదులచే "బ్రహ్మ ఉన్నది" అనుపరోక్షజ్ఞానము బుద్ధిపూర్వకృత మగుపాపమును మాత్రమే అగ్నివలె తగులపెట్టును.

అపరోక్షాత్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకమ్
సంసారకారణాజ్ఞానతమస శ్చండభాస్కరః .

తా॥ గురూపదిష్టవేదాంతార్థమును నిరంతరము మనన మొనర్చి నిదిధ్యాసద్వారా "నేనే బ్రహ్మమును" అనునట్టి అపరోక్షజ్ఞానము నొందగా జననమరణప్రవాహరూప మగుసంసారమునకు మూలకారణ మగునవిద్య సంపూర్ణముగా నశించును. ఇక వాడు జన్మింపడు. శాశ్వతసుఖరూపమోక్షము నొందును. అట్టిజ్ఞాని యిట్లనుకొనును.

దుఃఖినోఽజ్ఞా స్సంసరంతు కామం పుత్రాద్యపేక్షయా
పరమానందపూర్ణోహం సంసరామి కి మిచ్ఛయా
అనుతిష్ఠంతు కర్మాణి పరలోకయియాసవః
సర్వలోకాత్మకః కస్మా దనుతిష్ఠామి కిం కథమ్

వ్యాచక్షతాం తే శాస్త్రాణి వేదా నధ్యాపయంతు వా
యేఽత్రాధికారిణో మే తు నాధికారోఽక్రియత్వతః
నిద్రాభిక్షే స్నానశౌచే నేచ్ఛామి న కరోమి చ
ద్రష్టార శ్చే త్కల్పయంతి కిం మే స్యా దన్యకల్పనాత్
గుంజాపుంజాది దహ్యేత నాన్యారోపితవహ్నినా
నాన్యారోపితసంసారధర్మా నేవ మహం భజే.

తా॥ అజ్ఞులు పుత్రాదులను గోరి తత్సిద్ధికై కర్మలను ప్రయత్న పూర్వకముగా ఆచరించి తదనుభవముకొరకు తిరిగి జన్మింతురు. నేను పరమానందరూపుడ నగుటచే నెట్టికోరిక లేదుగాన నే నెట్టి కర్మను చేయను. తదనుభవముకొరకు జన్మింపను. పరలోకములో సుఖము నపేక్షించువా రందుకు తగుప్రయత్న మొనర్తురు. నేను సర్వలోకములను వ్యాపించియున్న వాడ నగుటచే ఆప్రయత్న మక్కర లేదు. వేదశాస్త్రాదుల నధ్యయన మొనర్చుట బ్రహ్మప్రాప్తి నపేక్షించువారు చేయదగినపని. నా కట్టిబ్రహ్మప్రాప్తి గల్గినందువలన వేదాధ్యయనాదు లక్కరలేదు. నాదేహవ్యాపారము లగు నిద్రా, శౌచ, భోజనాదులందుగూడ నాకోరిక యెంతమాత్రము లేదు. లోకులు నాయందు నిద్రాదిప్రవృత్తి యున్నట్లు కల్పించుచున్నను నాకు వారికల్పనతో నెట్టిసంబంధమును లేదు. పొదరిళ్ళు మొదలగునవి ఇతరత్ర యుండినయగ్నితో నెట్లు తగులబడవో నేనుగూడ నితరులచే ఆరోపింపబడిన సంసారధర్మముతో నేవిధముగాను బంధింపబడను.

శ్రుణ్వం త్వజ్ఞాతతత్త్వా స్తే జాన న్కస్మా చ్ఛృణో మ్యహమ్
మన్యంతాం సంశయాపన్నా న మన్యేఽహ మసంశయః
విపర్యస్తో నిదిధ్యాసే త్కిం ధ్యాన మవిపర్యయాత్
దేహాత్మత్వవిపర్యాసం న కదాచి ద్భజా మ్యహమ్.

తా॥ బ్రహ్మాత్త్వము తెలిసికొనదలచినవారు వేదాంతవాక్య శ్రవణ మొనర్తురు. వినినపదార్థమందు సంశయము గలవారు మనన మొనర్తురు. దేహాదికమందు విపరీత మగునాత్మబుద్ధి గలవారు నిది

ధ్యాన మొనర్తురు. నా కేమియును లేవుగాన నేను శ్రవణ మనన నిదిధ్యాన లొనర్ప నవసరము లేదు. నేను కృతార్థుడ నైతిని.

అహం మనుష్య ఇత్యాది వ్యవహారో వినాప్యముమ్
విపర్యాసం చిరాభ్యస్తవాసనాతోఽవకల్పతే
ప్రారబ్ధకర్మణి క్షీణే వ్యవహారో నివర్తతే
కర్మాక్షయే త్వసౌ నైవ శామ్యే ద్ధ్యానసహస్రతః.

తా॥ 'నేను మనుష్యుడను' ఇత్యాదివ్యవహారము పైవిపర్యాసము లేకున్నను చిరకాలమునుండి అభ్యస్త మగువాసనవలన నేర్పడును. వర్తమానదేహకారణ మగుప్రారబ్ధకర్మ క్షీణింపగా ఆవ్యవహారము పోవును. పైశ్రవణమనననిదిధ్యాస లెంతయొనర్చినను ఆగామి సంచితకర్మలను పోగొట్టునుగాని ప్రారబ్ధము నెంతమాత్రము పోగొట్ట లేవు. ప్రారబ్ధ మనుభవించితీరవలసినదే. గాని జ్ఞానోదయానంతర మందు దేహము ప్రారబ్ధకర్మ ననుభవించుచున్నను నాకుమాత్ర మద్దానితో నెట్టిసంబంధమును లేదు.

విరళత్వం వ్యవహృతే రిష్టంచే ద్ధ్యాన మస్తు తే
అబాధికాం వ్యవహృతిం పశ్య న్ధ్యాయా మ్యహం కుతః.

తా॥ నేను మనుష్యుడను– ఇత్యాదివ్యవహార బాహుళ్యము తగ్గుటకొరకు కట్టివాడు ధ్యాన మొనరింపవలయును. నే నట్టివాడను గాను. అనగా అట్టిస్థితి నతిక్రమించి కృతార్థుడ నైతినిగాన ధ్యాన మొనర్పను.

విక్షేపో నాస్తి యస్మా న్మే న సమాధి స్తతో మమ
విక్షేపో వా సమాధిర్వా మనస స్స్యా ద్వికారిణః.

తా॥ నేనే పరబ్రహ్మమును. నా కెట్టివిక్షేపమును లేదు. మనస్సుండి విక్షేపాదులు గలవానికి సమాధి యవసరమని శాస్త్రముపదేశించుచున్నదిగాని నాకు మనస్సే లేదుగాన, నాకు సమాధితో పని లేదు. అనగా నేను సమాధివలన పొందదగినఫలమును పొందితిని.

నిత్యానుభవరూపస్య కో మమానుభవః పృధక్
కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్త మిత్యేవ నిశ్చయః.

తా॥ నిత్యానందరూపుడ నగునా, కింక వేరగుఆనందాను భవము లేదు. చేయదగిన దంతయు చేసితిని. పొందదగినసర్వాత్మ భావమును పొందితిని. ఇది నానిశ్చయము.

వ్యవహారో లౌకికో వా శాస్త్రీయో వాఽన్యథాపి వా
మమాకర్తు రలేపస్య యథారబ్ధం ప్రవర్తతామ్.

తా॥ నాకు భిక్షాదిలౌకికవ్యవహారముగాని సమాధ్యాది శాస్త్రీయవ్యవహారములుగాని లేవు. నాకు కర్తృత్వముగాని ఆయా పనులందు సంబంధముగాని ఎంతమాత్రము లేదు.

అథవా కృతకృత్యోఽపి లోకానుగ్రహకామ్యయా
శాస్త్రీయేణైవ మార్గేణ వర్తేహం కా మమ క్షతిః.

తా॥ అట్లుకాకపోయినను నేను కృతార్థుడనై బ్రహ్మనిము నైనను లోకసంగ్రహముకొరకు శాస్త్రీయమార్గమున ప్రవర్తించు చుందును. నా కేమి లోటున్నది?

దేవార్చనస్నానశౌచభిక్షాదా వర్తతాం వపుః
తారం జపతు వా క్తద్వ త్పర త్వామ్నాయమ స్తకమ్
విష్ణుం ధ్యాయతు ధీ ర్యద్వా బ్రహ్మానందే విలీయతామ్
సాక్ష్యహం కించిద ప్యత్ర న కుర్వే నాపి కారయే
ఏవంచ కలహం కుత్ర సంభవే త్కర్మిణో మమ
విభిన్నవిషయత్వేన పూర్వాపరసముద్రవత్
వపుర్వాగ్ధీషు నిర్బంధః కర్మిణో నతు సాక్షిణి
జ్ఞానిన స్సాక్ష్యలేపత్వే నిర్బంధో నేతరత్ర హి.

తా॥ ఈదేహము దేవతల నర్చించుట స్నానము శౌచము భిక్ష మొదలగుపను లొనర్చుగాక. ఈవాగింద్రియము ప్రణవజపమును గాని ఉపనిషత్పారాయణముగాని చేయుగాక. ఈమనస్సు విష్ణువును

ధ్యానించుగాక లేక బ్రహ్మానందమందు లీనమగుగాక. నే నీవ్యవహార మున కంతకును సాక్షి మాత్రుడనే. అంతేగాని నే నీపనులు చేయుట లేదు. చేయించుట లేదు. ఇట్లు చెప్పినచో కర్మానుష్ఠాతకును నాకును ఎట్టికలహము లేదు. దేహము వాగాదీంద్రియములు బుద్ధి వీనివిషయ మందుమాత్రమే మాఉభయులసిద్ధాంతమునకు భేదమున్నది. కర్మ ఫలమును దేహి పొందును. దేహవ్యాపారమునకు కర్తయు, భోక్తయు నగువిజ్ఞానమయ, ఆనందమయకోశములే ఆత్మయని కర్మరుల అభిప్రాయము, అకర్త, అభోక్తయై సాక్షిమాత్రుడే ఆత్మయని వేదాంతుల అభిప్రాయము.

ఏవం చాన్యోన్యవృత్తాంతానభిజ్ఞౌ బధిరావివ
వివదేతాం బుద్ధిమంతో హాసంత్యేవ విలోక్య తౌ.

తా॥ ఈ ప్రకార మిద్దరు చెవిటివారు పరస్పరసంభాషణ మొనర్చుచు పరస్పరార్థగ్రహణము లేనట్లు ఈకర్మిరవేదాంతు లిద్దరు వివాదపడుటను చూచుబుద్ధిమంతుడు నవ్వును.

ఇంక జ్ఞానికి అజ్ఞానికి ప్రవర్తనయందలిభేదము ప్రదర్శింప బడుచున్నది.

చిత్ప్రత్యక్షా తతోన్యస్య మిథ్యాత్వం చానుభూయతే
నాద్వైత మపరోక్షం చే త్యేత న్న వ్యాహతం కథమ్.

తా॥ కూటస్థమును, స్వప్రకాశమును, నగుఆత్మచైతన్యము కంటె వేరుగా నెట్టివస్తువును లేదుగదా. ద్వైతముగా కనుపించు ఈజగత్తును అందలిమిథ్యాత్వమును ఈచైతన్యముచేతనే అనుభవించు చున్నందున అద్వైతజ్ఞానము ప్రత్యక్షము గోచర మగుచున్నందున నద్వైతము ప్రత్యక్షము గాదని చెప్పరాదు.

ఇత్థం జ్ఞాత్వా ప్యసంతుష్టాః కేచి త్కుత ఇతీర్యతామ్
చార్వాకాదేః ప్రబుద్ధస్యా ప్యాత్మా దేహః కుతో వద.

తా॥ ఇట్లు జ్ఞానుల కద్వితీయాత్మజ్ఞానము ప్రత్యక్షమైనను కొంద రజ్ఞానులు తమబుద్ధి కీయద్వితీయాత్మస్వరూపము తెలియక

దేహామే ఆత్మ యనుచార్వాకదర్శనము మొదలగుదర్శనములను మాత్రమే నమ్మి వేద్యవిషయమును సరిగా గుర్తింపలేకపోవు చున్నారు.

సమ్యగ్విచారో నాస్త్యస్య ధీదోషా దితిచే త్తథా
అసంతుష్టాస్తు శాస్త్రార్థం న త్వైక్షంత విశేషతః.

తా॥ ఆచార్వాకాదులు చిత్తదోషముచే వేదాంతార్థవిచారణ మొనర్పక దేహామే ఆత్మ యనవచ్చును. గాని వారి కాసిద్ధాంత మందలిదోషము భాసించినచో వేదాంతశాస్త్రార్థమును విచారించెడి వారే.

యదా సర్వే ప్రముచ్యంతే కామా యేస్య హృది శ్రితాః
ఇతి శ్రౌతం ఫలం దృష్టం నేతిచే ద్దృష్టమేవ తత్.

తా॥ అద్వైతాత్మజ్ఞానఫలము దృష్టము గాదు. ఎప్పుడో వచ్చునట్టి అదృష్టమని యన్నచో "యదా సర్వే" ఇత్యాదిశ్రుతి అట్లన్నవారికి గోచరింప లేదని తెలియనగును. ఏలననగా ఆశ్రుతి ముముక్షువుయొక్క సర్వకామములు అవిద్యారూపములని నిశ్చయింపబడి విద్యచే వానిని పోగొట్టుకొన్నక్షణములోనే బ్రహ్మ మగు నని బోధించుచున్నది.

అహంకార, చిదాత్మానా వేకీకృ త్యావివేకతః
ఇదం మే స్యా దిదం మే స్యా దితీచ్ఛా కామశబ్దితాః.

తా॥ అంతఃకరణభేద మగునహంకారమును ఆత్మచైతన్యమును భిన్నములుగా గ్రహింపక ఒకటిగా భావించి "నాకీవిషయము గావలెను" ఇత్యాదిగా కోరుటయే కామము లనబడును.

అప్రివేశ్య చిదాత్మానం పృథ క్పశ్య న్నహంకృతిమ్
ఇచ్ఛంస్తు కోటివస్తూని న బాధో గ్రంథిభేదతః.

తా॥ అహంకార మనుమిథ్యావస్తువు నధిష్ఠాన మగుచిదాత్మలో నైక్య మొనర్చినవా డవిద్యాగ్రంథిభేద మొనర్చినవా డగుటచే ఎన్ని కోరినను బాధ నొందడు.

గ్రంథిభేదేపి సంభావ్యా ఇచ్ఛాః ప్రారబ్ధదోషతః.

తా॥ ఒకానొకజ్ఞానికి ప్రారబ్ధవశముచే నవిద్యాగ్రంథిభేదానంతరకాలమందుగూడ కోరిక లుండును. కాన నట్టివాని నుద్దేశించి పైశ్లోకములోని అభిప్రాయము చెప్పబడినది.

అహంకారగతేచ్ఛాభి ర్దేహవ్యాధ్యాదిభి స్తథా
వృక్షాదిజన్మనాశై ర్వా చిద్రూపాత్మని కిం భవేత్.

తా॥ అహంకారాదులకు సాక్షి యగుకూటస్థునకు దేహసంబంధము లేకపోవుటచే అహంకారగతము లగుకోరికలవలన కూటస్థున కేమి లోటుండును? అట్లే వ్యాధిచే దేహమునకు లోటుగాని ఆత్మ కేమి?

గ్రంథిభేదా త్పురాప్యేవ మితిచే త్తన్న విస్మర
అయమేవ గ్రంథిభేద స్తవ తేన కృతీ భవాన్.

తా॥ గ్రంథిభేదమనగా నిట్లాత్మను అహంకారములను వేరుగా గ్రహించుటయే. గాన గ్రంథిభేదమునకు పూర్వమందుగూడ నిట్లే తలచు నవరాదు.

నైవ జానంతి మూఢా శ్చే త్తోఽయం గ్రంథి ర్న చాపరః
గ్రంథితద్భేదమాత్రేణ వైషమ్యం మూఢబుద్ధయోః.

తా॥ ఈఅవిద్యాగ్రంథులు గలవాడే మూఢు డనబడును. ఈ అవిద్యాగ్రంథిబంధము పోయినవాడే వివేకి లేక జ్ఞాని.

ప్రవృత్తౌ వా, నివృత్తౌ వా దేహేంద్రియమనోధియామ్
న కించిదపి వైషమ్య మ స్త్యజ్ఞానివిబుద్ధయోః.

తా॥ కాన జ్ఞానియొక్కయు, మూఢునియొక్కయు దేహవ్యాపారమందు లోకదృష్టిలో భేదమేదియు భాసించదు. అనగా ఉభయులు స్నానభోజనాదుల నొనర్చుచున్నట్లు లోకమునకు భాసించును గాని జ్ఞాని కవిద్యాగ్రంథులు తొలగిపోయినందున వా డెల్లపుడు కూటస్థాత్మరూపముతో నిశ్చయముగా నుండును. ప్రారబ్ధానుసారముగ

వానిదేహముమాత్రము ప్రవర్తించును. ఆతని కీదేహప్రవృత్తియం దెంతమాత్రము నభినివేశ ముండదు. ఇక మూఢునకన్ననో కూటస్థ చిదాభాసుల నిద్దరను కలిపి ఒకటిగా వ్యవహరించుట, దేహవ్యాపారము లన్నిటియందును అభినివేశము నుండును.

ధ్యానదీపమం దిట్లుపదేశింపబడియున్నది.

బ్రహ్మసాక్షాత్కృతి స్త్వేవం విచారేణ వినా నృణామ్
ఆప్తోపదేశమాత్రేణ న సంభవతి కుత్రచిత్.

తా॥ వేదమందలికర్మకాండలోనిభాగ మాప్తు డగుగురూపదేశ మాత్రముచేతనే అనుష్ఠానము సంభవించును. గాని వేదాంతభాగము మాత్ర మట్లుగాక గురువునొద్ద శ్రవణమొనర్చినతరువాత మనననిదిధ్యాస లొనర్చినసేగాని బ్రహ్మసాక్షాత్కారము గలుగదు.

పరోక్షజ్ఞాన మశ్రద్ధా ప్రతిబధ్నాతి నేతరత్
అవిచారోఽపరోక్షస్య జ్ఞానస్య ప్రతిబంధకః.

తా॥ పరోక్షజ్ఞానముమాత్రమే గురూపదేశమువలన కలుగును. అది మననాదిరూప మగువిచారణద్వారా అపరోక్ష మగును. అపుడే బ్రహ్మభావము సిద్ధించును. గాన పరోక్షజ్ఞాన మపరోక్ష మగుటకు గలమధ్యప్రయత్నవిశేషమే విచారము. ఇది లేనిచో అవిశ్వాసము మొదలగు ప్రతిబంధములు గల్గి పరోక్షజ్ఞానముగూడ తొలగిపోవును.

విచార్యా ప్యపరోక్షేణ బ్రహ్మాత్మానం న వేత్తి చేత్
ఆపరోక్ష్యావసానత్వా ద్భూయో భూయో విచారయేత్.

తా॥ ఒకమారు విచారించినంతమాత్రముచేతనే యొకని కపరోక్షజ్ఞానము గలుగవచ్చును. ఇతరులకు పెక్కుమార్లు విచారించిన గాని గలుగదు. గాన అపరోక్షాత్మసాక్షాత్కార పర్యంతము విచారణచేయుచుండవలసినదే.

విచారయ న్నామరణం నైవాత్మానం లభేత చేత్
జన్మాంతరే లభేతైవ ప్రతిబంధక్షయే సతి.

తా॥ ఒకనికి మరణపర్యంతము విచారణచేసినను సాక్షాత్కారము గలుగకున్నను వానికి వగవ పనిలేదు. ప్రతిబంధ మెక్కువగా నున్నట్లు గ్రహించి ఇంకను విచారించవలెను. అట్లు చేయుచుండగా మరణించినను ఉత్తరజన్మలో నీవాసన లుండి త్వరలో అపరోక్షజ్ఞానము గల్గితీరును.

ఇహ వాముత్ర వా విద్యేత్యేవం సూత్రకృతోదితమ్
శ్రుణ్వంతో ప్యత్ర బహవో య న్న విద్యురితి శ్రుతిః

తా॥ ఇట్లనుటకు "ఐహికమ ప్యప్రస్తుతప్రతిబంధే తద్దర్శనాత్" అనుబ్రహ్మసూత్రమును "శ్రుణ్వంతోపి బహవో య న్నవిద్యుః" అను కఠోపనిషత్తును ప్రమాణములు.

గర్భఏవ శయాన స్స న్వామదేవోఽవబుద్ధవాన్
పూర్వాభ్య స్తవిచారేణ యద్వ దధ్యయనాదిషు.

తా॥ మరియు గర్భస్థుడయియున్న కాలమందే వామదేవు డను ఋషి కపరోక్షజ్ఞానము గల్గినట్లు శ్రుతి చెప్పుచున్నదిగాన వానికి తప్పక పూర్వజన్మలోనివిచారణ సాధనమైన ట్లవశ్య మంగీకరింపవలసియున్నది.

బహువార మధీతేపి యదా నాయాతిచే త్పునః
దినాంతరేఽనధీత్యైవ పూర్వాధీతం స్మరే త్పుమాన్.

తా॥ లోకమందు వేదాధ్యయనమొనర్చువా డొకనా డనేక పర్యాయములు వల్లించగా మరునాడు నిద్రలేవగానే వానికి పూర్తిగా విద్య వచ్చుట అనుభవసిద్ధమేగదా. అట్లే యిచటగూడ నొకజన్మలోని విచారణ మరుజన్మలోని కనుగతమగును.

కాలేన పరిపచ్యంతే కృషిగర్భాదయో యథా
తద్వ దాత్మవిచారోపి శనైః కాలేన పచ్యతే.

తా॥ కృషి గర్భము మొదలగునవి కాలక్రమముచేతనే పరిపాకావస్థ నొందుచున్నట్లే ఆత్మవిచారణగూడ కాలక్రమముచేతనే పరిపక్వమై అపరోక్షమగును.

పునఃపునర్విచారేపి త్రివిధప్రతిబంధతః
న వేత్తి తత్త్వ మిత్యేత ద్వార్త్తికే సమ్య గీరితమ్.

తా॥ మాటిమాటికి విచారించుచున్నను బ్రహ్మ మపరోక్షము గాకపోవుటకు 1 భూతకాలప్రతిబంధకము, 2 వర్తమానప్రతిబంధకము, 3 భావికాలప్రతిబంధకము— మూడుకారణము లని సురేశ్వరులచే వార్తికమందు వివరింపబడినది.

—♦ ప్రతిబంధభేదము ♦.

కుత స్తద్జ్ఞాన మితిచే త్తద్ధి బంధపరిక్షయాత్
అసావపి చ భూతో వా భావీ వా వర్తతేఽథవా
అధీతవేదవేదార్థో వ్యతఏవ న ముచ్యతే
హిరణ్యనిధిదృష్టాంతా దిదమేవ హి దర్శితమ్.

తా॥ అప్రతిబంధకములు పూర్తిగా తొలగినక్షణములోనే అపరోక్షజ్ఞానము గల్గును. భరతునకు మూడుజన్మలలో ప్రతిబంధక్షయ మాయెను. అందుచే నేలలో నిక్షేపమొనర్పబడిన హిరణ్యనిధికి పైభాగమందు సంచరించుచున్నను అచట నిధియున్నట్లు జ్ఞానములేని వారి కానిధితో నెట్టిలాభము లేనట్లు వేదార్థకోవిదులైనంతమాత్రముచే విచారణసల్పనివారు ముక్తులు కానేరరు.

—♦ భూతప్రతిబంధము ♦—

అతీతేనాపి మహిషీ స్నేహేన ప్రతిబంధతః
భిక్షు స్తత్త్వం న వేదేతి గాథా లోకే ప్రగీయతే.

తా॥ ఒకానొకసన్న్యాసి వేదాంతశ్రవణమొనర్చినను ఆకాలమందు తనపూర్వాశ్రమమందలిభార్యను స్మరించుచుండుటచే వేదాంత తత్త్వమును గ్రహింపజాలకపోయినట్లు లోకమందు కథ చెప్పబడుచున్నది. గాన భూతకాలికప్రతిబంధ మనగా నిట్టిదే.

అనుసృత్య గురు స్స్నేహం మహిష్యాం తత్త్వ ముక్తవాన్
తతో యథావ ద్వే దైష ప్రతిబంధస్య సంక్షయాత్.

తా॥ అప్పు డాతనిగురు వీసంగతిని (Psychology) గ్రహించి ఆభార్యను దానిదేహేంద్రియాదులను వర్ణించుచు వాని కధిష్ఠాన మగుఆత్మను తద్ద్వారా బోధింపగా నపు డాసన్న్యాసికి ప్రతిబంధక్షయ మయి వేదాంతతత్త్వము బోధపడెను

—♦ వర్తమానప్రతిబంధము ♦—

ప్రతిబంధో వర్తమానో విషయాసక్తిలక్షణః
ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయదురాగ్రహః

తా॥ వర్తమానప్రతిబంధమనగా విషయము లగుశబ్దస్పర్శా దులం దాసక్తియు బుద్ధిమాంద్యమును శుష్కతర్కమును కుశంక లును గురువు చెప్పినదానిని విపరీతముగా గ్రహించుటయును.

శమాద్యైశ్శ్రవణాద్యైశ్చ తత్ర తత్రోచితైః క్షయమ్
నీతేస్మిన్ప్రతిబంధేఽత స్స్వస్య బ్రహ్మత్వ మశ్నుతే.

తా॥ శమదమాదులచేతను శ్రవణమననాదులచేతను ఆవర్త మానప్రతిబంధము తొలగగా బ్రహ్మభావము నొందును.

—♦ ఆగామిప్రతిబంధము ♦—

ఆగామిప్రతిబంధశ్చ వామదేవే సమీరితః
ఏకేన జన్మనా క్షీణో భరతస్య త్రిజన్మభిః.

తా॥ ఒకజన్మచే వామదేవుడును మూడుజన్మలచే భరతుడును ముక్తులైనట్లు తెలుపు కథలవలన ఆగామిప్రతిబంధమునుగ్రహించునది.

యోగభ్రష్టస్య గీతాయా మతీతే బహుజన్మని
ప్రతిబంధక్షయః ప్రోక్తో న విచారో ప్యనర్థకః.

తా॥ ఇట్లపరోక్షజ్ఞానోదయపర్యంతము విచారణసల్పనివాడే యోగభ్రష్టుడని భగవద్గీతలో చెప్పబడినది. వాని కెన్ని జన్మలలోనైన నీపరోక్షజ్ఞాన మనువృత్తమై విచారణచేయగా ప్రతిబంధము పోగా జ్ఞాని యగును.

బ్రహ్మలోకాభివాంఛాయాం సమ్యక్సత్యాం నిరుధ్యతామ్
విచారయే ద్య ఆత్మానం నతు సాక్షాత్కరో త్యయమ్.

తా॥ లేక అట్టివానికి కార్యబ్రహ్మలోకము లేక సత్యలోక ప్రాప్తికొరకు కోరిక గలుగగా, దానిని నిరోధించి ఆత్మవిచారణ చేయువాడు, అపరోక్షజ్ఞానము నొందలేడు. ఇదిగూడ మరియొక ఆగామిప్రతిబంధము.

వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా ఇతిశాస్త్రాత్ః
బ్రహ్మలోకే సకల్పాంతే బ్రహ్మణాసహ ముచ్యతే.

తా॥ కాని యట్టివారు బ్రహ్మలోకమును పొంది అచట విచారణ సల్పి ఆబ్రహ్మమానముచే నూరుసంవత్సరములతరువాత ఆబ్రహ్మతోగూడ ముక్తు లగుదురు.

దేహాభిమానం విధ్వస్య ధ్యానా దాత్మాన మద్వయమ్
పశ్య న్మర్త్యోఽమృతో భూత్వా హ్యత్ర బ్రహ్మ సమశ్నుతే.

తా॥ మరణించుస్వభావము గలదేహమందు నేను అనునభిమానమును వదలి ధ్యాన నిదిధ్యాసాదులచే తననిజరూప మగుకూటస్థ బ్రహ్మమును గుర్తించినవాడు తప్పక ఇచటనే బ్రహ్మభావమునొందును.

ప్రారబ్ధకర్మప్రాబల్యా ద్భోగే ష్విచ్ఛా భవే ద్యది
క్లిశ్య న్నేవ తదా ప్యేష భుంక్తే విష్టిగృహీతవత్.

తా॥ అట్టిజ్ఞానికి ప్రారబ్ధకర్మయొక్క ప్రాబల్యముచే ప్రాపంచిక భోగములం దిచ్ఛ గల్గినను వాని ననుభవించునపు డెంతమాత్రము ప్రీతిగాని అభినివేశముగాని ఉండదు.

వివేకే జాగ్రతి సతి దోషదర్శనలక్షణే
కథ మారబ్ధకర్మాపి భోగేచ్ఛాం జనయిష్యతి.

తా॥ జ్ఞానికి వివేకముగల్గి కూటస్థుని దేహాదికమును వేరు వేరుగా గ్రహించుచు, తాను కూటస్థాత్మరూపుడ ననునిశ్చయజ్ఞాన ముండినపుడు ప్రారబ్ధవశముచే ప్రాపంచికభోగములం దిచ్ఛ ఎట్లు గల్గును?

—• ప్రారబ్ధభేదము •—

నైష దోషో యతోఽనేకవిధం ప్రారబ్ధ మీాఢ్యతే
ఇచ్ఛానిచ్ఛాపరేచ్ఛా చ ప్రారబ్ధం త్రివిధం స్మృతమ్.

తా॥ ఇందుకు సమాధానమును వినుము. ప్రారబ్ధము మూడు విధములు 1 ఇచ్ఛాప్రారబ్ధము, 2 అనిచ్ఛాప్రారబ్ధము, 3 పరేచ్ఛా ప్రారబ్ధము. అనగా ఇచ్ఛచే భోగప్రద మగుప్రారబ్ధము, అనిచ్ఛచే భోగప్రద మగుప్రారబ్ధము. పరేచ్ఛచే భోగప్రద మగుప్రారబ్ధము అని మూడువిధములు.

—• ఇచ్ఛాప్రారబ్ధము •—

అపథ్యసేవిన శ్చోరా రాజదారరతా అపి
జానంత ఏవ స్వానర్థ మిచ్ఛం త్యారబ్ధకర్మతః.

తా॥ అందు ఇచ్ఛామాత్రభోగప్రద మగుప్రారబ్ధకర్మ మెట్టిదో ఉదాహరణపూర్వకముగా ప్రదర్శింపబడుచున్నది. రాజభార్యయం దాసక్తి అపథ్యసేవ దొంగతనము వీనియం దిచ్ఛ గల్గుట యనునది, మహాదోష మనియు తనకు హాని సంభవించుననియు రాజుకు తెలిసినపుడు తనకు నాశము గల్గుననియు పూర్తిగా తెలిసియే అట్టి దుష్కార్యమందు ప్రవర్తించవలయునను నిచ్ఛ యుదయించుట ఇచ్ఛాప్రారబ్ధ మనబడును. ఇది యిచ్ఛను కల్గించుట మాత్రముతోనే నివృత్తి అగుచున్నది.

నచాత్ర్రైత ద్వారయితు మీాశ్వరేణాపి శక్యతే
యత ఈశ్వర ఏవాహ గీతాయా మర్జునం ప్రతి
సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి.

తా॥ ప్రారబ్ధమును నివారించుటకు ఈశ్వరునకుగూడ సాధ్యము గాదు. ఆ ఈశ్వరుడే గీతలందు "ప్రతివాడును జ్ఞానియైనను తనపూర్వజన్మకర్మఫలరూప మగుప్రకృతి కనువుగా ప్రవర్తించునుగాన నేను తన్నిరోధమును చేయజాల"నని చెప్పెను.

అవశ్యంభావిభావానాం ప్రతీకారో భవేద్యది
తదా దుఃఖై ర్న లిప్యేర న్నలరామయుధిష్ఠిరాః
నచేశ్వరత్వ మీశస్య హీయతే తావతా యతః
అవశ్యంభావితా ప్యేషా మీశ్వరేణైవ నిర్మితా.

తా॥ పూర్వజన్మలం దొనర్పబడి ఫలమిచ్చుటకు సిద్ధపడియున్న ప్రారబ్ధమునకు ప్రతీకారమేయున్నచో పురాణకథలందలిమహాపురుషులగు నలుడు, రాముడు, యుధిష్ఠిరుడు మొదలగువా రట్టిదుఃఖముల నొందకుండెడివారే- ఇంతమాత్రముచే ఈశ్వరుని సామర్థ్యము తొలగ లేదు. ఆ ఈశ్వరుడే ప్రారబ్ధముల కనివార్యత్వమును అవశ్యానుభవనీయతను బోధించెను.

## —♦ అనిచ్ఛాప్రారబ్ధము ♦—

ప్రశ్నోత్తరాభ్యామే వైత ద్గమ్యతేఽర్జునకృష్ణయోః
అనిచ్ఛాపూర్వకం చాస్తి ప్రారబ్ధమితి తచ్ఛృణు.

తా॥ ఇక రెండవదగు పరేచ్ఛాప్రారబ్ధము భగవద్గీతయందు కృష్ణార్జునసంవాదరూపముగ నిట్లు ప్రదర్శింపబడియున్నది.

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః
కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్
స్వభావజేన కౌంతేయ! నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి య న్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్.

తా॥ "పురుషుని యిచ్ఛలేకయే ఒకానొకశక్తిచే ప్రేరితుడై పాపకార్య మొనర్చుట లోకములో కనుపించుచున్నది. ఆప్రేరకశక్తి యెద్ది" అని అర్జునుడు ప్రశ్నింపగా కృష్ణు డిట్లు సమాధానమును చెప్పెను. ప్రతిజీవునియొక్క పూర్వజన్మకర్మఫలము ఈజన్మారంభకమగు "స్వభావ" మనబడుచు, కామక్రోధాదిరజోగుణధర్మరూపముగా నుండి, పురుషుని ప్రేరేపించును.

—♦ ప రే చ్ఛా ప్రా ర బ్ధ ము ♦—

నానిచ్ఛంతో న చేచ్ఛంతః పరదాక్షిణ్యసంయుతాః
సుఖదుఃఖే భజంత్యేత త్పరేచ్ఛాపూర్వకర్మహి.

తా॥ ఇక మూడవ దగుపరేచ్ఛాప్రారబ్ధస్వరూపము వివరింప బడుచున్నది. కొందరు కొన్నిపనులం దిచ్ఛ యుండియు ఇచ్ఛలేకయు గాక కేవలము పరులయందలిదాక్షిణ్యముచే పరప్రీతికొరకుమాత్రమే సుఖదుఃఖముల ననుభవింతురు ఇదియే పరేచ్ఛాప్రారబ్ధకర్మ మనబడును.

కథం తర్హి కి మిచ్ఛ న్నిత్యేవ మిచ్ఛా నిషిధ్యతే
నేచ్ఛానిషేధః కిం త్విచ్ఛాబాధో భర్జితబీజవత్.

తా॥ అట్లైనచో "కిమిచ్ఛ న్కస్య కామాయ శరీర మను సంజ్వరేత్" అనుశ్రుతి ఇచ్ఛాభావము నెట్లుబోధించుచున్నది? ఆ శ్రుతితో నీవిషయము విరోధించు ననునాశంక గలుగవచ్చును. కాని ఆశ్రుతికి అర్థమేమనగా కిమిచ్ఛన్ అనగా ఇచ్ఛాభావ మర్థము గాదు. ఇచ్ఛయున్నను తత్సమర్థమగుప్రవృత్తిని పుట్టింపదని అర్థము. వేగించిన ధాన్య మెట్లు మొలకలెత్తుయోగ్యత లేక మిగిలినధాన్యోపభోగ్యత అనగా భక్ష్యయోగ్యత గల్గియుండునో అట్లే ఈపరేచ్ఛాప్రారబ్ధము గూడ కార్యకారి గాక యుండును. అనగా వ్యసనాదికము నొనర్పదని భావము.

—♦.

# ప్రశ్నోత్తరశతి

## [ సర్వ సందేహ సమాధాయకము ]

ప్రశ్నము- ఆత్మకు గల యవస్థ లెన్ని ? అవి యేవి ?
సమాధానము- ఆత్మ కేడవస్థలు గలవు. అవి యెవ్వియన

అజ్ఞానావృతివిక్షేప ద్వివిధజ్ఞానవృత్తయః
శోకాపగమ ఇత్యేతే యోజనీయా శ్చిదాత్మని.

తా॥ 1 అజ్ఞానము 2 ఆవరణము 3 విక్షేపము 4 పరోక్ష జ్ఞానము 5 అపరోక్షజ్ఞానము 6 దుఃఖనివృత్తి 7 తృప్తి అనునవి.

సంసారాసక్తచిత్తస్సం శ్చిదాభాసః కదాచన
స్వయంప్రకాశకూటస్థం స్వతత్త్వం నైవ వేత్త్యయమ్.

1 తా॥ చిదాభాసు డగుజీవుడు సంసారమం దాసక్తి గలచిత్తము గలవాడై స్వప్రకాశ మగుకూటస్థాత్మతత్వమును గుర్తింపనిస్థితియే అజ్ఞాన మనెడిప్రథమావస్థ.

న భాతి నాస్తి కూటస్థ ఇతి వ_ ప్రసంగతః

2 తా॥ కూటస్థాత్మప్రసంగమును సత్పురుషు లొనర్చునపుడు కూటస్థుడు లేడనియు భాసించుట లేదనియు చెప్పుటయే, ఆవరణ మనెడిద్వితీయావస్థ

కర్తా భోక్తాహ మస్మీతి విక్షేపం ప్రతిపద్యతే.

3 తా॥ నేను కర్తను ఈపని నొనర్చుచున్నాను. ఈఫలము ననుభవించుభోక్తను అనితలచుచు బుద్ధియందు గలకర్తృత్వాదులను కూటస్థాత్మయం దారోపించుటయే విక్షేప మనుతృతీయావస్థ.

అ సి కూటస్థ ఇత్యాదౌ పరోక్షం వేత్తి వార్తయా.

4 తా॥ కూటస్థ మగుఆత్మ గలదని గురుశాస్త్రమూలమున గ్రహించుటయే పరోక్షజ్ఞాన మనుచతుర్థావస్థ.

పశ్చాత్కూటస్థ ఏవాస్మీ త్యేవం వేత్తి విచారతః.

5 తా॥అనంతరము వేదాంతవాక్యమననరూపవిచారణవలన తానే కూటస్థాత్మ యనునిశ్చయము నొందుటయే అపరోక్షజ్ఞాన మనబడు పంచమావస్థ.

కర్తా భోక్తే త్యేవమాదిశోకజాతం ప్రముంచతి.

6 తా॥ అనంతరము నేను కర్తనుగాను భోక్తనుగాను ఇత్యాది కర్తృత్వాదిజన్యము లగుదుఃఖాదులను వదలిపెట్టుటయే దుఃఖనివృత్తి యనబడు షష్ఠావస్థ.

కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్త మిత్యేవ తుష్యతి.

7 తా॥ నేను బ్రహ్మవేత్త నగుటకు చేయదగినదంతయు చేసితిని, ఇక నాకు చేయదగిన దేమియు లేదు. నేనే బ్రహ్మమైతిని. సర్వవ్యాపకుడను ఆనందరూపుడను అని తలచుటయే తృప్తి యనబడును పమావస్థ.

8 ప్రశ్నము - పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనెడిపంచభూతములును వానివలన నేర్పడిన మనుష్యపశుపక్ష్యాదిజగ మంతయు కనుపించుచుండగా ఒక్క బ్రహ్మమాత్రమే యున్నదనుట ఎట్లు ?

సమాధానము - గారడీవానిమాయయందు వానిచే ప్రదర్శింపబడుపదార్థము లెట్టివో రజ్జువునందు సర్పము భాసించుట యెట్లో చవిటినేలయం దెండమావు లుదకమువలె భాసించుట యెట్లో అట్లే సత్య, జ్ఞాన, ఆనందరూప మగు అద్వితీయవస్తువునం దీ ఆకాశాదిభూతములును మనుష్యాదులును భాసించుచున్నారు.

9 ప్ర- ప్రతిపురుషుడును సుఖమం దాసక్తిగల్గి, ఆసుఖము సిద్ధించుటకొరకెన్నికష్టములైన ననుభవించుచు ప్రయత్నము లొనర్చుచున్నాడు, ఇది ఎట్లు మిథ్య యగును ?

స- ఆత్మకు సుఖముగాని దుఃఖముగాని లేవు. దేహము స్వభావముచే జడమైనది. గాన సుఖదుఃఖములుగాని అందుల కనువగుప్రయత్నము లగుకర్మలుగాని ఈస్థూలదేహమునకు చెందినవిగావు. సూక్ష్మదేహ మనబడులింగదేహ మొకటి గలదు. దానివే ఈసుఖదుఃఖాదులును ప్రయత్నము లగుకర్మలును.

10 ప్ర- బ్రహ్మాదిదేవతలు, ఇంద్రాదిలోకపాలకులు వీరలను శాస్త్రము బోధించినది. వారల నారాధించువారలకు మంచిసుఖము గల్గునని బోధింపబడియుండెగదా. ఇది ఎట్లు మిథ్య యగును ?

స- ప్రపంచములోనిప్రతివస్తువును ఒకఘటాదినామము ఒకరూపముమాత్రమే- ఇవి రెండును కల్పితములు, ఉపాదానకారణ

మగుమట్టికిని తత్కార్యము లగుఘటశరావాదులకును నామరూపములే భేదము. ఆనామరూపములు రెండును కల్పితములుగాన తీసివేయగా మిగులునది కారణ మగుమట్టియే. అట్లే బ్రహ్మ మను కారణమందు నామరూపాత్మక మగుబ్రహ్మేంద్రాదిజగ మంతయు కల్పింపబడినకార్యము. గాన అదంతయు కారణ మగుబ్రహ్మమే గాని అంతకంటె వేరుగా నెద్దియు లేదు.

11 ప్ర- స్థూలదేహముగాక మఱియొకసూక్ష్మదేహము గలదనియు. అదియే సుఖదుఃఖాదికర్మల నాచరించునని దానివలనిఫలము ననుభవించుననియు చెప్పెదరు. అది యెట్లు కుదురును ?

స- స్థూలదేహము స్వప్నదశలో పనిచేయుట లేదు. సూక్ష్మదేహము సుషుప్తిదశలో పనిచేయుట లేదు. గాన నివి రెండును ఒకానొకకారణమందు లీనము లగుచున్నట్లు గ్రహింపవలయును.

12 ప్ర- సర్వము బ్రహ్మమనియు, అది నిస్సంగమనియు చెప్పెదరు. ప్రతిజీవుడును ఆయావిషయములందు సంగతుడగుట యెట్లు కుదురును ?

స- కుండలోనియుదకమందు ప్రతిఫలించిన ఆకాశ మెట్లానీటి నంటకయుండునో అట్లే ఆత్మ ప్రతిదేహమందును ఉండిగూడ దాని నంటక యుండును.

13 ప్ర- సర్వము బ్రహ్మమని అతడు గుణరహితుడని చెప్పెదరు. ప్రతివాడును గుణసహితుడుగా కనుపించుటకు కారణ మేమి ?

స- గుణములన్నియు మాయాకార్యములు- ఆమాయ యథార్థమైనది గాదు. కార్యమాత్రగమ్య మైనది. బ్రహ్మముకంటె వేరుగానిశక్తిరూపము. అదియే గుణముల నన్నిటిని చేయుచుండును. బ్రహ్మవిష్ణురుద్రాదు లందరును ఈమాయాజనితులే. మాయాకార్యమే నామరూపాత్మక మగుజగత్తు.

14 ప్ర- అద్వైత మనగా రెండవవస్తువు లేకపోవుట యనునర్థ మగుచో మాయ ఉన్నదని చెప్పిన ఆమాట ఎట్లు కుదురును ? మాయ యనురెండవవస్తు వున్నట్లేగదా.

స- ఈమాయ ఒకపదార్థము గాదు. అగ్నికిని ఉష్ణశక్తికిని భేదము లేనట్లుగా, రవికి ప్రభకు భేదము లేనట్లుగా, నీటికి ద్రవత్వ శక్తికి భేదము లేనట్లుగా ఈశ్వరునకు నీమాయకు భేదము లేదు. రశకి యే మాయ యనబడును.

15 ప్ర- అఖండసచ్చిదానంద, సర్వపరిపూర్ణ, స్వయంప్రకాశపర బ్రహ్మ మగుఆత్మను అంధకారమువంటి అవిద్యాశక్తి ఆవరించుకొని ఉన్న దని చెప్పినయెడల దీపప్రకాశమునం దంధకార మున్న దనుటవలె విరోధము కావున నట్లు చెప్పగూడదు అందుకని అవిద్య లేదందుమా దానికార్యము లగువిక్షేపావరణశక్తులు ప్రపంచమును దృశ్యముగను మరచునట్లుగను చేయుచున్నవి. అవిద్యయే లేనిచో గురుశాస్త్రము లనర్థములే యగును. మోక్షమునకు గురుమూలక వేదాంతశ్రవణాదులే సాధనమని శాస్త్రము ఘంటాపథముగ చెప్పుచున్నది. కావున అవిద్య యొక్క- స్వరూపస్వభావాదికము దానిఉనికి గురుశాస్త్రములసార్థక్యము ఎట్లు ?

స- కట్టెలం దగ్ని గూఢముగా నున్న ట్లజ్ఞానదశలో బ్రహ్మాత్మయం దవిద్య నిగూఢముగ నున్నది అది విక్షేపఆవరణ శక్తులద్వారా అభివ్యక్త మగును. కట్టెతో మరియొకకట్టెను మథించగా ఏర్పడినయగ్ని ఆరెంటిని కాల్చి భస్మమొనర్పగలిగినట్లు గురుపూర్వక వేదాంతవాక్యశ్రవణమననాదులచే కలిగినతత్త్వజ్ఞాన మవిద్యను సమూలముగా భస్మమొనర్పగల్గును. అందుచే నవిద్య యనునది అనిర్వచనీయమై అగ్నియందలిదాహకశక్తి అగ్నికంటె వేరుగానట్లు ఈశ్వరునికంటె భిన్నము గాదు.

16 ప్ర- వేదాంతశాస్త్రమందు బ్రహ్మాత్మకును అవిద్యకును గల సంబంధము నిద్రావస్థలోనిబాహ్య మగుఅంధకారమునకును అంతర మగుఆత్మజ్యోతికిని గలసంబంధముతో పోల్చబడినట్లు వింటిని. అట్లా రెంటికి విరోధమే లేనియెడల అవిద్య నశించినగాని ముక్తిలభించదనుట యెటు కుదురును ?

స- బ్రహ్మాత్మయే అంతఃకరణమందు ప్రతిబింబించి,అవిద్యావశ ముచే తానే జీవుడనని జననమరణాది సంసారధర్మము నొందుచున్నా ననియు భ్రమజెంది, మోక్షమును గోరి, ఆత్మానాత్మవిచారణ జేసి, ఆత్మ యాథార్థ్యజ్ఞానముచే జీవత్వభ్రాంతిని పోగొట్టుకొని, శరీరత్రియ మే తాను గాననియు, ఆదేహాదులకు సాక్షిమాత్రుడనే తాననియు నిశ్చయించుటయే అవిద్యానివృత్తి యనబడును. ఇదియే మోక్ష మగును.

17 ప్ర- సకలప్రపంచమును మిథ్య యగుచో వేదములుగూడ మిథ్యయేగదా. అట్టి అసత్యమైన వేదములవలన సత్యమగు మోక్ష మెట్లు గల్గును ?

స- స్వప్నమందు చూడబడిన వ్యాఘ్రము మిథ్యయైనను నిద్రా భంగరూపమగు సత్యఫలమును గలుగజేయుచున్నది. అట్లే వేదముల వలన గల్గినజ్ఞానము అవిద్యను నశింపజేయుచున్నది. అనగా అదివరలో తాను పరిచ్ఛిన్నమగు దేహమందుండి జననాదిధర్మముల నొందు చున్నానను భ్రాంతిలోనుండి వేదమందలి బోధవలన, తానే బ్రహ్మము బ్రహ్మమే తాననెడి అద్వైతజ్ఞానము గల్గుచున్నది. ఆప్రకారము జ్ఞానా నంతరమందు సకలప్రపంచముతోబాటు వేదములుగూడ మిథ్యయే యగుచున్నవి.

18 ప్ర- అంతఃకరణ సంబంధమగు విచారణాజ్ఞానము అవిద్యను నశింపజేయుట ప్రత్యక్షవిరోధముగా నున్నది. నూలే వస్త్రమైనట్లు కారణమగు అవిద్యయే అంతఃకరణమైనందున, ఆ అంతఃకరణతో చేయువేదాంతవిచారణగూడ అవిద్యాకార్యమే యగునుగదా. దాని వలన అజ్ఞాన మెట్లు నశించును ?

స- ఇనుము సంబంధమగుఉక్కు ఆయినుమును ఖండించునట్లు అవిద్యను అవిద్యాకార్యమగు వేదాంతవిచారణ ఖండించును.

19 ప్ర- సమాధియందును, నిద్రావస్థయందును, చక్షురాదీంద్రి యములయొక్కవృత్తిజ్ఞానమును, వేదాంతవిచారణాజ్ఞానమును, భాసిం

పక ఒకానొక కారణమందు లీన మగుచున్నవి. సమాధిలో దేహము నిలబడుచున్నది. నిద్రావస్థలో నిలబడుట లేదు. ఇందులకు కారణ మేమి ?

స- సమాధికాలమందు చిత్తవృత్తులన్నియు జ్ఞానమందు లీన మగును. నిద్రావస్థలో చిత్తవృత్తులన్నియు అజ్ఞానమందు లీనమగును. కావున సమాధిలో దేహము నిలబడుచున్నది. నిద్రావస్థలో నిల బడుట లేదు.

20 ప్ర- దేహేంద్రియాది 24 పదార్థములును జడములు. 25 వ పదార్థమగు జీవుడు రజ్జువునందు భాసించు సర్పమువలె మిథ్యారూపు డంటిరి. ఆత్మ నిర్వికారసాక్షిమాత్రు డంటిరి. అయినచో కామ క్రోధాదు లెవరికి కలుగుచున్నవి ?

స- అవిద్యయే కామక్రోధాది రూపముగా పరిణామము నొందుచున్నది. జీవునకు వానిఫలము గలుగుచున్నది.

21 ప్ర- మోక్షదశయందు జీవుడు నశించుటచే జీవించియుండు మనుష్యుడు తనచావుకొరకు మందును ఎట్లు పుచ్చుకొనును ?

స- అవిద్యచే కల్పితమగు జీవభావము పోయి తానే బ్రహ్మ మను నిశ్చయజ్ఞానము గల్గుటయే మోక్షము. దేహ ముండగనే అట్టి నిశ్చయ జ్ఞానము గలుగవలెను. వాడే జీవన్ముక్తు డనబడును. వాని కీదేహపతనానంతరమందు "విదేహముక్తి" లభించును. మనుష్యుడు తన చావుకొరకు మందు పుచ్చుకొనుచో, అట్టివాడు అనేక జన్మల వరకు పశుపక్ష్యాది తిర్యగ్యోనులందే తిరిగి జన్మల నొందుచుండునే గాని వానికి మోక్ష మెంతమాత్రము రాకపోగా తిరిగి వివేకము గల మనుష్యజన్మగూడ రానేరదు.

22 ప్ర- దేహాది ప్రపంచము మిథ్యయనుట ఎట్లు ?

స- నాశము లేక సర్వకాల సర్వావస్థలందును ఉండునది "సద్వస్తు" వనబడును. ఆత్మ జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడి అవస్థలు మూటియందును బాల్య, కౌమార, యౌవన, వార్ధకాద్యవస

లందును ఏకరీతిగా నున్నందున సద్వస్తు వనబడును. దేహాదికము జాగ్రద్దశలో భాసించి సుషుప్తిలో భాసించుట లేదు. గాన మిథ్య యనబడును.

23 ప్ర- మోక్షము నొందువా డెవరు ?

స- అదివరకు దేహమాత్ర పరిచ్ఛిన్నుడ ననుతలంపుతో నుండి జననాది సంసారధర్మము నొందు జీవుడే, విద్యావివేకముచే తానే సర్వవ్యాపకుడగు సచ్చిదానంద బ్రహ్మమునని నిశ్చయించును. ఇట్లు నిశ్చయించుటయే మోక్ష మనబడునుగాని వేరే ఒకస్థానమును పొందుట మోక్ష మనబడదు.

24 ప్ర- దేహ మున్నంతవరకు అద్వైతభావ మెట్లుగలుగును ?

స- పామరునకు కలుగదుగాని విద్వాంసునకు దేహాదిజగమంతయు మిథ్యయనియు తానే సర్వవ్యాపక మగుసచ్చిదానంద బ్రహ్మమనియు, నిశ్చయముతో నుండును గాన వానికి అద్వైతభావమే గలుగును. ఇదియే జీవన్ముక్త్యవస్థ యనబడును.

25 ప్ర- శుక్తికిని రజతమునకును తెలుపు మొదలగు సాధారణ ధర్మము లుండుటచే ఒకవస్తువునందు రెండవ వస్తువుయొక్క భ్రాంతి కలుగవచ్చును. బ్రహ్మము, సత్య, జ్ఞాన, ఆనంద, అనంతరూపమును జగత్తు అసత్య, జడ, దుఃఖ, పరిచ్ఛిన్నరూపమును అయినందున ఇట్టి బ్రహ్మమందు జగద్భ్రాంతి ఎట్లు గల్గును ?

స- లోకమందలి మనుష్యపశుపక్ష్యాదు లందరును ఈ భ్రాంతితో వ్యవహరించుచున్నారు. గాన వీరి వ్యవహారమును ప్రత్యక్ష ప్రమాణమే. ఇందుకు నిదర్శనము. అనేకజన్మలనుంచి సర్వులును స్వభావముచేతనే ఇట్టి భ్రాంతితోనుండి వ్యవహరించుచున్నారు. ఉన్న వ్యవహారములోని భ్రాంతికి ప్రతీకారోపాయమును శాస్త్రముపదేశించుచున్నదేగాని భ్రాంతికి కారణమును గాని భ్రాంతియొక్క ప్రారంభకాలమునుగాని శాస్త్రము చెప్పలేదు.

26 ప్ర- జీవుడనుకర్త, ఎరుగుట యనుక్రియ, మనస్సు ఇంద్రియ ములనుసాధనములు- ఈమూటిచేత ప్రతివిషయము తెలియబడును. బ్రహ్మముగూడ అట్లు తెలియబడుచో, మిగిలిన తెలియబడు వస్తువుల వంటిదే యగును. ఆవస్తువులన్నియు సత్యమగుచో బ్రహ్మముగూడ సత్య మగును. అవి అసత్యములగుచో బ్రహ్మముగూడ అసత్యమగును. లేక బ్రహ్మమట్లు పైమూడుసాధనములచే తెలియబడదందుమా కుందేటి కొమ్ములవలె లేనివస్తు వగునుగదా! ఇందులకు సమాధాన మేమి?

స- బ్రహ్మాత్మ ప్రతిమనోవ్యాపారమునకును ప్రతీంద్రియ వృత్తికిని సాక్షిగానున్నది. లేనిచో జడములగు ఇంద్రియమనస్సులు ఎట్లు ప్రవర్తింపగలవు? ఈఆత్మ జ్ఞానరూపమే గాన తన్ను తానెరుగుటకు ఇతరసహాయమక్కరలేదు. అట్టి జ్ఞానరూప మగుఆత్మసత్తామాత్ర ముచేతనే చక్షురాదీంద్రియములుగాని, మనస్సుగాని, జీవుడుగాని, తమతమ వ్యాపారముల నొనర్చుచున్నవి. ఆత్మ సత్త లేనికాలమందు దేహములు జడములై యుండుట లోకసిద్ధము. గాన ఆత్మ నెరుగుటకు మరియొక సాధనాపేక్ష లేదు. కావుననే దేహేంద్రియాదు లీయాత్మ యందు కల్పితము లనబడుచున్నవి.

27 ప్ర- మాయ స్వతంత్రమా? లేక పరతంత్రమా?

స- నిర్వికార మగుపరబ్రహ్మమును జీవుడు, ఈశ్వరుడు, జగత్తు అను మూడువిధములుగా దోచునట్లు చేయునదియే మాయ యన బడును. అది స్వయముగానుండి నిత్య మగుపరబ్రహ్మముకంటె విలక్ష ణముగా అనిత్యముగా నుండి స్వతస్సిద్ధముగా జడమైనదైనను బ్రహ్మ సన్నిధానమాత్రముచేత చేతనవంత మైనదానివలె పనిచేయుటచే పరతంత్రమనియే చెప్పబడును.

28 ప్ర- జగత్తు బ్రహ్మముకంటె భిన్నమైనదా? అభిన్నమైనదా?

స- పామరజనులయొక్క దృష్టిలో జగత్తు బ్రహ్మముకంటె భిన్నమైనది. విద్వద్దృష్టిలో బ్రహ్మమే జగత్తు, జగత్తే బ్రహ్మము.

29 ప్ర- బ్రహ్మ మెందుచే మాయ కాధారముగా నున్నది ?

స- బ్రహ్మము సద్రూపము-మాయ అసద్రూపము. అందుచే మాయ కార్య మొనర్చుటకు సదాధారము నొంది తీరవలసియున్నది.

30 ప్ర- మాయను చూచుచుండగా బ్రహ్మము గోచరించుట లేదు. బ్రహ్మమును చూచునపుడు మాయ గోచరమగుట లేదని నేను గ్రహించితిని. ఇందుకు కారణ మేమి ?

స-కొయ్యతోగాని లక్కతోగాని చేయబడిన ఏనుగును చూచి నిజముగా ఏనుగని భ్రమించినవారికి కొయ్యగాని లక్కగాని గోచరింపదు. విచారించి చూచినవారికి కొయ్యగాని లక్కగాని గోచరించిన కాలములో నిజమగు ఏనుగు గోచరింపదు. అట్లే జగత్తు కధిష్ఠాన మగుబ్రహ్మము గోచరించినవారలకు మాయాకార్య మగు జగత్తు గోచరింపదు. మాయాకార్య మగుజగతు గోచరించువారలకు అధిష్ఠాన మగుబ్రహ్మము గోచరింపదు.

31 ప్ర- మాయను వంధ్యాపుత్రునివలె లేనిదానినిగా గాని మిథ్యగాగాని, జడముగాగాని, ఏల చెప్పుదురు ?

స- జ్ఞానరూపమగు బ్రహ్మముకంటె వేరుగా నుండుటచే జడమనియు, బ్రహ్మవేత్తల దృష్టిలో అసత్యమగుటచే వంధ్యాపుత్రునివలె లేనిదనియు ఇదమిత్థమని నిరూపింప నలవికాని దగుటచే తను ఒక కాలములోను ఒకవ్యక్తికిని కనుపించి ఇంకొక కాలములోను ఇంకొక వ్యక్తికిని కనుపించక పోవుటచేత మిథ్యయు ననబడుచున్నది.

32 ప్ర- 1 మాయ 2 జగత్తు 3 చిచ్ఛక్తి 4 బ్రహ్మము, అనునీ నాల్గింటిని వేరువేరుగా గుర్తించు టెట్లు ?

స- నామరూపములను, తోపింపజేయునది మాయ. నామరూపాత్మక మగు ప్రపంచమే జగత్తు. సూర్యకిరణములే మరుభూమియందు (చవిటిపఱ్ఱ) ఉదకమువలె స్ఫురించును. ఈసూర్యకిరణమే బహిర్ముఖమున మిథ్యగా నుండుజలముగాను, అంతర్ముఖమున ప్రత్యక్షముగా దోచు ఎండమావులుగాను భాసించునట్లు స్వయం

జ్యోతిస్స్వభావక మగు బ్రహ్మమే, అంతర్ముఖమున చిచ్ఛక్తిగాను బహిర్ముఖమున మాయాశక్తిగాను దోచును. ఆచిచ్ఛక్తివలననే గ్రుడ్డు లోపలనుండు పక్షిపిల్లలు నానావిధచిత్రవర్ణములతో పుట్టుచున్నవి. ఆచిచ్ఛక్తి లేనియెడల రాజులేని దేశమువలెనగును. అగ్ని జలమువలె చల్లగాను, చేదువస్తువు తియ్యగాను, సముద్రోదకము మన్నుగాను, ఈతీరుగా జగమంతయు భిన్నస్వభావకముగా తారుమారగును. ఎట్టి నామక్రియాదికమును లేక ఎల్లపుడు ఏకరీతిగా నాశరహితమై యుండు నదే పరబ్రహ్మము.

33 ప్ర- రజ్జువునందు సర్పము భ్రాంతిచే స్ఫురించుటకు తత్పూర్వ కాలికసర్పస్వరూప స్వభావాది పరిజ్ఞాన మవశ్య ముండితీరవలయును. అట్లే సర్వజగదధిష్ఠాన మగుబ్రహ్మమందు జగత్తు భ్రాంతిచే స్ఫురించుటకును, తత్పూర్వకాలికజగత్స్వరూపస్వభావాదిపరిజ్ఞాన ముండి తీరవలయునుగదా. అట్లైనచో జగన్మిథ్యాత్వ మెట్లు ?

స- ఈలోకమందలి వెండి, సర్పము మొదలగు అనుభవములో నుండు పదార్థములచే శుక్తియందు వెండిభ్రాంతి, రజ్జువునందు సర్ప భ్రాంతి గలినట్లు బ్రహ్మమందు జగద్భ్రాంతి కలుగలేదు. ఇంతకు విలక్షణముగా కలిగినది. ఎట్లనగా గంధర్వపట్టణ మసత్యము. దానిలో నుండు సర్వము లసత్యములు. అట్లసత్యములుగా నుండియు గంధర్వ నగరమనియు, సర్పములనియు, లోకమందరు చెప్పుకొనుట అనుభవసిద్ధ మైయున్నది. అట్టివే మిథ్య యనబడును. అట్టి మిథ్యాసర్పమువలె బ్రహ్మమందు వివర్తముగా ప్రపంచము తోచుచున్నది. కాన ప్రపంచము అనాది యనబడును. అనగా ఎపుడు పుట్టినదో ఎవరును చెప్పలే రని యభిప్రాయము. కాని ఈప్రపంచమునకు అంతము గలదనియు, అంతమొందించు నుపాయమును వేద ముపదేశించినది. మరియు పిత్త రోగికి బెల్లము చేదుగానుండుటకు కారణము వాని మనోవికారమేగాని బెల్లముయొక్క ధర్మము గానట్లు మాయవలని మనోభ్రాంతిచేత బ్రహ్మము జగత్తుగా తోచుచున్నది. అంతేగాని బ్రహ్మ మొకానొకపు

డైనను జగత్తు కాలేదు. జగత్తను పదార్థము బ్రహ్మముకంటె వేరుగా ఎప్పుడును లేదు.

34 ప్ర-కాలభేదముచే రజ్జువును చూచి సర్పమని భ్రమించి మరల సమీపమునకు బోయి పరీక్షించిచూచి "ఇది సర్పము గాదు; త్రాడే" అని కనిపెట్టినమాత్రమున పాము అసత్య మగుచున్నది. అట్లు బ్రహ్మమే సత్యమని తెలిసినతోడనే, ప్రపంచమును అసత్యము కావల యును. అట్లు కాజాలక ప్రారబ్ధకర్మముండుపర్యంతము ప్రపంచ దేహవికారాది ధర్మములు మొదలగునవి ఏల కలుగుచున్నవి?

స- కర్మశేషమగు ప్రారబ్ధకర్మముండువరకు సోపాధికభ్రాంతి వలన ప్రపంచవికారములు తోచుచున్నవి. ఒకచోట రగుల్కొనిన అగ్నిని చల్లార్చినను అచట కొంత సేపటివరకు వెచ్చదనము, ధూమ మును ఉండునట్లు బ్రహ్మజ్ఞానముచే అవిద్య నశించిపోయినను, దాని కార్యములగు దేహేంద్రియాది ప్రపంచముమాత్రము ప్రారబ్ధము నశించువరకు ఉండును. దీనినే "సోపాధికభ్రాంతి" యందురు.

35 ప్ర- స్థాణువునందు పురుషభ్రాంతి కలిగినపుడు దగ్గరకు పోయి పరిశోధించిచూడగా అది స్థాణువేగాని పురుషుడెంతమాత్రము గాదని దోచినది. అసత్యమని భ్రాంతి యని తెలిసికొన్నవాడును స్థాణువును రెండును నిత్యముగా నుండునట్లు జీవుడు అజ్ఞానదశయందు బ్రహ్మ మునే ప్రపంచముగా నెంచి భ్రాంతినొందెను. తరువాత తత్త్వవివేక మొనర్చి "బ్రహ్మమే సత్యము జగత్తు మిథ్య" అని తెలిసికొనెను. అందుచే బ్రహ్మమును చూచిన జీవుడు జీవునిచే తెలిసికొనబడిన బ్రహ్మము ఈరెండును వేరువేరుగా సత్యముగా నుంటవలన అద్వైత మని ఎట్లు చెప్పవచ్చును?

స- ఒకనాటకసభయందు వేషగాడు స్త్రీపాత్ర నగా స్త్రీ వేషమును ధరించి ఆడుచున్నప్పటికిని తాను పురుషుడేగాని స్త్రీ ఎంత మాత్రము గాజాలడు. అట్లే పరబ్రహ్మ మగుఆత్మ అవిద్యాప్రతి బింబోపాధివశమున తానే తన్ను జీవుడని భ్రాంతిపడుచున్నాడు. అందు

వలన తానే తిరిగి తత్త్వవివేకమువలన అవిద్యోపాధి నశించగా తాను జీవు డనుభ్రాంతి పోయి తానే బ్రహ్మమని అనుభవముచే తెలిసికొనుచున్నాడు. గాన ఆత్మసత్తామాత్రముకంటె వేరుగా జగత్తు లేదుగాన అద్వైతసిద్ధి గలుగుచున్నది.

36 ప్ర- ముఖమునకు అద్దము వేరుగా నుండువస్తువుగాన ఆ యద్దమునందు ముఖమువంటి ప్రతిబింబము తోచును. అయితే బ్రహ్మమునకు వేరుగాక మాయావిద్యలు అభిన్నముగా నుండుటవలన ఆ మాయావిద్యలందు బ్రహ్మ మెట్లు ప్రతిబింబింప గలదు? తనలో తాను ప్రతిబింబించునా ? అందుచే ప్రతిబింబము జీవు డనుట ఎట్లు ?

స- సర్వవ్యాపక మగునాకాశమందు ఘటజలము అభిన్నముగా నుండియు ఆజలమునందు ఆకాశమువలె ఒక ప్రతిబింబము తోచునట్లు బ్రహ్మమున కభిన్నముగా నుండు మాయావిద్యలందు బ్రహ్మమువలె ప్రతిబింబము తోచును. అందు మాయాప్రతిబింబమునకు ఈశ్వరుడనియు అవిద్యా ప్రతిబింబమునకు జీవుడనియు పేర్లు.

37 ప్ర- రూపసహితు డగుచంద్రుడు రూపసహిత మగుఅద్దమునందు ప్రతిబింబించునుగాని రూపరహిత మగుబ్రహ్మము మాయావిద్యలం దెట్లు ప్రతిబింబించును ?

స- అరూప మగునాకాశము రూపసహిత మగుజలమునందు ప్రతిబింబించునట్లు అరూప మగుబ్రహ్మము మాయావిద్యలందు ప్రతిబింబించును.

38 ప్ర- రూపసహిత మగుపృథివి ఉపాధివశమున ఘటాకారమును పొందును; గాని రూపరహిత మగుబ్రహ్మము ఎట్లు నామరూపాత్మక ప్రపంచాకారము నొందగలదు ?

స- మట్టిని వేరుగా విడిచి ఘటము ఒక పదార్థముగా లేనట్లు సత్తామాత్ర మగుఆత్మను వేరుచేసిచూడగా ప్రపంచముయొక్క నామరూపములు ఎంతమాత్రమును భాసించుటలేదు. మరియు రూపరహిత మగునాకాశము నీలపీతాది నానారూపములుగా గనబడునట్లు

అరూప మగుబ్రహ్మము సరూప మగుప్రపంచముగా కానుపించు చున్నది.

39 ప్ర- అంధకారమువలె అజ్ఞానముతో నుండునిద్రావస్థలో జీవుని తత్సాక్షి యగుఆత్మను ఈరెంటిని వేరువేరుగా ఎరుగుట ఎట్లు ?

స- నేను సుఖముగా నిద్రించితినని చెప్పువాడు జీవుడు- నేను నిద్రావస్థ (సుషుప్త్యవస్థ)లో ఈనామరూపాత్మక జగత్తును కొంచె మైనను ఎరుగకుంటి ననువాడే సాక్షి.

40 ప్ర- జీవన్ముక్తుడగుజ్ఞానికిగూడ ప్రారబ్ధకర్మ యుండునన్నచో ద్వైతమే యగును. గాన నట్టిజ్ఞానికి ప్రారబ్ధము లేదన్నయెడల లోక మం దట్టివారు దేహాదిస్నానభోజనాది వ్యవహారమును గనుచున్నారు గనుక ఇదెట్లు సమంజసము ?

స- జీవన్ముక్తునకు తాను జీవుడ ననుభ్రాంతి నష్టమైనందున ప్రారబ్ధ మనుభవించుచున్నను వాడు తనదేహామే అనుభవించుచున్న దనియు, తాను నిత్యసాక్షిరూపుడనుమాత్రమే యనియు స్థిరనిశ్చ యముతో నుండును. గాన వానినిశ్చయమందు అద్వైతమే తప్ప ద్వైతభావముగాని దేహభానముగాని ఎంతమాత్రమును లేదు.

41 ప్ర- శబ్దతన్మాత్రముగా నుండు ఆకాశమునుండి వాయువు మొదలగు భూతము లెట్లు కలిగెను ?

స- చేదుగా నుండు వేపవిత్తనమువలన పుట్టినవేపచెట్టుగూడ చేదుగా నుండునట్లు కారణభూతమైన ఆకాశము శబ్దగుణకముగాన వాయ్వాది నాలుగు భూతములందుగూడ ఆశబ్దము అనుగతమగుచు వాయువు మొదలగు భూతములు స్పర్శాదివిశేషగుణములతో కల్గెను.

42 ప్ర- బంధ మనగా నెద్ది ? మోక్ష మనగా నెద్ది ?

స- బ్రహ్మమనగా నేమో తెలియక దేహాదులతో వ్యవహ రించుటయే బంధ మనబడును. బ్రహ్మమనగా నేమో తెలిసికొని

తానే బ్రహ్మమను స్థిరనిశ్చయము నొందియుండుటయే మోక్ష మన బడును.

43 ప్ర- ఒక్కడే జీవుడని చెప్పినయెడల మోక్ష మొందువాడు లేకపోవును. అందుకొరకు నానాజీవు లున్నారని చెప్పినచో అద్వైత మెట్లు సిద్ధించును ? కావున ఏమి చెప్పవలయును ?

స- జ్ఞానియొక్క దృష్టిలో అద్వైతమే. ఒకేచంద్రు డనేక తటాకాది జలములందు ప్రతిబింబింపగా ఆప్రతిబింబములు (నానాగా) అనేకములుగా నున్నట్లు పరబ్రహ్మ మొక్కడే అనేకాంతఃకరణము లందు ప్రతిబింబించి అనేకజీవు లనబడును. అంతఃకరణప్రతిబింబిత బ్రహ్మమే జీవు డనబడును. అదియే అజ్ఞానావస్థ యనబడును. అట్టి యవస్థలో అనేకజీవు లున్నారు. జ్ఞానిదృష్టిలో నంతఃకరణములుగాని అందలిబ్రహ్మప్రతిబింబములుగాని లేవు. ఒక్కబ్రహ్మము మాత్రమే గలదు, గాన అద్వైతమే- కుండలోనినీటియందు ప్రతిబింబించిన చంద్రబింబ మాకుండనీ రింకిపోయినతర్వాత అసలుచంద్రబింబము లోనే లీనమైనట్లు తెలియవలెను. కాని అంతమాత్రముచేత మిగిలిన తటాకాదులలోని నీళ్లింకిపోలేదుగాన అందలి చంద్రప్రతిబింబము లన్నియు వేరువేరుగా కలవు. అట్లే ఒకజ్ఞానియొక్క అంతఃకరణము నశించినయెడల అందలిప్రతిబింబ మగుజీవుడు జీవసంజ్ఞను లేక ప్రతి బింబసంజ్ఞను పోగొట్టుకొని బింబభూత మగుబ్రహ్మ మగుచున్నాడు. ఇదియే మోక్ష మనబడును. ఈఅంతఃకరణనాశనమునకు సాధనమే వేదాంతవాక్యశ్రవణమననాదికము. ఇదియే దానికి సాధనముగాని మరియొకసాధన మేదియు లేదు. ఈఅంతఃకరణము లున్నంతవర కందలి బ్రహ్మప్రతిబింబములే జీవు లనబడును. వీరు జననమరణాదిసంసార ధర్మము నొందుచుందురు.

44 ప్ర- బ్రహ్మ మొక్కటియేగాని రెండవవస్తు వెంతమాత్ర మును లేదన్నయెడల 'త్వం' అనుపదముయొక్క అర్థవిచారణ చేయ

వలసినపని లేదు. చేయవలయు నన్నచో పరిత్యాగాత్మస్వరూప మగు తనకంటె వేరుగా బ్రహ్మ మొకటి యుండవలయునుగదా ?

స- అజ్ఞానదృష్టివలన జీవు డగు తనకు జననమరణాదులు గల వనెడుభ్రాంతి అనాదికాలమునుండి వచ్చుచుండుటవలన ఆయజ్ఞాన మనెడుభ్రాంతి నశించుటచే తానే బ్రహ్మమని తననిజరూప మెరుగుటకుగాను ప్రతివాదును "త్వం" అనుపదముయొక్క అర్థవిచారణ కొరకు పరిశోధన చేయవలసియున్నది. ఇట్లు తత్త్వవిచారణ చేసిన నిజ స్వరూపము నెరిగినవెనుక దేహాదిప్రపంచ మంతయు తన ఆత్మయందే లీనమగును. ఎట్లనగా రజ్జువును జూచి సర్పమని భ్రాంతిపడినవానికి రజ్జుస్వరూపము నెరిగినతర్వాత భ్రాంతిచే భాసించినసర్పము రజ్జువు లోనే లీనమైనట్లు జ్ఞానికి పూర్వమందలి, జీవభావముగాని దేహాది జగత్తుగాని సర్వము జ్ఞానోదయానంతరమున తనఆత్మస్వరూపమందే లయమగును.

45 ప్ర- గురువు చక్షురాద్యవయవములతో నొప్పు దేహధారియై భాసించుచుండగా అత డశరీరి యని బ్రహ్మమే యని యెటు చెప్ప వచ్చును ?

స- బ్రహ్మవేత్త యగు గురువు దేహేంద్రియాదులు తాను కానియు వాని కన్నిటికి సాక్షిమాత్రు డగుఆత్మయే తా ననియు, స్థిరనిశ్చయముతో నుండి దేహాభిమాన మెంతమాత్రము లేనివా డగుటచే అశరీరి యనబడును.

46 ప్ర- గురువు సకలవ్యవహారముల నొనర్చుచు శిష్యులకు తత్త్వము నుపదేశించుచుండగా అతడు చేయుబోధ యంతయు మనస్సు మొదలగుఇంద్రియములను గలిగియేగదా. అత డెట్లసంకల్పాదులు లేనివాడని ఎట్లు చెప్పవచ్చును ?

స- సంకల్పాదు లన్నియు మనోధర్మములు. బ్రహ్మవేత్త యగుగురువు మనస్సు తాను గాననియు తాను మనస్సునకు సాక్షి

మాత్రు డగుఆత్మ నేనే యనియు దృఢనిశ్చయముతో నున్నందున అతనికి సంకల్పాదులు లేవు.

**47** ప్ర- ఆహారమును భుజించునది దేహమా? జీవుడా?

స- దేహమందలి, అగ్నిసంబంధ మగుఉదానవాయు వాహార మును భుజించును.

48 ప్ర- దాహము, ఆకలి, ఎవరికి గల్గుచున్నవి?

స- దాహము, ఆకలి ప్రాణవాయుధర్మములు.

49 ప్ర- స్వస్వరూపనిశ్చయము గలవారికి భోక్తవ్య మేల లేదు?

స- కర్తృత్వభోక్తృత్వములు బుద్ధిధర్మములు. ఆబుద్ధి తాను గానని యు దానికి వేరుగా నుండుసర్వసాక్షి యే తాననియు నిశ్చయిం చుటవలన నట్టివానికి భోక్తృత్వాదులు లేవు.

50 ప్ర- అవిద్యచే తాను జీవమాత్రుడ ననుకొనినభ్రాంతి నశించి దేహాది ప్రపంచ మంతయు బ్రహ్మాత్మయం దారోపిత మని తెలిసి నిస్సంకల్ప ముగా సాక్షి మాత్రస్వరూపుడుగా నుండుజ్ఞానికి తాను జీవించియుండు వరకు ప్రారబ్ధమునకును శరీరేంద్రియవ్యాపారములకును నియామకుడు లేడు. అయినప్పటికి ఆశరీరేంద్రియములు సకలకార్యములను చేయుచు సకలము ననుభవించుచున్నవి. అట్లు వానిని నడుచున ట్లొనర్చువా డెవరు?

స- ఒకయింటిలో కాపురమున్నవా రాయిల్లు విడిచిపోయిన తరువాత ఆయింటియజమాని తనయింటిని తాను తిరిగి స్వీకరించినట్లు నిస్సంకల్పుడై సాక్షిమాత్రముగా నుండుజ్ఞాని శరీరము సర్వజీవశరీ రములే తనకు కారణశరీరముగా గలఈశ్వరునకు కార్యశరీర మగుట వలన ఆయీశ్వరు డాశరీరము "నాది" అని అభిమానించి దానిసక లేంద్రియవ్యాపారములకు నియామకు డగును.

51 ప్ర- జీవుడు ప్రతిబింబ మగుటవలన మిథ్యాస్వరూపు డగుచు జ్ఞానదశయందు నశించిపోవుచున్నట్లు చెప్పుచున్నారే! అప్పు డైక్య ... ఎవరితో గలుగుచున్నది?

స- జీవసాక్షిగా నుండుప్రత్యగాత్మకును, పరబ్రహ్మమునకును ఐక్యము కలుగుచున్నది.

52 ప్ర- బంధమోక్షము లెవరికి గల్గును ?

స- సర్వవ్యాపక మగుబ్రహ్మాత్మకు బంధము లేదు; మోక్షమును లేదు. జీవుడే అనాదికాలప్రవృత్త మగువాసనాబలముచే తాను దేహాదిసంఘాతమే యనియు జననాదులు తనకే యనియు తలచుటయే బంధ మనబడును. గురుముఖమున వేదాంతవాక్యశ్రవణాదిద్వారా తానే సర్వజగత్కారణ మగుబ్రహ్మమని తెలిసికొనుటయే మోక్ష మనబడును.

53 ప్ర- ఘటవిషయజ్ఞానమునందు వృత్తి నష్టమైనయెడల ఘటరూపమును సాక్షి యెరుగుచున్నది. అట్లు ఘటవృత్తులు లేనపుడాసాక్షి యగునాత్మ తన్ను తానే ఎరుగుట యెట్లు ?

స- వృత్తి యనునంతఃకరణము లేనియెడల జీవుడు లేడు. అంతఃకరణము లేనిఘటాదులు జడము లనబడును. అట్టిఘటాదులను సాక్షి యగునాత్మ యెరుగుట లేదు. జీవుడే యెరుగుచున్నాడు.

54 ప్ర- వృత్తిజ్ఞానము అనగా అంతఃకరణసంబంధమగుతత్త్వవివేకమువలన గలిగినట్టిజ్ఞానము అజ్ఞానమును నాశ మొనర్చినతర్వాత తానెట్లు నశించును ?

స- సూర్యునియెదుట అంధకారమును పోగొట్టుదీపప్రకాశము గోచరము కాక నశించిపోవుటవలె స్వయంజ్యోతిస్స్వభావ మగుఆత్మ యొక్క సన్నిధియందు వృత్తిజ్ఞానము నశించును.

55 ప్ర- 1. దేహమే తానని తలచినపుడును 2. తాను జీవుడనని తలచినపుడును 3. తాను సాక్షిమాత్రుడనే యనితలచినపుడును 4. బ్రహ్మమే తానని తలచినపుడును గలుగుమార్పు లెవ్వి ?

స- 1. దేహమే తానని తలచినపుడు ప్రపంచము నిత్య మని గ్రహించును. 2. తాను జీవుడ ననితలచినపుడు నిత్యానిత్యరూపముగా జగత్తును గ్రహించును. 3. సాక్షియే తానని తలచినపుడు జగత్తును

మిథ్యగా తలచును. 4. బ్రహ్మమే తానని తలచినపుడు సముద్రము నకును తరంగములకును అభేదముగా నున్నట్లు బ్రహ్మమునకును తనకును నభేదమైనట్లు గ్రహించును.

56 ప్ర- ఆత్మ సర్వవ్యాపక మగుబ్రహ్మ మైనచో సర్వజీవుల యొక్క అంతఃకరణవృత్తివిశేషముల నన్నిటి నెరుగవలయునుగదా!

స- చైతన్యస్వరూప మగుఆత్మ సర్వపరిపూర్ణమైనను ఉపాధి భేదమువలన ఆయాశరీరసాక్షి యగునాత్మ ఆయాజీవులయొక్క అంతఃకరణవృత్తులనుమాత్రమే ఎరుగును.

57 ప్ర- జీవు డంతఃకరణసంబంధ మగువృత్తిజ్ఞానముచే దేహ తత్త్వము నెరిగినచో ఆక్షణమందే జీవుడు మిథ్యారూపు డగుచుండు టచే ఈజీవుడు దేహము నెరుగుననుట తగదు. వృత్తిజ్ఞానమే దేహము నెరుగవలెనుగదా!

స- జీవుడు లేనిఅంతఃకరణము జడమగుటచే జీవునకే దేహము ప్రయోజనకారి యనవలెనుగాని దేహమునకు జీవుడు ప్రయోజనకారి యనరాదు. ఇట్టివానికి జీవవృత్తిదేహము లనుభేద ముండదు.

58 ప్ర- ఆత్మ వృత్తిజ్ఞానము గలుగుటకు ముందుగాని, లేక తత్త్వ విచారముచే గల్గుజ్ఞానమునకు ముందుగాని అజ్ఞానమునకు సాక్షిగా నుండుటవలన అదియే సమాధి యగునా? లేక సమాధికిని, దీనికిని గలభేద మేమి?

స- అజ్ఞానము సాక్షిస్వరూపు డగుఆత్మ నెరుగనందువలనను బీజాంకురన్యాయముచే వృత్తిజ్ఞానముల యుత్పత్తుల కన్నిటికిని కారణ మగుటవలనను దానిని సమాధి యనరాదు. దేహేంద్రియాదికమును, ధ్యానరూపక్రియను మఱచి క్రమముగా ఆత్మైకవిషయక మగువృత్తి పరంపర నిలుచుటయే సమాధి యనబడును.

59 ప్ర- దేహేంద్రియాదులకు సాక్షిగా నుండునాత్మ తానని ఎరిగినజ్ఞానులకు వ్యవహారదశయందు జీవుడును అంతఃకరణమును ఉండుటవలన అద్వైతహాని యెట్లు కలుగదు?

స- సముద్రముకంటె తరంగములు వేరుగానట్లు అంతఃకరణము, జీవుడు ఆత్మకంటె వేరుగావని ఎరుగుటయే అద్వైతజ్ఞానముగాన అట్టిస్థితిలో అద్వైతమునకేహానియు లేదు.

60 ప్ర- జీవుడే బ్రహ్మమనుట ఉపాసనచేతనా? లేక స్వతస్సిద్ధమా?

స- ఉపాసింపబడుదేవత తనకంటె వేరని తలచునవు డట్టి యుపాసనవలన జీవుడు బ్రహ్మము కాజాలడు.

61 ప్ర- అట్లైనచో "జీవుడు బ్రహ్మ"మనుట "బ్రహ్మచారి అగ్ని" యనునట్లు ఔపచారికప్రయోగ మేల కాదు ?

స- తనకంటె అన్యముగా నుండుపదార్థములకే ఔపచారిక ప్రయోగ ముండునుగాని తన కౌపచారికప్రయోగ ముండదు.

62 ప్ర- అట్లైన జీవుని బ్రహ్మమనుట గౌణప్రయోగమా ?

స- ఒక పురుషుని జూచి ఇతడు సింహమనుట గౌణ మన బడునుగాని సింహమును జూచి ఇది సింహమనుట గౌణ మనబడదు. అట్లే బ్రహ్మమును జూచి బ్రహ్మమనుట గౌణము గాదు, జీవునినిజ రూపము బ్రహ్మచైతన్యమేగాన జీవుడు బ్రహ్మమనుట స్వభావసిద్ధమే.

63 ప్ర- జీవుని బ్రహ్మ మనుట గుణగుణిన్యాయముచే ఏల కా గూడదు ?

స- నల్లకలువయు దానినలుపురంగును అన్యోన్యాభిన్నముగా నుండుటచే ఆరెంటిని గుణిగుణము లనిచెప్పవచ్చును. ఇట్లే జీవాత్మకు తాను జీవు డనుభావము భ్రాంతివలననే దోచినదిగాని సహజముగా అన్యోన్యాభిన్నమైనది కాన గుణిగుణన్యాయమువలన జీవుడు బ్రహ్మ మనరాదు.

64 ప్ర- జీవుని బ్రహ్మ మనుట కార్యకారణన్యాయముచే ఏల కాగూడదు ?

స- పాలు రూపాంతరముతో పెరుగగుట పరిణామ మనబడును. అట్లు బ్రహ్మము జీవు డనురూపాంతరముతో పరిణమించలేదు. సచ్చి

దానందరూపు డగుబ్రహ్మ మవిద్యావరణశక్తివలన మఱుగుపడి భ్రాంతిచే జీవుడుగా తోచుచున్నాడు. ఆభ్రాంతి నశించినతోడనే తాను తననిజస్వరూప మగుబ్రహ్మ మగుచున్నాడు. కాన పరిణామవాద మిచట ప్రసక్తము గాదు. అట్లే పరమాణువు లనెడికారణమువలన స్థూల మగుకార్యరూప మేర్పడిన దనుఆరంభవాదముగూడ ఈబ్రహ్మ మందు పట్టదు

65 ప్ర- వేదోక్తరీతిచే జీవుడును పరమాత్మయు రెండు నుండుట వలన అద్వైత మెట్లు సిద్ధించును ?

స- బ్రహ్మ మగుఆత్మయు జీవుడును బింబప్రతిబింబము లగుట వలన అద్వైతమే యనిచెప్పబడును.

66 ప్ర- జీవాత్మ శరీరసంబంధముతో "నీవు నేను వాడు" ఇత్యాద్యభిమానముతో వ్యవహరించుచున్నదిగాన దీనికి కర్తృత్వభోక్తృత్వ ములు గలవు. అవి యుండుటవలన ప్రపంచము నిత్యమే యగునుగదా.

స- దేహముతో తాదాత్మ్యము నొందినజీవుడు తానే దేహ మనుతలంపుతో నున్నపుడు కర్తృత్వభోక్తృత్వాదిక ముండును. ఆతలంపే భ్రాంతి యని మిథ్యాజ్ఞానమని అవిద్యయని చెప్పబడును. వేదాంతవాక్యశ్రవణాదులచే ఆభ్రాంతి పోయి తానే సచ్చిదానంద పరబ్రహ్మ మని తలచినపుడు కర్తృత్వాదికము తొలగిపోవును. ఎట్లనగా ఒకరాజు స్వప్నావస్థయందు తాను భిక్షమెత్తి జీవించుచున్నట్లు కల గని మేల్కొని జాగ్రదవస్థలో తనమంత్రి మొదలగువారితో తన స్వప్నవృత్తాంతమును చెప్పుచు తనమనస్సులో తా నొకకాలమందు భిక్షుకుడుగా లేనని తెలిసికొనినట్టు జీవన్ముక్తిదశయందు స్వప్నపదార్థమువలె సర్వప్రపంచము మిథ్యయనియు పరబ్రహ్మమే తననిజరూప మగుఆత్మయనియు దృఢనిశ్చయము గల్గి పూర్వవాసనవలన తాను జీవునిరీతిగా కర్తృత్వాదులు గల్గి సకలవ్యాపారములు చేయుచున్నను వానియందు పూర్వమువలె తాదాత్మ్యాభిమాన మెంతమాత్రము లేకయుండును. తత్త్వజ్ఞానమువలన తాను జీవు డనుభ్రాంతి నశించి

తత్త్వమే బ్రహ్మస్వరూపుడ ననునిశ్చయ మున్నను ప్రారబ్ధకర్మఫలానుసారము వానిదేహము ప్రవర్తించుటచే లోకులదృష్టిలో ఆతడు యథాపూర్వముగా వ్యవహరించునట్లు భాసించునేగాని అతడు మాత్రము తన దేహమందు ఎట్టిఅభిమానమును లేకుండును.

67 ప్ర- ఆత్మ శరీరసంబంధముగా నుండగా ఆయాత్మనిరుపాధిక మనుట ఎట్లు సంభవించును ?

స- ఘటమునం దాకాశ మున్నప్పటికి సర్వవ్యాపక మగు ఆకాశమును ఘటమెంతమాత్రము బంధింపలేదుగాన అంతమాత్రముచే ఆకాశము వాస్తవముగా ఘటోపాధిక మనబడదు. అట్లే ఆత్మ శరీరమనుఉపాధిలో నున్నప్పటికి వాస్తవముచే నిరుపాధికమే యగుచున్నది.

68 ప్ర- కార్యరూపముగా నుండుజగత్తున కుత్పత్తినాశములు గలుగుచున్నందున కారణరూప మగుబ్రహ్మకును ఉత్పత్తినాశములుండుట యుక్తియుక్త మగుచుండ బ్రహ్మమున కుత్పత్తినాశములు లేవను టెట్లు ?

స- రజ్జుసర్పదృష్టాంతమందు కార్య మగుసర్పవికారములు కారణ మగురజ్జువునందు లేకపోవుట ప్రత్యక్షసిద్ధమైనట్లు కార్య మగు జగత్తులోని వికారములు కారణ మగుబ్రహ్మమునకు లేవు.

69 ప్ర- జీవన్ముక్తు డగుజ్ఞాని తానే బ్రహ్మ మనునిశ్చయజ్ఞానము గల్గియున్నచో భూతభవిష్యద్వర్తమానకాలము లందలి సర్వవిషయక జ్ఞానములు వాని కుండవలయునుగాదా. ఏల ఉండుటలేదు ?

స- సర్వజ్ఞత్వాది గుణములును త్రికాల జ్ఞానాదులును మాయాకార్యము లగుటచే మాయా ప్రతిబింబ మగు ఈశ్వరునకే అది సంబంధించినవి. గాని అవిద్యా ప్రతిబింబితు డగుజీవునకు సంబంధించినవి గావు. కాన జీవోపాధిలో నున్నపుడు సర్వజ్ఞత్వాది గుణములు గలుగ జాలవు. అయినను ఈశ్వరోపాసనచే ఈశ్వరభావము నొందినవాడు మాత్రము ఈత్రికాలజ్ఞానాదుల నొందును.

70 ప్ర- అజ్ఞానమును అంతఃకరణతో చేయు వేదాంత విచారణ జ్ఞానము పోగొట్టిన యెడల ఆ విచారణాజ్ఞానమును తరువాత నశించు నట్టిదే గాన విచారణాజ్ఞానముకూడ అనిత్యమే యగుచున్నదిగదా. గాన విచారణాజనిత ఆత్మ ఎట్లు నిత్యమగును ?

స- జ్ఞానాజ్ఞానములే ఎరుక మరుపులు. ఇవి కల్పితము లగుటచే అనిత్యములు. స్వభావజ్ఞానము నిత్యమై అవస్థాత్రయమునకు సాక్షిగా నుండునదిగాన ఆస్వభావజ్ఞానమే ఆత్మ యనబడును. దాని కంటె వేరుగా ఎట్టి పదార్థమును లేనందున దానిని నాశమొనర్చు కారణము లేదు అందుచే అది నిత్యమును అవినాశియును అగును.

71 ప్ర- బ్రహ్మస్వరూపు డగుజ్ఞానికి సోపాధికభ్రాంతివలన ప్రపంచము తోచుచున్న యెడల శుద్ధస్ఫటికమునొద్ద జపాపుష్ప మున్నపుడు ఆస్ఫటిక మెఱ్ఱగా తోచునట్లుండును. అట్లుగాక ఆత్మకంటె వేరొక పదార్థము లేక పోవుటవలన అతనికి సోపాధికభ్రాంతి యెట్లు కలుగును?

స- ప్రారబ్ధ కర్మశేష ముండుటచే నట్టిభ్రాంతి కలుగును.

72 ప్ర- ఆత్మజ్ఞానము వేదాంతవాక్యశ్రవణాదులవలన గలుగుచున్నదిగాన దానికి నాశ ముండితీరవలయునుగదా. ఒక ప్రయత్నమున గల్గినది తప్పక నశింపవలె నను నియమ మున్నది గదా.

స- సూర్యుడు స్వభావముచేతనే ప్రకాశస్వరూపు డైనను మేఘచ్ఛన్నుడైనపుడు ప్రకాశహీనుడుగా గనుపడునట్లే జ్ఞానస్వభావ మగుఆత్మ ఎల్లపుడు జ్ఞానస్వరూపుడైనను అవిద్యావరణచే అజ్ఞానరూపుడుగా గనుపించును. మేఘావరణ తొలగగానే సూర్యుని ప్రకాశము స్ఫుటముగా గోచరించునట్లే వేదాంతజ్ఞానముచే అవిద్యావరణము తొలగగానే ఆత్మజ్ఞానము స్ఫుటముగా గోచరించును.

73 ప్ర- సచ్చిదానందలక్షణములు వేరువేరుగా నున్నవా లేక ఒక్కటిగా నున్నవా ? ఇవి ఆత్మస్వరూపు డగుతనకు అన్యమా లేక అనన్యమా ?

స- ప్రపంచసృష్టికి ముందును సృష్టికాలమందును స్థితికాలమందును లయకాలమందును 1. సత్ = త్రికాలములందు నాశము లేకయుండునది. 2. చిత్ = జడముగాక చైతన్యరూపమై సర్వము నెరుగునది. 3. ఆనందము = ఇంద్రియభోగమునందు గలుగుసుఖరూపమగుఅనుభవమునందు గలఆనందము.

ఈమూడును ఏకరీతిగా నుండును. పరమాత్మ ఈత్రికాలములందును నాశము లేకుండగ, ఏకరీతిగ నుండుటచే సత్ అనబడును. పగలు సూర్యరశ్మిముండర నేత్రములు మూసికొన్నను మనస్సులో విషయములన్నియు భాసించుటచే మనస్సులో నుండునట్టిప్రకాశ మగు జ్ఞానరూపమే చిత్తు మనబడును. ప్రతివానికిని ఇతరపుత్రమిత్రకళత్ర గృహక్షేత్రారామాదు లన్నిటికంటెను తనఆత్మయందే అధికమగు ప్రీతి యుండుటచే ఆనందరూప మనబడును. మల్లెపువ్వునకు గలతెలుపు రంగు మృదుత్వము సువాసన అనునీమూటిని వేరుపరచుట కెంత మా ము వీలు లేకుండున ట్లాత్మగూడ ఈసత్ చిత్ ఆనంద మను మూడులక్షణములను వేరువేరుగా గ్రహించుటకు వీలులేనిది. కాన సచ్చిదానందలక్షణ మొకబ్రహ్మమందే పట్టును. కాన ఇందలిసత్ గాని చిత్ గాని ఆనందముగాని బ్రహ్మముకంటె వేరగునట్టివస్తువునందును పట్టవు. అయితే అంతఃకరణము సత్త్వాదిత్రిగుణములు గలదియగుచు వరుసగా శాంత, ఘోర, మూఢ, వృత్తులని మూడువిధములుగా నగుటవలన ఈవృత్తిభేద మున్నను, సచ్చిదానందలక్షణము లొక్కటిగా నున్నను, వేరువేరుగా తోచును. మల్లెపూవునందు తెలుపురంగు మృదుత్వము సువాసన, ఈమూడు ఏకముగానున్నను దానితెలుపు రంగును కంటితోను మృదుత్వమును త్వగాదీంద్రియముతోను సువాసనను ఘ్రాణేంద్రియముతోను గుర్తెరుగుచున్నాడు. అట్లీమూడువిధములగువృత్తులును ఒక్కొకటి ఒక్కొకలక్షణము నెరుగుటవలన సచ్చిదానందలక్షణము లేకముగా నుండినను వేరువేరుగా భేదముగా తోచుచు తమోగుణప్రధానముగ నుండువృత్తి గలిగినజడపదార్థము లగుమన్నుమొదలగువానియందు సల్లక్షణముమాత్రము తోచును. రజోగుణ

ముతో గూడినవృత్తివిషయరూప మగుకామక్రోధాదిదుర్గుణము లగుచు దుఃఖస్వరూపము లగుటవలన వానియందు సత్ చిత్ అను రెండులక్షణములుమాత్రమే తోచునుగాని ఆనందము తోచుటలేదు. ఇదే శాంతము ప్రధానముగా గలవృత్తియందు సత్, చిత్, ఆనందము లనెడిమూడులక్షణములును తోచును.

74 ప్ర- మాయవలన బుట్టినపంచభూతము లొకటిగా లేక వేరువేరుగా గుణములు గలవిగా నేల ఉన్నవి ?

స- మాయ త్రిగుణాత్మికముగా నుండుటవలనను 1 బ్రహ్మము 2 ప్రకృతి 3 ఈశ్వరుడు 4 మాయ 5 విక్షేపము అను నీఐదును పంచభూతములకు కారణములుగా నుండుటవలనను పంచభూతగుణములు వేరువేరుగా నున్నవి.

75 ప్ర- సర్వపరిపూర్ణబ్రహ్మ మగుఆత్మసన్నిధానమున జడరూపముగ నుండుమనస్సునకు చేష్టలు కలవన్న యెడల అట్లు జడముగా నుండుఘటాదులకుగూడ చేష్ట లుండవలెనుగదా ?

స- అయస్కాంతసన్నిధానమందు సూది మొదలగు ఇనుము మాత్రమే చలించునుగాని తక్కిన ఘటాదివస్తువు లెంతమాత్రమును చలింపవు. అట్లే ఆత్మసన్నిధానమందు మనస్సే చేష్టల నొనర్చునుగాని ఘటాదులు చేష్టల నొనర్పవు.

76 ప్ర- ఆకాశము రూపరహితమై యుండగా అది శబ్దతన్మాత్రమనుటకు ప్రమాణ మేమి ?

స- ప్రతిధ్వనియే ప్రత్యక్షము. మరియు ఆకాశము లేనిచోట శబ్ద ముండజాలదు.

77 ప్ర- నిరవయవముగా నుండుఆత్మ వినా జీవునకు కర్తృత్వ వ్యవహారము లేదుగాన జీవునకు బంధము లేదనవచ్చునా ?

స- జీవుడు ప్రతిబింబ మగుటవలన ఆత్మను విడిచి ఆజీవుని ప్రత్యేకించిచూడగా జడ మగుటవలన ఆజీవునకు బంధము లేదు.

78 ప్ర- జీవుడు ప్రతిబింబ మగుచు బ్రహ్మమున కభేదమగుచుండగా ఆజీవుడు బంధావస్థయందు మోక్షము నేల కోరుచున్నాడు.

స- సూర్యప్రకాశమునందు దీపజ్వాల లయించిపోవునట్లు జ్ఞానానుభవమునం దావరణ నశించినతోడనే జీవుడు బ్రహ్మమునందు లయించుచున్నాడు. అట్టిజీవు డావరణసహితుడుగా నుండునపుడు తాను బ్రహ్మముకంటె వేరుగానున్నట్లు భ్రాంతిపడి భేదబుద్ధి గల్గియుండుచున్నందున మోక్షమును గోరుచున్నాడు.

79 ప్ర- ఒకజ్ఞాని కంతఃకరణమును దానిసంబంధ మగుజ్ఞానమును నశింపగా అతడు జీవన్ముక్తిని పొందుచున్నాడు. అట్టివానికి జగత్తు లేదుగదా. అట్టివానికి లేకున్నజగత్తు మిగిలినవారి కేల కనుపించుచున్నది ?

స- వృత్తిజ్ఞానము సమష్టి వ్యష్టి యని రెండువిధములు. అందొకజ్ఞానికి వానియంతఃకరణము నశించుటచే వ్యష్టివృత్తిజ్ఞానము నశించుటవలన వానికిమాత్రము జగత్తు లేకపోవునుగాని తక్కినజీవుల అంతఃకరణములు సమష్టివృత్తిజ్ఞాన మనబడును. అవి నశింపలేదు. గాన తక్కినవారికి జగత్తు తోచుచుండును.

80 ప్ర- బ్రహ్మము జ్ఞానరూపముగాను, జగత్తు జడరూపముగాను ఉండుటవలన బ్రహ్మమే జగత్తనినవో ఆరెంటికి నైక్య మెట్లుగలుగును?

స- నామరూపములుగా దోచునీజగత్తునకు నిజస్వరూపము బ్రహ్మమేగాన నైక్యము గలుగును. అనగా భ్రాంతికాలమందలి సర్పమే జ్ఞానకాలమందు రజ్జువగునట్లు అజ్ఞానకాలమందలిజగత్తే జ్ఞానకాలమందు బ్రహ్మమగును.

81 ప్ర- సద్రూప మగుబ్రహ్మాత్మ నిత్యమనుటకు కారణ మేమి?

స- అంతఃకరణసంబంధము లైనజ్ఞానాజ్ఞానములగు ఎరుకమరపులు కల్పితము లగుచున్నవి. వానికి సాక్షిగా నుండుఆత్మ అవస్థాత్రయమునందును నిత్యముగా నుండుటవలన ఆత్మ నిత్య మనబడుచున్నది.

82 ప్ర- సద్రూప మగుఆత్మరీతిగా అసత్తగుజగత్తుగూడ సహజమేగదా.

స- బ్రహ్మరీతిగా జగత్తు సద్రూపము కానందున సహజము గాదు.

83 ప్ర- సదా మౌన మనుటకు తాత్పర్య మేమి ?

స- బ్రహ్మసాక్షాత్కారమని యర్థము.

84 ప్ర- జీవన్ముక్తు డగునాకు జీవత్వము నశించినయెడల నేనెవ్వడను ?

స- బ్రహ్మముతప్ప వేరొకవస్తువు లేదుగాన ఆత్మస్వరూపుడ వగునీవే బ్రహ్మమవు.

85 ప్ర- జీవన్ముక్తు డగుజ్ఞాని ఒకనియింట భుజించినంతమాత్రమున జగత్తునకెల్ల తృప్తి ఎట్లుగల్గును ?

స- విశ్వరూపు డగుఈశ్వరాంశమే జ్ఞాని యగుటవలన జ్ఞాని భుజించినంతమాత్రముచేత విశ్వరూపు డగుఈశ్వరుడు తృప్తినొందుచున్నాడు. అందుచే జగత్తంతయు తృప్తినొందును.

86 ప్ర- ఆత్మసాక్షాత్కార మెక్కడమాటలోనే గలదా ?

స- ఆత్మసాక్షాత్కారము సద్గురూపదిష్ట మగునొక్క మహావాక్యార్థములోనే గలదు.

87 ప్ర- జ్ఞానికి కర్మనివృత్తి ఎట్లు గలుగును ?

స- ప్రారబ్ధాంత్యమున విదేహకైవల్యము ననుభవించునపుడు కర్మనివృత్తి యగును. ప్రారబ్ధమునుమాత్ర మనుభవించితీరవలయును.

88 ప్ర- జీవన్ముక్తులు సకలధర్మములు చేయుచున్నారే. ఆకర్మ ఫలములను వా రెందుకు పొందుటలేదు ?

స- జ్ఞాని సర్వము బ్రహ్మమేయని కర్తృత్వశూన్యుడై యుండుటవలన అతనిని కర్మఫలములు చెందవు.

89 ప్ర- జీవన్ముక్తునకు పంచమలము లెట్లు తొలగిపోవును ?

స- బ్రహ్మజ్ఞానమువలన తొలగును.

90 ప్ర- దేశాంతర వర్ణాంతర మతాంతరములకు చెందువారికిని ముక్తి గలదా ?

స- ఎట్టివారికేని ఎన్నటికేని భారతభూమిలో బ్రాహ్మణులుగా జన్మించి వేదోక్తకర్మాచరణమున చిత్తశుద్ధి నొంది, వేదాంతార్థ శ్రవణాదులచే బ్రహ్మసాక్షాత్కారమును బడయజాలకున్న ముక్తి గలుగదు.

91 ప్ర- ఆగామిసంచితనాశము లెట్లు గలుగును ?

స- గురుకటాక్షమువలనను, జ్ఞానోపదేశమువలనను సంచిత నాశమగును. కర్తృత్వభ్రాంతి పోవుటచే ఆగామి నాశ మగును.

92 ప్ర- జీవన్ముక్తు లగుజ్ఞానులు జన్మాంతరవ్యవహారముల నేల తెలియుటలేదు ?

స- కర్మ ప్రాణాయామము యోగము తపస్సు ఇత్యాదిసాధనములచే ఈశ్వరానుగ్రహము నొందినవారు త్రికాలజ్ఞానము నొంది యుందురు. కర్మాదిసాధనములు మాయాకార్యము లగుటచేతను మిథ్య యగుటచేతను నిష్కామి యగుబ్రహ్మజ్ఞాని వానిని గోరడు. అందుచే నతడు జన్మాంతరవిషయములను త్రికాలజ్ఞానమును కోరడు.

93 ప్ర- త్వం పదలక్ష్యార్థ మెరిగినతర్వాత తత్పదలక్ష్యార్థ మేల ఎరుగబడవలెను ?

. స- త్వం పదలక్ష్యార్థ మెరిగినయెడల దేహేంద్రియములకు సాక్షిగా నుండుప్రత్యగాత్మ యగుతన్ను తెలియవచ్చును. తత్పదలక్ష్యార్థము నెరిగినచో అఖండపరిపూర్ణబ్రహ్మము నెరుగవచ్చును.

94 ప్ర- అసి పద మేల ఎరుగవలయును ?

స- దేహేంద్రియసాక్షిగా నుండుఈఆత్మయే సర్వపరిపూర్ణ బ్రహ్మమనియు అదియే ఆత్మయనియు అసి అను పదముచే తెలుపబడును గాన ఆపదము నెరుగవలెను.

95 ప్ర- చిద్విలాస మగుప్రపంచము జీవన్ముక్తునకు నష్టమైనయెడల చిత్తు నిత్యముగా నుండవలయునుగదా, ఆరోపిత మగు దేహేంద్రియాది ప్రపంచమును అధిష్ఠాన మగుసాక్షిత్వభావమును కనబడకపోవుటవలన శూన్యమగునా ?

స- స్వభావజ్ఞాన మగుబ్రహ్మ మొక్కటే సత్యముగాన జ్ఞాని తాను సాక్షి యనుతలంపు నశించి తానే బ్రహ్మమైముగా నుండుటవలన స్వస్వరూపమునకు హానిలేదు.

96 ప్ర- జీవు లొనర్చుపుణ్యపాపము లీశ్వరుడు చేయించు కార్యములేగదా- జీవు లేమిచేయగలరు ? అట్లైన జీవులందు దోష మేమి?

స- ఈశ్వరసృష్టికిని జీవసృష్టికిని భేద మున్నది. జగత్తునందలి స్థావరజంగమాది సర్వమును ఈశ్వరసృష్టి యనబడును. ఆజగత్తులోని వస్తువులందు ప్రీతిగాని ద్వేషముగాని ఉదాసీనభావముగాని "నేను" అనెడియహంకారముగాని కామక్రోధాదులుగాని ఇవన్నియు జీవసృష్టి యనబడును. ఇవి నిర్మలుడైనయీశ్వరునిచే సృష్టింపబడినవి గావు. ఈశ్వరు డొకనిని జ్ఞానిగాను ఒకనిని కామక్రోధాదియుక్తునిగాను సృష్టించుటకు ఆజీవులపూర్వజన్మలోని కర్మఫలమే సాధనముగాని ఈశ్వరునకు పక్షపాతము లేదు. అందుచే కామక్రోధాదులు జీవునిచే జీవునియందు చేయబడినవిగాన తత్ఫలముల నాతడే ఎన్ని జన్మలలోనైన నవశ్య మనుభవించితీరవలెను. కావున జీవు డీకామక్రోధాదులను పోగొట్టుకొనుటకు వేదోపదిష్టధర్మము నాచరించవలయును. ఈశ్వరసృష్టి యగుపంచభూతసూర్యచంద్రాదులను చూచినమాత్రమున భగవంతు డున్నాడనుబుద్ధి గలిగి అతనియందు భక్తి గల్గి అతని ఉచ్ఛ్వాసనిశ్వాసరూపములవంటి వగువేదములం దుపదేశింపబడినధర్మము నెరిగి ఆచరించి చిత్తశుద్ధిని సంపాదించి చివరకు వేదాంతవాక్యశ్రవణాదిక మొనర్చి బ్రహ్మాత్మైక్యజ్ఞానము నొంది ముక్తుడగువాడు జీవుడే. మోక్షముకొరకు వేరొకమార్గము లేదుగాన నీరీతిగా ఈశ్వరసృష్టిని మోక్షసాధనగా నుపయోగించుకొనువాడుత్తముడు. కామక్రోధాదులకు లోబడి వేదోదితధర్మముల నుల్లం

ఘించి ప్రవర్తించువాడు నీచాతినీచజన్మల నెత్తి అధోగతిపాలై ఎన్నటికి మోక్షము నొందజాలడు.

97 ప్ర- మోక్షము కర్మలవలన గలుగునా? జ్ఞానముచే గలుగునా?

స- జ్ఞానమువలననే మోక్షము గలుగును. కర్మలవలన చిత్తశుద్ధి గలిగి క్రమముగా జ్ఞానము నొందుటకు తగుయోగ్యత గల్గును. ఒకమనుష్యుని ఫలానివాడని తెలియవలయుననిన వానిఅడియాలముల గుర్తెరిగినవెనుక వాడు ఫలానివాడని కనిపెట్టవచ్చునేగాని అది విడిచిపెట్టి తలక్రిందుగా తపస్సుచేసినను భూమండలమంతయు తిరిగివచ్చినను వానిని కనిపెట్టజాలనట్లు తన్ను తా నెరుగుటకు తపోజపాదికర్మాను ష్ఠానమువలన సాధ్యపడదు. కనుక వేదాంతవిచారణ చేయుటవలననే ఆత్మస్వరూపము తెలిసి చివరకు తననిజరూపమే బ్రహ్మాత్మయని తెలిసికొని మోక్షమునొందును.

98 ప్ర- జగద్విషయమున 1 ఆరంభవాద, 2 పరిణామవాద, 3 కార్యకారణవాద, 4 బింబప్రతిబింబవాద ప్రభృతుల నేల చెప్పకూడదు? వివర్తవాదము నేల చెప్పవలెను?

స- 1 తల్లిగర్భమునుండి శిశువు పుట్టినట్లు బ్రహ్మమునందుండి జగత్తు పుట్టెననుట ఆరంభవాదము. ఇచట తల్లి వేరుగా శిశువు వేరుగా రెండు ఖండపదార్థములుగా నున్నట్లు జగత్తువేరుగా బ్రహ్మము వేరుగా ఖండపదార్థములుగా లేవు. గాన ఆరంభవాదము చెప్పరాదు.

2 పాలు పెరుగుగా మార్పునొందినట్లు బ్రహ్మమే జగత్తుగా మార్పునొందె ననుట పరిణామవాదము. పాలరూపము చెడి పెరుగు అనురూపాంతరము వచ్చునట్లు బ్రహ్మరూపము చెడి జగద్రూపము రాలేదు. జగత్తునందుగూడ ప్రతిప్రాణియందును సత్, చిత్, ఆనందాది బ్రహ్మలక్షణము లిప్పటికిని స్ఫుటముగా గోచరించుచున్నందున ఈపరిణామవాదము చెప్పరాదు.

3 మన్ను దానినిజరూపము చెడకయే కుండగా నేర్పడినట్లు బ్రహ్మరూపము చెడకయే జగత్తుగా తోచుననుట కార్యకారణవాదము మన్ను కొంత వికారము నొందనిదే కుండగా నేర్పడదు. బ్రహ్మము నిర్వికారమైనందున జగత్తుగా నేర్పడు ననుటకు వీలులేనందున ఈ కార్యకారణవాదము చెప్పరాదు.

4 సూర్యుడు వికారపడకయే జలమునందు ప్రతిబింబించునట్లు బ్రహ్మముయొక్క ప్రతిబింబమే జగత్తనుట బింబప్రతిబింబవాదము. సూర్యుడు ప్రతిబింబించుటకు జల మనెడిఆధార ముండవలెను. అట్లు బ్రహ్మము ప్రతిబింబించుటకు జగత్తుగాక వేరగుఆధార ముండవలెను. జగత్తులోని ఉదకము బ్రహ్మప్రతిబింబమేగాన ఈప్రతిబింబకారణమగు (బింబాధారమగు) జలము వేరుగా నుండవలెను. కాన బింబప్రతిబింబ వాదము చెప్పరాదు. మరియు నేది మరియొకవస్తువునందు ప్రతిబింబించునో అది పరిపూర్ణవస్తువు గాదు. సూర్యుడొకచోట జలము మరియొకచోట నుండుటవలన ఆజలమునందు సూర్యుడు ప్రతిబింబించును. కనుక నీరెండువస్తువులను పరిపూర్ణవస్తువులు గాజాలవు. అపరిపూర్ణవస్తువులకే ఈబింబప్రతిబింబన్యాయము చెల్లును. బ్రహ్మ మపరిపూర్ణవస్తువు గానందున ఈబింబప్రతిబింబవాదమును చెప్పరాదు. మరియు పరిపూర్ణత్వమునకు దోషములేక శుక్తియందు భ్రాంతిచే రజతము తోచునట్లు బ్రహ్మమునందు భ్రాంతిచే జగత్తు తోచుననుట వివర్తవాదము. శుక్తికంటె వేరుగా రజతమనునది శుక్తియందు లేదని పరీక్షించి చూచినవెనుక ఆశుక్తియందు రజతము తోచుట లేదు. అట్లు బ్రహ్మముకంటె ప్రపంచము వేరుగా లేదని ఎరిగినప్పటికిని మరల ప్రపంచ మున్నదనెడివ్యవహార మున్నది. అందుచే నీ శుక్తికారజతోపమానము సరికాదు.

అసత్తగు ఎండమావులవలె సద్రూప మగుబ్రహ్మమందు అసత్తగుజగత్తు తోచుచున్న దన్నయెడల ఎండమావులందు జలము లేదని తెలిసినవెనుక అక్కడ జల ముండునట్లు తోచినను ఆజలము నెవరును త్రాగిన ట్లనుభవము లేదు. జగత్తులో నేను

జలమును త్రాగితిని. నాకు దాహము తీరెను. నేను స్నానముచేసితిని- ఇత్యాదివ్యవహారము సర్వజనానుభవసిద్ధమైనందుచే ఈయెండమావుల దృష్టాంతము సరికాదు.

స్వప్నమందు తోచినజగత్తువలె బ్రహ్మము జగత్తుగా తోచు నన్నచో స్వప్నప్రపంచ మెట్లు అసత్యమో అట్లే ఈప్రపంచమంతయు అసత్యమే కావలెను. స్వప్నమందు భాసించుపదార్థము లన్నియు తాత్కాలికమనోవిజృంభణమేగాని అనుభవమందు తరువాత జాగ్రత్తలో లేవు. అట్లే బ్రహ్మ మాజగత్తుగా మనోవిజృంభణమాత్రమే యన్నచో ఒకప్పుడును బ్రహ్మము జగత్తు గాలేదు. ఇందుచే స్వప్నప్రపంచమువంటి దీజగ మనరాదు. మనస్సే మాయయొక్క ప్రథమ పరిణామము. ఈమాయ యనునది సర్వజీవులయొక్క పూర్వజన్మలందలి పుణ్యపాపకర్మవాసనలేగాని వేరు గాదు. కాన మాయయే జగత్తు, జగత్తే మాయ. కావున జగత్తును నానావిధజీవులును మాయాకార్యములేగాని సత్యములు గావు.

99 ప్ర- శరీరేంద్రియాది 24 తత్వములు నశించునవి. నే నక్షరుడను, నశింపనివాడను. గాన నశించుస్వభావము గలశరీరేంద్రియ వ్యాపారములు నావ్యాపారము లెంతమాత్రమును గావు. క్షర మగు శరీరాదులకును అక్షరవాచ్య మగుప్రకృతికిని పరుడ నగునేనే పరమాత్మను, ప్రత్యగాత్మయును అయి ప్రకాశించుచున్నాను. శుక్తిక యందు రజతమువలె రజ్జువునందు సర్పమువలె నాయందే సకలజగత్తు ఆరోపింపబడినదేగాని నేను స్వభావముచేత సత్య, జ్ఞాన, అనంత, ఆనందరూపుడనే యని మీరు చెప్పగా తెలిసికొంటిని. ఈక్షణమందు కల్గిన యీజ్ఞానము నాకు చిరకాల ముండుట కుపాయ మేమి ?

స- ఆనంద మతిశయించునట్లు, చిత్తశాంతి గల్గుటకు, ఎల్లప్పుడు బ్రహ్మనిష్ఠ నొందియుండవలెనేగాని వేరొకసాధనము లేదు. బ్రహ్మ విచారణ చేయనివానికి బ్రహ్మనిష్ఠ దుర్లభము. ఇది ఆత్మ, ఇది ఆత్మ కాదు- అనెడివివేచనము గలవానికిమాత్రమే బ్రహ్మనిష్ఠ సాధ్య

మగును. పుష్పములను కోయుటయును ఆసమయమందే కన్నులు మూయుటయును ఎంతసులభమో బ్రహ్మనిష్ఠ అంతసులభము. రాత్రిం బవళ్ళు తదేకదీక్షతో బ్రహ్మవిచారణ చేయుచుండవలెను. అట్లైనచో బుద్ధి నిరంతరాభ్యాసముచేత బ్రహ్మాకారవృత్తి నొంది చివరకు బుద్ధి గూడ లేక బ్రహ్మలో లీనమగును. ఆవు పొదుగునందు గోమారు లున్నను ఆపాలు వానికి లభించనట్లును కోతికి కొబ్బరికాయ లభించి నను దానియనుభవము నొందజాలనట్లును పైవిచారణ చేయనివాడు బ్రహ్మానందమును గ్రోలజాలడు.

100 ప్ర- జ్ఞాననిష్ఠ లేక సమాధికాలమందు మనస్సుండునెడల సూక్ష్మదేహ మంతయు నుండవలెను. అయ్యది స్థూలము నాశ్రయిం పక యెట్టిపనిని చేయజాలనందున స్థూలదేహముగూడఉండితీరవలెను. అహంకారాదు లీదేహములతో నెల్లప్పుడు గూడియేయుండును. గాన సర్వసంసారమును సమాధియం దుండునని తేలుచున్నది. ఇక సమాధి యెట్లు సిద్ధించును ? అట్లుగాక సమాధియందు మనస్సు లేదంటిమేని సమాధినుండి లేచుట సంభవింపదు. సమాధినుండి లేవ కున్నయెడల బ్రహ్మానుభవము గలసజ్జనులు లభింపరు. అవు డితరసాధ కుల కుపదేశించువా రుండరు. ఇంతబాధ సమాధియందు మనస్సు లేదనినచో గలుగును. అందుకొరకు మనస్సు కొంతకాల ముండునని కొంతకాల ముండదనియు చెప్పునెడల మోక్షము నొందినవారు తిరిగి సంసారబద్ధు లగుదు రనవలసివచ్చును. అట్లైన మోక్ష మనిత్య మగును. దీనికి సమాధాన మెట్లు ?

స- మనస్సు అచేతనమైనది. దానికి స్వయముగా ఇది చేత నము ఇది అచేతనము అని తెలిసికొనుశక్తి లేదు. కాన బ్రహ్మమిట్టి దని మన స్సెన్నడును తెలిసికొనజాలదు. ఆమనస్సులోనికూటస్థప్రతి బింబము ప్రపంచము నజ్ఞానావస్థయందును బ్రహ్మమును జ్ఞానావస్థ యందు తెలిసికొనును. ఈమనస్సుసుషుప్తిలో కూటస్థునియందు లీనమగుచున్నది. కాని జాగ్రద్దశయందు మిథ్య యగుదేహాది జగత్తును భాసింపజేయుచున్నది. కూటస్థుడ వగు నీనిజరూపము

సచ్చిదానందరూపము. కాన నిన్నామన స్సేమియు చేయజాలదు. కుండేటికొమ్ములకును ఆకాశమునకును చేరిక యెన్నటికిని కలుగ జాలదు. స్వప్నపదార్థము లెంతఅసత్యములో మనస్సు నంత అసత్యమైనది. అద్దానివికారములు కూటస్థుని నెంతమాత్రము నంటవు. లోకమంతను ఒకేసూర్యుడు ప్రకాశింపజేయుచున్నను లోకమందలిపదార్థములందలి గుణదోషములు సూర్యుని నంటనట్లు మనస్సు ఇంద్రియములు మొదలగువానినన్నిటిని కూటస్థుడే ప్రకాశింపజేయుచున్నను వానిగుణదోషములు కూటస్థు నెంతమాత్రము నంటవు. మరియు ఆకాశమువలన పుట్టినవాయువు లోకమంతట చలించుచున్నను ఆచలనము కారణ మగుఆకాశము నెంతమాత్రము స్పృశింపదు. అట్లే బ్రహ్మకార్య మగుజగ త్తెట్టివికారముల నొందినను అవి కారణ మగుబ్రహ్మము నంటవు. ఈజగమంతయు మాయాకల్పిత మైనది. 1 మాయ అసాధ్యమును సాధించి, లేనిదానిని భాసింపజేయును. 2 అది జడమై ఎన్నడును చైతన్యమును విడిచియుండదు. 3 దీనికి ఆది లేదు. అంతముమాత్రము గలదు. 4 బ్రహ్మైకత్వమును అపరోక్షముగా గుర్తించినక్షణమే ఆమాయకు అంతకాలము కనుక మనస్సు సర్వాత్మనా లేదు.



## బ్రహ్మవాదివివేకము

### —♦ డాంబిక బ్రహ్మవాది లక్షణము ♦—

అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే
ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదనమోదవత్.

తా॥ అపరోక్షబ్రహ్మానుభవము లేనిమూఢుఁడు (లోకవంచకుఁడై) తనకేమేమో బ్రహ్మానుభవ మున్నట్లు వృథామోదమును గనుపఱచుచుండును. ఇయ్యది నదీతీరమందలి పొన్నతమాతతరు శాఖాగ్రఫలముల గ్రహింపఁ జాలక యధోభాగమునఁ బ్రవహించెడి

జలమందుఁ దత్ఫల ప్రతిబింబమును జూచి తత్ఫలరసాస్వాదనానందము ననుభవించుచున్న ట్లభినయించుటను బోలియుండును.

—♦ జీవన్ముక్తుని ప్రవర్తనాదికము ♦—

మ॥ అనపేక్షుం డసమానుఁడై ధనికదీనాలాపముల్ వీనులన్
వినకే కర్మరదేహచేష్టల నొగిన్ వీక్షింపకే నిత్యముం
దనుఁ దాఁ జూచుచుఁ బావనాత్మకసుతీర్థశ్రేణి నత్యంత
పావనముంగా నొనరించుచుం జెలఁగు జీవన్ముక్తుఁ డానందుఁడై.

తా॥ జీవన్ముక్తుడు సదా బ్రహ్మానందము గలవాడై ఏకోరికలు లేనివాడై తనకుసముడులేని, నిరుపమానుడై ధనవంతుల యొక్కయు, దరిద్రులయొక్కయు పలుకులు చెవులవినకుండకయే ఎవ రేయేమాటలు మాటలాడుకొనుచున్నను జెవిని బెట్టక కర్మశ్రద్ధగలవారలయొక్క శరీరవ్యాపారములను చూడక అనగా నిత్యనైమిత్తికాదిశాస్త్రోక్తకర్మలను పాటింపక సర్వకాలసర్వావస్థలయందును బ్రహ్మమైవెలుగునట్టితననే అనగా బ్రహ్మమునే చూచుచు పరిశుద్ధస్వరూపములయినపుణ్యతీర్థములయొక్క వరుసను మిక్కిలి పవిత్రములుగా చేయుచు పామువిడిచినకుబుసమునందు పామునకెట్టియభిమానము లేనట్లు దేహమం దట్టిఅభిమానశూన్యుడై బ్రహ్మానందమున ప్రకాశించుచుండును.

సీ॥ ఒకవేళఁ దనయందు సకలప్రపంచంబు
కల్పితం బని యెంచి కాంచి నవ్వు
ఒకవేళ సర్వభూతోపాధితతియందుఁ
దనుఁ జూచి మిగుల సంతసముఁ జెందు
ఒకవేళ దేహాదు లొప్పుగా విహరింప
సర్వసాక్షి నటంచు సంభ్రమించు
ఒకవేళ నన్య మించుక లే దొకండ నే
నని నిర్వికల్పసమాధి నొందు

జీవన్ముక్తుడు (1) ఒకసమయమున తనయం దెల్లలోకములు ఆరోపింపబడినవని భావించి నవ్వును. (2) ఒకానొకప్పుడు పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనుపంచభూతములనెడి ఉపాధులయొక్క సమస్తసముదాయమునందు బ్రహ్మభావము కని అత్యంతానందము నొందును. (3) ఇంకొకసమయమునందు స్థూలశరీరము మొదలగు నవి చక్కగా సంచరించుచుండగా కూటస్థుడనని సంతోషము జెందును. అనగా కర్తృత్వరహితుడై సాక్షియై యుండును. (4) వేరొక సమయమందు తనకంటె భిన్నమైనది కొంచెమైనను లేనేలేదు. నే నొక్కడనే యని నిశ్చలబ్రహ్మనిష్ఠయం దుండును. లేక నిర్వికల్ప సమాధియం దుండును.

తే॥ లిప్తమాత్రం బవిద్యాఽవిలిప్తమాత్ర మయిన
ఘను నెన్న లేరు బ్రహ్మాదు లనఁగ
క్షణము సర్వజగద్విలక్షణముఁ బొందు
వానినుతియింపఁ దరమె యెవ్వానికైన ?

తా॥ అజ్ఞానాస్పృష్టచిన్మాత్రావస్థితి నొకత్రుటి మాత్రమైన బడసినఘనునే బ్రహ్మాదులుసయితము నుతింపజాలరనిన, అనుక్షణము సర్వజగద్విలక్షణ మగునట్టియఖండాత్మావస్థితి నలరుమహామహుని నుతింప నెవరికి సాధ్యమగును ? అనగా ఎవ్వరికిని సాధ్యము కాదు.

నీరోగ ఉపవిష్టో వా రుగ్ణో వా విలుఠన్ భువి
మూర్ఛితో వా త్యజ త్వేవ ప్రాణాన్ భ్రాంతి ర్న సర్వథా
తీర్థే శ్వపచగృహే వా
నష్ట స్మృతిః పరిత్యజన్ దేహమ్
జ్ఞానసమకాలముక్తః
కైవల్యం యాతి హతశోకః

తా॥ ద్వైత భ్రాంతిలేనియాజ్ఞాని వ్యాధిలేనివాడై కూర్చుండినను వ్యాధిగలవాడై భూమిపై పొర్లాడుచున్నను మూర్ఛ బొందినను పుణ్యనదీతీర్థములయందైనను, చండాలాదిగృహస్థలములయందైనను,

ప్రాణముల విడిచినను జ్ఞానసమ కాలమునందే ముక్తుడయినందున వానికి నేవిధమునను ద్వైతభ్రమ లేదు. [జ్ఞానసమకాలము= అజ్ఞాననివృత్తి జ్ఞానోదయము ఏకకాలమందే అగును. దీపమువచ్చుట చీకటి పోవుట యెట్లో అట్లే యనిగ్రహించునది.]

దినేదినే స్వప్నసుప్త్యో రధీతే విస్మృతే ప్యయమ్
పరేద్యు ర్నానధీత స్స్యా త్తద్వ ద్విద్యా న నశ్యతి.

తా॥ మరణకాలమందు మూర్ఛాదులచేత జ్ఞానము నశించుచుండగా భ్రాంతి అనుటకు వీలులేదు. ఎందుచేతనన ప్రతిదినము చదువబడినవేదము స్వప్నసుషుప్త్యాద్యవస్థలందు మరిచిపోబడినను ఆపురుషుడు పరదినమందు వేదమును చదువలేనివాడు కాడు, అప్రకారమే మరణాదికాలమందు మూర్ఛాదులచేత బ్రహ్మస్వరూపానుసంధానము వారికి లేకపోయినను వారియాత్మజ్ఞానము నశింపదు. ఇందుకు ప్రమాణము.

ప్రమాణోత్పాదితా విద్యా ప్రమాణం ప్రబలం వినా
న నశ్యతి న వేదాంతా త్ప్రబలం మాన మీక్ష్యతే.

తా॥ వేదాంతప్రమాణముచేత పుట్టించబడినబ్రహ్మజ్ఞానము వేదాంతప్రమాణముకన్న బలవత్తరమైనమరియొకప్రమాణమెచ్చటను లేనందున బ్రహ్మజ్ఞాన మెన్నటికిని నశింపదు.

యస్మాన్మంత్రబలోపేతః క్రీడ న్సర్పై ర్న లిప్యతే
క్రీడన్నపి న లిప్యేత తద్వ దింద్రియపన్నగైః.

తా॥ మంత్రముచేత కట్టుబడినసర్పముతో క్రీడించినను ఆ సర్పము కాటువేసి బాధించలేనట్లు దశేంద్రియమను సర్పములు ఆత్మజ్ఞాన మనుమంత్రముచేత కట్టువడి వానితో క్రీడించు ఆత్మజ్ఞానిని బాధింపజాలవు.

దేహాత్మజ్ఞానవద్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్
ఆత్మన్యేవ భవే ద్యస్య న నేచ్ఛన్నపి ముచ్యతే.

తా॥ దేహమే నేననెడిమనుష్యాజ్ఞానమును బాధించునట్టిదియు దేహమే నేననెడిమనుష్యాజ్ఞానమువంటిదృఢమైనబ్రహ్మాజ్ఞానము ప్రత్యగాత్మయం దేయేపురుషునకు కలుగునో ఆపురుషుడు మోక్షేచ్ఛ లేనివాడయినను సంసారహేతు వగుఅజ్ఞానము జ్ఞానముచే బాధింపబడుటచేత సంసారబంధమునుండి విడువబడుచున్నాడు.

జనకాదేః కథం రాజ్య మితిచే దృఢబోధతః
తథాతథాపిచే త్తర్కం పర యద్వా కృషిం కురు.

తా॥ జనకాదిజ్ఞానివర్గమునకు రాజ్యపరిపాలనాదిలౌకికవ్యవహార ప్రవర్తన మెందుచేత గలిగె ననియంటివేని నిశ్చలమగుఅపరోక్షజ్ఞానము కలిగియుండుటచేతనే నీవును అట్టినిశ్చలాపరోక్షజ్ఞానము వలయునెడల తర్కమును చదువుము. లేక కృష్యాదులను చేయుము.

ప్రవృత్తౌ వా నివృత్తౌ వా దేహేంద్రియమనోధియామ్
న కించిదపి వైషమ్య మ స్త్యజ్ఞానివిబుద్ధయోః.

తా॥ కర్మలచేయుటయందుగాని కర్మలు చేయకుండుటయందు గాని అజ్ఞానియొక్కయు జ్ఞానియొక్కయు దేహేంద్రియమనోబుద్ధుల వ్యాపారమందు కొంచమైనను భేదముండదు లేదు.

వ్యవహారో లౌకికో వా శాస్త్రీయోఽన్యథాపి వా
మమాకర్తు రలేపస్య యథారబ్ధం ప్రవర్తతామ్.

తా॥ జ్ఞాని కంతటను కర్తృత్వము లేకపోవుచుండగా మీకనియతకర్తృత్వము ప్రాప్తించుననక కర్తృత్వభోక్తృత్వరహితుడ నగు నాకు ప్రారబ్ధకర్మము నతిక్రమించక భిక్షాహారాదిలౌకికవ్యాపారమైనను ప్రతిషిద్ధహింసాదివ్యవహారమైనను గలుగుట మా కిష్టమే యగును. ప్రారబ్ధవశమున ప్రాప్తించెడి అనియతప్రవృత్తిత్వము గలిగినను గలుగనిమ్ము.

ఆరబ్ధకర్మనానాత్వా ద్బుద్ధానా మన్యథాన్యథా
వర్తంతాం తేన శాస్త్రార్థే భ్రమితవ్యం న పండితైః.

తా॥ ప్రారబ్ధకర్మముయొక్క నానాత్వమువలన అనగా ప్రారబ్ధకర్మ నానావిధములుగా నుండుటచేత జ్ఞానులకును నానావిధముగ ప్రవర్తనము కలిగియుండును. అందుచేత శాస్త్రార్థమందు పండితులు భ్రమింపరాదు.

స్వస్వకర్మానుసారేణ వర్తంతాం తే యథాయథా
అవశిష్ట స్సర్వబోధ స్సమా ముక్తి రితి స్థితిః.

తా॥ అజ్ఞానులు తమతమ ప్రారబ్ధకర్మానుసరణముగా తమతమ యిష్టానుసారం ప్రవర్తించుచుందురు సర్వజ్ఞానులయొక్క ఆత్మజ్ఞానము అనగా నేను బ్రహ్మమునైతి ననెడియాకారము గలజ్ఞానము భేదము లేనిదనియు జ్ఞానఫల మగుముక్తి సమానమనియు వేదాంత సిద్ధాంతము.

ఏనంచ కలహః కుత్ర సంభవే త్కర్మిణో మమ
విభిన్నవిషయత్వేన పూర్వాపరసముద్రవత్.

తా॥ కర్మికిని జ్ఞానికిని ప్రాక్పశ్చిమసముద్రములవలె విభిన్నవిషయము కల్గియుండుటచేత కలహసంబంధహేతువు లేదు.

వపుర్వాగ్ధీషు నిర్బంధః కర్మిణో నతు సాక్షిణి
జ్ఞానిన స్సాక్ష్యలేపత్వే నిర్బంధో నేతరత్ర హి॥

తా॥ 1 కర్మికి దేహమందును, వాక్కునందును బుద్ధియందును నిర్బంధము గలదు. 2 ప్రత్యగాత్మయందు నిర్బంధము లేదు. 3 జ్ఞానికి సాక్షిప్రత్యగాత్మయొక్క భోక్తృత్వమందు నిర్బంధము గలదు. 4 ఇతరమునం దనగా మనోవాగ్దేహములయందు నిర్బంధము లేదు.

యం కర్మీ న విజానాతి సాక్షిణం తస్య తత్త్వవిత్
బ్రహ్మత్వం బుధ్యతాం తత్ర కర్మిణః కిం విహీయతే.

తా॥ 1 కర్మలను చేయువారు ప్రత్యగాత్మ నెరుగరు. 2 ప్రత్యగాత్మకు బ్రహ్మభావము అనగా బ్రహ్మస్వరూపలక్షణము జ్ఞాని యెరుగును. ఆవిషయమందు కర్మికి కర్మానుష్ఠానమందు లోపము లేదు.

చోద్యం వా పరిహారో వా క్రియతాం ద్వైతభాషయా
అద్వైతభాషయా చోద్యం నాస్తి నాపి తదుత్తరమ్.

తా॥ చోద్యమైనను పరిహారమైనను వ్యవహారదశచేత చేయబడును. అద్వైతదశచేత చోద్యము లేదు. ఆచోద్యమునకు సమాధానమైనను లేదు.

తావ ద్గర్జంతి శాస్త్రాణి జంబుకా విపినే యథా
న గర్జతి మహాశక్తి ర్యావ ద్వేదాంతకేసరీ.

తా॥ అరణ్యమందు సింహము లేనికాలమందును దేశమందును నక్కలు మొదలగు క్షుద్రమృగములు గర్జించునట్లు వేదాంతశాస్త్రజ్ఞుడు లేనిచోట సాంఖ్యయోగ, న్యాయ, వైశేషిక, బౌద్ధ, జైన, పాశుపత, పాంచరాత్రాదిదర్శనానుయాయులు గర్జింతురు. ఆసింహము గర్జించు ప్రదేశమం దితరమృగములన్నియు పారిపోవునట్లు వేదాంతశాస్త్రజ్ఞుని చూచి పయిదర్శనానుయాయులు పారిపోవుదురు.

అహో శాస్త్ర మహో శాస్త్ర మహోగురు రహో గురుః
అహో జ్ఞాన మహో జ్ఞాన మహో సుఖ మహో సుఖమ్.

తా॥ బ్రహ్మప్రాప్తికి సాధన మగుశాస్త్రము, గురువు, జ్ఞానము, అద్దానిఫల మగునాసుఖస్వరూపత్వమును ఎంతగొప్పవి ! ఎంత ఆశ్చర్యకరమైనవి !

—♦ లోకాసంగ్రాహవిద్వన్నింద ♦—

బుద్ధాద్వైతసతత్త్వస్య । యథేచ్ఛాచరణం యది
శునాం తత్త్వదృశాంచైవ । కో భేదోఽశుచిభక్షణే.

తా॥ ప్రత్యగభిన్నాపరోక్షబ్రహ్మసాక్షాత్కారము నొందిన తత్త్వవేత్త యగువాడుగూడ యథేచ్ఛాచారియగునెడల నిషిద్ధసేవ (మలభక్ష) క మగుశునకమునకును దత్త్వవేత్తకును హెచ్చుత గ్గేమి గలదు ? అనఁగాఁ దత్త్వవేత్త యగువాఁడు "తస్య కార్యం నవిద్యతే" మున్నగుశాస్త్రముల ననుసరించి, కృతకృత్యుఁడైనను సాధకులకృత

కృత్యతకొఱకు మార్గదర్శియై లోకసంగ్రాహకము లగు విహితకర్మ ములనే యాచరించుచుండవలెను. అట్లుగాక తాను గృతార్థుఁడైనంత మాత్రమున లోకమర్యాదల నుల్లంఘించినచోఁ దాను దరణోపాయ ముగ నౌకను గైకొని నదిని దరించిన పిదప నౌకను భగ్నమొనర్చి నట్లె యగును. ఈవిషయమునే "యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జన" ఉత్తముఁ డాచరించుదాని నాదర్శముగఁ గొనియే యితర జనము ప్రవర్తించును. "న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన । నానవాప్త మవాప్తవ్యం వర్తఏవచ కర్మణి" ఓయర్జునా ! ముల్లోకములలోఁగూడ నాకుఁ బొందరానిదిగాని పొంద వలసినదిగాని యెద్దియును లేదు. అట్లైనను లోకసంగ్రహార్థమై విధి విహితమార్గమందె నడచుచుంటిని. ఇత్యాద్యనేకరీతులు భగవానుఁ డర్జునునకుపదేశించియుండెఁ గావునఁ దత్త్వదర్శి లోకసంగ్రహార్థమై విధిశాస్త్రము ననుసరించవలెనని సిద్ధాంతము గాని యిచట "నిస్త్రై గుణ్యే పథి విచరతాం కోవిధిః కోనిషేధః" త్రిగుణాతీతమార్గమందు విహరించువారికి విధి యెద్ది? నిషేధమెద్ది? "జక్షన్ క్రీడన్ రమమాణ స్త్రీభిర్వాయానైర్వా వయస్యైర్వాఽవయ స్యైర్వా నోపజనం స్మర న్నిదం శరీర మితి" అంతికమందుండినట్టి యీశరీరమునుగూడ స్మరించక నిరంతరము బ్రహ్మాత్మమాత్రస్థితిలో నున్నతత్త్వవేత్త భుజించుచుండి నను స్త్రీలతోఁగాని, యానముతోఁగాని, శత్రుమిత్రాదులతోఁగాని విహరించుచున్నను బాధలేదు. "అతిప్రసంగ ఇతిచేత్ప్రసంగం తావ దీరయ । ప్రసంగో విధిశాస్త్రంచేత్తన్నతత్త్వవిదంప్రతి" తత్త్వవేత్త స్వేచ్ఛాచారి యైనచో నతిప్రసంగము తటస్థించదా ? యని ప్రశ్న రాఁగాఁ బ్రసంగమెద్దియని సిద్ధాంతి ప్రశ్నించె. విధిశాస్త్రమే ప్రసంగ మనఁగా, నాశాస్త్రము దేహాదితాదాత్మ్యాధ్యాసరహితుఁ డగుతత్త్వ దర్శినిగుఱించి కాదని యీ "బుద్ధాద్వైతసతత్త్వస్య" యని వ్రాసిన విద్యారణ్యులవారే యీశ్లోకమును వ్రాసిరి. ఇట్లే "బ్రహ్మహత్యాశ్వ మేధాద్యైః పుణ్యపాపై ర్నలిప్యతే" "నమాతృవధేన, నపితృవధేన, నస్తేయేన నభ్రూణహత్యయా, నాస్య పాపంచ నకృష్ణోముఖాన్నీలంవా"

ఇత్యాది బ్రహ్మవిద్యాకాంక్షితక బ్రాహ్మణోపనిషదాది ప్రమాణము లంబట్టి తత్త్వవేత్తకు విధిప్రతిషేధములతోఁగాని పుణ్యపాపములతోఁ గాని సంబంధము లేదని తెలుటేగాక పూర్వోక్తరీతిని స్త్రీవయస్యా దులతో విహరించుచుండినను "నబాధో గ్రంధిభేదతః" గ్రంధి విచ్ఛిన్నమగుటచే విధిశాస్త్రము శాసింపఁజాలదనియు స్వేచ్ఛాచారము బంధకముగాదనియుఁ దెలియుచుండెఁగదా. పైవిధముగాఁ దత్త్వవేత్త లోకసంగ్రాహకుఁడే కావలెనని చెప్పు టెట్లు ఘటించును ? అని శంక గలుగును. ఇందుకు సమాధానము.

'బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే'

'మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే'

'కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తయేత్'

'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే'

'పరిపక్వమలా యే తా న్ప్రతిబంధకపాపోత్సాదనహేతు
శక్తిపాతేన యోజయతి పరే తత్త్వే సఏవ గురుః'

తా॥ ఇత్యాద్యనేకప్రమాణములవలన ననేకజన్మార్జితసుకృత పుంజ పరీపాకవశమునఁ దత్త్వజిజ్ఞాస గలుగఁగా సద్గురుకరుణా కటాక్షముచే నజ్ఞానావరణవిభంజకతత్త్వసాక్షాత్కారము గలుగునని తెలియుచుండె. తత్త్వజ్ఞానానంతర మారబ్ధదేహ పతనపర్యంతము, కులాలచక్రభ్రమిభంగి నారబ్ధకర్మవేగ మున్నంతవఱకుఁ గర్తలేనట్టి విద్వచ్ఛరీరవ్యవహారము క్రియామాత్రమై జరుగుచుండును. అట్టిస్థితిలో నాకులాలచక్రము నేవైపునకుఁద్రిప్పి కర్త వెడలునో తరువాతఁగూడ నావైపునకే వేగమున్నంతవఱకుఁ బరిభ్రమించుచుండును. కాని కర్తయగుకులాలుఁడు లేనపుడు స్వేచ్ఛగాఁ దిరుగవచ్చు నన్నంతమాత్రమున నాచక్రము పూర్వక్రమమునకు విరుద్ధక్రమముగఁ దిరుగవలెనన్నచో ఘటియొకకర్త గావలెను గదా. ఈవిధముగనే యనేక జన్మములనుండి పరిభ్రమించుచున్నట్టిపుణ్యపురుషున కాయాపుణ్యరాశిపరిణామరూప మగును త్తమశరీరము లభించినపు డాశరీరమందుఁ

దత్త్వజిజ్ఞాసువై జీవుఁ డున్నంతవఱ కెట్టివిధిశాస్త్రానుసారి యగుప్రణ్యామార్గ మబ్బియుండెనో యాయుపాధియం దాజీవునకు సమ్యగ్దర్శనము గలిగినవెంటనే యచట కర్త (కర్తృత్వాధ్యాస) నశించినను దదుపాధి పూర్వవేగము ననుసరించి విధిశాస్త్రానుసారముగనే యథాపూర్వముగఁ బరిభ్రమించుచుండును. ఆకర్మము కర్మముగాదు. అహంకారచిత్తాదాత్మ్యాధ్యాసాత్మకగ్రంథిమూలకము లగుకర్మములే కర్మములు. తద్గ్రంథిరహితోపాధిపరివర్తన మంతయుఁ జేష్టామాత్రమే. ఈవిషయమంతయు "నతత్కర్మ కర్మ భవతి, యేన బుద్ధే స్సముచ్ఛయ స్స్యా" దిత్యాది భగవద్గీతాభగవత్పాద భాష్యమున విస్పష్టమైయున్నది. అట్టిచేష్టామాత్ర మగుకర్మమంతయు యథాపూర్వముగనే యుండును అదియే లోకసంగ్రాహకకర్మ మనబడును. అట్టిస్థితిలో విధిశాస్త్రముల నుల్లంఘించి యాయుపాధి ప్రవర్తింపవలెనన్నచోఁ గ్రొత్తకర్త రావలెను అది కల్ల. కొంతకాలము తరచఁగాఁ బాలనుండి వెన్న పృథక్కరింపఁబడుఁగాని తిరిగి యేయుపాయముచేతను యథాపూర్వముగ వెన్న పాలలోఁగలియనట్లు కొంతకాలము ప్రయత్నించఁగా నజ్ఞాని (సగ్రంథికుఁడు) జ్ఞాని (నిర్గ్రంథికుఁడు) యగుఁగుగాని తిరిగి జ్ఞాని యజ్ఞానియగుట కల్లయనిభావము. కావునఁ దత్త్వవిదుపాధిపరివర్తన మంతయు శాస్త్రీయముగనే యుండి లోకసంగ్రాహక మగుచుండునని తెలియవలెను. ఇట్టిస్థితిలోఁ దత్త్వవేత్తకు విధిప్రతిషేధములు లేవనియు స్త్రీవయస్యాదులతో భోగించినను బ్రహ్మహత్యాశ్వమేధము లొనర్చినను బుణ్యపాపములు లేవనునట్టి వచనము లెందుకు బయలుదేరినవనిమాత్రము శంక గలుగును. ఇందుకు సమాధానము. ఈవచనముల కన్నిటికి నంతఃకరణము సమ్యగ్దర్శనముచే నిర్గ్రంథికమైనపిదపఁ బుణ్యపాపము లాతనికి సంబంధించవని చెప్పుటయందే తాత్పర్యముగాని తత్త్వవేదనానంతరము స్వేచ్ఛాచారమునకు మఱియొకకర్తవచ్చుననిగాని కర్త లేకయే పూర్వక్రియకు విరుద్ధముగఁ దదుపాధి పరిభ్రమించుననిగాని చెప్పుటయందుఁ దాత్పర్యము లేదు.

కాని యొకసూక్ష్మవిచారము గలదు. ఆరబ్ధదేహము పుణ్యాపాపాన్యతరకర్మనిర్మిత మగుటచే శుభోదయసమయమున సమ్యగ్దర్శనము గల్గినతరువాత నశుభకర్మప్రవృత్తిగూడఁ గ్వాచిత్కముగఁ గలుగవచ్చును. అట్టిస్థితిలో వైరాగ్యోపరతులు లేక ప్రవర్తించుటయు లోకనిందయుఁ గలుగును. అపుడాయుపాధివలన లోకసంగ్రహము జరుగదు. అట్లైనను దదుపాధ్యనంతరము విదేహకైవల్యము సిద్ధమె. (విదేహకైవల్యములో బ్రహ్మవిత్, బ్రహ్మవిద్వర, బ్రహ్మవిద్వరీయ, బ్రహ్మవిద్వరిష్ఠులందఱు నొకేస్వరూపము నొందుదురు.) గాని యాబ్రహ్మవేత్తలలో జీవన్ముక్త్యావస్థయందుఁ దరతమభావము నుండును. అందుఁ గొందఱు తత్త్వవేత్తలు సామాన్యముగ నజ్ఞానులఁ బోలియుందురు. అనఁగా దేహేంద్రియమనఃప్రాణాది ప్రవృత్తినివృత్తులు జ్ఞానికి నజ్ఞాని యగుసాధకునితో సమముగ నుండవచ్చును. అంతమాత్రముచే నాతనిసమ్యగ్దర్శనకృతగ్రంథివిచ్ఛేదఫల మగువిదేహకైవల్యములో బాధలేదు. ఈయర్థమును "ప్రవృత్తౌ వా నివృత్తౌ వా దేహేంద్రియ మనోధియామ్ । నాహోరాదా వస్తి భేదః, అప్యజ్ఞానివిబుద్ధయోః"అని శ్రీవిద్యారణ్యులవారు సెలవిచ్చిరి. కావున నీవిధముగ శాస్త్రవ్యతిరిక్త మార్గమున సంచరించు వేత్తలుగూడఁ బూర్వోక్తవిధమున నారబ్ధవైచిత్రిచే నూటికొక్కరు కోటికొక్కరు క్వాచిత్కముగ నుండవచ్చును. అంతమాత్రమునఁ దత్త్వదర్శులందఱు విధిశాస్త్రముల నుల్లంఘింతురనియు విధిమార్గముల నుల్లంఘించుటయే బ్రహ్మజ్ఞాని లక్షణమనియు స్వసాంప్రదాయనిషిద్ధమార్గపరిభ్రష్టులగుకొంద ఱచలాభాసవాదులును, నచలవాద మిదియె యనుకొనియెడు కొందఱు జీవపరభేదవాదులును వచించునట్లు దలఁపరాదు.

ప్రాయికమార్గము ననుసరించి తత్త్వవిత్తు లోకానుగ్రాహకుఁడైయే యుండుననియు లేనిచోఁ దురీయవిజ్ఞానభూమికలోనుండి లోకమున కగమ్యుఁడై యుండుననియుఁ దెలియవలెను. కాని యింతవిచారించినను బ్రాయికముగ జీవన్ముక్తలక్షణకథనమెగాని జీవన్ముక్తున కిదమిత్థమని నిష్కృష్టలక్షణము చెప్ప వీలుగాదు. కావుననే "విదుషో

విధిప్రతిషేధాగోచరత్వేన జిజ్ఞాసో స్సాధనానుష్ఠానాయ లక్షణాన వాదాత్" (భ. గీ. 255 శాం. భా. ఆనందగిరి) "ప్రారబ్ధకర్మనానాత్వా దుత్థానా మన్యథాన్యథా । వర్తనం తేన శాస్త్రార్థే భ్రమితవ్యం నపండితైః" అని పైయర్థమునే శ్రీమదానందగిరి విద్యారణ్యాదులు నిరూపించియుండిరి. పర్యవసానమున నిజమైనతత్త్వవేత్త ప్రాయికముగ లోకసంగ్రాహకుఁడే యగుననియు, నట్లు గానివానికి విదేహముక్తి నిశ్చితమైనను లోకదూషణ మాత్ర మనివార్యమనియుఁ దెలియవలెను.



## నమోవాకము

శ్రు॥ సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయ వై నమోనమః
భవేభవే నాతిభవే భవస్వ మాం భవోద్భవాయ నమః.

తా॥ సద్యోజాత మను పేరుగల ఈశ్వరుని పశ్చిమవక్త్రమును శరణుజొచ్చుచున్నాను. ఓ ఈశ్వరా! నాకు మాటిమాటికి జన్మము వచ్చులాగున ప్రేరేపింపవలదు. జన్మమరణాదుల నతిక్రమించుచున్నట్లు నన్ను ప్రేరేపింపుము. నన్నిట్టిసంసారమునుండి ఉద్ధరించు నీసద్యోజాత వక్త్రమునకు నమస్కారము.

శ్రు॥ వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమశ్శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః కాలాయ నమః కలవికరణాయ నమో బల వికరణాయ నమో బలాయ నమో బలప్రమథనాయ నమ స్సర్వభూతదమనాయ నమో మనోన్మనాయ నమః.

తా॥ పరమేశ్వరుని ఉత్తరవక్త్రమునకు నమస్కరించుచున్నాను. అది 1 సుందరముగా ప్రకాశించునట్టిది, 2 అన్నిప్రాపంచిక వస్తువులకు ముందు పుట్టినందున జ్యేష్ఠమని చెప్పబడునట్టిది, 3 అన్నిటికంటె శ్రేష్ఠమైనది, 4 ప్రళయకాలమందు సర్వజీవసంహారముద్వారా జీవులను రోదనమొనరింపఁజేయునది, 5 సర్వులకు ఆయు

ర్ధాయక్షీణతకు హేతువయినది, 6 సుఖము గల్గియుండి నానావిధ జగన్నిర్మాణ మొనర్చునది, 7 సర్వదుష్టవృత్తు లనబడురాక్షసబల మును హింసించునది, 8 సకలబలశక్తులకు స్థానమైనది, 9 స్వేచ్ఛచే సకలబలశ_ని, ఉపసంహారమొనర్చునది, 10 సకలభూతములను శిక్షించునది. 11 మనస్సుకు సామర్థ్యము నిచ్చునది. ఇట్టిపరమేశ్వరుని ఉ_త్తరముఖమునకు నమస్కారము.

శ్రు॥ అఘోరేభ్యోథ ఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః
సర్వేభ్య స్సర్వశర్వేభ్యో నమ_స్తే అస్తు రుద్రరూపేభ్యః.

తా॥ సర్వాంతర్యామి వగుఓపరమేశ్వరా! ఘోరరూపము గాక శాంతస్వరూపమైనట్టియు ఉగ్రమైనట్టియు లయకాలమందు ప్రాణులను హింసించునట్టి నీరుద్రరూపములకు నమస్కారము.

శ్రు॥ తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహితన్నో
రుద్రః ప్రచోదయాత్.

తా॥ పరమేశ్వరునితూర్పుముఖ మగుతత్పురుషముఖము శాస్త్రాభ్యాసమువలన తెలిసికొందుము. అట్లు తెలిసికొని ఆమహాదేవుని ధ్యానింతుము. అందువలన రుద్రుడు మమ్ముల నాపరమేశ్వరధ్యానమందు ప్రేరేపించుగాక.

శ్రు॥ ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం
బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మా శివో మే అస్తు
సదాశివోమ్.

తా॥ ఏ పరమేశ్వరుని ఊర్ధ్వముఖము సర్వవిద్యలకును సర్వభూతములకును నియామకమును వేదములను రక్షించునదియు నయియున్నదో అట్టిప్రవృద్ధు డగుపరమేశ్వరుడు నాకు శాంతుడై మంగళప్రదు డగుగాక.

శ్రు॥ నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ హిరణ్య
రూపాయ హిరణ్యపతయే ఽంబికాపతయే అంబికాపతయే
ఉమాపతయే పశుపతయే నమోనమః.

తా॥ బాహువులు మొదలగుసకలావయవములు బంగారము వంటివిగా గలినట్టియు బంగారమువలె దుర్లభము లగుఅక్షరములు గలవాడును, తేజోరూపుడును, హిరణ్యనిధుల కధిపతియు, అంబికా పతియు ఉమాపతియు నగుపరమేశ్వరునకు నమస్కారము. పిపీలికాది బ్రహ్మపర్యంత మగుసకలప్రాణిసమూహామునకును అధిపతి యగు పరమేశ్వరునకు నమస్కారము.

శ్రు॥ ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగలం
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః.

తా॥ పరబ్రహ్మము సత్యరూపము, జ్ఞానరూపము, ఆనంద రూపము నయ్యు భక్తానుగ్రహార్థమై కృష్ణపింగళాకార మగుస్త్రీపురుష రూపముతో ననగా అర్ధనారీశ్వరరూపముతో నుండి లోకమందరివలె అధోరేతస్కుడు గాక ఊర్ధ్వరేతస్కుడై విలక్షణము లగుమూడు నేత్రములు గల్గి జగత్తంతయు తనరూపముగా గలవాడై యుండుఅపర బ్రహ్మమునకు నమస్కారము.

శ్రు॥ బ్రహ్మమేతు మాం మధు మేతు మాం బ్రహ్మమేవ మధు మేతు మాం యా స్తే సోమప్రజావత్సోభిసోఽహం దుష్వప్న హాం దురుష్వహా యా స్తే సోమ ప్రాణాగ్ స్తాం జుహోమి.

తా॥ పరబ్రహ్మము నన్ను పొందుగాక పరమానందమాధు ర్యోపేత మగువస్తువు నన్ను పొందుగాక. మధుర మగుబ్రహ్మ తత్త్వము నన్నుపొందుగాక. బ్రహ్మవిద్యాస్వరూపుడ వగునోపర మేశ్వరా! నీప్రజ లందరిలోను నేను బాలుడను. సంసారదుఃఖమును నశింపజేయునట్టి ఓపరమేశ్వరా! నా కీదుస్సహ మగుసంసారదుఃఖ మును పోగొట్టుము. ప్రాణవృత్తులను నీయందు లీన మొనర్చుచున్నాను. అనగా జీవబ్రహ్మైక్యము నొనర్చి నేనే పరిపూర్ణస్వయంప్రకాశరూపు డనై యుంటి ననిభావము.

శ్రు॥ బ్రహ్మమేధయా మధుమేధయా బ్రహ్మమేవ మధు మేధయా అద్యానో దేవసవితః ప్రజా వత్సావీ స్సౌభగం పరా దుష్వప్నియగ్ం సువ విశ్వాని దేవసవిత ద్దురితాని పరాసువ.

తా॥ సర్వజగత్కారణమును సర్వవేదాంతప్రతిపాద్యమును అగుబ్రహ్మము గురూపదిష్టమహావాక్యములందలి అర్థమును విచారించుచు పరమానందమాధుర్యోపేత మగునిశ్చయధారణాశక్తిచేత పొందబడుబ్రహ్మము నాకు సిద్ధించుగాక. శిష్యపరంపరతో నొప్పు ఆచార్యత్వభాగ్యము నాకు గల్గున ట్లనుగ్రహింపుము. దుస్స్వప్నము వంటి ద్వైతభావమును నాకు నశింపజేయుము. అట్టిసామర్థ్యము గల ఓపరమేశ్వరా సమస్తపాపములను పోగొట్టి శుభమగు ఆత్మతత్త్వజ్ఞానమును నాకు సమగ్రముగా ననుగ్రహింపుము.

శ్రు॥ హరిగ్ం హరంత మనుయంతి దేవా విశ్వ శ్యేశానం వృషభం మతీనాం. బ్రహ్మసరూప మను మేద మాగా దయనం మావివధీ ర్విక్రమస్వ.

తా॥ విష్ణురూపముతో సర్వవ్యాపకమైన ఓపరమేశ్వరా! దేవతలకును ప్రపంచమునకును ప్రాణిబుద్ధులకును నీవే ప్రభుడవు. అందుచే నిన్ను బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రు లనునాలుగుజాతులవారియొక్కయు పాపములను హరింపజేయువాడ వగుటచే నిన్ను భృత్యభావముతో ననుసరింతును. నీవు మాచే అధ్యయనమొనర్పబడు వేదము ననుసరించుమాకు మోక్షము నిమ్ము. మమ్ములను సంసారమునుండి ఉద్ధరింపుము, రక్షింపుము.

శ్రు॥ అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయమాత్మా మే శుద్ధ్యంతాం జ్యోతి రహం విరజా విపాప్మా భూయాసం.

తా॥ నాయొక్క అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయములనెడి పంచకోశములును పరిశుద్ధములై నేను

క్రమముగా ఈపంచకోశములను అతిక్రమించి ఆనందరూపు డగు బ్రహ్మము నను నిశ్చయజ్ఞానము గలవాడ నగునట్లు జేయుము.

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ మదుచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే॥
ఓం శాంతిః శాంతిః శ్శాంతిః

ఏ పరబ్రహ్మము దేశకాల వస్తుపరిచ్ఛేదశూన్యమై వెలయు చున్నదో అట్టి బ్రహ్మము నిరుపాధికము కావున అంతట వ్యాపించి యుండుటచేత పూర్ణమని చెప్పబడుచున్నది సోపాధికమును, నామ రూపసమన్వితమును, వ్యవహారాశ్రయమును, ఇదంశబ్దవాచ్య మగు యీప్రపంచము సైతము స్వరూపమాత్రమే అగుటచేత. పూర్ణ మనియే చెప్పబడును. వ్యవహారాత్మకమై విశేషత్వమును పొంది నట్టియు, పూర్ణశబ్దవాచ్యమును, నగు యీకార్యబ్రహ్మము, పూర్ణ శబ్దవాచ్య మగుకారణబ్రహ్మముకంటె బహిర్గతమగుచున్నది. కార్యా త్మక మగుబ్రహ్మము, కారణాత్మక మగుబ్రహ్మముకంటె, అభేదమని యెరిగినయెడల, నిష్ప్రతియోగిక బ్రహ్మస్వరూపమేమిగలుగుచున్నది. ఓంశ్శాంతిః శ్శాంతిః శ్శాంతిః ఓంకారప్రతిపాద్యుడగు, పరమేశ్వరుడు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయమును శాంతింపజేయుగాక.

—♦ ఉ ప ని ష చ్ఛ బ్దా ర్థ ము ♦—

శ్రు॥ య ఇమాం బ్రహ్మవిద్యా ముపయంతి. ఆత్మభవేన శ్రద్ధాభక్తిపురస్సరా స్సంతి తేషాం గర్భజన్మజరారోగాద్య నర్థపూగం నిశాతయతి. పరం వా బ్రహ్మ గమయతి. అవి ద్యాదిసంసారకారణం చ అత్యంత మవసాదయతి. వినాశ యతీ త్యుపనిషత్.

తా॥ 1 ఇట్టివేదాంతవాక్యశ్రవణమనననిదిధ్యాస లొనర్చిన వారల గర్భవాస జన్మమరణాద్యనర్థపరంపరను తెగగొట్టునుగాన ఉప నిషత్తనబడును, 2 వీరలకు పరబ్రహ్మభావమును పొందించునుగాన ఉపనిషత్తనబడును, 3 అవిద్యాదిసర్వసంసారకారణమును పూర్తిగా నశింపజేయునదిగాన ఉపనిషత్తనబడును.

## —♦ ఉపసంహారము ♦—

విధ్యంఘ్రి ర్బంధముగ్గుల్ఫో హ్యావిద్యా దేహాజంఘకః
జగన్మిథ్యాజాను దేశ స్తూపదేశోరు దేశకః
బ్రహ్మాత్మైక్యకటీదేశో విద్యామనననాభికః
జీవన్ముక్త్యాఖ్యదహార స్స్వానుభూతికరద్వయః
స్వసమాధిస్కంధ దేశ స్స్వస్వరూపా ఖ్యకంధరః
ఫలభూతమహావాక్యఫలో వై దేహాము స్తకః
ఏవంవిధార్య దేహాంతమహావాక్యకళేబరః
వస్తుతో నిర్విశేషాత్మా శ్రీపా న్నారాయణోస్మ్యహమ్
యన్మహావాక్యసిద్ధాంతము క్తం చి త్తైకగోచరమ్
శ్రీరామచంద్రేంద్ర(సరస్వతీ)యతిం నౌమి సర్వాత్మకం మహః

తా॥ సత్యజ్ఞానానంతానందాదిపదములే పాదములుగాను, సంసారబంధమును విడిపించువాక్యమే గుల్ఫప్రదేశముగాను, అవిద్యాది దేహాంతమే పిక్కలుగాను, జగన్మిథ్యాజ్ఞానమే మోకాళ్ళుగాను, వేదాంతోపదేశమే తొడలుగాను, బ్రహ్మాత్మైకత్వమే కటిప్రదేశముగాను, వేదాంతవిద్యామననమే నాభిగాను, జీవన్ముక్తియే హృదయాకాశముగాను, బ్రహ్మానందానుభవమే చేతులుగాను, సమాధినిష్ఠయే స్కంధములుగాను, స్వస్వరూపానుసంధానమే మెడగాను, మహావాక్యములే ఫలముగాను, విదేహకైవల్యమే శిరస్సుగాను, గలశ్రీరామచంద్రేంద్ర సరస్వతీస్వామివారు యథార్థముచే నిర్విశేషచిన్మాత్ర నారాయణులే. అట్టివారికి పరస్సహస్రప్రణామములు.

ఓమ్, తత్, సత్,

శ్రీ

—•—